# శ్రీ గీతా భాష్యత్రయ సారము

ఇది

మహామహోపాధ్యాయ

శ్రీ పరవస్తు వెంకటరంగాచార్యులయ్యవారలుంగారి

పుత్రులగు

శ్రీ పరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవారలుం

గారిచే

రచింపఁబడి

దీనిని ముద్రింపించుటకు ఏర్పడిన సొసైటీవారిచేత

ముద్రింపింపఁబడినది.

1889.

Arsha Press. Vizagapatam.

Publisher Sri Paravastu

Sreenivasa Jagannadhaswami Ayyavaralugaru.

Printer N. Subbarow.

శ్రీ హయగ్రీవాయ నమః



నమః పరమర్షిభ్యః



అస్మద్గురుభ్యో నమః



"ఈశ్వరునకు జగత్సృష్టిపరిపాలనప్రళయకర్తృత్వము స్వభావసిద్ధమని వేదమునం జెప్పఁబడియున్నది. అందులోనుం బరిపాలనము ముఖ్యకృత్యము. అందుకు నీశ్వరుండు ఏనవలె నూటిమాటికిం బ్రయాసముం జెందుచుండఁడు. ఏటియేమం టేని,—జీవులకుం బ్రత్యేకముగాఁ గరణకళేబరములును సూర్య చంద్ర నదీ సముద్ర మేఘాది సామాన్య పరికరములును గలుగునట్లు సంకల్పమాత్రమున సామగ్రిని బుట్టించి యొండొంటికిఁ గార్యకరములం జేసి యంత్రకారుండు యంత్రము నడపి సాక్షియై యున్నట్లు ఆనందింపుచుండును. అయిన నొకొక్కకప్పుడు వస్తుస్వభావవైచిత్ర్యమున విరుద్ధముగా సామగ్రీపరిణామంబు గలుగును. అట్టి సమయములయందు దుష్టజనులు వృద్ధిఁ జెందుటయు సాధుజనులకు హాని సంభవించుటయు, నధర్మము పైకొనుటయు ధర్మము సడలుటయుం దటస్థించును. అట్టి దశలయందు జీవులకంటె విలక్షణమయిన స్వకీయాంశమును సృజించి యస్మదాదిశరీరసజాతీయమయిన శరీరములో దానిం జొనిపి యది పుట్టునట్లు సంకల్పించును. ఆయంశము విలక్షణజ్ఞానశక్త్యాదులు గలుగుటచేత దుష్టసంఘము నడఁచి సాధుసంఘంబుం గాచి ధర్మపరిపాలనంబుం జేసి యుత్తరకాలంబునఁ గూడ నట్లు నడవం ద్రోవఁ జూపి వెండియు నీశ్వర భాగముం జేరును. అట్టి యీశ్వరాంశంబులే యవతారంబు లనంబడును"- (అవతారసంగ్రహము.)

ఇట్టి యవతారములలో అతిమానుషవ్యాపారములు మిక్కిలిగాఁ గలదియు, గొంచెము తక్కువగా నయిదువేల సంవత్సరముల క్రిందట భారతఖండము ఉన్నతస్థితినుండిన కాలమునందు ఆవిర్భవించినదియు నయిన యవతారము శ్రీకృష్ణావతారము.

ఈ శ్రీకృష్ణమూర్తి ధార్తరాష్ట్రులగు దుర్యోధనాదులకును, పాండవులగు ధర్మరాజాదులకును, సంభవించిన యుద్ధమున నర్జునునకు సారథిగానుండెను- ఇందువల్లనే కదా పార్థసారథియను పేరు ప్రసిద్ధంబుగా నున్నది.

ఈ శ్రీకృష్ణమూర్తి భారతయుద్ధసమయంబున నర్జునునకుఁ జేసిన జ్ఞానోపదేశమును సంజయుండను వాఁడు విని, ధృతరాష్ట్రునకు భారతయుద్ధవృత్తాంతము నంతయుఁ దెలియఁజేయుటలో, వినిపించెను- దానిని మహాభారతమను గ్రంథమున శ్రీవేదవ్యాసుఁడనియు కృష్ణద్వైపాయనుఁడనియు సుప్రసిద్ధుఁడగు పరమర్షి శ్లోకరూపముగా రచియించెను.

ఇదియె భగవద్గీతలని చెప్పఁబడుచుండి పదునెనిమిది యధ్యాయములుగా నున్నయది- భగవద్గీతాశబ్దమునకు భగవంతునిచేఁ జెప్పఁబడినవి యని యర్థము.

ఈభగవద్గీతలకు శంకరాచార్యులవారును, రామానుజాచార్యులవారును, మధ్వాచార్యులవారును రచించిన మూడుభాష్యములు, వారివారి శిష్యపరంపరలలోని వారలచే నధ్యయనము చేయఁబడుచున్నవి.

ఈ మూడు భాష్యముల తాత్పర్యంబులును మందబుద్ధులకుం గూడ సుగ్రాహంబులగునట్లు ఆంధ్రభాషను ఈగ్రంథరూపముగాఁ దెలియఁజేయఁబడును.

అందు శంకరాచార్యసంప్రదాయమువారు అద్వైతులనియు, రామానుజాచార్యసంప్రదాయమువారు విశిష్టాద్వైతులనియు, మధ్వాచార్యసంప్రదాయమువారు ద్వైతులనియుఁ జెప్పఁబడుదురు- వీరి తాత్పర్యభేదములు ముక్తిసంగ్రహమునందును అస్మత్కృతంబగు తద్వివరణంబునందును సుస్పష్టములుగాన నందుఁ జూడదగును.

ధృతరాష్ట్ర ఉవాచ.

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥౧॥

ధృతరాష్ట్రః ఉవాచ = ధృతరాష్ట్రుఁడు పలికెను- హేసంజయ! = ఓ సంజయుఁడా!, ధర్మక్షేత్రే కురుక్షేత్రే = పుణ్యక్షేత్రమగు కురుక్షే

క్షేత్రమున*, యుయుత్సవః సమవేతాః= యుద్ధముఁజేయఁగోరుచున్న వారై చేరిన, మామకాః పాణ్డవాశ్చైవ= నావారును పాణ్డవులును, కిమ్ అకుర్వత?= ఏమి చేసిరి?

సంజయ ఉవాచ.

దృష్ట్వాతు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్॥ ౨॥

సంజయః ఉవాచ= సంజయుఁడు చెప్పెను, రాజా దుర్యోధనః= రాజగు దుర్యోధనుఁడు, వ్యూఢం పాణ్డవానీకం దృష్ట్వా=వ్యూహములుగాఁ దీర్చఁబడిన పాండవుల సేనను చూచి, తదా=అప్పుడు, ఆచార్యమ్ ఉపసంగమ్య=ద్రోణాచార్యుని చేరి, వచనమ్ అబ్రవీత్=(చెప్పఁబోవు) వాక్యమును పలికెను.

పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవశిష్యేణ ధీమతా॥ ౩॥

హే ఆచార్య!=ఓ యాచార్యుఁడా!, ధీమతా తవ శిష్యేణ ద్రుపదపుత్రేణ వ్యూఢామ్=బుద్ధిమంతుఁడును నీ శిష్యుఁడునగు ద్రుపదుని కొడుకుచేత(దృష్టద్యుమ్నునిచేత) వ్యూహములుగాఁ బన్నఁబడినదియు, మహతీమ్=గొప్పదియునగు, పాణ్డుపుత్రాణామ్ ఏతామ్ చమూమ్= పాండవుల ఈ సేనను, పశ్య=చూడుము.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ ౪॥
ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్।
పురుజి త్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥ ౫॥
యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః॥ ౬॥

అత్ర= ఈ పాండవసేనలో, మహేష్వాసాః=గొప్పవిలుకాండ్రును, యుధి భీమార్జునసమాః= యుద్ధమున భీమార్జునులతో సమానులైనవారునగు, శూరాః(సన్తి)= శూరులు కలరు). (వారెవ్వరన్నను) యుయుధానః= సాత్యకియు, విరాటశ్చ= విరటుఁడును, మహారథః ద్రుపద

* ఇది పంజాబు దేశములో పానిపట్ (Panipat) అను పట్టణసమీపమున నున్నది.

శ్చ= మహారథుఁడగు† ద్రుపదుఁడును, ధృష్టకేతుః= ధృష్టకేతువును, చేకితానః= చేకితానుఁడును, వీర్యవాన్ కాశిరాజశ్చ= పరాక్రమముగల కాశిరాజును, పురుజిత్ = పురుజిత్తును, కున్తిభోజశ్చ= కుంతిభోజుఁడును, నరపుంగవః శైబ్యశ్చ= మనుష్యులలో శ్రేష్ఠుఁడగు శైబ్యుఁడును, విక్రాన్తః యుధామన్యుశ్చ= శూరుఁడైన యుధామన్యువును, వీర్యవాన్ ఉత్తమౌజాశ్చ= పరాక్రమవంతుఁడగు ఉత్తమౌజస్సును, సౌభద్రః= సుభద్రకొడుకు (అభిమన్యువు)ను, ద్రౌపదేయాశ్చ= ద్రౌపదికొడుకులు (ధర్మరాజభీమార్జుననకులసహదేవులకు వరుసగా పుత్రులగు ప్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేనులు)ను, సర్వే మహారథాఏవ= అందఱును మహారథులే.

అస్మాకంతు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్బ్రవీమి తే॥ ౭॥

యే= ఎవ్వరు, అస్మాకమ్ విశిష్టాః= మనయొక్క ముఖ్యులో, మమ సైన్యస్య నాయకాః= నా సేనయొక్క అధిపతులో, తాన్ నిబోధ= వారిని తెలుసుకొనుము, తే సంజ్ఞార్థం తాన్ బ్రవీమి= నీకు తెలియుటకొఱకు, వారిని చెప్పెదను.

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ॥ ౮॥
అన్యేచ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః॥ ౯॥

భవాన్= నీవును, భీష్మశ్చ= భీష్ముఁడును, కర్ణశ్చ= కర్ణుఁడును, సమితింజయః కృపశ్చ= యుద్ధమును జయించెడి (యుద్ధమందు జయమును పొందెడి) కృపాచార్యుఁడును, అశ్వత్థామా= అశ్వత్థామయు, వికర్ణశ్చ= వికర్ణుఁడు (దుర్యోధనుని తమ్ముఁడు)ను, తథైవ సౌమదత్తిశ్చ= అట్లే సోమదత్తునికొడుకు (భూరిశ్రవుఁడు)ను, సైంధురాజస్తథైవ చ అనుపాఠమున సైంధవుఁడు (జయద్రథుఁడును) అని యర్థము. మదర్థే త్యక్త

---

† ఏకో దశ సహస్రాణి యోధయేద్యస్తు ధన్వినామ్। శస్త్రశాస్త్రప్రవీణశ్చ మహారథ ఇతి స్మృతః॥ — ఆయుధవిద్యయందు నిపుణుఁడై పదివేలవిలుకాండ్రతో నెవ్వఁడొక్కఁడే యుద్ధము సేయునో వాఁడు మహారథుఁడు.

జీవితాః = నాకొఱకు విడువఁబడిన (విడుచుటకు నిశ్చయింపఁబడిన) ప్రాణములుకల, అన్యే శూరాశ్చ (సన్తి) = ఇతరులైన వీరులును (కలరు). సర్వే = ఎల్లరును, నానాశస్త్రప్రహరణాః = అనేకవిధములగు ఆయుధములును యుద్ధసాధనములును కలవారును, యుద్ధవిశారదాః = యుద్ధమునందు నేర్పుగలవారును.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥౧౦॥

భీష్మాభిరక్షితమ్ = భీష్మునిచే రక్షింపఁబడిన, తత్ అస్మాకమ్ బలమ్ = అట్టి మన బలము, అపర్యాప్తమ్ = చాలకున్నది. భీమాభిరక్షితమ్ = భీమునిచేఁ గాపాడఁబడిన, ఏతేషామ్ ఇదమ్ బలమ్ = వీరి (పాండవుల) ఈ సైన్యము, పర్యాప్తమ్ = చాలియున్నది.

మధుసూదనటీకలో అపర్యాప్తమ్ అనుదానికి అపరిమితమనియు, పర్యాప్తమ్ అనుదానికి పరిమితమనియు నర్థము వ్రాయఁబడి, మనసైన్యము గొప్పది, పాండవుల సైన్యము స్వల్పమైనది, అని యొక్క యోజనయును,—భీష్మాభిరక్షితమ్ = దేనికొఱకు భీష్ముఁడు మనచేత రక్షింపఁబడుచున్నాఁడో అట్టిదైన, తత్ బలమ్ = ఆ పాండవసేన, అస్మాకమ్ అపర్యాప్తమ్ = మనకు చాలదు, మనల జయించుటకు చాలదనుట. భీమాభిరక్షితమ్ = దేనికొఱకు భీముఁడు పాండవులచే రక్షింపఁబడుచున్నాఁడో అట్టి, ఏతేషామ్ అస్మాకమ్ ఇదమ్ బలమ్ = ఈ మన ఈ బలము, పర్యాప్తమ్ = చాలినది. పాండవులను జయించుటకు మనబలము చాలుననుట. అని మఱియొక్క యోజనయుం జేయఁబడినది.

అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః।
భీష్మమేవాభిరక్షన్తు భవన్తస్సర్వ ఏవ హి॥౧౧॥

భవన్తః సర్వే ఏవ = మీరు అందఱును, సర్వేషు అయనేషు చ = అన్నిత్రోవలయందును (వ్యూహములో ప్రవేశింపవలసిన మార్గములయందు), యథాభాగమ్ అవస్థితాః = వంతులచొప్పున నున్నవారై, భీష్మమేవ అభిరక్షన్తు హి = భీష్మునినే రక్షింపవలయుంగదా.

మధుసూదనటీకలో అయనములనఁగా సేనాపతి సేనామధ్యమ ననుండి, యోధులుండుటకు వారివారికిఁ దగినట్లుగా నేర్పఱచిన యుద్ధ

భూమిలోని స్థానములనియర్థము వ్రాయఁబడినది.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్॥

ప్రతాపవాన్ కురువృద్ధః పితామహః = పరాక్రమముకలవాఁడును జ్ఞాతులలో పెద్దయునగు భీష్ముఁడు, తస్య హర్షమ్ సంజనయన్ = ఆతనికి(దుర్యోధనునికి) సంతోషమును పుట్టించుచు, ఉచ్చైః సింహనాదం వినద్య = గట్టిగా సింహనాదమును చేసి, శఙ్ఖం దధ్మౌ = శంఖమును పూరించెను.

మధుసూదనటీకలో సింహనాదమ్ అనునది ణముల్ంతావ్యయమని వ్రాయఁబడి, సింహనాదం వినద్య = సింహమువలెధ్వనిచేసిఅనియర్థము చేయఁబడినది.

తతశ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।
సహసైవాభ్యహన్యన్త స శబ్దస్తుములో௨భవత్॥౧౩॥

తతః = తరువాతను, శఙ్ఖాశ్చ భేర్యశ్చ = శంఖములును మంచభులును, పణవానకగోముఖాః = సూక్ష్మమృదంగవిశేషములును ‡ స్థూలవాద్యవిశేషములును§ సంగీతములనుపయోగించెడి మద్దెలవిశేషములును, సహసైవ అభ్యహన్యన్త = శీఘ్రముగానే కొట్టఁబడినవి(వాయింపఁబడినవి)- స శబ్దః = ఆధ్వని, తుములః అభవత్ = సంకీర్ణము అయ్యెను.

తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ।
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః॥౧౪॥

తతః = తదనంతరము, శ్వేతైః హయైః యుక్తే = తెల్లని గుఱ్ఱములతోఁ గూడినదియు, మహతి = గొప్పదియునగు, స్యన్దనే స్థితౌ = రథమున నున్న, మాధవః పాణ్డవశ్చైవ = శ్రీకృష్ణమూర్తియును అర్జునుఁడును నే, దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః = శ్రేష్ఠములైన శఙ్ఖములను పూరించిరి.

పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః॥౧౫॥

‡ ఆంధ్రటీకాకారులు ‘‘పంబ యాం చనఁగను పణవమెసఁగు’’ అనియున్నది- ఉదుకయని కొందరి అభిప్రాయమని అమరటీక.

§ తప్పెటయని అమరటీక.

వృభుజములుకల సుభద్రకొడుకు(అభిమన్యుఁడు)ను (హే)పృథివీపతే (ఓ)రాజా!(ఓధృతరాష్ట్రుఁడా!)సర్వశః పృథక్పృథక్ శఙ్ఖాన్దధ్ముః = అందఱును వేఱువేఱుగా శంఖములను పూరించిరి.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్॥౧౯॥

తుములః సఘోషః = సంకులమైన ఆశంఖధ్వని, నభశ్చ పృథివీం చైవ వ్యనునాదయన్ = ఆకాశమునుఁ భూమిని ప్రతిధ్వనిచేయింపుచు, ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ = ధృతరాష్ట్రపుత్రులయొక్క గుండెలను బద్దలుగొట్టెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాణ్డవః॥౨౦॥
హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే।

(హే)మహీపతే! = (ఓ)రాజా!(ధృతరాష్ట్రుఁడా!)అథ = తరువాతను, శస్త్రసంపాతే ప్రవృత్తే(సతి) = ఆయుధములపాటు ప్రవర్తించినది(అగుచుండఁగా), కపిధ్వజః పాణ్డవః = కోఁతి(హనుమంతుఁడు)ధ్వజముగాఁగల పాండవుఁడు(అర్జునుఁడు), వ్యవస్థితాన్ ధార్తరాష్ట్రాన్ దృష్ట్వా = యుద్ధముచేయ నిలిచియున్న ధృతరాష్ట్రపుత్రులను చూచి, ధనుః ఉద్యమ్య = విల్లును ఎత్తి, తదా హృషీకేశమ్ ఇదం వాక్యమ్ ఆహ = అప్పుడు శ్రీకృష్ణమూర్తినిగూర్చి ఈ వాక్యమును పలికెను.

ఇచట మాధ్వటీకయందు, (యుద్ధే) ధనుః ఉద్యమ్య (స్వేన)శస్త్రసంపాతే ప్రవృత్తే (సతి) = (యుద్ధమునందు)ధనుస్సును ఎత్తి (తాను) శస్త్రములను ప్రయోగించుట ప్రసక్త(మగుచుండఁగా)అని యొకయన్వయంబును,—ప్రవృత్తే అనుదానికి ప్రవర్తింపఁజేయవలసిన అనియర్థముచేసి, ప్రవృత్తే శస్త్రసంపాతే వ్యవస్థితాన్ ధార్తరాష్ట్రాన్ = ప్రవర్తింపఁజేయవలసిన ఆయుధప్రయోగము గలవారై నిలిచియున్న మనోరథవాసులను అని మఱియొకయన్వయమును వ్రాయఁబడినవి.

సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥౨౧
యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్।
కై ర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥౨౨॥

భయోః సేనయోః మధ్యే=రెండు సేనల నడుమను, భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం మహీక్షితాం (ప్రముఖతః)చ=భీష్మద్రోణులయెదుటనును అందఱు రాజుల(యెదుటను)ను, రథోత్తమం స్థాపయిత్వా=రథశ్రేష్ఠమును నిలిపి, (హే)పార్థ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, సమవేతాన్ ఏతాన్ కురూన్ పశ్య=చేరియున్న ఈ కౌరవులను చూడుము- ఇతి ఉవాచ=అని పలికెను.

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్।
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా॥౨౬॥
శ్వశురాన్సుహృదశ్చైవ సేనయోరుభయోరపి।

అథ=తరువాతను, పార్థః=అర్జునుఁడు, తత్ర సేనయోః ఉభయోరపి స్థితాన్=ఆ సేనలు రెంటియందును ఉన్న, పితౄన్=పినతండ్రి పెదతండ్రులను, పితామహాన్=తాతలను, ఆచార్యాన్=ఆచార్యులను, మాతులాన్=మేనమామలను, భ్రాతౄన్=అన్నదమ్ములను, పుత్రాన్=కొడుకులను, పౌత్రాన్=మనుమలను, తథా సఖీన్=అట్లు చెలికాండ్రను, శ్వశురాన్=మామగార్లను, సుహృదః=ఉపకారము చేసినవారిని, అపశ్యత్=చూచెను.

తాన్సమీక్ష్య స కౌన్తేయస్సర్వాన్బన్ధూనవస్థితాన్।
కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్॥౨౭॥

సః కౌన్తేయః=ఆ కున్తీపుత్రుఁడు(అర్జునుఁడు), అవస్థితాన్ తాన్ సర్వాన్ బన్ధూన్ సమీక్ష్య=(యుద్ధభూమియందు నిలిచియున్న ఆ యందఱు బంధువులను చూచి, పరయా కృపయా ఆవిష్టః=గొప్ప కనికరముచేత నాక్రమింపఁబడినవాఁడై, విషీదన్ ఇదమ్ అబ్రవీత్=దుఃఖించుచున్నవాఁడై దీనిని(చెప్పఁబోవు వాక్యమును) పలికెను.

విషాదమనఁగా దుఃఖమువలన కలిగిన మనోదౌర్బల్యము- అది కలిగినచో నన్నివ్యాపారములును ఉడుగును- అని మాన్యటీకలో వివరింపఁబడినది.

అర్జున ఉవాచ.

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్॥౨౮॥
సీదన్తి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి।

వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥౨౯॥
గాణ్డీవం స్రంసతే హస్తాత్త్వక్చైవ పరిదహ్యతే।
నచ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవచ మే మనః॥౩౦॥

(హే)కృష్ణ! = (ఓ)కృష్ణుఁడా!‡, యుయుత్సుం సముపస్థితమ్ = యుద్ధముఁగోరినవాఁడై వచ్చియున్న, ఇమం స్వజనం దృష్ట్వా(స్థితస్య) మమ = ఈ స్వజనమును చూచి(నిలిచియున్న)నాయొక్క, గాత్రాణి సీదన్తి = అవయవములుశిథిలములగుచున్నవి- ముఖంచపరిశుష్యతి = ముఖంబును ఎండిపోవుచున్నది- మే శరీరే వేపథుశ్చ (జాయతే) = నా శరీరమున వడఁకును (పుట్టుచున్నది)- రోమహర్షశ్చ జాయతే = పులకరింతయు(గగుర్పాటు)ను పుట్టుచున్నది- గాణ్డీవం హస్తాత్ స్రంసతే = గాండీవధనుస్సు చేతినుండి జారుచున్నది- త్వక్చైవ పరిదహ్యతే = చర్మంబును అంతటదహింపఁబడుచున్నది- మే మనశ్చ భ్రమతీవ = నా మనస్సును తిరుగుచున్నట్లున్నది- అవస్థాతుంచ నశక్నోమి = నిలుచుటకును సమర్థుఁడను కాకున్నాను.

నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ।
నచ శ్రేయో ఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే॥౩౧॥

(హే)కేశవ§ = (ఓ)కృష్ణమూర్తీ, విపరీతాని నిమిత్తానిచ పశ్యామి = విరుద్ధములైన(అనిష్టమునుసూచించెడి) శకునములనును చూచుచున్నాను-

‡ కృష్ణ = భూదారణమైన సుఖము వాఁడు; కృష్ణ = భక్తులను తమన్నును సూత్ర ఆకర్షించువాఁడు; కృష్ణ = ఖేదింపఁబడిన (దైత్యుల) ప్రాణంబును బలంబును కలవాఁడు; (భక్తులకు) ఈయఁబడిన ప్రాణంబును బలంబును కలవాఁడు. అని మాధ్వటీకయందు వివరింపఁబడినది.

§ క ఈశ వ = బ్రహ్మను రుద్రుని రక్షించువాఁడు, కేశవ = కేశియను రాక్షసుని చంపినవాఁడు- అని మధుసూదనటీక- మాధ్వటీకలో బ్రహ్మ రుద్రులను ప్రవర్తింపఁజేయువాఁడు, క ఈ ఇ ఈశ వ = బ్రహ్మను లక్ష్మిని కాముని రుద్రుని వశవర్తులఁజేయువాఁడు, లేక వహించువాఁడు, కేశవ = సుఖక్షేత్రమును వహించువాఁడు, ప్రళయసముద్రమునఁగాని క్షీరసముద్రమునఁగాని యుండువాఁడు, మంచితలవెండ్రుకలు గాని కేశనామముగల అవతారములు గాని కలవాఁడు అని యనవయవార్థములు వ్రాయఁబడినవి.

ర్లును, పౌత్రాః=మనుమలును, స్యాలాః=భార్యతోఁబుట్టినవాండ్రును, తథా సంబన్ధినః=ఆప్రకారము చుట్టాలును.

ఏతా న్నహన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కింను మహీకృతే॥ ౩౫

(హే) మధుసూదన*!=(ఓ) శ్రీకృష్ణుఁడా!, (మామ్) ఘ్నతోఽపి ఏతాన్=(నన్ను) కొట్టుచున్నవారైనను వీరిని, త్రైలోక్యరాజ్యస్య హేతోరపి=మూడులోకములరాజ్యము నిమిత్తమైనను, హన్తుమ్ నేచ్ఛామి=చంపను ఇచ్ఛయింపకున్నాను. మహీకృతే (హన్తుం నేచ్ఛామీతి) (వక్తవ్యమ్) కింను=భూమికొఱకు (చంపఁగోరకున్నానని) (చెప్పవలసినది) ఏమి?

నిహత్య ధార్తరాష్ట్రా న్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన।
పాపమే వాశ్రయే దస్మా న్హత్వైతా నాతతాయినః॥ ౩౬

(హే) జనార్దన!† (ఓ) కృష్ణుఁడా!, ధార్తరాష్ట్రాన్ నిహత్య (స్థితానాం) నః=దుర్యోధనాదులను చంపి (ఉన్న) మనకు, కా ప్రీతిః స్యాత్=ఏమి సంతోషము కలుగును?- ఆతతాయినః‡ ఏతాన్=చం

---

* మధుసూదన=మధువనెడి దైత్యుని చంపినవాఁడు- మాధ్వటీకలో, తేనెవ్రాసిన యష్టమునవలె సుఖలేశములకల సంసారమును పోఁగొట్టువాఁడు- మధుసూదన=మధురముగా వండుచున్న దైనభక్తుని నియమించువాఁడు- అనియును వ్రాయఁబడినది.

† జనార్దన=జనులను చంపువాఁడు- అనఁగా సంహారకర్త అని మధుసూదనటీక- మాధ్వటీకలో జన=పుట్టినవాఁడును, అర్దన=సంహరించువాఁడును అనియు, జన అర్దన=పుట్టుకను పోఁగొట్టువాఁడు, మంచిజనులను మంచిగతిని పొందించువాఁడు, చెడుజనులను చెడుగతిని పొందించువాఁడు, సజ్జనులను రక్షించువాఁడు, దుర్జనులను హింసించువాఁడు- అనియర్థములు వ్రాయఁబడినవి.

‡ శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః। క్షేత్రదార హరశ్చైవ షడేతే హ్యాతతాయినః- (ఇండ్లు మొదలగువానికి నిప్పుపెట్టువాఁడు, విషముపెట్టువాఁడు, శస్త్రమును చేతంగలవాఁడు, ధనమును అపహరించువాఁడు, భూమిని భార్యను హరించువాఁడు, ఈయాఱుగురును ఆతతాయులనఁబడుదురు)

పుటకమ్ముక్తులయిన వీరిని, హత్వా (స్థితాన్) అస్మాన్=చంపి (ఉన్న) మనను, పాపమేవ ఆశ్రయేత్ = పాపమే ఆశ్రయించును—ఆతతాయిన మాయాన్తం హన్యాదేవావిచారయన్ (చంపనుద్యుక్తుఁడై వచ్చువానిని విచారింపక చంపవలసినదియె) అను నీతిశాస్త్రవచనముకంటె, అహింసా పరమోధర్మః (హింసింపకుండుట గొప్ప ధర్మము) అను ధర్మశాస్త్రవచనము బలవత్తని తాత్పర్యము.

మధుసూదనటీకలో, అస్మాన్ హత్వా (స్థితాన్)=(యుద్ధముచేయకయూరకయున్న) మనను చంపి (ఉన్న), ఏతాన్ ఆతతాయినః= ఈ ఆతతాయిలను (దుర్యోధనాదులను), పాపమేవ ఆశ్రయేత్ = పాపమే ఆశ్రయించును. అనియు వ్యాఖ్యానము చేయఁబడినది.

తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్స్వబాన్ధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ ॥ ౩౭ ॥

(హే) మాధవ§! = (ఓ) కృష్ణుఁడా!, తస్మాత్ = దానివలన, వయమ్ = మనము, స్వబాన్ధవాన్ ధార్తరాష్ట్రాన్ హన్తుమ్ అర్హాః న= బంధువులతోఁగూడిన ధార్తరాష్ట్రులను చంపఁదగినవారము కాము. స్వబాన్ధవాన్ అనుపాఠమున మనబంధువులైన అనియర్థము. స్వజనం హత్వా = స్వజనమును చంపి, సుఖినః కథం హి స్యామ? = సుఖవంతులము ఎట్లు అగుదుము?

యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ ౩౮ ॥
కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన ॥ ౩౯ ॥

లోభోపహతచేతసః ఏతే = రాజ్యలోభముచేతఁ జెడఁగొట్టఁబడిన మనస్సులుగల వీరు (దుర్యోధనాదులు), కులక్షయకృతం దోషమ్ = వంశక్షయముచేఁ గలుగఁజేయఁబడిన దోషమును, మిత్రద్రోహే పాతకం

§ మాధవ = లక్ష్మికి పెనిమిటి. అని మధుసూదనటీక- మాధ్వటీకలో, జ్ఞానమునకు అధిపతియగువాఁడు, మా ధ వ = జ్ఞానమును ధర్మమును ప్రవర్తింపఁజేయువాఁడు, మాధవ=మధువను దైత్యుని సంబంధి. అనఁగా మధువను దైత్యుని యొక్క శత్రువనుట-, అనియు వ్యాఖ్యానము చేయఁబడినది-

చ = మిత్రద్రోహమునందలి పాపమునను, నపశ్యన్తి యద్యపి = ఎఱుంగకున్నారు గాని, (తథాఽపి = అయినను). (హే) జనార్దన = (ఓ) కృష్ణుఁడా!, కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిః అస్మాభిః = కులక్షయముచేఁగలుగఁజేయఁబడెడు దోషమును ఎఱుంగుచున్న మనచేతను, అస్మాత్ పాపాత్ నివర్తితుమ్ = ఈ పాపమునుండి మఱలుటకు, కథం నజ్ఞేయమ్ = ఎట్లు తెలియఁబడఁదగదు.

కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః।
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత॥౪౦॥
అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥౪౧॥
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః॥౪౨॥

కులక్షయే (సతి) సనాతనాః కులధర్మాః ప్రణశ్యన్తి = వంశక్షయము (కలుగుచుండఁగా) పరంపరచేవచ్చిన కులధర్మములు నశించుచున్నవి- ధర్మే నష్టే (సతి) = ధర్మము నశించిన(దగుచుండఁగా), కులమ్ కృత్స్నముత = కులమును అంతటిని, అధర్మః అభిభవతి = అధర్మము ఆక్రమించుచున్నది- (హే) కృష్ణ! = (ఓ) కృష్ణుఁడా!, అధర్మాభిభవాత్ కులస్త్రియః ప్రదుష్యన్తి = అధర్మము ఆక్రమించుటవలన కులములోనిస్త్రీలు చెడుచున్నారు- (హే) వార్ష్ణేయ! = (ఓ) వృష్ణివంశమువాఁడా! (కృష్ణుఁడా!), స్త్రీషు దుష్టాసు (సత్సు) = స్త్రీలు చెడినవారు (అగుచుండఁగా). వర్ణసంకరః జాయతే = వర్ణములు కలిసిపోవుట కలుగుచున్నది- సంకరః = సంకరము, కులఘ్నానాం కులస్యచ = కులమును చెడఁగొట్టినవారికిని కులమునకును, నరకాయైవ (భవతి) = నరకముకొఱకే అగుచున్నది- హి = ఇంతియెకాక, ఏషాం పితరః = వీరి పితృదేవతలు, లుప్తపిణ్డోదకక్రియాః (సన్తః) పతన్తిహి = లోపించినపిండోదకకార్యములుకలవారు (అగుచు) (నరకములో) పడుచున్నారు గదా.

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥౪౩॥

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ॥౪౪॥

కులఘ్నానామ్=కులమును చెడఁగొట్టువారియొక్క, వర్ణసంకరకారకైః ఏతైః దోషైః=వర్ణసంకరమును చేసెడి ఈ దోషములచేత, శాశ్వతాః జాతిధర్మాః కులధర్మాశ్చ=సనాతనములైన వర్ణధర్మములును వంశధర్మములును, ఉత్సాద్యన్తే=నశింపఁజేయఁబడును- (హే)జనార్దన!=(ఓ)కృష్ణుఁడా!, ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణామ్=నశించిన కులధర్మములుగల మనుష్యులకు, నరకే నియతం(యథాతథా) వాసః భవతి=నరకమున నిత్యముగా ఉనికి కలుగుచున్నది, ఇతి శుశ్రుమ=అని వింటిమి. పెద్దలవలన అని శేషము.

కులధర్మాశ్చ అను చకారమువలన ఆశ్రమధర్మాదులకుఁగూడ గ్రహణమని మాధ్వటీక.

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్।
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః॥౪౫॥

అహోబత!=అయ్యయ్యో!- వయమ్=మనము, మహత్ పాపం కర్తుం వ్యవసితాః=గొప్ప పాపమును చేయుటకు ఉద్యుక్తులమైతిమి- యత్=ఏకారణమువలన, రాజ్యసుఖలోభేన=రాజ్యమందును సుఖమందును ఆశచేత,స్వజనమ్ హన్తుమ్ ఉద్యతాః=స్వజనమును చంపుటకు ఉద్యుక్తులమైతిమో.

మాధ్వటీకలో ఉద్యతాః (ఇతి) యత్ (తత్) పాపమ్=ఉద్యుక్తులమైతిమి (అనునది) యేది(కలదో) (ఆ) పాపమును అని వెనుకకు అన్వయము వ్రాయఁబడినది.

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్॥౪౬

అప్రతీకారమ్ అశస్త్రమ్ మామ్=ప్రతిక్రియ లేనివాఁడనును శస్త్రములు లేనివాఁడనునగు నన్ను, శస్త్రపాణయః ధార్తరాష్ట్రాః=శస్త్రములు చేతులలోఁగల ధృతరాష్ట్రునికొడుకులు, హన్యుర్యది=చంపిరేని, తత్=అది, మే క్షేమతరం భవేత్=నాకు మిక్కిలిహితమైనది

అగును- ప్రియతరమ్ అనుపాఠమున మిక్కిలిఇష్టమైనది అనియర్థము.

సంజయ ఉవాచ.

ఏవ ముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః॥౪౭॥

సంజయః ఉవాచ=సంజయుఁడు పలికెను- సంఖ్యే=యుద్ధమునందు, అర్జునః=అర్జునుఁడు, ఏవమ్ ఉక్త్వా=ఇట్లు పలికి, శోకసంవిగ్నమానసః(సన్) సశరం చాపం విసృజ్య=దుఃఖముచేతపీడింపఁబడినమనస్సుకలవాఁ(డగుచు) బాణములతోఁగూడిన ధనుస్సును విడిచి, రథోపస్థే ఉపావిశత్=రథముమీదను కూర్చుండెను.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదేఽర్జున
విషాదో నామ ప్రథమోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబునగు భగవద్గీతలలో అర్జునవిషాదప్రతిపాదకంబగు
మొదటియధ్యాయము.

## రెండవయధ్యాయము-

### సంజయ ఉవాచ.

తం తథా కృపయా ఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్।
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః॥ ౧॥

తథా కృపయా ఆవిష్టమ్=అట్లు కనికరముచేత ఆక్రమింపఁబడిన వాఁడును, అశ్రుపూర్ణాకులేక్షణమ్ విషీదన్తమ్ తమ్=కన్నీళ్లతో నిండినవైవ్యాకులములైన నేత్రములుకలవాఁడును దుఃఖింపుచున్నవాఁడునగు ఆతనిఁ (అర్జునుని) గూర్చి, మధుసూదనః ఇదమ్ వాక్యమ్ ఉవాచ=శ్రీకృష్ణమూర్తి ఈ వాక్యమును పలికెను.

### శ్రీభగవా నువాచ.

కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున॥ ౨॥

శ్రీభగవాన్ ఉవాచ=శ్రీభగవంతుఁడు (శ్రీకృష్ణమూర్తి)† పలికెను- (హే) అర్జున!=(ఓ) యర్జునుఁడా!, అనార్యజుష్టమ్ అస్వర్గ్యమ్ అకీర్తికరమ్ కశ్మలమ్=తగుమనుష్యులు కానివారి (అజ్ఞానుల) చేనవలంబింపఁబడినదియు స్వర్గమునకుతగనిదియు అపకీర్తినికలుగఁజేయునదియునగు దుఃఖము, విషమే=ఒడుదుడుకులో, త్వా కుతః ఉపస్థితమ్=నిన్ను ఏల పొందెను.

మధుసూదనటీకలో కశ్మలమ్ అనుదానికి మలినమైన స్వధర్మవైముఖ్యము అని వ్రాయఁబడినది- మాధ్వటీకలో దుఃఖము మోహము అని రెండర్థములు వ్రాయఁబడినవి.

---

† శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః। జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీఙ్గనా॥ (ఐశ్వర్యధర్మకీర్తిశ్రీజ్ఞాన వైరాగ్యములకు భగము అని సంజ్ఞ- ఇవికలవాఁడు భగవంతుఁడు-) శ్లో॥ ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానా మాగతిం గతిమ్। వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవానితి॥ (భూతములపుట్టుకను, నాశమును, రాకపోకలను, సంపత్తును, ఆపత్తును, జ్ఞానమును, అజ్ఞానమును, ఎవ్వఁడెఱుఁగునో వాఁడు భగవంతుఁడని చెప్పఁబడఁగినవాఁడు) ఈ రెండు శ్లోకములును శాంకరభాష్యములో 3 అధ్యా॥ 39 శ్లోకమున వ్రాయఁబడినవి.

క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥౩॥

(హే)పార్థ! = (ఓ)కుంతీపుత్రుఁడా!, క్లైబ్యం మాస్మగమః = అధైర్యమును పొందకుము- త్వయి ఏతత్ నోపపద్యతే = నీయందు ఇది తగదు- (హే)పరంతప! = శత్రువులను తపింపఁజేయువాఁడా!, క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వా = తుచ్ఛమైన మనస్సునందలి పిరికితనమును విడిచి, ఉత్తిష్ఠ = లెమ్ము- యుద్ధమునకు సిద్ధముగా నుండు మనుట.

మాధ్వటీకలో క్లైబ్యమ్ = క్లీబత్వము, భయము, అని రెండర్థములు వ్రాయఁబడినవి.

అర్జున ఉవాచ.

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన॥౪॥

హే అరిసూదన! మధుసూదన! = ఓ శత్రువులను జంపువాఁడా!, శ్రీకృష్ణుఁడా!, పూజార్హౌ భీష్మం ద్రోణంచ = పూజకుతగినవారగు భీష్ముని ద్రోణునిని(గూర్చి), అహం సంఖ్యే ఇషుభిః కథం ప్రతియోత్స్యామి = నేను యుద్ధమునందు బాణములచేత ఎట్లు ఎదిరించి యుద్ధముచేయఁగలను?.

మాధ్వటీకలో అరి సూదన అనుదానికి చక్రముచేత శత్రువులను జంపువాఁడా! అనియర్థము వ్రాయఁబడినది- ప్రతి అని పదచ్ఛేదము చేయఁబడి భీష్మం ద్రోణం ప్రతి అని అన్వయింపఁబడినది.

గురూ నహత్వా హి మహానుభావాన్
ఛ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే।
హత్వార్థ కామాంస్తు గురూ నిహైవ
భుఞ్జీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్॥౫॥

మహానుభావాన్ గురూన్ అహత్వా = గొప్పప్రభావముగల పెద్దలను చంపక, ఇహ లోకే భోక్తుమ్ భైక్ష్యమపి శ్రేయః = ఈ లోకమున అనుభవింపను భిక్షాన్నమైనను మేలు- అర్థకామాన్ గురూన్ హత్వాతు = ధనమునుకోరెడి గురువులను చంపితిమా, ఇహైవ రుధిరప్ర

దిగ్ధాన్ భోగాన్ భుఞ్జీయ = ఈలోకమునందే రక్తముచేఁబూయఁబడిన భోగములను అనుభవింపవలయును.

మధుసూదనటీకలో హిమహానుభావాన్ అని ఏకపదముగాఁగూడ విభజింపఁబడి, హిమ = చలువను, హ = పోఁగొట్టెడియగ్నియొక్కగాని సూర్యునియొక్కగాని, అనుభావాన్ = ప్రభావముగల అనియర్థము వ్రాయఁబడినది. ఉత్తరార్థములో అర్థకామాన్ భోగాన్ = అర్థకామస్వరూపములైన భోగములను అనియు నన్వయింపఁబడినది. మాధ్వటీకలో ఈయన్వయమే వ్రాయఁబడినది.

న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥౬॥

నః కతరత్ గరీయః = మనకు ఏది శ్రేష్ఠమో, ఏతత్ నచవిద్మః = దీనిని ఎఱుంగకున్నాము. భిక్షాచరణయుద్ధములలో నేది శ్రేష్ఠమో తెలియదనుటయని మధుసూదనటీక. యుద్ధమును చేయుటమానుటలలో నేది శ్రేష్ఠమో తెలియదనుటయని మాధ్వటీక. (వయమ్) జయేమ యద్వా = (మనము) జయింతుమేమో. నః (ధార్తరాష్ట్రాః) జయేయుః యదివా = మనను (ధార్తరాష్ట్రులు) జయింతురేమో. యాన్ హత్వా (వయమ్) నైవజిజీవిషామః = ఎవ్వరిని చంపి (మనము) జీవింపనేకోరమో, తే ధార్తరాష్ట్రాః ప్రముఖే అవస్థితాః = ఆ ధార్తరాష్ట్రులు ఎదుటనిలిచినవారు. మధుసూదనటీకలో ధార్తరాష్ట్రులనఁగా ధృతరాష్ట్రసంబంధులగు భీష్మద్రోణాదులని వివరింపఁబడినది.

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయస్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్॥౭॥

కార్పణ్యదోషోపహతస్వభావః = లోభముచేఁగలిగిన దోషముచేత తిరస్కరింపఁబడిన స్వభావముగలవాఁడనును, ధర్మసమ్మూఢచేతాః =

ధర్మమునందుసందేహమునుపొందినమనస్సుకలవాఁడనునై, త్వామ్ పృచ్ఛామి=నిన్ను అడుగుచున్నాను- యత్ నిశ్చితం శ్రేయః స్యాత్=ఏది నిశ్చయింపఁబడిన మేలు అగునో, తత్ మే బ్రూహి= దానిని నాకు చెప్పుము- తే అహమ్ శిష్యః=నీకు నేను శిష్యుఁడను- త్వామ్ ప్రపన్నమ్ మామ్ శాధి=నిన్ను ఆశ్రయించిన నన్ను శాసింపుము.

స్వల్పమైనను ధనక్షయమును ఎవ్వఁడు సహింపఁడో వాఁడు కృపణుఁడని లోకములోఁ జెప్పఁబడును. అట్టివాఁడగుటచేత ఆత్మజ్ఞానములేనివాఁడెల్ల కృపణుఁడనఁబడును. అట్టికార్పణ్యమువలన ఈ జన్మమున వీరె నావారు వీరు చచ్చినచో నాబ్రదుకేల అనికలిగెడు మమకారమే దోషము అని మధుసూదనటీక.

కార్పణ్యమనఁగా స్వజనమును చంపెదననెడి మనోదీనత్వము- దానిచేతనును కులక్షయమువలనఁ గలిగెడి దోషముచేతనునని రామానుజీయటీకయు మాధ్వటీకయు- స్వభావమనఁగా పౌరుషము అని మాధ్వటీక- ధైర్యము మొదలయినది అని రామానుజటీక.

నహి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్య చ్ఛోక ముచ్ఛోషణ, మిన్ద్రియాణామ్।
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్॥౮॥

ఇన్ద్రియాణామ్ ఉచ్ఛోషణమ్ మమ శోకమ్=ఇంద్రియములను మిక్కిలి ఇగురఁజేసెడి నా దుఃఖమును, యత్ అపనుద్యాత్ (తత్) =ఏది పోఁగొట్టునో (దానిని), భూమౌ అసపత్నమ్ ఋద్ధమ్ రాజ్యమ్=భూమిలో శత్రువులులేని సమృద్ధికల రాజ్యమును సురాణామ్ ఆధిపత్యంచ=దేవతలయొక్క ఆధిపత్యమును, అవాప్యాపి పొందియును, (అహమ్) నపశ్యామిహి=(నేను) కానకున్నానుగదా.

సంజయ ఉవాచ.

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః।
న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవహ॥౯॥

పరంతపః గుడాకేశః=శత్రువులను తపింపఁజేసెడి అర్జునుఁడు, హృషీకేశం(ప్రతి) ఏవమ్ ఉక్త్వా=శ్రీకృష్ణుని (గూర్చి) ఇట్లు చెప్పి నయోత్స్య ఇతి ఉక్త్వా=యుద్ధముచేయను అని పలికి, తూష్ణీం బభూవహ=ఊరకుండెను

హ అనునది ఆశ్చర్యమును తెలియఁజేయును అని రామానుజీయటీక.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత,
సేనయో రుభయోర్మధ్యే విషీదన్త మిదం వచః॥౧౦॥

(హే)భారత!=(ఓ)ధృతరాష్ట్రుఁడా!, హృషీకేశః=శ్రీకృష్ణమూర్తి, ఉభయోః సేనయోః మధ్యే=రెండు సేనల నడుమను, విషీదన్తమ్ తమ్=దుఃఖించుచున్న అతని(అర్జునుని)గూర్చి, ప్రహసన్నివ ఇదమ్ వచః ఉవాచ=పరిహసించుచున్నట్లున్నవాఁడై ఈ వాక్యమును పలికెను

జ్ఞానవంతుఁడవైనను నీకు ఇట్టి దుర్బుద్ధి ఎట్లు కలిగెనని పరిహాసముచేయుచును అని మాధ్వటీకలో వివరింపఁబడినది.

ఈ వాక్యము అనఁగా నత్వేవాహంజాతునాసమ్(౨అ॥౧౨శ్లో)అనునది మొదలు అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః(౧౮అ॥౬౬శ్లో)అనుశ్లోకమువఱకునుండెడి భగవద్గీతలను అని రామానుజభాష్యము.



దృష్ట్వాతు పాణ్డవానీకమ్(౧అ॥౨శ్లో)అనునది మొదలు, నయోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవహ(౨అ॥౯శ్లో) అనువఱకును జెప్పఁబడిన గ్రంథము, ప్రాణుల సంసారదుఃఖమునకు బీజభూతములగు(నిత్తనములగు) శోకమోహములు పుట్టుటకు కారణమును తెలియఁజేయును- ఎట్లన్నను- కథంభీష్మమహంసంఖ్యే(౨అ॥౪శ్లో)ఇత్యాదిగ్రంథముచేత, అర్జునునకు కలిగిన శోకమోహములు, రాజ్యము గురువులు పుత్రులు మిత్రులు(చెలికాండ్రు) సుహృత్తులు(ఉపకారకులు) స్వజనము సంబంధులు బంధువులు, వీరియందు, నేను వీరివాఁడను వీరు నావారు అనెడి భ్రాంతివలనగలిగిన స్నేహమునకు భంగము వచ్చు

ట కారణముగాఁ గలిగినవిగాఁ దెలియఁజేయఁబడినవి- ఈశోకమోహములచేత వివేకజ్ఞానశూన్యుఁడై యర్జునుఁడు, స్వయముగాఁ బ్రవర్తించిన యుద్ధమునుండియు మఱలెను- తనకు గాని భిక్షమెత్తుట మొదలగువానిం జేయుట కుద్దేశించెను- కాఁబట్టి శోకమోహాది దోషములతోఁగూడిన యెల్ల ప్రాణులకును స్వయముగానె స్వధర్మమును విడుచుటయు నిషిద్ధమును సేవించుటయు సంభవించును- స్వధర్మమునఁ బ్రవర్తించినప్పటికిని వారి మనోవాక్కాయములప్రవృత్తి ఫలోద్దేశపూర్వకంబును అహంకారముతోఁగూడినదియును గానేయుండును- దానివలన పుణ్యపాపములు వృద్ధిబొంది జన్మసుఖదుఃఖప్రాప్తిస్వరూపంబగు సంసారము ఎడతెగకుండును- కాఁబట్టి, సంసారబీజములు శోకమోహములనియు, అవి సర్వకర్మసంన్యాస(అన్నికర్మములను విడుచుట)పూర్వకంబగు నాత్మజ్ఞానముననె కాని మఱియొక్క దానివలన నివర్తించవనియు, సర్వలోకానుగ్రహముకొఱకు ఉపదేశింపఁగోరినవాఁడై వాసుదేవుఁడు అర్జునుని నిమిత్తముగాఁ జేసికొని ఈపైగ్రంథమును చెప్పుచున్నాఁడు- అని శంకరభాష్యము.

పరిసక్తి లేనిచోట గలిగిన స్నేహకారుణ్యములచేత వ్యాకులుఁడై క్షత్రియులకు పరమధర్మమైన యుద్ధమును అధర్మముగాఁ దలంచుచు, ధర్మమును తెలియఁగోరి శరణాగతుఁడైన యర్జునునింగూర్చి,—ఆత్మతత్త్వజ్ఞానంబును ఫలోద్దేశములేనియుద్ధము ఆత్మప్రాప్తికిసాధనమనెడిజ్ఞానంబును కలుగక ఈతని యజ్ఞానము శమింపదనితలంచి భగవంతునిచే నధ్యాత్మశాస్త్రారంభము చేయఁబడినది- అనిరామానుజభాష్యము.

ధర్మంబును జ్ఞానంబును లోకంబున నశింపఁగా కరుణాశీలుగను బ్రహ్మరుద్రేంద్రాదులచేఁ బ్రార్థింపఁబడినవాఁడై జ్ఞానమును తెలియఁజేయుటకై భగవంతుఁడు వ్యాసుఁడుగానవతరించెను- వేదార్థజ్ఞానములేక సంసారములో క్లేశముంజెందుచుండెడి స్త్రీశూద్రాదులకుంగూడ ధర్మజ్ఞానద్వారంబున మోక్షము కలుగవలయునని మహాభారతమును రచియించెను- దానిలో సర్వభారతార్థసంగ్రహమై వాసుదేవార్జునసంవాదరూపమై భారతమనెడికల్పవృక్షమునకు మక

రంధమువంటిదైన గీతను రచియించెను. రెండుసేనలనడుమను బాంధవాదిమోహమనెడి వలలో జిక్కుకొని విషాదమునుపొందుచున్న యర్జునునింగూర్చి భగవంతుఁడుచెప్పుచున్నాఁడు. అని మధ్వభాష్యము.

శ్రీభగవానువాచ.

అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః॥౧౧॥

త్వమ్ అశోచ్యాన్ అన్వశోచః = నీవు దుఃఖింపఁదగనివారింగూర్చి దుఃఖించితివి. ప్రజ్ఞావాదాంశ్చ భాషసే = తెలివింబట్టినమాటలనుం గూడ చెప్పుచున్నావు. పణ్డితాః గతాసూన్ అగతాసూంశ్చ నానుశోచన్తి = ఆత్మజ్ఞానముకలవారు ప్రాణములుపోయినవారింగూర్చియు ప్రాణములుపోనివారింగూర్చియు దుఃఖింపరు.

ప్రజ్ఞావాదములననవి దేహస్వభావమునను జీవుని స్వభావమునుం దెలియఁజేసెడి మాటలు. గతాసూన్ అనుశబ్దమునకు శరీరములును, అగతాసూన్ అనుశబ్దమునకు జీవులును అర్థము. అని రామానుజభాష్యము.

ప్రజ్ఞావాదములనఁగా నీబుద్ధివలనఁగలిగిన వాదములని మధ్వభాష్యము.

నత్వేవాహం జాతునాసం నత్వం నేమే జనాధిపాః।
నచైవ న భవిష్యామః సర్వే వయ మితఃపరమ్॥౧౨॥

అహమ్ జాతు నాసమ్(ఇతి)తున్నైవ = నేను ఒకప్పుడును లేకుంటి(ననునది)లేదు. త్వమ్ (నాసీరితి) న = నీవు (లేకుంటివనునది) లేదు. ఇమే జనాధిపాః (నాసన్నితి) న = ఈ రాజులు (లేకుండిరనునది) లేదు. వయమ్ సర్వే ఇతః పరమ్ నభవిష్యామః (ఇతి)చ నైవ = మనము అందఱము ఇఁకమీఁదను లేకపోయెదము (అనునది) యును లేదు.—సర్వేశ్వరుఁడనగు నేనెట్లు నిత్యుఁడనో అట్లు జీవులును నిత్యులేయనుట.

ఆత్మ యొకటియె యైనను శరీరములభేదము ననుసరించి బహుత్వము చెప్పఁబడినది. అని శంకరభాష్యము.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాన్తరప్రాప్తి ర్ధీర స్తత్రనముహ్యతి॥౧౩॥

దేహినః అస్మిన్ దేహే=ఆత్మకు ఈదేహమున, కౌమారమ్ యౌవనమ్ జరా యథా (భవన్తి)=బాల్యంబును యౌవనంబును ముదిమియు నెట్లు (కలుగుచున్నవో), తథా దేహాన్తరప్రాప్తిః (భవతి)=అట్లె మఱియొక్క శరీరమును పొందుటయును (కలుగుచున్నది)- తత్ర ధీరః నముహ్యతి=అవిషయమున బుద్ధిమంతుఁడు మోహముం జెందఁడు.

కౌమారాద్యవస్థలుకలిగినప్పుడు ఆత్మ పుట్టుటయు అవి పోవునప్పుడు ఆత్మ నశించుటయు నెట్లులేదో అట్లు శరీరాంతరము కలుగుటయును అవికారియు నొక్కఁడునగు నాత్మకె కలుగుచున్నది- అని శంకర భాష్యము.

ఒక్కయవస్థపోయి మఱియొక్కయవస్థకలుగునప్పుడు ఆత్మస్థిరుఁడను జ్ఞానముండుటచేత ఆత్మ నశించెననుకొని శోకమును జెందుట యెట్లులేదో, అట్లె ఒక్కదేహమునుండి మఱియొక్కదేహమును జెందునప్పుడును ఆత్మస్థిరుఁడను జ్ఞానముకలవాఁడు దుఃఖింపఁడు- అని రామానుజభాష్యము.

ఈశ్లోకము దేహమున జీవుఁడున్నాఁడను నంశమును సాధించును- అదియెట్లన్నను, ఈజన్మంబున బాల్యాది శరీరములు వేఱువేఱైనను, ఏనేను కుమారశరీరము కలవాఁడనైతినో ఆనేనే యౌవనశరీరము కలవాఁడనగుచున్నాను, అనునమభవమువలన జీవుఁడొక్కఁడెట్లు సిద్ధుఁడయ్యెనో, శరీరాంతరమును పొందునప్పుడును ఇట్లె- చచ్చినశరీరమునకు బాల్యాద్యవస్థానుభవము లేదుగదా- ఇంతియు కాక యపౌరుషేయంబగుటను ప్రమాణతమంబైన వేదంబు నిందుప్రమాణము- కావున కుయుక్తులచేత ధీరుఁడగువాఁడు మోహముం జెందఁడు- అని మధ్వభాష్యము.

మధ్వభాష్యంబున ఈశ్లోకమునకును వెనుకటి శ్లోకమునకును మఱియొక్కవిధముగాఁగూడ తాత్పర్యమువ్రాయఁబడినది—జీవనాశముం బట్టియైనను శరీరనాశముం బట్టియైననుగదా శోకముంజెందవలసినది-

అందుజీవులు నిత్యులగుటవలన జీవనాశముంబట్టి శోకింపనక్కఱ లేదని "న త్వేవాహమ్" అనుశ్లోకమునకు తాత్పర్యము- ఇఁక శరీరనాశమునకున్ను దుఃఖింపనక్కఱలేదు- బాల్యాదిశరీరములుపోయి యౌవనాదిశరీరములు వచ్చినప్పుడెట్లు శోకము లేదో అట్లె ఈశరీరముపోయి మఱియొక శరీరము వచ్చునప్పుడు నని "దేహినోస్మిన్" అనుశ్లోకమునకు తాత్పర్యము.

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణ సుఖ దుఃఖదాః।
ఆగమాపాయినో నిత్యా స్తాం స్తితిక్షస్వ భారత॥

(హే)కౌన్తేయ!=(ఓ)కున్తీపుత్రుఁడా!, మాత్రాస్పర్శాః శీతోష్ణసుఖదుఃఖదాః=శబ్దాదివిషయసంబంధములు చలివేఁడి మొదలగుసుఖదుఃఖములనిచ్చునవి- ఆగమాపాయినః=రాకపోకలుగలవి- అనఁగా నొకప్పుడుండి మఱియొకప్పుడు లేకుండునవి- (కావుననె), అనిత్యాః=అనిత్యములు- (హే)భారత! తాన్ తితిక్షస్వ=(ఓ)భరతవంశమువాఁడా! వానిని సహింపుము.

చలువయె కాలభేదమున సుఖమును దుఃఖమునుంగూడ కలుగఁజేయును- వేడియున్నట్లె- మాత్రలనఁగా ఇంద్రియములు- వానికి విషయములతోడి సంబంధములుగానీ వాని విషయములుగానీ మాత్రాస్పర్శములు- అని శంకరభాష్యము.

శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయములును వానికి ఆశ్రయములైన పంచభూతంబులును తన్మాత్రల*చేఁ గలిగినవిగాన మాత్రలనఁబడును- వానికి శ్రోత్రాదీంద్రియములతోడి సంబంధములె మాత్రాస్పర్శములు- అని రామానుజభాష్యము.

మాత్రలనఁగా విషయములు- వానితోడిసంబంధములు మాత్రాస్పర్శములు- అని మధ్వభాష్యము.

యంహి నవ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥౧౫॥

(హే)పురుషర్షభ!=(ఓ)పురుషశ్రేష్ఠుఁడా, సమదుఃఖసుఖమ్ ధీరమ్ యమ్=సమములైనసుఖదుఃఖములుకలవాఁడును ధైర్యముకలవాఁడు

* తన్మాత్రలస్వరూపమును సృష్టిసంగ్రహమునఁజూచునది.

నను నెవ్వనిని, ఏతే నవ్యథయన్తి=ఇవి బాధింపవో, సహి అమృతత్వాయ కల్పతే=వాఁడుగదా మోక్షమునొందుటకు సమర్థుఁడగుచున్నాఁడు.

ధీరమ్= బుద్ధిమంతుని- అని శంకరభాష్యము.

పురిశయః పురుషః (శరీరమున పరుండువాఁడుగాన పురుషుఁడనఁబడును) అనువిగ్రహమునుపట్టి శరీరముతోనుండఁగానే యెవ్వనిమాత్రాస్పర్శములు బాధింపవో - ఇట్లుబాధింపఁబడకుండుటకు సమదుఃఖసుఖత్వము హేతువు- దానికి ధైర్యముహేతువు- అని మధ్వభాష్యము.

నాసతోవిద్యతేభావో నాభావో విద్యతే సతః|
ఉభయోరపి దృష్టోన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః||౧౬||

అసతః భావః నవిద్యతే=లేనిదానికి కలిమి లేదు- సతః అభావః న విద్యతే=కలదానికి లేమి లేదు- అనయోః ఉభయోరపి అన్తః=ఈ రెంటియొక్కయును నిర్ణయము, తత్త్వదర్శిభిః దృష్టః=తత్త్వమునెఱిఁగినవారిచే తెలియఁబడినది.

ఘటము(కుండ)కలదు, పటము(బట్ట)కలదు, చెట్టుకలదు, గోడకలదు ఇత్యాది జ్ఞానములన్నిటియందును కలదు అనునంశమొక్కటి కలదు. అది మాఱుటలేదుగాన వికారముకానిది- మిగిలిన ఘటపటాదులొక్కొక్కజ్ఞానమునకొక్కొక్కటిచొప్పున మాఱుచున్నవిగాన వికారములనఁబడును. ఈవికారములన్నియు నొక్కప్పుడున్నను మఱియొక్కప్పుడు లేకుండునుగాన లేనివియె- కావునన సత్తులనఁబడును- కలదు అనుదానికి ఒక్కప్పుడును లేకపోవుట లేదుగాన అదిసత్తు- ఈసత్తే బ్రహ్మమనియు నాత్మయనియుఁ జెప్పఁబడినది- ఈయంశమె ఈశ్లోకతాత్పర్యమని శంకరభాష్యము.

అసత్తనఁగా నశించెడి స్వభావముకలదియగు శరీరము- సత్తు అనఁగా నట్టిదికానిజీవుఁడు- అసత్తగుదేహము సత్తగుట, అనఁగా, నశింపనిదియగుటలేదు- సత్తునకు అనఁగా నశింపనిజీవునకు అభావము అనఁగా అసత్తగుటలేదు- ఇట్లు శరీరాత్మవివేకము తత్త్వజ్ఞులచేఁ దెలియఁబడినది. అని రామానుజభాష్యము.

విద్యతే భావః అనునప్పుడు విద్యతే అభావః అని పదచ్ఛేదము- అ

సత్తునకు అనఁగా కారణంబునకును లేమిలేదు. సత్తునకను అనఁగా విఘ్నంబునకును లేమిలేదు. అనఁగా ప్రకృతియును ఆత్మవలె నిత్యమే యనుట. అని మధ్వభాష్యము.

అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్।
వినాశమవ్యయస్యాస్య నకశ్చిత్ కర్తుమర్హతి॥౧౭॥

యేన ఇదం సర్వం తతమ్=దేనిచేత ఇదియంతయు వ్యాపింపఁబడినదో, తత్ అవినాశి విద్ధి=దానిని నాశములేనిదానిగా నెఱుంగుము. అవ్యయస్య అస్య=వికారములేనిదగుదీనికి, కశ్చిత్=ఎవ్వఁడును, వినాశం కర్తుం నార్హతి=వినాశమును కలుగఁజేయఁ దగడు.॥

ఈశ్లోకము బ్రహ్మతత్త్వమునుగూర్చినదియని శంకరభాష్యము.

ఈశ్లోకము ఆత్మతత్త్వవిషయమైనది. అచేతనములయందంతటను చేతనులు వ్యాపించియున్నారని తాత్పర్యమని రామానుజభాష్యము.

ఈశ్లోకము వేదాదినిత్యత్వవిషయము. ఉత్తరార్ధముచే శాపము మొదలగువానిచేఁగూడ నాశము దని చెప్పఁబడుచున్నది. అని మధ్వభాష్యము.

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥౧౮॥

నిత్యస్య అప్రమేయస్య అనాశినః శరీరిణః=నిత్యుఁడును జ్ఞానమునకు విషయముకానివాఁడును నాశములేనివాఁడునగు శరీరి(శరీరముకలవాని)యొక్క ఇమే దేహాః అన్తవన్తః ఉక్తాః=ఈ శరీరములు నాశముకలవిగాఁ జెప్పఁబడినవి. (హే)భారత!=తస్మాత్ యుధ్యస్వ=(ఓ)యర్జునా! ఆహేతువువలన యుద్ధముచేయుము.

ఎండమావులను చూచినపైఁబుట్టిన జలజ్ఞానము తగిన ప్రమాణమువలన నివర్తించునట్లును, స్వప్నమునందలి మాయాశరీరములు జాగ్రదవస్థయందు లేనియట్లును, ఈ దేహములును అంతముకలవి. శరీరియనఁగా నాత్మ. అప్రమేయుఁడనఁగాఁ బ్రత్యక్షాది ప్రమాణములచే నేర్పఱుపశక్యముకానివాఁడనుట. అని శంకరభాష్యము.

శరీరిఅనఁగా ఆత్మ- దేహశబ్దమునకు పోగుచేయఁబడినది యనియవయవార్థము- జీవుఁ డెప్పుడును మనచేఁ జెలియఁబడెడి ఘట

వటాదులవలె, తెలియఁబడెడి వస్తువుగాఁ దెలియఁబడదు. ఈజీవు మన్నను, తెలిసికొనెడి వాఁడుగాఁ దెలియఁబడుచున్నాఁడు- ఇదియె యప్రమేయశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది- అని రామానుజభాష్యము.

అప్రమేయశబ్దమునకు, అప్రమేయుఁడగు నీశ్వరునితో సమానమైన రూపముకలవాఁడు, అనఁగా నీశ్వరప్రతిబింబమని యర్థము - ఈశ్వరుని ప్రతిబింబము జీవుఁడగుటకు అద్దమువంటి ఉపాధి జీవస్వరూపమే- లోకములోఁ బ్రతిబింబము నశించుటకు బింబము దగ్గిర లేకపోవుట నిమిత్తము- ఈశ్వరప్రతిబింబమగు జీవునికి అట్టి నాశము లేదు- అని మధ్వభాష్యము.

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ నవిజానీతో నాయం హన్తి నహన్యతే॥౧౯॥

ఏనం హన్తారం యః వేత్తి=వీనిని కొట్టెడివానినిగా నెవ్వఁడు ఎఱుంగుచున్నాఁడో, ఏనం హతం యః మన్యతే=ఈతనిని కొట్టఁబడినవానినిగా నెవ్వఁడు తలంచుచున్నాఁడో, తౌ ఉభౌచ నవిజానీతః=వారు ఇద్దఱును ఎఱుంగకున్నారు- (అనఁగా ఎఱుంగనివారు) అయమ్ నహన్తి=ఈతఁడు కొట్టుచున్నవాఁడు కాఁడు- నహన్యతే =కొట్టఁబడుచున్నవాఁడును కాఁడు.

ఇది వేదమంత్రమని శంకరాచార్యులవారిచేఁ జెప్పఁబడినది.

కొట్టెడివాఁడగుట యనుకర్తృత్వంబును, కొట్టఁబడెడివాఁడగుట యనెడి కర్మత్వంబును, వికారంబులుగాన బ్రహ్మమునందు లేవని తాత్పర్యము- అని శంకరభాష్యము.

ఏనం హన్తారమ్, అనునవి విశేష్యవిశేషణములుకావు- ఈజీవునింగూర్చి చెడఁగొట్టెడిదానిగా నగ్నిమొదలగుదాని నెవ్వఁడు తలంచుచున్నాఁడో, ఈజీవుఁడు చెడఁగొట్టఁబడినవాఁడని యెవ్వఁడు తలంచుచున్నాఁడో, వారిద్దఱును ఎఱుంగనివారు- ఈయగ్నిమొదలగునది చెడఁగొట్టుచున్నది కాదు, వీడు చెడఁగొట్టఁబడుచున్నవాఁడు కాఁడు- అని రామానుజభాష్యము.

ఈజీవుని స్వతంత్రముగాఁ గొట్టువానిగానును, కొట్టఁబడ్డవానిగానును తలంచువాఁడు ఎఱుంగనివాఁడు-ప్రతిబింబమునకు బింబ

మనుపట్టిరయే కదా వ్యాపారము- జీవుఁడు ఈశ్వరప్రతిబింబముకదా అని మధ్వభాష్యము.

నజాయతే మ్రియతేవా కదాచి
న్నాయంభూత్వా భవితావా నభూయః।
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే॥ ౨౦॥

అయం నజాయతే=ఈయాత్మ పుట్టుచుండువాఁడుకాఁడు- నమ్రియతేవా=చచ్చువాఁడునుకాఁడు- అయం కదాచిత్ నభూత్వా భూయః భవితావా న=ఇతఁడు ఒకప్పుడు లేకుండి తిరిగియు కలుగువాఁడైనను కాఁడు- అయమ్ అజః=ఈతఁడు పుట్టనివాఁడు- నిత్యః=నాశములేనివాఁడు- శాశ్వతః=ఎల్లప్పుడునుండువాఁడు- పురాణః=పురాతనుఁడు- శరీరే హన్యమానే నహన్యతే=శరీరము చెడఁగొట్టఁబడుచున్నను చెడఁగొట్టఁబడకయున్నాఁడు.

ఇది వేదమంత్రమని శంకరాచార్యులవారును మధ్వాచార్యులవారును చెప్పిరి.

నాయంభూత్వా భవితావా నభూయః అనుదానికి రెండన్వయములు- (౧) అయం భూత్వా నభవితా న=ఈతఁడు కలిగియుండి లేకుండఁబోవువాఁడు కాఁడు- ఇది నశింపఁడనుదానికి హేతువు- (౨) అయం నభూత్వా భవితా న=ఈతఁడు లేకుండి కలుగఁబోవువాఁడు కాఁడు- ఇది పుట్టఁడు అనుదానికి హేతువు- అనిత్యవస్తువులకు ఆఱు అవస్థలు కలవు- వానిని భావవికారములందురు- అవియెవ్వియనిన. ౧ జాయతే(పుట్టుట). ౨ అస్తి(కలిమి). ౩ విపరిణమతే(పరిణమించుట). ౪ వర్ధతే(ఎదుగుట). ౫ అపక్షీయతే(తగ్గుట). ౬ వినశ్యతి(నశించుట). ఇందు మొదటిదియు నాఱవదియు నను భావవికారములు వెనుకటి పదములచే నిషేధింపఁబడినవి- శాశ్వతశబ్దముచే ఎల్లప్పుడు నొకవిధముగా నుండువాఁడను నర్థమున అపక్షయమనెడి అయిదవ భావవికారము నిషేధింపఁబడుచున్నది- పురాణశబ్దమున కు పురాఽపినవః అని నిర్వచనము- అనఁగా మునుపును క్రొత్తవాఁడేయనియర్థము- మునుపటికంటె ఇప్పుడు క్రొత్తదనము కలుగతే

దని తాత్పర్యము- ఈవిశేషణము, వృద్ధియనెడి నాల్గవభావవికారము ను నిషేధించుచున్నది- అని శంకరభాష్యము.

ఈయాత్మ మనదేహములవలె పుట్టుచుండుటయు నశించుచుండుట యు లేదు- కల్పాదియందు పుట్టి కల్పాంతమునందు నశించెడి ప్రజాప త్యాది శరీరములవలె ఒకప్పుడు పుట్టి చాలకాలముండి నశించువాడు నుకాడు- శాశ్వతుఁడనుటచే ప్రకృతివలె ఎల్లప్పుడును వికారములుకాని పరిణామములం బొందువాఁడుగూడ కాడనుట- పురాణుఁడనఁగా పురాపినవః అను నిర్వచనముచే ఎల్లప్పుడును అపూర్వముగానె అనుభ వింపఁబడఁదగినవాఁడనుట- అని రామానుజభాష్యము.

నాయమ్ అనునప్పుడు నా, అయమ్ అని పదచ్ఛేదము- నా అనఁగా పురుషుఁడు, అనఁగా జీవుఁడు, ఈశ్వరజ్ఞానమువలె, కలిగియుండియె పెండియు కలుగుచుండువాఁడును కాఁడు- అజుఁడు నిత్యుఁడు, అనఁ గా పుట్టుకలేనివాఁడును నిత్యుఁడునగు ఈశ్వరునిం బోలినవాఁడు- శాశ్వతుఁడు, అనఁగా ఎల్లప్పుడు నొకవిధముగానుండువాఁడు- పు రాణుఁడైనను, అనఁగా ( పురమ్ దేహమ్ అణతి ) శరీరమును పొం దియున్నవాఁడైనను, శరిరము కొట్టఁబడినదగుచుండఁగా ఈజీవుఁడు కొట్టఁబడఁడు- ఇట్లైతెలింగినవాఁడు ఎట్లు కొట్టించును, ఎట్లు కొట్టును- అని మధ్వభాష్యము.

వేదా వినాశినం నిత్యం య ఏన మజమవ్యయమ్।
కథం సపురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్॥

పార్థ!=అర్జునుఁడా!, అవినాశినమ్ అజమ్ అవ్యయమ్ నిత్యమ్ ఏనమ్=నాశములేనివాఁడును పుట్టుకలేనివాఁడును క్షయము లేనివాఁ డును (కావుననె)నిత్యుఁడునగు ఈయాత్మను, యః వేద=ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో, సపురుషః కథం హన్తి?=ఆపురుషుఁడు ఎట్లు కొట్టుచున్నాఁడు!- కం హన్తి=ఎవ్వని కొట్టుచున్నాఁడు- కం ఘాతయతి=ఎవ్వని కొట్టించుచున్నాఁడు.

అవినాశియనఁగా ఆఱవభావవికారము లేనివాఁడు- నిత్యుఁడనఁగా పరిణామము(౩వ భావవికారము) లేనివాఁడు- అజుఁడనఁగా పుట్టుక (౧ భావవికారము) లేనివాఁడు- అవ్యయుఁడనఁగా వృద్ధిక్షయములు

(౬-వ భావవికారములు)లేనివాఁడు- బ్రహ్మజ్ఞానము గలవాఁడుఅన్నికర్మములనుండియు నుడుగును- అని శంకరభాష్యము.

నిత్యమైన ఆత్మస్వరూపమునెఱింగినవాఁడు శరీరమును చెడఁగొట్టుచు, ఆత్మను చెడఁగొట్టుచున్నానని యెట్లుఅనుకొనును?- అని తాత్పర్యము అని రామానుజభాష్యము.

అవినాశియనఁగా నైమిత్తిక(కారణాంతరమువలనగలిగిన)వినాశము లేనివాఁడు- నిత్యుఁడనఁగా స్వాభావిక(స్వతస్సిద్ధమైన)నాశము లేనివాఁడు- అవినాశియనఁగా దోషములతోఁగూడనివాఁడనియు, నిత్యుఁడనఁగా ఎల్లప్పుడు నుండువాఁడనియుం, జెప్పవచ్చును- అని మధ్వభాష్యము.

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ ౨౨॥

నరః జీర్ణాని వాసాంసి విహాయ=మనుష్యుఁడు శిథిలములైన బట్టలను వదిలి, నవాని అపరాణి యథాగృహ్ణాతి=క్రొత్తవియగు ఇతరవస్త్రములను ఎట్లు స్వీకరింపుచున్నాఁడో, తథా దేహీ జీర్ణాని శరీరాణి విహాయ=అట్లు జీవుఁడు ముదిమిగలిగిన శరీరములను విడిచి, నవాని అన్యాని సంయాతి=క్రొత్తవియగు ఇతరశరీరములను పొందుచున్నాఁడు.

దేహముతోనున్నను ఆత్మకు వికారములులేవు అని శంకరభాష్యము.

ధర్మయుద్ధమున శరీరములను విడిచినవారికి విడువఁబడినవానికంటె మేలగుస్వర్గశరీరంబులు కలుగుట శాస్త్రమున నున్నదిగాన, వీరిని యుద్ధములో చంపుటకు సంతోషింపవలయుంగాని దుఃఖింపనక్కఱలేదని తాత్పర్యము- అని రామానుజభాష్యము.

ఇది దేహాత్మవివేకానుభవముకొఱకైన దృష్టాంతము- అని మధ్వభాష్యము.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।

న చైనం క్లేదయ న్త్యాపో న శోషయతి మారుతః॥ ౨౩॥
అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్య స్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః॥ ౨౪॥

శస్త్రాణి ఏనం న ఛిన్దన్తి=ఆయుధములు ఈతనిని ఛేదింపవు- పావకః ఏనమ్ న దహతి=అగ్ని ఈతనిని తగులఁబెట్టదు-ఆపశ్చ ఏనమ్ న క్లేదయన్తి=నీళ్లను ఈతనిం జివికింపవు- మారుతః న శోషయతి=వాయువు ఇగుర్పదు-(కాఁబట్టి) అయమ్ అచ్ఛేద్యః=ఈతఁడు ఛేదింపఁబడఁదగనివాఁడు- అయమ్ అదాహ్యః=ఈతఁడు తగులఁబెట్టఁబడఁదగనివాఁడు- అక్లేద్యః=దివుకింపఁబడఁదగనివాఁడు అశోష్య శ్చైవ=ఇగుర్పఁబడఁదగనివాఁడునే- నిత్యః=నిత్యుఁడు- సర్వగతః=అంతటను న్నవాఁడు- స్థాణుః=స్థిరుఁడు- (కావున నె) అచలః=కదలనివాఁడు- అయమ్ సనాతనః=పాతఁడు చాలకాలపువాఁడు.

ఆత్మతత్త్వమును తెలిసికొనుట కష్టసాధ్యమగుటను చెప్పినమాటలనె చెప్పుచు భగవంతుఁడగు వాసుదేవుఁడు బోధించెను- పౌనరుక్త్యమును ఆలోచించుచో ఆత్మతత్త్వముంగూర్చి చెప్పినదంతయు న జాయతే మ్రియతే వా కదాచిత్ (౨అ॥ ౨౦శ్లో) అని చెప్పినదానిచేతనే గతార్థమగును- అని శంకరభాష్యము.

రామానుజభాష్యమున స్థాణువనఁగా స్థిరస్వభావుఁడనియు అచలుఁడనఁగా కదలింపశక్యముకానివాఁడనియు సనాతనుఁడనఁగా పురాతనుఁడనియును అర్థవివేచనము చేయఁబడినది.

తఱుచుగా నన్నిటిచేత నశింపనిదానికింగూడ కారణవిశేషమున నాశము కలుగుటకలదు- కావున అట్టి కారణవిశేషము కూడ లేదనుట, నైనం ఛిన్దన్తి అను శ్లోకమునకు తాత్పర్యము- వర్తమానమున నాశము లేక పోయినట్లు ముందును నాశము లేదనుట అచ్ఛేద్యోయమ్ అను శ్లోకమునకు తాత్పర్యము - నిత్యసర్వగతస్థాణుః అని పాఠము- అట్టి యీశ్వరునితో సరూపుఁడుగాన అచ్ఛేద్యత్వాదివిశేషణవిశిష్టుఁడు- శాశ్వతుఁడనుటచే ఎల్లప్పుడు నొక్క రూపముగా నుండువాఁడని చెప్పఁబడినది- ఈ శ్లోకమున స్థాణుశబ్దము నైమిత్తికముగానైన రూపాంతరము లేదని తెలియఁజేయుచున్నది- నిత్యముగా సర్వగతుఁడైనవాఁడని యన్వయము-

విరోధము లేనిచో బింబధర్మములన్నియు ప్రతిబింబమున సంభవించును అని మధ్వభాష్యము

అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే।
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి॥౨౫॥

అయమ్ అవ్యక్తః=ఈయాత్మ స్ఫుటపడనివాఁడు- అయమ్ అచిన్త్యః=ఈతఁడు తలంపఁబడఁదగనివాఁడు- అయమ్ అవికార్యః (ఇతి) ఉచ్యతే=ఈతఁడు వికారములనుపొందింపఁబడఁదగనివాఁడు (అని) చెప్పఁబడుచున్నాఁడు- తస్మాత్ ఏనమ్ ఏవమ్ విదిత్వా=ఆ హేతువువలన ఈతని ఇట్లు తెలిసికొని, అనుశోచితుమ్ నార్హసి =విచారింపం దగవు.

పంచేంద్రియములకును విషయము కాకపోవుటచే అవ్యక్తుఁడనియు అచింత్యుఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడని శంకరభాష్యము.

ఛేదింపఁబడుట మొదలగువానికితగిన వస్తువులవలెఁ దెలియఁబడుటయు తలంపఁబడుటయు లేమగాన ఈయాత్మ అవ్యక్తుఁడనియు అచింత్యుఁడనియుఁజెప్పఁబడుచున్నాఁడని రామానుజభాష్యము.

వెనుకఁజెప్పిన హేతువులవలననే అవ్యక్తాదిస్వరూపుఁడు- అని మధ్వభాష్యము.

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి॥౨౬॥

అథచ ఏనమ్=ఇఁకను ఈయాత్మను, నిత్యజాతమ్ నిత్యం మృతంవా మన్యసే=నిత్యముగాపుట్టినవానిగానైనను నిత్యముగా చచ్చినవానిగానైనను తలంచెదవు, (హే) మహాబాహో!=(ఓ) మహాభుజుఁడా!, తథాపి త్వమ్ ఏవం శోచితుం నార్హసి=అట్లయినను నీవు ఇట్లు దుఃఖింపం దగవు.

ఆత్మను పుట్టుచునునశించుచునుండెడి శరీరమునుగానే తలఁచితివేని, అని రామానుజభాష్యమున వివరింపఁబడినది.

ఆత్మ నిత్యుఁడైనను దేహసంయోగ వియోగరూపములగు జనన మరణములు ఆత్మకు మోక్షమువరకును నియతముగా కలుగునని తలంచితివేని ఆపాటి జ్ఞానముచేతనైనను నీవు దుఃఖింపందగదు

వ్వాను- అని మధ్వభాష్యము.

జాతస్యహి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ।
తస్మా దపరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి॥౨౭॥

జాతస్య మృత్యుః ధ్రువోహి=పుట్టినదానికి నాశము తప్పనిదిగదా- మృతస్య జన్మచ ధ్రువమ్=నశించినదానికి పుట్టుకయును తప్పనిదె- తస్మాత్ అపరిహార్యే అర్థే=ఆహేతువువలన పరిహరింపందగని విషయమున, త్వమ్ శోచితుమ్ నార్హసి=నీవు దుఃఖింపందగవు.

నశించినది తిరిగియుం బుట్టుటయెట్లన్నను,—పుట్టుక నాశము:అనునవి ఉన్నద్రవ్యమునకె అవస్థావిశేషములుకాని క్రొత్తగా నొకవస్తువైనను లేనిది పుట్టుటలేదు- దూదియొడికినచో నూలగుచున్నది- నూలు నేసినచో బట్టయగుచున్నది బట్టచెడిపోయినయెడను నూలైననగును, దూదియైననగును- తుదకు మనకంటికి కనఁబడని దూదియొక్కయవయవములైన నగుంగాని శుద్ధముగా లేకపోదు- కాఁబట్టి నశించిన వస్తువెల్ల మఱియొక్క వస్తువగుట కలదుగాన, ధ్రువం జన్మమృతస్యచ, అనుటకు కొఱంత లేదు- అని రామానుజభాష్యమున వివరింపఁబడినది.

జన్మమరణములు ఆత్మకు నియతములు గాన శోకింపవలసినది లేదు- అని మధ్వభాష్యము.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥౨౮॥

(హే) భారత!=(ఓ) భరతవంశమువాఁడా!, భూతాని=మనుష్యాది భూతములు, అవ్యక్తాదీని=తెలియఁబడని యాదికలవి- వ్యక్తమధ్యాని =తెలియఁబడిన మధ్యముకలవి- అవ్యక్తనిధనాన్యేవ=తెలియఁబడని నాశముకలవియె- తత్ర పరిదేవనా కా=అందు విలాప మేల?

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి
శ్రుత్వాఽ ప్యేనం వేద నచైవ కశ్చిత్॥౨౯॥

కశ్చిత్ ఏనమ్ ఆశ్చర్యవత్ పశ్యతి=ఒకానొకఁడు ఈతనిని అద్భుత

వస్తువునువలె చూచుచున్నాఁడు తథైవచ అన్యః ఆశ్చర్యవత్ వదతి =అట్లే మఱియొకఁడు అద్భుతవస్తువుంగురించివలె చెప్పుచున్నాఁడు- అన్యశ్చ ఆశ్చర్యవత్ ఏనమ్ శృణోతి=మఱియొక్కఁడు అద్భుతమునువలె ఈయాత్మను వినుచున్నాఁడు- కశ్చిత్ ఏనమ్ శ్రుత్వా ఒపి న వేదచ=ఒకానొకఁడు ఈయాత్మను వినియును తెలిసికొనకున్నాఁడు.

ఒకానొకఁడు ఈయాత్మను చూచుచున్నాఁడు- వాఁడు ఆశ్చర్యవస్తువువంటివాఁడు- ఒకానొకఁడు ఈయాత్మ తత్త్వముంగూర్చి చెప్పుచున్నాఁడు- వాఁడును ఆశ్చర్యవస్తువు వంటివాఁడు- ఒకానొకఁడు ఈయాత్మతత్త్వముఁగూర్చి వినుచున్నాఁడు- వాఁడును ఆశ్చర్యమువంటివాఁడు- తలుచుగా ప్రతిమనుష్యుఁడును వినియును తెలిసికొనకున్నాఁడు- ఒకానొకఁడు(వేయింటనొకఁడు) తెలిసికొనుచున్నాఁడు- అనియును శంకరభాష్యమున యోజన చేయఁబడినది.

అద్భుతవస్తువువలెనున్న ఈజీవుని ఒకానొకఁడు చూచుచున్నాఁడు. ఒకానొకఁడు చెప్పుచున్నాఁడు. ఒకానొకఁడు వినుచున్నాఁడు- తత్త్వస్థితిలో నెవ్వఁడును ఎఱుంగఁడు- అని రామానుజభాష్యము.

ఆశ్చర్యవత్=దుర్లభముగా- ఎవ్వని ప్రతిబింబమైన యీయాత్మను లెస్సగాఁ దెలిసికొనుట దుర్లభమో, ఆయీశ్వరుని సామర్థ్యముంగూర్చి చెప్పవలసినదేమి? అని యీశ్వరసామర్థ్యమును ఈశ్లోకము చూపుచున్నది- అని మధ్వభాష్యము.

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత।
తస్మా త్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి॥30॥

(హే) భారత!=(ఓ)భరతవంశ్యుఁడా!, సర్వస్య దేహే (వధ్యమానేఽపి)= సమస్తమైన ప్రాణిజాతమునకును దేహము (చెడఁగొట్టఁబడుచున్నను), అయం దేహీ నిత్యమ్ అవధ్యః= ఈ దేహముకలవాఁడగునాత్మ నిత్యముగా చెడఁగొట్టఁబడఁదగనివాఁడు- తస్మాత్ త్వమ్ సర్వాణి భూతాని శోచితుమ్ నార్హసి=అందువలన నీవు అన్ని భూతములంగూర్చియు దుఃఖింప దగవు.

స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే॥

అపిచ=ఇంతియె కాక, స్వధర్మమ్ అవేక్ష్య వికమ్పితుమ్ నార్హసి =స్వకీయమగు క్షత్రియధర్మమును ఆలోచించి చలింపం దగవు-క్షత్రియస్య ధర్మ్యాత్ యుద్ధాత్ అన్యత్ శ్రేయః నవిద్యతేహి =క్షత్రియునికి ధర్మముండప్పని యుద్ధముకంటె వేఱు మేలు లేదుగదా.

యుద్ధము ప్రాణిహింసారూపంబయినను ఆప్రాణులకు మేలైన దేహములఁ గలుగఁజేయుఁగాన అగ్నీషోమీయ పశుహింసవలె ధర్మ్యమె- వైద్యుఁడు జేయు శస్త్రకర్మము రోగికివలె అగ్నీషోమీయ పశుహింస పశువునకు రక్షణంబె యగును- అని రామానుజభాష్యము.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధ మీదృశమ్॥౩౨॥

(హే)పార్థ!=(ఓ) కుంతీపుత్రుఁడా!, యదృచ్ఛయా ఉపపన్నమ్ =ప్రయత్నము లేకయే చేకూరినదియు, అపావృతమ్ స్వర్గద్వారమ్ = తెఱవఁబడిన స్వర్గద్వారమైనదియునగు, ఈదృశమ్ యుద్ధమ్= ఇట్టి యుద్ధమును, సుఖినః క్షత్రియాః లభన్తే= పుణ్యముకల క్షత్రియులు పొందుచున్నారు.

ఇట్టియుద్ధము నెవ్వరు లభించుచున్నారో ఆ క్షత్రియులు సుఖవంతులు కారా? అని శంకరభాష్యమున యోజనచేయఁబడినది.

అథచేత్త్వం ధర్మ్య మిమం సంగ్రామం నకరిష్యసి।
తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి॥౩౩॥

అథ త్వమ్ ధర్మ్యమ్ ఇమం సంగ్రామం నకరిష్యసిచేత్ =ఇఁక నీవు ధర్మమునుండితప్పని ఈ యుద్ధమును చేయకపోయెదవేని, తతః స్వధర్మం కీర్తించ హిత్వా=దానివలన స్వకీయమైన ధర్మమునును కీర్తినిని విడిచి, పాపమ్ అవాప్స్యసి=పాపమును పొందెదవు.

కీర్తి పశుపతితోఁ గలిసికొనుట మొదలగుదానివలనఁగలిగినది- అని శంకరభాష్యము.

స్వధర్మమును అనఁగా స్వధర్మమునకు ఫలమైన నిరతిశయ సుఖమును- కీర్తి జయములవలన కలుగునది- అని రామానుజభాష్యము.

అకీర్తించాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్।
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే॥౩౪॥

తే అవ్యయామ్ అకీర్తించాపి భూతాని కథయిష్యన్తి=నీకు స్థిరమైన అపకీర్తినిఁగూడ ప్రాణులు ప్రశంసించెదరు- సంభావితస్య అకీర్తిః మరణాచ్చ అతిరిచ్యతే=గౌరవింపఁబడినవానికి అకీర్తి మరణముకంటెను నతిశయించుచున్నది.

భయా ద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః।
యేషాంచ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥

యేషాం త్వమ్ బహుమతో భూత్వా=ఎవ్వరికి నీవు (ఇప్పటికి) మన్నింపఁబడినవాఁడవై, లాఘవమ్ యాస్యసి=(ఇఁక) చులకదనమును పొందఁగలవో, తే మహారథాశ్చ=ఆ (దుర్యోధనాది) మహారథులును, త్వామ్ భయాత్ రణాత్ ఉపరతమ్ మన్యన్తే=నిన్ను భయమువలన యుద్ధమునుండి మఱలినవానిఁగా తలంతురు.

అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః।
నిన్దన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥౩౬॥

తవ అహితాః=నీ శత్రువులు, తవ సామర్థ్యమ్ నిన్దన్తః=నీ సామర్థ్యమును నిందించుచున్నవారై, బహూన్ అవాచ్యవాదాంశ్చ వదిష్యన్తి=పెక్కులైన చెప్పఁదగని ప్రసంగములను చెప్పెదరు- తతః దుఃఖతరం కిం ను?=అంతకన్న మిక్కిలి దుఃఖకరమైనది ఏది?.

హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్
తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః॥౩౭॥

(హే) కౌన్తేయ!=(ఓ) కున్తీపుత్రుఁడా!, హతః స్వర్గం వా ప్రాప్స్యసే=చంపఁబడినవాఁడవై స్వర్గమునైనను బొందఁగలవు- జిత్వా మహీం వా భోక్ష్యసే=జయించి భూమినైనను ననుభవింపఁగలవు- తస్మాత్ యుద్ధాయ కృతనిశ్చయః ఉత్తిష్ఠ=ఆ హేతువువలన యుద్ధముకొఱకు చేయఁబడిననిశ్చయముకలవాఁడవై లెమ్ము.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।

తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥౩౮॥
సుఖదుఃఖే సమే కృత్వా = సుఖదుఃఖములను సమములం జేసికొని, లాభాలాభౌ (సమౌకృత్వా)= లాభమునును లాభము లేకపోవుటనును (సమములం జేసికొని), జయాజయౌ (సమౌకృత్వా)= జయపరాజయములను (సమములంజేసికొని), తతః యుద్ధాయ యుజ్యస్వ=అటపైని యుద్ధమునకు తలపడుము- ఏవమ్ పాపమ్ నావాప్స్యసి= ఈచొప్పున పాపముం బొందఁగలవాఁడవుకావు.

ఇట్లు శరీరముకంటె విలక్షణుండగు నాత్మను తెలిసికొని యుద్ధములోని ఆయుధపుదెబ్బలు మొదలగువానిచే సుఖదుఃఖాదులు కలిగినను బుద్ధివికారము లేనివాఁడవై స్వర్గాదిఫలోద్దేశము లేక యుద్ధమును చేయుము- ఇట్లుచేసినచో పాపమును అనఁగా దుఃఖరూపమగు సంసారమును బొందవు అనిరామానుజభాష్యము.

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యాయుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి॥౩౯॥
సాంఖ్యే ఏషాబుద్ధిః తే అభిహితా=సాంఖ్యమందలి ఈబుద్ధి నీకు చెప్పఁబడినది- యోగే ఇమాంబుద్ధింతు శృణు= యోగమునందలి ఈ బుద్ధిని వినుము- యయా బుద్ధ్యా యుక్తః కర్మబన్ధం ప్రహాస్యసి= ఏ బుద్ధితోఁ గూడినవాఁడవై కర్మబంధమును విడువఁగలవో.

స్వధర్మ మపిచావేక్ష్య (౨అ॥౩౧శ్లో)'అనునది మొదలు ఈవఱకు అర్జునుని శోకమోహములను పోఁగొట్టుటకు లౌకికన్యాయము చెప్పఁబడినది-అది ముఖ్యోద్దేశముతోఁ జెప్పఁబడలేదు. కాన పూర్వము ఆరంభింపఁబడిన పరమార్థజ్ఞానమే ఈశ్లోకముచే ముగింపఁబడుచున్నది.
—సాంఖ్యబుద్ధియనఁగా పరమార్థజ్ఞానము- అదియె సంసారహేతువులగు దుఃఖము అజ్ఞానము మొదలగు దోషములను సాక్షాత్తుగానివర్తింపఁజేయును- యోగమనఁగా ఆజ్ఞానమును కలుగఁజేసెడి కర్మయోగము-అది ద్వంద్వపరిత్యాగపూర్వకంబై ఈశ్వరారాధనముకొఱకు కర్మములనాచరించుటయును, సమాధియోగంబును- ఈ యోగమువలననీశ్వర ప్రసాదముకలిగి దానిచే జ్ఞానముకలుగఁగా పుణ్యపాపబంధమును విడుచును అనిశంకరభాష్యము.

సాంఖ్యమనఁగా బుద్ధిచేఁదెలిసికొనవలసిన యాత్మతత్త్వము. సాంఖ్యజ్ఞానమనఁగా అట్టినిత్యమైన యాత్మతత్త్వమును దెలిసికొనుట. ఇది న త్వేవాహమ్ (౨అ॥ ౧౨శ్లో) అనునది మొదలు, తస్మాత్సర్వాణిభూతాని నత్వం శోచితుమర్హసి (౨అ॥ ౩౦శ్లో) అనువఱకుఁ జెప్పఁబడినది. యోగమనఁగా ఆత్మజ్ఞానపూర్వకంబగు మోక్షమునకు సాధనములగు కర్మముల నాచరించుటయందు తెలివికలుగుట. అది ఇఁక చెప్పఁబడును. అని రామానుజభాష్యము.

సాంఖ్యమనఁగా పరిశుద్ధాత్మతత్త్వజ్ఞానము. బుద్ధియనఁగా వాక్కు. ఆత్మజ్ఞానముంగూర్చిన గ్రంథము చెప్పఁబడినది. ఇఁక యోగము అనఁగా ఉపాయముంగూర్చిన గ్రంథము చెప్పఁబడును. అని మధ్వభాష్యము.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో నవిద్యతే,
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥

ఇహ అభిక్రమనాశః నాస్తి = దీనిలో ఆరంభము చెడుటలేదు. ప్రత్యవాయః నవిద్యతే = తప్పు లేదు. అస్య ధర్మస్య స్వల్పమపి = ఈ ధర్మము యొక్క పిసరైనను, మహతః భయాత్ త్రాయతే = గొప్పభయమునుండి కాపాడుచున్నది — ఆరంభించినది చెడుటయనఁగా ఫలము కలుగకపోవుట. భయమనఁగా సంసారభయము.

చికిత్సలోవలె ప్రత్యవాయము లేదు. అని శంకరభాష్యము.

ఆరంభించినదాని మధ్యకాలమున విడుచుటవలనఁ గలిగెడుదోషము ప్రత్యవాయము. అని రామానుజభాష్యము.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥ ౪౧

(హే) కురునన్దన! = (ఓ) కురువంశమువాఁడా!, ఇహ వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకా = దీనిలో నిశ్చయస్వభావమైన బుద్ధి ఒకటి. అవ్యవసాయినాం బుద్ధయః బహుశాఖాః అనన్తాశ్చ = నిశ్చయము లేని వారి బుద్ధులు అనేకశాఖలుకలవియు అనన్తములును.

వ్యవసాయాత్మకబుద్ధియనఁగా ఈశ్రేయోమార్గమున (హితమార్గమున) మంచి ప్రమాణములవలనఁబుట్టిన నిశ్చయస్వభావముగల

సాంఖ్యబుద్ధియును యోగబుద్ధియును- ఇట్టివికాని విపరీతబుద్ధులు అవ్యవసాయాత్మకబుద్ధులు- అవికలవారు అవ్యవసాయులు- అనఁగా ప్రమాణములవలనఁబుట్టిన వివేకజ్ఞానములేనివారు- అని శంకరభాష్యము.

వ్యవసాయ మనఁగా నిశ్చయము- అనఁగా ఆత్మయాథాత్మ్యనిశ్చయము- (ఆత్మజ్ఞానము)- మోక్షేచ్ఛకలవానికి తాను ఆచరించెడి కర్మములయందుండెడి బుద్ధి ఆత్మజ్ఞానపూర్వకంబగుటచే వ్యవసాయాత్మిక యనఁబడును- కామ్యకర్మములనాచరించుటలో,ఆత్మస్వరూపయాథాత్మ్యనిశ్చయము లేకపోయినను, స్వర్గాదిఫలములంగోరికర్మములంజేసిఫలమననుభవించుట సంభవించునుగాన,కామ్యకర్మవిషయ మగు బుద్ధి అవ్యవసాయాత్మికయనఁబడును- వ్యవసాయాత్మకబుద్ధి ఒక్క- మోక్షముకొఱకె అగుటను ఒక్కటియనఁబడుచున్నది- అవ్యవసాయులు అనఁగా స్వర్గపుత్రపశ్వన్నాది ఫలములకు సాధనములగు కర్మములనాచరించువారు- వారిబుద్ధులు, ఫలములు అనంతములగుటను, అనంతములు- ఇవి ఒక్కొక ముఖ్యఫలమునకై విధింపబడినను దర్శపూర్ణమాసాదులలోని ఆయుస్సు మొదలగు ఫలములవంటి అవాంతరఫలములువీనికిఅనేకములుకలవుగానబహుశాఖములు—నిత్యనైమిత్తిక కర్మములు ప్రధానావాంతరఫలములనన్నిటిని విడిచి మోక్షమొక్కదానికొఱకె ఆచరింపఁబడవలసినవి- తమతమవర్ణాశ్రమములకుతగిన కామ్యకర్మములును,వానివానిఫలములను విడిచి,మోక్షసాధనములుగానె నిత్యనైమిత్తికములతోఁజేర్చి యథాశక్తిగనాచరింపఁబడవలసినవి- అని రామానుజభాష్యము.

యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః॥౪౨॥
కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥౪౩॥
భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ నవిధీయతే॥౪౪॥

(హే)పార్థ!=(ఓ)కున్తీపుత్రుఁడా!, వేదవాదరతాః=(ఫలసాధనములంజూర్చిన)వేదవాక్యములయందాసక్తికలవారును, అన్యత్ నాస్తి ఇతి వాదినః=(కర్మముకంటె)ఇతరమైనది లేదు అని చెప్పువారును, కా

మాత్మానః=కోరికయెస్వభావముగాఁగలవారును, స్వర్గపరాః=స్వర్గ
మునందాసక్తులునగు, అవిపశ్చితః=అల్పజ్ఞానులు, జన్మకర్మఫలప్రదా
మ్=పుట్టుకయనెడికర్మఫలమునుఇచ్చునదియు, భోగైశ్వర్యగతింప్రతి
క్రియావిశేషబహులామ్=సుఖానుభవమునునైశ్వర్యమును బొందుటనుం
గూర్చిన కర్మవిశేషములుమిక్కిలిగాఁగలదియునగు, పుష్పితామ్
యామ్ ఇమాం వాచం ప్రవదన్తి=పూసినదానివలెశోభించుచున్న
ఏ యీ వాక్యమును చెప్పుచున్నారో, తయా అపహృతచేతసామ్=
దాని(అవాక్కు)చేత అపహరింపఁబడినమనస్సులుగలవారైన, భోగైశ్వ
ర్యప్రసక్తానామ్ సమాధౌ=సుఖానుభవమునందును ఐశ్వర్యమునందును
ఆసక్తిగలవారియొక్క మనస్సునందు, వ్యవసాయాత్మికా బుద్ధిః నవి
ధీయతే=నిశ్చయస్వభావముగల బుద్ధి కలుగదు.

పుష్పితామ్=పూయుటయె ఫలముగాఁగల, అనఁగా, పైచూపుకు
సుందరముగానుండెడి- అని తాత్పర్యము. నాన్యదస్తీతివాదినః=స్వర్గా
దులకంటె గొప్పఫలము లేదనువారు- కామాత్మానః=కామమందు మ
నస్సుగలవారు- జన్మకర్మఫలప్రదామ్=స్వర్గాద్యనుభవాంతమున జ
న్మకర్మమనెడి ఫలమునిచ్చునది- అపహృతచేతసామ్=అపహరింపఁబ
డినఆత్మజ్ఞానముకలవారికి- వ్యవసాయాత్మికా బుద్ధిః=ఆత్మయాథాత్మ్య
నిశ్చయపూర్వకంబగు మోక్షసాధనభూతకర్మవిషయకజ్ఞానము— మో
క్షేచ్ఛకలవాఁడు కామ్యకర్మములయందు సంగమును చేయఁగూడదు-
అని రామానుజభాష్యము.

మోక్షమను ఫలమును గోరి స్వర్గాదిపురుషార్థములతోఁగూడిన వా
క్కును చెప్పుచున్నారు- వేదవాదరతాః=కర్మాదివాచకమగు వే
దమునందు ఆసక్తిగలవారు- వేదములచేత పైకి ఏది చెప్పఁబడినదో
ఆయర్థమందాసక్తిగలవారు- మఱియేమియు లేదని చెప్పుచున్నవా
రు- వేదములు పరోక్షముగాభగవంతునిఁజెప్పుచున్నవి - భోగైశ్వర్య
ప్రాప్తియె వేదమునకుఫలమనియెఱుగరు- వారికి, ఈశ్వరునియందలి మ
నస్సమాధానముకొఱకైన యుక్తినిర్ణయస్వరూపమైన బుద్ధిగలుగదు -
అసమాధానమెకదా మోక్షసాధనము - అని మధ్వభాష్యము.

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।

నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥౪౫॥

వేదాః త్రైగుణ్యవిషయాః=వేదములు సత్త్వరజస్తమోగుణములువిషయముగాఁగలవి- (హే)అర్జున!=(ఓ)అర్జునుఁడా!, నిస్త్రైగుణ్యః నిర్ద్వన్ద్వః నిత్యసత్త్వస్థః నిర్యోగక్షేమః ఆత్మవాన్(చ) భవ=మూఁడుగుణములును లేనివాఁడవును శీతోష్ణాదిద్వంద్వములు లేనివాఁడవును ఎల్లప్పుడునుసత్త్వగుణమునను న్నవాఁడవును యోగక్షేమములు లేనివాఁడవును ఆత్మజ్ఞానముకలవాఁడవును అగుము- యోగమనఁగా తనకు లేనిదానిని సంపాదించుట- దానిని సంరక్షించికొనుట క్షేమము.

త్రైగుణ్యమనఁగా సంసారము- నిస్త్రైగుణ్యుఁడనఁగా కోరికలేనివాఁడనుట- అని శంకరభాష్యము.

త్రైగుణ్యశబ్దముచే సత్త్వరజస్తమోగుణములుమిక్కిలిగాఁగలపురుషులు చెప్పఁబడుదురు- వారివారికి తగినహితములను వేదములు చెప్పును- నీవు అన్యోన్యసంకీర్ణములగు మూఁడుగుణములను వృద్ధిపొందించికొనక వృద్ధిపొందిన సత్త్వగుణము మాత్రము కలవాఁడవు అగుము- ఆత్మస్వరూపంబును అదికలుగుటకు సాధనమునుతప్ప మిగిలిన యోగక్షేమములు లేనివాఁడవై ఆత్మస్వరూపమును వెదుకువాఁడవుకమ్ము- అని రామానుజభాష్యము.

త్రైగుణ్యమనఁగా సత్త్వరజస్తమోగుణసంబంధియగు స్వర్గాదికము- అది వేదమునకు పైకితోఁచెడియర్థము - అట్టియర్థమునందు భ్రమపడకుము- వేదములు స్వస్వరూపమున విష్ణువును తెలియఁజేయునవి- అని మధ్వభాష్యము.

యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే।
తావా న్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥౪౬॥

ఉదపానే యావాన్ అర్థః=బావిమొదలగుదానియందు ఎంతప్రయోజనమో, తావాన్ సర్వతస్సంప్లుతోదకే (భవతి)=అంతప్రయోజనము అంతటనిండియున్ననీరుగలదానియందును (కలుగుచున్నది)- సర్వేషు వేదేషు (యావాన్ అర్థః)=సమస్తములైన వేదములలోఁజె

ప్పఁబడినకర్మములలో (ఎంత ప్రయోజనమో), తావాన్ విజానతః బ్రాహ్మణస్య (భవతి)=అంతప్రయోజనము జ్ఞానముకల బ్రహ్మసంబంధియయినవానికి (కలుగుచున్నది)- అనిశంకరభాష్యము.

సర్వతస్సంప్లుతోదకే ఉదపానే (పురుషస్య) యావాన్ అర్థః=అంతటనిండియున్ననీరుగల బావిమొదలగుదానియందు (పురుషునికి) ఎంతప్రయోజనమో, విజానతః బ్రాహ్మణస్య సర్వేషు వేదేషు తావాన్ అర్థః=జ్ఞానముగల ముముక్షువునకు అన్ని వేదములయందును అంతియ ప్రయోజనము- బావిలో ఎవ్వనికెంత కావలయునో అంత నీరే పరిగ్రహింపఁబడునట్లు ముముక్షువుచే వేదమున మోక్షసాధనము మాత్రమే పరిగ్రహింపఁబడును- అనిరామానుజభాష్యము.

బావిమొదలగువానివలనం గలుగు ప్రయోజనము మహాజలమువలనంగలుగుదానిలో సంతర్భవించునట్లె వేదములలోని ఫలము బ్రాహ్మణునిఫలములో సంతర్భవించును- బ్రహ్మ అణతి(బ్రహ్మమును పొందువాఁడు) అనువిగ్రహముచే బ్రహ్మ పరోక్షజ్ఞానముకలవాఁడు బ్రాహ్మణుఁడు- అది జ్ఞానమువలనకలుగునని విజానతః అనువిశేషణము తెలియఁజేయుచున్నది- అనిమధ్వభాష్యము.

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూః మా తే సఙ్గోఽస్త్వకర్మణి॥౪౭॥

తే కర్మణ్యేవ అధికారః=నీకు కర్మమునందె అధికారము- కదాచన ఫలేషు (అధికారః) మా(భూత్)=ఒకప్పుడును ఫలములయందు (అధికారము) కాఁగూడదు- కర్మఫలహేతుః మా భూః=కర్మఫలములకు హేతువైనవాఁడవు కాకుండుము- తే అకర్మణి సఙ్గః మాస్తు=నీకు చేయకుండుటయందు ప్రీతి కలుగఁగూడదు.

నీకు కర్మనిష్ఠయందే కాని జ్ఞాననిష్ఠయందధికారము లేదు- కర్మఫలములయందాశ కలవాఁడవైతివేని తిరిగియు జన్మమును పొందుదువు- అనిశంకరభాష్యము.

ఫలమును కోరక భగవదారాధనరూపముగాఁ జేయఁబడెడి కర్మము మోక్షసాధనమగుంగాన, నిత్యసత్త్వస్థుఁడవగుటచే మోక్షముంగోరెడినీకు కర్మములయందుమాత్రమె కాని వానిఫలములయందధికారము లే

దు-కర్మమునకును ఫలమునకును నీవు హేతువుకాఁగూడదు- అనఁగా కర్మమునకు నేను కర్తను కానని యు ఫలమునకు హేతువు కాననియుఁ గూడ నీవు తలంచికొనవలయును- అని రామానుజభాష్యము.

జ్ఞానివైన నీకే ఫలపుఁగోరికకూడదు- ఇఁకనజ్ఞానులకు కూడదని చెప్ప నేలను?- వేదములో రుచిపుట్టుటకై కర్మములకు ఫలములు చెప్పఁబడియున్నవి- కర్మఫలము కర్మమునాచరించుటకు ఎవ్వనికి హేతువగునో అట్టివాఁడవుకాకుండుము- మిగిలిన ఫలములు లేకపోయినను నాప్రసాద (అనుగ్రహ)ము వెడి ఫలము కలదుగాన కర్మములను చేయుటను విడువకూడదు- లోకములో నీకేమి కావలయునని యడుగంబడియు తమసేవయె కావలయునని కోరువానియందు కలిగెడిప్రీతి, స్వార్థమై సేవఁజేయువానియందు కలుగదుగాన భక్తిజ్ఞానాదిప్రార్థన చేయఁదగినదియె యని మధ్వభాష్యము.

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥౪౮॥

(హే) ధనంజయ! =(ఓ) యర్జునుఁడా!, సఙ్గమ్ త్యక్త్వా=సంగమును విడిచి, సిద్ధ్యసిద్ధ్యోః సమః భూత్వా=ఫలముసిద్ధించుటయందును సిద్ధింపకపోవుటయందును సమానుఁడవు అయి, యోగస్థస్సన్ కర్మాణి కురు= యోగమునందున్నవాఁడవై కర్మములను చేయుము- సమత్వమ్ యోగః (ఇతి) ఉచ్యతే=సమముగానుండుటయె యోగము (అని) చెప్పఁబడును.

ఈశ్వరుఁడు ప్రీతినిఁ బొందవలయునని తలంచుచు ఫలసంగమును విడిచి కర్మములను జేయుము- కర్మానుష్ఠానమువలనఁగలిగెడి సత్త్వశుద్ధిద్వారకమైన జ్ఞానప్రాప్తి కలిగినను కలుగకున్నను ఒక్కవిధముగా నుండుటయె యోగము- అని శంకరభాష్యము.

రాజ్యము బంధువులు మొదలగువారియందు సంగమును విడిచి జయముకలిగినను కలుగకున్నను ఒక్కవిధముగా నెయుండి యుద్ధాదికర్మములంజేయుము- అని రామానుజభాష్యము.

యోగస్థుఁడనఁగా ఉపాయమందున్నవాఁడు- సంగమనఁగా ఫలస్నేహము- అనిమధ్వభాష్యము.

దూరేణహ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥౪౯॥

(హే)ధనంజయ!=(ఓ)యర్జునుఁడా!, బుద్ధియోగాత్ కర్మ దూరేణ అవరంహి=సమత్వబుద్ధితోఁగూడినకర్మముకంటె (మిగిలిన)కర్మము మిక్కిలి తక్కువగదా- బుద్ధౌ శరణమ్ అన్విచ్ఛ=జ్ఞానమునందు ఆశ్రియమును కోరుము- ఫలహేతవః కృపణాః=ఫలమునుకోరువారు దీనులు.

ఈశ్వరారాధనార్థమైన కర్మముకన్న ఫలమునుకోరి చేయఁబడిన కర్మము జన్మమరణాదిహేతువగుటవలన మిక్కిలి నికృష్టమైనది- కాఁబట్టి యోగబుద్ధియందుకాని దానిపరిపాకమువలనకలిగెడి సాంఖ్యబుద్ధియందుగాని అభయప్రాప్తికారణమును కోరుము- అని శంకరభాష్యము.

ఫలత్యాగవిషయంబును సిద్ధ్యసిద్ధిసమత్వవిషయంబునగు బుద్ధితోఁగూడినకర్మము సాంసారికదుఃఖముల నన్నిటిని నివర్తింపఁజేసి మోక్షమును పొందించును- మిగిలిన కర్మము సంసారమును పొందించును- శరణమనఁగా నివాసస్థానము- ఆబుద్ధియందె నిలువుమనుట - కృపణులనఁగా సంసారులు- అని రామానుజభాష్యము.

బుద్ధియోగ మనఁగా జ్ఞానస్వరూపమైన యుపాయము - శరణ మనఁగా ఉనికి- కర్మమునుచేయుటకు ఫలమె హేతువుగాఁగలవారు ఫలహేతువులు- అని మధ్వభాష్యము.

బుద్ధియుక్తోజహాతీహ ఉభే సుకృత దుష్కృతే।
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥౫౦॥

బుద్ధియుక్తః ఇహ ఉభే సుకృతదుష్కృతే జహాతి=బుద్ధితోఁగూడినవాఁడుఈలోకమున రెండైన పుణ్యపాపములను విడుచుచున్నాఁడు- తస్మాత్ యోగాయ యుజ్యస్వ=ఆహేతువువలన బుద్ధి కలుగుటకొఱకు సిద్ధపడుము- కర్మసు కౌశలం యోగః=కర్మములయందలి నేర్పు యోగము.

నేర్పుచేత సాధింపందగినది యనుట- అని రామానుజభాష్యము.

జ్ఞాని అనిష్టమైన మనుష్యాదిఫలమగు సుకృతమును విడిచిపెట్టునఁగా

ని మహాఫలంబై ఉపాసనాదిఫలంబగు సుకృతమును విడువఁడు, కర్మక్షయము శ్రుతిలో నెచ్చటఁజెప్పియున్నను అజ్ఞానులంగూర్చినదియే- మోక్షములోఁగూడ కామాన్నీకామరూప్యనుసంచరన్ (కోరఁబడిన యన్నములవాఁడును కోరఁబడిన రూపముకలవాఁడునై సంచరించుచును) ఇత్యాదులచే పుణ్యానుభవము చెప్పఁబడుచున్నది- దుష్కృతమును సంపూర్ణముగా విడుచును- యోగమనఁగా జ్ఞానోపాయము- అదియేకదా కర్మములో నేర్పు- అని మధ్వభాష్యము;

కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥౫౧॥

బుద్ధియుక్తాః మనీషిణః=జ్ఞానముతోఁగూడిన బుద్ధిమంతులు, కర్మజం ఫలం త్యక్త్వా=కర్మమువలనఁగలిగెడి ఫలమును విడిచి, జన్మబన్ధవినిర్ముక్తా(స్సన్తః) అనామయం పదం గచ్ఛన్తిహి=జన్మమనెడికట్టు చేతవిడువఁబడినవా(రగుచు) ఉపద్రవములులేని స్థానమును పొందుచున్నారుగదా.

ఇష్టానిష్టశరీరప్రాప్తియె కర్మజఫలము- బుద్ధియనఁగా సమత్వబుద్ధి- మనీషిణః అనుదానికి జ్ఞానులయి అని యర్థము- జన్మబన్ధవినిర్ముక్తాః=బ్రదికియుండియె జన్మబన్ధముక్తులై మోక్షాఖ్యమగు విష్ణుస్థానమును చెందుదురు- లేక, బుద్ధియోగాద్ధనంజయ.(అ॥ ౪౯శ్లో.)అనునది మొదలు ఇదివఱకును కర్మయోగమువలన సత్త్వశుద్ధికలిగి దానివలన కలిగెడి బ్రహ్మజ్ఞానమె చెప్పఁబడుచున్నది- అని శంకరభాష్యము.

బుద్ధియోగముతోఁగూడినవారై ఫలమును విడిచి కర్మములఁజేయువారింగూర్చినది ఈశ్లోకము- అని రామానుజభాష్యము.

కర్మములను,వానిఫలముంగోరక, ఈశ్వరునకు సమర్పించి, మంచిజ్ఞానము కలవారై మోక్షమును పొందుదురు- యోగముతోఁగూడిన కర్మము జ్ఞానసాధనము, జ్ఞానము మోక్షసాధనము అనిభావము- అని మధ్వభాష్యము.

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ॥౫౨॥

తే బుద్ధిః. మోహకలిలం యదా వ్యతితరిష్యతి=నీ బుద్ధి మోహమనె

లిలంతను ఎప్పుడు దాటఁగలదో, తదా శ్రోతవ్యస్య శ్రుతస్యచ నిర్వేదం గన్తాసి=అప్పుడు వినఁబడవలసినదానియొక్కయు వినఁబడిన దానియొక్కయు వైరాగ్యమును పొందఁగలవు.

ఆత్మానాత్మవివేకజ్ఞానమును చెడఁగొట్టి విషయములనుఁగూర్చి యంతఃకరణమును ప్రవర్తింపఁజేసెడి మోహము పోయి, నీబుద్ధి యెప్పుడు పరిశుద్ధమగునో, అప్పుడు నీకు వినవలసినదియు విన్నదియు నిష్ఫలము గాఁదోచును- అని శంకరభాష్యము.

చెప్పినచొప్పున కర్మములను చేయుటచే పాపక్షయము కలుగుటను స్వల్పఫలసంగమునకు హేతువగు మోహమును నీబుద్ధి యెప్పుడు దాటునో, అప్పుడు, మాబోంటివారిచే నింతకుమున్నె త్యాజ్యముగాఁ జెప్పఁబడినదియు, ఇఁక జెప్పఁబడఁబోవునదియు నగు ఫలము మొదలగు దానియందు వైరాగ్యమును పొందును- అని రామానుజభాష్యము.

మనస్సునకు మిథ్యాజ్ఞానము పోవుటకు ఈశ్వరసమర్పణముతో కర్మములంజేయవలయును- నిర్వేదమ్ అనుదానికి మిక్కిలిలాభమును అని యర్థము- గొప్పవారిచే వినఁబడఁదగినదియు వినఁబడినదియునగు వేదము మొదలగువాని ఫలమును పొందుదువు- అని మధ్వభాష్యము.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి॥ ౫౩॥

శ్రుతివిప్రతిపన్నా తే బుద్ధిః=శ్రుతులచేతననేకవిధములుగా తెలిసికొనిన నీ అంతఃకరణము, యదా నిశ్చలా (సతీ) సమాధౌ అచలా స్థాస్యతి=ఎప్పుడు విక్షేపములేనిది(అగుచు) ఆత్మయందు వికల్పజ్ఞానములేనిదై ఉండునో, తదా యోగమ్ అవాప్స్యసి=అప్పుడు వివేకజ్ఞానరూపంబగు సమాధిని పొందుదువు- అని శంకరభాష్యము.

శ్రుతివిప్రతిపన్నా అచలా తే బుద్ధిః=నావలన వినుటవలన విశేషముగాఁ దెలిసికొనినదై ఒక్కవిధముగానుండెడి నీ బుద్ధి, సమాధౌ యదా నిశ్చలా స్థాస్యతి=మనస్సులో ఎప్పుడు నిలకడకలది అగునో, తదా యోగమ్ అవాప్స్యసి=అప్పుడు ఆత్మావలోకనమును పొందఁగలవు- శాస్త్రమువలనఁగలిగిన ఆత్మజ్ఞానముతోఁగూడిన కర్మయోగము స్థితప్రజ్ఞతయనెడి జ్ఞాననిష్ఠను కలుగఁజేయును- అని ఆ

శ్వాత్మావలోకనమును పొందును- అని రామానుజభాష్యము.

నీ బుద్ధి, మొదట శ్రుతులతో విరుద్ధమైనదైయును, ఎప్పుడు వేదార్థమునకు అనుకూలమగు తత్త్వనిశ్చయమున విరుద్ధ వాక్యములచేఁగూడ కదల్పఁబడదో, అట్టిదై ప్రబ్రహ్మప్రత్యక్షముచేత భేర్యాదులు మ్రోసినను చలింపనిదిఅగునో, అప్పుడు ఉపాయసిద్ధికలవాఁడవగుదువు- అని మధ్వభాష్యము.

అర్జున ఉవాచ.

స్థితప్రజ్ఞస్య కాభాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కింప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥౫౪॥

(హే)కేశవ!=(ఓ)శ్రీకృష్ణమూర్తీ!, సమాధిస్థస్య స్థితప్రజ్ఞస్య భాషా కా=సమాధిలోనుండెడి స్థితప్రజ్ఞునకు శబ్దము ఏది?- స్థితప్రజ్ఞుఁడు జనులచే నేమని చెప్పఁబడుననుట- స్థితధీః కిం ప్రభాషేత=స్థితప్రజ్ఞుఁడు దేనిని పలుకును?-కిమ్ ఆసీత?=ఎట్లు ఉండును?- కింవ్రజేత=ఎట్లు నడచును.

అర్జునుఁ డెఱిఁగియున్నను, లోకోపకారార్థము ప్రశ్నముచేయుచున్నాఁడు- స్థితప్రజ్ఞుఁడనఁగా నిలిచిన జ్ఞానము కలవాఁడు- భాషయనఁగాలక్షణము- సమాధిస్థస్య అనునదిలక్షణమైనను మఱియొకలక్షణమును అడుగుచున్నాఁడు- అని మధ్వభాష్యము.

శ్రీభగవానువాచ.

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥౫౫॥

(హే)పార్థ!=(ఓ)యర్జునుఁడా!, ఆత్మని ఆత్మనైవ తుష్టః=ఆత్మయందు ఆత్మచేతనె సంతోషించినవాఁడై, మనోగతాన్ సర్వాన్ కామాన్ యదా ప్రజహాతి=మనస్సులోని అన్ని కోరికలను ఎప్పుడు విడుచునో, తదా స్థితప్రజ్ఞః (ఇతి) ఉచ్యతే=అప్పుడు స్థితప్రజ్ఞుఁడు (అని) చెప్పఁబడును.

ఇఁకనీయధ్యాయమంతయు స్థితప్రజ్ఞుని లక్షణంబును సాధనంబును తెలియఁజేయును- వెలుపటిలాభములయం దపేక్ష లేక తనస్వరూపమందె తనివిని పొందినవాఁడు స్థితప్రజ్ఞుఁడు- అని శంకరభా

ష్యము.

ఆత్మన్యేవ ఆత్మనా తుష్టః=ఆత్మైకవిషయంబగు మనస్సుచే సంతోషించినవాఁడై, మిగిలిన యన్నికామములను ఎప్పుడు విడుచునో, అప్పుడు స్థితః ప్రజ్ఞత్వముయొక్క తుదియవస్థకలుగును- అని రామానుజభాష్యము-ఈ యవస్థ వశీకారమనుపేరుగల నాల్గవయవస్థ.

పరమాత్మయందెపరమాత్మచేతనున్నవాఁడై తలుచుగా నన్నికోరికెలను విడుచుచున్నాఁడు- పరమాత్మయందున్నవానికి పరమాత్మప్రసాదంబుననే తుష్టికలుగును- అని మధ్వభాష్యము.

దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః।
వీతరాగభయక్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే॥౫౬॥

దుఃఖేషు అనుద్విగ్నమనాః=దుఃఖములయందు క్షోభముసుపొందనిమనస్సుకలవాఁడును, సుఖేషు విగతస్పృహః=సుఖములయందు ఆశలేనివాఁడును, వీతరాగభయక్రోధః మునిః=రాగంబును భయంబును క్రోధంబును లేని ముని, స్థితధీః (ఇతి) ఉచ్యతే=స్థితప్రజ్ఞుఁడు (అని) చెప్పఁబడుచున్నాఁడు.

దుఃఖములు ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికములనునవి- (ఆధ్యాత్మికములు రోగాదులవలనఁగలుగునవి- అధిభౌతికములు చోరపిశాచాదులవలనఁ కలుగునవి- అధిదైవికములు పిడుగులు మొదలగువానివలనఁ గలుగునవి) సుఖములయందాశలేకపోవుటయనఁగా అగ్నిలో పుడకలను వేయుటతోనే అగ్ని వృద్ధిపొందినట్లు సుఖముకలిగినప్పుడు వృద్ధిపొందకుండుట- మునియనఁగా సన్యాసి- అని శంకరభాష్యము.

దుఃఖములనఁగా ఇష్టమైనవస్తువులు లేకపోవుట మొదలగు దుఃఖనిమిత్తములు- సుఖములనఁగా ఇష్టమైనవి- తనకులేనివానియందలికోరిక రాగము- ఇష్టమైనదిపోవుటకును అనిష్టమైనదివచ్చుటకును కారణములగువానింజూచి దుఃఖించుటభయము- ఇష్టముపోవుటవలనను అనిష్టముకలుగుటవలనను కలిగినదై దుఃఖకరమై తనలోఁగలిగెడి మనోవికారము క్రోధము- ముని అనఁగా ఆత్మను మననముచేయు స్వభావముకలవాఁడు- ఇదివెనుకటిశ్లోకమున చెప్పిన యవస్థకంటె పూర్వమైనయవస్థ- అని రామానుజభాష్యము. ఇదిఏకేంద్రియ మనుపేరుగలమూడవయవస్థ.

వెనుకటిశ్లోకములోఁ జెప్పఁబడినజ్ఞానోపాయములె ఇఁక మూఁడుశ్లోకములచే స్పష్టపఱుపఁబడును-రాగమనఁగా చెడ్డవిషయములను మంచివిషయములుగా భ్రమించుట- అని మధ్వభాష్యము.

యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥౫౭॥

యః సర్వత్ర అనభిస్నేహః (సన్)=ఎవ్వఁడు అంతట స్నేహములేనివాఁడు (అగుచు), తత్తత్ శుభాశుభం ప్రాప్య నాభినన్దతి న ద్వేష్టి=ఆయా మంచిచెడ్డలను పొంది సంతోషింపఁడో ద్వేషింపఁడో, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా=వాని తెలివి నిలుకడనుపొందినది.

అంతటననఁగా దేహము ప్రాణము మొదలగువానియందు- అని శంకరభాష్యము.

ఇష్టములైనవానియందంతటను ఉదాసీనుఁడగుచు- శుభమనఁగా ఇష్టమయినదికలుగుట-అదిపోవుట అశుభము- ఇది వెనుకటిశ్లోకములోఁ జెప్పఁబడినదానికన్న వెనుకటిదశ- అని రామానుజభాష్యము. ఇదివ్యతిరేకమను పేరుగల రెండవయవస్థ.

అంతట స్నేహములేకపోవుట శుభాశుభములచే సంతోషద్వేషములు లేకపోవుటకు హేతువు- అని మధ్వభాష్యము.

యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥౫౮॥

అయమ్ యదా=ఈతఁడు ఎప్పుడు, కూర్మః అఙ్గానీవ=తాబేలు అవయవములనువలె, ఇన్ద్రియాణి సర్వశః ఇన్ద్రియార్థేభ్యః సంహరతే=ఇంద్రియములను అన్ని విషయములనుండియు మఱలించికొనుచున్నాఁడో, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా=వాని తెలివి నిలకడగలిగినది.

ఇంద్రియములను విషయములనుండి మఱలించి మనస్సును ఆత్మయందునుచు చున్నాఁడు- ఈ నాలుగుజ్ఞాననిష్ఠలును పూర్వపూర్వముచెప్పఁబడినది పైపైని చెప్పఁబడినదానిచేఁబుట్టఁదగినవి- అని రామానుజభాష్యము. ఈశ్లోకమునఁ జెప్పఁబడినది యతమానమ వెడిప్రథమదశ.

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥౫౯॥

నిరాహారస్య దేహినః=ఆహారములేని పురుషునకు, విషయాః రసవర్జం వినివర్తన్తే=విషయములు రాగముతప్ప మఱలుచున్నవి- పరం దృష్ట్వా(స్థితస్య) అస్య రసోపి నివర్తతే=ఆత్మస్వరూపమును చూచి(యున్న) వీనికి రాగంబును మఱలుచున్నది.

విషయములనఁగా ఇంద్రియములు- నిరాహారునకు అనఁగా విషయములను స్వీకరింపనివానికి- పరబ్రహ్మమును చూచియున్నవానికి అనఁగా బ్రహ్మమే నేనుఅనుకొనినవానికి - అనిశంకరభాష్యము.

ఇంద్రియములకు ఆహారము విషయములే- రాగంబును, విషయములకంటెపరమైన అనఁగా మిక్కిలిసుఖకరమైన ఆత్మస్వరూపమును చూచినపై మఱలుచున్నది- అనిరామానుజభాష్యము.

వెనుకఁజెప్పఁబడిన జ్ఞానము ప్రయత్నములేక సిద్ధింపదని యుత్తరశ్లోకములచేఁజెప్పఁబడుచున్నది- ఆహారము(తిండి) లేనివానికి ఇతరవిషయములననుభవించెడి శక్తి లేకపోవును- మిగిలినవిషయములయందు కోరికయైనను లేకపోవును- రసమును(రుచిని) కోరుటమొదలగునది నివర్తింపదు- అది అపరోక్షజ్ఞానమువలననె మఱలును- రసశబ్దము రాగముఁగూడ చెప్పును- అని మధ్వభాష్యము.

యతతోహ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥౬౦॥

(హే)కౌన్తేయ!=(ఓ)యర్జునుఁడా!, యతతః విపశ్చితోఽపి పురుషస్య మనః=ప్రయత్నముచేయుచున్నవాఁడును జ్ఞానవంతుడునైనను పురుషునియొక్క మనస్సును, ప్రమాథీని ఇన్ద్రియాణి ప్రసభం హరన్తిహి=క్షోభముకలుగఁజేసెడి ఇంద్రియములు బలాత్కరించి లాగుచున్నవి- విషయములతోఁజేరుచున్నవియనుట.

ఇంద్రియములను జయించుటఆత్మదర్శనంబునంగాని కలుగదు- కాన జ్ఞాననిష్ఠదుర్లభమైనది- అని రామానుజభాష్యము.

అపరోక్షజ్ఞానములేక వట్టిజ్ఞానముకలవాఁడైనను సాధారణమైనయత్నముకలవాఁడైనను శరీరాభిమానియగువాని మనస్సును ఇంద్రియములు లాగుచున్నవి- అనిమధ్వభాష్యము

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీతమత్పరః।

వశేహి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥౬౧॥

తాని సర్వాణి సంయమ్య=వానిని అన్నిటిని స్వాధీనముచేసికొని, యుక్తః మత్పర(స్సన్) ఆసీత=సమాధికలవాఁడై నాయందాసక్తికలవాఁ(డగుచు) ఉండునది- యస్య ఇన్ద్రియాణి వశే వర్తన్తే=ఎవనికి ఇంద్రియములు తనవశమున నున్నవో, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా =వాని జ్ఞానము నిలుకడకలది.

మత్పరః ఆసీత అనుదానికి అందఱికిని ఆత్మనైన నేను పరుఁడు గాఁగలవాఁడై, ఆతనికంటె నేను వేఱుగాదు అనియుండునది- అని శంకరభాష్యము.

మత్పరః అనుదానికి నాయందుమనస్సునుఉంచినవాఁడై అనియర్థము- భగవంతునియందు ఉంచబడినమనస్సు అన్నిపాపములును నశించుటవలన నిర్మలమై విషయానురాగములేనిదై ఇంద్రియములనుస్వాధీనముచేసికొనును- అని రామానుజభాష్యము.

మిక్కిలి ప్రయత్నముకలవానికి ఇంద్రియములు స్వాధీనములుఅగును- యుక్తః=నాయందుమనస్సుకలవాఁడై, మత్పరః=సమస్తముకన్నను తక్కుప్పుడనుగా నన్ను ఎవ్వఁడెఱుఁగునో అట్టివాఁడై అని మధ్వభాష్యము.

ధ్యాయతో విషయాన్ పుంస స్సఙ్గ స్తేషూపజాయతే।
సఙ్గా త్సంజాయతే కామః కామా త్క్రోధోఽభిజాయతే॥
క్రోధా ద్భవతి సంమోహ స్సంమోహా త్స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి॥౬౩॥

విషయాన్ ధ్యాయతః పుంసః=విషయములను ఆలోచించుచున్న పురుషునకు, తేషు సఙ్గః ఉపజాయతే=వానియందు ప్రీతి కలుగుచున్నది- సఙ్గాత్ కామః సంజాయతే=విషయప్రీతివలన ఆశ పుట్టుచున్నది- కామాత్ క్రోధః అభిజాయతే=ఆశవలన క్రోధము పుట్టుచున్నది- తాను ఆశపడినదానిని మఱియొకఁడు ఆశపడినతోడనె వానియందు కోపముపుట్టునుగదా- క్రోధాత్ సంమోహః భవతి=కోపమువలన అవివేకముకలుగుచున్నది. సంమోహాత్ స్మృతివిభ్రమః (భవతి) =అవివేకమువలన మఱపు (కలుగుచున్నది)- స్మృతిభ్రంశాత్ బుద్ధి

నాశః (భవతి)=మఱపువలన తెలివిపోవుట (కలుగుచున్నది)- బుద్ధినాశాత్ ప్రణశ్యతి=తెలివిచెడుటవలన నశింపుచున్నాఁడు.

బుద్ధినాశమనఁగా అంతఃకరణముచెడుట- అనఁగా ఇది చేయఁదగినది ఇది చేయఁదగనిది అను నేర్పాటు లేకపోవుట- దానివలన నశించుటయనఁగా పురుషార్థమునకు తగకపోవుట- అని శంకరభాష్యము.

కామ మనఁగా విషయములను అనుభవింపక నిలువలేకపోవుట- సంమోహ మనఁగా కార్యాకార్యవివేకము లేకపోవుట- స్మృతిభ్రంశము అనఁగా తాను నడపించుచున్న ఇంద్రియజయము మొదలగుదానిని మఱచుట- బుద్ధినాశమనఁగా ఆత్మజ్ఞానమునందలి వ్యవసాయము (నిశ్చయము) పోవుట- దానివలన నశించుటయనఁగా సంసారములోఁబడుటయె-అని రామానుజభాష్యము.

సంమోహమనఁగా అకార్యములయందలి కోరిక- స్మృతివిభ్రమ మనఁగా శాస్త్రనిషేధములను మఱచుట- బుద్ధినాశమనఁగా అన్నివిధములను దోషమనెడి జ్ఞానమె లేకపోవుట- ప్రణశ్యతిఅనుదానికి నరకము మొదలగు అనర్థములను పొందుచున్నాఁడు అనియర్థము- అని మధ్వభాష్యము.

రాగద్వేషవియుక్తైస్తు విషయా నిన్ద్రియై శ్చరన్ ।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి॥౬౪॥

రాగద్వేషవియుక్తైః ఆత్మవశ్యైః ఇన్ద్రియైః విషయాన్ చరన్=రాగద్వేషములు లేనివై తనకులోఁగియున్న ఇంద్రియములచేత విషయములను అనుభవింపుచున్నవాఁడై, విధేయాత్మా ప్రసాదమ్ అధిగచ్ఛతి=స్వాధీనమైనఅంతఃకరణముకలవాఁడై శేటను పొందుచున్నాడు.

స్వాధీనములైన ఇంద్రియములచేత శరీరముగాలుచుటకై విడువశక్యముకాని విషయములను అనుభవింపుచు- ప్రసాదమనఁగా స్వస్థత- అని శంకరభాష్యము.

విషయాన్ చరన్=విషయములను తిరస్కరించియున్నవాఁడై- ప్రసాదమనఁగా నిర్మలమైన మనస్సు కలిగియుండుట- అని రామానుజభాష్యము.

[illegible] జయింపఁబడిన మనసు కలవాఁడు

మనస్సుయొక్క తేటను పొందుచున్నాఁడు- అనిమధ్వభాష్యము.

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే॥౬౫॥

ప్రసాదే (సతి) అస్య సర్వదుఃఖానామ్ హానిః ఉపజాయతే=ప్రస న్నతకలుగుచుండఁగా వీని సర్వదుఃఖములకును నాశము కలుగుచున్న ది. ప్రసన్నచేతసః బుద్ధిః ఆశు పర్యవతిష్ఠతి=ప్రసన్నమైన యంతఃకర ణముకలవాని బుద్ధి శీఘ్రముగా నిలకడకలదియగుచున్నది.

పర్యవతిష్ఠతే=ఆకాశమువలెనంతటనుండునదియగును- ఆత్మస్వరూ పముచేత నిశ్చలమగుననుట- అనిశంకరభాష్యము.

ప్రసన్నచేతసః=ఆత్మావలోకనమునకు విరోధులగు దోషములులే ని మనస్సుకలవానికి- బుద్ధిః=ప్రత్యేకముగా ఆత్మవిషయమైన జ్ఞానము- అని రామానుజభాష్యము.

బుద్ధిః పర్యవతిష్ఠతి=జ్ఞానము బ్రహ్మపరోక్షత్వముచేత లెస్సగా స్థి తినిచేయును- ప్రసాదమనఁగా తనప్రియత్వములేకయైనను తలుచు గా విషయములయందు ప్రవర్తింపకపోవుట- అనిమధ్వభాష్యము.

నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా।
నచా భావయత శ్శాన్తి రశాన్తస్య కుత స్సుఖమ్॥౬౬॥

అయుక్తస్య బుద్ధిః నాస్తి=యోగములేనివానికి జ్ఞానము లేదు- అ యుక్తస్య భావనాచ న=యోగములేనివానికి భావనయును లేదు- అభావయతశ్చ శాన్తిః న=భావనచేయకున్నవానికి శాంతి లేదు-అ శాన్తస్య సుఖమ్ కుతః=శాంతిలేనివానికి సుఖము ఎక్కడది?

సమాధిలేనివానికి ఆత్మస్వరూపజ్ఞానంబును ఆత్మజ్ఞానమునందలి అభినివేశంబు(నిశ్చయము)ను కలుగదు- సుఖమనఁగా ఇంద్రియములు విషయానుభవపు ఆశనుండి మఱలుట- విషయములయందలియాశదుఃఖ మే- ఆశకలిగినప్పుడు సుఖలేశమైనను కలుగదు- అనిశంకరభాష్యము.

యోగమనఁగా భగవంతునియందు మనస్సునుంచుట- బుద్ధియనఁగా ప్రత్యేకముగా నాత్మను తెలిసికొనుట- భావనయనఁగా ఆత్మధ్యానము శాంతియనఁగా విషయములయందలి స్పృహ(ఆశ) యుడుగుట- ఇదిలే వానికి, నిత్యమై, ఇంతకంటె నెక్కుడు లేదనఁదగిన సుఖము కలుగదు

అని రామానుజభాష్యము.

అయుక్తుఁడనఁగా మనోనిగ్రహము లేనివాఁడు- బుద్ధియనఁగా పరంచిజ్ఞానము- శాంతియనఁగా మోక్షము- అని మధ్వభాష్యము.

ఇన్ద్రియాణాంహి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి॥౬౭॥

యత్ మనః=ఏ మనస్సు, చరతామ్ ఇన్ద్రియాణామ్ అను విధీయతే=విషయములననుభవించుచున్న ఇంద్రియముల వెంటను ప్రవర్తించునో, తత్ అస్య ప్రజ్ఞామ్=అది వీని తెలివిని, వాయుః అమ్భసి నావమివ=గాలి నీటిలో ఓడనుపలె, హరతి=ఆకర్షించుచున్నది.

ఓడవాండ్ర యోడను గాలి, మార్గమును తప్పించి అపమార్గమునకు నడపించునట్లు ఇంద్రియముల ననుసరించెడి మనస్సు సంన్యాసియొక్క ఆత్మానాత్మవివేకమువలనఁగలిగిన జ్ఞానమును నశింపఁజేయును- అని శంకరభాష్యము.

ప్రజ్ఞయనఁగాఁ బ్రత్యేకముగా నాత్మను తెలిసికొనుట- వాయువనగా ఎదురుగాలి-అని రామానుజభాష్యము.

విధీయతే=ఈశ్వరునిచేతఁ జేయఁబడుచున్నదో- ప్రజ్ఞామ్=శ్రేష్ఠమైనజ్ఞానమును- ఇఁకపుట్టబోవుదానింగూడ నివారించుచున్నది-పుట్టినదానిని తిరస్కరించుచున్నది- అని మధ్వభాష్యము.

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥౬౮॥

(హే)మహాబాహో!=(ఓ)గొప్పభుజములుకలవాఁడా!, తస్మాత్=ఆహేతువువలన, యస్య ఇన్ద్రియాణి సర్వశః ఇన్ద్రియార్థేభ్యః నిగృహీతాని=ఎవ్వని ఇంద్రియములు అంతటను విషయములనుండి నిగ్రహింపఁబడినవో, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా=వాని బుద్ధి నిలకడకలది.

కాఁబట్టి సమస్తవిధముల నిగ్రహింపఁబడిన యింద్రియములు కలవాఁడె జ్ఞాని- అని మధ్వభాష్యము.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥౬౯॥

సర్వభూతానాం యా నిశా=సమస్తప్రాణులకును ఏది రాత్రియో, తస్యాం సంయమీ జాగర్తి=దానిలో యోగి. మేలుకనుచున్నాఁడు. యస్యాం భూతాని జాగ్రతి=దేనియందు భూతములు మేలుకనుచున్నవో, సా పశ్యతః మునేః నిశా=అది తెలిసికొనుచున్న మునికి రాత్రి.

సర్వప్రాణులకు రాత్రియగునది పరమార్థతత్త్వము-జ్ఞానికి రాత్రియగునది లౌకికవైదికవ్యవహారము- అని శంకరభాష్యము.

సర్వభూతములరాత్రియగునది ఆత్మజ్ఞానము- జ్ఞానికి రాత్రియగునది శబ్దాదివిషయజ్ఞానము- అని రామానుజభాష్యము.

సమస్తభూతములకు రాత్రియగునది పరమేశ్వరస్వరూపము- దానియందు జ్ఞాని మేలుకొనుటయనఁగా తెస్సగా అపరోక్షజ్ఞానముకలవాఁడగుట- జ్ఞానికి రాత్రి విషయస్వరూపము- మునియనఁగా మననముకలవాఁడు- అని మధ్వభాష్యము.

> ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
> సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్ ।
> తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వే
> స శాన్తి మాప్నోతి న కామకామీ॥ ౭౦॥

ఆపూర్యమాణమ్ అచలప్రతిష్ఠమ్ సముద్రమ్= నింపఁబడుచున్నదై చలింపనిస్థితిగల సముద్రమును, ఆపః యద్వత్ ప్రవిశన్తి=నీళ్లు ఎట్లు చొచ్చుచున్నవో, తద్వత్ సర్వే కామాః యం ప్రవిశన్తి=అట్లు అన్ని కోరికలును ఎవ్వనిని చొచ్చుచున్నవో, సః శాన్తిమ్ ఆప్నోతి =వాఁడు శాంతిని పొందుచున్నాఁడు- కామకామీ శాన్తిమ్ నాప్నోతి=కామములుగోరువాఁడు శాంతిని పొందఁడు.

సమస్తమైనకోరికలును ఎవ్వనికి ఆత్మయందె అణఁగుచున్నవో, వాఁడు మోక్షమును పొందును- అని శంకరభాష్యము.

శబ్దాదివిషయములు ఇంద్రియగోచరములైనను కాకున్నను ఎవ్వఁడు తనయాత్మావలోకనతృప్తిచేత వికారము లేనివాఁడైయుండునో, వాఁడె నిస్పృహతను పొందును- అని రామానుజభాష్యము.

ఎవ్వఁడు విషయములచే నింపఁబడినవాఁడైనను దర్పము లేకుండునో,

ప్రయత్నమును చేయఁడో, విషయములు లేనిచో శోషింపఁడో, వాఁడు మోక్షముం జెందును- అని మధ్వభాష్యము.

విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాం శ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకార స్సశాన్తి మధిగచ్ఛతి॥ ౭౧॥

యః పుమాన్=ఏ పురుషుఁడు, సర్వాన్ కామాన్ విహాయ=అన్ని కోరికలను విడిచి, నిస్పృహః నిర్మమః నిరహంకారః చరతి=ఆశ లేనివాఁడును మమకారము లేనివాఁడును అహంకారము లేనివాఁడునై సంచరింపుచున్నాఁడో, సః శాన్తిమ్ అధిగచ్ఛతి=వాఁడు శాంతిని పొందుచున్నాఁడు.

చరతి అనుదానికి జీవనమాత్రవ్యాపారకమై మిగిలి తిరుగుచున్నాఁడో అనియర్థము- అహంకారమనఁగా తనను గొప్పఁజేసికొనుట- శాంతి యనఁగా అన్ని సంసారదుఃఖములు నుడుగుటయనెడి మోక్షము- అని శంకరభాష్యము,

కామములనఁగా కోరఁబడెడి శబ్దాదివిషయములు- నిరహంకారః =దేహమునందు ఆత్మాభిమానము లేనివాఁడు- అని రామానుజభాష్యము.

కామములనఁగా విషయములు- చరతి=భక్షింపుచున్నాఁడో- నేను భక్షింపుచున్నాననే అహంకారమమకారములు లేనివాఁడై ముక్తిని పొందును- అని మధ్వభాష్యము.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యా మన్తకాలేపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి॥ ౭౨॥

(హే)పార్థ! ఏషా బ్రాహ్మీ స్థితిః=(ఓ)యర్జునుఁడా! ఇదీ బ్రహ్మసంబంధియగు స్థితి- ఏనాం ప్రాప్య నముహ్యతి=దీనిని పొంది మోహముం జెందఁడు- అన్తకాలేఽపి అస్యాం స్థిత్వా=చరమవయస్సునందుఁగూడ దీనిలో ఉండి, బ్రహ్మనిర్వాణమ్ ఋచ్ఛతి=బ్రహ్మానందమును పొందుచున్నాఁడు.

అన్నికర్మములనువిడిచి బ్రహ్మస్వరూపముగానుండుటయనెడి జ్ఞానము, బ్రాహ్మీ స్థితిః అని చెప్పఁబడినది- వార్ధకమున సన్యసించినవాఁడుఁగూడ మోక్షమునుపొందఁగా బ్రహ్మచర్యమునుండియె సంన్యసించి జీవ

నకాలమంతయు బ్రహ్మమునందె యున్నవానికి మోక్షముకలుగునని చెప్పవలయునే? అనిశంకరభాష్యము.

నిత్యాత్మజ్ఞానముకలవాఁడై సంగములేని కర్మముల నాచరించుటయె, బ్రహ్మమును పొందించునదిగాన, బ్రాహ్మీ స్థితిః అని చెప్పఁబడినది- ఇట్టి కర్మస్థితినిబొంది తిరిగియు సంసారముంజెందఁడు- బ్రహ్మనిర్వాణము ను అనఁగా నిర్వాణమయమగు బ్రహ్మమును, అనఁగా సుఖైకస్వరూపం బగు నాత్మను పొందుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

బ్రాహ్మీ=బ్రహ్మవిషయమగు, స్థితిః=లక్షణము- అంతకాలమందైనను ఈస్థితిలో నిలిచియె బ్రహ్మమును పొందుచున్నాఁడు-లేనియెడను జన్మాంతరమును పొందుచున్నాఁడు- జ్ఞానులకుఁగూడ ప్రారబ్ధకర్మ మున్నయెడను మఱియొక్క-శరీరము కలుగును- నిర్వాణం బ్రహ్మ=శరీరములేని బ్రహ్మమును- శరీరములేకపోవుటయనఁగా ప్రకృతివలనఁగలిగిన శరీరములేకుండుటకాని ఎల్లప్పుడును ఆనందరూపమైఅంతటను పరిపూర్ణమైన అప్రాకృతశరీరము లేకపోవుటకాదు- ఆశరీరమునె తన మాయచేత పరిచ్ఛిన్నమునుచేసి రామకృష్ణాదిరూపముగాఁజూపును- ఎల్లప్పుడును అన్నిశరీరములయందును లెక్క-లేని అనంతములైన గుణములు కలవియు దోషము లేమియులేనిదియునగు నారాయణుఁడను పరబ్రహ్మమును అపరోక్షజ్ఞానముచేఁ బొందుచున్నాఁడు- అని మధ్వభాష్యము.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సాం
ఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతి
పాదకంబును యోగశాస్త్రంబును శ్రీ కృష్ణా
ర్జున సంవాదంబునగు భగవద్గీతలలో
సాంఖ్యయోగప్రతిపాదకంబగు
రెండవయధ్యాయము.



## మూడవయధ్యాయము.

### అర్జునఉవాచ.

జ్యాయసీచే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥౧॥
వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్॥౨॥

(హే)జనార్దన!=(ఓ)శ్రీకృష్ణుఁడా!, బుద్ధిః కర్మణః జ్యాయసీ తే మతా చేత్=జ్ఞానము కర్మముకంటె శ్రేష్ఠమైనదిగా నీకు ఇష్టమయ్యె నేని, (హే)కేశవ!=(ఓ)శ్రీకృష్ణుఁడా!, తత్=అందువలన, ఘోరే కర్మణి మామ్ కిం నియోజయసి?=ఘోరమైన కర్మమునందు నన్ను ఏల ప్రవర్తింపఁజేయుచున్నావు?- వ్యామిశ్రేణేవ వాక్యేన=కలతగానుండెడిదానివంటి వాక్యముచేత, మే బుద్ధిం మోహయసీవ=నా బుద్ధిని మోహింపఁజేయుచున్నట్లు ఉన్నావు- యేన అహమ్ శ్రేయః అప్నుయామ్=దేనిచేత నేను మేలును పొందుదునో, తత్ ఏకమ్ నిశ్చిత్య వద=అట్టి ఒక్కదానిని నిశ్చయించి చెప్పుము.

ఈయర్జునప్రశ్నముచే జ్ఞానకర్మసముచ్చయము అనఁగా జ్ఞానముతోతుల్యముగా కర్మమునుఁగూడ చేర్చి యాచరించుట సిద్ధాంతముకాదని స్పష్టపఱుపఁబడినది- అనిశంకరభాష్యము.

జ్ఞాననిష్ఠయె ఆత్మావలోకనమునకు సాధనము-కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠను కలుగఁజేయునది- ఇంద్రియముల వ్యాపారములన్నియు నుడుగుటచేఁ గలిగెడి ఆత్మావలోకనమె సాధింపవలసినదైనచో సకలకర్మములను వదిలి జ్ఞానమునె యాచరించుటయందు నన్ను నియోగింపుము- సర్వేంద్రియవ్యాపారరూపమైనకర్మమున నన్నేల నియోగించెదవు- అనిరామానుజభాష్యము.

కర్మముకన్న జ్ఞానము మిక్కిలి యుత్తమమైనదని చెప్పితివి- అట్లయ్యె నేని నివృత్తికర్మముల విడిచి యుద్ధమనెడి ఘోరమయినకర్మమందు నన్నేల నియోగింపుచున్నావు? అని మధ్వభాష్యము.

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా మయా ప్రోక్తా పురాఽనఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥౩

(హే)అనఘ=(ఓ)పాపములు లేనివాఁడా!,అస్మిన్ లోకే= ఈ లోకము నందు,పురా ద్వివిధా నిష్ఠా మయా ప్రోక్తా=పూర్వము రెండువిధము లుగల నిష్ఠ నాచేత చెప్పఁబడినది- సాంఖ్యానామ్ జ్ఞానయోగేన(ని ష్ఠా ప్రోక్తా)=జ్ఞానులకు జ్ఞానమనెడియోగముచేత (నిష్ఠ చెప్పఁబ

పూర్వమునందు అనఁగా సృష్ట్యాదియందు-వేదార్థసంప్రదాయ మును బయలుపుచ్చినప్పుడు- నిష్ఠయనఁగా అనుష్ఠేయమందలి తాత్ప ర్యము- జ్ఞాన యోగము బ్రహ్మచర్యాశ్రమమునందె సంన్యసించిన పర మహంసపరివ్రాజకులకు- అట్లుకాక కర్మములనాచరించెడి వారికి క ర్మయోగము- అని శంకరభాష్యము.

సంఖ్యఅనఁగా బుద్ధి- దానితోఁగూడినవారు సాంఖ్యులు- ఆత్మమా త్రవిషయమైన జ్ఞానముకలవారు- దానికితగనివారై కర్మయోగాధి కారులైనవారు యోగులు- విషయములయందు వ్యాకులమైన బుద్ధి కల వారికి కర్మయోగమున నధికారము- వ్యాకులముకాని బుద్ధికలవారికి జ్ఞా నయోగమున నధికారము- కాఁబట్టి వ్యామిశ్రమైన వాక్యము చెప్పఁబ డలేదు- అని రామానుజభాష్యము.

సనకాదులవలె గృహస్థాదికర్మములను విడిచి జ్ఞాననిష్ఠులైనవారును, జనకాదులవలె గృహస్థాదికర్మములలోనుండియె జ్ఞాననిష్ఠులైనవారు న ని రెండువిధములైన జనులు కలరు-ఇందు మొదటివారు సాంఖ్యులు-రెం డవవారు యోగులు- జ్ఞాననిష్ఠులైనను అధికారికులగుటవలన ఈశ్వరే చ్ఛచేతనును లోకసంగ్రహార్థమగుటవల్లనును కర్మయోగ్యులయినవా రును యోగులు- ఈశ్వరేచ్ఛచేతనె కర్మమును చేసెడివారు ప్రియ వ్రతాదులు- నీవు జనకాదులవలె కర్మములనాచరించుచునె జ్ఞానమున కు తగినవాఁడవు- అని మధ్వభాష్యము.

న కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
నచ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥ ౪॥

కర్మణామ్ అనారమ్భాత్=కర్మములను ఆచరింపకపోవుటవలన, పు రుషః నైష్కర్మ్యమ్ నాశ్నుతే=మనుష్యుఁడు జ్ఞాననిష్ఠను పొందఁడు- సంన్యసనాదేవచ సిద్ధిం నసమధిగచ్ఛతి=కర్మములనువిడుచుటమా

త్రమునను జ్ఞానసిద్ధిని పొందఁడు.

ఈజన్మమునఁగాని జన్మాంతరమునఁగాని అనుష్ఠింపఁబడిన కర్మములు పాపక్షయకారణములగుటను అంతఃకరణశుద్ధిని కలుగఁజేసి జ్ఞానోత్పత్తిద్వారమగున జ్ఞాననిష్ఠకు కారణములగును- అంతఃకరణశుద్ధి లేక వట్టి కర్మపరిత్యాగ మాత్రముచేత జ్ఞానసిద్ధి కలుగదు- అని శంకరభాష్యము

అనారంభమనఁగా కర్మములను ఆరంభింపకయె పోవుట. సంన్యసనమనఁగా ఆరంభించినవానిని విడుచుట- ఫలాభిసంధిలేనికర్మములచే భగవంతుని నారాధించినఁగాని అనాదికాలమునుండియున్న పాపములు పోయి అవ్యాకులేంద్రియత్వపూర్వకమగు ఆత్మనిష్ఠ లుగదు- అని రామానుజభాష్యము.

కర్మములను అనఁగా యుద్ధము మొదలగు వానిని చేయకపోవుటవలన నైష్కర్మ్యమనఁగా కామ్యకర్మములను విడుచుటచేఁ బొందఁబడెడి మోక్షముకలుగదు-జ్ఞానము మోక్షసాధనముగాని కర్మములఁజేయకపోవుట కాదు-ఇందుకు హేతువు పురుషుఁడగుట-ఎల్లప్పుడును స్థూలమైనను సూక్ష్మమైన నగు పురమ(శరీరము)తోఁగూడియె యుండువాఁడు- కర్మములను చేయకపోవుటవలననె ముక్తి కలుగునెడను స్థావరములకు ముక్తి కలుగవలయును- సంన్యాసనమనఁగా కామ్యకర్మములను విడుచుట- కామములేనికర్మములనాచరించుటచే నంతఃకరణశుద్ధి కలిగి జ్ఞానముచే మోక్షము కలుగును- యత్యాశ్రమము ప్రయతత్వము(మనస్సమాధానము) కొఱకు నుభగవంతునికి సంతోషము కలుగుటకు నైయున్నది- గృహస్థులు ఇతరకర్మములలో ప్రవర్తించుటవలన అప్రయతులై యుందురు- అధికారికులు గృహస్థులైయె ప్రయతులగుటను సమర్థులగుదురు- అని మధ్వభాష్యము.

నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ ౫ ॥

కశ్చిదపి జాతు క్షణమపి=ఒకానొకఁడును ఒక్కప్పుడు క్షణకాలమైనను, అకర్మకృత్ నతిష్ఠతిహి=కర్మములను చేయనివాఁడ(అగుచు ఉండఁడుగదా- సర్వః అవశః=సమస్తమైనవాఁడను అస్వాధీనుఁడై

ప్రకృతిజైః గుణైః కర్మ కార్యతేహి=ప్రకృతివలనఁగలిగిన సత్త్వర జస్తమోగుణములచేత కర్మమును చేయింపఁబడుచున్నాఁడుగదా-

జ్ఞానులను సత్త్వాదిగుణములచే కదల్పఁబడుట లేదుగాన ఈశ్లోకము అజ్ఞవిషయము- అజ్ఞః=అజ్ఞుఁడు, అను పదమును తెచ్చికొని యన్వయించుసది. అని శంకరభాష్యము.

కర్మయోగముచేత ప్రాచీనపాపములను నశింపఁజేసికొని, సత్త్వాదిగుణములను స్వాధీనము చేసికొని, నిర్మలమైనయంతఃకరణముకలవానిచే సంపాదింపవలసినది జ్ఞానయోగము- అని రామానుజభాష్యము.

కర్మములను సర్వవిధములను వీడుచుట శక్యముకాదు- అని మధ్వభాష్యము.

కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥౬

యః కర్మేన్ద్రియాణి సంయమ్య=ఎవ్వఁడు కర్మేంద్రియములను* నియమించికొని, ఇన్ద్రియార్థాన్ మనసా స్మరన్ ఆస్తే=ఇంద్రియవిషయములను మనస్సుచేత తలంచుచును ఉన్నాఁడో, సః విమూఢాత్మా మిథ్యాచారః (ఇతి) ఉచ్యతే=వాఁడు మోహమును జెందిన మనస్సుకల మిథ్యాచారుఁడు (అని) చెప్పఁబడుచున్నాఁడు.

ఆత్మజ్ఞానము లేనివాఁడు కర్మములం జేయకుండుట యయుక్తము- మిథ్యాచారుఁడనఁగా పాపాచారుఁడు- అనిశంకరభాష్యము.

పాపము నశింపకపోవుటవలన అంతఃకరణజయము లేనివాఁడైయును ఆత్మజ్ఞానమునఁప్రవర్తించి విషయాసక్తమైన మనస్సుకలవాఁడు, ఒకవిధముగా నుద్దేశించి మఱియొకవిధముగా నడచువాఁడుగాన మిథ్యాచారుఁడనఁబడుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

అయినను కర్మములను శక్తికొలది విడువవలయును- అనిమధ్వభాష్యము.

* వాక్కు, హస్తము, పాదము, గుదము, ఉపస్థము, అనునయిదును కర్మేంద్రియములు- వీని వివరణము సృష్టిసంగ్రహవిస్తరమున సుస్పష్టము- గాను-

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే॥ ౭॥

(హే)అర్జున!=(ఓ)యర్జునుఁడా!, యస్తు ఇంద్రియాణి మనసా నియమ్య=ఎవ్వఁడైతే ఇంద్రియములను మనస్సుచేత నియమించి, అసక్త(స్సః)కర్మేంద్రియైః కర్మయోగమ్ ఆరభతే=ఫలసంగము లేనివాఁడై కర్మేంద్రియములచేత కర్మయోగమును ఆరంభించుచున్నాఁడో, సః విశిష్యతే=వాఁడు విశేషించుచున్నాఁడు.

ఇట్లు కర్మముల నాచరించెడి యజ్ఞుఁడు, వెనుకటి మిథ్యాచారునికంటె శ్రేష్ఠుఁడు- అని శంకరభాష్యము.

ఆత్మావలోకనమందు మనస్సుకలవాఁడై, తనకు అలవాటుపడిన విషయములవంటివైన శాస్త్రీయకర్మములయందు ఇంద్రియములను నియమించి, సంగములేక కర్మములం జేయువాఁడు ప్రమాదము నూహించుటకైన నవకాశము లేకపోవుటచే, జ్ఞాననిష్ఠుఁడైనపురుషునికంటెను విశేషించుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

వెనుకటి శ్లోకములో మనస్సుచేత తలంచుచును అనియు, ఈశ్లోకమున మనస్సుచేత నియమించి అనియు చెప్పుటచే మనస్సు ప్రయోజకము అని తెలియఁజేయఁబడినది- కర్మయోగమనఁగా సంన్యాసము మొదలయిన వర్ణాశ్రమధర్మములన్నియుం గాని ఒక్క-గృహస్థకర్మము మాత్రమె కాదు- కాఁబట్టి తప్పక స్వవర్ణాశ్రమోచితమైన కర్మమును చేయుము- అనిమధ్వభాష్యము.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।
శరీరయాత్రాఽపిచ తే న ప్రసిద్ధ్యే దకర్మణః॥

త్వం నియతం కర్మ కురు=నీవు నియతమైన కర్మమును చేయుము, అకర్మణః కర్మ జ్యాయః హి=అకర్మముకంటె కర్మము శ్రేష్ఠము గదా-అకర్మణః తే శరీరయాత్రాపిచ నప్రసిద్ధ్యేత్=కర్మములులేని నీకు శరీరమునిలుచుటకూడను సిద్ధింపదు.

నియతమనఁగా నిత్యము- ఫలములేక ఏయధికారికి ఏకర్మము విధింపఁబడుచున్నదో, వానికి అదినియతకర్మము- అకర్మమనఁగా కర్మములం జేయకపోవుట- అనిశంకరభాష్యము.

నియతమ్=వ్యాపింపఁబడినది- ప్రకృతిసంబంధము కలవానిచేత కర్మము వ్యాపింపఁబడినదిగదా- ప్రకృతిసంపర్కము అనాదివాసనచే కలిగినది- అకర్మమనఁగా జ్ఞానము- సాధనముపూర్తియగువఱకు శరీరమును నిలబెట్టికొనుట ఆవశ్యకము- న్యాయముగా సంపాదింపఁబడిన ధనముచేత పంచమహాయజ్ఞాదులంజేసి మిగిలిన యన్నముచే శరీరమును నిలబెట్టికొనవలయును- కాఁబట్టి జ్ఞాననిష్ఠునికిఁగూడ శరీరము నిలిచియుండువఱకు, సాధనము పూర్తియగునందాక, మహాయజ్ఞములు మొదలైన నిత్యనైమిత్తిక కర్మములు ముఖ్యముగాఁ జేయవలసినది- కర్మయోగమునందుఁగూడ ఆత్మ కర్త కాఁడను తలంపు ఉండవలసినదిగాన ఆత్మయాథాత్మ్యజ్ఞానము అంతర్భవించియె యున్నది- ప్రకృతిసంసర్గము కలవానికి కర్మయోగము సుకరంబును ప్రమాదము లేనిదియు- కాఁబట్టి జ్ఞాననిష్ఠకు యోగ్యుఁడైనవానికింగూడ జ్ఞానయోగముకన్న కర్మయోగమె శ్రేష్ఠము- కావున నీవు కర్మమును చేయుము- అని రామానుజభాష్యము.

నియతమనఁగా తనవర్ణమునకును ఆశ్రమమునకును తగినది- అని మధ్వభాష్యము.

> యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః।
> తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గస్సమాచర ॥౯॥

యజ్ఞార్థాత్ కర్మణః అన్యత్ర=యజ్ఞార్థమైన కర్మముకన్న మిగిలినవిషయమునందె, అయంలోకః కర్మబన్ధనః (భవతి)=ఈలోకము కర్మముబంధనముగాఁగలది (అగుచున్నది)=(హే) కౌన్తేయ!=(ఓ) కుంతీపుత్రుఁడా!, ముక్తసంగ (స్సన్) తదర్థం కర్మ సమాచర=ఫలసంగము లేనివాఁడ(వగుచు) యజ్ఞార్థమైన కర్మమును ఆచరింపుము.

యజ్ఞశబ్దమునకు ఈశ్వరుఁడర్థము- ఈశ్వరునికొఱకు చేయఁబడెడి కర్మము యజ్ఞార్థము- అని శంకరభాష్యము.

యజ్ఞార్థమనఁగా యజ్ఞము మొదలగు శాస్త్రీయకర్మములకొఱకైన ద్రవ్యార్జనము మొదలయినది- ఆత్మార్థీయప్రయోజనములగు కర్మముల చేత ఈలోకము బంధముకలదియగును- తనప్రయోజనముకొఱకైన దను తలంపుచేఁ గలిగెడి సంగము లేనివాఁడవై ధనసంపాదనము మొదలగు

దానిం జేసి యజ్ఞాదులం జేసినచో, దానిచే నారాధింపఁబడి భగవంతుఁడు అనాదికాలప్రవృత్తంబగు కర్మవాసనను తెగఁగొట్టి కలఁత లేని ఆత్మావలోకనమును కలుగఁజేయును- అని రామానుజభాష్యము.

యజ్ఞశబ్దమునకు విష్ణువు అర్థము- యజ్ఞార్థమై సంగము లేని కర్మము బంధకము కాదు- అని మధ్వభాష్యము.

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్టకామధుక్॥

ప్రజాపతిః సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా=ప్రజాపతి కర్మములతోఁ గూడిన ప్రజలను సృజించి, పురా ఉవాచ=తొల్లి (ఇట్లు) అనెను- అనేన ప్రసవిష్యధ్వమ్=దీనిచేత వృద్ధి పొందుఁడు, ఏషః వః ఇష్టకామధుక్ అస్తు=ఇది మీకు కోరినకోరికలను ఇచ్చునది అగును.

ప్రజాపతి అనఁగా ప్రజలను సృజించువాఁడు- కామములు అనఁగా ఫలములు- అని శంకరభాష్యము.

ప్రజాపతి అనఁగా సర్వేశ్వరుఁడు ఇష్టకామధుక్=ఇష్టములైన, మోక్షమునను దానికి అనుగుణములైన కామములనును, ఇచ్చునది- అని రామానుజభాష్యము.

ఈశ్లోకము వెనుక చెప్పఁబడినదానికి అర్థవాదము- అని మధ్వభాష్యము.

దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ॥౧౧॥

అనేన దేవాన్ భావయత=దీనిచేత దేవతలను కలుగఁజేయుఁడు- తే దేవాః వః భావయన్తు=ఆ దేవతలు మిమ్ము కలుగఁజేయుదురు- పరస్పరం భావయన్తః=అన్యోన్యము పోషించుచున్నవారై, పరమ్ శ్రేయః అవాప్స్యథ=గొప్ప మేలును పొందఁగలరు.

భావయత=వృద్ధిపొందింపుఁడు- భావయన్తు=వర్షము మొదలగువానిచే వృద్ధిపొందింతురు- జ్ఞానము కలిగి తద్ద్వారమున మోక్షమును పొందుదురు అని శంకరభాష్యము.

భావయత=ఆరాధింపుఁడు- భావయన్తు=పోషింతురు- పరం శ్రేయః=మోక్షమును- అని రామానుజభాష్యము.

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తాన ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥౧౨

యజ్ఞభావితాః దేవాఃహి=యజ్ఞములచేత భావింపఁబడిన దేవతలుగదా, వః ఇష్టాన్ భోగాన్ దాస్యన్తే=మీకు ఇష్టములైన భోగములను ఈఁగలరు- తైః దత్తాన్=వారిచేత ఈబడినవానిని, ఏభ్యః అప్రదాయ యః భుఙ్క్తే=వీరికి ఈయక ఎవ్వఁడు అనుభవింపుచున్నాఁడో, సః స్తేనఏవ= వాఁడు దొంగయె.

భావితులనఁగా వృద్ధిపొందింపఁబడినవారు- అనఁగా సంతోషపెట్టఁబడినవారనుట. భోగములనఁగా స్త్రీపుత్రపశ్వాదులు. దేవతల స్వమ్మను అపహరించుటచే దొంగయగును- అని శంకరభాష్యము.

భావితులనఁగా ఆరాధింపఁబడినవారు- దేవతలు పైపైని వెండియు తమనారాధించుటకు తగిన భోగములను భగవంతుఁడు అన్నాగాఁగావారై ఇత్తురు- చౌర్యము(దొంగతనము) అనఁగా ఇతరులచేత తమకార్యమునకై సంపాదింపఁబడి వారిదైయున్న వస్తువును తనదని తలంచుచు దానిచే తనను పోషించికొనుట- అనిరామానుజభాష్యము.

యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః।
భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్॥౧౩॥

యజ్ఞశిష్టాశినః సన్తః=యజ్ఞములు చేయఁగా మిగిలినదానిని తినెడి సత్పురుషులు, సర్వకిల్బిషైః ముచ్యన్తే=అన్నిపాపములచే విడువఁబడుదురు- యే ఆత్మకారణాత్ పచన్తి=ఎవ్వరు తమనిమిత్తము వండుకొనుచున్నారో, తే పాపాః అఘం భుఞ్జతే=ఆ పాపులు పాపమును తినుచున్నారు.

దేవయజ్ఞాదులను చేసి అమృతమను పేరుగల తచ్ఛేషమును భుజించుటచే చుల్లి(పొయ్యి)మొదలగు పంచసూనల(అయిదుహింసాస్థానముల)చేఁ గలిగెడు పాపములచేతనును, ప్రమాదమువలనఁ గలిగెడు పాపములచేనును, విడువఁబడుదురు- అనిశంకరభాష్యము. (౧ దేవయజ్ఞము అనఁగా నిత్యము అగ్నిలో హోమములుచేయుట- ౨ బ్రహ్మయజ్ఞము అనఁగా నిత్యమును అధ్యయనముచేయుట- 3 పితృయజ్ఞము- అనఁగా ప్రతిదినమును పితృదేవతలను తృప్తిని బొందించుట- ౪ మనుష్యయజ్ఞము

నఁగా ప్రతిదినమువచ్చిన అతిథులకు భోజనము పెట్టుట, ౫ భూతయజ్ఞము. అనఁగా నిత్యమును జంతువులకు బలి వేయుచుండుట. ఇవి పంచమహాయజ్ఞములనియెదరు. పంచసూనలనునవి ౧ చుల్లి(పొయ్యి) ౨ కుట్టని(రోకలి) ౩ పేషణి(పొత్రము) ౪ ఉదకుంభి(నీళ్లకడవ) ౫ మార్జని(చీపురుకట్ట) వీనివలన చిన్నచిన్న పురుగులు మొదలగువానికి హింసకలుగును గావున పంచసూనలని చెప్పఁబడును.

ఇంద్రాదిస్వరూపముగానున్న పరమపురుషుని ఆరాధించుటకై ద్రవ్యములను సంపాదించి వానిచే అట్టి భగవంతుని ఆరాధించి శేషముచే పొటపోసికొనెడివారు, అనాదికాలమునుండిసంపాదింపఁబడిన వైఆత్మయాథాత్మ్యజ్ఞానమునకు విరోధులైన సమస్తపాపములచే, విడువఁబడుదురు. ఇంద్రాదిస్వరూపుఁడగు పరమపురుషునిచే తననారాధించుటకై ఈబడిన ద్రవ్యములను తమకొఱకై వండుకొని తినెడి పాపాత్ములు పాపమునే తినుచున్నారు. పాపముగాఁబరిణమించునదిగాన పాపమని చెప్పఁబడుచున్నది. ఆత్మావలోకనమున వైముఖ్యముకలవారై నరకమును పొందుదురు అని రామానుజభాష్యము.

అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసంభవః।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥ ౧౪॥
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ ౧౫॥
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।
అఘాయురిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి॥ ౧౬॥

అన్నాత్ భూతాని భవన్తి=అన్నమువలన భూతములు కలుగుచున్నవి. పర్జన్యాత్ అన్నసంభవః (భవతి)=మేఘమువలన అన్నము కలుగుట (అగుచున్నది). యజ్ఞాత్ పర్జన్యః భవతి=యజ్ఞమువలన మేఘము కలుగుచున్నది. యజ్ఞః కర్మసముద్భవః=యజ్ఞము పనివలనఁగలుగునది. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి=కర్మమును బ్రహ్మమువలనఁబుట్టుకకలదానినిగాను ఎఱుంగుము. బ్రహ్మ అక్షరసముద్భవమ్=బ్రహ్మము అక్షరునివలనపుట్టుకగలది. తస్మాత్=ఆహేతువువలన, సర్వగతం బ్రహ్మ=సర్వమునుచేరియున్న బ్రహ్మము, నిత్యం య

జ్ఞే ప్రతిష్ఠితమ్=నిత్యముగా యజ్ఞమున నిలిచియున్నది- ఏవమ్ ప్రవర్తితమ్ చక్రమ్=ఇట్లు ప్రవర్తింపఁజేయఁబడిన చక్రమును, ఇహ యః నానువర్తయతి=ఇచ్చటను ఎవ్వఁడు అనువర్తింపఁడో, (హే) పార్థ!=(ఓ) అర్జునుఁడా!, సః అఘాయుః ఇన్ద్రియారామ(శ్శసన్)=వాఁడు పాపజీవనముకలవాఁడును ఇంద్రియములచేత నేక్రీడించుచున్నవాఁడు (నగుచు), మోఘమ్ జీవతి=వ్యర్థముగా బ్రదుకుచున్నాఁడు.

యజ్ఞమనఁగా యజ్ఞము చేయుటవలనఁగలిగెడి అపూర్వము-(అదృష్టము- అనఁగా నిచ్చటపుణ్యము)- కర్మ మనఁగా ఋత్విక్కులతోఁగూడి యజమానుఁడుచేసెడివ్యాపారము- బ్రహ్మోద్భవమనఁగా వేదముచేఁబ్రకాశింపఁజేయఁబడినదియనుట- అక్షరము అక్షరునివలన అనఁగా పరమాత్మవలనఁగలిగినది- పరమాత్మవలనపుట్టుటనే అన్నివిషయములందెలియఁజేయుటను సర్వగతంబయ్యును యజ్ఞవిధియే ప్రధానముగాఁగలది- కర్మాధికారియైన యెవ్వఁడు ఈజగచ్చక్రమును అనువర్తింపఁడో, వాఁడు నిరర్థకజీవనముకలవాఁడు- కాఁబట్టి జ్ఞానికానివాఁడు కర్మమును చేయవలసినదియే- అని శంకరభాష్యము.

యజ్ఞమనఁగా కర్మమే- అది ధనము సంపాదించుట మొదలగు యజమానవ్యాపారము చేఁగలుగునదిగాన కర్మోద్భవము. బ్రహ్మోద్భవమ్ అనునప్పుడు బ్రహ్మశబ్దము ప్రకృతిపరిణామరూపమైన శరీరమును చెప్పును- ఆ వ్యాపారము శరీరమువలనఁగలుగునదియనియర్థము. అక్షర శబ్దమునకు జీవాత్మయర్థము- అన్నపానాదులచే తృప్తిఁబొందినజీవునిచే నధిష్ఠింపఁబడినదై శరీరము వ్యాపారములం జేయుంగాన బ్రహ్మము అక్షరసముద్భవము అని చెప్పఁబడినది- సర్వగతమనఁగా సర్వాధికారులను పొందియున్నది యనుట- యజ్ఞేప్రతిష్ఠితమ్ అను వాక్యమునకు శరీరము యజ్ఞమునకు మూలమైనది అనియర్థము- అన్నమువలన భూతములు అనఁగా జీవులతోఁగూడిన శరీరములును, మేఘమువలన అన్నంబును, యజ్ఞమువలన మేఘంబును, యజ్ఞము యజమానుని వ్యాపారమువలనను, ఆవ్యాపారము జీవునితోఁగూడిన శరీరమువలనను, అట్టిశరీరములు తిరిగియును అన్నమువలనను అనియిట్లు ఒకదానికొకటి కారణములై చక్ర

మువలె తిరుగుచున్నదానిని, కర్మయోగాధికారి గాని జ్ఞానయోగాధికారిగాని ప్రవర్తింపఁజేయఁడేని, యజ్ఞశేషముచేత పొట్టపోసికొనుట లేదుగాన వాఁడు అఘాయువు- అనఁగా పాపములను చేయుటకైయైన ఆయుస్సుకలవాఁడుగానీ పాపరూపముగాఁబరిణమించిన ఆయుస్సుకలవాఁడుగానీ రెండువిధములనుండెడి యాయుస్సుకలవాఁడుగానీ అగును- వాఁడు ఆత్మారాముఁడు కాఁడుగాన ఇంద్రియారాముఁడు. అనఁగా ఇంద్రియములె తోట అనఁగా విహారప్రదేశముగాఁగలవాఁడు అగును- యజ్ఞశేషముచే దేహపోషణము లేకపోవుటచే అతిశయించిన రజస్తమోగుణములుగలవాఁడై ఆత్మావలోకనమున విముఖుఁడగును- దీనివలన తాను చేయుచుండెడి జ్ఞానయోగాది ప్రవృత్తియు నిష్ఫలంబగును- అని రామానుజభాష్యము.

కర్మములను చేయవలయుననుటకు మఱియొక్క హేతువు చెప్పఁబడుచున్నది- పర్జన్యుఁడనఁగా ఆదిత్యుఁడును మేఘచక్రాభిమాని యగు దేవతయు- యజ్ఞమువలన ఆదిత్యుఁడు బలవృద్ధిని పొందును- మేఘచక్రము యజ్ఞమువలన కలుగుంగాన యజ్ఞాద్భవతి పర్జన్యః అని చెప్పఁబడినది- యజ్ఞమనఁగా దేవతలకు హోమాదులం జేయుట- కర్మమనఁగా క్రియ (పని)- జీవులవ్యాపారములన్నియు పరమాత్మవలననె కలుగుచున్నవి ఏషహ్యేవ సాధుకర్మ కారయతి (ఇతఁడేగదా మంచి పనిని చేయించుచున్నాఁడు) అని శ్రుతి- ప్రతిబింబమైన జీవునికి బింబమైన పరమాత్మను పట్టియెకదా వ్యాపారము- పరబ్రహ్మము అక్షరములచే స్ఫుటపఱుపఁబడును- ఆ యక్షరములు (వేదము) నిత్యములైనవి- ఇట్లు పరంపరచే యజ్ఞమునకు బ్రహ్మము అభివ్యంగ్యము (స్ఫుటపఱుపఁబడునది) గాన యజ్ఞమున ప్రతిష్ఠితము అని చెప్పఁబడినది- ఆ అక్షరములు భూతములచే స్ఫుటపఱుపఁబడునవి గాన ఇది చక్రము- ఈ జగచ్చక్రమును ఎవ్వఁడు అనుసరింపఁడో వాఁడు దానిని చెడఁగొట్టువాఁడుగాన అఘాయువనఁబడును- పాపముకొఱకైయైన ఆయుస్సుకలవాఁడు అని యర్థము- అని మధ్వభాష్యము.

యస్త్వాత్మరతిరేవస్యాదాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే॥౧౭॥

యః మానవస్తు = ఏ మనుష్యుఁడైతే, ఆత్మరతిరేవ = ఆత్మయందెలస

తికలవాఁడును, ఆత్మతృప్తశ్చ=తనయందేతృప్తినిపొందినవాఁడును, ఆత్మన్యేవ సంతుష్టశ్చ స్యాత్=ఆత్మయందె సంతోషించినవాఁడును అగునో, తస్య కార్యమ్ నవిద్యతే=వానికి చేయవలసినది లేదు.

ఆత్మను తెలిసికొని అజ్ఞానములేనివారై పుత్రైషణాదులును లేనివారై శరీరమునిలుచుటకు మాత్రము భిక్షాచరణము చేయుచున్నవారికి ఆత్మజ్ఞానముతప్ప రెండవది చేయవలసినదిలేదు- ఆత్మయందె సంతోషించినవాఁడనుటచే అంతటను ఆశలేనివాఁడనుట- అని శంకరభాష్యము.

సాధనముల యొక్క-అపేక్షయె యాత్మదర్శనము కలవాఁడగు ముక్తునికే మహాయజ్ఞములు మొదలగు వర్ణాశ్రమకర్మముల యొక్క- లేకపోవుటయని ఇఁక మూఁడుశ్లోకములచే చెప్పఁబడుచున్నది- ధారకపోషకభోగ్యములు§మూఁడును ఆత్మయె ఎవనికగునో, వానికి, స్వయముగానె యాత్మస్వరూపము ఎల్లప్పుడును చూడఁబడుటచే, ఆత్మదర్శనమునకు చేయవలసినది ఏమియు లేదు- అని రామానుజభాష్యము.

ఆత్మయనఁగా పరమాత్మ- ఆపరమాత్మయొక్క దర్శనము మొదలగుదానిచేఁగలిగిన సుఖము-రతి- ఇతరములు వలదు,అనెడి జ్ఞానము తృప్తి- అతృప్తిని కలుగఁజేసెడి సుఖమె సంతోషము- పరమాత్మదర్శనాది సుఖమును పొంది మిగిలినవానియందెల్లను తృప్తికలవాఁడగుటనె పరమాత్మయందె యుండి సంతోషించినవాఁడై మఱియేదియు సంతోషకారణము లేనివాఁడైన అసంప్రజ్ఞాతసమాధిలోనున్నవానికి కర్మము లేదు- మిగిలినజ్ఞానికి కర్మము కలదు- మానవశబ్దమునకు జ్ఞానిఅనిఅర్థము- దీనిచే అపరోక్షజ్ఞానము కలవానికె అసంప్రజ్ఞాతసమాధికలుగునని తెలుపఁబడినది- అని మధ్వభాష్యము.

నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః॥ ౧౮॥

---

§ ధారకమనఁగా శరీరమును నిలువఁబెట్టెడి పానము (నీరు)-పోషకమనఁగా శరీరమునకు పుష్టినికలుగఁజేసెడియన్నము- భోగ్యములనఁగా సుఖానుభవము కొఱకైన తోటలు, పూఁబుదండలు, చందనము, సంగీతము, వాద్యము- నాట్యము మొదలైనవి.

తస్య కృతేన అర్థః నైవ=వానికి చేయఁబడినదానిచే ప్రయోజనము లేనేలేదు- ఇహ అకృతేన కశ్చన న=ఇచ్చట చేయఁబడనిదానిచే ఒక్కటియు లేదు- అస్య సర్వభూతేషు అర్థవ్యపాశ్రయః కశ్చిత్ న=వీనికి సమస్తభూతములయందును ప్రయోజనసాధనమైనది ఒకటియును లేదు.

ఆత్మజ్ఞానికి కర్మమును చేయుటచేత ప్రయోజనములేదు- కర్మమును చేయకపోవుటచేత ప్రత్యవాయము(తప్పు) లేదు- ఈతనికి బ్రహ్మమొదలుకొని స్థావరములవఱకునుండెడి భూతములలో నొక్కదానివలనను కార్యములేదు- కార్యమున్నయెడను గదా దానికొఱకు కర్మమునాచరింపవలయును- అని శంకరభాష్యము.

ముక్తునికి ఎల్లప్పుడును ఆత్మదర్శనము సిద్ధమగుటను ఆత్మదర్శనముకొఱకైన సాధనములను చేసినను చేయకున్నను ఏమియును ప్రయోజనములేదు- ఆత్మకంటె నితరములగు నచేతనములయందు స్వయముగానె వైముఖ్యముగలవీనికి ఆకాశాదిభూతములయందు ఒక్కటియును ప్రయోజనముగా నాశ్రయింపఁదగినది లేదు- అట్లున్నంగదా దానియందు వైముఖ్యముకలుగుటకు సాధనమును ఆచరింపవలసినది- అని రామానుజభాష్యము.

అసంప్రజ్ఞాతసమాధిలోనున్నవాఁడు దానిని విడిచి కర్మములు చేసినచో ప్రయోజనములేదు- సంధ్యావందనాదులను చేయకపోయినను ప్రత్యవాయములేదు- సమస్తభూతములయందును వీనికి ప్రయోజనమునకు ఆశ్రయము(నిమిత్తము) అయినది లేదు- అని మధ్వభాష్యము.

తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥ ౧౯

తస్మాత్ అసక్తః(సన్) కార్యం కర్మ సతతం సమాచర=అందువలన సంగములేనివాఁడవు(అగుచు) చేయవలసిన కర్మమును ఎల్లప్పుడును ఆచరింపుచుండుము. పూరుషః అసక్తః(సన్) కర్మ ఆచరన్=మనుష్యుఁడు సంగములేనివాఁడు(అగుచు) కర్మమును ఆచరింపుచున్నవాఁడై, పరమ్ ఆప్నోతి=పరమును పొందుచున్నాఁడు.

నీవు అట్టి జ్ఞానములో లేవు గాన, చేయవలసిన నిత్యకర్మమును

ఆచరింపుము- ఈశ్వరార్థమైన కర్మమును చేయుచు పురుషుఁడు మోక్షమును పొందుచున్నాఁడు- అని శంకరభాష్యము.

సాధనములు లేకయే ఆత్మదర్శనము ఎవ్వనికి కలుగునో వానికే ఆత్మదర్శనసాధనముల యక్కఱ లేదు- సాధనములం జేయఁదలంచినవానికిఁ గూడ, ఆత్మజ్ఞానగర్భమగుటను, జ్ఞానయోగికింగూడ తగుమాత్రము ఆచరింపవలసియుండుటను, కర్మయోగమే ఆత్మదర్శనము కలుగుటకు శ్రేష్ఠమైనది- కాఁబట్టి సంగములేనివాఁడవై ఆత్మప్రాప్తి కలుగువఱకును కర్మమును, చేయవలసినదియే యని, జేయుచుండుము- చెప్పఁబోయెడి అకర్తృత్వజ్ఞానముతోఁ గర్మముం జేయువాఁడు పరుని అనఁగా ఆత్మను పొందుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

అసంప్రజ్ఞాతసమాధిలోనున్నవానికి కార్యము లేదు గాన నీవు కర్మమును ఆచరింపుము- అని మధ్వభాష్యము.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః॥౧౯॥

జనకాదయః కర్మణైవ సంసిద్ధిమ్ ఆస్థితాః హి=జనకుఁడు మొదలగువారు కర్మముచేతనె సిద్ధినిపొందినవారు గదా.

జనకుఁడు అశ్వపతి మొదలగువారు జ్ఞానులైనయెడను లోకసంగ్రహముకొఱకు కర్మమును విడువకుండిరనియర్థము- జ్ఞానములేనివారైనయెడను, సత్త్వశుద్ధికొఱకు కర్మములను ఆచరించి క్రమముగా సిద్ధిని పొందిరని యర్థము- అని శంకరభాష్యము.

జ్ఞానయోగమున కధికారియైనను కర్మయోగమును ఆచరించుటయె ఆత్మదర్శనమువిషయమై శ్రేష్ఠముగాన, జ్ఞానులలో నగ్రేసరులగు జనకాదులుగూడ కర్మయోగముననె సిద్ధిని పొందిరి- అనఁగా ఆత్మనుపొందిరనుట- అని రామానుజభాష్యము.

కర్మములనాచరించెడి యాచారముకలదు- కర్మణా సహ=కర్మముతోఁగూడనె అనఁగా కర్మమునుచేయుచునె అనుట- కర్మమునుచేయుచునె జ్ఞానమునుపొంది సిద్ధినిపొందిరి. జనకాదులు జ్ఞానులగుట శాస్త్రాదులలోఁ బ్రసిద్ధము- ప్రయాగాదితీర్థములు ముక్తిసాధనములనుట పాపవిముక్తికి సాధనములనుట- లేక ఆతీర్థములస్తోత్రమైనవచనము. కాఁబట్టి అపరోక్షజ్ఞానమువలననె మోక్షము కలుగును- కర్మము దానికి సా

ధనము- అనిమధ్వభాష్యము.

లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి॥౨౦॥
యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే॥౨౧॥

లోకసంగ్రహం సంపశ్యన్నపి=లోకసంగ్రహమును చూచుచున్నను, కర్తుమేవ అర్హసి=కర్మములంజేయుటకె తగుచున్నావు- శ్రేష్ఠః యద్యత్ ఆచరతి=శ్రేష్ఠుఁడు దేనినిదేనిని ఆచరించునో, ఇతరః జనః తత్తదేవ ఆచరతి=మిగిలినజనుఁడును దానినిదానినె ఆచరించు చున్నాఁడు- సః యత్ ప్రమాణం కురుతే=అతఁడు దేనిని ప్రమాణమునుగాఁ జేయుచున్నాఁడో, లోకః తత్ అనువర్తతే=(మిగిలిన) జనుఁడు దానినె అనుసరించుచున్నాఁడు.

లోకసంగ్రహమనఁగా లోకమును అపమార్గమున ప్రవర్తింపకుం డునట్లు నివారించుట- ప్రమాణముఅనునది లౌకికంబును వైదికంబును- అని శంకరభాష్యము.

యత్ప్రమాణమ్=ఏపాటిదానినిగా అనఁగా ఏఅంగములతోఁగూడి నదానిగాఁజేయునో,తత్=అట్టిదానినిగా నెఅనఁగాఅయంగములతోఁగూ డినదానినిగా నె,సంపూర్ణజ్ఞానములేనిజనుఁడును ఆచరించుచున్నాఁడు- కాఁబట్టి లోకమును కాపాడుటకై శిష్టుఁడుగా ప్రసిద్ధుఁడయినవాఁడు వర్ణాశ్రమధర్మములనాచరించునది- లేనిచో లోకమును చెడఁగొట్టు టచేఁగలిగిన పాపము వీనిని జ్ఞానయోగమునుండిగూడ తప్పించును- అని రామానుజభాష్యము.

సః యత్ ప్రమాణం కురుతే=అతఁడు ఏవాక్యము మొదలగుదాని ని ప్రమాణమునుగాఁ జేయునో, అనిమధ్వభాష్యము.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి॥౨౨॥

(హే)పార్థ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, మే త్రిషు లోకేషు కర్తవ్యం కించన నాస్తి=నాకు మూడు లోకములయందును చేయవలసినది ఒకటియు లేదు- అనవాప్తమ్ అవాప్తవ్యం న=పొందఁబడనిదై పొందవలసినది లేదు- (అహం)చ కర్మణి వర్తేఏవ=(నేను)ను

కర్మమున నుండు నేయున్నాను- నేను(గూడ లోకసంగ్రహముకొఱకై కర్మమునాచరింపుచున్నాను- అని తాత్పర్యము.

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥ ౨౩॥

అహం జాతు కర్మణి అతన్ద్రిత(స్సన్) న వర్తేయం యది=నేను ఒకప్పుడు కర్మమున పొలుమాలికలేనివాఁడ(నై) ప్రవర్తింపకుందు నేని, (హే) పార్థ!=(ఓ)అర్జునుఁడా!, మనుష్యాః సర్వశః మమ వర్త్మ అనువర్తన్తే=మనుష్యులు అన్నిప్రకారముల నా మార్గమును అనువర్తింతురు.

ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్।
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః॥ ౨౪॥

అహం కర్మ న కుర్యాం చేత్=నేను కర్మమును చేయకుందునేని, ఇమే లోకాః ఉత్సీదేయుః=ఈ జనులు చెడుదురు- సంకరస్య కర్తా చ స్యామ్=సంకరమును చేయువాఁడనును అగుదును- ఇమాః ప్రజాః ఉపహన్యామ్=ఈ ప్రజలను చెడఁగొట్టుదును.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।
కుర్యా ద్విద్వాం స్తథా ఽ సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్॥

(హే) భారత!=(ఓ) భరతవంశమువాఁడా, కర్మణి సక్తాః అవిద్వాంసః యథా కుర్వన్తి=కర్మములయందు ఫలసంగముకల అజ్ఞానులు ఎట్లు కర్మములం జేయుదురో, విద్వాన్ అసక్తః లోకసంగ్రహం చికీర్షుః=జ్ఞాని ఫలసంగములేనివాఁడై లోకసంగ్రహమును చేయఁగోరుచున్నవాఁడై, తథా కుర్యాత్=అట్లు(అజ్ఞులయట్లు) కర్మము నాచరించునది.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినామ్।
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్॥ ౨౬॥

విద్వాన్ కర్మసఙ్గినామ్ అజ్ఞానాం బుద్ధిభేదం న జనయేత్=జ్ఞాని కర్మములయందాసక్తిగల అజ్ఞులకు బుద్ధిభేదమును పుట్టింపఁగూడదు- యుక్తః సమాచరన్=పూనికకలవాఁడై చేయుచును, సర్వకర్మాణి జోషయేత్=అన్నికర్మములను ఆచరింపఁజేయవలయును.

బుద్ధిభేదమనఁగా ఈకర్మమునాచరించి దీనిఫలము ననుభవింపవలయునను నిశ్చయమును చలింపఁజేయుట- అనిశంకరభాష్యము.

అజ్ఞులనఁగా ఆత్మజ్ఞానము సంపూర్ణముగా లేనివారై జ్ఞానయోగమును అవలంబింపలేక మోక్షమునె కోరి కర్మములంజేయువారు-బుద్ధిభేదమనఁగా ఆత్మావలోకనమునకు కర్మయోగముకన్న వేఱుసాధనమున్నదను బుద్ధిని పుట్టించుట- ఆత్మజ్ఞానము సంపూర్ణముగాఁగలిగి తాను జ్ఞానయోగాధికారియైనను జ్ఞానయోగాపేక్ష లేకయె కర్మయోగము ఆత్మావలోకనసాధన మగునను బుద్ధితో(యుక్తః)కూడుకొనినవాఁడై కర్మమునె ఆచరింపుచు,కర్మములంజేయువారికి అన్నికర్మములయందును (జోషయేత్)ప్రీతిని పుట్టింపవలయును- అని రామానుజభాష్యము.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే॥౨౭॥

సర్వశః ప్రకృతేః గుణైః క్రియమాణాని కర్మాణి(ప్ర)=అన్నిప్రకారములను ప్రకృతియొక్క గుణములచేత చేయఁబడుచున్న కర్మములంగూర్చి, అహంకారవిమూఢాత్మా అహం కర్తా ఇతి మన్యతే=అహంకారముచే మోహమునుపొందిన యంతఃకరణముకలవాఁడు నేను కర్తను అని తలంచుచున్నాఁడు.

మధుసూదనటీకలో, కర్మాణి కర్తా అహమ్=కర్మములను చేయువాఁడను నేను- అనియన్వయము- కర్తృశబ్దము తృన్నంతము- అనివ్రాయఁబడినది.

ప్రకృతియనఁగా సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థారూపమైన ప్రధానతత్త్వము- దానిగుణములనఁగా కార్యకరణరూపములగు వికారములు- కర్మములనఁగా లౌకికములును శాస్త్రీయములును- అహంకారమనఁగా కార్యకారణ సముదాయమందు అహమ్(నేను)అనెడిజ్ఞానము- అదికలవాఁడు అజ్ఞానముచేత కర్మములు ఆత్మవని తలంపుచు ఆయాకర్మములకు నేను కర్తను అని తలంపుచున్నాఁడు- అని శంకరభాష్యము

ప్రకృతియొక్క గుణములనఁగా సత్త్వరజస్తమోగుణములు- అహం

కార మనఁగా అహమ్( నేను )శబ్దముచే చెప్పఁబడిన ప్రకృతియందు అహమ్( నేను )అనెడి యభిమానము( దేహాత్మాభిమానము )- దానిచేత ఆత్మస్వరూపము నెఱుఁగనివాఁడై గుణకర్మములవిషయమున నేనె కర్తననుకొనుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

ప్రకృతినిపట్టి గుణభూతములు( అప్రధానములు )ను, ప్రకృతిసంబంధులనగు ఇంద్రియములు గుణములు- ప్రతిబింబమునకు కర్తృత్వము లేదుగదా- అని మధ్వభాష్యము.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః।
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా నసజ్జతే॥౨౮॥

( హే )మహాబాహో!=( ఓ )గొప్పభుజములుకలవాఁడా!, గుణకర్మవిభాగయోః తత్త్వవిత్తు=గుణములనుఏర్పఱుచుటయందునుకర్మములనుఏర్పఱుచుటయందును తత్త్వమునెఱింగినవాఁడో, గుణాః గుణేషు వర్తన్తే=గుణములు గుణములయందు ప్రవర్తించుచున్నవి, ఇతి మత్వా నసజ్జతే=అని తలంచి సంగమునుపొందఁడు.

గుణములు గుణములయందు అనఁగా ఇంద్రియములు విషయములయందు అనుట- ఆత్మ, విషయములయందు ప్రవర్తింపదని తలంచి యనుట- అనిశంకరభాష్యము.

గుణములనఁగా సత్త్వాదులు- కర్మములనఁగా వానివానిపనులు- గుణములు గుణములయందు అనఁగా సత్త్వాదిగుణములు వానికార్యములయందు అనుట నసజ్జతే=గుణములకర్మములయందు నేనుకర్తను అనితలంపఁడు- అనిరామానుజభాష్యము.

కర్మభేదగుణభేదముల తత్త్వమునెఱింగినవాఁడు-గుణములుగుణములయందు అనఁగా ఇంద్రియాదులు విషయములయందు అనుట- అనిమధ్వభాష్యము.

ప్రకృతేర్గుణసంమూఢాః సజ్జన్తే గుణకర్మసు।
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్నవిచాలయేత్॥౨౯॥

ప్రకృతేః గుణసంమూఢాః=ప్రకృతియొక్క గుణములచేత మోహమునుపొందినవారు, గుణకర్మసు సజ్జన్తే=గుణములకర్మములయందు తగులుకొనుచున్నారు- అకృత్స్నవిదః తాన్ మన్దాన్=సంపూర్ణముగా

తెలియఁగని ఆ మూఢులను, కృత్స్నవిత్ నవిచాలయేత్ = సంపూర్ణము గా నెఱింగినవాఁడు కదల్పఁగూడదు.

కర్మములయందు తగులుకొనుటయనఁగా మేముఫలముకొఱకుకర్మములం జేయుచున్నామనుకొనుట- కృత్స్నవిత్తు అనఁగా ఆత్మజ్ఞానముకలవాఁడు- కదలించుటయనఁగా బుద్ధిభేదమును (౨౬॥ శ్లో॥) పుట్టించుట- అనిశంకరభాష్యము.

సంపూర్ణజ్ఞానములేనివారు ఆత్మావలోకనమునకై ప్రవర్తించిన ప్రకృతిసంసర్గముకలవారగుటచే ప్రకృతిగుణములచేత ఆత్మస్వరూపమున మోహమును పొందినవారై క్రియలయందె ఆసక్తులగుదురు- ప్రకృతికంటె విలక్షణముగానుండెడి యాత్మస్వరూపమున తగులుకొనరు- ఇందువలన జ్ఞానయోగమునకు సమర్థులు కారుగాన వారికి కర్మయోగమనందె యధికారము- ఇట్టివారిని సంపూర్ణజ్ఞానముకలవాడు, తాను జ్ఞానయోగమునె ఆచరించుటచేతఁ జెడఁగొట్టఁగూడదు- కర్మయోగమును విడిచిన యాతనిం జూచి ఆ మందులుగూడ కర్మయోగమున నిలుకడలేని మనస్సుకలవారగుదురు. కాఁబట్టి శ్రేష్ఠుఁడైనవాఁడును స్వయముగా కర్మయోగమునె ఆచరింపుచు ఆత్మయాథాత్మ్యజ్ఞానముచే, ఆత్మకర్తకాఁడు, అనితలఁచుచున్నవాఁడై ఆత్మావలోకనమునకు కర్మయోగమె ఇతరాపేక్షలేని సాధనమనిచూపుచు అమందులకు కర్మయోగమున ప్రీతిని పుట్టింపవలయును- అనఁగా జ్ఞానియు లోకసంగ్రహమునకై కర్మయోగమునాచరింపవలయుననుట- గుణములయందు కర్తృత్వమును తలంచుటయనఁగా ఈకర్తృత్వము ఆత్మకు స్వరూపముంబట్టి వచ్చినది కాదు- మఱియేమన్నను గుణసంపర్కమువలన వచ్చినది అని తలఁచుట- అనిరామానుజభాష్యము.

ప్రకృతియొక్క గుణములగుఇంద్రియాదులయందు మూఢుఁడై- ఇంద్రియాద్యభిమానమువలనఁగదా విషయాదిప్రసంగము కలుగుచున్నది- గుణకర్మసు = విషయములయందును కర్మములయందును - అని మధ్వభాష్యము.

మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వవిగతజ్వరః॥ ౩౦॥

మయి సర్వాణి కర్మాణి సంన్యస్య=నాయందు అన్నికర్మములను ఉనిచి, అధ్యాత్మచేతసా=ఆత్మయందలిమనస్సుతోఁ(గూడినవాఁడవై), నిరాశీః నిర్మమః భూత్వా=ఆశలేనివాఁడవును మమకారములేని వాఁడవును అయి, విగతజ్వరః (సన్) యుధ్యస్వ=పరితాపములేనివాఁడ(వగుచు) యుద్ధమును చేయుము.

జ్ఞానములేనివాఁడై మోక్షేచ్ఛకలవాఁడు కర్మముల నాచరింపవలసినప్రకారము చెప్పఁబడుచున్నది- అధ్యాత్మచేతస్సుఅనఁగా కర్తనైన నేను ఈశ్వరునికై భృత్యునివలెకర్మములంజేయుచున్నాను అనెడి వివేకబుద్ధి- జ్వరమనఁగా దుఃఖము- అని శంకరభాష్యము.

అధ్యాత్మచేతస్సుఅనఁగా శ్రుతులవలనఁగలిగిన ఆత్మస్వరూపవిషయమైన జ్ఞానము- అనఁగా తాను భగవంతునికి శరీరమనియు భగవంతునిచే ప్రవర్తింపఁబడువాఁడనియు తలంచుట- అందఱకును ఈశ్వరుఁడు(నియమించువాఁడు)ను శేషియు(పలినవాఁడును)నగు పరమపురుషుఁడే తనవాఁడగుఆత్మచేత తనఉపకరణముల(సాధనసామగ్రి)చేత తన యారాధనముకొఱకు స్వయముగానె తనకర్మములను చేయించికొనుచున్నాఁడు, అనితలంచి మమకారాదులులేనివాఁడవై, పూర్వము అనాదికాలమునుండి సంపాదింపఁబడినపాపసమూహముతో నేనెట్లు ఉండగలను అనెడి అంతర్జ్వరములేనివాఁడవై, పరమపురుషుఁడే కర్మములచే నారాధింపఁబడి సంసారబంధమునుండివిడిపించునని తలంచి సుఖముగా కర్మయోగమునె చేయుము- అని రామానుజభాష్యము.

భ్రాంతిచే జీవునియందారోపింపఁబడిన కర్మములను భగవంతునియందు విడిచి, అనఁగా భగవంతుఁడె అన్నికర్మములంజేయుచున్నాఁడనితలంచి- ఈకర్మములన్నియు భగవంతుని పూజయనియుతలంచి- అధ్యాత్మచేతస్సు అనఁగా పరమాత్మనుపట్టిన మనస్సు- అనిమధ్వభాష్యము.

యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః।
శ్రద్ధావన్తో ఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః॥౩౧॥

యే మానవాః మే ఇదంమతమ్=ఏ మనుష్యులు నాయొక్క ఈ మతమును, శ్రద్ధావన్తః అనసూయన్తః నిత్యమ్ అనుతిష్ఠన్తి=శ్రద్ధగలవారును అసూయలేనివారునై ఎల్లప్పుడును ఆచరింపుచుందురో, తే

ఽపి కర్మభిః ముచ్యన్తే=వారును కర్మములచేత విడువఁబడుదురు.

పరమగురువును వాసుదేవుఁడునగు నాయందు అసూయచేయకున్న వారై- కర్మణములనఁగా పుణ్యపాపములు- అని శంకరభాష్యము.

ఇదియె శాస్త్రతాత్పర్యమని తలంచి నామతమును ఆచరించువారును, ఆచరింపలేకపోయినను శ్రద్ధకలవారును, శ్రద్ధ లేకపోయినను ఇది శాస్త్రతాత్పర్యముకాదనెడి యసూయలేనివారును, వీరందఱును బంధమునకు హేతువులై అనాదికాలమునుండియున్న కర్మములచే విడువఁబడుదురు- తేఽపి=వారుగూడ అనెడియపిశబ్దమునకు, ఇప్పుడు ఆచరింపకపోయినను, శ్రద్ధకలవారును అసూయలేనివారును శ్రద్ధానసూయలచే పాపక్షయమును పొందినవారై శీఘ్రకాలముననె దీనిననుష్ఠించి ముక్తులగుదురు, అనితాత్పర్యము. అని రామానుజభాష్యము.

ఇట్లు నివృత్తకర్మాచరణము చేయువారుఁగూడ జ్ఞానద్వారమున ముక్తిని పొందెదరు- ఇఁక అపరోక్షజ్ఞానులంగూర్చి చెప్పవలసినదేమి?- అనిమధ్వభాష్యము.

యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్।
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః॥౩౨॥

యేతు ఏతత్ మే మతమ్ అభ్యసూయన్తః నానుతిష్ఠన్తి=ఎవ్వరైతే ఈ నా మతమును అసూయచేయుచున్నవారై ఆచరింపరో, తాన్ సర్వజ్ఞానవిమూఢాన్, నష్టాన్ అచేతసః విద్ధి=వారిని అన్నిజ్ఞానములయందును మూఢులనుగానును చెడినవారినిగానును చిత్తములేనివారినిగానును తెలిసికొనుము.

అసూయచేయుటయనఁగా నిందించుట- అన్నిజ్ఞానములయందును అనేకవిధములుగా మూఢులయినవారు- అచేతస్సులనఁగా అవివేకులు, అని శంకరభాష్యము.

ఆత్మలందఱును నాకు శరీరమగుటను నేను ఆధారముగాఁగల వారు, నాకు శేషభూతులు(పలుబడి)అయినవారు, నాచేతనే ప్రవర్తించువారు, అనుతలంపుతో అన్నికర్మములను ఎవ్వరు చేయరో, ఎవ్వరుశ్రద్ధ చేయరో, ఎవ్వరు అసూయ చేతురో, వారిని అన్నిజ్ఞానములయందును విశేషముగా మూఢులమున వారినిగానును, కావుననె చెడినవారినిగానును, చే

తన్ను(వ: నన్ను)నకు కార్యమైన వస్తుతత్త్వజ్ఞానము లేకపోవుటచే చేతన్నులేనివారినిగానును, అనఁగా విపరీతజ్ఞానముకలవారినిగానను తెలిసికొనుము- అని రామానుజభాష్యము.

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కింకరిష్యతి॥33॥

జ్ఞానవానపి స్వస్యాః ప్రకృతేః సదృశం చేష్టతే=జ్ఞానముకలవాఁడైనను తనదగు ప్రకృతికి తగినట్లు పనిచేయును- భూతాని ప్రకృతిం యాన్తి=ప్రాణులు ప్రకృతిని అనుసరింపుచున్నవి- నిగ్రహః కిం కరిష్యతి=నిగ్రహము ఏమి చేయఁగలదు?.

ప్రకృతియనఁగా ప్రకృతజన్మాదులయందు బయలుపడిన పూర్వజన్మసంబంధులగు ధర్మాధర్మములసంస్కారము(వాసన)- అని శంకరభాష్యము.

జ్ఞానవంతుఁడనఁగా, ఆత్మస్వరూపము ప్రకృతికంటె విలక్షణమైనది, అదియె యెల్లప్పుడును అనుసంధానము చేయఁదగినదని శాస్త్రములు చెప్పుచున్నవి, అనియెడి జ్ఞానముకలవాఁడు- ప్రకృతియనఁగా ప్రాచీన(ప్రాఁత)వాసన- దానిననుసరించెడి జంతువులను శాస్త్రముచే చేయఁబడిన నిగ్రహము ఏమిచేయఁగలదు- అని రామానుజభాష్యము.

ప్రకృతియనఁగాఁ బూర్వసంస్కారము- అనిమధ్వభాష్యము.

ఇన్ద్రియ స్యేన్ద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపన్థినౌ॥34॥

ఇన్ద్రియస్య ఇన్ద్రియస్య అర్థే=ఇంద్రియము ఇంద్రియము (అన్నిఇంద్రియముల) యొక్క విషయమున, రాగద్వేషౌ వ్యవస్థితౌ=రాగద్వేషములు ఏర్పడియున్నవి-తయోః వశం నాగచ్ఛేత్=వానికి లొంగుబాటును పొందఁగూడదు- తౌ అస్య పరిపన్థినౌహి=అవి వీనికి విఘ్నముచేయునవిగదా.

శాస్త్రముచొప్పున ప్రవర్తించువాఁడు మునుపటివలె రాగద్వేషములకధీనుఁడు కాఁగూడదు- పురుషునియొక్క ప్రకృతి రాగద్వేషానుసారముగానె యుండును- అది పురుషుని ప్రవర్తింపఁజేయునేని యప్పుడు తనధర్మమును విడుచుటయు ఇతరధర్మములను ఆచరించుటయు కలుగు

ము- పురుషుండు రాగద్వేషములను అడఁచికొనినప్పుడు శాస్త్రదృష్టికలవాఁడై యగునుగాని ప్రకృతివశుఁడు కాఁడు- కాఁబట్టి శాస్త్రము నిరర్థకము కాదు- అని శంకరభాష్యము.

శ్రోత్రము మొదలగుజ్ఞానేంద్రియములకు విషయంబులగు శబ్దాదులయందును వాక్కు మొదలగు కర్మేంద్రియములకు విషయములగు వచనము(మాట) మొదలగు వానియందును, వానిని అనుభవింపఁగోరుటయనెడి రాగము పూర్వానుభవవలనఁ గలిగినదై తప్పక యుండును- ఆయనుభవము అడ్డగింపఁబడెనేని తప్పక ద్వేషము కలిగియుండును- ఈ రాగద్వేషములు, జ్ఞానయోగమునకు ప్రయత్నము చేయుచుండుటను అన్ని యింద్రియములను నియమించుచున్న పురుషుని, లాఁగదీసికొని, తమకార్యములయందు చేర్చును. అందువలన వాఁడు ఆత్మస్వరూపానుభవమునకు విముఖుఁడై చెడును- కాఁబట్టి జ్ఞానయోగమును ఆరంభించి రాగద్వేషములకు అధీనుఁడై చెడఁగూడదు- రాగద్వేషములు వీనికి జయింపరాని శత్రువులుగదా- అవి జ్ఞానాభ్యాసమును నివారించును- అని రామానుజభాష్యము.

వెనుకటిశ్లోకములో చెప్పినట్లైనను తనశక్తి కొలది నిగ్రహమును చేయవలసినదియె- నిగ్రహమువలన అప్పటికి ప్రయోజనము లేకపోయినను మిక్కిలి ప్రయత్నము చేయుటవలన ప్రయోజనము కలుగును- అని మధ్వభాష్యము.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥3౫॥

స్వనుష్ఠితాత్ పరధర్మాదపి = లెస్సగానాచరింపఁబడిన ఇతరుల ధర్మముకంటెను, విగుణః స్వధర్మః శ్రేయాన్ = గుణములేనిదైనను తనధర్మము ప్రశస్తమైనది - స్వధర్మే (స్థితస్య) నిధన(మపి) శ్రేయః = తనధర్మమున(నున్నవానికి) మరణ(మైనను) మేలు- పరధర్మః భయావహః = ఇతరధర్మము భయమును కలుగఁజేయునవి.

రాగద్వేషములచే ప్రేరితుండగువాఁడు ఇతరధర్మముఁగూడ ధర్మమె కాన యాచరింపవలసినదియె యని తలంచును- అది యుక్తము కాదు- భయ మనఁగా నరకము మొదలగునది- అని శంకరభాష్యము.

ప్రకృతిసంబంధము కలవానికి ఆచరింపశక్యముకానిదగుటచే జ్ఞాన

యోగముపరధర్మము- శక్యమగుటచే కర్మయోగము స్వధర్మము- మేలైనది అనఁగా ప్రమాదము లేనిదనుట- కర్మయోగమునను న్నవాఁడు ఒక్కజన్మమున ఫలమును పొందక మృతిఁబొందినను మేలే- విఘ్నములచే బాధింపఁబడకపోవుటను- రెండవజన్మమందైనను కలతలేని కర్మయోగము సంభవించును- జ్ఞానయోగము ప్రమాదగర్భమగుటను భయావహమె- అని రామానుజభాష్యము.

యుద్ధము రాగాదులతోఁగూడినదైనను ఆచరింపవలసినదియె- అని మధ్వభాష్యము.

అర్జున ఉవాచ.

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥ ౩౬॥

(హే) వార్ష్ణేయ!=(ఓ) వృష్ణివంశమువాఁడా!, అథ=ఇఁకను, అయమ్ పూరుషః అనిచ్ఛన్నపి=ఈ పురుషుఁడు కోరకున్నవాఁడైనను, కేన ప్రయుక్తః=దేనిచేత ప్రేరణచేయఁబడినవాఁడై, బలాత్ నియోజితఇవ పాపం చరతి?=బలాత్కారముగా నియోగింపఁబడినవానివలె పాపమును చేయుచున్నాఁడు?.

ఈపురుషుఁడు అనఁగా జ్ఞానయోగమునకై ప్రవర్తించువాఁడు- పాపము అనఁగా విషయానుభవము- అని రామానుజభాష్యము.

అథ అనునది అర్థాంతరము (మఱియొక్క విషయము) అని తెలియఁజేయును. కర్మమునకు కారణములైనవి క్రోధము మొదలగునవియు కామమున నెడి యనేకములు కలవు- వానిలో నేది బలవత్తైనది?- అని మధ్వభాష్యము.

శ్రీభగవానువాచ.

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥ ౩౭॥

ఏషః రజోగుణసముద్భవః కామః=ఇది (నీవడిగిన హేతువు) రజస్సనెడిగుణమువలనపుట్టెడి కామము- ఏషః క్రోధః=ఇది(యె) క్రోధము- ఒక్క వస్తువును తాను కోరఁగా దానికి మఱియొవ్వఁడైనను అడ్డముచేసి

నయెడను అప్పుడె కోపముగలుగునుగాన ఇదియె క్రోధమని చెప్పఁబడు చున్నది- (ఏషః) మహాశనః=(ఇది) మిక్కిలితిండికలది- (ఏషః) మహాపాప్మా=(ఇది) మిక్కిలిపాపము- ఇహ ఏనమ్ వైరిణమ్ విద్ధి =ఇచ్చట దీనిని శత్రువునుగా ఎఱుంగుము.

కామము(కోరిక) అందఱిని స్వాధీనముచేసికొనుచున్న శత్రువు- అన్నియనర్థంబులుఁగలుగుట దీనింబట్టియె- ఈకామము మఱియొకని దానిచే నడ్డగింపఁబడినదై క్రోధరూపముగాఁబరిణమించుచున్నది- ఇది రజోగుణమువలనఁబుట్టునదియు రజోగుణమును పుట్టించునదియు- ప్రాణులు కామముచే ప్రేరణచేయఁబడియె పాపములంజేయుదురు గాన ఇది మహాపాప్మ యనఁబడుచున్నది- కాఁబట్టి ఈసంసారమున ఈకామమును శత్రువునుగా నెఱుంగుము- అని శంకరభాష్యము.

సత్త్వరజస్తమోగుణమయమైన ప్రకృతితో కలిసియున్నవాఁడై జ్ఞానయోగమును ఆరంభించినవానికి, పూర్వపువాసనవలనఁగలిగిన శబ్దాదివిషయములంగూర్చిన కామము ఈతనిని విషయములకై లాగుచున్నది- ఈకామమె అడ్డగింపఁబడినదై అడ్డగించిన చేతనులయందు క్రోధరూపముగాఁబరిణమించి ఇతరులను హింసించుటమొదలగు గొప్ప పాపకార్యములం బ్రవర్తింపఁజేయును- రజోగుణమువలనఁబుట్టిన ఈకామమును జ్ఞానయోగమునకు సహజశత్రువునుగా తెలిసికొనుము- అని రామానుజభాష్యము.

కర్మములం బ్రవర్తింపఁజేయువానిలోఁ బ్రబలమైనది ఈకామమె- దీనివలనఁబుట్టునదిగాన క్రోధంబును ఇదియె- గురువులను నిందించుట మొదలగుదానివలనఁగలిగిన క్రోధముఁగూడ, తనకు గురువులుమొదలగు వారియందుండెడి భక్తివలన, వారిని నిందింపకుండుటను కోరుటచేఁ గలిగినదియె- కామమునకు భోగ్యము (అనుభవింపఁబడఁదగినది) మిక్కిలిగాఁగలదగాన మహాశనమనఁబడును- బ్రహ్మహత్యమొదలగు గొప్ప పాపములకు కారణముగాన మహాపాప్మయనఁబడును- అన్నిపురుషార్థములకును విరోధియగు టను వైరియనఁబడును- అని మధ్వభాష్యము.

ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్॥ ౩౮॥

యథా ధూమేన వహ్నిః ఆవ్రియతే=ఎట్లు పొగచేత నిప్పు ఆవరింపఁబడుచున్నదో, యథా ఆదర్శః మలేన (ఆవ్రియతే)=ఎట్లు అద్దంబును మురికిచేత (ఆవరింపఁబడుచున్నదో), యథా గర్భః ఉల్బేన* ఆవృతః=ఎట్లు గర్భము మావిచేత ఆవరింపఁబడినదో- తథా తేన ఇదమ్ ఆవృతమ్=అట్లు దానిచేత ఇది ఆవరింపఁబడినది.

కామము శత్రువగుటకు దృష్టాంతములు చూపఁబడుచున్నవి- ఇది యనఁగా జ్ఞానము- అని శంకరభాష్యము.

ఇది యనఁగా ప్రాణిసమూహము- అని రామానుజభాష్యము.

ప్రకాశరూపమైనను అగ్ని పొగచేత కప్పఁబడినదై ఇతరులచేతను ఎట్లు చూడఁబడదో అట్లు పరమాత్మ మన కామముచేత ఆవరింపఁబడినవాఁడై చూడఁబడఁడు- మకిలగ్రమ్మిన యద్దమున ముఖము మొదలగునవి ఎట్లు తెలియఁబడవో అట్లు కామముచే నావరింపఁబడిన యంతఃకరణము జీవేశ్వరాదులయభివ్యక్తికి పనికి రాదు- ఉల్బముచేత ఆవరింపఁబడిన గర్భము ఎట్లు తనపనినిచేయఁజాలదో అట్లుదీనిచేత నావరింపఁబడిన జీవుఁడు ఈశ్వరాదులను తెలిసికొనఁజాలఁడు అని మధ్వభాష్యము.

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ॥౩౯॥

(హే)కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, నిత్యవైరిణా కామరూపేణ దుష్పూరేణ అనలేన చ ఏతేన=నిత్యము శాశ్వతుృవైనదియు కోరికస్వరూపము గాఁగలదియు నింపశక్యముకానిదియు తృప్తిలేనిదియునగు దీనిచేతను, జ్ఞానినః జ్ఞానమ్ ఆవృతమ్=జ్ఞానముకలవాని జ్ఞానము ఆవరింపఁబడినది.

జ్ఞానినః నిత్యవైరిణా=జ్ఞానముకలవానికి నిత్యము శత్రువైన-జ్ఞానముకలవాఁడె దీనిచేత నేను అనర్థములోఁబడితి ననుకొననుగాన ఇది జ్ఞానము కలవానికె శత్రువు. గాని మూర్ఖునికి కాదు- జ్ఞానము కలవాఁడు ఆశ పుట్టినప్పుడు కామమును ఇష్టమైనదానిగా నాలో

* ఉత్తరంబా ఉల్బాజ్జరాయుః అనేశ్రుతివలన గర్భమునంటుండెడి శిశువుపైనుండునది ఉల్బము- దానిపైనుండెడిది జరాయువు- ఇట్లయినను నిఘంటువులలో ఉల్బజరాయుశబ్దములు పర్యాయములుగాఁగూడవ్యవహరింపఁబడుచున్నది- కలలోజరాయురుల్బః అని రత్నకోశము.

చినను. దానివలన దుఃఖమువచ్చినప్పుడు ఆశచేత నేనిట్లు దుఃఖమును పొందుచున్నానని తెలిసికొనునుగాన ఇది జ్ఞానికి శత్రువు- మూర్ఖునికి కాదు- అనలము అనఁగా అలమ్=చాలును అనునది లేనిది- అని శంకరభాష్యము.

జ్ఞానమే స్వభావముగాఁ గలవాఁడైనను ఈజీవునియొక్క జ్ఞానము దీనిచే నావరింపఁబడినది- దుష్పూరమనఁగా పొందశక్యము కాని విషయములు కలది- అని రామానుజభాష్యము.

శాస్త్రమువలన జ్ఞానము కలిగినను కామముచే నావరింపఁబడినచో పరమాత్మపరోక్షత్వమునకై (పరమాత్మ సాక్షాత్కారమనకై) ప్రకాశింపదు- విశేషముగ జ్ఞానముకలవానికే ఇట్లుండ కొంచెము జ్ఞానము కలవాని విషయమున చెప్పవలసినదేమి? కామరూపమనఁగా కామమను పేరుగలదియనుట- దుఃఖముచేతఁగదా కామము పూరింపఁబడుచున్నది- కాఁబట్టి దుష్పూరమనఁబడుచున్నది- ఇంద్రాదిపదము సుఖముచే దొరకదుగదా. ఇంద్రాదిపదముదొరకినను బ్రహ్మాదిపదము కోరఁబడునుగాని అలమ్=చాలును అనెడి బుద్ధి కలుగదుగాన కామము అనలమనఁబడుచున్నది- అనిమధ్వభాష్యము.

ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే।
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్॥౪౦॥

అస్య అధిష్ఠానమ్=దీనికి అధిష్ఠానము, ఇన్ద్రియాణి మనః బుద్ధిః (ఇతి) ఉచ్యతే=ఇంద్రియములును మనస్సును బుద్ధియును (అని) చెప్పఁబడుచున్నది- ఏతైః జ్ఞానమ్ ఆవృత్య=వీనిచేత జ్ఞానమును ఆవరించి, దేహినమ్ విమోహయతి=ఆత్మను మోహింపఁజేయుచున్నది.

అధిష్ఠానమనఁగా ఆశ్రయము- శత్రువుయొక్క పట్టు తెలిసినచో సుఖముగా శత్రువును జయింపవచ్చునుగాన అది ఈశ్లోకమున చెప్పఁబడుచున్నది- అని శంకరభాష్యము.

ఈ కామము ఇంద్రియము మొదలగువానిని ఉపకరణములను (సాధనములను) గాఁ జేసికొని ఆత్మను ఆశ్రయించి యుండునుగాన ఆ యింద్రియాదులు ఈ కామమునకు అధిష్ఠానమనఁబడును- మోహింపఁజేయుటయనఁగా ఆత్మజ్ఞానమున వైముఖ్యంబునను విషయానుభవమున ఆ

సక్తినివిపుట్టించుట- అని రామానుజభాష్యము.

బుద్ధిమొదలగునవి విషయములను పొందినయెడనుగదా జ్ఞానము ఆవరింపఁబడును- అధిష్ఠానము హరింపఁబడినతోడనె శత్రువు నశించును గదా. అనిమధ్వభాష్యము.

తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥౪౧॥

(హే)భరతర్షభ!=(ఓ)భరతవంశమువారిలో శ్రేష్ఠుఁడా!; తస్మాత్ త్వమ్ ఆదౌ ఇన్ద్రియాణి నియమ్య=ఆహేతువువలన నీవు మొదటను ఇంద్రియములను నియమించి, జ్ఞానవిజ్ఞాననాశనమ్ పాప్మానమ్ ఏనమ్ ప్రజహి=జ్ఞానవిజ్ఞానములను నశింపఁజేసెడి పాపస్వరూపమైన దీనిని నశింపఁజేయుము- హి అనునది పాదపూరణము. హి=స్ఫుటముగా అని మధుసూదనటీకలో అర్థము చేయఁబడినది. ‡

పాపమనఁగా కామము- జ్ఞానమనఁగా శాస్త్రములవలనను ఆచార్యునివలనను ఆత్మ మొదలగువానిఁ దెలిసికొనుట- విజ్ఞానమనఁగా విశేషముగా దానిననుభవించుట- ఈరెండును మేలును పొందుటకు సాధనములైనవి- అనిశంకరభాష్యము.

సమస్తేంద్రియవ్యాపారములను ఉడుగుట స్వరూపముగాఁగల జ్ఞానయోగమునఁ బ్రవర్తించినవానికి, ఈ కామ మనెడి శత్రువు, విషయములయందు ఆభిముఖ్యమును కలుగఁజేసి ఆత్మయందు వైముఖ్యమును కలుగఁజేయునుగాన, ప్రకృతిసంసర్గము కలిగియుండుటచేత ఇంద్రియవ్యాపారములయందే ఆసక్తి కల నీవు, మొదటను అనఁగా మోక్షోపాయమును మొదలువెట్టినప్పుడు ఇంద్రియవ్యాపారరూపమగు కర్మయోగమునను ఇంద్రియములను నియమించి, ఈ కామమును నశింపఁజేయుము- జ్ఞానమనఁగా ఆత్మస్వరూపమును తెలిసికొనుట- విజ్ఞానమనఁగా ఆత్మ దేహముకంటె వేఱు అని యెఱుంగుట- అని రామానుజభాష్యము.

---

‡ మనదేశపు శంకరభాష్యపుస్తకములో ప్రజహిహి=పరిత్యజ అని పాఠమున్నది. బొంబాయిలో అచ్చుపడినపుస్తకములో ప్రజహి పరిత్యజ హి యస్మాత్ - అని యున్నది- రామానుజభాష్యమధ్వభాష్యములకు ప్రజహి, హి, అని రెండు పదములనియే తాత్పర్యము- మధుసూదనటీకలో ఏకపదముగానున్ను, రెండు పదములుగానున్ను గూడ వ్యాఖ్యానము చేయఁబడినది.

ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః॥౪౨॥

ఇన్ద్రియాణి పరాణి ఆహుః=ఇంద్రియములను ఉత్కృష్టములనుగా చెప్పుచున్నారు- ఇన్ద్రియేభ్యః మనః పరమ్=ఇంద్రియములకంటె మనస్సు ఉత్కృష్టము- మనసఃతు పరా బుద్ధిః=మనస్సుకన్నను ఉత్కృష్టమైనది బుద్ధి- బుద్ధేఃతు పరతః యః, సః (పరమాత్మ)=బుద్ధికంటెను పైని ఎవ్వఁడో, వాఁడు (పరమాత్మ)- బుద్ధియనఁగా అధ్యవసాయము- అనఁగా నిశ్చయజ్ఞానము.

ఎవ్వఁడు బుద్ధివఱకునుండెడి దృశ్య(తెలియఁబడెడి)పదార్థములకు లోనివాఁడో, దేహవంతుఁడైన ఎవ్వనిని ఇంద్రియాదులనాశ్రయించియున్న కామము జ్ఞానమును ఆవరించి మోహింపఁజేయునని చెప్పఁబడినదో, అతఁడె తెలిసికొనెడి పరమాత్మ- అనిశంకరభాష్యము.

పరశబ్దమునకు జ్ఞానముతో విరోధించుటయందు ప్రధానము అనియర్థము- ఇంద్రియములు విషయవ్యాపారమునందున్నచో ఆత్మజ్ఞానము ప్రవర్తింపదు- ఇంద్రియములుడిగినను మనస్సు విషయాసక్తమైనచో ఆత్మజ్ఞానము కలుగదు- మనస్సు మిగిలిన ప్రవృత్తులు లేనిదైనను విరుద్ధమైన నిశ్చయము కలిగెనేని జ్ఞానము ప్రవర్తింపదు- ఇన్నియునుడిగినను కోరికె యుండెనేని అది ఇంద్రియాదులనన్నిటిని తనవిషయమున నడిపించి ఆత్మజ్ఞానమును నిరోధించును- కాఁబట్టి యో బుద్ధేః పరతస్తు సః అని చెప్పఁబడుచున్నది- అనఁగా బుద్ధికంటె పైని ఏది కలదో అది కామమె అని యర్థము- అనిరామానుజభాష్యము.

శత్రువును చంపుటకు ఆయుధమువంటిదైన జ్ఞానమును చెప్పుటకు ఈ శ్లోకములో జ్ఞేయము (తెలియఁబడవలసినది) చెప్పఁబడుచున్నది- శరీరముకంటె ఇంద్రియములు ఉత్కృష్టములు- బుద్ధికంటెను ఉత్కృష్టుఁడు ఎవ్వఁడో వాఁడె తెలియఁబడవలసినవాఁడు- వాఁడు ఈశ్వరుఁడు-వాఁడు బుద్ధికంటెనే కాదు- అవ్యక్తము(ప్రకృతి)కంటెను ఉత్కృష్టుఁడుగా తెలియఁబడవలసినవాఁడు- అనిమధ్వభాష్యము.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥౪౩॥

(హే)మహాబాహో!=(ఓ)గొప్పభుజములుకలవాఁడా!, ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా=ఇట్లు బుద్ధికంటెను ఉత్కృష్టమైనదానిని తెలిసికొని, ఆత్మనా ఆత్మానమ్ సంస్తభ్య=ఆత్మచేతను ఆత్మను నిలిపి, దురాసదమ్ కామరూపమ్ శత్రుమ్ జహి=దుఃఖముచేఁబొందఁదగిన కామస్వరూపమైన శత్రువును నశింపఁజేయుము.

బుద్ధికంటె పరుఁడైన ఆత్మను తెలిసికొని ఆయాత్మచేతనె మనసును నిలిపి తెలియశక్యముగాని అనేకవిశేషములుగల ఈకామమును చంపుము- అనిశంకరభాష్యము.

. కామమును బుద్ధికంటెను ఉత్కృష్టమైన జ్ఞానయోగవిరోధినిగాఁ దెలిసికొని (ఆత్మనా=)బుద్ధిచేత మనస్సును కర్మయోగమున నిలిపి ఈకామమనెడి శత్రువును నశింపఁజేయుము - అని రామానుజభాష్యము

బుద్ధిమొదలగువానికంటె నుత్కృష్టుఁడైన హరిని తెలిసికొని- ఆత్మానమ్=మనస్సును- ఆత్మనా=బుద్ధిచేతను- అనిమధ్వభాష్యము.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబునగు భగవద్గీతలలో కర్మయోగప్రతిపాదకంబగు మూడవయధ్యాయము.

## నాలుగవయధ్యాయము.

శ్రీభగవానువాచ.

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్।
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ ౧॥
ఏవం పరంపరాప్రాప్త మిదం రాజర్షయో విదుః।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప॥ ౨॥
స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః॥
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్॥ ౩॥

అహమ్ అవ్యయమ్ ఇమమ్ యోగమ్ వివస్వతే ప్రోక్తవాన్=నేను అవ్యయమైన ఈ యోగమును ఆదిత్యునికొఱకు చెప్పియుంటిని- వివస్వాన్ మనవే ప్రాహ=ఆదిత్యుఁడు మనువుకొఱకు చెప్పెను- మనుః ఇక్ష్వాకవే అబ్రవీత్=మనువు ఇక్ష్వాకువుకొఱకు చెప్పియుండెను. ఏవమ్ పరంపరాప్రాప్తమ్ ఇదమ్ రాజర్షయః విదుః=ఇట్లు పరంపరచేవచ్చిన దీని రాజర్షులు ఎఱుంగుదురు- (హే) పరంతప=(ఓ) శత్రువులను తపింపఁజేయువాఁడా!, సః యోగః ఇహ మహతా కాలేన నష్టః=ఆ యోగము ఈలోకమున గొప్ప కాలముచేత నశించినది- సః పురాతనః యోగఏవ=ఆ ప్రాచీనమైన యోగమె, మే భక్తః సఖాచ అసి ఇతి=నా భక్తుఁడవును చెలికాఁడవును అగుచున్నావు అని, అద్య మయా తే ప్రోక్తః=ఇప్పుడు నాచేత నీకు చెప్పఁబడినది- ఏతత్ ఉత్తమమ్ రహస్యంహి=ఇది గొప్ప రహస్యముగదా.

అవ్యయమనఁగా ఫలము తప్పనిది- తప్పక మోక్షమును కలుగఁజేయునదియనుట- క్షత్రియులకు ప్రజలను పరిపాలించెడి సామర్థ్యము కలుగుటకై సృష్ట్యాదియందు ఆదిత్యుఁడు మొదలగువారికి కర్మయోగము వలనఁగలిగెడి సాంఖ్యయోగము ఉపదేశింపఁబడినది, అని శంకరభాష్యము.

సమస్తజగత్తును ఉద్ధరించుటకై ఈమన్వంతరము మొదటను మోక్షసాధనముగా యోగము వివస్వంతుఁడు మొదలగువారికి ఉపదేశింపఁబడెనని రామానుజభాష్యము.

అర్జునఉవాచ.

అపరం* భవతో జన్మ పరంజన్మ వివస్వతః।
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవానితి॥४॥

భవతః జన్మ అపరమ్ = నీయొక్క పుట్టుక తరువాతిది- వివస్వతః జన్మ పరమ్ = ఆదిత్యునియొక్క పుట్టుక మునుపటిది- ఆదౌ త్వమ్ ప్రోక్తవాన్ ఇత్యేతత్ = మొదటను నీవు చెప్పితివి అనుదీనిని, కథమ్ విజానీయామ్ = ఎట్లు తెలిసికొనుదును.

భగవంతుఁడు చెప్పినది పరస్పరవిరుదమని యెవ్వరు ననుకొనకుండుటకై అర్జునుఁడు ప్రశ్నము చేయుచున్నాఁడు- అని శంకరభాష్యము.

అర్జునుఁడు శ్రీకృష్ణమూర్తిని సర్వేశ్వరునిగా నెఱిఁగినవాఁడైనను సర్వేశ్వరునికి కర్మపరవశులకువలెఁగలిగిన జన్మము ఇంద్రజాలాదులవలె అసత్యమా? సత్యమా? సత్యమైనయెడను జన్మవిధమెట్లు- ఈ శరీరము ఏమి స్వరూపమైనది? పుట్టుటకేమి హేతువు- పుట్టుకయెప్పుడుగలుగును- పుట్టుట(జన్మమునకు) ప్రయోజనమేమి- అని శంకంజేయుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

పయిసర్వాణి అనుశ్లోకమునఁ జెప్పఁబడిన భగవన్మాహాత్మ్యమును సహేతుకముగాఁదెలియుటకు ప్రశ్నము చేయుచున్నాఁడు- అని మధ్వభాష్యము.

శ్రీభగవానువాచ.

బహూని మే వ్యతీతాని జన్మాని తవచార్జున।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప॥५॥

(హే)అర్జున! = (ఓ)యర్జునుఁడా!, మే తవచ బహూని జన్మాని వ్యతీతాని = నాకును నీకును అనేకములయిన జన్మములు అతిక్రమించినవి- తాని సర్వాణి అహమ్ వేద = వానిని అన్నిటిని నేను ఎఱుంగుదును- (హే) పరంతప! = (ఓ) శత్రువులనుతపింపఁజేయువాఁడా!, త్వం న వేత్థ = నీవు ఎఱుంగవు.

---

* కొన్ని శంకరభాష్యపుస్తకములలోను, మధ్వభాష్యపుస్తకములలోను అపరఋ అనిపాఠము- అర్థమొక్కటియె.

ధర్మాధర్మములచే ప్రతిబంధింపఁబడిన జ్ఞానశక్తి కలవాఁడవగుటచే నీ వెఱుఁగవు- నిత్యశుద్ధబుద్ధముక్తసత్యస్వభావుఁడనుఅనఁగా నిత్యమైపరిశుద్ధమై ముక్తమై సత్యమైన స్వభావముగలవాఁడనగుటను ఆవరణము (కప్పు) లేని జ్ఞానశక్తి కలవాఁడనుగాన నేను సమస్తజన్మములను నెఱుంగుదును- అని శంకరభాష్యము.

మీజన్మములవలె నాజన్మములును సత్యములే కాని మిథ్యాభూతములు కావు- అని రామానుజభాష్యము.

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా ॥ ౬ ॥

అజోఽపిసన్ =పుట్టుకలేనివాఁడనగుచును, అవ్యయాత్మా (సన్ =నాశములేనిస్వభావముకలవాఁడను (అగుచు), భూతానామ్ ఈశ్వరోఽపిసన్ =భూతములకు ఈశ్వరుఁడను నగుచు, స్వాం ప్రకృతిమ్ అధిష్ఠాయ =నాదైన ప్రకృతిని అధిష్ఠించి, ఆత్మమాయయా సంభవామి =స్వమాయచేత పుట్టుచున్నాఁడను.

ప్రకృతియనఁగా విష్ణుసంబంధియగు త్రిగుణాత్మకమైన మాయ- ఈ జగత్తంతయును దానివశమున నే ఉన్నది- మాయచేత మోహితుఁడగుటనే తాను వాసుదేవుఁడను జ్ఞానము ఎవ్వనికిని కలుగకున్నది- అట్టిమాయను స్వాధీనము చేసికొని, పుట్టినవానివలెనుండును- లోకులవలెఁ బరమార్థముగాఁ బుట్టలేదు- అని శంకరభాష్యము.

ప్రకృతియనఁగా స్వభావము- మాయఅనఁగా జ్ఞానము- అనఁగా సంకల్పము- పరమేశ్వరస్వభావములగు అపహతపాప్మత్వము (పాపములు లేకుండుట) మొదలగుదానిని విడువకయె తనశుద్ధసత్త్వమయమైన రూపమునె (దివ్యరూపమునె) దేవమనుష్యాదులతో సమానమైనయాకారముకలదానిగాఁ జేసి తన సంకల్పముచేత దేవాదిరూపములకలవాఁడై పుట్టుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

అవ్యయాత్మ అనుదానికి నాశములేని దేహముకలవాఁడై అనియర్థము- ఆత్మ యనాదియగుట అందఱికిని తుల్యమే- ప్రకృతివలనఁబుట్టిన వసుదేవాదులయందు దానితోనె వారికిఁ బుట్టినట్లు కనఁబడుచున్నాఁడు- ఆత్మమాయయా అనుదానికి ఆత్మజ్ఞానముతో అగుయర్థము-సృష్టికారణ

మైన మాయ(ప్రకృతి)వలన వసుదేవాదులశరీరములను సృజించివిమోహితయను మాయచే పుట్టనివాఁడై పుట్టినట్లుతోఁచుచున్నాఁడు అనియైనసర్థము- ఈశులగు బ్రహ్మరుద్రలక్ష్మీశేషాదులకంటెవరుఁడు(శ్రేష్ఠుఁడు)గాన ఈశ్వరుఁడనఁబడును- అని మధ్వభాష్యము.

యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్॥ ౭॥

(హే) భారత!=(ఓ)యర్జునుఁడా!, యదాయదాహి ధర్మస్య గ్లానిః భవతి=ఎప్పుడెప్పుడు ధర్మమునకు హాని కలుగుచున్నదో, అధర్మస్య అభ్యుత్థానం (భవతి)=అధర్మమునకు అభివృద్ధి (కలుగుచున్నదో), తదా అహమ్ ఆత్మానమ్ సృజామి=అప్పుడు నేను నన్ను సృజింతును.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ ౮॥

సాధూనాం పరిత్రాణాయ=సత్పురుషులను రక్షించుటకొఱకును, దుష్కృతామ్ వినాశాయచ=పాపకర్మములను చేయువారి నాశముకొఱకును, ధర్మసంస్థాపనార్థాయ=ధర్మములను లెస్సగా స్థాపించుటకొఱకును, యుగేయుగే సంభవామి=ప్రతియుగమునందును పుట్టుచుందును.

భగవంతుఁడు అవతరించినయెడ రక్షణాదికమును చేయునను నియమము లేదు- ఇచ్ఛచేతనును స్వభావముచేతనును యథేష్టముగాఁ బ్రవర్తించుచుండును- అనిమధ్వభాష్యము.

జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున॥ ౯॥

ఏవం దివ్యం మే జన్మ కర్మచ తత్త్వతః యః వేత్తి=ఇట్లు అప్రాకృతమైన నా పుట్టుకనును వ్యాపారమునును యథార్థముగా ఎవఁడు ఎఱుంగుచున్నాఁడో, సః దేహం త్యక్త్వా పునః జన్మ నైతి=వాఁడు దేహమును విడిచి తిరిగియు జన్మమును పొందఁడు- (హే) అర్జున!=(ఓ)యర్జునుఁడా!, (సః) మామ్ ఏతి=(వాఁడు) నన్ను పొందుచున్నాఁడు- వ్యాపారమనఁగా సాధువులను రక్షించుట

మొదలయినది.

ఇట్టి జ్ఞానముక్తులవాఁడు ముక్తిని పొందును. అని శంకరభాష్యము.

భగవంతుని నాశ్రయించుటకు విరోధులగు పాపములన్నియును ఈ యథార్థజ్ఞానము చేత పోయి అజన్మమున నే భగవంతుని ఆశ్రయించి భగవదేకప్రియుండై భగవంతునిఁ జేరును. అని రామానుజభాష్యము.

ఈ జ్ఞానముమాత్రముననే ముక్తి కలుగదు. వారివారికి తగిన సమస్త గుణముల జ్ఞానంబును కలుగవలయును, అని, తత్త్వతః అను పదము తెలియఁజేయుచున్నది- అని మధ్వభాష్యము.

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః॥౧౦॥

వీతరాగభయక్రోధాః = అనురాగంబును భయంబును కోపంబును పోయినవారును, మన్మయాః = నాస్వరూపములో నివారును, మామ్ ఉపాశ్రితాః = నన్ను ఆశ్రయించిన వారునగు, బహవః = పెక్కుండ్రు, జ్ఞానతపసా పూతాః = జ్ఞానమనెడి తపస్సుచేత పవిత్రులై, మద్భావమ్ ఆగతాః = నాస్వరూపమును పొందిరి.

మన్మయులు అనఁగా ఈశ్వరునితో నభేదమును తెలిసికొనినవారు. పరమాత్మజ్ఞానమనెడి తపస్సు అనుటచేత జ్ఞాననిష్ఠకు ఇతరతపస్సు యొక్క అపేక్ష లేదని సూచింపఁబడుచున్నది- అని శంకరభాష్యము.

జ్ఞానతపస్సు అనఁగా అవతారములయు వ్యాపారములయు తత్త్వజ్ఞానమనెడి తపస్సు- దీనిచేత పవిత్రులయినవారు నన్ను ఆశ్రయించినవారై రాగాదులుపోయి మన్మయులు అనఁగా నాయందు చిత్తముకలవారై నాతోసమానమైనధర్మములు (గుణములు) కలుగుటను పొందిరి- అని రామానుజభాష్యము.

మన్మయులు అనఁగా మత్ప్రియులు- అంతటనన్ను విడిచి మఱియొకదానిం జూడనివారు- అని మధ్వభాష్యము.

యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥౧౧॥

యే యథా మామ్ ప్రపద్యన్తే = ఎవ్వరు ఎట్లు నన్ను ఆశ్రయింతురో, అహమ్ తాన్ తథైవ భజామి = నేను వారిని అట్లే స్వీకరింతును-

(హే) పార్థ! = (ఓ) యర్జునుఁడా!, మనుష్యాః సర్వశః మమ వర్త్మ అనువర్తన్తే = మనుష్యులు అన్నివిధములను నామార్గమును అనుసరించుచున్నారు.

ప్రకారముగా అనఁగా ఏఫలమునుగోరి ఆశ్రయింతురో- జ్ఞానవంతులై కర్మసంన్యాసముకలిగి మోక్షమునుకోరెడివారికి మోక్షమునున్ను, ఫలమును కోరక కర్మములం జేయువారికి జ్ఞానమునున్ను, ఆర్తులైనవారికి ఆర్తినిపోఁగొట్టుటనున్ను, వారివారి కోరికెప్రకారము ఇచ్చెదనుగాని నాకు ఒకనియందును రాగమైనను ద్వేషమైనను లేదు- అని శంకరభాష్యము.

నన్నాశ్రయించువారికి దేవమనుష్యాదిరూపమున నవతరించియొ రక్షణమును చేయుదుననెడు నియమము లేదు- నన్ను ఆశ్రయింపఁగోరువారు వారివారి అపేక్షానుసారముగా నా రూపమును ఎట్లూహించికొందురో వారికి అట్లే నా స్వరూపమును చూపుదును- సమస్తమనుష్యులును, నామార్గమును అనఁగా నా స్వభావమును, యోగులవాక్కులకును మనస్సులకునుగూడ అగోచరమైనను, తమతమ చక్షురాదికరణముల చేత తమకు అపేక్షితములైన అన్నిప్రకారముల చేతను, అనుభవించి అనువర్తింతురు- అని రామానుజభాష్యము.

అన్యదేవతాదిస్వరూపముగా నన్ను భజించినంతమాత్రమున ముక్తి లేదు- అయినను వారివారికి తగిన ఫలముల నిచ్చెదను- నేను సర్వకర్మములకు కర్తను భోక్తనుంగావున, అన్యదేవతలనుగూర్చి యజ్ఞములు చేయువారైనను నామార్గమునే అనుసరించుచున్నారు- అని మధ్వభాష్యము.

కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా॥౧౨॥

ఇహ కర్మణాం సిద్ధిం కాఙ్క్షన్తః = ఈలోకమున కర్మములయొక్క ఫలసిద్ధిని కోరుచున్నవారై, దేవతాః యజన్తే = ఇంద్రాదిదేవతలను గూర్చి యాగములను చేయుచున్నారు- మానుషే లోకే = మనుష్యసంబంధియగు లోకమునందు, కర్మజా సిద్ధిః క్షిప్రం భవతి హి = కర్మములవలన గలిగిన ఫలసిద్ధి శీఘ్రముగా అగుచున్నదిగదా.

నేను వేఱు, దేవతలు వేఱు, అని దేవతలనుగూర్చి భేదబుద్ధితో యాగము చేయువారికి మానుషలోకమున శీఘ్రముగా ఫలసిద్ధి యగును- దీనిచే ఇతరలోకములయందుఁగూడ కర్మఫలములసిద్ధి తెలియఁజేయఁబడినది- మనుష్యలోకమున వర్ణాశ్రమాది కర్మములు విశేషము. అని శంకరభాష్యము.

మనుష్యలోకశబ్దము స్వర్గాదులం గూడఁ దెలియఁజేయును- ఈ లోకములోనివారు అందఱును అవివేకులై క్షుద్రఫలములంగోరి పుత్రపశ్వన్నాదులకొఱకును స్వర్గాదులకొఱకును ఇంద్రాదిదేవతలనుమాత్రము కర్మములచే నారాధించుచున్నారు- ఒకఁడైనను సంసారము దురోతపుట్టి మోక్షము[illegible] ఇంద్రా[illegible] ఆత్మభూతుఁడనగు నన్ను కర్మములచే నారాధింపకున్నాఁడు- అని రామానుజభాష్యము.

అన్యదేవతలంగూర్చి యజ్ఞము చేయువారును నామార్గము ననుసరించువారగుటవలన పుత్రాదిఫలప్రాప్తి శీఘ్రముగా కలుగుచున్నది- విష్ణువు యజ్ఞభోక్తకానియెడల బ్రహ్మాదులకు స్వాతంత్ర్యము లేకపోవుటచే ఫలమునిచ్చు సామర్థ్యము లేదుగాన ఫలసిద్ధి కలుగకపోవలసినది- అని మధ్వభాష్యము.

చాతుర్వర్ణ్యం [illegible] సృష్టం గుణకర్మవిభాగశః।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్॥౧౩॥

మయా గుణకర్మవిభాగశః చాతుర్వర్ణ్యం సృష్టమ్= నాచేత సత్త్వరజస్తమోగుణములయు వ్యాపారములయు విభాగము చొప్పున చాతుర్వర్ణ్యము (బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు) సృజింపఁబడినది. అవ్యయం మాం తస్య కర్తారమ్ అకర్తారమపి విద్ధి= నిత్యుఁడనైన నన్ను దానికి(చాతుర్వర్ణ్యమునకు) కర్తనుగాను కర్తగానివానిగాను ను తెలిసికొనుము.

సత్త్వగుణప్రధానుఁడగు బ్రాహ్మణునికి శమము(ఇంద్రియనిగ్రహము), దమము(అంతఃకరణనిగ్రహము), తపస్సు, మొదలగునవి కర్మములు- సత్త్వముతోఁగూడిన రజోగుణము ప్రధానముగాఁగల క్షత్రియునికి శౌర్యము (శూరత్వము), తేజస్సు(ప్రతాపము), మొదలగునవి కర్మములు- తమస్సుతోఁగూడిన రజోగుణము ప్రధానముగాఁగల వైశ్యునికి కృషి (వ్యవ

సాయము) మొదలగునవి కర్మములు- రజస్సుతోఁగూడిన తమోగుణ ము ప్రధానముగాఁగల శూద్రునికి శుశ్రూష( పరిచర్య )యే కర్మము- ఇట్లు గుణకర్మవిభాగముచొప్పున చాతుర్వర్ణ్యమును సృజించుటకు నన్ను మాయావ్యవహారమున కర్తనుగానును, పరమార్థమున కర్త కానివాఁడనుగానును, అవ్యయునిగానును, అనఁగా అసంసారినిగాను ను తెలిసికొనుము- అని శంకరభాష్యము.

బ్రహ్మమొదలుస్తంబము(గడ్డి కాడ) వరకునుండు జగత్తంతయు నా చే సృజింపఁబడినది, రక్షింపఁబడుచున్నది, సంహరింపఁబడుచున్నది, అని యెఱుంగునది- నన్ను దానికి కర్తనుగానును అకర్తనుగానును తెలిసికొనుము- ( ఈయంశము ఉత్తరశ్లోకమున వివరింపఁబడును )- అని రామానుజభాష్యము.

చాతుర్వర్ణ్య మనఁగా నాలుగువర్ణముల సముదాయము· బ్రాహ్మణుఁడు సాత్త్వికుఁడు- క్షత్రియుఁడు సాత్త్వికరాజసుఁడు- వైశ్యుఁడు రాజసతామసుఁడు- శూద్రుఁడు తామసుఁడు- అని గుణవిభాగము. శమోదమః (౧౮అ॥౪౨శ్లో॥)ఇత్యాదిశ్లోకముచే కర్మవిభాగము చెప్పఁబడును. కర్తనైన నన్ను క్రియ(పని)యందు అభిమానము లే కపోవుటవలన అకర్తనుగాఁదెలిసికొనుము- అని మధ్వభాష్య.

న మాం కర్మాణి లిమ్పన్తి నమే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న సబధ్యతే॥౧౪॥

కర్మాణి మాం నలిమ్పన్తి=కర్మములు నన్ను అంటవు- మే కర్మ ఫలే స్పృహా న=నాకు కర్మములఫలమందు కోరిక లేదు- ఇతి మాం యః అభిజానాతి=ఇట్లు నన్ను ఎవ్వఁడు తెలిసికొనునో, సః కర్మభిః నబధ్యతే=వాఁడు కర్మములచేత కట్టఁబడఁడు.

ఎవ్వరికి నేను కర్తను అనెడి యభిమానంబును కర్మములఫలముల యందు ఆశయునుకలదో, ఆసంసారులకు కర్మములు దేహములంగలు గఁజేయును-ఆరెండును లేని నన్ను కర్మములు అంటవు- మఱియెవ్వఁడై నను నేనుకర్తను గాను, నాకుకర్మఫలమున కోరిక లేదు, అనుకొని నన్ను తనుగా తలఁచునో, వాఁడును, కర్మములచే బంధింపఁ(కట్టఁ)బడఁడు- అని శంకరభాష్యము.

ఈ విచిత్రసృష్టి మొదలగు కర్మములు(పనులు) నన్ను సంబంధింపవు- అనఁగా దేవమనుష్యాదిసృష్టి వైచిత్ర్యములు సృజింపఁబడువారి పుణ్యపాపకర్మవిశేషముబట్టి వచ్చినవి- కాఁబట్టి నేను విచిత్రసృష్టి మొదలగుదానికి కర్తనుగాను- కరణకళేబరములతో సృజింపఁబడిన జీవులు సృష్టివలన కలిగిన భోగ్యములను వారివారి కర్మానుగుణముగా ననుభవింతురు- కాఁబట్టి సృష్ట్యాదికర్మఫలంబునందుకూడ వారికే కోరికగాని నాకు కోరికలేదు- ఇట్లు సృష్టికి కర్తనుగనుసు అకర్తనుగానుసు సృష్ట్యాదికర్మఫలసంగము లేనివానిగ నను నన్ను ఎవ్వఁడెఱుఁగునో, వాఁడు కర్మయోగారంభమునకు విరోధులగు ప్రాచీనకర్మములతో సంబంధింపఁడు. అని రామానుజభాష్యము.

నాకు కర్మఫలమందు(పరులకొఱకు) ఇచ్ఛమాత్రముకలదుగాని అభినివేశము లేదు- కొందఱే ముక్తులగుదురుగాని క్రమముగానైనను సర్వముక్తి లేదు- అందుకు జీవులు అనంతులగుటయె హేతువు- అనిమధ్వభాష్యము- ఫలముకలుగుఁగాక యను దేనివలన మనస్సునకు విక్షేపము కలుగునో అది అభినివేశము- అనిహనుమట్టీక.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥

పూర్వైః ముముక్షుభిరపి=పూర్వులైన మోక్షేచ్ఛకలవారిచేతనను, ఏవం జ్ఞాత్వా కర్మ కృతమ్=ఇట్లు తెలిసికొని కర్మము చేయఁబడినది. తస్మాత్ త్వమ్ పూర్వైః కృతం పూర్వతరం కర్మైవ కురు=అందువలన నీవు పూర్వులచేత చేయఁబడిన పురాతనమైన కర్మమునే చేయుము.

నేను కర్తనుగాను, నాకు కర్మఫలమున కోరిక లేదు, అని తెలిసికొనఁబడి పూర్వులగు ముముక్షువులచే కర్మము చేయఁబడినది- కాఁబట్టి జనకాదులచే చేయఁబడినకర్మమును, నీవు ఆత్మజ్ఞానము లేనివాఁడవైనచో అంతఃకరణశుద్ధికొఱకును, ఆత్మజ్ఞానము కలవాఁడవైనయెడల లోకసంగ్రహముకొఱకును చేయుము- అని శంకరభాష్యము.

ఇట్లు నన్ను తెలిసికొని పాపములన్నిటిని పోఁగొట్టికొనిన పూర్వముముక్షువులచే వెనుక చెప్పఁబడినకర్మము చేయఁబడినది- అం

మువలన నీవును ఇట్టిజ్ఞానముచే పాపములం బోగొట్టికొని పూర్వులగు వివస్వంతుఁడు, మనువు, మొదలగువారిచేఁ జేయఁబడిన పురాతనకర్మమును చేయుము- అని రామానుజభాష్యము.

జ్ఞానముకలిగినను కర్మమును చేయుటకు ఆచారముకలదు పూర్వతరం అనుదానికి పూర్వముకలిగినది అనియర్థము- అనిమధ్వభాష్యము- జ్ఞానికి మోక్షముకలుగుట నిశ్చితమైనను అంతకంటె నెక్కుడు మోక్షము కలుగుటకు కర్మములనాచరించుట యాచారసిద్ధము- అని మధ్వటీకలో వివరింపఁబడినది.

కిం కర్మ కిమకర్మేతి కవయో ప్యత్ర మోహితాః।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్॥

కర్మ కిమ్=కర్మము ఏది?, అకర్మ కిమ్=అకర్మము ఏది?, ఇత్యత్ర కవయోఽపి మోహితాః=అను నీవిషయమున పండితులును మోహమును చెందిరి- తత్ తే కర్మ ప్రవక్ష్యామి=అందువలన నీకు కర్మమును చెప్పెదను- యత్ జ్ఞాత్వా అశుభాత్ మోక్ష్యసే=దేనిని తెలిసికొని సంసారమునుండి విడుదలను పొందఁగలవో.

అకర్మ మనఁగా కర్తయైన ఆత్మయొక్క తత్త్వజ్ఞానము- చేయవలసిన కర్మమును దానిలోఁజేరిన జ్ఞానమును ఎట్టివి, అనునంశమున పండితులుకూడ నెఱుఁగకున్నారు- ఇట్లు అంతర్గతమైన జ్ఞానముగల కర్మమును నేను నీకు చెప్పెదను- దేనివలన సంసారమునుండి విడువఁబడుదువో- అని రామానుజభాష్యము.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః॥౧౭॥

కర్మణోఽపి బోద్ధవ్యం (తత్త్వమ్ అస్తి హి)=కర్మమునకును తెలియఁబడఁదగిన (స్వరూపము కలదుగదా)- వికర్మణశ్చ బోద్ధవ్యమ్ (అస్తి)=వికర్మంబునకును తెలియఁబడఁదగినది (కలదు)- అకర్మణశ్చ బోద్ధవ్యమ్ (అస్తి)=అకర్మమునకును తెలియఁబడఁదగినది (కలదు)- కర్మణః గతిః గహనా=కర్మముయొక్క విధము తెలియశక్యముకానిది-

కర్మమనఁగా శాస్త్రముచే విధింపఁబడినది- వికర్మమనఁగా శాస్త్రముచే నిషేధింపఁబడిన కర్మము- అకర్మమనఁగా కర్మములంజేయు

క యోగకుండుట- వీని యొక్క తత్త్వము తెలియశక్యముకానిది- అని శంకరభాష్యము.

కర్మమనఁగా మోక్షసాధనమైనది. వికర్మమనఁగా నిత్యనైమిత్తికకామ్యరూపముచేతను దానికి సాధనములగు ద్రవ్యసంపాదనాదిరూపములచేతను అనేకవిధములయినకర్మము- అకర్మమనఁగా జ్ఞానము- వికర్మమున తెలియవలసినది ఏది అనఁగా,-నిత్యనైమిత్తికకామ్య ద్రవ్యార్జనాదికర్మమున ఫలభేదములవలన వచ్చిన నానావిధత్వమును విడిచి మోక్షమె ఫలము అగునట్లు ఏకశాస్త్రార్థత్వమునుఅనుసంధానముచేయుట- ఇది, వ్యవసాయాత్మికాబుద్ధిః (అ౨॥౪౧శ్లో॥)అను శ్లోకమునవివరింపఁబడినది- అని రామానుజభాష్యము.

కర్మవికర్మములు విహితనిషిద్ధకర్మములు- అకర్మమనఁగా కర్మమును చేయకపోవుట- అని మధ్వభాష్యము.

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణిచ కర్మ యః।
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్॥

యః కర్మణి అకర్మ పశ్యేత్=ఎవ్వఁడు కర్మమున అకర్మమును చూచునో, యః అకర్మణి కర్మచ పశ్యేత్=ఎవ్వఁడు అకర్మమున కర్మమును చూచునో, సః మనుష్యేషు బుద్ధిమాన్=వాఁడు మనుష్యులలో బుద్ధిమంతుఁడు- సః యుక్తః=వాఁడు యోగముకలవాఁడు-సః కృత్స్నకర్మకృత్=వాఁడు అన్నికర్మములంజేయువాఁడు.

కర్మమనఁగా లోకులుచేసెడి వ్యాపారము(పని)- అకర్మమనఁగా లోకులు పనులుచేయక ఊరకయుండుట. అనఁగా నేను పనులేమియును లేక సుఖముగానున్నాననుకొనుట- ఈ రెండును అవిద్య(అజ్ఞానము)వలన ఆత్మకుకలిగిన అధ్యాసమనెడిసంసారభ్రాంతిలో చేరినవియె-ఆత్మకు ఒకక్రియకు(పనికి) కర్త(*Agent*)యగుటయనెడు కర్తృత్వము, లేమి- కాఁబట్టి లోకులు చేసెడిపని ఆత్మయొక్క కర్మము కాదనియు, అట్లె, పనులులేక సుఖముగానున్నాననుకొనుట, నేను ఉన్నాను అని కర్తృత్వముతోఁ గూడియుండుటచేత కర్మమె యనియును, ఎవ్వఁడెఱుంగునో, వాఁడు పండితుఁడును, యోగియును, అన్ని కర్మములను చేసినవాఁడును. ఒక్క యోధ కొండజనముల నెక్కించికొని

నదిలోఁ బోవుచుండఁగా దానిలోనున్న వానికి స్థిరముగా నుండెడికొండలు చెట్లు మొదలగునవి ఎదురుగా వచ్చుచున్నట్లును, పడవలోనున్నవాండ్రు స్థిరముగానున్నట్లును కనఁబడును. విమర్శించినచో వచ్చుచున్నట్లు తోఁచెడి వృక్షములయందు కదలిక లేకపోవుటయు, నిలుకడగానున్నట్లు తోఁచెడి యోడ మనుష్యులయందు నడకయును తెలియును. ఇందు వచ్చుటయనెడి కదలిక కర్మమునకును, నిలుకడగానుండుట యనెడు కదలికలేకపోవుట అకర్మమునకును దృష్టాంతము. అని శంకరభాష్యము

అకర్మమనఁగా కర్మము కానిదగు జ్ఞానము. కర్మమునందగనెడి యాత్మస్వరూపజ్ఞానమును, జ్ఞానమునందగనెడి కర్మమును, ఎవ్వఁడెఱుఁగునో వాఁడు బుద్ధిమంతుఁడు; అనఁగా శాస్త్రార్థము నంతయు నెఱింగినవాఁడు. వాఁడె యుక్తుఁడు; అనఁగా మోక్షమునకుఁ దగినవాఁడు. వాఁడె యన్ని కర్మములం జేసినవాఁడు; అనఁగా శాస్త్రార్థమునంతయు జరిపినవాఁడు. కర్మజ్ఞానములు రెండు నొకదానితోనొకటి చేరియుండవలయుననుట. అని రామానుజభాష్యము.

అకర్మ అనునప్పుడు అ అనునది విష్ణువును చెప్పును. కాన విష్ణువుయొక్క కర్మము(పని) అని యర్థము. కర్మము చేయఁబడినదగుచుండఁగా, అది భగవంతుని కర్మము, ప్రతిబింబమైన నాకు స్వతంత్రముగాఁ గర్తృత్వము లేదు, అని యెవ్వఁడు తలంచునో; అకర్మణి అనుదానికి జీవుని పనులులేని నిద్రమొదలగు కాలమందు అని యర్థము; జీవుడు పని చేయక పడియుండు నిద్రాదిసమయములయందును భగవంతునికి సృష్టి మొదలగు కర్మము కలదనియు నెవ్వఁడు తలంచునో; వాఁడు మనుష్యులలోఁ బామరుఁడు కానివాఁడు. వాఁడె యోగముతోఁ గూడినవాఁడు. వాఁడె అన్నికర్మములం జేసినవాఁడు, అన్ని కర్మములం జేయకపోయినను అన్నికర్మములం జేసినవేఁ గలిగెడు మోక్షఫలము కలుగుననుట. అని మధ్వభాష్యము.

యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః॥౧౯॥

యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః = ఎవ్వనియొక్క

అన్ని కర్మములును కామములును సంకల్పములును లేనివో, బ. భా: జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తం పణ్డితమ్ ఆహుః=పండితులు జ్ఞానమనెడియగ్నిచేతదహింపఁబడినకర్మములుగల అతని పండితునిగా చెప్పుచున్నారు.

కామములకు కారణములైనవి సంకల్పములు- ఈ రెండును లేనివాఁడై, ప్రవృత్తిమార్గమున నున్నవాఁడు లోకసంగ్రహముకొఱకును, నివృత్తిమార్గముననున్నవాఁడు తాను బ్రదుకుటకుమాత్రంబును, పనులు చేయును- జ్ఞానమనఁగా వెనుకటిశ్లోకములోఁజెప్పఁబడినది- అని శంకరభాష్యము- కామమనఁగా ఫలమును కోరుట- సంకల్పమనఁగా నేను చేయుచున్నాను, అనెడి కర్తృత్వాభిమానము- అని మధుసూదనటీక.

సమారంభములు అనఁగా ద్రవ్యమును సంపాదించుట మొదలగులౌకికవ్యాపారములతోఁగూడిన నిత్యనైమిత్తిక కామ్యకర్మముల ఆరంభములు- కామమనఁగా ఫలసంగము- సంకల్పమనఁగా ప్రకృతితోను దానిగుణములతోనును ఆత్మను ఏకీభవింపఁజేసి తలంచుట- జ్ఞానమనఁగా కర్మాంతర్గతమైన ఆత్మజ్ఞానము- దీనివలన కర్మమున కు జ్ఞానాకారత్వము సంభవింపుచున్నది- అని రామానుజభాష్యము

ఇఁక నైదుశ్లోకములు ఈ వెనుకటిశ్లోకముయొక్క ప్రపంచమే- అని మధ్వభాష్యము- ఇది నాకు కావలయుననెడు ఫలసంగము కామము- ఇది చేసెదనను కర్మసంగము సంకల్పము- అనిమాధ్వటీక-

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చిత్ కరోతి సః॥ ౨౦॥

కర్మఫలాసఙ్గం త్యక్త్వా=కర్మములందునుఫలములయందును ఆసక్తిని విడిచి, కర్మణి అభిప్రవృత్తోఽపి నిత్యతృప్తః నిరాశ్రయః యః=కర్మమునందు ప్రవర్తించినవాఁడైనను నిత్యమైన తృప్తికలవాఁడును ఆధారములేనివాఁడును ఎవ్వఁడో, సః కిఞ్చిత్ నకరోత్యేవ=వాఁడు ఒక్కదానిని చేయకున్నవాఁడె.

దేనిని ఆశ్రయించి ఫలమునుకోరునో అది ఆశ్రయము (అది దేహేంద్రియాదికము- అని మధుసూదనటీక)- అది లేనివాఁడు నిరాశ్రయుఁ

డు సన్న్యాసియగువాఁడు బ్రదుకుటకుమాత్రము కర్మములను జేయును- సన్న్యాసి కానివాఁడును కర్మమువలన ప్రయోజనము లేదని తెలిసికొని కర్మములను వాని సాధనములతోఁగూడ విడిచినవాఁడైనను లోకసంగ్రహార్థమై కర్మములను చేయును- వాని కర్మముఁగూడ జ్ఞానమనెడి యగ్నిచే దహింపబడినదై అకర్మమే యగును- అని శంకరభాష్యము.

నిత్యమైన తనయాత్మయందు తృప్తినిచెందినవాఁడు నిత్యతృప్తుఁడు- అస్థిరమైన ప్రకృతియందు ఆశ్రయబుద్ధి లేనివాఁడు నిరాశ్రయుఁడు- ఇట్టివాఁడు కర్మములయందు ప్రవర్తించినను కర్మవ్యాజమున జ్ఞానాభ్యాసమును చేయుచున్నాఁడుగాన కర్మమును చేయనివాఁడె అని రామానుజభాష్యము.

ఆసఙ్గమ్=స్నేహమును- నిత్యతృప్తుఁడును నిరాశ్రయుఁడునైన ఈశ్వరునితో సమానమైన రూపముకలవాఁడనైతినను కామవాఁడు- అని మధ్వభాష్యము.

నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥౨౧॥

నిరాశీః=ఆశలు లేనివాఁడును, యతచిత్తాత్మా=నియమింపఁబడిన చిత్తమును ఇంద్రియంబులునుకలవాఁడును, త్యక్తసర్వపరిగ్రహః=విడువఁబడిన అన్ని పట్టుదలలునుకలవాఁడునై, కేవలం శారీరం కర్మ కుర్వన్=కేవలమైన శరీరసంబంధియగు కర్మమును చేయుచున్నవాఁడై, కిల్బిషం నాప్నోతి=పాపమును పొందఁడు- సంసారమును పొందఁడనుట..

శారీరమనఁగా శరీరము నిలుచుటమాత్రము ప్రయోజనముగాఁగల భిక్షాటనాదికము- అని శంకరభాష్యము.

నిరాశీః=ఫలోద్దేశము లేనివాఁడు- పరిగ్రహమనఁగా ప్రకృతియందును ప్రాకృతములయందును మమకారము- కేవలశారీరకర్మమనఁగా జ్ఞాననిష్ఠ లేనివట్టి కర్మయోగము- దీనివలన ఆత్మదర్శనము కలుగునను- అని రామానుజభాష్యము.

ఈశ్లోకము కామాదులను విడుచుటకు ఉపాయమును చెప్పుచు

స్వాది- నియమింపఁబడిన బుద్ధియును మనస్సును గలవాఁడగుటచే ఆశ లేనివాఁడై- పరిగ్రహములు విడుచుటయనఁగా అభిమానము లేకపోవుట- ఇట్టివాఁడు కర్మములవలనఁగలిగెడి పాపమును పొందఁడు. అనిమధ్వ భాష్యము.

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే॥ ౨౨॥

యదృచ్ఛాలాభసంతుష్టః = తనంత నెకలిగినలాభముచేసంతోషించిన వాఁడును, ద్వన్ద్వాతీతః=శీతోష్ణాదిద్వంద్వములనుమించినవాఁడును, విమత్సరః=మాత్సర్యము లేనివాఁడును, సిద్ధౌ అసిద్ధౌచ సమః=కలిమి యందును లేమియందును సముఁడును (అయినవాఁడు), కృత్వాఽపి న నిబధ్యతే=కర్మములను చేసినను బంధమునుపొందఁడు.

విమత్సరుఁడనఁగా వైరబుద్ధిలేనివాఁడు- ఇట్టివాఁడు భిక్షాటనాది కర్మమును చేసినను, కర్తృకర్త్వాభిమానము లేకపోవుటచే, చేయనివాఁడె- అనిశంకరభాష్యము.

సిద్ధ్యసిద్ధులయందు సముఁడు అనఁగా తాను చేయుచుండెడి యుద్ధాదికర్మములలో జయము వచ్చినను అపజయమువచ్చినను సమానమైన చిత్తముకలవాఁడు- ఇట్టివాఁడు జ్ఞానము లేక వట్టి కర్మమును చేసినను సంసారమును పొందఁడు- అని రామానుజభాష్యము.

ఈశ్లోకము నిరూపింపఁబడిన బుద్ధియును మనస్సునుకలవారి స్వరూపమును చెప్పును- సిద్ధ్యసిద్ధులలో సముఁడగుటను ద్వంద్వాతీతుఁడగుటను- అని మధ్వభాష్యము.

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥ ౨౩॥

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః=సంగములేనివాఁడును విడువఁబడినవాఁడును జ్ఞానమందునిలిచియున్నమనస్సుకలవాఁడును, యజ్ఞాయ కర్మ ఆచరతః=యజ్ఞము(జరుగుట)కొఱకు కర్మమును చేయుచున్నవాఁడునగువానికి, సమగ్రం కర్మ ప్రవిలీయతే=సమస్తమైన కర్మంబును అణఁగుచున్నది- అనఁగా నశించుచున్నదియనుట.

ఈశ్లోకము బ్రహ్మజ్ఞానము కలిగినను ఒకానొకనిమిత్తమువలన సంన్యాసము లేకుండెడి వానింగూర్చినది- ఈతఁడె త్యక్త్వాకర్మఫలాసఙ్గమ్(౪అ॥ ౨౦ శ్లో)అనుశ్లోకమునఁ జెప్పఁబడినవాఁడు- ముక్తుఁడనఁగా పుణ్యపాపసంబంధము లేనివాఁడు. సమగ్రమైనకర్మము అనఁగా ఫలముతోఁ గూడిన కర్మము అనిశంకరభాష్యము.

ఆత్మజ్ఞానము కలవాఁడగుటచే మిగిలినవానియందు సంగము లేనివాఁడు, గతసంగుఁడు- అన్ని పరిగ్రహములచేతనును విడువఁబడినవాఁడు ముక్తుఁడు- కర్మ సమగ్రం(యథాతథా) ప్రవిలీయతే=బంధకమగు ప్రాచీనకర్మము నిశ్శేషముగా క్షయించును- అని రామానుజభాష్యము.

ఫలస్నేహము లేనివాఁడు గతసంగుఁడు- ముక్తుఁడనఁగా శరీరాద్యభిమానము లేనివాఁడు- జ్ఞానావస్థితచేతసుఁడు అనఁగా పరమేశ్వర జ్ఞానము కలవాఁడు- అని మధ్వభాష్యము.

బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా॥ ౨౪॥

అర్పణం బ్రహ్మ= హోమసాధనము బ్రహ్మము- హవిః బ్రహ్మ= హవిస్సు బ్రహ్మము- బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం బ్రహ్మ= బ్రహ్మస్వరూపమైనయగ్నియందు బ్రహ్మముచేతనైన హోమము బ్రహ్మము- బ్రహ్మకర్మసమాధినా తేన గన్తవ్యం బ్రహ్మైవ= బ్రహ్మస్వరూపమైన కర్మమందు సమాధిగల వానిచే పొందఁదగినది బ్రహ్మమే.

లోకసంగ్రహార్థము కర్మము చేయువాఁడును బ్రహ్మజ్ఞానముకలవాఁడై కర్మతత్సాధనాదులన్నియు బ్రహ్మమెయని యెఱింగి కర్మములను చేసినయెడను అది అకర్మమె యగును- సర్వకర్మసంన్యాసికి కర్మను లేకపోయినను కర్మసంబంధియైన అర్పణాదికమంతయు బ్రహ్మమె- అనిశంకరభాష్యము.

బ్రహ్మార్పణమ్ బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్= బ్రహ్మమయములగు హోమసాధనములుగల బ్రహ్మమయమగుహవిస్సు బ్రహ్మమయమయినయగ్నియందు బ్రహ్మమైన కర్తచేత హో

మము చేయఁబడినది- అని సమస్తకర్మంబును బ్రహ్మాత్మకంబగుటచే త బ్రహ్మమయమని యెవ్వఁడు తలంచునో, వాఁడు, బ్రహ్మకర్మస మాధి- వానిచేత, బ్రహ్మాత్మకంబగుటను బ్రహ్మమయమైన నయా త్మ స్వరూపమె పొందఁబడఁదగినది- మోక్షముంగోరువానిచేఁ జేయఁ బడనకర్మము పరబ్రహ్మాత్మకమనెడి యనుసంధానము ( తలంపు )తోఁ గూడియుండుటనె జ్ఞానాకారమై ఆత్మజ్ఞాన మగు- అటేకమై ఆత్మావ లోకనసాధన మగును- అని రామానుజభాష్యము. ఈ రామానుజ సి ద్ధాంతములో భగవంతునికి మిగిలిన చేతనాచేతనములన్నియు శరీరము లు- వానికి భగవంతుఁడు శరీరి( ఆత్మ )- ఇట్టి శరీరశరీరిభావమును పట్టి యె మిగిలినపదార్థంబులన్నియు బ్రహ్మమనుట- అసియెటుంగునది.

హోమసాధనములన్నియు బ్రహ్మమనుట, బ్రహ్మాధీనమైన సత్తకలవిగుటవలన- సమాధితోఁగూడ బ్రహ్మమె కర్మము- ఇట్లుభ గవంతుఁడొక్కఁడె స్వతంత్రుఁడు, మిగిలినదంతయువాని యధీనము, అ ను జ్ఞానముకలవాఁడె వెనుకటి శ్లోకమునఁ జెప్పఁబడిన జ్ఞానావస్థితచేత స్కుఁడు- అని మధ్వభాష్యము.

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥ ౨౫॥

అపరే యోగినః దైవం యజ్ఞమేవ పర్యుపాసతే=కొందఱు కర్మ నిష్ఠులు దేవసంబంధియగు యజ్ఞమునే ఆచరింపుచున్నారు- అపరే బ్రహ్మాగ్నౌ యజ్ఞేనైవ యజ్ఞం ఉపజుహ్వతి=మఱికొందఱు బ్ర హ్మమనెడియగ్నియందు యజ్ఞముచేతనె యజ్ఞమును హోమముచే యుచున్నారు.

దేవతలనుగూర్చి యజ్ఞములంజేయువారె కర్మనిష్ఠులు- ఉత్తరా ర్ధములో యజ్ఞశబ్దము ఆత్మను జెప్పును- ఈ యుపాధితోఁ గూడి నయాత్మనునిరుపాధిక పరబ్రహ్మస్వరూపముగాఁ దలంచువారు బ్రహ్మ జ్ఞానముగల సంన్యాసులు- అని శంకరభాష్యము.

దైవయజ్ఞమనఁగా దేవార్చనరూపంబగు యజ్ఞము- దీనినాచరించు వారు ఒకవిధమైన కర్మయోగులు- ఉత్తరార్ధమున యజ్ఞమ్ అను నది హవిస్సు(సు) మొదలగు యజ్ఞసాధనములం జెప్పును- వెనుకటి

శ్లోకమునఁజెప్పఁబడినట్లు జ్ఞానాకారమగు కర్మము నాచరించువారు ఒకవిధమగు కర్మయోగులు- అని రామానుజభాష్యము.

దైవమ్=భగవంతుని, యజ్ఞం(యథాతథా) పర్యుపాసతే=యజ్ఞ (మనునట్లుగా) ఉపాసన చేయుచున్నారు- భగవదుపాసనమె యజ్ఞ మనుట. యతులకు ఇంతకంటె వేఱు యజ్ఞము లేదు- యజ్ఞేన యజ్ఞ మేవ ఉపజుహ్వతి=ప్రసిద్ధమైన యజ్ఞముచేతనె భగవంతునింగూర్చి హోమము చేయుచున్నారు- (వీరు వానప్రస్థులు- అని మాధ్వ టీక) అనిమధ్వభాష్యము.

శ్రోత్రాదీనీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్ విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి॥౨౬॥

అన్యే సంయమాగ్నిషు శ్రోత్రాదీని ఇన్ద్రియాణి జుహ్వతి=ఇతరు లు ఇంద్రియనియమనములనెడి యగ్నులయందు శ్రోత్రము మొదల గు ఇంద్రియములను హోమముచేయుచున్నారు- అన్యే ఇం ద్రియాగ్నిషు శబ్దాదీన్ విషయాన్ జుహ్వతి=అన్యులు ఇంద్రియ ములనెడియగ్నులయందు శబ్దము మొదలగు విషయములను హో మము చేయుచున్నారు.

ఇంద్రియములు అనేకములుగాన వాని నియమించుటలును అనేక ములుగాఁ జెప్పఁబడినవి. కొందఱు ఇంద్రియములను నియమించుట యె హోమమని తలంతురు- మఱికొందఱు అవిరుద్ధమైన విషయ ములను అనుభవించుటయె హోమమనితలంతురు- అని శంకరభా ష్యము.

కొందఱు కర్మనిష్ఠులు శ్రోత్రాదీంద్రియములను నియమించుట యందె ప్రయత్నము చేయుదురు- మఱికొందఱు కర్మనిష్ఠులు శబ్దా దివిషయములను అనుభవింపుచును శబ్దాదివిషయములయందు అత్యాస క్తిని నివారించుటయందు ప్రయత్నము చేయుదురు- అని రామానుజ భాష్యము.

ఈ శ్లోకమున పూర్వార్ధము ఇంద్రియనియమనము చేసెడి నై ష్ఠికబ్రహ్మచారిని గూర్చినది- ఉత్తరార్ధము యుక్తవిషయానుభ వముచేసెడి గృహస్థునిగూర్చినది- అనిమాధ్వటీక.

సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥౨౭॥

అపరే=మఱికొందఱు, సర్వాణి ఇన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణిచ =సమస్తములైన ఇంద్రియవ్యాపారములను ప్రాణములవ్యాపారములను, జ్ఞానదీపితే ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి=జ్ఞానముచేతఁ బ్రకాశింపఁజేయఁబడిన ఆత్మసంయమమనెడియోగాగ్నియందు హోమమును చేయుచున్నారు.

ప్రాణకర్మములనఁగా ప్రాణవాయువుయొక్క వ్యాపారములగు అవయవములనుముడుచుట, చాచుట, మొదలగునవి· ఆత్మవిషయమగు సంయమము (సమాధి) అనెడి యోగము- అదియె అగ్ని- దీనికి జ్ఞానము, దీపమునకు చమురువంటిది- అని శంకరభాష్యము·

ఆత్మసంయమమనఁగా మనస్సును నియమించుట- మనస్సునకు ఇంద్రియవ్యాపారములయందును ప్రాణవ్యాపారములయందును ఆసక్తి ఘట్టకుండుటకై ప్రయత్నము చేయువారు- అని రామానుజభాష్యము.

ఆత్మసంయమమనెడి ఉపాయాగ్నియందు- అనిమధ్వభాష్యము

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః॥౨౮॥

యతయః సంశితవ్రతాః అపరే ద్రవ్యయజ్ఞాః=ప్రయత్నముకలవారును తీక్ష్ణమైనవ్రతముకలవారునగు మఱికొందఱు ద్రవ్యయజ్ఞముకలవారు- (అపరే) తపోయజ్ఞాః=(మఱికొందఱు) తపస్సనెడియజ్ఞముకలవారు- తథా అపరే యోగయజ్ఞాః=అట్లె (మఱికొందఱు) యోగమనెడియజ్ఞముకలవారు- (అపరే) స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ= (మఱికొందఱు) స్వాధ్యాయయజ్ఞంబునుజ్ఞానయజ్ఞంబునుకలవారు.

ద్రవ్యయజ్ఞులనఁగా పుణ్యతీర్థములయందు ధనమును వినియోగము చేసి దానిని యజ్ఞమని తలంచువారు- యోగయజ్ఞులు ప్రాణాయామాదియజ్ఞముం జేయువారు- వేదాధ్యయనము చేయువారు స్వాధ్యాయయజ్ఞులు· శాస్త్రార్థజ్ఞానము కలవారు జ్ఞానయజ్ఞులు. అని శంకరభాష్యము.

యుక్తముగా ద్రవ్యములను సంపాదించి, దేవతలం గూర్చిన దానములయందును యాగములయందును హోమములయందును ప్రయత్నము చేయువారు ద్రవ్యయజ్ఞులు- కృచ్ఛ్రచాంద్రాయణోపవాసాదులయందు నిష్ఠ కలవారు తపోయజ్ఞులు. పుణ్యతీర్థములను పుణ్యస్థానములను పొందుటకు ప్రయత్నము చేయువారు యోగయజ్ఞులు- వేదాధ్యయనాభ్యాసమునందును తదర్థజ్ఞానాభ్యాసమునందును ఆసక్తి కలవారు వరుసను స్వాధ్యాయయజ్ఞులును జ్ఞానయజ్ఞులును- అని రామానుజభాష్యము.

ద్రవ్యమును హోమము చేయువారు ద్రవ్యయజ్ఞులు- ఈ తపస్సనెడి హవిస్సును అబ్రహ్మాగ్నియందు అబ్రహ్మముయొక్క పూజకొఱకు హోమము చేయుచున్నాను అనుకొనువారు తపోయజ్ఞులు- అర్పణము నే హోమమని తలంచుట- అని మధ్వభాష్యము.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥ ౨౯॥
అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।

(అపరే) అపానే ప్రాణం జుహ్వతి=(మరికొందఱు) అపానవాయువులో ప్రాణవాయువును హోమము చేయుచున్నారు. తథా అపరే ప్రాణే అపానం (జుహ్వతి)=అట్లు మఱికొందఱు ప్రాణవాయువునందు అపానవాయువును (హోమము చేయుచున్నారు)- (అపరే) ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః (భవన్తి)=(మఱికొందఱు) ప్రాణాపానముల నడకలను నిలిపి ప్రాణాయామము ముఖ్యముగాఁగలవారు (అగుచున్నారు)- అపరే నియతాహారాః (సన్తః) ప్రాణేషు ప్రాణాన్ జుహ్వతి=ఇతరులు నియమింపఁబడిన (తగ్గింపఁబడిన) యాహారములు కలవారు (అగుచు) ప్రాణములయందు ప్రాణములను హోమము చేయుచున్నారు- ప్రాణాయామము చేయునప్పుడు మొదట రెండవ ముక్కుచెరమును మూసి ఒక్క ముక్కుచెరములోనుండి గాలిని లోపలకు పీల్చెదరు- దీనికి పూరకమని పేరు- తరువాత కొంతసేపు రెండు చెరములను బిగించి గాలిని లోపల నిలిపెదరు- ఇది కుంభకమనఁబడును- తరువాత పీల్చిన చెరముగాక రెండవ చెరము వెంట్రను

నిగించిన గాలిని మెల్లగా వెలుపలకు విడిచెదరు- దీనికి రేచకమని పేరు- ఇందు అపానే జుహ్వతి ప్రాణమ్ అని పూరకంబును, ప్రాణె ఽపానం తథాఽపరే అని రేచకంబును, ప్రాణాపానగతీరుద్ధ్వాఅని కుంభకంబును చెప్పంబడినవని యెఱుంగునది.

నోటఁగాని ముక్కునంగాని వాయువును వెలుపలకు వదలుట ప్రాణగతి- అట్లుగాక లోపలకు పీల్చుట అపానగతి- ప్రాణములను ప్రాణములలో హోమము చేయుటయనఁగా ఒక్కొక్కవాయువును జయించుచు జయింపఁబడినవాయువులో మిగిలిన వాయువును ప్రవేశపెట్టుట- అని శంకరభాష్యము.

ప్రాణాయామపరాయణాః నియతాహారాః అనునవి ముఱ్ఱురికిని అన్వయించును- ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి=ప్రాణాపానగతులను నిలిపి ప్రాణములను ప్రాణములలోనె హోమమును చేయుచున్నారు (సర్వప్రాణములను ఏకీభవింపఁజేయుచున్నారు)- అని కుంభకము చెప్పఁబడినది- అని రామానుజభాష్యము.

ప్రాణమును అపానములోనను అపానమును ప్రాణములోనను హోమము చేయుట కుంభకమునె తెలియఁజేయును- నియతాహారుండగుటను ప్రాణములు శోషించుట(ఇగురుట)వలన ప్రాణములను ప్రాణములలో హోమమును చేయుచున్నాఁడు- ప్రాణములను ప్రాణములలో హోమము చేయుటను, యచ్ఛేద్వాఙ్మనసీప్రాజ్ఞః( కఠ ౩- ౧౩ )అనుశ్రుతిలోఁ జెప్పఁబడినరీతిగానె నఁజెప్పవచ్చును- అని మధ్వభాష్యము.

సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥౩౦॥
యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ॥౩౧॥

ఏతే సర్వేఽపి=వీరు అందఱును, యజ్ఞవిదః యజ్ఞక్షపితకల్మషాః యజ్ఞశిష్టామృతభుజః = యజ్ఞము నెఱిఁగినవారును యజ్ఞముచే పోగొట్టబడినపాపములుకలవారును యజ్ఞమునమిగిలినఅమృతమును అనుభవించువారునై, సనాతనం బ్రహ్మ యాన్తి=శాశ్వతమైన బ్రహ్మమును పొందుచున్నారు- (హే) కురుసత్తమ! అయజ్ఞస్య అయం లోకః నాస్తి

=(ఓ) కౌరవశ్రేష్ఠుఁడా!, యజ్ఞములేనివానికి ఈలోకము లేదు- అన్యః కుతః (అస్తి)=మఱియొక్క లోకము దేనివలన కలుగును? యజ్ఞములు చేయఁగా మిగిలిన శేషమునకు అమృతమని పేరు.

యజ్ఞశిష్టామృతభుజః=యజ్ఞములు చేయఁగా మిగిలిన కాలమున ఆ యజ్ఞశేషమును తినుచున్నవారై- మోక్షేచ్ఛకలవారై యజ్ఞములను చేసినయెడను కాలక్రమమున మోక్షమును చెందుదురు- అని శంకరభాష్యము.

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్ ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే

ఎవం బహువిధాః యజ్ఞాః=ఇట్లు పలువిధంబులగు యజ్ఞములు, బ్రహ్మణః ముఖే వితతాః= బ్రహ్మముయొక్క ముఖంబున వ్యాప్తములైయున్నవి. తాన్ సర్వాన్ కర్మజాన్ విద్ధి=వానిని అన్నిటిని కర్మములచేఁబుట్టినవానినిగాను ఎఱుఁగుము-ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే=ఇట్లు తెలిసికొని మోక్షముం జెందఁగలవు.

బ్రహ్మముఖంబునను అనఁగా వేదద్వారంబుననుల - వేదద్వారంబున తెలియఁబడుచున్నవి గాన బ్రహ్మముఖంబున విస్తీర్ణంబులైనవియని చెప్పఁబడును- కర్మజములుఅనఁగా కాయికవాచిక మానసవ్యాపారంబులవలనఁ గలిగినవి- అనఁగా ఆత్మనిర్వ్యాపారుండగుటను ఇవి ఆత్మవలనఁబుట్టినవి కావనుట- ఇవినావ్యాపారములుకావు, నేనునిర్వ్యాపారుఁడనుగదా, అని తెలిసికొనువాఁడు సంసారపువిడుదలం బొందును - అనిశంకరభాష్యము.

యజ్ఞములనఁగా కర్మయోగములు - బ్రహ్మముయొక్క ముఖంబున (వేదాంతమునందు అనిరామానుజీయటీక-) వ్యాపించియున్నవి అనగా, ఆత్మయాథాత్మ్యప్రాప్తి సాధనములుగాఁ జెప్పఁబడియున్నవి- కర్మజములనుగాను అనఁగా నిత్యము ఆచరింపఁబడుచున్న నిత్యనైమిత్తికకామ్యకర్మములవలనఁబుట్టినవానిగాననుట - నేనుఁజెప్పినప్రకారముగా నాచరించి మోక్షముం జెందఁగలవు - అనిరామానుజభాష్యము.

బ్రహ్మణః ముఖే వితతాః=పరమాత్మయొక్క ముఖమునవిస్తరించియున్నవి(అనఁగాపరమాత్మభోగ్యములు అనుట అనిమధ్వటీక)- కర్మ

జ్ఞములు అనఁగా మానసవాచిక కాయిక కర్మములవలనఁ గలిగినవి- ఇట్లు తెలిసికొని అకర్మములంజేసి మోక్షమును జెందఁగలవు - మోక్షముకొఱకు, యుద్ధమునువిడిచి మతితొలఁకదానిని చేసినను, అదియు కర్మమెకదా- కాఁబట్టి విహితమైనదానిని విడువఁగూడదు - అనిమధ్వభాష్యము.

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే॥33॥

(హే) పరంతప (హే) పార్థ = (ఓ) శత్రువులనుతపింపఁజేయువాఁడా (ఓ) యర్జునుఁడా, ద్రవ్యమయాత్ యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః శ్రేయాన్ = ద్రవ్యములతోఁ జేరినయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము మంచిది- అఖిలం సర్వం కర్మ = అఖిలమును సమస్తమునైన కర్మము, జ్ఞానే పరిసమాప్యతే = జ్ఞానమున పూర్తిచేయఁబడుచున్నది.

ద్రవ్యమయమనఁగా ద్రవ్యమనెడి సాధనముచేత సాధింపఁబడఁదగినది- ద్రవ్యయజ్ఞముఫలమును కలుగఁజేయును- జ్ఞానయజ్ఞముఫలమును కలుగఁజేయదుగాన ద్రవ్యయజ్ఞముకంటె శ్రేష్ఠము- అఖిలమనఁగా ప్రతిబంధింపఁబడనిది- కర్మ జ్ఞానే పరిసమాప్యతే అనుదానికి కర్మము జ్ఞానమున నంతర్భవింపుచున్నది- అనియర్థము-([redacted] ౨ అ॥౪౬ శ్లో॥) అని శంకరభాష్యము.

కర్మములలో ద్రవ్యమయాంశమును జ్ఞానమయాంశమనను రెండంశములు కలవు- అందు ద్రవ్యమయాంశంబుకంటె జ్ఞానమయాంశము శ్రేష్ఠము- అఖిలమ్ అనుదానికికర్మముకంటెమిగిలిన ఉపాదేయము (స్వీకరింపఁదగినది) అంతయునుఅనియర్థము- సమస్తసాధనములచేఁ బొందఁదగినజ్ఞానముకర్మాంతర్గతముగనట్లు అభ్యసింపఁబడుచున్నదై క్రమముగా ప్రాప్య(పొందవలసిన)దశను పొందును- అనిరామానుజభాష్యము

అఖిలమ్ అనుదానికి ఉపాసనకొఱకైన యంగములతోఁగూడినఅని యర్థము- కర్మమంతయు జ్ఞానముఫలముగాఁ గలదే- అనిమధ్వభాష్యము.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥34॥

తత్ ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా (చ) విద్ధి = దానిని జ్ఞా

నముచు) నమస్కారముచేతనను అడుగుటచేతనను శుశ్రూషచేత నను తెలిసికొనుము- తత్త్వదర్శినః జ్ఞానినః=తత్త్వము నెఱింగిన జ్ఞానులు, తే జ్ఞానమ్ ఉపదేక్ష్యన్తి=నీకు జ్ఞానమును ఉపదేశింపఁగలరు.

ప్రణిపాత మనఁగా దీర్ఘనమస్కారము- పరిప్రశ్నమనఁగా, బంధ మెట్లు కలుగును? మోక్ష మెట్లు గలుగును? అవిద్య యేది? విద్య యేది? అని యిట్లు అడుగుట- జ్ఞానవంతులైనను కొందఱు తత్త్వము నెఱుంగరు గాన తత్త్వదర్శినః అను విశేషణము వేయఁబడినది- అని శంకరభాష్యము-

యుక్తమైన కర్మమును ఆచరించుచున్నవాఁడవై- ఆత్మస్వరూప సాక్షాత్కారము కలవారికి నమస్కారాదులం జేసి, వారివలన ఆత్మజ్ఞానోపదేశమును పొందఁగలవు- అని రామానుజభాష్యము-

యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాణ్డవ।
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి ॥౩౫॥

(హే) పాణ్డవ!=(ఓ) పాండవుఁడా!, యత్ జ్ఞాత్వా=దేనిని తెలిసికొని, పునః ఏవం మోహం నయాస్యసి=తిరిగియును ఇట్లు అజ్ఞానమును పొందవో- యేన=దేనిచేతను, ఆత్మని అథో మయి=ఆత్మయందును అటుపైని నాయందును, భూతాని అశేషేణ ద్రక్ష్యసి=భూతములను నిశ్శేషముగా చూచుచున్నావో-

భూతములనఁగా బ్రహ్మాది స్తంబపర్యంతమైన ప్రాణిజాతము- జ్ఞానుల యుపదేశమును పొంది అన్ని యుపనిషత్తులయందును ప్రసిద్ధమైన క్షేత్రజ్ఞేశ్వరైక్యమును తెలిసికొందువు- అనిశంకరభాష్యము

మోహమనఁగా ఆత్మలయందు దేహాద్యభిమానము- అదియె మమకారాదులకు ఆధారము- ప్రకృతిసంబంధము లేని యాత్మలన్నియు అన్యోన్యము తుల్యముగానుండును- సర్వేశ్వరునితోనును తుల్యముగానుండును- అని రామానుజభాష్యము-

ఇప్పుడు గూడ నర్జునుఁడు జ్ఞానియె- (ప్రారబ్ధవశమువలన) తిరోభావము(మూయఁబడుట) కలుగుటవలన మోహము కలిగినది- ఏ జ్ఞానముచేత ఆత్మభూతుండనగు నాయందు సమస్తభూతములనును చూ

చున్నావో (అన్నిటికిని నేను ఆధారమని చూచుచున్నావో) - అథో అనుదానికి మోహనాశము కలిగిన తరువాతను, అని యర్థము- అని మధ్వభాష్యము-

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥౩౬॥

సర్వేభ్యః పాపేభ్యః పాపకృత్తమోఽపి అసి చేత్ =అందఱు పాపులకంటె మిక్కిలి పాపములను జేసినవాఁడవు కూడను అగుదువేని, సర్వం వృజినం జ్ఞానప్లవేనైవ సంతరిష్యసి=సమస్తమైన పాపమునను జ్ఞానమనెడు తెప్పచేతనె దాటఁగలవు- (శ. భాష్యము-

ఇచట వృజినశబ్దముచే పుణ్యముగూడ గ్రహింపఁబడును. ఆనిశంక సాధనమైన జ్ఞానముయొక్క ప్రశంస ఈశ్లోకము మొదలు మూడుశ్లోకములచేఁ జేయఁబడును- అని మధ్వభాష్యము-

యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥౩౭॥

(హే) అర్జున! =(ఓ) యర్జునుఁడా!, యథా సమిద్ధః అగ్నిః ఏధాంసి భస్మసాత్కురుతే=ఎట్లు లెస్సగాఁ బ్రకాశించిన అగ్ని సమిత్తులను (కట్టెలను) సంపూర్ణముగా భస్మముచేయునో, తథా జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే=అట్లు జ్ఞానమనెడియగ్ని అన్నికర్మములను సంపూర్ణముగా భస్మముచేయును-

ఏ కర్మముచే శరీరము ఆరంభింపఁబడెనో, ఆకర్మము (ప్రారబ్ధము), అనుభవముచేతనె నశింపవలసినది- కాఁబట్టి ఈ సమ్యగ్జ్ఞానము పుట్టుటకు ముందు చేయఁబడినవియు జ్ఞానముతోఁ గూడ కలిగినవియు అనేకపూర్వజన్మములయందు చేయఁబడినవియు నగు కర్మములన్నిటిని [మాత్రమె జ్ఞానము నశింపఁజేయును- అని శంకరభాష్యము-

నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥౩౮॥

జ్ఞానేన సదృశం పవిత్రమ్ ఇహ నవిద్యతే=జ్ఞానముతో తుల్యమైన శుద్ధినిచ్చునది ఈలోకమున లేదు- స్వయం యోగసంసిద్ధః (సన్) =స్వయముగా యోగమును సిద్ధింపఁజేసినవాఁడై, అ

యుచును), కాలేన ఆత్మని తత్ విన్దతి=కాలక్రమమున ఆత్మయందు దానిని(జ్ఞానమును) పొందుచున్నాఁడు-

యోగమనఁగా కర్మయోగంబును సమాధియోగంబును- సంసిద్ధుఁడనఁగా యోగ్యతను పొందినవాఁడు- అని శంకరభాష్యము-

గురూపదేశానుసారంబున ప్రతిదినంబును జ్ఞానాకారముగా నాచరింపఁబడుచున్న కర్మయోగముచే సిద్ధిని పొందినవాఁడు ఆత్మజ్ఞానమును తనంతటనె పొందుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరే ణాధిగచ్ఛతి॥౩౯॥

శ్రద్ధావాన్ తత్పరః సంయతేన్ద్రియః జ్ఞానం లభతే=శ్రద్ధకలవాఁడును ఆసక్తి కలవాఁడును నియమింపఁబడిన(విషయములనుండి మరలింపఁబడిన)ఇంద్రియములు కలవాఁడును జ్ఞానమును పొందుచున్నాఁడు- జ్ఞానం లబ్ధ్వా=జ్ఞానమును పొంది, అచిరేణ పరాం శాన్తిమ్ అధిగచ్ఛతి=కొద్దికాలముననె గొప్ప శాంతిని పొందుచున్నాఁడు-

శ్రద్ధావంతుఁడనఁగా నమ్మకము కలవాఁడు- తత్పరుఁడనఁగా గురువుల సేవ మొదలగువానియందు ప్రవర్తించినవాఁడు- నమస్కారాదికము శరీరధర్మముగాన మోసకాండ్రు నుండరుగాన వానింబట్టి జ్ఞానము తప్పక కలుగునని చెప్ప శక్యముకాదు- శ్రద్ధాదికము మనోధర్మముగాన తప్పక జ్ఞానలాభమునకు ఉపాయమగును- ఈజ్ఞానలాభమువలన శాంతిని అనఁగా మోక్షమును పొందును- అని శంకరభాష్యము.

శ్రద్ధావంతుఁడనఁగా జ్ఞానమును వృద్ధిపొందించికొనుట యందు శ్రద్ధకలవాఁడు- తత్పరుఁడనఁగా దానియందె మనస్సుకలవాఁడు- సంయతేంద్రియుఁడనఁగా మిగిలిన విషయములనుండి మరలింపఁబడిన ఇంద్రియములు కలవాఁడు- అని రామానుజభాష్యము-

ఈ శ్లోకము జ్ఞానసాధనమును తెలుపును- అని మాధ్వభాష్యము-

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥౪౦॥

అజ్ఞః వినశ్యతి=అజ్ఞుఁడు నశించుచున్నాఁడు- అశ్రద్దధానశ్చ (విన

శ్యతి]=నమ్మకున్నవాఁడును (నశింపుచున్నాఁడు)- సంశయాత్మా చ (వినశ్యతి]=సంశయచిత్తముకలవాఁడును(నశింపుచున్నాఁడు)- సంశయాత్మనః అయం లోకః నాస్తి=సంశయాత్మునకు ఈ లోకము లేదు- పరః న=పరలోకము లేదు- సుఖం న=సుఖము లేదు-

ఆత్మజ్ఞానములేనివాఁడును విశ్వాసము లేనివాఁడునుగూడ చెడుదురుగాని సంశయాత్మ చెడినంత చెడరు. సంశయాత్మ పాపిష్ఠుఁడు- అని శంకరభాష్యము.

ఉపదేశమువలన కలిగిన జ్ఞానములేనివాఁడును, ఉపదేశింపఁబడిన జ్ఞానమును వృద్ధిపొందించికొనుట యందుత్వర లేనివాఁడును, ఉపదేశింపఁబడినజ్ఞానమందు సంశయమనస్సుకలవాఁడును చెడుదురు- ఈ సంశయాత్మునకు ఈ లోకము మొదలగునవియె లేనియప్పుడు మోక్షమెట్లు కలుగును?- కావున సంశయాత్మ సుఖలేశమునైనఁ బొందుట సంభవింపదు- అని రామానుజభాష్యము.

ఈ శ్లోకము మొదలు జ్ఞానవిరోధిఫలము చెప్పఁబడుచున్నది-అని మధ్వభాష్యము.

యోగసంన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ ।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ॥౪౧॥

(హే) ధనంజయ!=(ఓ)యర్జునుఁడా!, యోగసంన్యస్తకర్మాణమ్ జ్ఞానసంఛిన్నసంశయమ్ ఆత్మవన్తమ్=యోగముచేత సంన్యసింపఁబడిన కర్మములుగలవాఁడును జ్ఞానముచేత తెగఁగొట్టఁబడిన సంశయములకలవాఁడును దృఢమైనమనస్సుకలవాఁడు నగువాని, కర్మాణి న నిబధ్నన్తి=కర్మములు బంధింపవు

యోగమనఁగా పరమార్థజ్ఞానము- దానిచేత ధర్మాధర్మరూపములగు కర్మములను విడిచినవాఁడును, ఆత్మయును ఈశ్వరుఁడును ఒక్కఁడె అను జ్ఞానముచే పోయిన సంశయముకలవాఁడును, ఆత్మవంతుఁడును అనఁగా పొరపాటులేనివాఁడు నగువాని, సత్త్వరజస్తమోగుణ వ్యాపారరూపములైన కర్మములు బంధింపవు- అనఁగా అనిష్టాదిఫలములం గలుగఁజేయవనుట- అని శంకరభాష్యము.

వెనుకఁజెప్పఁబడిన యోగముచే సంన్యసింపఁబడిన అనఁగా జ్ఞా

నా కారమును పొందింపఁబడిన కర్మములు కలవాఁడు. కర్మములనఁగా బంధమునకు హేతువులయిన ప్రాచీనకర్మములు. అని రామానుజభాష్యము.

తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః॥
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత॥౪౨॥

తస్మాత్ = ఆ హేతువువలన, అజ్ఞానసంభూతం హృత్‌స్థమ్ ఆత్మనః ఏనం సంశయం ఛిత్త్వా = అజ్ఞానమువలనఁగలిగినదియు హృదయమునసున్నదియునగు ఆత్మయొక్క (ఆత్మవిషయమగు) ఈ సంశయమును ఛేదించి, యోగమ్ ఆతిష్ఠ = యోగమును ఆచరింపుము. (హే) భారత! = (ఓ) భరతవంశమువాఁడా!, ఉత్తిష్ఠ = లెమ్ము.

అజ్ఞానమనఁగా అవివేకము. హృదయమనఁగా బుద్ధి. యోగమును అనఁగా పరమార్థజ్ఞానమునకు సాధనమైన కర్మాచరణమును చేయుము. యుద్ధమునకు లెమ్ము. అని శంకరభాష్యము.

అజ్ఞానమనఁగా అనాదిగానుండెడిది. కర్మయోగానుష్ఠానమును చేయుము. దానినిమిత్తము లెమ్ము. అని రామానుజభాష్యము.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యో
గశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగో నామ
చతుర్థోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాద
కంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదం
బునగు భగవద్గీతలలో జ్ఞానయోగప్రతిపాద
కంబగు నాలుగవ యధ్యాయము.

బొంబయిలో అచ్చువేసిన మధుసూదనటీక పుస్తకములో (బ్రహ్మార్పణయోగో నామ) బ్రహ్మార్పణయోగప్రతిపాదకంబగు నాలుగవ యధ్యాయము అనియున్నది.

## అయిదవయధ్యాయము.

### అర్జునఉవాచ.

సంన్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగంచ శంససి।
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥౧॥

(హే) కృష్ణ!=(ఓ) కృష్ణుఁడా!, కర్మణాం సంన్యాసం పునః యోగంచ శంససి=కర్మముల సంన్యాసమునను తిరిగి యోగమునను జెప్పుచున్నావు- ఏతయోః యత్ ఏకం శ్రేయః=వీనిలో నేది ఒకటి మేలైనదో, సునిశ్చితం తత్ మే బ్రూహి=లెస్సగా నిశ్చయింపఁబడిన దానిని నాకు జెప్పుము.

ఒక్క పురుషుఁడు సంన్యాసమును కర్మయోగమును గూడ నాచరించుట సంభవింపదు- అని శంకరభాష్యము.

కర్మములసంన్యాసమనఁగా జ్ఞానయోగము. రెండవయధ్యాయములో మొదట కర్మయోగమునే చేయునది, దానిచేత అంతఃకరణశుద్ధి కలిగినపైని జ్ఞానయోగమును చేయునది, అని చెప్పఁబడినది-తృతీయచతుర్థాధ్యాయములలో, జ్ఞానయోగాధికారపు దశను పొందినవానికిని కర్మనిష్ఠయె ప్రశస్తమైనది, అది జ్ఞానములేకయె ఆత్మప్రాప్తికి సాధనముగును, అని కర్మయోగము ప్రశంసింపఁబడినది- ఈ జ్ఞానయోగకర్మయోగములలో,సులభముగా నాచరింపదగినదియు ఆత్మప్రాప్తిని శీఘ్రముగా కలిగించునదియు అగుటను ఏదిమేలైనదో దానిం జెప్పుము-అని రామానుజభాష్యము.

నియమించుట మొదలగువానిచే నన్నిలోకముల నాకర్షించువాఁడుగాన కృష్ణుఁడనఁబడును- సంన్యాసమే శ్రేష్ఠమైనయెడల దానికి ఈ యుద్ధము విరుద్ధము- అనిప్రశ్నతాత్పర్యము. సంన్యాసమనఁగా యత్యాశ్రమము కాదు- సంన్యాసస్వరూపమును భగవంతుఁడె (౩అ॥౩శ్లో॥)చెప్పెఁగలఁడు- అని మధ్వభాష్యము-

### శ్రీభగవానువాచ.

సంన్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ।
తయోస్తు కర్మసంన్యాసాత్ కర్మయోగో విశిష్యతే॥౨॥

సంన్యాసః కర్మయోగశ్చ (ఇత్యేతౌ) ఉభౌ నిశ్శ్రేయసకరౌ=సంన్యాసంబును కర్మయోగంబును (అనునీ) రెండును మోక్షమును గలుగఁజేయునవి- తయోః కర్మయోగః కర్మసంన్యాసాత్ విశిష్యతే= వానిలో కర్మయోగము కర్మసంన్యాసముకంటె విశేషించుచున్నది.

సంన్యాసమనఁగా కర్మములను విడుచుట- కర్మయోగమనఁగా కర్మములనాచరించుట- ఈ రెండును జ్ఞానము పుట్టుటకు హేతువులగుటను మోక్షమును కలుగఁజేయునవియైనను వానిలో కర్మయోగమె ప్రశస్తమని కర్మయోగము స్తోత్రము చేయఁబడుచున్నది. అని శంకరభాష్యము.

జ్ఞానయోగకర్మయోగములు రెండును ఒకటి దానియపేక్షయె యొకదానికి లేకయె నిశ్శ్రేయసమును కలుగఁజేయునవి- అని రామానుజభాష్యము.

జ్ఞేయ స్స నిత్యసంన్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే॥

యః న ద్వేష్టి న కాఙ్క్షతి=ఎవ్వఁడు ద్వేషింపఁడో కోరఁడో, సః నిత్యసంన్యాసీ జ్ఞేయః=వాఁడు నిత్యముగా సంన్యాసిగా తెలియఁబడఁదగినవాఁడు- (హే) మహాబాహో!= (ఓ) గొప్పభుజములుకలవాఁడా!, నిర్ద్వన్ద్వః బన్ధాత్ సుఖం ప్రముచ్యతే హి=ద్వంద్వములులేనివాఁడు బంధమునుండి సుఖముగా విడువఁబడుచున్నాఁడుగదా.

కర్మయోగికర్మములనాచరించుచున్నను రాగద్వేషములులేనివాఁడేని నిత్యసంన్యాసియనఁబడును. అని శంకరభాష్యము.

కర్మయోగియై యుండి కర్మయోగములో నంతర్భవించియున్న యాత్మానుభవమందే తృప్తిని పొందినవాఁడై మఱి దేనినైనను గోరుటయు మఱిదేనినైనను ద్వేషించుటయు లేకుండునేని నిత్యసంన్యాసి అనఁగా నిత్యజ్ఞాననిష్ఠుఁడని చెప్పఁబడును- అని రామానుజభాష్యము.

ఈ శ్లోకము సంన్యాసశబ్దార్థమును తెలియఁజేయును. సంన్యాసము జ్ఞానమునకు అంతరంగమని మధ్వభాష్యము.

సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః।
ఏకమ ప్యాస్థిత స్సమ్య గుభయో ర్విన్దతే ఫలమ్॥౪॥

బాలాః సాంఖ్యయోగౌ పృథక్ ప్రవదన్తి=అజ్ఞులు సాంఖ్యయోగములను వేఱుగాను చెప్పుచున్నారు. పణ్డితాః న (ప్రవదన్తి)=పండితులు చెప్పరు. ఉభయోః ఏకమపి సమ్యక్ ఆస్థితః=రెంటిలో ఒకదానిని నైనను బాగుగా అవలంబించినవాఁడు ఉభయోః ఫలం విన్దతే=రెంటియొక్క ఫలమును పొందుచున్నాఁడు.

వేఱుగాఁజెప్పుట యనఁగా విరుద్ధములైన ప్రత్యేకఫలములు గలవనుట. సాంఖ్యయోగములు రెంటికిని మోక్షమే ఫలము. కాఁబట్టి ఫలమున విరోధము లేదు. జ్ఞానముతోఁగూడిన కర్మసంన్యాసము(కర్మములను విడుచుట) సాంఖ్యశబ్దమును. జ్ఞానసాధనమైనసమబుద్ధితోఁగూడిన కర్మమే యోగము. అని శంకరభాష్యము.

కర్మయోగము జ్ఞానయోగమును గలుగఁజేయు ననియు, జ్ఞానయోగము ఆత్మావలోకనమును గలుగఁజేయు ననియు, ఫలభేదములను చెప్పువారు పండితులు కారు. రెండిటికిని ఆత్మావలోకనమే ఫలము. అని రామానుజభాష్యము. [ము. అని మధ్వభాష్యము.

సాంఖ్యయోగములు రెండును అంతరంగములగుటచే విరోధము లే

యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి ॥౫॥

యత్ స్థానం సాంఖ్యైః ప్రాప్యతే=ఏ స్థానము సాంఖ్యులచే పొందఁబడుచున్నదో, తత్ యోగైరపి గమ్యతే=అది యోగులచేతను పొందఁబడుచున్నది. సాంఖ్యంచ యోగంచ ఏకం యః పశ్యతి=సాంఖ్యమును యోగమును ఒకటిగా ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో, సః పశ్యతి=వాఁడు తెలిసికొనుచున్నాఁడు.

జ్ఞాననిష్ఠులగు సంన్యాసులచేతఁ బొందఁబడెడి మోక్షము, కర్మములనన్నిటిని ఈశ్వరునకు అర్పించి తనకు ఫలమును గోరక కర్మములనాచరించెడి యోగులచేతఁగూడ పొందఁబడుచున్నది. ఇట్టి కర్మము జ్ఞానప్రాప్తిని గలుగఁజేసి తద్ద్వారమున మోక్షమును గలుగఁజేయును. కాఁబట్టి ఫలముచే ఒకటి యగుటను సాంఖ్యయోగములు రెండు నొక్కటియే. అని శంకరభాష్యము.

జ్ఞానముచేఁ బొందఁబడెడి ఆత్మావలోకనమే కర్మయోగమున

ష్ఫలచేఁ బొందఁబడును. ఇట్లు ఫలమొకటియగుటచే జ్ఞానయోగకర్మయోగములు ఒకటి అనఁగా వైకల్పికములు అగుట-అని రామానుజభాష్యము. వైకల్పికము లనఁగా దేని నాచరించినను రెండవదాని నాచరింపనక్కఱలేనివి.

యోగముచేఁగూడ జ్ఞానద్వారమున జ్ఞానఫలము పొందఁబడుచున్నది. అని మధ్వభాష్యము.

సంన్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః।
యోగయుక్తో ముని ర్బ్రహ్మ నచిరే ణాధిగచ్ఛతి॥౬॥

(హే)మహాబాహో!=(ఓ)గొప్పభుజములుకలవాఁడా!, సంన్యాసస్తు అయోగతః ఆప్తుమ్ దుఃఖమ్=సంన్యాసమైతే యోగము లేక పొందుటకు శక్యముకానిది. యోగయుక్తః మునిః=యోగముతోఁగూడిన ముని, నచిరేణ బ్రహ్మ అధిగచ్ఛతి=శీఘ్రముగా బ్రహ్మమును పొందుచున్నాఁడు.

వెనుకటి శ్లోకముచొప్పున కర్మయోగముకంటె సంన్యాసమె శ్రేష్ఠమగుచున్నది. ఇట్లుండఁగా కర్మసంన్యాసముకంటె కర్మయోగమె శ్రేష్ఠము(౫అ॥౨శ్లో॥) అని చెప్పినది ఎట్లు సంధఠించు ననిన —వినుము. నీవు కేవలమైన కర్మసంన్యాసము కేవలమైన కర్మయోగము వీనిలో నేది శ్రేష్ఠమని అడిగినదానికి కర్మసంన్యాసముకంటె కర్మయోగమె శ్రేష్ఠమని దానికి తగిన యుత్తరమును చెప్పితిని. ఈ చెప్పినది జ్ఞానము నుద్దేశించి చెప్పఁబడలేదు. జ్ఞానాపేక్ష గల సంన్యాసము సాంఖ్యమని నా యభిప్రాయము. అదియె పరమార్థ యోగము. వైదికమైన కర్మయోగము కూడ దానికి అంగ మగుటను సంన్యాసమనియు యోగమనియుఁ జెప్పఁబడును. ఇట్లు వైదికకర్మ యోగము సాంఖ్యమునకు అంగ మగుటను తెలియఁజేయునదియె ఈశ్లోకము. ఈశ్లోకమున యోగమనఁగా వైదికకర్మయోగము. అది ఈశ్వర సమర్పితంబును ఫలాపేక్షలేనిదియు నగు కర్మాచరణము. ముని యనఁగా ఈశ్వరస్వరూపమును తలంచుచున్న కర్మయోగి. బ్రహ్మమును, అనఁగా బ్రహ్మజ్ఞానమును, అనఁగా పూర్వము చెప్పఁబడిన పరమార్థసంన్యాసమును పొందుచున్నాఁడు. కాబట్టియె నాచేత క

చును, కించిత్ నకరోత్యేవ ఇతి=ఒకదానినైనను చేయకయేయున్నాను అని, యుక్తః(సన్) మన్యేత=సమాహితచిత్తుఁడు (అగుచు) తలంచునది.

ఇట్లు అన్నివ్యాపారములును అకర్మములు అనెడి జ్ఞానము కలవానికి, కర్మము లేదను జ్ఞానము కలుగుటవలన కర్మసంన్యాసమందె అధికారము- ఎండమావులలో నీరున్నదని తలంచి త్రాగుటకు ప్రవర్తించినవాఁడు నీరు లేదనుజ్ఞానము కలిగినపైని జలపానమునకు ప్రవర్తింపఁడుగదా. అని శంకరభాష్యము.

ఆత్మతత్త్వము నెఱింగినవాఁడు, జ్ఞానమె స్వభావముగాఁగల నాకు కర్మమూలకంబగు ఇంద్రియ ప్రాణసంబంధమువలన ఇట్టి కర్తృత్వము కలిగినదిగాని, కర్తృత్వము స్వరూపప్రయుక్తము(స్వభావ సిద్ధము) కాదని తలంచునది- అని రామానుజభాష్యము.

ఈ శ్లోకములు రెండును సంన్యాసమును స్ఫుటపఱచుచున్నవి- అని మధ్వభాష్యము.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివామ్భసా॥౧౦॥

కర్మాణి బ్రహ్మణి ఆధాయ=కర్మములను బ్రహ్మమునందు ఉనిచి, సఙ్గం త్యక్త్వా=సంగమును విడిచి, యః కరోతి=ఎవ్వఁడు కర్మమును చేయుచున్నాఁడో, పద్మపత్రమ్ అమ్భసేవ = తామరాకు నీటిచేతవలె, సః పాపేన నలిప్యతే=వాఁడు పాపముచేత పూయఁబడఁడు.

ఈశ్లోకము కర్మసంన్యాసమును చేయనివానిం గూర్చినది- భృత్యుఁడు తన స్వామికొఱకు పనులంజేసినట్లు ఈశ్వరునికొఱకు కర్మములంజేయుచు మోక్షమనెడి ఫలమునందుఁగూడ సంగము లేనివాఁడు పాపముతో సంబంధింపఁడు- అని శంకరభాష్యము.

బ్రహ్మమనఁగా ప్రకృతి- వెనుకటి శ్లోకమునం జెప్పినచొప్పున కర్మముల కర్తృత్వమును ఇంద్రియరూపముగాఁ బరిణమించిన ప్రకృతియందునిడి, ఫలసంగమును విడిచి, నేనేమియు చేయుటలేదనుకొని, కర్మములఁజేయువాఁడు దేహాత్మాభిమానరూపమై బంధహేతువగు పాప

ము చే పూయంబడఁడు- అని రామానుజభాష్యము.

సంన్యాసయోగముతోఁ గూడినవాఁడె కర్మలేపముం బొందఁడను- అని యీశ్లోక తాత్పర్యము- అని మధ్వభాష్యము.

> కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియై రపి।
> యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాऽऽత్మశుద్ధయే॥ ౧౧॥

యోగినః ఆత్మశుద్ధయే సఙ్గం త్యక్త్వా=యోగులు ఆత్మశుద్ధికొఱకు సంగమును విడిచి, కాయేన మనసా బుద్ధ్యా కేవలైః ఇన్ద్రియై రపి కర్మ కుర్వన్తి=శరీరము చేతను మనస్సుచేతను బుద్ధిచేతను కేవలములైన ఇంద్రియములచేతనును కర్మమును చేయుచున్నారు.

కేవలములనఁగా మమకారము లేనివనుట- కర్మములం జేయుట ఈశ్వరునికొఱకుగాని ఫలముకొఱకుగాదని తలఁచి, ఫలసంగమును విడిచి, యోగులు అనఁగా కర్మయోగులు, సత్త్వశుద్ధికొఱకు కర్మముం జేయుదురు- అని శంకరభాష్యము.

శరీరాములచే సాధింపఁదగిన కర్మమును స్వర్గాది ఫలసంగమును విడిచి ఆత్మయందుండెడి ప్రాచీనకర్మబంధము నశించుటకొఱకు చేయుదురు- అని రామానుజభాష్యము.

ఇట్లు పూర్వుల యాచారము కల్లదని తెలియఁజేయునది ఈశ్లోకము- అని మధ్వభాష్యము.

> యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్।
> అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ ౧౨॥

యుక్తః=యుక్తుఁడు, కర్మఫలం త్యక్త్వా=కర్మఫలమును విడిచి, నైష్ఠికీమ్ శాన్తిమ్ ఆప్నోతి=నిష్ఠయందుకలిగిన శాంతిని పొందుచున్నాఁడు- అయుక్తః=యుక్తుఁడుకానివాఁడు, కామకారేణ ఫలే సక్తః(సన్) నిబధ్యతే=కామప్రేరణచేత ఫలమునందు ఆసక్తుఁడు (అగుచు) బంధింపఁబడుచున్నాఁడు.

ఈశ్వరునికొఱకు కర్మములం జేయుచున్నాను, నాఫలముకొఱకు కాదు, అను చిత్తసమాధానముకలవాఁడు యుక్తుఁడు-అట్టివాఁడై కర్మములం జేయువాఁడు, దానివలన, సత్త్వశుద్ధి(అంతఃకరణపరిశుద్ధి), జ్ఞానము కలుగుట, అన్నికర్మములనువిడుచుట, జ్ఞాననిష్ఠ కలుగుట, అనునవి

కర్తృత్వము ఆత్మయొక్క ప్రాదేశికధర్మములయిన దేహసంబంధములవలన వచ్చినదిగాని స్వరూపము గాదు. వచ్చినదానిని వివేకముగలమనస్సుతో సమస్తకర్మములను నవరంధ్రములుగల శరీరమున సంన్యసించి అనఁగా కర్తృత్వమును విడిచి, తాను దేహమును అధిష్ఠించి యుండుటయందలి ప్రయత్నమును చేయక దేహముచేత చేయింపనివాఁడునై సుఖముగానున్నాఁడు- అని రామానుజభాష్యము.

ఈశ్లోకముగూడ సంన్యాసశబ్దార్థమును వివరించుచు- మనస్సుచే తననుటచే అభిమానత్యాగము చెప్పఁబడుచున్నది- అని మధ్వభాష్యము.

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥౧౪॥

ప్రభుః కర్తృత్వం న(సృజతి)=ఆత్మ కర్తృత్వమును సృజింపఁడు- లోకస్య కర్మాణి న సృజతి = లోకముయొక్క కర్మములను సృజింపఁడు- కర్మఫలసంయోగం న(సృజతి)=కర్మఫలముల సంబంధమును సృజింపఁడు- స్వభావస్తు ప్రవర్తతే=స్వభావమె ప్రవర్తించుచున్నది.

కర్మములనఁగా లోకమునకు ఇష్టములైన రథములు పంటలు మేడలు మొదలగునవి- కర్మఫలసంయోగమనఁగా ఇట్టి రథాదులను చేసినవానికి వానిఫలములతో సంబంధము- స్వభావము అనఁగా అవిద్యాస్వరూపమైన ప్రకృతియనెడి మాయయె ప్రవర్తించుచున్నది- అని శంకరభాష్యము.

దేవతలు తిర్యక్కులు(పశుపక్ష్యాదులు) స్థావరములు అనెడి స్వరూపముగా ప్రకృతితోఁ జేరియున్న ఈలోకముయొక్క వానివాని(దేవాదుల)కర్తృత్వమును, వానివాని కర్మములను, ఆకర్మములవలనఁ గలిగెడి దేవాదిఫలసంబంధములను, ప్రభువు అనఁగా కర్మవశ్యుఁడు కాక స్వాభావికమైన స్వరూపములోనుండెడి యాత్మ సృజింపఁడు. మఱియేమన్నను— ఈకర్తృత్వాదికమంతయును అనాదికాలమునుండి కలిగిన పూర్వపూర్వకర్మములవలన దేవాదిస్వరూపమైన ప్రకృతిసంసర్గముచేఁ గలుగఁ జేయఁబడిన ఆయాయాకారాభిమానముచేఁ గలిగిన వాసనలచే కలుగఁ జేయఁబడినదియె- స్వరూపముచేత కలిగినదికాదు.

శింపఁబడినవో, తేషాం జ్ఞానమ్=వారిజ్ఞానము, తత్ పరమ్ = ఆదిత్యవత్ ప్రకాశయతి=ఆ పరతత్త్వమును సూర్యునివలె ప్రకాశింపఁ జేయును.

జ్ఞానమనఁగా ఆత్మవిషయమగు వివేకజ్ఞానము. ఆవరించుటచే మోహమును కలుగఁజేసెడి యెవరి యజ్ఞానము ఆత్మవిషయమగు వివేకజ్ఞానముచేత నశింపఁజేయఁబడినదో, వారిజ్ఞానము సూర్యునివలె అన్నివస్తువులను ప్రకాశింపఁజేయుచున్నది. అదియె పరమార్థతత్త్వము. అని శంకరభాష్యము.

ఆత్మనామ్ అనిపాఠము. యేషామ్ ఆత్మనామ్ జ్ఞానేన=ఏ యాత్మలయొక్క ఆత్మజ్ఞానముచేత, కర్మసంచయరూపమయిన అజ్ఞానము నశింపఁజేయఁబడినవో, వారియొక్క, స్వాభావికమై, పరమ్=ఉత్కృష్టమైన, తత్ జ్ఞానమ్=ఆజ్ఞానము, సంకోచము లేనిదై, సమస్తమును ప్రకాశింపఁజేయును. అని రామానుజభాష్యము.

ఈశ్వరాపరోక్షజ్ఞానమె అజ్ఞాననాశకము, అని ఈశ్లోకము తెల్పుచున్నది. అని మధ్వభాష్యము.

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః।
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥ ౧౭॥

తద్బుద్ధయః=దానియందుబుద్ధికలవారును, తదాత్మానః=అదియె యాత్మయనితలంచువారును, తన్నిష్ఠాః=దానియందె యభినివేశముకలవారును, తత్పరాయణాః=అదియెపరమగతిగాఁగలవారును, జ్ఞాననిర్ధూతకల్మషాః=జ్ఞానముచేతఁబోఁగొట్టఁబడినపాపములుగలవారును, అపునరావృత్తిం గచ్ఛన్తి=పునరావృత్తిలేకపోవుటను పొందుచున్నారు.

తచ్ఛబ్దముచే బ్రహ్మము చెప్పఁబడును. ఈ చెప్పఁబడినలక్షణములు గల సంన్యాసులు వెండియు దేహసంబంధమును పొందరు. అని శంకర భాష్యము.

తచ్ఛబ్దముచే నాత్మ చెప్పఁబడును. తదాత్మానః=ఆయాత్మవిషయమైన మనస్సుగలవారు. తన్నిష్ఠాః=దానియభ్యాసమునందు ఆసక్తులైనవారు. తత్పరాయణాః=అదియె పరమప్రయోజనమని తలంచువారు. ఏయవస్థలోనున్నయాత్మకు పునరావృత్తి లేదో ఆ యాత్మ

మొదలగుదానితోఁగూడిన ఆత్మ కలవాఁడయ్యేని, అక్షయసుఖము నొందుచున్నాఁడు. ధ్యానాదులతోఁగూడినవానికే అక్షయమైన యాత్మసుఖము కలుగును. మఱియొకవిధముగాఁ గలుగదు. అని మధ్వభాష్యము

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః॥౨౨॥

యే సంస్పర్శజాః భోగాః=ఏవి విషయేంద్రియసంబంధములవలనఁ గలిగిన అనుభవములో, తే దుఃఖయోనయ ఏవ హి=అవి దుఃఖహేతువులే కదా. (తే) ఆద్యన్తవన్తః= అవి ఆరంభమును సమాప్తియు కలవి. అనఁగా స్వల్పకాలముండునవియనుట. (హే) కౌన్తేయ=(ఓ) కుంతీపుత్రుఁడా, బుధః తేషు న రమతే=జ్ఞానముకలవాఁడు వానియందు ప్రీతిఁ జేయఁడు

సంన్యాసమునకై కామభోగము నిందింపఁబడుచున్నది. అని మధ్వభాష్యము

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః॥౨౩॥

యః ఇహైవ శరీరవిమోక్షణాత్ ప్రాక్=ఎవ్వఁడు ఇచ్చటనే శరీరమును విడుచుటకుముందె, కామక్రోధోద్భవం వేగం సోఢుం శక్నోతి=కామమువలనను క్రోధమువలనను పుట్టిన వేగమును సహింపఁజాలుచున్నాఁడో, సః నరః యుక్తః=ఆ మనుష్యుఁడు యోగముకలవాఁడు, సః సుఖీ=వాఁడు సుఖముకలవాఁడు.

కామమనఁగా ఇంపైన విషయము ఇంద్రియగోచరమైనప్పుడుగానీ వినఁబడినప్పుడుగానీ తలంపఁబడినప్పుడుగానీ కలిగెడి ఆశ. క్రోధమనఁగా తనకు అనిష్టములైన విషయములు అనుభవింపఁబడినప్పుడుగానీ వినఁబడినప్పుడు గానీ తలంపఁబడినప్పుడుగానీ కలిగెడి ద్వేషము. వీని వేగము అనఁగా అంతఃకరణము యొక్క క్షోభము. అందు కామవేగమునకు రోమాంచము (పులకరింత), నేత్రముఖవికాసము, మొదలగునవి గురుతులు. క్రోధవేగమునకు, వడఁకు, చెమట, ఔడుకఱచుట(పెదవికఱచుట), కన్నులెఱ్ఱఁబాఱుట, మొదలగునవి

గుణములు- మరణమునుఅవధిగాఁ జెప్పుటచే, బ్రదికియున్నవానికి కామక్రోధవేగము తప్పనిది, దానికినిమిత్తములు లేకలేకయుండదు, కాఁబట్టి మరణమువఱకును సహింపఁగూడదు అని తెలియఁజేయఁబడినది. అని శంకరభాష్యము.

ఇప్పుడనుఅనఁగా సాధనానుష్ఠానదశయందే- యుక్తుఁడుఅనఁగా ఆత్మానుభవమునకుతగినవాఁడు-సుఖిఅనఁగా శరీరవిమోక్షానంతరము ఆత్మానుభవమొకటియెసుఖముగాఁగలవాఁడగును- అని రామానుజభాష్యము.

ఈశ్లోకముకామభోగపరిత్యాగమును ప్రశంసించుచున్నది. శరీరవిమోక్షమునకుపూర్వముఅనుటవలన మనుష్యశరీరమున నెట్లు సహింపశక్యమగునో అట్లు మఱియొకశరీరమునశక్యముకాదని భావము- బ్రహ్మలోకము మొదలగునది కామమును జయించినవారికె కలుగును- అని మధ్వభాష్యము.

యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥ ౨౪॥

యః అన్తస్సుఖః=ఎవ్వఁడు ఆత్మయందెసుఖముకలవాఁడో,(యః)అన్తరారామః=(ఎవ్వఁడు) ఆత్మయందెక్రీడించుటకలవాఁడో, తథా యః అన్తర్జ్యోతిరేవ=అట్లే ఎవ్వఁడు ఆత్మయందె ప్రకాశముకలవాఁడో, సః యోగీ బ్రహ్మభూతః(స్సన్) బ్రహ్మనిర్వాణమ్ అధిగచ్ఛతి=ఆ యోగి బ్రహ్మమైన(వాఁడై) బ్రహ్మానందమును పొందుచున్నాఁడు.

బ్రదికియుండఁగనె బ్రహ్మభూతుఁడై- అనిశంకరభాష్యము.

ఎవ్వఁడుఆత్మానుభవమొక్కటియెసుఖముగాఁగలవాఁడో-ఎవ్వఁడు ఆత్మయొక్కటియె తోటగాఁగలవాఁడో, అనఁగా ఆత్మయొతనగుణములచేతసుఖమునువృద్ధిపొందించునదిగాఁగలవాఁడో- బ్రహ్మనిర్వాణమనఁగా ఆత్మానుభవసుఖము- అనిరామానుజభాష్యము.

ఇట్టి [illegible] రీతిచెప్పఁబడుచున్నది- ఆరామమనఁగా పరదర్శనాదివలనఁ గలిగిన [illegible]- సుఖమనఁగా ఉపద్రవము లేమివలనఁ గలిగినది- ఈ శ్లోకములో [illegible] అనఁగా పరమాత్మ దర్శనాదులవలనఁగలిగినది- పరమాత్మ స్వరూపజ్యోతిస్సుగాన ఆ

యనయందున్న జ్ఞాని అంతర్జ్యోతిః అని చెప్పఁబడుచున్నాడు- అసంప్రజ్ఞాతసమాధికలవానికి బాహ్యవిషయములు కనఁబడకపోవుటవల్లనును కనఁబడినను కార్యకరములు కాకపోవుటవల్లనును ఏవకారము ప్రయోగింపఁబడినది- బ్రహ్మభూతుఁడు అనఁగా బ్రహ్మమునందయినవాఁడు- ఈవిశేషణముచే అంతస్సుఖత్వాదులకు హేతువు చెప్పఁబడినది- అనిమధ్వభాష్యము.

లభన్తే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః॥౨౫॥

క్షీణకల్మషాః ఛిన్నద్వైధాః యతాత్మానః సర్వభూతహితే రతాః ఋషయః=నశించినపాపములుకలవారును పోయినసంశయములుకలవారును నియమింపఁబడినఇంద్రియములుకలవారును సర్వభూతములకును హితమైనదానియందు ఆసక్తిగలవారునగు జ్ఞానులు, బ్రహ్మనిర్వాణం లభన్తే=బ్రహ్మానందమును పొందుచున్నారు.

ఛిన్నద్వైధులనఁగా శీతోష్ణాదిద్వంద్వములచే విడువఁబడినవారు- యతాత్మలనఁగా ఆత్మయందే నియమింపఁబడిన మనస్సుకలవారు- ఋషులనఁగా ఆత్మావలోకనముచేయువారు- కల్మషములనఁగా ఆత్మప్రాప్తికివిరోధులైనపాపములు- అనిరామానుజభాష్యము.

ఛిన్నద్వైధాయతాత్మానఃఅని ఏకపదము- ద్వైధమనఁగా సంశయమైనను విపర్యయమైనను- ఇది ఛేదింపఁబడినచో ఛిన్నద్వైధులవుదురు- ఆయతాత్మలనఁగా పొడవైనమనస్సుకలవారు- సర్వజ్ఞులనుట- అనిమధ్వభాష్యము.

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥౨౬॥

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ విదితాత్మనామ్=కామక్రోధములచే విడువఁబడినవారును యతులును నియమింపఁబడినమనస్సుకలవారును తెలియఁబడినయాత్మకలవారునగువారికి, బ్రహ్మనిర్వాణమ్ అభితః వర్తతే= బ్రహ్మానందము అంతటను ఉన్నది.

యతులనఁగా సంన్యాసులు- అభితః అనఁగా బ్రతికియున్నప్పుడును మృతినిబొందినను అనుట- అనిశంకరభాష్యము.

యతులనఁగా ప్రయత్నము చేయుట స్వభావముగాఁగలవారు. ఏజి తాత్మవాన్ అనిపాఠము- జయింపఁబడినమనస్సుకలవారు అనియర్థము- దీనికి నియమింపఁబడినమనస్సుకలుగుటకారణము- అంతటనున్నది అనగా చేతిలోనిదే బ్రహ్మానందమనుట - అనిరామానుజభాష్యము.

వారిచే బ్రహ్మము క్రమము లేకయె పొందఁదగినది అని ఈశ్లోకము చేఁజెప్పఁబడుచున్నది- అనిమధ్వభాష్యము.

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాన్తరే భ్రువోః।
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యన్తరచారిణౌ॥ ౨౭ ॥
యతేన్ద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః॥ ౨౮॥

బాహ్యాన్ స్పర్శాన్ బహిః కృత్వా=వెలపటి విషయములను వెలిగాఁజేసి, చక్షుశ్చైవ భ్రువోః అన్తరే (కృత్వా)=చక్షుస్సునే కనిబొమల నడుమను (నిలిపి), ప్రాణాపానౌ సమౌ నాసాభ్యన్తరచారిణౌ కృత్వా=ప్రాణాపానములను సమములనుగాను ముకుట నడుమను సంచరించువానినిగాను చేసి, యతేన్ద్రియమనోబుద్ధిః విగతేచ్ఛాభయక్రోధః మోక్షపరాయణః మునిః యః=నియమింపఁబడిన బాహ్యేంద్రియములును మనస్సును బుద్ధియును కలవాఁడును పోయినకోరికయు భయమును క్రోధమును కలవాఁడును మోక్షము ముఖ్యముగాఁగలవాఁడునగు ముని ఎవ్వఁడో, సః సదా ముక్త ఏవ=వాఁడు ఎల్లప్పుడును ముక్తిని జెందినవాఁడె.

ఈ రెండుశ్లోకములును ధ్యానయోగమునకు సూత్రములవంటివి- శబ్దాదులు శ్రోత్రాదీంద్రియముల ద్వారమున బుద్ధిలోఁ బ్రవేశపెట్టఁబడినవెడను విషయములగును- ఆశబ్దాదులను తలంపనివానికి అవి బాహ్యములయి వెలిగాఁజేయఁబడినవగును- మునియనఁగా సంన్యాసి- అని శంకరభాష్యము.

స్పర్శములనఁగా శబ్దాదివిషయసంబంధములు- వానిని వెలిగాఁజేయుటయనఁగా బాహ్యేంద్రియవ్యాపారములను చాలించికొనుట- భ్రూమధ్యమందనఁగా నాసాగ్రమందనుట- ప్రాణాపానములనఁగా ఉచ్ఛ్వాస నిశ్వాసములను, సమానమైన గతిగలవానిగాఁజేసి- ఇంద్రియాదుల

మునియమించుటయనఁగా ఆత్మావలోకనమునఁదప్ప మఱియొకదా నియందుప్రవర్తింపనీకపోవుట- మునియనఁగా ఆత్మావలోకనముచే యువాఁడు- వాఁడుసాధనమును నడపించునప్పుడుగూడ సాధ్యదశ యందువలె ముక్తుఁడే-అని రామానుజభాష్యము.

ఇఁకధ్యానప్రకారము చెప్పఁబడుచున్నది- శ్రోత్రాదీంద్రియములనుని యమించుటచేత బాహ్యస్పర్శములను నియమించి-చక్షుస్సును కనుబొ మలనడుమనుంచుటయనఁగా భ్రూమధ్యమును చూచుట- ప్రాణాపానము లను సమముగాఁజేయుటయనఁగా కుంభకములోనుండుట- అనిమధ్వ భాష్యము.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాం శాన్తిమృచ్ఛతి॥

యజ్ఞతపసాం భోక్తారమ్ = యజ్ఞములకును తపస్సులకును భోక్త (అనుభవించువాఁడు)యయినవాఁడనను, సర్వలోకమహేశ్వరమ్= అన్నిలోకములకును గొప్పయీశ్వరుఁడైనవాఁడనను, సర్వభూతా నాం సుహృదమ్=అన్నిభూతములకును సుహృత్తైనవాఁడనునన్ను,మాం జ్ఞాత్వా శాన్తిమ్ ఋచ్ఛతి=నన్ను తెలిసికొని శాంతిని పొందుచు న్నాఁడు.

భోక్తయనఁగా కర్మరూపంబునను దేవతారూపంబుననుగూడ న నుభవించువాఁడు- సుహృత్తనఁగా ప్రత్యుపకారమును కోరక ఉపకార ము చేయువాఁడు- శాంతియనఁగా సంసారముడుగుట- అని శంకరభా ష్యము.

నన్ను తెలిసికొని కర్మయోగము నాచరించినచో నె శాంతిని అనఁ గాసుఖమును పొందుచున్నాఁడు- నన్ను సర్వలోకమహేశ్వరునిగానును సర్వసుహృత్తునుగాను తెలిసికొని కర్మయోగము నాయొక్క యారా ధనముగాన దానిలోసుఖముగాఁ ప్రవర్తించుచున్నాఁడు-అని రామా నుజభాష్యము.

ఈశ్లోకముచే ధ్యేయము(ధ్యానముచేయవలసినది) చెప్పఁబడుచున్న ది- అని మధ్వభాష్యము.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసంన్యాసయోగో నామ పఞ్చమోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబునగు భగవద్గీతలలో కర్మసంన్యాసయోగప్రతిపాదకంబగు అయిదవ యధ్యాయము-

బొంబయిలో అచ్చుపడినపుస్తకములో సంన్యాసయోగో నామ అని యున్నది.

# గీతాభాష్యత్రయసారము

## ఆఱవయధ్యాయము

### శ్రీ భగవానువాచ.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సంన్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః॥౧॥

కర్మఫలమ్ అనాశ్రిత(స్సన్)కార్యం కర్మ యః కరోతి= కర్మముయొక్క ఫలమునుఆశ్రయింపనివాఁడై చేయఁదగిన కర్మమును ఎవ్వఁడు చేయుచున్నాఁడో, సః సంన్యాసీచ యోగీచ= వాఁడు సంన్యాసియును యోగియును- నిరగ్నిః (సంన్యాసీ) న= అగ్నులులేనివాఁడు (సంన్యాసి) కాఁడు- అక్రియశ్చ (సంన్యాసీ) న=క్రియలు(కర్మములు) లేనివాఁడును (సంన్యాసి) కాఁడు.

ఈశ్లోకముచే ఫలమునుగోరక చేయఁబడెడి కర్మము సంన్యాసము వంటిది అని స్తోత్రము చేయఁబడుచున్నది గాని సంన్యాసము నిషేధింపఁబడలేదు- కర్మఫలమును ఆశ్రయింపనివాఁడనఁగా కర్మఫలమందు ఆశలేనివాఁడు- చేయఁదగిన కర్మమనఁగా నిత్యకర్మము- క్రియలనఁగా అగ్న్యపేక్షలేని తపస్సు దానము మొదలగునవి- అని శంకరభాష్యము.

కార్యమ్=చేయవలసినదానిగా- పరమపురుషుని యారాధనరూపమగుటను కర్మమేనాకు ప్రయోజనము కాని దానివలనసాధింపవలసినది లేదుఅనితలంచుచుఎవ్వఁడు కర్మమును చేయునో, వాఁడు సంన్యాసియునుఅనఁగా జ్ఞానయోగనిష్ఠుఁడును, యోగియును అనఁగా కర్మయోగనిష్ఠుఁడును- ఆత్మావలోకనమనెడి యోగమునకు సాధనములైన జ్ఞానకర్మములరెంటియందును నిష్ఠకలవాఁడు అని యర్థము- వేదమున విధింపఁబడిన యజ్ఞాదికర్మములం బ్రవర్తింపని కేవలజ్ఞాననిష్ఠుఁడు ఇట్టివాఁడు కాఁడు- వానికి జ్ఞాననిష్ఠమాత్రమేకలదు- ఈ కర్మయోగికి రెండునుకలవు- అనిరామానుజభాష్యము.

సంన్యాసికిఁగూడ అగ్నియును క్రియయును కలవు- అతనికి అగ్నిబ్రహ్మమే- వగబ్రహ్మపూజయే క్రియ- అనిమధ్వభాష్యము.

యం సంన్యాస ఇతి ప్రాహు ర్యోగం తం విద్ధిపాణ్డవ।

న హ్యసంన్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన॥౨॥

యం సంన్యాసమితి ప్రాహుః=దేనిని సంన్యాసమని చెప్పుచున్నారో, (హే) పాండవ! యోగం తం విద్ధి=(ఓ) యర్జునుఁడా! యోగమును దానినిగానె తెలిసికొనుము- అసంన్యస్తసంకల్పః కశ్చన యోగీ న భవతిహి=విడువఁబడనిసంకల్పముకలవాఁడు ఎవ్వఁడును యోగి కాఁడుగదా.

సమస్తములైనకర్మములను వానిఫలములనుగూడవిడుచుట సంన్యాసము - కర్మఫలసంకల్పమును మాత్రము విడిచినవాఁడగు కర్మయోగియును సంన్యాసముచేసినవాఁడుగా స్తోత్రము చేయఁబడుచున్నాఁడు - ఫలమునువిడుచుట అనెడిసామ్యము ఇద్దఱికినికలదుగాన ఇట్లు చెప్పఁబడినది- సంకల్పమనఁగా ఫలమునుగూర్చిన యుద్దేశము-ఇదిలేక కర్మములనాచరించువాఁడు చిత్తముయొక్క విక్షేపమునకు (చెదిరిపోవుటకు) కారణమైన ఫలసంకల్పములేనివాఁడగుటచే యోగి అనఁగా చిత్తసమాధానము(చిత్తముయొక్క నిలకడ)కలవాఁడు అగును - అని శంకరభాష్యము.

సంన్యాసమనఁగా జ్ఞానయోగము- అదికర్మయోగమేఅని తెలిసికొనుము- సంకల్పమనఁగా ఆత్మకానిప్రకృతియందు ఆత్మయనెడితలంపు- దానిని ఆత్మయాథాత్మ్యజ్ఞానముచేబోఁగొట్టికొననివాఁడు కర్మయోగికాఁడుగదా- అనిరామానుజభాష్యము.

సంన్యాసముగూడ యోగములోనంతర్భూతమెయని చెప్పఁబడుచున్నది- కామసంకల్పాదులనువిడువక ఉపాయముకలవాఁడెట్లగును? అని తాత్పర్యము- అనిమధ్వభాష్యము.

ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే॥౩॥

యోగమ్ ఆరురుక్షోః మునేః=యోగమును పొందఁగోరిన మునికి, కర్మ కారణమ్(ఇతి)ఉచ్యతే=కర్మము సాధనము (అని)చెప్పఁబడుచున్నది- యోగారూఢస్య తస్యైవ=యోగమునుపొందిన వానికే, శమః కారణమ్ (ఇతి)ఉచ్యతే=శాంతి సాధనము (అని)చెప్పఁబడుచున్నది.

ధ్యానయోగమును ఆచరించుటకు శక్తిలేనివాఁడును ధ్యానయోగముపొందఁగోరువాఁడు నగువానికి ఫలాపేక్షలేనికర్మయోగము సాధనము. యోగమునఁ బ్రవేశించినవానికి శమముఅనఁగా సర్వకర్మనివృత్తియె సాధనమగును- కర్మములను వదలినకొలఁది ఆయాసము తొలఁగుటచే ఇంద్రియజయముకలవాఁడై చిత్తైకాగ్ర్యము కలవాఁడు అగును- అనిశంకరభాష్యము.

యోగమనఁగా ఆత్మావలోకనము(కైవల్యము)అనెడిమోక్షము- శమమనఁగా కర్మనివృత్తి- మోక్షముకలుగువఱకును కర్మముచేయఁదగినది- అనిరామానుజభాష్యము.

యోగమనఁగా ఉపాయము- ఆరురుక్షువు అనఁగా ఆయుపాయముయొక్క సంపూర్తినికోరువాఁడు- ఆరూఢుఁడనఁగా సంపూర్ణమైనఉపాయముకలవాఁడు- అనఁగా అపరోక్షజ్ఞానముకలవాఁడు- శమమనఁగా అనుభవింపవలసినకర్మములన్నియు క్షయించుట- కారణమనఁగా పరమసుఖసాధనము- అపరోక్షజ్ఞానముకలవానికి భోక్తవ్యకర్మోపశమముకలిగెనేని అసంప్రజ్ఞాతసమాధిలెస్సగాకలుగును- కర్మోపశమముకలుగనియెడను భగవంతునిచరిత్రములు మొదలగువానిచే కాలముగడుపుట సంభవించును- అనిమధ్వభాష్యము.

యదాహి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే।
సర్వసంకల్పసంన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥౪॥

యదా ఇన్ద్రియార్థేషు నానుషజ్జతే=ఎప్పుడు విషయములయందు ఆసక్తినిచేయఁడో, కర్మసు (నానుషజ్జతే)=కర్మములయందును ఆసక్తిని చేయఁడో, తదా సర్వసంకల్పసంన్యాసీ యోగారూఢః(ఇతి) ఉచ్యతేహి=అప్పుడు అన్నిసంకల్పములనువిడిచినవాఁడై యోగారూఢుఁడు(అని) చెప్పఁబడుచున్నాఁడు.

ఇంద్రియార్థములనఁగా శబ్దాదివిషయములు- కర్మములనఁగా నిత్యనైమిత్తికకామ్యనిషిద్ధములు- వీనివలన ప్రయోజనము లేదనుజ్ఞానముకలవాఁడై, నానుషజ్జతే=ఇవి చేయఁదగినవి అనుతలంపును చేయఁడు- సర్వసంకల్పసంన్యాసి అనఁగా ఇహాముష్మికకామములకు హేతువులగువానిని అన్నిటినివిడిచినవాఁడు- కామకామములను సమ

సర్వకర్మములను విడుచునది అని యర్థము- అని శంకరభాష్యము.

ఇంద్రియార్థములనఁగా ఆత్మకాఁగమిగిలిన ప్రాకృతవిషయములు- ఈయోగి ఆత్మైకానుభవస్వభావముకలవాఁడగుటచే ప్రాకృతవిషయములయందును వానితో సంబంధించిన కర్మములయందును, ఎప్పుడు, సంగమును చేయఁడగుచో, అప్పుడు, వాఁడు సమస్తసంకల్పములను విడిచినవాఁడై యోగారూఢుఁడు అని చెప్పఁబడుచున్నాఁడు- కాఁబట్టి ఆరురుక్షువైనవాఁడు విషయానుభవమునకు తగినవాఁడుగాన విషయానుషంగా భావనారూపమగు కర్మయోగమె వానికి యోగసిద్ధిని కలుగఁజేయును- అని రామానుజభాష్యము. (*విషయములయందు ఆసక్తి లేకపోవుటను అభ్యసించుట స్వరూపముగాఁగలది)

ఈశ్లోకము యోగారూఢునిలక్షణమును చెప్పుచున్నది- అపరోక్షజ్ఞానముకలవానికి తదనంతరమె దోషములు అణఁగిపోవుట కలుగును- అదియె లక్షణమైన యనుషంగము- అని మధ్వభాష్యము.

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః॥౫॥

ఆత్మనా ఆత్మానమ్ ఉద్ధరేత్=ఆత్మచేత ఆత్మను లేవనెత్తవలయును- ఆత్మానం నావసాదయేత్=ఆత్మను బాధింపఁగూడదు- ఆత్మనః ఆత్మైవహి బన్ధుః=ఆత్మకు ఆత్మయేకదా బన్ధువు- ఆత్మనః ఆత్మైవ రిపుః=ఆత్మకు ఆత్మయె శత్రువు.

ఉద్ధరించుటయనఁగా సంసారమనెడి యనర్థసముద్రమునుండి పైకి లేవనెత్తుట- అవసాదయేత్ అనుదానికి అధోగతిని పొందింపఁగూడదు అని యర్థము- ఆత్మకు సంసారమును విడిపించుటకైనబంధువు ఆత్మయె- మిగిలినబంధువులు స్నేహాదిబంధమునకు ఆధారములగుటను మోక్షమునకు ప్రతికూలురే- మిగిలినయపకారము చేసెడి వెలుపలి శత్రువులుగూడ ఆత్మమువల్ల కల్పినవారె గాన ఆత్మయె శత్రువని చెప్పఁబడుచున్నది. అని శంకరభాష్యము.

ఆత్మనా=మనస్సుచేత- విషయములయందు ఆసక్తి లేనిమనస్సుచేత ఆత్మను ఉద్ధరింపవలయునుగాని విషయములయందు ఆసక్తిగల మనస్సుచేత ఆత్మను బాధింపఁగూడదు- అని రామానుజభాష్యము.

యోగాభ్యాసము ప్రయత్నముచే చేయఁదగినదికాదని ఈశ్లోకముచేఁ జెప్పఁబడుచున్నది- ఆత్మనా=మనస్సుచేత- ఆత్మానమ్=జీవుని- ఆత్మైవ=మనస్సే- ఆత్మనః=జీవునికి- అనిమధ్వభాష్యము.

బన్ధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥౬॥

యేన ఆత్మనా ఆత్మైవ జితః=ఏయాత్మచేత ఆత్మయె జయింపఁబడినాఁడో, తస్య ఆత్మనః ఆత్మా బన్ధుః= ఆయాత్మకు ఆత్మ బంధువు- అనాత్మనస్తు ఆత్మైవ శత్రువత్ శత్రుత్వే వర్తేత=జయింపఁబడనియాత్మకలవానికో ఆత్మయే శత్రువువలె శత్రుత్వమున ఉండును.

ఆత్మ యనఁగా కార్యకరణసంఘాతము (దేహేంద్రియాదిసముదాయము)- దానిని జయించినవాఁడు అనఁగా జితేంద్రియుఁడు- అనిశంకరభాష్యము.

ఏపురుషుని చేతతనమనస్సు విషయములను చేరకుండునట్లు జయింపఁబడినదో వానికి, ఆమనస్సు బంధువు- జయింపఁబడని మనస్సుకలవానికితన మనస్సే శత్రువువలెతనకీడునందు ప్రవర్తించును- అనిరామానుజభాష్యము.

ఎట్టివానికిఆత్మ బంధువగునోఅది ఈశ్లోకమున చెప్పఁబడుచున్నది- యేన=ఎవ్వనిచేత, ఆత్మైవ=మనస్సే, ఆత్మనా = బుద్ధిచేతగాని జీవుని చేతఁగాని, జయింపఁబడినదో- అనాత్మనః= మనస్సు లేనివానికి అనఁగా జయింపఁబడనిమనస్సుకలవానికి- జయింపఁబడనిమనస్సుగల పురుషునియొక్క మనస్సుఉన్నదైనను ఉపకారముచేయునదికాదుగాన లేనట్లె చెప్పఁబడినది-జీతగాఁడుకలిగియున్నను వాఁడుచేయవలసినపనివాఁడుచేయనిచో అధికారి జీతగాఁడులేనివాఁడె- అనిమధ్వభాష్యము.

జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥౭॥

జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః (భవతి)=జయింపఁబడినకార్యకరణసంఘాతముకలవాఁడును శాంతిని పొందినవాఁడు నగువానికి పరమాత్మ సమాధిచేఁబొందఁబడినవాఁడు (అగుచున్నాఁడు)- శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః (సమః స్యాత్)=శీ

కొనుట-కూటస్థుఁడనఁగా దేహాద్యవస్థలలోఁగూడననుసరించియుండెడి జ్ఞానైకస్వరూపుఁడగు ఆత్మయందున్నవాఁడు- కావుననె జయింపఁబడిన ఇంద్రియములుకలవాఁడు- సమలోష్టాశ్మకాంచనుఁడనఁగా ప్రకృతివిలక్షణమైన స్వరూపమునన్నవాఁడగుటచే ప్రాకృతవస్తువులయందు భోగ్యతాబుద్ధియుండదుగాన లోష్టాశ్మకాంచనములవలన సమానమైన ప్రయోజనముకలవాఁడు- యోగియనఁగా కర్మయోగి, యుక్తుఁడనఁగా ఆత్మావలోకనరూపమగు యోగాభ్యాసమునకు తగినవాఁడని చెప్పఁబడుచున్నాఁడు-అని రామానుజభాష్యము.

శీతోష్ణాదుల యందుకూటస్థుఁడైనవాఁడు- కూటస్థుఁడనఁగా కూటమువలె=ఆకాశమువలెనుండువాఁడు- అనఁగానిర్వికారుఁడు- ఇట్లు కూటస్థుఁడగుటకు హేతువులు, జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా విజితేన్ద్రియః అనునవి-. విజ్ఞానమనఁగా సాధారణులెఱుంగనివిశేషములనెఱుంగుటయైనను అపరోక్షజ్ఞానమైనను- యోగియనఁగాయోగముచేయుచున్నవాఁడు. యుక్తుఁడనఁగా సంపూర్ణమైనయోగముకలవాఁడు- ఇట్లుయోగానుష్ఠానముచేయువాఁడు యోగసంపూర్ణుఁడని చెప్పఁబడును-అనిమధ్వభాష్యము.

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు।
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥౯॥

సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబన్ధుషు సాధుష్వపి పాపేషుచ = సుహృత్తులుమిత్రులు శత్రువులుఉదాసీనులుమధ్యస్థులు ద్వేష్యులుబంధువులుఅనువీరియందును సజ్జనులయందును పాపులయందును, సమబుద్ధిః విశిష్యతే=సమానమైనబుద్ధికలవాఁడు విశేషింపుచున్నాఁడు.

సుహృత్తనఁగా ప్రత్యుపకారమునుకోరక ఉపకారముచేయువాఁడు-మిత్రుఁడనఁగా స్నేహముకలవాఁడు- ఉదాసీనుఁడువివ్వాదిపక్షమునంజేరనివాఁడు- మధ్యస్థుఁడనఁగావిరోధముకలయుభయులకుహితమునుకోరువాఁడు- ద్వేష్యుఁడనఁగా తనకుఅనిష్టుఁడైనవాఁడు- బంధువులనఁగా చుట్టము- సాధువులనఁగా శాస్త్రములనుసరించువాఁడు-పాపుఁడనఁగా నిషిద్ధకార్యములంజేయువాఁడు- సమబుద్ధియనఁగా క

కర్తయెవ్వఁడు కర్మమేది అని విమర్శించి బుద్ధిని ప్రసరింపఁజేయని వాఁడు విముచ్యతే=విడువఁబడుచున్నాఁడు, అనియుపాఠముకలదు- యోగారూఢులందఱిలోవీఁడు ఉత్తముఁడని యర్థము- అని శంకరభాష్యము.

వయసును ఆలోచింపకతనహితమునుకోరువారు సుహృత్తులు- సమానవయస్సుకలవారై హితమునుకోరువారు మిత్రులు- శత్రువులనఁగా నిమిత్తమునుపట్టి అనర్థమునుకోరువారు- హితమునను అనర్థమునునుగూడ కోరుటకు నిమిత్తములేనివారు ఉదాసీనులు- వారిపుట్టుక మొదలు ఎవ్వనికిని ఈ రెంటిని కోరకున్నవారు మధ్యస్థులు- వారిపుట్టుక మొదలు అనిష్టమునే కోరుచుండువారు ద్వేష్యులు- వారుపుట్టినది మొదలుహితమునే కోరువారు బంధువులు- సాధువులనఁగా ధర్మస్వభావముకలవారు- పాపులనఁగా పాపస్వభావముకలవారు- వీనికిఆత్మవలననే ప్రయోజనముకాని సుహృత్తులు మొదలగువారివలన ప్రయోజనమును వారితోవిరోధమును లేదుగాన వారియందు సమానమైనబుద్ధికలవాఁడు యోగాభ్యాసమునకు తగినవాఁడగుటలో విశేషింపుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

జీవులయొక్క చిత్తు అనఁగా చైతన్యంబును, పరమాత్మయును, అన్నియును పరమాత్మవలనఁ గలుగుటయు, సాధువులుపాపులు మొదలైన యందఱియందును ఒక్క విధముగా నుండుటచే అందఱియందును సమబుద్ధికలవాఁడు-జీవులు చిద్రూపులు కదా, విశేషము (దోషము) అంతఃకరణమువలనఁ గలిగినది, అందఱికిని సాధుత్వాదికమంతయును ఈశ్వరునిచేఁ జేయఁబడినదియె, స్వయముగా నొక్కటియును లేదు, అని యిట్లు సమబుద్ధికలవాఁడైయుండునదియె కాని సాధువులకును పాపులకును పూజమొదలగువానిలో సామ్యమును జేయఁగూడదు- సుహృత్తులు మొదలగు వారికి శాస్త్రములోఁ జెప్పినదానికంటె హెచ్చుతగ్గులు లేక పూజచేయుటయు సమత్వమె- ప్రత్యుపకారాపేక్షలేక యుపకారము చేయువాఁడు సుహృత్తు- క్లేశస్థానమును అనఁగా దుఃఖమువచ్చెడిస్థితిని కనిపెట్టి రక్షించువాఁడు మిత్రుఁడు- హింస మొదలగుదానిం జేయువాఁడు శత్రువు- చేయవలసినయుపకారమునను అపకారమునను

గూడ ఉపేక్ష చేయువాఁడు ఉదాసీనుఁడు- ఆ రెంటిని చేయువాఁడు మధ్యస్థుఁడు- అవాసితమును అనఁగా అనిష్టమును చేయువాఁడు ద్వేష్యుఁడు- అని మధ్వభాష్యము.

యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసిస్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥౧౦॥

యోగీ=యోగి, ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీః అపరిగ్రహః రహసి స్థితశ్చ(సన్)=ఒంటరియును నియమింపఁబడిన చిత్తంబును ఆత్మయును కలవాఁడును ఆశ లేనివాఁడును పరిగ్రహము లేనివాఁడును ఏకాంతమునందు ఉన్నవాఁడు(నగుచు), సతతమ్ ఆత్మానమ్ యుఞ్జీత =ఎల్లప్పుడును ఆత్మను గూర్చి యోగమును చేయునది.

యోగియనఁగా ధ్యానము చేయువాఁడు. ఆత్మానమ్ యుఞ్జీత= అంతఃకరణమును నిగ్రహింపవలయును- ఏకాంతమనఁగా కొండగుహ మొదలగునది- ఏకాకియనఁగా సంన్యాసమును చేసినవాఁడు అనుట- చిత్తమనఁగా అంతఃకరణము- ఆత్మయనఁగా శరీరము- అని శంకరభాష్యము.

యోగియనఁగా వెనుకఁ జెప్పఁబడిన కర్మయోగనిష్ఠుఁడు- సతతమ్ అనఁగా ప్రతిదినంబునయోగాభ్యాసకాలంబున- ఆత్మానమ్ యుఞ్జీత=ఆత్మను యుక్తునిగాఁ జేయునది- తన్నుచూచువానిగాఁ జేయునదియనుట- రహస్సనఁగా జనులు లేని నిశ్శబ్దమైన ప్రదేశము- ఏకాకియనుటచే తానుదప్ప మఱియొకఁడైననుండఁగూడదనుట- చిత్తమనఁగా చింతతోఁగూడిన మనస్సు- ఆత్మయనఁగా అట్టిది కాని మనస్సు- అపరిగ్రహుఁడనఁగా ఆత్మ తప్ప మిగిలిన దానియందు మమకారము లేనివాఁడు- అని రామానుజభాష్యము.

ఇఁకను సమాధియోగప్రకారము చెప్పఁబడుచున్నది. ఆత్మానం యుఞ్జీత=మనస్సును సమాధియోగముతోఁ గూడినదానిగాఁ జేయునది అని మధ్వభాష్యము.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్॥౧౧॥
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః।

ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే ॥౧౨॥

శుచౌ దేశే=పరిశుద్ధమైన చోటను, నాత్యుచ్ఛ్రితమ్ నాతినీచమ్ చేలాజినకుశోత్తరమ్ స్థిరమ్ ఆత్మనః ఆసనం ప్రతిష్ఠాప్య=మిక్కిలియెత్తుగానుండనిదియు మిక్కిలిపల్లముగానుండనిదియు వస్త్రంబును చర్మంబును కుశలమీఁదవేయున్నదియు నిశ్చలమైనదియు (నగు) తన ఆసనమును నిలిపి, తత్ర ఆసనే ఉపవిశ్య=ఆ యాసనమున కూర్చుండి, యతచిత్తేంద్రియక్రియః (సన్) మనః ఏకాగ్రం కృత్వా=నియమింపఁబడినచిత్తముయొక్కయు ఇంద్రియములయొక్కయు వ్యాపారములుకలవాఁడు (అగుచు) మనస్సును నిశ్చలమును చేసి, ఆత్మవిశుద్ధయె యోగం యుంజ్యాత్=ఆత్మపరిశుద్ధికొఱకు యోగమును చేయునది.

శుచియనఁగా స్వతస్సిద్ధముగాఁగాని చేయుటవలనఁగాని నిర్జనమైనది- క్రింద కుశలును, వాని పైని అజినంబును, దాని పైని వస్త్రంబునని క్రమము- యోగమును అనఁగా సమాధానము (చిత్తవృత్తినిరోధము) ను చేయునది- మనస్సును ఏకాగ్రమును చేయుటయనఁగా విషయములనుండి మరలించుట- ఆత్మవిశుద్ధియనఁగా అంతఃకరణపరిశుద్ధి- అని శంకరభాష్యము-

శుచియనఁగా అపరిశుద్ధులైనపురుషులచే నాశ్రయింపఁబడినదిగాని పరిగ్రహింపఁబడినదిగాని కానిదియు అపరిశుద్ధవస్తువులసంపర్కము లేనిదియునగుటచే పవిత్రమైనది- అట్టి ప్రదేశమందు కఱ్ఱమొదలగువానిచేఁ జేయఁబడినదియు కుశలును అజినంబును వస్త్రంబును పైపైనికలదియునగు నాసనమును నిలిపి- మనస్సునకు నైర్మల్యమును కలుగఁజేయునదియు చేరువుకలదియునగు నా యాసనమునం గూరుచుండి ఆత్మవిశుద్ధికొఱకు అనఁగా బంధనివృత్తికొఱకు ఆత్మావలోకనమును చేయునది- అని రామానుజభాష్యము-

యోగమును అనఁగా సమాధియోగమును అని మధ్వభాష్యము-

సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలంస్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥౧౩॥
ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥౧౪॥

కాయశిరోగ్రీవం సమమ్ అచలం(చ) ధారయన్=శరీరమునును శిరస్సునుకంఠమునును సమముగానును కదలకుండునట్లును నిలుపుచున్నవాఁడును, స్థిరః=స్థిరుఁడును, స్వం నాసికాగ్రం సంప్రేక్ష్య దిశః అనవలోకయంశ్చ=స్వకీయమైన ముక్కుకొనను చూచి దిక్కులను చూడకున్నవాఁడును, ప్రశాన్తాత్మా=శాంతినిపొందినఅంతఃకరణము కలవాఁడును, విగతభీః=భయములేనివాఁడును, బ్రహ్మచారివ్రతే స్థితః=బ్రహ్మచారియొక్కవ్రతమునందు ఉన్నవాఁడును(అయి), మనః సంయమ్య= మనస్సును నియమించి, మచ్చిత్తః మత్పరః యుక్తః ఆసీత=నాయందు చిత్తముకలవాఁడును నేనుగొప్పవాఁడుగాఁగలవాఁడును సమాధికలవాఁడునై కూరుచుండునది.

నాసికాగ్రం సంప్రేక్ష్యేవ=నాసికాగ్రమునుచూచినట్లుండియని ఇవశబ్దమును తెచ్చి యన్వయింపవలయును- తననాసికాగ్రమునుచూచుటయె చెప్పఁబడినయెడను మనస్సుకూడ ముక్కుకొనను చూచుటయందె ప్రవర్తించునుగాని ఆత్మనుచూచుటయందు ప్రవర్తింపదు- కాఁబట్టి రెండుకన్నులను దగ్గరకుచేర్చుటయె ఇక్కడ విధింపఁబడుచున్నది- బ్రహ్మచారివ్రతమనఁగా స్త్రీసంపర్కము లేకపోవుట,గురువునకుశుశ్రూష చేయుట, భిక్షాన్నమునుతినుట, మొదలగునది - మనస్సును నియమించుటయనఁగా మనస్సుయొక్క వృత్తులను అణఁచుట- లోకములోస్త్రీయందు చిత్తముకలవాఁడైనను రాజునుగాని మహాదేవునిగాని గొప్పవానిగాఁదలఁచుటకలదుగాన, నట్లుకాక, పరమేశ్వరునియందెచిత్తముకలవాఁడైఆపరమేశ్వరుఁడెపరుఁడనుజ్ఞానము కలిగి యుండునదియని విధింపఁబడుచున్నది- అనిశంకరభాష్యము.

అచలంస్థిరమ్అనిపాఠము- స్థిరముగాననఁగా వేరువు కలిగియుండుటచేత స్థిరముగానిలుపుచునని యన్వయము- ప్రశాన్తాత్మయనఁగామిక్కిలి సుఖించినమనస్సుకలవాఁడు- యుక్తుఁడనఁగా అవధానముకలవాఁడు- అనిరామానుజభాష్యము.

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి॥౧౫॥

యోగీ=ధ్యానముచేయువాఁడు, నియతమానసః=నియమింపఁబడినమ

నస్సుకలవాఁడై, ఏవం సదా ఆత్మానం యుఞ్జన్=ఇట్లు ఎల్లప్పుడును అంతఃకరణమును సమాహితమునుగాఁ జేయుచున్నవాఁడై, నిర్వాణపరమామ్ మత్సంస్థామ్ శాన్తిమ్ అధిగచ్ఛతి=మోక్షమె చరమావధిగాఁ గలదియు నాయందున్నదియు నగు శాంతిని పొందుచున్నాఁడు.

శాంతి యనఁగా ఉపరతి (పను లేవియు చేయకుండుట)- నాయందున్నః యనఁగా నాకు అధీనమైనదనుట- అని శంకరభాష్యము.

పరబ్రహ్మంబును పురుషోత్తముఁడన నగు నాయందు మనస్సును చేర్చుచున్నవాఁడై, నా సంపర్కముచే మనసు పవిత్రమగుచుండగాన నిశ్చలమైన మనస్సు కలవాఁడై- ఆత్మయోగము చేయువానికి మనోనైర్మల్యమునకై మనస్సును భగవంతునియందుంచుట చెప్పఁబడినది- అని రామానుజభాష్యము.

నిర్వాణపరమామ్=శరీరమును విడిచిన తరువాతఁ గలిగెడి- అని మధ్వభాష్యము..

నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాన్తమనశ్నతః।
నచాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ।౧౬॥

అత్యశ్నతః యోగః నాస్తి=మిక్కిలి తినువానికి యోగము లేదు- ఏకాన్తమ్ అనశ్నతశ్చ న=బొత్తిగా తినని వానికిని లేదు- అతిస్వప్నశీలస్య చ న=మిక్కిలి నిద్రించుట స్వభావముగాఁ గలవానికిని లేదు- (హే) అర్జున!=(ఓ) యర్జునుఁడా!, (ఏకాన్తం) జాగ్రతశ్చ నైవ =(బొత్తిగా) మేలుకొనువానికిని లేనే లేదు.

ఆత్మసంమితమైన అన్నముకంటె హెచ్చుగా తినువాఁడు మిక్కిలి తినువాఁడు- (ఏపాటి యన్నమును తినినచో అజీర్ణము లేకుండునో, పనిపాటులకు అనుకూలముగా నుండునో, ఆపాటి యన్నము ఆత్మసంమితము- అని మధుసూదనటీక) యోగశాస్త్రములోఁ జెప్పినట్లు సగము కడుపు నింపునట్లు గాక అధికముగా తినుట యత్యశనమనియుం జెప్పవచ్చును- మిగిలిన సగము కడుపులో సగము అనఁగా ఒకపాతికను మాత్రము నీటితో నింపునది- మిగిలిన పాతిక వెలితిగానే యుండవలయునని యోగశాస్త్రమునఁ జెప్పఁబడినది- అని శంకరభాష్యము.

అనశనాదులు కూడదనుట శక్తిలేనివానికి- శక్తికలవాఁడునిద్ర తిం డి మొదలగువానిని విడిచి కన్నులుమూసికొని ధ్యానముచేయుచు సిద్ధి నిపొందునని నారదీయమునఁ జెప్పఁబడినది. అనిమధ్వభాష్యము.

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥౧౭॥

యుక్తాహారవిహారస్య=తగినఆహారంబునుసంచారంబునుకలవాఁడును, కర్మసు యుక్తచేష్టస్య=కర్మములయందు తగినవ్యాపారముకల వాఁడును, యుక్తస్వప్నావబోధస్య=తగిననిద్రయు మెలుకువయుకలవాఁ డును(అగువానికి), దుఃఖహా యోగః భవతి=దుఃఖములనుపోఁగొట్టె డియోగము కలుగుచున్నది- దుఃఖములనఁగా సాంసారికదుఃఖములన్ని యును.

యుక్తమనఁగా ఉపాయముతోఁగూడినది- ఎంతమాత్రము చేతశరీ మాదులు లేకపోవునో, అంతమాత్రము ఆహారాదులు కలవానికి అనుట- అనిమధ్వభాష్యము.

యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే।
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥౧౮॥

యదా చిత్తం వినియతం(సత్) ఆత్మన్యేవ అవతిష్ఠతే=ఎప్పుడు చిత్తము నియమింపఁబడినది(అగుచును) ఆత్మయందె నిలుచుచున్న దో, తదా సర్వకామేభ్యః నిస్పృహః(సన్) యుక్త ఇతి ఉచ్యతే= అప్పుడు అన్నికోరికలనుండియు మరలినయాశకలవాఁడు(అగుచు) యుక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు-

వినియతమనఁగా ఏకాగ్రత్వమును పొందింపఁబడినది- అనఁగా బా హ్యవిషయములనువిడిచినది- యుక్తుఁడనఁగా సమాధిని పొందినవాఁ డు- అనిశంకరభాష్యము. [ము.

యుక్తుఁడనఁగా యోగమునకు తగినవాఁడు- అని రామానుజభాష్య ఆత్మయందు అనఁగా భగవంతునియందు- అనిమధ్వభాష్యము.

యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః॥౧౯॥

నివాతస్థః దీపః యథా నేఙ్గతే=గాలిలేనిచోటనున్న దీపము ఎ

ట్టు కదలదో, యోగం యుఞ్జతః యతచిత్తస్య యోగినః=యోగము ను చేయుచున్నవాఁడును, నియమింపఁబడినమనస్సుగలవాఁడునగు యోగియొక్క, ఆత్మనః సా ఉపమా స్మృతా=ఆత్మకు అది పోటిగా తలంపఁబడినది.

ఆత్మయనఁగా చిత్తము. అని శంకరభాష్యము.

ఆత్మయనఁగా ఆత్మస్వరూపము-గాలి లేని స్థలములోనుండుటచేతకదలిక లేక, వెలుఁగుతోఁగూడినదై యుండెడి దీపమువలె, ఇతరములైన మనోవృత్తులన్నియు పోవుటచేత యోగియొక్క యాత్మ కదలనిదై జ్ఞానమనెడి వెలుఁగుకలదై యుండును. అని రామానుజభాష్యము.

ఆత్మనః యోగం యుఞ్జతః యోగినః సా ఉపమా=భగవంతుని యొక్క (భగవంతునిం గూర్చిన) యోగమును చేయుచున్న యోగికి అది పోటి. అని మధ్వభాష్యము.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥౨౦॥
సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥౨౧॥
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే॥౨౨॥
తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥౨౩॥

యోగసేవయా నిరుద్ధం చిత్తం యత్ర ఉపరమతే=యోగమునాచరించుటచేత నిరోధింపఁబడిన చిత్తము దేనియందు ఉపరతినిపొందుచున్నదో, యత్ర చ ఆత్మనా ఆత్మానం పశ్యన్ ఆత్మన్యేవ తుష్యతి =దేనియందు మనస్సుచేత ఆత్మను చూచుచున్నవాఁడై ఆత్మయందే సంతోషించుచున్నాఁడో, యత్ అతీన్ద్రియం బుద్ధిగ్రాహ్యమ్ ఆత్యన్తికం సుఖమ్=ఏది ఇంద్రియములనతిక్రమించినదియు బుద్ధిచేత గ్రహింపఁబడునదియు [illegible] సుఖమో, తత్ యత్ర వేత్తి=దానిని దేనిలో అనుభవించుచున్నాఁడో, యత్ర స్థితః అయమ్ తత్త్వతః న చైవ చలతి=దేనిలో ఉన్న ఈతఁడు(యోగి) త

త్త్వమునుండి చలింపఁడో, యం లబ్ధ్వా అపరం లాభం తతః అధికమ్ నమన్యతేచ=దేనిని పొంది మఱియొక లాభమును దానికంటె అధికమైనదానిగా తలంపఁడో, యస్మిన్ స్థితః గురుణాదుఃఖేనాపి నవిచాల్యతే=దేనిలో ఉన్నవాఁడు గొప్ప దుఃఖముచేఁగూడ కదల్పఁబడఁడో, దుఃఖసంయోగవియోగం తం యోగసంజ్ఞితం విద్యాత్=దుఃఖసంపర్కము యొక్క వియోగమైన దానిని యోగమను పేరుగలదానిగా తెలిసికొనవలయును-సః యోగః అనిర్విణ్ణచేతసా నిశ్చయేన యోక్తవ్యః=ఆ యోగము నిర్వేదము లేనిమనస్సుగలవానిచేత నిశ్చయముతో ఆచరింపఁబడవలసినది.

యత్ర=ఏ కాలమునందు- (ఆత్మనా) సమాధిపరిశుద్ధమైన యంతఃకరణము చేత(ఆత్మానమ్) అంతటజ్యోతిస్స్వరూపమగు పరమచైతన్యమును (పశ్యన్) తెలిసికొనుచున్నవాఁడై- ఆత్యంతికమనఁగా అనంతమనుట- దుఃఖమనఁగా ఆయుధపుదెబ్బ మొదలగునది- నిశ్చయంబును అనిర్వేదంబును యోగసాధనములని తెలియఁజేయుటకై "సనిశ్చయేన" అనెడియర్ధశ్లోకము చెప్పఁబడినది- అని శంకరభాష్యము.

యత్ర ఉపరమతే=ఏయోగమునందు ఉపరమింపుచున్నదో, అనఁగా మిక్కిలి సుఖమును కలుగఁజేయునది అని ప్రీతిని చేయుచున్నదో- తత్త్వమునుండి చలింపఁడో అనఁగా యోగమువలనఁగలిగిన సుఖాతిశయమునుండి తప్పఁడో- ఏయోగమునుపొంది, దానిని చాలించికొనినప్పుడును, ఆ యోగము నెకోరుచున్నవాఁడై మఱియొక్క లాభమును తలంపఁడో- యోగములోనున్నప్పుడును యోగమును వదలినప్పుడును గూడ పుత్రవియోగము(కొడుకులు ఎడఁబాయుట) మొదలగు గొప్పదుఃఖములచేతఁగూడ కదల్పఁబడఁడు- దుఃఖసంబంధమునకు విరుద్ధమైనస్వరూపముగల, దానినె, యోగశబ్దార్థముగా నెఱుంగునది-ఆరంభదశయందు యోగము ఇట్టిదను నిశ్చయముతోఁగూడ హర్షముతోఁగూడిన మనస్సుతో యోగమును నడపునది- అని రామానుజభాష్యము.

(ఆత్మనా)మనస్సుచేత(ఆత్మని) దేహమునందు(ఆత్మానమ్)భగవంతుని(పశ్యన్)చూచుచున్నవాఁడై- తత్త్వమునుండి అనఁగా భగవద్రూపమునుండి- దుఃఖసంయోగము దేనిచేతవిడుచునో, అదిదుఃఖసంయోగ

వియోగము- పుట్టినదుఃఖమునుమాత్రమె నివారించుటకాదు- దుఃఖము పుట్టుకనె నివారించునని తెలియఁజేయునది. సంయోగశబ్దము- నిశ్చయముతో నాచరింపఁబడఁదగినది, అనఁగా కలిమినికోరినవానిచే తప్పక ఆచరింపఁబడవలసినదనుట- అనిమధ్వభాష్యము-

సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః।
మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥ ౨౪॥
శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్॥ ౨౫॥

సంకల్పప్రభవాన్ సర్వాన్ కామాన్ అశేషతః త్యక్త్వా= సంకల్పమువలనఁగలిగిన అన్ని కామములను శేషములేకుండునట్లు విడిచి, మనసైవ ఇన్ద్రియగ్రామమ్ సమన్తతః వినియమ్య=మనస్సుచేతనె ఇన్ద్రియసమూహమును అంతట నియమించి, ధృతిగృహీతయా బుద్ధ్యా శనైశ్శనైః ఉపరమేత్ =ధైర్యముచేఁగ్రహింపఁబడిన బుద్ధిచేత మెల్ల మెల్లగా ఉపరతినిపొందునది- మనః ఆత్మసంస్థం కృత్వా=మనస్సును ఆత్మయందున్నదానినిగాఁ జేసి, కిఞ్చిదపి నచిన్తయేత్ =ఒక్కదానినిని తలంపఁగూడదు.

అశేషము కానఁగా నిశ్శేషముగా(అంటులేకుండునట్లు)ననుట-వివేకముతోఁగూడినమనస్సుచేతనె ఇంద్రియసముదాయమునునియమించి- ధృతిగృహీతయనఁగా ధైర్యముతోఁగూడినదనుట- ఆత్మయందున్నది అనఁగా అంతయునాత్మయె, దానికంటె మఱియొక్కటిలేదు, అని యిట్లు ఉండినమనస్సు- ఇదియోగమునకుపరమావధి- అనిశంకరభాష్యము.

స్పర్శజములనియు సంకల్పజములనియు కామములు రెండు విధములు- స్పర్శజములు (స్పర్శనమువలననగునవి) శీతోష్ణాదులు- సంకల్పజములు(సంకల్పమునఁ దనగునవి)పుత్రుఁడు క్షేత్రము(భూమి) మొదలగునవి-అందుసంకల్పజములను, దానితో తనకుసంబంధములేదనుకొనుటచేమనస్సుచేత నెవిడిచియు, తప్పనిసరైనస్పర్శజములు తటస్థించినప్పుడు వానివలనఁగలిగెడి సంతోషవిషయంబులనువిడిచియు, సమస్తవిషయములయందును అన్నియింద్రియములను నియమించి, మెల్లమెల్లగా వి

వేకవిషయకంబగుబుద్ధిచేత ఆత్మకంటె మిగిలినవానినన్నిటినుండియు ముపరతినిపొంది, మనస్సును ఆత్మయందునిలిపి దేనినిని తలంపకుండునది-అని రామానుజభాష్యము.

సర్వాన్ అనుదానికి అన్నివిషయములైన అనియర్థము-అశేషతః అనుటవలన ఒక్కవిషయముగల కామమునుగూడ స్వల్పముగానైనను ఒకానొకప్పుడైనను చేయఁగూడదనుట- ఏవ అనుశబ్దము మనస్సుచేతనే నియమింపశక్యము కనుగాని మతియొక్కదానిచేత కాదని తెలియఁజేయును- బుద్ధి,మనస్సులనిగ్రహించుటయందును ఆత్మరమణము(ఆత్మయందు క్రీడించుట)నందును సాధనము - అనిమధ్వభాష్యము.

యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చల మస్థిరమ్।
తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥౨౬॥

చఞ్చలమ్ అస్థిరమ్ మనః=చంచలమైనదియును (కావుననె)స్థిరముగానిదియునగు మనస్సు, యతో యతః నిశ్చరతి=ఏయేవిషయమునిమిత్తము బయలువెడలుచున్నదో, తతస్తతః ఏతత్ నియమ్య=దానిదానినుండి దీనిని(మనస్సును) మరలించి, ఆత్మన్యేవ వశం నయేత్=ఆత్మవిషయముననె వశమును పొందింపవలయును.

మనస్సును విషయములనుండి నియమించి, అనఁగా, యథార్థస్థితిని తెలిసికొనుటచే ఆయావిషయములు ఆభాసమును(భ్రాంతివలనఁదెలియఁబడినదాని)గాఁ జేయుచుండి, వైరాగ్యము భావించుటచేత మనస్సునకు ఆత్మవశ్యతను కలుగఁజేయునది. ఇట్లు యోగాభ్యాసబలమున యోగియొక్క మనస్సు ఆత్మయందె శాంతినిపొందుచున్నది- అనిశంకరభాష్యము.

ఆత్మయందు మిక్కుటమైన సుఖమును భావించుటచే మనస్సును వశ్యమునుగాఁజేయునది- అని రామానుజభాష్యము

యతో యతః=ఎచ్చట ఎచ్చట- ఆత్మన్యేవవశంనయేత్=ఆత్మవిషయముననె వశీకరించునది- అని మధ్వభాష్యము.

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్।
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్॥౨౭॥

ప్రశాన్తమనసం శాన్తరజసం బ్రహ్మభూతమ్ అకల్మషమ్ ఏనం

వియోగము- పుట్టినదుఃఖమునుమాత్రమె నివారించుటకాదు- దుఃఖపు పుట్టుకనె నివారించునని తెలియఁజేయునది సంయోగశబ్దము- నిశ్చయముతోనాచరింపఁబడఁదగినది, అనఁగాకలిమినిలోఁగినవానిచే తప్పక ఆచరింపఁబడవలసినదనుట- అనిమధ్వభాష్యము-

సంకల్పప్రభవా న్కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః।
మనసై వేన్ద్రియగ్రామం వినియమ్యసమన్తతః॥౨౪॥
శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపిచిన్తయేత్॥౨౫॥

సంకల్పప్రభవాన్ సర్వాన్ కామాన్ అశేషతః త్యక్త్వా= సంకల్పమువలనఁగలిగిన అన్ని కామములను శేషములేకుండునట్లు విడిచి, మనసైవ ఇన్ద్రియగ్రామమ్ సమన్తతః వినియమ్య=మనస్సుచేతనె ఇన్ద్రియసమూహమును అంతట నియమించి, ధృతిగృహీతయా బుద్ధ్యా శనైశ్శనైః ఉపరమేత్ =ధైర్యముచేఁగ్రహింపఁబడిన బుద్ధిచేత మెల్లమెల్లగా ఉపరతినిపొందునది- మనః ఆత్మసంస్థం కృత్వా=మనస్సును ఆత్మయందున్నదానినిగాఁ జేసి, కిఞ్చిదపి నచిన్తయేత్ =ఒక్కదానినిని తలంపఁగూడదు.

అశేషము గాననఁగా నిశ్శేషముగా(అంటులేకుండునట్లు)ననుట-వివేకముతోఁగూడినమనస్సుచేతనె ఇంద్రియసముదాయమునునియమించి- ధృతిగృహీతయనఁగా ధైర్యముతోఁగూడినదనుట- ఆత్మయందున్నది అనఁగా అంతయునాత్మయె, దానికంటె మఱియొక్కటిలేదు, అని యిట్లు ఉండినమనస్సు- ఇదియోగమునకుపక్రమావధి- అనిశంకరభాష్యము

స్పర్శజములనియు సంకల్పజములనియు కామములురెండు విధములు- స్పర్శజములు (స్పర్శముపలననగునవి) శీతోష్ణాదులు- సంకల్పజములు(సంకల్పమువలననగునవి)పుత్రక్షేత్రము(భూమి) మొదలగునవి-అందుసంకల్పజములను, వానితో తనకుసంబంధములేదనుకొనుటచేమనస్సుచేతనెవిడిచియు, తప్పనిసరైనస్పర్శజములు తటస్థించినప్పుడువానివలనఁగలిగెడి సంతోషభయంబులనువిడిచియు, సమస్తవిషయములనుండియు అన్నియింద్రియములనుసు నియమించి, మెల్లమెల్లగా వి

తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥ ౩౮॥
సుఖదుఃఖే సమే కృత్వా = సుఖదుఃఖములను సమములం జేసికొని, లాభాలాభౌ (సమౌకృత్వా) = లాభమునును లాభము లేకపోవుటసును (సమములం జేసికొని), జయాజయౌ (సమౌకృత్వా) = జయపరాజయములను (సమములంజేసికొని), తతః యుద్ధాయ యుజ్యస్వ = అటపైని యుద్ధమునకు తలపడుము- ఏవమ్ పాపమ్ నావాప్స్యసి = ఈచొప్పున పాపముం బొందఁగలవాఁడవుకావు.

ఇట్లు శరీరముకంటె విలక్షణుండగు నాత్మను తెలిసికొని యుద్ధములోని ఆయుధపుదెబ్బలు మొదలగువానిచే సుఖదుఃఖాదులు కలిగినను బుద్ధివికారము లేనివాఁడవై స్వర్గాదిఫలోద్దేశము లేక యుద్ధమును చేయుము- ఇట్లుచేసినచో పాపమును అనఁగా దుఃఖరూపమగు సంసారమును బొందవు అని రామానుజభాష్యము.

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యాయుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి ౩౯॥
సాంఖ్యే ఏషాబుద్ధిః తే అభిహితా = సాంఖ్యమందలి ఈబుద్ధి నీకు చెప్పఁబడినది- యోగే ఇమాం బుద్ధింతు శృణు = యోగమునందలి ఈ బుద్ధిని వినుము- యయా బుద్ధ్యా యుక్తః కర్మబన్ధం ప్రహాస్యసి = ఏ బుద్ధితోఁ గూడినవాఁడవై కర్మబంధమును విడువఁగలవో.

స్వధర్మ మపి చావేక్ష్య (అ౹ ౩౧ శ్లో) అనునది మొదలు ఈ ... జనునకు శోకమోహములను పోఁగొట్టుటకు లౌకికన్యాయము చెప్పఁబడినది-అది ముఖ్యోద్దేశముతోఁ జెప్పఁబడలేదు. కాన పూర్వము ఆరంభింపఁబడిన పరమార్థ జ్ఞానమే ఈశ్లోకముచే ముగింపఁబడుచున్నది.
— సాంఖ్యబుద్ధి యనఁగా పరమార్థజ్ఞానము- అదియె సంసార హేతువులను దుఃఖము అజ్ఞానము మొదలగు దోషములను సాక్షాత్తుగా ... పఁజేయును- యోగమనఁగా అజ్ఞానమును కలుగఁజేసెడి కర్మ... గము-అది ద్వంద్వపరిత్యాగపూర్వకం... ఈశ్వరారాధనము కొ... కర్మములనాచరించుటయును, సమాధియోగంబును- ఈ యోగ... ఫలమగు ఈశ్వర ప్రసాదము కలిగి దానిచే జ్ఞానము కలుగఁగా ... ంధము ను ... ని శంకరభాష్యము.

సాంఖ్యమనఁగా బుద్ధిచేఁదెలిసికొనవలసిన యాత్మతత్త్వము. సాం
ఖ్యజ్ఞానమనఁగా అట్టినిత్యమైన యాత్మతత్త్వమును తెలిసికొనుట. ఇది
న త్వేవాహమ్ (అ॥౧౨శ్లో) అనునది మొదలు, తస్మాత్సర్వాణిభూతాని
నత్వంశోచితుమర్హసి (అ॥౩౦శ్లో) అనువఱకుఁజెప్పఁబడినది. యో
గమనఁగా ఆత్మజ్ఞానపూర్వకంబగు మోక్షమునకు సాధనములగు క
ర్మముల నాచరించుటయందు తెలివికలుగుట. అది ఇఁక చెప్పఁబడు
ను. అని రామానుజభాష్యము.

సాంఖ్యమనఁగా పరిశుద్ధాత్మతత్త్వజ్ఞానము. బుద్ధియనఁగా వా
క్కు. ఆత్మజ్ఞానముంగూర్చిన గ్రంథము చెప్పఁబడినది. ఇఁక యోగ
ము అనఁగా ఉపాయముంగూర్చిన గ్రంథము చెప్పఁబడును. అని మ
ధ్వభాష్యము.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో నవిద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥

ఇహ అభిక్రమనాశః నాస్తి=దీనిలో ఆరంభము చెడుటలేదు. ప్రత్య
వాయః నవిద్యతే=తప్పు లేదు. అస్య ధర్మస్య స్వల్పమపి=ఈ ధ
ర్మము యొక్క పిసరైనను, మహతః భయాత్ త్రాయతే=గొ
ప్పభయమునుండి కాపాడుచున్నది — ఆరంభించినది చెడుటయనఁ
గా ఫలము కలుగకపోవుట. భయమనఁగా సంసారభయము.

చికిత్సలోవలె ప్రత్యవాయము లేదు. అని శంకరభాష్యము.

ఆరంభించినదాని మధ్యకాలమున విడుచుటవలనఁ గలిగెడుదోష
ము ప్రత్యవాయము. అని రామానుజభాష్యము.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥ ౪౧

(హే) కురునన్దన!=(ఓ) కురువంశమువాఁడా!, ఇహ వ్యవసాయాత్మి
కా బుద్ధిః ఏకా=దీనిలో నిశ్చయస్వభావమైన బుద్ధి ఒకటి. అ
వ్యవసాయినాం బుద్ధయః బహుశాఖాః అనన్తాశ్చ=నిశ్చయములే
నివారి బుద్ధులు అనేకశాఖలుకలవియు అనన్తములును.

వ్యవసాయాత్మికబుద్ధియనఁగా ఈశ్రేయోమార్గమున (హితమార్
గమున) మంచి ప్రమాణములవలనఁబుట్టిన నిశ్చయస్వభావముగల

సాంఖ్యబుద్ధియును యోగబుద్ధియును- ఇట్టివికాని విపరీతబుద్ధులు అవ్యవసాయాత్మకబుద్ధులు- అవికలవారు అవ్యవసాయులు- అనఁగా ప్రమాణములవలనఁబుట్టిన వివేకజ్ఞానము లేనివారు- అని శంకరభాష్యము.

వ్యవసాయ మనఁగా నిశ్చయము- అనఁగా ఆత్మయాథాత్మ్యనిశ్చయము- (ఆత్మజ్ఞానము)- మోక్షేచ్ఛకలవానికి తాను ఆచరించెడి కర్మములయందుండెడి బుద్ధి ఆత్మజ్ఞానపూర్వకంబగుటచే వ్యవసాయాత్మకమనఁబడును- కామ్యకర్మములనాచరించుటలో,ఆత్మస్వరూపయాథాత్మ్యనిశ్చయము లేకపోయినను, స్వర్గాదిఫలములంగోరికర్మములం జేసిఫలమనుభవించుట సంభవించునుగాన,కామ్యకర్మవిషయమగు బుద్ధిఅవ్యవసాయాత్మికయనఁబడును- వ్యవసాయాత్మకబుద్ధి ఒక్క మోక్షముకొఱకే అగుటను ఒక్కటియనఁబడుచున్నది- అవ్యవసాయులు అనఁగా స్వర్గపుత్రపశ్వన్నాది ఫలములకు సాధనములగు కర్మములనాచరించువారు- వారిబుద్ధులు, ఫలములు అనంతములగుటను, అనంతములు- ఇవి ఒక్కొక్క ముఖ్యఫలమునకై విధింపంబడినను దర్శపూర్ణమాసాదులలోని ఆయుస్సు మొదలగు ఫలములవంటి అవాంతరఫలములువీనికిఅనేకములుకలవుగానబహుశాఖములు—నిత్యనైమిత్తిక కర్మములు ప్రధానావాంతరఫలములనన్నిటిని విడిచి మోక్షమొక్కదానికొఱకే ఆచరింపఁబడవలసినవి- తమతమవర్ణాశ్రమములకుతగిన కామ్యకర్మములును,వానివానిఫలములను విడిచి,మోక్షసాధనములుగానె నిత్యనైమిత్తికములతోఁజేర్చి యథాశక్తిగనాచరింపఁబడవలసినవి- అని రామానుజభాష్యము.

యా మిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః॥౪౨॥
కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥౪౩॥
భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ నవిధీయతే॥౪౪॥

(హే)పార్థ!=(ఓ)కున్తీపుత్రుఁడా!, వేదవాదరతాః='ఫలసాధనములంజూపిన) వేదవాక్యములయందాసక్తికలవారును, అన్యత్ నాస్తి ఇతి వాదినః=(కర్మముకంటె)ఇతరమైనది లేదు అని చెప్పువారును, కా

మాత్మానః=కోరికయే స్వభావముగాఁగలవారును, స్వర్గపరాః=స్వర్గమునందాసక్తులునగు, అవిపశ్చితః=అల్పజ్ఞానులు, జన్మకర్మఫలప్రదామ్=పుట్టుకయు నైడికర్మఫలమును ఇచ్చునదియు, భోగైశ్వర్యగతింప్రతి క్రియావిశేషబహులామ్=సుఖానుభవమును నైశ్వర్యమును బొందుటనుం గూర్చిన కర్మవిశేషములు మిక్కిలి గాఁగలదియునగు, పుష్పితామ్ యామ్ ఇమాం వాచం ప్రవదన్తి=పూసినదానివలె శోభించుచున్నవ యీ వాక్యమును చెప్పుచున్నారో, తయా అపహృతచేతసామ్=దాని(అవాక్కు)చేత అపహరింపఁబడినమనస్సులుగలవారైన, భోగైశ్వర్యప్రసక్తానామ్ సమాధౌ=సుఖానుభవమునందును ఐశ్వర్యమునందును ఆసక్తిగలవారియొక్క మనస్సునందు, వ్యవసాయాత్మికా బుద్ధిః నవిధీయతే=నిశ్చయస్వభావముగల బుద్ధి కలుగదు.

పుష్పితామ్=పూయుటయె ఫలముగాఁగల, అనఁగా, పైచూపుకు సుందరముగానుండెడి- అని తాత్పర్యము. నాన్యదస్తీతివాదినః=స్వర్గాదులకంటె గొప్పఫలము లేదనువారు- కామాత్మానః=కామమందు మనస్సుగలవారు- జన్మకర్మఫలప్రదామ్=స్వర్గాద్యనుభవాంతమున జన్మకర్మమనెడి ఫలమునిచ్చునది- అపహృతచేతసామ్=అపహరింపఁబడినఆత్మజ్ఞానముకలవారికి- వ్యవసాయాత్మికా బుద్ధిః=ఆత్మయాథాత్మ్యనిశ్చయపూర్వకంబగు మోక్షసాధనభూతకర్మవిషయకజ్ఞానము— మోక్షేచ్ఛకలవాఁడు కామ్యకర్మములయందు సంగమును చేయఁగూడదు- అని రామానుజభాష్యము.

మోక్షమను ఫలమును గోరి స్వర్గాదిపుష్పములతోఁగూడిన వాక్కులను చెప్పుచున్నారు- వేదవాదరతాః=కర్మాదివాచకమగు వేదమునందు ఆసక్తిగలవారు- వేదములచేత పైకి పదిచెప్పఁబడినదో అయర్థమందాసక్తిగలవారు- మఱియేమియు లేదని చెప్పుచున్నవారు- వేదములు పరోక్షముగాభగవంతునిఁజెప్పుచున్నవి - భోగైశ్వర్యప్రాప్తియె వేదమునకుఫలమనియెదరు- వారికి, ఈశ్వరునియందలి మనస్సమాధానముకొఱకైన యుక్తినిర్ణయస్వరూపమైన బుద్ధిగలుగదు - ఆసమాధానమేకదా మోక్షసాధనము - అని మధ్వభాష్యము.

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।

నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥౪౫॥

వేదాః త్రైగుణ్యవిషయాః=వేదములు సత్త్వరజస్తమోగుణములువి షయముగాఁగలవి- (హే)అర్జున!=(ఓ)అర్జునుఁడా!, నిస్త్రైగుణ్యః నిర్ద్వన్ద్వః నిత్యసత్త్వస్థః నిర్యోగక్షేమః ఆత్మవాన్(చ) భవ=మూఁడుగుణములును లేనివాఁడవును శీతోష్ణాదిద్వంద్వములు లేనివాఁడవును ఎల్లప్పుడును సత్త్వగుణమునను న్నవాఁడవును యోగక్షేమములు లేనివాఁడవును ఆత్మజ్ఞానముకలవాఁడవును అగుము- యోగమనఁగా తనకు లేనిదానిని సంపాదించుట- దానిని సంరక్షించికొనుట క్షేమము.

త్రైగుణ్యమనఁగా సంసారము- నిస్త్రైగుణ్యుఁడనఁగా కోరికలేనివాఁడనుట- అని శంకరభాష్యము.

త్రైగుణ్యశబ్దముచే సత్త్వరజస్తమోగుణములుమిక్కిలిగాఁగలపురుషులు చెప్పఁబడుదురు- వారివారికి తగినహితములను వేదములు చెప్పును- నీవు అన్యోన్యసంకీర్ణములగు మూఁడుగుణములను వృద్ధిపొందించికొనక వృద్ధిపొందిన సత్త్వగుణము మాత్రము కలవాఁడవు అగుము- ఆత్మస్వరూపంబును అధికలుగుటకు సాధనమునుతప్ప మిగిలిన యోగక్షేమములు లేనివాఁడవై ఆత్మస్వరూపమును వెదకువాఁడవుకమ్ము- అని రామానుజభాష్యము.

త్రైగుణ్యమనఁగా సత్త్వరజస్తమోగుణసంబంధియగు స్వర్గాదికము- అదివేదమునకు పైకితోఁచెడియర్థము - అట్టియర్థమునందు భ్రమపడకుము- వేదములు స్వస్వరూపముగ విష్ణువును తెలియఁజేయునవి- అని మధ్వభాష్యము.

యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే।
తావా న్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥౪౬॥

ఉదపానే యావాన్ అర్థః=బావిమొదలగుదానియందు ఎంతప్రయోజనమో, తావాన్ సర్వతస్సంప్లుతోదకే (భవతి)=అంతప్రయోజనము అంతటనిండియున్ననీరుగలదానియందును (కలుగుచున్నది)- సర్వేషు వేదేషు (యావాన్ అర్థః)=సమస్తములైనవేదములలోఁ జె

ప్పఁబడినకర్మములలో (ఎంత ప్రయోజనమో), తావాన్ విజానతః బ్రాహ్మణస్య(భవతి)=అంతప్రయోజనము జ్ఞానముకల బ్రహ్మసంబంధి యయినవానికి (కలుగుచున్నది)- అనిశంకరభాష్యము.

సర్వతస్సంప్లుతోదకే ఉదపానే (పురుషస్య) యావాన్ అర్థః= అంతటనిండియున్ననీరుగల బావిమొదలగుదానియందు (పురుషునికి) ఎంతప్రయోజనమో, విజానతః బ్రాహ్మణస్య సర్వేషు వేదేషు తావాన్ అర్థః=జ్ఞానముగల ముముక్షువునకు అన్నివేదములయందును అంతియ ప్రయోజనము- బావిలో ఎవ్వనికెంత కావలయునో అంత నీరే పరిగ్రహింపఁబడునట్లు ముముక్షువుచే వేదమున మోక్షసాధనము మాత్రమే పరిగ్రహింపఁబడును- అనిరామానుజభాష్యము.

బావిమొదలగువానివలనం గలుగు ప్రయోజనము మహాజలమువలనంగలుగుదానిలోనంతర్భవించునట్లె వేదములలోని ఫలము బ్రాహ్మణునిఫలములో నంతర్భవించును- బ్రహ్మ అణతి(బ్రహ్మమును పొందువాఁడు) అనువిగ్రహముచే బ్రహ్మ పరోక్షజ్ఞానముకలవాఁడు బ్రాహ్మణుఁడు- అది జ్ఞానమువలనకలుగునని విజానతః అనువిశేషణము తెలియఁజేయుచున్నది- అనిమధ్వభాష్యము.

> కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషుకదాచన।
> మా కర్మఫలహేతుర్భూః మా తే సఙ్గోఽస్త్వకర్మణి॥౪౭॥

తే కర్మణ్యేవ అధికారః=నీకు కర్మమునందె అధికారము- కదాచన ఫలేషు (అధికారః) మా(భూత్)=ఒకప్పుడును ఫలములయందును (అధికారము) కాఁగూడదు- కర్మఫలహేతుః మా భూః=కర్మఫలములకు హేతువైనవాఁడవు కాకుండుము- తే అకర్మణి సఙ్గః మాస్తు=నీకు చేయకుండుటయందు ప్రీతి కలుగఁగూడదు-

నీకు కర్మనిష్ఠఁయందేకాని జ్ఞాననిష్ఠయందధికారములేదు- కర్మఫలములయందాశకలవాఁడవైతివేని తిరిగియు జన్మమును పొందుదువు- అనిశంకరభాష్యము.

ఫలమును కోరక భగవదారాధనరూపముగాఁ జేయఁబడెడి కర్మము మోక్షసాధనముగాన, నిత్యసత్త్వస్థుఁడవగుటచే మోక్షమంగోరెడినీకుకర్మలయందుమాత్రమెకాని వానిఫలములయందధికారములే

దు-కర్మమునకును ఫలమునకును నీవు హేతువుకాఁగూడదు- అనఁగా కర్మమునకు నేను కర్తను కాననియు ఫలమునకు హేతువు కాననియుఁ గూడ నీవు తలంచికొనవలయును. అని రామానుజభాష్యము.

జ్ఞానివైన నీకే ఫలపుకోరికకూడదు- ఇఁకనజ్ఞానులకు కూడదని చెప్పనేల?- వేదములో రుచిపుట్టుటకై కర్మములకు ఫలములు చెప్పఁబడియున్నవి- కర్మఫలము కర్మమునాచరించుటకు ఎవ్వనికి హేతువగునో అట్టివాఁడవుకాకుండుము- మిగిలిన ఫలములు లేకపోయినను నాప్రసాద (అనుగ్రహ)మనెడు ఫలము కలదుగాన కర్మములను చేయుటను విడువ కూడదు- లోకములో నీకేమి కావలయునని యడుగంబడియు తనసేవయె కావలయునని కోరువానియందు కలిగెడిప్రీతి, స్వార్థమై సేవఁజేయువానియందు కలుగదుగాన భక్తిజ్ఞానాదిప్రార్థన చేయఁదగినదియె యని మధ్వభాష్యము.

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥౪౮॥

(హే)ధనంజయ!=(ఓ)యర్జునుఁడా!, సఙ్గమ్ త్యక్త్వా=సంగమును విడిచి, సిద్ధ్యసిద్ధ్యోః సమః భూత్వా=ఫలముసిద్ధించుటయందును సిద్ధించకపోవుటయందును సమానుఁడవు అయి, యోగస్థస్సన్ కర్మాణి కురు=యోగమునందున్నవాఁడవై కర్మములను చేయుము- సమత్వమ్ యోగః (ఇతి) ఉచ్యతే=సమముగానుండుటయె యోగము (అని) చెప్పఁబడును.

ఈశ్వరుఁడు ప్రీతిఁ బొందవలయునని తలంచుచు ఫలసంగమును విడిచి కర్మములను జేయుము- కర్మానుష్ఠానమువలనఁగలిగెడి సత్త్వశుద్ధిద్వారకమైన జ్ఞానప్రాప్తి కలిగినను కలుగకున్నను ఒక్క విధముగానుండుటయె యోగము- అని శంకరభాష్యము.

రాజ్యము బంధువులు మొదలగువారియందు సంగమును విడిచి జయముకలిగినను కలుగకున్నను ఒక్కవిధముగానెయుండి యుద్ధాదికర్మములంజేయుము- అని రామానుజభాష్యము.

యోగస్థుఁడనఁగా ఉపాయమునందున్నవాఁడు- సంగమనఁగా ఫలస్నేహము- అనిమధ్వభాష్యము.

దూరేణహ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥౪౯॥

(హే)ధనంజయ!=(ఓ)యర్జునుఁడా!, బుద్ధియోగాత్ కర్మ దూరేణ అవరంహి=సమత్వబుద్ధితోఁగూడినకర్మముకంటె (మిగిలిన)కర్మము మిక్కిలి తక్కువగదా- బుద్ధౌ శరణమ్ అన్విచ్ఛ=జ్ఞానమునందు ఆశ్రయమును కోరుము- ఫలహేతవః కృపణాః=ఫలమునుకోరువారు దీనులు.

ఈశ్వరారాధనార్థమైన కర్మముకన్న ఫలమునుకోరి చేయఁబడిన కర్మము జన్మమరణాదిహేతువగుటవలన మిక్కిలి నికృష్టమైనది- కాఁబట్టి యోగబుద్ధియందుకాని దానిపరిపాకమువలనకలిగెడి సాంఖ్యబుద్ధియందుగాని అభయప్రాప్తికారణమును కోరుము- అని శంకరభాష్యము.

ఫలత్యాగవిషయంబును సిద్ధ్యసిద్ధిసమత్వవిషయంబునగు బుద్ధితోఁగూడినకర్మము సాంసారికదుఃఖముల నన్నిటిని నివర్తింపఁజేసి మోక్షమును చెందించును- మిగిలిన కర్మము సంసారమును పొందించును- శరణమనఁగా నివాసస్థానము- ఆబుద్ధియందె నిలుపుమనుట - కృపణులనఁగా సంసారులు- అని రామానుజభాష్యము.

బుద్ధియోగ మనఁగా జ్ఞానస్వరూపమైన యుపాయము- శరణ మనఁగా ఉనికి- కర్మమును చేయుటకు ఫలమె హేతువుగాఁగలవారు ఫలహేతువులు- అని మధ్వభాష్యము.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే।
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥౫౦॥

బుద్ధియుక్తః ఇహ ఉభే సుకృతదుష్కృతే జహాతి=బుద్ధితోఁగూడినవాఁడుఈలోకమున రెండైన పుణ్యపాపములను విడుచుచున్నాఁడు- తస్మాత్ యోగాయ యుజ్యస్వ=ఆహేతువువలన బుద్ధికలుగుటకొఱకు సిద్ధపడుము- కర్మసు కౌశలం యోగః=కర్మములయందలి నేర్పు యోగము.

నేర్పుచేత సాధింపఁదగినది యనుట- అని రామానుజభాష్యము.

జ్ఞాని అనిష్టమైన నరకాదిఫలమగు సుకృతమును విడిచిపెట్టునఁగా

ని మహాఫలంబై ఉపాసనాదిఫలంబగు సుకృతమును విడువఁడు, కర్మతు యము శ్రుతిలో నెచ్చటఁ జెప్పియున్నను అజ్ఞానులం గూర్చినదియె- మోక్షములోఁగూడ కామాన్నీ కామరూప్యనుసంచరన్ (కోరఁబడిన యన్నముకలవాఁడును కోరఁబడిన రూపముకలవాఁడునై సంచరింపుచును )ఇత్యాదులచే పుణ్యానుభవము చెప్పఁబడుచున్నది- దుష్కృతమును సంపూర్ణముగా విడుచును- యోగమనఁగా జ్ఞానోపాయము- అదియెకదా కర్మములో నేర్పు- అని మధ్వభాష్యము;

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥ ౫౧॥

బుద్ధియుక్తాః మనీషిణః=జ్ఞానముతోఁగూడిన బుద్ధిమంతులు, కర్మజం ఫలం త్యక్త్వా=కర్మమువలనఁగలిగెడి ఫలమును విడిచి, జన్మబన్ధవినిర్ముక్తా(స్సన్తః) అనామయం పదం గచ్ఛన్తి హి=జన్మమనెడికట్టు చేతవిడువఁబడినవా(రగుచు) ఉపద్రవములులేని స్థానమును పొందుచున్నారుగదా.

ఇష్టానిష్టశరీరప్రాప్తియె కర్మజఫలము- బుద్ధియనఁగా సమత్వబుద్ధి- మనీషిణః అనుదానికి జ్ఞానులయి అని యర్థము- జన్మబన్ధవినిర్ముక్తాః=బ్రదికియుండియె జన్మబన్ధముక్తులై మోక్షాఖ్యమగు విష్ణుస్థానమును చెందుదురు- లేక, బుద్ధియోగాద్ధనంజయ (అ॥ ౪౯శ్లో॥)అనునది మొదలు ఇదివఱకును కర్మయోగమువలన సత్త్వశుద్ధికలిగి దానివలన కలిగెడి బ్రహ్మజ్ఞానమె చెప్పఁబడుచున్నది- అని శంకరభాష్యము.

బుద్ధియోగముతోఁగూడినవారై ఫలమును విడిచి కర్మములఁ జేయువారిం గూర్చినది ఈశ్లోకము- అని రామానుజభాష్యము.

కర్మములను వానిఫలముం గోరక, ఈశ్వరునకు సమర్పించి, మంచిజ్ఞానము కలవారై మోక్షమును పొందుదురు- యోగముతోఁ గూడిన కర్మము జ్ఞానసాధనము, జ్ఞానము మోక్షసాధనము అనిభావము- అని మధ్వభాష్యము.

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥ ౫౨॥

తే బుద్ధిః మోహకలిలం యదా వ్యతితరిష్యతి=నీ బుద్ధి మోహమనె

డికలంతను ఎప్పుడు దాటఁగలదో, తదా శ్రోతవ్యస్య శ్రుతస్యచ నిర్వేదం గన్తాసి=అప్పుడు వినఁబడవలసినదానియొక్కయు వినఁబడినదానియొక్కయు వైరాగ్యమును పొందఁగలవు.

ఆత్మానాత్మవివేకజ్ఞానమును చెడఁగొట్టి విషయములనుఁగూర్చి యంతఃకరణమును ప్రవర్తింపఁజేసెడి మోహము పోయి, నీబుద్ధి యెప్పుడు పరిశుద్ధమగునో, అప్పుడు నీకు వినవలసినదియు విన్నదియు నిష్ఫలముగాఁదోఁచును- అని శంకరభాష్యము.

చెప్పినచొప్పున కర్మములను చేయుటచే పాపక్షయము కలుగుటను స్వల్పఫలసంగమునకు హేతువగు మోహమును నీబుద్ధి యెప్పుడు దాటునో, అప్పుడు, మావంటివారిచే నింతకు మున్నె త్యాజ్యముగాఁ జెప్పఁబడినదియు, ఇఁకఁ జెప్పఁబడఁబోవునదియు నగుఫలము మొదలగు దానియందు వైరాగ్యమును పొందుదువు- అని రామానుజభాష్యము.

మనస్సునకు మిథ్యాజ్ఞానము పోవుటకు ఈశ్వరసమర్పణముతో కర్మములం జేయవలయును- నిర్వేదమ్ అనుదానికి మిక్కిలిలాభమును అని యర్థము-గొప్పవారిచే వినఁబడఁదగినదియు వినఁబడినదియునగు వేదము మొదలగువాని ఫలమును పొందుదువు- అని మధ్వభాష్యము.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి॥ ౫౩॥

శ్రుతివిప్రతిపన్నా తే బుద్ధిః=శ్రుతులచేతననేకవిధములుగా తెలిసికొనిన నీ అంతఃకరణము, యదా నిశ్చలా(సతీ) సమాధౌ అచలా స్థాస్యతి=ఎప్పుడు విక్షేపములేనిది(అగుచు) ఆత్మయందు వికల్పజ్ఞానములేనిదై ఉండునో, తదా యోగమ్ అవాప్స్యసి=అప్పుడు వివేకజ్ఞానరూపమగు సమాధిని పొందుదువు- అని శంకరభాష్యము.

శ్రుతివిప్రతిపన్నా అచలా తే బుద్ధిః=నావలనవినుటవలనవిశేషముగాఁదెలిసికొనినదై ఒక్కవిధముగానుండెడి నీ బుద్ధి, సమాధౌ యదా నిశ్చలా స్థాస్యతి=మనస్సులో ఎప్పుడు నిలకడకలది అగునో, తదా యోగమ్ అవాప్స్యసి=అప్పుడు ఆత్మావలోకనమును పొందఁగలవు- శాస్త్రములవలనఁగలిగిన ఆత్మజ్ఞానముతోఁగూడిన కర్మయోగము స్థితప్రజ్ఞతను నెడి జ్ఞాననిష్ఠను కలుగఁజేయును- అని ఆ

శాస్త్రావలోకనమును సాధించును- అని రామానుజభాష్యము.

నీ బుద్ధి, మొదట శ్రుతులతో విరుద్ధమైనదైయును, ఎప్పుడు వేదార్థమునకు అనుకూలమగు తత్త్వనిశ్చయమున విరుద్ధవాక్యములచేఁగూడ కదల్పఁబడదో, అటుపైని బ్రహ్మప్రత్యక్షముచేత భేర్యాదులు మ్రోసినను చలింపనిదిఅగునో, అప్పుడు ఉపాయసిద్ధికలవాఁడవగుదువు- అని మధ్వభాష్యము.

అర్జున ఉవాచ.

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కింప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥ ౫౪॥

(హే) కేశవ!=(ఓ) శ్రీకృష్ణమూర్తీ!, సమాధిస్థస్య స్థితప్రజ్ఞస్య భాషా కా=సమాధిలోనుండెడి స్థితప్రజ్ఞునకు శబ్దము ఏది?- స్థితప్రజ్ఞుఁడు జనులచే నేమని చెప్పఁబడుననుట- స్థితధీః కిం ప్రభాషేత=స్థితప్రజ్ఞుఁడు దేనిని పలుకును?-కిమ్ ఆసీత?=ఎట్లు ఉండును?- కింవ్రజేత=ఎట్లు నడచును.

అర్జునుఁడెఱిఁగియున్నను, లోకోపకారార్థము ప్రశ్నముచేయుచున్నాఁడు- స్థితప్రజ్ఞుఁడనఁగా నిలిచిన జ్ఞానము కలవాఁడు- భాషయనఁగా లక్షణము- సమాధిస్థస్య అనునదిలక్షణమైనను మఱియొకలక్షణమును అడుగుచున్నాఁడు- అని మధ్వభాష్యము.

శ్రీభగవానువాచ.

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్ట స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ ౫౫॥

(హే) పార్థ!=(ఓ) యర్జునుఁడా!, ఆత్మని ఆత్మనైవ తుష్టః=ఆత్మయందు ఆత్మచేతనె సంతోషించినవాఁడై, మనోగతాన్ సర్వాన్ కామాన్ యదా ప్రజహాతి=మనస్సులోని అన్ని కోరికెలను ఎప్పుడు విడుచునో, తదా స్థితప్రజ్ఞః (ఇతి) ఉచ్యతే=అప్పుడు స్థితప్రజ్ఞుఁడు (అని) చెప్పఁబడును.

ఇఁకనీయధ్యాయమంతయు స్థితప్రజ్ఞుని లక్షణంబును సాధనంబును తెలియఁజేయును- వెలుపటిలాభములయందపేక్ష లేక తనస్వరూపమందె తనివిని పొందినవాఁడు స్థితప్రజ్ఞుఁడు- అని శంకరభా

వ్యము.

ఆత్మన్యేవ ఆత్మనా తుష్టః=ఆత్మైకవిషయంబగు మనస్సుచే సంతోషించినవాఁడై, మిగిలిన యన్నికామములను ఎప్పుడు విడుచునో, అప్పుడు స్థితప్రజ్ఞత్వముయొక్క తుదియవస్థకలుగును- అని రామానుజభాష్యము- ఈ యవస్థ వశీకారమనుపేరుగల నాల్గవయవస్థ.

పరమాత్మయందె పరమాత్మచేతనున్నవాఁడై తలుచుగా నన్నికోరికెలను విడుచుచున్నాఁడు- పరమాత్మయందున్నవానికి పరమాత్మప్రసాదంబుననే తుష్టికలుగును- అని మధ్వభాష్యము.

దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే॥౫౬॥

దుఃఖేషు అనుద్విగ్నమనాః=దుఃఖములయందు క్షోభమునుపొందనిమనస్సుకలవాఁడును, సుఖేషు విగతస్పృహః=సుఖములయందు ఆశలేనివాఁడును, వీతరాగభయక్రోధః మునిః=రాగంబును భయంబును క్రోధంబును లేని ముని, స్థితధీః (ఇతి) ఉచ్యతే=స్థితప్రజ్ఞుఁడు (అని) చెప్పఁబడుచున్నాఁడు.

దుఃఖములు ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికములనునవి- (ఆధ్యాత్మికములు రోగాములవలనఁగలుగునవి- ఆధిభౌతికములు చోరపిశాచాములవలనఁ గలుగునవి- అధిదైవికములు పిడుగులు మొదలగువానివలనఁ గలుగునవి)- సుఖములయందాశలేకపోవుటయనఁగా అగ్నిలో పుడకలను వేయుటతోనే అగ్ని వృద్ధిపొందినట్లు సుఖముకలిగినప్పుడు వృద్ధిపొందకుండుట- మునియనఁగా సన్యాసి- అని శంకరభాష్యము.

దుఃఖములనఁగా ఇష్టమైనవస్తువులు లేకపోవుట మొదలగు దుఃఖనిమిత్తములు- సుఖములనఁగా ఇష్టమైనవి- తనకులేనివానియందలికోరిక రాగము- ఇష్టమైనదిపోవుటకును అనిష్టమైనదివచ్చుటకును కారణములగువానింజూచి దుఃఖించుటభయము- ఇష్టముపోవుటవలనను అనిష్టము కలుగుటవలనను కలిగినదై దుఃఖకరమై తనలోఁగలిగెడి మనోవికారము క్రోధము- ముని అనఁగా ఆత్మను మననముచేయు స్వభావము కలవాఁడు- ఇది వెనుకటిశ్లోకమున చెప్పిన యవస్థకంటె పూర్వమైనయవస్థ- అని రామానుజభాష్యము. ఇది ఏకేంద్రియమను పేరుగలమూడవయవస్థ.

వెనుకటిశ్లోకములోఁజెప్పఁబడినజ్ఞానోపాయములె ఇఁక మూఁడుశ్లోకములచే స్పష్టపఱుపఁబడును-రాగమనఁగా చెడ్డవిషయములను మంచివిషయములుగా భ్రమించుట- అని మధ్వభాష్యము.

యః సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినన్దతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥౫౭॥

యః సర్వత్ర అనభిస్నేహః (సన్)=ఎవ్వఁడు అంతట స్నేహములేనివాఁడు (అగుచు), తత్తత్ శుభాశుభం ప్రాప్య నాభినన్దతి నద్వేష్టి= ఆయా మంచిచెడ్డలను పొంది సంతోషింపఁడో ద్వేషింపఁడో, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా=వాని తెలివి నిలుకడనుపొందినది.

అంతటననఁగా దేహము ప్రాణము మొదలగువానియందు- అనిశంకరభాష్యము.

ఇష్టములైనవానియందంతటను ఉదాసీనుఁడగుచు- శుభమనఁగా ఇష్టమయినదికలుగుట-అదిపోవుట అశుభము- ఇది వెనుకటిశ్లోకములోఁ జెప్పఁబడినదానికన్న వెనుకటిదశ- అని రామానుజభాష్యము. ఇదివ్యతిరేకమను పేరుగలరెండవయవస్థ.

అంతట స్నేహములేకపోవుట శుభాశుభములచే సంతోషద్వేషములు లేకపోవుటకు హేతువు- అని మధ్వభాష్యము.

యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥౫౮॥

అయమ్ యదా=ఈతఁడు ఎప్పుడు, కూర్మః అఙ్గానీవ=తాబేలు అవయవములనువలె, ఇన్ద్రియాణి సర్వశః ఇన్ద్రియార్థేభ్యః సంహరతే=ఇంద్రియములను అన్ని విషయములనుండియు మఱలించికొనుచున్నాఁడో, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా=వాని తెలివి నిలకడగలిగినది.

ఇంద్రియములను విషయములనుండి మఱలించి మనస్సును ఆత్మయందునుంచుచున్నాఁడు- ఈ నాలుగుజ్ఞాననిష్ఠలును పూర్వపూర్వముచెప్పఁబడినది పైపైని చెప్పఁబడినదానిచేఁబుట్టఁదగినవి- అని రామానుజభాష్యము. ఈశ్లోకమునఁజెప్పఁబడినదియతమానమనెడిప్రథమదశ.

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥౫౯॥

నిరాహారస్య దేహినః=ఆహారములేని పురుషునకు, విషయాః రసవర్జం వినివర్తన్తే=విషయములు రాగముతప్ప మఱలుచున్నవి- పరం దృష్ట్వా(స్థితస్య) అస్య రసోపి నివర్తతే=ఆత్మస్వరూపమును చూచి (యున్న) వీనికి రాగంబును మఱలుచున్నది.

విషయములనఁగా ఇంద్రియములు- నిరాహారునకు అనఁగా విషయములను స్వీకరింపనివానికి- పరబ్రహ్మమును చూచియున్నవానికి అనఁగా బ్రహ్మమే నేనుఅనుకొనినవానికి- అని శంకరభాష్యము.

ఇంద్రియములకు ఆహారము విషయములె- రాగంబును, విషయముల కంటెపరమైన అనఁగా మిక్కిలిసుఖకరమైన ఆత్మస్వరూపమును చూచినపై మఱలుచున్నది- అని రామానుజభాష్యము.

వెనుకఁజెప్పఁబడిన జ్ఞానము ప్రయత్నములేక సిద్ధింపదని యుత్తరశ్లోకములచేఁజెప్పఁబడుచున్నది- ఆహారము(తిండి) లేనివానికి ఇతరవిషయములననుభవించెడి శక్తి లేకపోవును- మిగిలినవిషయములయందు కోరికయైనను లేకపోవును- రసమును(రుచిని) కోరుటమొదలగునది నివర్తింపదు- అది అపరోక్షజ్ఞానమువలననె మఱలును- రసశబ్దము రాగముంగూడ చెప్పును- అని మధ్వభాష్యము.

యతతోహ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ ౬౦॥

(హే)కౌన్తేయ!=(ఓ)యర్జునుఁడా!, యతతః విపశ్చితోఽపి పురుషస్య మనః=ప్రయత్నముచేయుచున్నవాఁడును జ్ఞానవంతుడునైనను పురుషునియొక్క మనస్సును,ప్రమాథీని ఇన్ద్రియాణి ప్రసభం హరన్తిహి=క్షోభముకలుగఁజేసెడి ఇంద్రియములు బలాత్కరించి లాగుచున్నవి- విషయములతోఁజేరుచున్నవియనుట.

ఇంద్రియములను జయించుటఆత్మదర్శనంబునంగానికలుగదు- కాన జ్ఞాననిష్ఠదుర్లభమేనది- అని రామానుజభాష్యము.

అపరోక్షజ్ఞానములేక వట్టిజ్ఞానముకలవాఁడైనను సాధారణమైనయత్నముకలవాఁడైనను శరీరాభిమానియగువాని మనస్సును ఇంద్రియములు లాగుచున్నవి- అనిమధ్వభాష్యము

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీతమత్పరః।

వశేహి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥౬౧॥

తాని సర్వాణి సంయమ్య=వానిని అన్నిటిని స్వాధీనముచేసికొని, యుక్తః మత్పర(స్సన్) ఆసీత=సమాధికలవాఁడై నాయందాసక్తిగలవాఁ(డగుచు) ఉండునది- యస్య ఇన్ద్రియాణి వశే వర్తన్తే=ఎవనికి ఇంద్రియములు తనవశమున నున్నవో, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా =వాని జ్ఞానము నిలకడకలది.

మత్పరః ఆసీత అనుదానికి అంతటికిని ఆత్మనైన నేను పరుఁడు గాఁగలవాఁడై, ఆతనికంటె నేను వేఱుగాను అనియుండునది- అని శంకరభాష్యము.

మత్పరః అనుదానికి నాయందుమనస్సునుఉంచినవాఁడై అనియర్థము- భగవంతునియందు ఉంచబడిన మనస్సు అన్నిపాపములును నశించుటవలన నిర్మలమై విషయానురాగములేనిదై ఇంద్రియములనుస్వాధీనముచేసికొనును- అని రామానుజభాష్యము.

మిక్కిలి ప్రయత్నముకలవానికి ఇంద్రియములు స్వాధీనములుగాను- యుక్తః=నాయందుమనస్సుకలవాఁడై, మత్పరః=సమస్తముకన్న నన్నుత్కృష్టుఁడనుగా నన్ను ఎవ్వఁడెఱుఁగునో అట్టివాఁడై అని మధ్వభాష్యము.

ధ్యాయతో విషయాన్ పుంసస్సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥
క్రోధాద్భవతి సంమోహస్సంమోహాత్స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥౬౩॥

విషయాన్ ధ్యాయతః పుంసః=విషయములను ఆలోచింపుచున్న పురుషునకు, తేషు సఙ్గః ఉపజాయతే=వానియందు ప్రీతి కలుగుచున్నది- సఙ్గాత్ కామః సంజాయతే=విషయప్రీతివలన ఆశ పుట్టుచున్నది- కామాత్ క్రోధః అభిజాయతే=ఆశవలన క్రోధము పుట్టుచున్నది- తాను ఆశపడినదానిని మఱియొకఁడు ఆశపడినతోడనె వానియందు కోపముపుట్టునుగదా- క్రోధాత్ సంమోహః భవతి=కోపమువలన అవివేకముకలుగుచున్నది• సంమోహాత్ స్మృతివిభ్రమః (భవతి) =అవివేకమువలన మఱపు (కలుగుచున్నది)- స్మృతిభ్రంశాత్ బు

నాశః (భవతి)=మఱపువలన తెలివిపోవుట (కలుగుచున్నది)- బుద్ధినాశాత్ ప్రణశ్యతి= తెలివిచెడుటవలన నశింపుచున్నాఁడు.

బుద్ధినాశమనఁగా అంతఃకరణముచెడుట- అనఁగా ఇది చేయఁదగినది ఇది చేయఁదగనిది అను నేర్పాటు లేకపోవుట- దానివలన నశించుటయనఁగా పురుషార్థమునకు తగిలపోవుట- అని శంకరభాష్యము.

కామమనఁగా విషయములను అనుభవింపక నిలువలేకపోవుట- సంమోహమనఁగా కార్యాకార్యవివేకము లేకపోవుట- స్మృతిభ్రంశము అనఁగా తాను నడపించుచున్న ఇంద్రియజయము మొదలగుదానిని మఱచుట- బుద్ధినాశమనఁగా ఆత్మజ్ఞానమునందలి వ్యవసాయము (నిశ్చయము) పోవుట- దానివలన నశించుటయనఁగా సంసారములోఁబడుటయే-అని రామానుజభాష్యము.

సంమోహమనఁగా అకార్యములయందలి కోరిక- స్మృతివిభ్రమము అనఁగా శాస్త్రనిషేధములను మఱచుట- బుద్ధినాశమనఁగా అనిషిద్ధము లను దోషమునెడి జ్ఞానమె లేకపోవుట- వినశ్యతిఅనుదానికి నరకము మొదలగు అనర్థములను పొందుచున్నాఁడు అనియర్థము- అని మధ్వభాష్యము.

రాగద్వేషవియుక్తైస్తు విషయానిన్ద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి॥౬౪॥

రాగద్వేషవియుక్తైః ఆత్మవశ్యైః ఇన్ద్రియైః విషయాన్ చరన్ =రాగద్వేషములులేనివై తనకులోంగియున్న ఇంద్రియములచేత విషయములను అనుభవింపుచున్నవాఁడై, విధేయాత్మా ప్రసాదమ్ అధిగచ్ఛతి=స్వాధీనమైనఅంతఃకరణముకలవాఁడై తేటను పొందుచున్నాఁడు.

స్వాధీనములైన ఇంద్రియములచేత శరీరముగలుచుటకై విడువశక్యముకాని విషయములను అనుభవింపుచు- ప్రసాదమనఁగా స్వస్థత- అని శంకరభాష్యము.

విషయాన్ చరన్=విషయములను తిరస్కరించియున్నవాఁడై- ప్రసాదమనఁగా నిర్మలమైన మనస్సు కలిగియుండుట- అని రామానుజభాష్యము

విషయములననుభవింపుచున్నను జయింపఁబడిన మనస్సుకలవాఁడు

మనస్సుయొక్క తేటను పొందుచున్నాఁడు- అనిమధ్వభాష్యము.

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥౬౫॥

ప్రసాదే (సతి) అస్య సర్వదుఃఖానామ్ హానిః ఉపజాయతే=ప్రసన్నతకలుగుచుండఁగా వీని సర్వదుఃఖములకును నాశము కలుగుచున్నది. ప్రసన్నచేతసః బుద్ధిః ఆశు పర్యవతిష్ఠతి=ప్రసన్నమైన యంతఃకరణముకలవాని బుద్ధి శీఘ్రముగా నిలకడకలదియగుచున్నది.

పర్యవతిష్ఠతే=ఆకాశమువలెననంతటనుండునదియగును- ఆత్మస్వరూపముచేత నిశ్చలమగుననుట- అనిశంకరభాష్యము.

ప్రసన్నచేతసః=ఆత్మావలోకనమునకు విరోధులగు దోషములులేని మనస్సుకలవానికి- బుద్ధిః=ప్రత్యేకముగా ఆత్మవిషయమైన జ్ఞానము- అని రామానుజభాష్యము.

బుద్ధిః పర్యవతిష్ఠతి=జ్ఞానము బ్రహ్మపరోక్షత్వముచేత లెస్సగా స్థితినిచేయును- ప్రసాదమనఁగా తనప్రయత్నము లేకయైనను తలఁచుగా విషయములయందు ప్రవర్తింపకపోవుట- అనిమధ్వభాష్యము.

నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా।
నచా భావయత శ్శాన్తి రశాన్తస్య కుత స్సుఖమ్॥౬౬॥

అయుక్తస్య బుద్ధిః నాస్తి=యోగములేనివానికి జ్ఞానము లేదు- అయుక్తస్య భావనాచ న=యోగములేనివానికి భావనయును లేదు- అభావయతశ్చ శాన్తిః న=భావనచేయకున్నవానికి శాంతి లేదు- అశాన్తస్య సుఖమ్ కుతః?=శాంతిలేనివానికి సుఖము ఎక్కడది?

సమాధిలేనివానికి ఆత్మస్వరూపజ్ఞానంబును ఆత్మజ్ఞానమువందలి అభినివేశంబు(నిశ్చయము)ను కలుగదు- సుఖమనఁగా ఇంద్రియములు విషయానుభవపు ఆశనుండి మఱలుట- విషయములయందలియాశ దుఃఖమే- ఆశకలిగినప్పుడు సుఖలేశమైనను కలుగదు- అనిశంకరభాష్యము.

యోగమనఁగా భగవంతునియందు మనస్సునుంచుట- బుద్ధియనఁగా ప్రత్యేకముగా నాత్మను తెలిసికొనుట- భావనయనఁగా ఆత్మధ్యానము- శాంతియనఁగా విషయములయందలి స్పృహ(ఆశ) యుడుగుట- ఇదిలేనివానికి, నిత్యమై, ఇంతకంటె నెక్కుడు లేదనఁదగిన సుఖము కలుగదు-

అనిరామానుజభాష్యము.

అయుక్తుఁడనఁగా మనోనిగ్రహము లేనివాఁడు- బుద్ధియనఁగా వివేకజ్ఞానము- శాంతియనఁగా మోక్షము- అనిమధ్వభాష్యము.

ఇన్ద్రియాణాంహి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥౬౭॥

యత్ మనః=ఏ మనస్సు, చరతామ్ ఇన్ద్రియాణామ్ అను విధీయతే=విషయములననుభవింపుచున్న ఇంద్రియముల వెంటను ప్రవర్తించునో, తత్ అస్య ప్రజ్ఞామ్=అది వీని తెలివిని, వాయుః అంభసి నావమివ=గాలి నీటిలో ఓడనువలె, హరతి=ఆకర్షించుచున్నది.

ఓడవాండ్ర యోడను గాలి, మార్గమును తప్పించి అపమార్గమునకు నడపించునట్లు ఇంద్రియముల ననుసరించెడి మనస్సు సంన్యాసి యొక్క ఆత్మానాత్మవివేకమువలనఁగలిగిన జ్ఞానమును నశింపఁజేయును- అనిశంకరభాష్యము.

ప్రజ్ఞయనఁగాఁ బ్రత్యేకముగా నాత్మను తెలిసికొనుట- వాయువనగా ఎదురుగాలి-అనిరామానుజభాష్యము.

విధీయతే=ఈశ్వరునిచేతఁజేయఁబడుచున్నదో- ప్రజ్ఞామ్=శ్రేష్ఠమైనజ్ఞానమును- ఇఁకపుట్టబోవుదానింగూడ నివారింపుచున్నది-పుట్టినదానిని తిరస్కరింపుచున్నది అనిమధ్వభాష్యము.

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥౬౮॥

(హే)మహాబాహో!=(ఓ)గొప్పభుజములుగలవాఁడా!, తస్మాత్=ఆహేతువువలన, యస్య ఇన్ద్రియాణి సర్వశః ఇన్ద్రియార్థేభ్యః నిగృహీతాని=ఎవ్వని ఇంద్రియములు అంతటను విషయములనుండి నిగ్రహింపఁబడినవో, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా=వాని బుద్ధి నిలకడ కలది.

కాఁబట్టి సమస్తవిధముల నిగ్రహింపఁబడిన యింద్రియములు కలవాఁడె జ్ఞాని- అనిమధ్వభాష్యము.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥౬౯॥

ప్రయత్నమును చేయఁడో, విషయములు లేనిచో శోషింపఁడో, వాఁడు మోక్షమునుం జెందును. అని మధ్వభాష్యము.

విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః।
నిర్మమో నిరహంకార స్సశాన్తి మధిగచ్ఛతి॥ ౭౧॥

యః పుమాన్ = ఏ పురుషుఁడు, సర్వాన్ కామాన్ విహాయ = అన్ని కోరికలను విడిచి, నిస్స్పృహః నిర్మమః నిరహంకారః చరతి = ఆశ లేనివాఁడును మమకారము లేనివాఁడును అహంకారము లేనివాఁడునై సంచరింపుచున్నాఁడో, సః శాన్తిమ్ అధిగచ్ఛతి = వాఁడు శాంతిని పొందుచున్నాఁడు.

చరతి అనుదానికి జీవనమాత్రవ్యాపారమె మిగిలి తిరుగుచున్నాఁడో అనియర్థము- అహంకారమనఁగా తనను గొప్పఁజేసికొనుట- శాంతి యనఁగా అన్నిసంసారదుఃఖములు నడఁగుటయనెడి మోక్షము- అని శంకరభాష్యము.

కామములనఁగా కోరఁబడెడి శబ్దాదివిషయములు- నిరహంకారః = దేహమునందు ఆత్మాభిమానము లేనివాఁడు- అని రామానుజభాష్యము.

కామము లనఁగా విషయములు- చరతి = భక్షింపుచున్నాఁడో- నేను భక్షింపుచున్నానని అహంకారమమకారములు లేనివాఁడై ముక్తిని బొందును- అని మధ్వభాష్యము.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యా మన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥ ౭౨॥

(హే) పార్థ! ఏషా బ్రాహ్మీ స్థితిః = (ఓ) యర్జునుఁడా! ఇది బ్రహ్మసంబంధమయిన స్థితి- ఏనాం ప్రాప్య నవిముహ్యతి = దీనిని పొంది మోహముం జెందఁడు- అన్తకాలేఽపి అస్యాం స్థిత్వా = చరమవయస్సునందుఁగూడ దీనిలో ఉండి, బ్రహ్మనిర్వాణమ్ ఋచ్ఛతి = బ్రహ్మానందమును పొందుచున్నాఁడు.

అన్నికర్మములను విడిచి బ్రహ్మస్వరూపముగానుండుటయనెడి జ్ఞానము, బ్రాహ్మీస్థితి యని చెప్పఁబడినది- బాల్యమున సన్న్యసించినవాఁడుఁ గూడ మోక్షమునుపొందఁగా బ్రహ్మచర్యమునుండియె సన్న్యసించి జీవ

నకాలమంతయు బ్రహ్మమునందె యున్నవానికి మోక్షముకలుగునని చెప్పవలయునే? అనిశంకరభాష్యము.

నిత్యాత్మజ్ఞానముకలవాఁడై సంగములేని కర్మముల నాచరించుటయె, బ్రహ్మమును పొందించునదిగాన, బ్రాహ్మీ స్థితిః అని చెప్పఁబడినది- ఇట్టి కర్మస్థితినిబొంది తిరిగియు సంసారమును జెందఁడు- బ్రహ్మనిర్వాణము అనఁగా నిర్వాణమయమగు బ్రహ్మమును, అనఁగా సుఖైకస్వరూపంబగు నాత్మను పొందుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

బ్రాహ్మీ=బ్రహ్మవిషయమగు, స్థితిః=లక్షణము- అంతకాలమందైనను ఈస్థితిలో నిలిచియె బ్రహ్మమును పొందుచున్నాఁడు-లేనియెడను జన్మాంతరమును పొందుచున్నాఁడు- జ్ఞానులకుఁగూడ ప్రారబ్ధకర్మ మున్నయెడను మఱియొకటి శరీరము కలుగును- నిర్వాణం బ్రహ్మ=శరీరములేని బ్రహ్మమును- శరీరము లేకపోవుటయనఁగా ప్రకృతివలనఁగలిగిన శరీరము లేకుండుటకాని ఎల్లప్పుడును ఆనందరూపమైఅంతటను పరిపూర్ణమైన అప్రాకృతశరీరము లేకపోవుటకాదు- ఆశరీరమునె తన మాయచేత పరిచ్ఛిన్నమునుజేసి రామకృష్ణాదిరూపముగాఁజూపును- ఎల్లప్పుడును అన్నిశరీరములయందును లెక్కలేని అనంతములైన గుణములు కలిగియు దోషము లేమియులేనిదియునగు నారాయణుఁడను పరబ్రహ్మము అపరోక్షజ్ఞానముచేఁ బొందుచున్నాఁడు- అని మధ్వభాష్యము.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సాం
ఖ్యయోగోనామ ద్వితీయోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతి
పాదకంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణా
ర్జున సంవాదంబునగు భగవద్గీతలలో
సాంఖ్యయోగప్రతిపాదకంబగు
రెండవయధ్యాయము.



## మూడవయధ్యాయము.

### అర్జునఉవాచ.

జ్యాయసీచే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥౧॥
వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్॥౨॥

(హే)జనార్దన!=(ఓ)శ్రీకృష్ణుఁడా!, బుద్ధిః కర్మణః జ్యాయసీ తే మతా చేత్=జ్ఞానము కర్మముకంటె శ్రేష్ఠమైనదిగా నీకు ఇష్టమయ్యెనేని, (హే)కేశవ!=(ఓ)శ్రీకృష్ణుఁడా!, తత్=అందువలన, ఘోరే కర్మణి మామ్ కిం నియోజయసి?=ఘోరమైన కర్మమునందు నన్ను ఏల ప్రవర్తింపఁజేయుచున్నావు?- వ్యామిశ్రేణేవ వాక్యేన=కలతగానుండెడిదానివంటి వాక్యముచేత, మే బుద్ధిం మోహయసీవ=నా బుద్ధిని మోహింపఁజేయుచున్నట్లు ఉన్నావు- యేన అహమ్ శ్రేయః ఆప్నుయామ్=దేనిచేత నేను మేలును పొందుదునో, తత్ ఏకమ్ నిశ్చిత్య వద=అట్టి ఒకదానిని నిశ్చయించి చెప్పుము.

ఈయర్జునప్రశ్నముచే జ్ఞానకర్మసముచ్చయము అనఁగా జ్ఞానముతో తుల్యముగా కర్మమునుఁగూడ చేర్చి యాచరించుట సిద్ధాంతము కాదని స్పష్టపఱుపఁబడినది- అని శంకరభాష్యము.

జ్ఞాననిష్ఠయె ఆత్మావలోకనమునకు సాధనము-కర్మనిష్ఠ, ఆజ్ఞాననిష్ఠను కలుగఁజేయునది- ఇంద్రియముల వ్యాపారములన్నియు నడఁగుటచేఁ గలిగెడి ఆత్మావలోకనమె సాధింపవలసినదైనచో సకలకర్మములను వదిలి జ్ఞానమునె యాచరించుటయందు నన్ను నియోగింపుము- సర్వేంద్రియవ్యాపారరూపమైనకర్మమున నన్నేల నియోగించెదవు- అని రామానుజభాష్యము.

కర్మముకన్న జ్ఞానము మిక్కిలి యుత్తమమైనదని చెప్పితివి- అట్లయ్యెనేని నివృత్తికర్మముల విడిచి యుద్ధమనెడి ఘోరమయినకర్మమందు నన్నేల నియోగింపుచున్నావు? అని మధ్వభాష్యము.

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా మయా ప్రోక్తా పురాఽనఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥౩॥

(హే) అనఘ = (ఓ) పాపములు లేనివాఁడా!, అస్మిన్ లోకే = ఈ లోకము నందు, పురా ద్వివిధా నిష్ఠా మయా ప్రోక్తా = పూర్వము. రెండువిధము లుగల నిష్ఠ నాచేత చెప్పఁబడినది- సాంఖ్యానామ్ జ్ఞానయోగేన (నిష్ఠా ప్రోక్తా) = జ్ఞానులకు జ్ఞానమనెడియోగముచేత (నిష్ఠ చెప్పఁబడినది).

పూర్వమునందు అనఁగా సృష్ట్యాదియందు-వేదార్థసంప్రదాయమును బయలుపుచ్చినప్పుడు- నిష్ఠయనఁగా అనుష్ఠేయమందలి తాత్పర్యము- జ్ఞానయోగము బ్రహ్మచర్యాశ్రమమునందె సంన్యసించిన పరమహంసపరివ్రాజకులకు- అటు కాక కర్మములనాచరించెడి వారికి కర్మయోగము- అని శంకరభాష్యము.

సంఖ్య అనఁగా బుద్ధి- దానితోఁగూడినవారు సాంఖ్యులు- ఆత్మమాత్రవిషయమైన జ్ఞానముకలవారు- దానికితగనివారై కర్మయోగాధికారులైనవారు యోగులు- విషయములయందు వ్యాకులమైన బుద్ధికలవారికి కర్మయోగమున నధికారము- వ్యాకులముకాని బుద్ధికలవారికి జ్ఞానయోగమున నధికారము- కాఁబట్టి వ్యామిశ్రమైన వాక్యము చెప్పఁబడలేదు- అని రామానుజభాష్యము.

సనకాదులవలె గృహస్థాదికర్మములను విడిచి జ్ఞాననిష్ఠులైనవారును, జనకాదులవలె గృహస్థాదికర్మములలోనుండియె జ్ఞాననిష్ఠులైనవారు నని రెండువిధములైన జనులు కలరు-ఇందు మొదటివారు సాంఖ్యులు-రెండవవారు యోగులు- జ్ఞాననిష్ఠులైనను అధికారికులగుటవలన ఈశ్వరేచ్ఛచేతనును లోకసంగ్రహార్థమగుటవల్లనును కర్మయోగ్యులయినవారును యోగులు- ఈశ్వరేచ్ఛచేతనె కర్మమును చేసెడివారు ప్రియవ్రతాదులు- నీవు జనకాదులవలె కర్మములనాచరించుచునె జ్ఞానమున కుతగినవాఁడవు- అని మధ్వభాష్యము.

న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
నచ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥౪॥

కర్మణామ్ అనారమ్భాత్ = కర్మములను ఆచరింపకపోవుటవలన, పురుషః నైష్కర్మ్యమ్ నాశ్నుతే = మనుష్యుఁడు జ్ఞాననిష్ఠను పొందఁడు- సంన్యసనాదేవచ సిద్ధిం న సమధిగచ్ఛతి = కర్మములనువిడుచుటమా

క్రమముననే జ్ఞానసిద్ధిని పొందఁడు.

ఈజన్మమునఁగాని జన్మాంతరమునఁగాని అనుష్ఠింపఁబడిన కర్మములు పాపక్షయకారణములగుటను అంతఃకరణశుద్ధిని కలుగఁజేసి జ్ఞానోత్పత్తిద్వారమున జ్ఞాననిష్ఠకు కారణములగును- అంతఃకరణశుద్ధి లేకపట్టి కర్మపరిత్యాగమాత్రముచేత జ్ఞానసిద్ధి కలుగదు- అని శంకరభాష్యము

అనారంభమనఁగా కర్మములను ఆరంభింపకయే పోవుట. సంన్యసనమనఁగా ఆరంభించినవానిని విడుచుట- ఫలాభిసంధిలేక కర్మములచే భగవంతుని నారాధించినఁగాని అనాదికాలమునుండియున్న పాపములు పోయి అవ్యాకులేంద్రియత్వపూర్వకముగు ఆత్మనిష్ఠ కలుగదు- అని రామానుజభాష్యము.

కర్మములను అనఁగా యుద్ధము మొదలగు వానిని చేయకపోవుటవలన నైష్కర్మ్యమనఁగా కామ్యకర్మములను విడుచుటచేఁ బొందఁబడెడి మోక్షము కలుగదు- జ్ఞానము మోక్షసాధనముగాని కర్మములం జేయకపోవుట గాదు- ఇందుకు హేతువు పురుషుఁడగుట- ఎల్లప్పుడును స్థూలమైనను సూక్ష్మమైననగు పురము (శరీరము)తోఁగూడియే యుండువాఁడు- కర్మములను చేయకపోవుటవలననే ముక్తి కలుగునేడను స్థావరములకు ముక్తి కలుగవలయును- సంన్యసనమనఁగా కామ్యకర్మములను విడుచుట- కామములేని కర్మములనాచరించుటచే నంతఃకరణశుద్ధి కలిగి జ్ఞానముచే మోక్షము కలుగును- యత్యాశ్రమము ప్రయతత్వము (మనస్సమాధానము) కొఱకును భగవంతునికి సంతోషము కలుగుటకునైయున్నది- గృహస్థులు ఇతరకర్మములలో ప్రవర్తించుటవలన అప్రయతులై యుందురు- అధికారికులు గృహస్థులైయు ప్రయతులగుటను సమర్థులగుదురు- అని మధ్వభాష్యము.

నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ ౫ ॥

కశ్చిదపి జాతు క్షణమపి = ఒకానొకఁడును ఒకప్పుడు క్షణకాలమును, అకర్మకృత్ నతిష్ఠతిహి = కర్మములను చేయనివాఁడు (అగుచు ...గదా- సర్వః అవశః = సమస్తమైనవాఁడును అస్వాధీనుఁడై

ప్రకృతిజైః గుణైః కర్మ కార్యతేహి=ప్రకృతివలనఁగలిగిన సత్త్వర జస్తమోగుణములచేత కర్మమును చేయింపఁబడుచున్నాఁడుగదా.

జ్ఞానులకు సత్త్వాదిగుణములచే కదల్పఁబడుట లేదుగాన ఈశ్లోకము అజ్ఞవిషయము. అజ్ఞః=అజ్ఞుఁడు, అను పదమును తెచ్చికొని యన్వయించునది. అనిశంకరభాష్యము.

కర్మయోగముచేత ప్రాచీనపాపములను నశింపఁజేసికొని, సత్త్వాది గుణములను స్వాధీనముచేసికొని, నిర్మలమైనయంతఃకరణముకలవానిచే సంపాదింపవలసినది జ్ఞానయోగము. అనిరామానుజభాష్యము.

కర్మములను సర్వవిధములను వీడుచుట శక్యముకాదు. అని మధ్వ భాష్యము.

కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥౬

యః కర్మేన్ద్రియాణి సంయమ్య=ఎవ్వఁడు కర్మేంద్రియములను* నియమించికొని, ఇన్ద్రియార్థాన్ మనసా స్మరన్ ఆస్తే=ఇంద్రియవిషయములను మనస్సుచేత తలంచుచును ఉన్నాఁడో, సః విమూఢాత్మా మిథ్యాచారః (ఇతి) ఉచ్యతే=వాఁడు మోహమునుజెందినమనస్సుకల మిథ్యాచారుఁడు (అని) చెప్పఁబడుచున్నాఁడు.

ఆత్మజ్ఞానములేనివాఁడు కర్మములంజేయకుండుట యయుక్తము. మిథ్యాచారుఁడనఁగా పాపాచారుఁడు. అనిశంకరభాష్యము.

పాపము నశింపకపోవుటవలన అంతఃకరణజయము లేనివాఁడైయును ఆత్మజ్ఞానమున ప్రవర్తించి విషయాసక్తమైన మనస్సుకలవాఁడు, ఒకరీవిధముగా నుద్దేశించి మఱియొకరీవిధముగా నడచువాఁడుగాన మిథ్యాచారుఁడనఁబడుచున్నాఁడు. అనిరామానుజభాష్యము.

అయినను కర్మములను శక్తికొలది విడువవలయును. అనిమధ్వభాష్యము.

---

* వాక్కు, హస్తము, పాదము, గుదము, ఉపస్థము, అనునయిదును కర్మేంద్రియములు. వీని వివరణము సృష్టిసంగ్రహవిస్తరమున సుస్పష్టము గను-

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున|
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే|| ౭||

(హే)అర్జున!=(ఓ)యర్జునుఁడా!, యస్తు ఇంద్రియాణి మనసా నియమ్య=ఎవ్వఁడైతే ఇంద్రియములను మనస్సుచేత నియమించి, అసక్త(స్సన్)కర్మేంద్రియైః కర్మయోగమ్ ఆరభతే=ఫలసంగము లేనివాఁడై కర్మేంద్రియములచేత కర్మయోగమును ఆరంభించుచున్నాఁడో, సః విశిష్యతే=వాఁడు విశేషించుచున్నాఁడు.

ఇట్లు కర్మముల నాచరించెడి యజ్ఞుఁడు, వెనుకటి మిథ్యాచారునికంటె శ్రేష్ఠుఁడు- అని శంకరభాష్యము.

ఆత్మావలోకనమందు మనస్సుకలవాఁడై, తనకు అలవాటుపడిన విషయములవంటివైన శాస్త్రీయకర్మములయందు ఇంద్రియములను నియమించి, సంగములేక కర్మములం జేయువాఁడు ప్రమాదము నూహించుటకైన నవకాశము లేకపోవుటచే, జ్ఞాననిష్ఠుఁడైనపురుషునికంటెను విశేషించుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

వెనుకటి శ్లోకములో మనస్సుచేత తలంచుచును అనియు, ఈశ్లోకమున మనస్సుచేత నియమించి అనియు చెప్పుటచే మనస్సు ప్రయోజకము అని తెలియఁజేయఁబడినది- కర్మయోగమనఁగా సంన్యాసము మొదలయిన వర్ణాశ్రమధర్మములన్నియుంగాని ఒక్క గృహస్థకర్మము మాత్రమె కాదు- కాఁబట్టి తప్పక స్వవర్ణాశ్రమోదితమైన కర్మమును చేయవలెను- అని మధ్వభాష్యము.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః|
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః||

త్వం నియతం కర్మ కురు=నీవు నియతమైన కర్మమును చేయుము, అకర్మణః కర్మ జ్యాయః హి=అకర్మముకంటెను కర్మము శ్రేష్ఠము గదా- అకర్మణః తే శరీరయాత్రాపి చ నప్రసిద్ధ్యేత్=కర్మములు లేని నీకు శరీరము నిలుచుటకూడను సిద్ధింపదు.

నియతమనఁగా నిత్యము- ఫలములేక ఏయధికారికి ఏకర్మము విధింపఁబడుచున్నదో, వానికి అదినియతకర్మము- అకర్మమనఁగా కర్మమును జేయకపోవుట- అని శంకరభాష్యము.

నియతమ్=వ్యాపింపఁబడినది- ప్రకృతిసంబంధము కలవానిచేత కర్మము వ్యాపింపఁబడినదిగదా- ప్రకృతిసంపర్కము అనాదివాసనచే కలిగినది- అకర్మమనఁగా జ్ఞానము- సాధనముపూర్తియగువఱకు శరీరమును నిలబెట్టికొనుట ఆవశ్యకము- న్యాయముగా సంపాదింపఁబడిన ధనముచేత పంచమహాయజ్ఞాదులంజేసి మిగిలిన యన్నముచే శరీరమును నిలబెట్టికొనవలయును- కాఁబట్టి జ్ఞాననిష్ఠునికిఁగూడ శరీరమునిలిచియుండువఱకు, సాధనము పూర్తియగునందాక, మహాయజ్ఞములు మొదలైన నిత్యనైమిత్తిక కర్మములు ముఖ్యముగాఁ జేయవలసిన- కర్మయోగమునందుఁగూడ ఆత్మ కర్త కాఁడను తలంపు ఉండవలసినది గాన ఆత్మయాథాత్మ్యజ్ఞానము అంతర్భవించియే యున్నది- ప్రకృతిసంసర్గము కలవానికి కర్మయోగము సుకరంబును ప్రమాదములేనిదియు- కాఁబట్టి జ్ఞాననిష్ఠకు యోగ్యుఁడైనవానికిఁగూడ జ్ఞానయోగముకన్న కర్మయోగమె శ్రేష్ఠము- కావున నీవు కర్మమును చేయుము- అని రామానుజభాష్యము.

నియతమనఁగా తనవర్ణమునకును ఆశ్రమమునకును తగినది- అని మధ్వభాష్యము.

> యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః।
> తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గః సమాచర ॥౯॥

యజ్ఞార్థాత్ కర్మణః అన్యత్ర=యజ్ఞార్థమైన కర్మముకన్న మిగిలినవిషయమునందు. అయం లోకః కర్మబన్ధనః (భవతి)=ఈలోకము కర్మముబంధనముగాఁగలది (అగుచున్నది)=(హే కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, ముక్తసంగః (సన్) తదర్థం కర్మ సమాచర=ఫలసంగములేనివాఁడ(వగుచు) యజ్ఞార్థమైన కర్మమును ఆచరింపుము.

యజ్ఞశబ్దమునకు ఈశ్వరుఁడర్థము- ఈశ్వరునికొఱకు చేయఁబడెడి కర్మము యజ్ఞార్థము- అని శంకరభాష్యము.

యజ్ఞార్థమనఁగా యజ్ఞము మొదలగు శాస్త్రీయకర్మములకొఱకైన ద్రవ్యార్జనము మొదలయినది- ఆత్మార్థప్రయోజనములగు కర్మములచేత ఈలోకము బంధముకలదియగును- తనప్రయోజనముకొఱకైన దనుతలంపు చేఁగలిగెడి సంగము లేనివాఁడవై ధనసంపాదనము మొదలగు

దానిం జేసి యజ్ఞాదులం జేసినచో, దానిచే నారాధింపఁబడి భగవంతుఁడు అనాదికాలప్రవృత్తంబగు కర్మవాసనను తెగఁగొట్టి కలఁత లేని ఆత్మావలోకనమును కలుగఁజేయును- అని రామానుజభాష్యము.

యజ్ఞశబ్దమునకు విష్ణువు అర్థము- యజ్ఞార్థమై సంగము లేని కర్మము బంధకము కాదు- అని మధ్వభాష్యము.

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వ మేష వోస్త్విష్టకామధుక్॥

ప్రజాపతిః సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా=ప్రజాపతి కర్మములతోఁ గూడిన ప్రజలను సృజించి, పురా ఉవాచ=తొల్లి (ఇట్లు) అనెను- అనేన ప్రసవిష్యధ్వమ్=దీనిచేత వృద్ధి పొందుఁడు, ఏషః వః ఇష్టకామధుక్ అస్తు=ఇది మీకు కోరినకోరికలను ఇచ్చునది అగును.

ప్రజాపతి అనఁగా ప్రజలను సృజించువాఁడు- కామములు అనఁగా ఫలములు- అని శంకరభాష్యము.

ప్రజాపతి అనఁగా సర్వేశ్వరుఁడు ఇష్టకామధుక్=ఇష్టములైన, మోక్షమునను దానికి అనుగుణములైన కామములనును, ఇచ్చునది- అని రామానుజభాష్యము.

ఈ శ్లోకము వెనుక చెప్పఁబడినదానికి అర్థవాదము- అని మధ్వభాష్యము.

దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ॥౧౧॥

అనేన దేవాన్ భావయత=దీనిచేత దేవతలను కలుగఁజేయుఁడు- తే దేవాః వః భావయన్తు=ఆ దేవతలు మిమ్మును కలుగఁజేయుదురు- పరస్పరం భావయన్తః=అన్యోన్యము పోషించుచున్నవారై, పరమ్ శ్రేయః అవాప్స్యథ=గొప్ప మేలును పొందఁగలరు.

భావయత=వృద్ధిపొందింపుఁడు- భావయన్తు=వర్షము మొదలగువానిచే వృద్ధిపొందింతురు- జ్ఞానము కలిగి తద్ద్వారమున మోక్షమును పొందుదురు అని శంకరభాష్యము.

భావయత=ఆరాధింపుఁడు- భావయన్తు=పోషింతురు- పరం శ్రేయః=మోక్షమును- అని రామానుజభాష్యము.

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥౧౨

యజ్ఞభావితాః దేవాఃహి=యజ్ఞములచేత భావింపఁబడిన దేవతలుగదా, వః ఇష్టాన్ భోగాన్ దాస్యన్తే=మీకు ఇష్టములైన భోగములను ఈఁగలరు- తైః దత్తాన్=వారిచేత ఈబడినవానిని, ఏభ్యః అప్రదాయ యః భుఙ్క్తే=వీరికి ఈయక ఎవ్వఁడు అనుభవింపుచున్నాఁడో, సః స్తేనఏవ= వాఁడు దొంగయె.

భావితులనఁగా వృద్ధిపొందింపఁబడినవారు- అనఁగా సంతోషపెట్టఁబడినవారనుట- భోగములనఁగా స్త్రీపుత్రపశ్వాదులు- దేవతల స్వమ్మును అపహరించుటచే దొంగయగును- అని శంకరభాష్యము.

భావితులనఁగా ఆరాధింపఁబడినవారు- దేవతలు పైపైని వెండియు తనునారాధించుటకు తగిన భోగములను భగవంతుఁడు ఆజ్ఞాపింపఁగా వారై ఇత్తురు- చౌర్యమ (దొంగతనము) అనఁగా ఇతరులచేత తన కార్యమునకై సంపాదింపఁబడి వారిదైయున్న వస్తువును తనదని తలంచుచు దానిచే తనను పోషించుకొనుట- అని రామానుజభాష్యము.

యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః।
భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్॥౧౩॥

యజ్ఞశిష్టాశినః సన్తః=యజ్ఞములు చేయఁగా మిగిలినదానిని తినెడి సత్పురుషులు, సర్వకిల్బిషైః ముచ్యన్తే=అన్నిపాపములచే విడువఁబడుదురు- యే ఆత్మకారణాత్ పచన్తి=ఎవ్వరు తననిమిత్తము వండుకొనుచున్నారో, తే పాపాః అఘం భుఞ్జతే=ఆ పాపులు పాపమునె తినుచున్నారు.

దేవయజ్ఞాదులను చేసి అమృతమను పేరుగల తచ్ఛేషమును భుజించుటచే చుల్లి(పొయ్యి) మొదలగు పంచసూనల(అయిదుహింసాస్థానముల)చేఁ గలిగెడు పాపములచేతనను, ప్రమాదమువలనఁ గలిగెడు పాపములచేతనను, విడువఁబడుదురు- అని శంకరభాష్యము. (౧ దేవయజ్ఞము అనఁగా నిత్యము అగ్నిలో హోమములు చేయుట- ౨ బ్రహ్మయజ్ఞము అనఁగా నిత్యమును అధ్యయనము చేయుట- ౩ పితృయజ్ఞము- అనఁగా ప్రతిదినమును పితృదేవతలను తృప్తిని బొందించుట- ౪ మనుష్యయజ్ఞము

నంగా ప్రతిదినమువచ్చిన అతిథులకు భోజనము పెట్టుట, ౫ భూతయజ్ఞము. అనఁగా నిత్యమును జంతువులకు బలి వేయుచుండుట- ఇవి పంచమహా యజ్ఞములనియెదరు- పంచసూనలనునవి ౧ చుల్లి(పొయ్యి) ౨ కుట్టని(రోకలి) ౩ పేషణి(పొత్రము) ౪ ఉదకుంభి(నీళ్లకడవ) ౫ మార్జని(చీపురుకట్ట) వీనివలన చిన్నచిన్నపురుగులు మొదలగువానికి హింసకలుగును గావున ఇవి పంచసూనలని చెప్పఁబడును.

ఇంద్రాదిస్వరూపముగానున్న పరమపురుషుని ఆరాధించుటకై ద్రవ్యములను సంపాదించి వానిచే అట్టి భగవంతుని ఆరాధించి శేషముచే పొట్టపోసికొనెడివారు, అనాదికాలమునుండి సంపాదింపఁబడినవై ఆత్మయాథాత్మ్యజ్ఞానమునకు విరోధులైన సమస్తపాపములచే, విముచఁబడుదురు- ఇంద్రాదిస్వరూపుఁడగు పరమపురుషునిచే తననారాధించుటకై ఈబడిన ద్రవ్యములను తమకొఱకై వండుకొని తినెడి పాపాత్ములు పాపమునే తినుచున్నారు- పాపముగాఁబరిణమించునదిగాన పాపమని చెప్పఁబడుచున్నది- ఆత్మావలోకనమున వైముఖ్యముకలవారై నరకమును పొందుదురు అని రామానుజభాష్యము.

అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసంభవః।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥ ౧౪॥
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ ౧౫॥
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।
అఘాయురిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి॥ ౧౬॥

అన్నాత్ భూతాని భవన్తి=అన్నమువలన భూతములు కలుగుచున్నవి- పర్జన్యాత్ అన్నసంభవః (భవతి)=మేఘమువలన అన్నము కలుగుట (అగుచున్నది)- యజ్ఞాత్ పర్జన్యః భవతి=యజ్ఞమువలన మేఘము కలుగుచున్నది- యజ్ఞః కర్మసముద్భవః=యజ్ఞము పనివలనఁగలుగునది- కర్మ బ్రహ్మోద్భవం విద్ధి=కర్మమును బ్రహ్మమువలనఁబుట్టుకకలదానిగాను ఎఱుంగుము- బ్రహ్మ అక్షరసముద్భవమ్=బ్రహ్మము అక్షరునివలనపుట్టుకగలది- తస్మాత్=ఆ హేతువువలన, సర్వగతం బ్రహ్మ=సర్వమును చేరియున్న బ్రహ్మము, నిత్యం యు

జ్ఞే ప్రతిష్ఠితమ్=నిత్యముగా యజ్ఞమున నిలిచియున్నది- ఏవమ్ ప్రవర్తితమ్ చక్రమ్=ఇట్లు ప్రవర్తింపఁజేయఁబడిన చక్రమును, ఇహ యః నానువర్తయతి=ఇచ్చటను ఎవ్వఁడు అనువర్తింపఁడో, (హే) పార్థ! =(ఓ) యర్జునుఁడా!, సః అఘాయుః ఇన్ద్రియారామః(శ్చ సన్)=వాఁడు పాపజీవనముకలవాఁడును ఇంద్రియములచేత నాక్రీడించుచున్నవాఁడు( నగుచు ), మోఘమ్ జీవతి=వ్యర్థముగా బ్రదుకుచున్నాఁడు.

యజ్ఞమనఁగా యజ్ఞముచేయుటవలనఁగలిగెడి అపూర్వము-(అదృష్టము- అనఁగా నిచ్చటపుణ్యము)- కర్మ మనఁగా ఋత్విక్కులతోఁగూడి యజమానుఁడుచేసెడివ్యాపారము- బ్రహ్మోద్భవమనఁగా వేదముచేఁబ్రకాశింపఁచేయఁబడినదియనుట- అక్షరము అక్షరునివలన అనఁగా పరమాత్మవలనఁగలిగినది- పరమాత్మవలనపుట్టుటనె అన్నివిషయములందెలియఁజేయుటను సర్వగతంబయ్యెను యజ్ఞవిధియె ప్రధానముగాఁ గలది- కర్మాధికారియైన యెవ్వఁడు ఈజగచ్చక్రమును అనువర్తింపఁడో, వాఁడునిరర్థకజీవనముకలవాఁడు- కాఁబట్టి జ్ఞానికానివాఁడు కర్మమునుచేయవలసినదియె- అనిశంకరభాష్యము.

యజ్ఞమనఁగా కర్మమె- అది ధనముసంపాదించుటమొదలగు యజమానవ్యాపారముచేఁగలుగునదిగాన కర్మోద్భవము- బ్రహ్మోద్భవమనునప్పుడు బ్రహ్మశబ్దముప్రకృతిపరిణామరూపమైన శరీరమును చెప్పును- ఆవ్యాపారము శరీరమువలనఁగలుగునదియనియర్థము. అక్షరశబ్దమునకు జీవాత్మయర్థము- అన్నపానాదులచే తృప్తిబొందినజీవునిచేనధిష్ఠింపఁబడినదై శరీరమువ్యాపారములంజేయుంగాన బ్రహ్మము అక్షరసముద్భవము అని చెప్పఁబడినది- సర్వగతమనఁగా సర్వాధికారులను పొందియున్నది యనుట- యజ్ఞేప్రతిష్ఠితమ్ అనువాక్యమునకు శరీరము యజ్ఞమునకు మూలమైనది అనియర్థము- అన్నమువలన భూతములు అనఁగా జీవులతోఁగూడిన శరీరములును, మేఘమువలన అన్నంబును, యజ్ఞమువలన మేఘంబును, యజ్ఞము యజమానుని వ్యాపారమువలనను, ఆవ్యాపారము జీవునితోఁగూడిన శరీరమువలననును, అట్టిశరీరములు తిరిగియును అన్నమువలననుఅనియిట్లు ఒకదానికొకటికారణములై చక్ర

ము వలె తిరుగుచున్నవానిని, కర్మయోగాధికారి గాని జ్ఞానయోగాధికారి గాని ప్రవర్తింపఁజేయఁడేని, యజ్ఞశేషముచేత పొట్టపోసికొనుటలేదు గాన వాఁడు అఘాయువు- అనఁగా పాపములను చేయుటకైయైన ఆయుస్సుకలవాఁడుగానీ పాపరూపముగాఁబరిణమించిన ఆయుస్సుకలవాఁడుగానీ రెండువిధములనుండెడి యాయుస్సుకలవాఁడుగానీ అగును- వాఁడు ఆత్మారాముఁడు కాఁడుగాన ఇంద్రియారాముఁడు. అనఁగా ఇంద్రియములె తోట అనఁగా విహారప్రదేశముగాఁగలవాఁడు అగును- యజ్ఞశేషముచే దేహపోషణము లేకపోవుటచే అతిశయించిన రజస్తమోగుణములుగలవాఁడై ఆత్మావలోకనమున విముఖుఁడగును- [illegible]న తాను చేయుచుండెడి జ్ఞానయోగాది ప్రవృత్తియు నిష్ఫలంబగును- అని రామానుజభాష్యము.

కర్మములను చేయవలయుననుటకు మఱియొక్క హేతువు చెప్పఁబడుచున్నది- పర్జన్యుఁడనఁగా ఆదిత్యుఁడును మేఘచక్రాభిమానియగు దేవతయు- యజ్ఞమువలన ఆదిత్యుఁడు బలవృద్ధిని పొందును- మేఘచక్రము యజ్ఞమువలన కలుగుంగాన యజ్ఞాద్భవతి పర్జన్యః అని చెప్పఁబడినది- యజ్ఞమనఁగా దేవతలకు హోమాదులం జేయుట- కర్మ మనఁగా క్రియ(పని)- జీవుల వ్యాపారములన్నియు పరమాత్మవలననె కలుగుచున్నవి ఏష హ్యేవ సాధుకర్మ కారయతి( ఇతఁడేగదా మంచి పనిని చేయించుచున్నాఁడు)అని శ్రుతి- ప్రతిబింబమైన జీవునికి బింబమైన పరమాత్మను పట్టియె కదా వ్యాపారము- పరబ్రహ్మము అక్షరములచే స్ఫుటపఱుపఁబడును- ఆ యక్షరములు(వేదము) నిత్యములైనవి- ఇట్లు పరంపరచే యజ్ఞమునకు బ్రహ్మము అభివ్యంగ్యము(స్ఫుటపఱుపఁబడునది)గాన యజ్ఞమున ప్రతిష్ఠితము అని చెప్పఁబడినది- ఆ అక్షరములు భూతములచే స్ఫుటపఱుపఁబడునవి గాన ఇది చక్రము- ఈ జగచ్చక్రమును ఎవ్వఁడు అనుసరింపఁడో వాఁడు దానిని చెడఁగొట్టువాఁడుగాన అఘాయువనఁబడును- పాపముకొఱకైయైన ఆయుస్సుకలవాఁడు అని యర్థము- అని మధ్వభాష్యము.

యస్త్వాత్మరతి రేవస్యా దాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే॥ ౧౭॥

యః మానవస్తు=ఏ మనుష్యుఁడైతే, ఆత్మరతిరేవ=ఆత్మయ-దెల

క్తికలవాఁడును, ఆత్మతృప్తశ్చ=తనయందెతృప్తినిపొందినవాఁడును, ఆత్మన్యేవ సంతుష్టశ్చ స్యాత్=ఆత్మయందె సంతోషించినవాఁడును అగునో, తస్య కార్యమ్ నవిద్యతే=వానికి చేయవలసినది లేదు.

ఆత్మను తెలిసికొని అజ్ఞానములేనివారై పుత్త్రైషణాదులును లేనివారై శరీరమునిలుచుటకు మాత్రము భిక్షాచరణము చేయుచున్నవారికి ఆత్మజ్ఞానముతప్ప రెండవది చేయవలసినదిలేదు- ఆత్మయందె సంతోషించినవాఁడనుటచే అంతటను ఆశలేనివాఁడనుట- అని శంకరభాష్యము.

సాధనముల యొక్క అపేక్షలేకయె యాత్మదర్శనము కలవాఁడగు ముక్తునికి మహాయజ్ఞములు మొదలగు వర్ణాశ్రమకర్మముల యొక్క అపేక్షలేకపోవుటయని ఇఁక మూఁడుశ్లోకములచే చెప్పఁబడుచున్నది- ధారకపోషకభోగ్యములు§ మూఁడును ఆత్మయె ఎవనికగునో, వానికి, స్వయముగనే యాత్మస్వరూపము ఎల్లప్పుడును చూడఁబడుటచే, ఆత్మదర్శనముకొఱకు చేయవలసినది ఏమియు లేదు- అని రామానుజభాష్యము.

ఆత్మయనఁగా పరమాత్మ- ఆపరమాత్మయొక్క దర్శనము మొదలగుదానిచేఁగలిగిన సుఖమునందు- ఇతరములు వలదు, అనెడి జ్ఞానము తృప్తి- ఆతృప్తిని కలుగఁజేసెడి సుఖమె సంతోషము- పరమాత్మదర్శనాది సుఖమును పొంది మిగిలినవానియందెల్లను తృప్తికలవాఁడగుటనె పరమాత్మయందె యుండి సంతోషించినవాఁడై, మఱియేదియు సంతోషకారణము లేనివాఁడైన అసంప్రజ్ఞాతసమాధిలోనున్నవానికి కర్మము లేదు- మిగిలినజ్ఞానికి కర్మము కలదు- మానవశబ్దమునకు జ్ఞానిఅనిఅర్థము- దీనిచె అపరోక్షజ్ఞానము కలవానికె అసంప్రజ్ఞాతసమాధికలుగునని తెలుపఁబడినది- అని మధ్వభాష్యము.

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥ ౧౮॥

---

§ ధారకమనఁగా శరీరమును నిలువఁబెట్టెడి పానము (నీరు)- పోషకమనఁగా శరీరమునకు పుష్టినికలుగఁజేసెడియన్నము- భోగ్యముఅనఁగా సుఖానుభవమునకు కారణమైన తోటలు, పూవుఁదండలు, చందనము, సంగీతము, వాద్యము- నాట్యము మొదలైనవి.

తస్య కృతేన అర్థః నైవ=వానికి చేయఁబడినదానిచే ప్రయోజనము లేనే లేదు- ఇహ అకృతేన కశ్చన న=ఇచ్చట చేయఁబడనిదానిచే ఒక్కటియు లేదు- అస్య సర్వభూతేషు అర్థవ్యపాశ్రయః కశ్చిచ్చ న=వీనికి సమస్తభూతములయందును ప్రయోజనసాధనమైనది ఒకటియును లేదు.

ఆత్మజ్ఞానికి కర్మమును చేయుటచేత ప్రయోజనములేదు- కర్మమును చేయకపోవుటచేత ప్రత్యవాయము(తప్పు) లేదు- ఈతనికి బ్రహ్మమొదలుకొని స్థావరములవఱకును ఉండెడి భూతములలో నొక్కదానివలనను కార్యములేదు- కార్యమున్నయెడలఁగదా దానికొఱకు కర్మమునాచరింపవలయును- అని శంకరభాష్యము.

ముక్తునికి ఎల్లప్పుడును ఆత్మదర్శనము సిద్ధమగుటను ఆత్మదర్శనముకొఱకైన సాధనములను చేసినను చేయకున్నను ఏమియును ప్రయోజనములేదు- ఆత్మకంటె నితరములగు నచేతనములయందు స్వయముగానె వైముఖ్యముగలవానికి ఆకాశాదిభూతములయందు ఒక్కటియును ప్రయోజనముగా నాశ్రయింపఁదగినది లేదు- అట్లున్నంగదా దానియందు వైముఖ్యముకలుగుటకు సాధనమును ఆచరింపవలసినది- అని రామానుజభాష్యము.

అసంప్రజ్ఞాతసమాధిలోనున్నవాఁడు దానిని విడిచి కర్మములు చేసినచో ప్రయోజనములేదు- సంధ్యావందనాదులను చేయకపోయినను ప్రత్యవాయములేదు- సమస్తభూతములయందును వీనికి ప్రయోజనమునకు ఆశ్రయము(నిమిత్తము) అయినది లేదు- అని మధ్వభాష్యము.

తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥ ౧౯

తస్మాత్ అసక్తః(సన్) కార్యం కర్మ సతతం సమాచర=అందువలన సంగములేనివాఁడవు(అగుచు) చేయవలసిన కర్మమును ఎల్లప్పుడును ఆచరించుచుండుము- పూరుషః అసక్తః(సన్) కర్మ ఆచరన్=మనుష్యుఁడు సంగములేనివాఁడు(అగుచు) కర్మమును ఆచరించుచున్నవాఁడై, పరమ్ ఆప్నోతి=పరమును పొందుచున్నాఁడు.

నీవు అట్టి జ్ఞానములో లేవు గాన, చేయవలసిన నిత్యకర్మమును

ఆచరింపుము- ఈశ్వరార్థమైన కర్మమును చేయుచు పురుషుఁడు మోక్షమును పొందుచున్నాఁడు- అని శంకరభాష్యము.

సాధనములు లేకయె ఆత్మదర్శనము ఎవ్వనికి కలుగునో వానికే ఆత్మదర్శనసాధనములయక్కఱ లేదు- సాధనములం జేయఁదలంచినవానికిఁ గూడ, ఆత్మజ్ఞానగర్భమగుటనును, జ్ఞానయోగికింగూడ తనుమాత్రము ఆచరింపవలసియుండుటనును, కర్మయోగమె ఆత్మదర్శనము కలుగుటకు శ్రేష్ఠమైనది- కాఁబట్టి సంగములేనివాఁడవై ఆత్మప్రాప్తి కలుగునట్టును కర్మమును, చేయవలసినదియె యని, జేయుచుండుము- చెప్పఁబోయెడి అకర్తృత్వజ్ఞానముతోఁ గర్మముం జేయువాఁడు పరుని అనఁగా ఆత్మను పొందుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

అసంప్రజ్ఞాతసమాధిలో నున్నవానికే కార్యము లేదు గాన నీవు కర్మమును ఆచరింపుము- అని మధ్వభాష్యము.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః॥౧౯౪॥

జనకాదయః కర్మణైవ సంసిద్ధిమ్ ఆస్థితాః హి = జనకుఁడు మొదలగువారు కర్మముచేతనె సిద్ధిని పొందినవారు గదా.

జనకుఁడు అశ్వపతి మొదలగువారు జ్ఞానులైనయెడను లోకసంగ్రహముకొఱకు కర్మమును విడువకుండిరని యర్థము- జ్ఞానములేనివారైనయెడను, సత్త్వశుద్ధికొఱకు కర్మములను ఆచరించి క్రమముగా సిద్ధిని పొందిరని యర్థము- అని శంకరభాష్యము.

జ్ఞానయోగమున కధికారియైనను కర్మయోగమును ఆచరించుటయె ఆత్మదర్శనమువిషయమై శ్రేష్ఠము గాన, జ్ఞానులలో నగ్రేసరులగు జనకాదులుగూడ కర్మయోగముననె సిద్ధిని పొందిరి- అనఁగా ఆత్మను పొందిరనుట- అని రామానుజభాష్యము.

కర్మములనాచరించెడి యాచారము కలదు- కర్మణా సహ = కర్మముతోఁగూడనె అనఁగా కర్మమును చేయుచునె అనుట- కర్మమును చేయుచునె జ్ఞానమును పొంది సిద్ధిని పొందిరి- జనకాదులు జ్ఞానులగుట భారతాదులలో ప్రసిద్ధము- ప్రయాగాదితీర్థములు ముక్తిసాధనములనుట పాపవిముక్తికి సాధనములనుట- లేక ఆ తీర్థములస్తోత్రమైననగును· కాఁబట్టి అపరోక్షజ్ఞానమువలననె మోక్షము కలుగును- కర్మము దానికి సా

ధనము- అని మధ్వభాష్యము.

లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి॥౨౦॥

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః।

స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే॥౨౧॥

లోకసంగ్రహం సంపశ్యన్నపి=లోకసంగ్రహమును చూచుచున్నను కర్తుమేవ అర్హసి=కర్మములం జేయుటకె తగుచున్నావు- శ్రేష్ఠ యద్యత్ ఆచరతి=శ్రేష్ఠుఁడు దేనినిదేనిని ఆచరించునో, ఇతర జనః తత్తదేవ ఆచరతి=మిగిలిన జనుఁడును దానినిదానినె ఆచరింపుచున్నాఁడు- సః యత్ ప్రమాణం కురుతే=అతఁడు దేనిని ప్రమాణమునుగాఁ జేయుచున్నాఁడో, లోకః తత్ అనువర్తతే=(మిగిలిన జనుఁడు దానినె అనుసరింపుచున్నాఁడు.

లోకసంగ్రహమనఁగా లోకమును అపమార్గమున ప్రవర్తింపకుండునట్లు నివారించుట- ప్రమాణముఅనునది లౌకికంబును వైదికంబును అని శంకరభాష్యము.

యత్ప్రమాణమ్=ఏపాటిదానినిగా అనఁగా ఏఅంగములతోఁగూడినదానిగాఁ జేయునో, తత్=అట్టిదానినిగానె అనఁగా ఆయంగములతోఁగూడినవానినిగానె, సంపూర్ణజ్ఞానము లేనిజనుఁడును ఆచరింపుచున్నాఁడు కాఁబట్టి లోకమును కాపాడుటకై శిష్టుఁడుగా ప్రసిద్ధుఁడయినవాఁడు వర్ణాశ్రమధర్మములనాచరించునది- లేనిచో లోకమును చెడఁగొట్టుటచేఁగలిగిన పాపము వీనిని జ్ఞానయోగమునుండిగూడ తప్పించును. అని రామానుజభాష్యము.

సః యత్ ప్రమాణం కురుతే=అతఁడు ఏ వాక్యము మొదలగుదానిని ప్రమాణమునుగాఁ జేయునో, అని మధ్వభాష్యము.

నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన।

నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి॥౨౨॥

(హే)పార్థ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, మే త్రిషు లోకేషు కర్తవ్యం కించన నాస్తి=నాకు మూఁడు లోకములయందును చేయవలసినది ఒక్కటియు లేదు- అనవాప్తమ్ అవాప్తవ్యం న=పొందఁబడనిదై పొందవలసినది లేదు- (అహం) కర్మణి వర్తేఏవ=(నేను)సు

కర్మమును నుంచు సేయున్నాను- నేనుఁగూడ లోకసంగ్రహముకొఱకై కర్మమునాచరించుచున్నాను- అని తాత్పర్యము.

యది హ్యహం నవర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥౨౩॥

అహం జాతు కర్మణి అతన్ద్రిత(స్సన్) నవర్తేయంయది = నేను ఒకప్పుడు కర్మమున పొలుమాలికలేనివాఁడ(నై) ప్రవర్తింపకుండు నేని, (హే) పార్థ! = (ఓ) అర్జునుఁడా!, మనుష్యాః సర్వశః మమ వర్త్మ అనువర్తన్తే = మనుష్యులు అన్నిప్రకారముల నా మార్గము ను అనువర్తింతురు.

ఉత్సీదేయు రిమే లోకా నకుర్యాం కర్మచే దహమ్।
సంకరస్యచ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః॥౨౪॥

అహం కర్మ నకుర్యాంచేత్ = నేను కర్మమును చేయకుండునేని, ఇమే లోకాః ఉత్సీదేయుః = ఈ జనులు చెడుదురు- సంకరస్య కర్తా చ స్యామ్ = సంకరమును చేయువాఁడనును అగుదును- ఇమాః ప్రజాః ఉపహన్యామ్ = ఈ ప్రజలను చెఱచఁగొట్టుదును.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।
కుర్యాద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్॥

(హే) భారత! = (ఓ) భరతవంశమువాఁడా, కర్మణి సక్తాః అవిద్వాంసః యథా కుర్వన్తి = కర్మములయందు ఫలసంగముకల అజ్ఞానులు ఎట్లు కర్మములం జేయుదురో, విద్వాన్ అసక్తః లోకసంగ్రహం చికీర్షుః = జ్ఞాని ఫలసంగములేనివాఁడై లోకసంగ్రహమును చేయఁ గోరుచున్నవాఁడై, తథా కుర్యాత్ = అట్లు(అజ్ఞులయట్లు) కర్మము నాచరించునది.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినామ్।
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్॥౨౬॥

విద్వాన్ కర్మసఙ్గినామ్ అజ్ఞానాం బుద్ధిభేదం నజనయేత్ = జ్ఞాని కర్మములయందాసక్తిగల అజ్ఞులకు బుద్ధిభేదమును పుట్టింపఁగూడదు- యుక్తః సమాచరన్ = పూనికకలవాఁడై చేయుచును, సర్వకర్మాణి జోషయేత్ = అన్నికర్మములను ఆచరింపఁజేయవలయును.

బుద్ధిభేదమనఁగా ఈకర్మమునాచరించి దీనిఫలము ననుభవింపవలయునను నిశ్చయమును చలింపఁజేయుట- అనిశంకరభాష్యము.

అజ్ఞులనఁగా ఆత్మజ్ఞానము సంపూర్ణముగా లేనివారై జ్ఞానయోగమును అవలంబింపలేక మోక్షమునె కోరి కర్మములంజేయువారు-బుద్ధిభేదమనఁగా ఆత్మావలోకనమునకు కర్మయోగముకన్న వేఱుసాధనమున్నదను బుద్ధిని పుట్టించుట- ఆత్మజ్ఞానము సంపూర్ణముగాఁగలిగి తాను జ్ఞానయోగాధికారియైనను జ్ఞానయోగాపేక్షలేకయె కర్మయోగము ఆత్మావలోకనసాధన మగునను బుద్ధితో(యుక్తః)కూడుకొనినవాఁడై కర్మమునె ఆచరింపుచు,కర్మములంజేయువారికి అన్నికర్మములయందును (జోషయేత్)ప్రీతినిపుట్టింపవలయును- అని రామానుజభాష్యము.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే॥ ౨౭॥

సర్వశః ప్రకృతేః గుణైః క్రియమాణాని కర్మాణి(ప్రతి)=అన్నిప్రకారములను ప్రకృతియొక్క గుణములచేత చేయఁబడుచున్న కర్మములంగూర్చి, అహంకారవిమూఢాత్మా అహం కర్తా ఇతి మన్యతే=అహంకారముచే మోహమునుపొందిన యంతఃకరణముకలవాఁడు నేను కర్తను అని తలంచుచున్నాఁడు.

మధుసూదనటీకలో, కర్మాణి కర్తా అహమ్=కర్మములను చేయువాఁడను నేను- అనియన్వయము- కర్తృశబ్దము తృన్నంతము- అనివ్రాయఁబడినది.

ప్రకృతియనఁగా సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థారూపమైన ప్రధానతత్త్వము- దానిగుణములనఁగా కార్యకరణరూపములగు వికారములు. కర్మములనఁగా లౌకికములును శాస్త్రీయములును- అహంకారమనఁగా కార్యకారణ సముదాయమందు అహమ్(నేను)అనెడిజ్ఞానము- అదికలవాఁడు అజ్ఞానముచేత కర్మములు ఆత్మవని తలంపుచు ఆయాకర్మములకు నేను కర్తను అని తలంపుచున్నాఁడు. అని శంకరభాష్యము

ప్రకృతియొక్క గుణములనఁగా సత్త్వరజస్తమోగుణములు- అహం

కార మనఁగా అహమ్( నేను )శబ్దముచే చెప్పఁబడని ప్రకృతియందు అహమ్( నేను )అనెడి యభిమానము( దేహాత్మాభిమానము )- దానిచేత ఆత్మస్వరూపము నెఱుఁగనివాఁడై గుణకర్మములవిషయమున నేనె కర్తననుకొనుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

ప్రకృతినిపట్టి గుణభూతములు( అప్రధానములు )ను, ప్రకృతిసంబంధులనగు ఇంద్రియములు గుణములు- ప్రతిబింబమునకు కర్మము లేదుగదా- అనిమధ్వభాష్యము.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః।
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే॥౨౮॥

(హే)మహాబాహో!=(ఓ)గొప్పభుజములుకలవాఁడా!, గుణకర్మవిభాగయోః తత్త్వవిత్తు=గుణములనువిభజించుటయందునుకర్మములనువిభజించుటయందును తత్త్వము నెఱింగినవాఁడో, గుణాః గుణేషు వర్తన్తే=గుణములు గుణములయందు ప్రవర్తించుచున్నవి, ఇతి మత్వా న సజ్జతే=అని తలంచి సంగమునుపొందఁడు.

గుణములు గుణములయందు అనఁగా ఇంద్రియములు విషయములయందు అనుట- ఆత్మ, విషయములయందు ప్రవర్తింపదని తలంచి యనుట- అనిశంకరభాష్యము.

గుణములనఁగా సత్త్వాదులు- కర్మములనఁగా వానివానిపనులు- గుణములు గుణములయందు అనఁగా సత్త్వాదిగుణములు వానికార్యములయందు అనుట న సజ్జతే=గుణములకర్మములయందు నేనుకర్తను అని తలంపఁడు- అనిరామానుజభాష్యము.

కర్మభేదగుణభేదముల తత్త్వము నెఱింగినవాఁడు-గుణములుగుణములయందు అనఁగా ఇంద్రియాదులు విషయములయందు అనుట- అనిమధ్వభాష్యము.

ప్రకృతేర్గుణసంమూఢాః సజ్జన్తే గుణకర్మసు।
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్॥౨౯॥

ప్రకృతేః గుణసంమూఢాః=ప్రకృతియొక్క గుణములచేత మోహమును పొందినవారు, గుణకర్మసు సజ్జన్తే=గుణములకర్మములయందు తగులుకొనుచున్నారు- అకృత్స్నవిదః తాన్ మన్దాన్=సంపూర్ణముగా

నెఱుఁగని ఆ మూఢులను, కృత్స్నవిత్ నవిచాలయేత్ = సంపూర్ణముగా నెఱింగినవాఁడు కదల్పఁగూడదు.

కర్మములయందు తగులుకొనుటయనఁగా మేముఫలముకొఱకు కర్మములం జేయుచున్నామనుకొనుట- కృత్స్నవిత్తు అనఁగా ఆత్మజ్ఞానముకలవాఁడు- కదలించుటయనఁగా బుద్ధిభేదమును (౨౬॥ శ్లో॥) పుట్టించుట- అని శంకరభాష్యము.

సంపూర్ణజ్ఞానములేనివారు ఆత్మావలోకనమునకై ప్రవర్తించి ప్రకృతిసంసర్గముకలవారగుటచే ప్రకృతిగుణములచేత ఆత్మస్వరూపమున మోహమును పొందినవారై క్రియలయందె ఆసక్తులగుదురు- ప్రకృతికంటె విలక్షణముగానుండెడి యాత్మస్వరూపమున తగులకొనరు- ఇందువలన జ్ఞానయోగమునకు సమర్థులు కారుగాన వారికి కర్మయోగమునందె యధికారము- ఇట్టివారని సంపూర్ణజ్ఞానముకలవాడు, తాను జ్ఞానయోగమునె ఆచరించుటచేతఁ జెడఁగొట్టఁగూడదు- కర్మయోగమును విడిచిన యీతనింజూచి ఆ మందులుగూడ కర్మయోగమున నిలుకడలేని మనస్సుకలవారగుదురు. కాఁబట్టి శ్రేష్ఠుఁడైనవాఁడును స్వయముగా కర్మయోగమునె ఆచరింపుచు ఆత్మయాథాత్మ్యజ్ఞానముచే, ఆత్మకర్తకాఁడు, అనితలఁచుచున్నవాఁడై ఆత్మావలోకనమునకు కర్మయోగమె ఇతరాపేక్షలేని సాధనమనిచూపుచు అమందులకు కర్మయోగమున ప్రీతిని పుట్టింపవలయును- అనఁగా జ్ఞానియు లోకసంగ్రహమునకై కర్మయోగమునాచరింపవలయుననుట- గుణములయందు కర్తృత్వమును తలంచుటయనఁగా ఈకర్తృత్వము ఆత్మకు స్వరూపముంబట్టి వచ్చినది కాదు- మఱియేమన్నను గుణసంపర్కమువలన వచ్చినది అని తలఁచుట- అని రామానుజభాష్యము.

ప్రకృతియొక్క గుణములగు ఇంద్రియాదులయందు మూఢులై- ఇంద్రియాద్యభిమానమువలనఁగదా విషయాదిప్రసంగము కలుగుచున్నది- గుణకర్మసు = విషయములయందును కర్మములయందును - అని మధ్వభాష్యము.

మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వవిగతజ్వరః॥ ౩౦॥

మయి సర్వాణి కర్మాణి సంన్యస్య=నాయందు అన్నికర్మములను ఉనిచి, అధ్యాత్మచేతసా=ఆత్మయందలిమనస్సుతోఁ(గూడినవాఁడవై), నిరాశీః నిర్మమః భూత్వా=ఆశలేనివాఁడవును మమకారములేనివాఁడవును అయి, విగతజ్వరః (సన్) యుధ్యస్వ=పరితాపములేనివాఁడ(వగుచు) యుద్ధమును చేయుము.

జ్ఞానములేనివాఁడై మోక్షేచ్ఛకలవాఁడు కర్మముల నాచరింపవలసినప్రకారము చెప్పఁబడుచున్నది- అధ్యాత్మచేతస్సు అనఁగా కర్తనైన నేను ఈశ్వరునికై భృత్యునివలె కర్మములం జేయుచున్నాను అనెడి వివేకబుద్ధి- జ్వరమనఁగా దుఃఖము- అని శంకరభాష్యము.

అధ్యాత్మచేతస్సు అనఁగా శ్రుతులవలనఁగలిగిన ఆత్మస్వరూపవిషయమైన జ్ఞానము- అనఁగా తాను భగవంతునికి శరీరమనియు భగవంతునిచే ప్రవర్తింపఁబడువాఁడనియు తలంచుట- అందువలను ఈశ్వరుఁడు(నియమించువాఁడు)ను శేషియు(ఏలినవాఁడును)నగు పరమపురుషుఁడే తనవాఁడగు ఆత్మచేత తనఉపకరణముల(సాధనసామగ్రి)చేత తన యారాధనముకొఱకు స్వయముగానె తనకర్మములను చేయించికొనుచున్నాఁడు, అనితలంచి మమకారములులేనివాఁడవై, పూర్వము అనాదికాలమునుండి సంపాదింపఁబడినపాపసమూహముతో నేనెట్లు ఉండగలను అనెడి అంతర్జ్వరములేనివాఁడవై, పరమపురుషుఁడే కర్మములచే నారాధింపఁబడి సంసారబంధమునుండివిడిపించునని తలంచి సుఖముగా కర్మయోగమునె చేయుము- అని రామానుజభాష్యము.

భ్రాంతిచే జీవునియందారోపింపఁబడిన కర్మములను భగవంతునియందు విడిచి, అనఁగా భగవంతుఁడె అన్నికర్మములం జేయుచున్నాఁడనితలంచి- ఈకర్మములన్నియు భగవంతుని పూజయనియుతలంచి- అధ్యాత్మచేతస్సు అనఁగా పరమాత్మనుపట్టిన మనస్సు- అనిమధ్వభాష్యము.

యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః।
శ్రద్ధావన్తో ఽనసూయన్తో ముచ్యన్తే తేపి కర్మభిః॥ 3౧॥

యే మానవాః మే ఇదంమతమ్=ఏ మనుష్యులు నాయొక్క ఈ మతమును, శ్రద్ధావన్తః అనసూయన్తః నిత్యమ్ అనుతిష్ఠన్తి=శ్రద్ధగలవారును అసూయలేనివారునై ఎల్లప్పుడును ఆచరింపుచుందురో, తే

ఽపి కర్మభిః ముచ్యన్తే=వారును కర్మములచేత విడువఁబడుదురు.

పరమగురువును వాసుదేవుఁడునగు నాయందు అసూయచేయకున్న వారై- కర్మములనఁగా పుణ్యపాపములు- అని శంకరభాష్యము.

ఇదియె శాస్త్రతాత్పర్యమని తలంచి నామతమును ఆచరించువారును, ఆచరింపలేకపోయినను శ్రద్ధకలవారును, శ్రద్ధ లేకపోయినను ఇది శాస్త్రతాత్పర్యము కాదనెడి యసూయలేనివారును, వీరందఱును బంధమునకు హేతువులైన అనాదికాలమునుండియున్న కర్మములచే విడువఁబడుదురు- తేఽపి=వారుగూడ అనెడియపిశబ్దమునకు, ఇప్పుడు ఆచరింపకపోయినను శ్రద్ధకలవారును అసూయలేనివారును శ్రద్ధానసూయలచే పాపక్షయమును పొందినవారై శీఘ్రకాలముననె దీనిననుష్ఠించి ముక్తులగుదురు, అని తాత్పర్యము. అని రామానుజభాష్యము.

ఇట్లు నివృత్తకర్మాచరణము చేయువారుఁగూడ జ్ఞానద్వారమున ముక్తిని పొందెదరు- ఇఁక అపరోక్షజ్ఞానులంగూర్చి చెప్పవలసినదేమి?- అని మధ్వభాష్యము.

> యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్।
>
> సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః॥౩-౩౨॥

యే తు ఏతత్ మే మతమ్ అభ్యసూయన్తః నానుతిష్ఠన్తి=ఎవ్వరైతే ఈ నా మతమును అసూయచేయుచున్నవారై ఆచరింపరో, తాన్ సర్వజ్ఞానవిమూఢాన్ నష్టాన్ అచేతసః విద్ధి=వారిని అన్నిజ్ఞానములయందును మూఢులనుగాను చెడినవారినిగాను చిత్తములేనివారినిగాను తెలిసికొనుము.

అసూయచేయుటయనఁగా నిందించుట- అన్నిజ్ఞానములయందును అనేకవిధములుగా మూఢులయినవారు- అచేతస్సులనఁగా అవివేకులు, అని శంకరభాష్యము.

ఆత్మలందఱును నాకు శరీరమగుటను నేను ఆధారముగాఁగలవారు, నాకు శేషభూతులు(పలుబడి)అయినవారు, నాచేతనే ప్రవర్తించువారు, అను తలంపుతో అన్నికర్మములను ఎవ్వరు చేయరో, ఎవ్వరు శ్రద్ధ చేయరో, ఎవ్వరు అసూయ చేతురో, వారిని అన్నిజ్ఞానములయందును విశేషముగా మూఢులయినవారినిగాను, కావుననె చెడినవారినిగాను, చే

తస్సు(మనస్సు)నకు కార్యమైన వస్తుతత్త్వజ్ఞానము లేకపోవుటచే చేత
స్సులేనివారినిగాను, అనఁగా విపరీతజ్ఞానము కలవారినిగాను తెలిసి
కొనుము- అని రామానుజభాష్యము.

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కింకరిష్యతి॥౩౩॥

జ్ఞానవానపి స్వస్యాః ప్రకృతేః సదృశం చేష్టతే=జ్ఞానముకలవాఁడైనను తనదగు ప్రకృతికి తగినట్లు పనిచేయును- భూతాని ప్రకృతిం యాన్తి=ప్రాణులు ప్రకృతిని అనుసరింపుచున్నవి- నిగ్రహః కిం కరిష్యతి=నిగ్రహము ఏమి చేయఁగలదు?.

ప్రకృతియనఁగా ప్రకృతజన్మాదులయందు బయలుపడిన పూర్వజన్మసంబంధులగు ధర్మాధర్మములసంస్కారము(వాసన)- అనిశంకరభాష్యము.

జ్ఞానవంతుఁడనఁగా, ఆత్మస్వరూపము ప్రకృతికంటె విలక్షణమైనది, అదియె యెల్లప్పుడును అనుసంధానముచేయఁదగినదని శాస్త్రములు చెప్పుచున్నవి, అనియెడి జ్ఞానముకలవాఁడు- ప్రకృతియనఁగా ప్రాచీన(ప్రాఁత)వాసన- దానిననుసరించెడి జంతువులను శాస్త్రముచే చేయఁబడిన నిగ్రహము ఏమిచేయఁగలదు- అని రామానుజభాష్యము.

ప్రకృతియనఁగాఁ బూర్వసంస్కారము- అనిమధ్వభాష్యము.

ఇన్ద్రియ స్యేన్ద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్నవశ మాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ॥౩౪॥

ఇన్ద్రియస్య ఇన్ద్రియస్య అర్థే=ఇంద్రియము ఇంద్రియము (అన్నిఇంద్రియముల) యొక్క విషయమున, రాగద్వేషౌ వ్యవస్థితౌ=రాగద్వేషములు ఏర్పడియున్నవి-తయోః వశం నాగచ్ఛేత్=వానికి లొంగుబాటును పొందఁగూడదు- తౌ అస్య పరిపన్థినౌహి=అవి వీనికి విఘ్నముచేయునవిగదా.

శాస్త్రముచొప్పున ప్రవర్తించువాఁడు మునుపటివలె రాగద్వేషములయధీనుఁడు కాఁగూడదు- పురుషుని యొక్క ప్రకృతి రాగద్వేషానుసారను గానె యుండును- అది పురుషుని ప్రవర్తింపఁజేయునేని యప్పుడు తనధర్మమును విడుచుటయు ఇతరధర్మములను ఆచరించుటయు కలుగు

ను- పురుషుఁడు రాగద్వేషములను అడఁచికొనినప్పుడు శాస్త్రదృష్టిగలవాఁడె యగును గాని ప్రకృతివశుఁడు కాఁడు- కాఁబట్టి శాస్త్రము నిరర్థకము కాదు- అని శంకరభాష్యము.

శ్రోత్రము మొదలగు జ్ఞానేంద్రియములకు విషయంబులగు శబ్దాదులయందును వాక్కు మొదలగు కర్మేంద్రియములకు విషయములగు వచనము(మాట) మొదలగు వానియందును, వానిని అనుభవింపఁగోరుట యనెడి రాగము పూర్వవాసనవలనఁ గలిగినదై తప్పకయుండును- ఆ యనుభవము అడ్డగింపఁబడెనేని తప్పక ద్వేషము కలిగియుండును- ఈ రాగద్వేషములు, జ్ఞానయోగమునకు ప్రయత్నము చేయుచుండుటను అన్ని యింద్రియములను నియమించుచున్న పురుషుని, లాఁగఁదీసికొని, తమ కార్యములయందు చేర్చును. అందువలన వాఁడు ఆత్మస్వరూపానుభవమునకు విముఖుఁడై చెడును- కాఁబట్టి జ్ఞానయోగమును ఆరంభించి రాగద్వేషములకు అధీనుఁడై చెడఁగూడదు- రాగద్వేషములు వీనికి జయింపరాని శత్రువులుగదా- అవి జ్ఞానాభ్యాసమును నివారించును- అని రామానుజభాష్యము.

వెనుకటి శ్లోకములో చెప్పినట్లైనను తనశక్తి కొలది నిగ్రహమును చేయవలసినదియె- నిగ్రహమువలన అప్పటికి ప్రయోజనము లేకపోయినను మిక్కిలి ప్రయత్నము చేయుటవలన ప్రయోజనము కలుగును- అని మధ్వభాష్యము.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ ౩౫ ॥

స్వనుష్ఠితాత్ పరధర్మాదపి = లెస్సగా నాచరింపఁబడిన ఇతరుల ధర్మముకంటెను, విగుణః స్వధర్మః శ్రేయాన్ = గుణము లేనిదైనను తనధర్మము ప్రశస్తమైనది - స్వధర్మే (స్థితస్య) నిధన(మపి) శ్రేయః = తనధర్మమున (నున్నవానికి) మరణ(మైనను) మేలు- పరధర్మః భయావహః = ఇతరధర్మము భయమును కలుఁగఁజేయునది.

రాగద్వేషములచే ప్రవర్తించువాఁడు ఇతరధర్మముఁగూడ ధర్మమె కాన యాచరింపవలసినదియె యని తలంచును- అది యుక్తము కాదు- భయము వలనఁగా నరకము మొదలగునది- అని శంకరభాష్యము.

ప్రకృతిసంబంధము కలవానికి ఆచరింపశక్యము కానిదగుటచే జ్ఞాన

యోగముపరధర్మము- శక్యమగుటచే కర్మయోగము స్వధర్మము- మేలైనది అనఁగా ప్రమాదము లేనిదనుట- కర్మయోగముననున్నవాఁడు ఒక్కజన్మమున ఫలమును పొందక మృతిఁబొందినను మేలే- విఘ్నములచే బాధింపఁబడకపోవుటను రెండవజన్మమందైనను కలతలేని కర్మయోగము సంభవించును- జ్ఞానయోగము ప్రమాదగర్భమగుటను భయావహమె- అని రామానుజభాష్యము.

యుద్ధము రాగాదులతోఁగూడినదైనను ఆచరింపవలసినదియె- అని మధ్వభాష్యము.

అర్జునఉవాచ.

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥ ౩౬॥

(హే) వార్ష్ణేయ! = (ఓ) వృష్ణివంశమువాఁడా!, అథ = ఇఁకను, అయమ్ పూరుషః అనిచ్ఛన్నపి = ఈ పురుషుఁడు కోరకున్నవాఁడైనను, కేన ప్రయుక్తః = దేనిచేత ప్రేరణచేయఁబడినవాఁడై, బలాత్ నియోజితఇవ పాపం చరతి? = బలాత్కారముగా నియోగింపఁబడినవానివలె పాపమును చేయుచున్నాఁడు?.

ఈపురుషుఁడు అనఁగా జ్ఞానయోగమునకై ప్రవర్తించువాఁడు- పాపము అనఁగా విషయానుభవము- అని రామానుజభాష్యము.

అథఅనునది అర్థాంతరము (మఱియొక్కవిషయము) అని తెలియఁజేయును. కర్మమునకు కారణములైనవి క్రోధము మొదలగునవియు కామమున నెడి యనేకములుకలవు- వానిలో నేది బలవత్తైనది?- అనిమధ్వభాష్యము.

శ్రీభగవానువాచ.

కామ ఏష క్రోధఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥ ౩౭॥

ఏషః రజోగుణసముద్భవః కామః = ఇది (నీవడిగిన హేతువు) రజస్సనెడిగుణమువలనపుట్టెడి కామము- ఏషః క్రోధః = ఇది (యె) క్రోధము- ఒక్కవస్తువును తాను కోరఁగా దానికి మఱియెవ్వఁడైనను అడ్డముచేసి

నమొడను అప్పుడె కోపముగలుగునుగాన ఇదియె క్రోధమని చెప్పఁబడుచున్నది- (ఏషః) మహాశనః=(ఇది) మిక్కిలితిండికలది- (ఏషః) మహాపాప్మా=(ఇది) మిక్కిలిపాపము- ఇహ ఏనమ్ వైరిణమ్ విద్ధి =ఇచ్చట దీనిని శత్రువునుగా ఎఱుంగుము.

కామము(కోరిక) అందఱిని స్వాధీనముచేసికొనుచున్న శత్రువు- అన్నియనర్థంబులుఁగలుగుట దీనింబట్టియె- ఈకామము మఱియొక్క దానిచే నడ్డగింపఁబడినదై క్రోధరూపముగాఁబరిణమించుచున్నది- ఇది రజోగుణమువలనఁబుట్టునదియు రజోగుణమును పుట్టించునదియు- ప్రాణులు కామముచే ప్రేరణచేయఁబడియె పాపములంజేయుదురు గాన ఇది మహాపాప్మ యనఁబడుచున్నది- కాఁబట్టి ఈసంసారమున ఈకామమును శత్రువునుగా నెఱుంగుము- అనిశంకరభాష్యము.

సత్త్వరజస్తమోగుణమయమైన ప్రకృతితో కలిసియున్నవాఁడై జ్ఞానయోగమును ఆరంభించినవానికి, పూర్వపువాసనవలనఁగలిగిన శబ్దాదివిషయములంగూర్చిన కామము ఈతనిని విషయములకై లాగుచున్నది- ఈకామమె అడ్డగింపఁబడినదై అడ్డగించిన చేతనులయందు క్రోధరూపముగాఁబరిణమించి ఇతరులను హింసించుటమొదలగు గొప్ప పాపకార్యములం బ్రవర్తింపఁజేయును- రజోగుణమువలనఁబుట్టిన ఈకామము జ్ఞానయోగమునకు సహజశత్రువునుగా తెలిసికొనుము- అని రామానుజభాష్యము.

కర్మములంబ్రవర్తింపఁజేయువానిలోఁ బ్రబలమైనది ఈకామమె- దీనివలనఁబుట్టునదిగాన క్రోధంబును ఇదియె· గురువులను నిందించుట మొదలగుదానివలనఁగలిగిన క్రోధముఁగూడ, తనకు గురువులు మొదలగు వారియందుండెడి భక్తివలన, వారిని నిందింపకుండుటను కోరుటచేఁ గలిగినదియె- కామమునకు భోగ్యము (అనుభవింపఁబడఁదగినది) మిక్కిలిగాఁగలదుగాన మహాశనమనఁబడును- బ్రహ్మహత్యమొదలగు గొప్ప పాపములకు కారణముగాన మహాపాప్మయనఁబడును- అన్నిపురుషార్థములకును విరోధియగు టను వైరియనఁబడును. అని మధ్వభాష్యము.

ధూమేనావ్రియతే వహ్నిర్యథాదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్॥ ౩౮॥

యథా ధూమేన వహ్నిః ఆవ్రియతే=ఎట్లు పొగచేత నిప్పు ఆవరింపఁబడుచున్నదో, యథా ఆదర్శశ్చ మలేన (ఆవ్రియతే)=ఎట్లు అద్దంబును మురికిచేత (ఆవరింపఁబడుచున్నదో), యథా గర్భః ఉల్బేన* ఆవృతః=ఎట్లు గర్భము మావిచేత ఆవరింపఁబడినదో- తథా తేన ఇదమ్ ఆవృతమ్=అట్లు దానిచేత ఇది ఆవరింపఁబడినది.

కామము శత్రువగుటకు దృష్టాంతములు చూపఁబడుచున్నవి- ఇదియనఁగా జ్ఞానము- అని శంకరభాష్యము.

ఇదియనఁగా ప్రాణిసమూహము- అని రామానుజభాష్యము.

. ప్రకాశరూపమైనను అగ్ని పొగచేత కప్పఁబడినదై ఇతరులచేతను ఎట్లు చూడఁబడదో అట్లు పరమాత్మ మన కామముచేత ఆవరింపఁబడినవాఁడై చూడఁబడడు- మకిలగ్రమ్మిన యద్దమున ముఖము మొదలగునవి ఎట్లు తెలియఁబడవో అట్లు కామముచే నావరింపఁబడిన యంతఃకరణము జీవేశ్వరాదులయభివ్యక్తికి పనికి రాదు- ఉల్బముచేత ఆవరింపఁబడిన గర్భము ఎట్లు తనపనిని చేయఁజాలదో అట్లుదీనిచేత నావరింపఁబడిన జీవుఁడు ఈశ్వరాదులను తెలిసికొనఁజాలఁడు అని మధ్వభాష్యము.

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేనచ॥ 39॥

(హే) కౌన్తేయ!=(ఓ) కున్తీపుత్రుఁడా!, నిత్యవైరిణా కామరూపేణ దుష్పూరేణ అనలేనచ పరేన=నిత్యముగా శత్రువైనదియు కోరికస్వరూపము గాఁగలదియు నింపశక్యము కానిదియు తృప్తిలేనిదియునగు దీనిచేతను, జ్ఞానినః జ్ఞానమ్ ఆవృతమ్=జ్ఞానముగలవాని జ్ఞానము ఆవరింపఁబడినది.

జ్ఞానినః నిత్యవైరిణా=జ్ఞానముకలవానికి నిత్యముగా శత్రువైన-జ్ఞానముకలవాఁడె దీనిచేత నేను అనర్థములోఁబడితి ననుకొనను గాన ఇది జ్ఞానము కలవానికె శత్రువు గాని మూర్ఖునికి కాదు- జ్ఞానము కలవాఁడు ఆశ పుట్టినప్పుడు కామమును ఇష్టమైనదానిగా నాలో

* ఉత్తరంవా ఉల్బాజ్జరాయుః అనేత్రతివలన గర్భమునందుండెడి శిశువుపైనుండునది ఉల్బము- దానిపైనుండెడిది జరాయువు- ఇట్లయినను నిఘంటువులలో ఉల్బజరాయుశబ్దములు పర్యాయములుగాఁగూడవ్యవహరింపఁబడుచున్నది- కలలోజరాయురుల్బః అని రత్నకోశము.

చించినను దానివలన దుఃఖమువచ్చినప్పుడు ఆశచేత నేనిట్లు దుఃఖమును పొందుచున్నానని తెలిసికొనునుగాన ఇది జ్ఞానికి శత్రువు- మూర్ఖునికికాదు- అనలము అనఁగా అలమ్=చాలును అనునది లేనిది- అని శంకరభాష్యము.

జ్ఞానమె స్వభావముగాఁగలవాఁడైనను ఈజీవునియొక్క జ్ఞానము దీనిచే నావరింపఁబడినది- దుష్పూరమనఁగా పొందశక్యము కాని విషయములు కలది- అని రామానుజభాష్యము.

శాస్త్రమువలన జ్ఞానము కలిగినను కామముచే నావరింపఁబడినచో పరమాత్మాపరోక్షత్వమునకై (పరమాత్మసాక్షాత్కారమునకై) ప్రకాశింపదు- విస్తారమగు జ్ఞానముకలవానికె ఇట్లుండ కొంచెము జ్ఞానముకలవాని విషయమున చెప్పవలసినదేమి? కామరూపమనఁగా కామమను పేరుగలదియనుట- దుఃఖముచేతఁగదా కామము పూరింపఁబడుచున్నది- కాఁబట్టి దుష్పూరమనఁబడుచున్నది- ఇంద్రాదిపదము సుఖముచే దొరకదుగదా. ఇంద్రాదిపదముదొరకినను బ్రహ్మాదిపదము కోరఁబడునుగాని అలమ్=చాలును అనెడి బుద్ధి కలుగదుగాన కామము అనలమనఁబడుచున్నది- అనిమధ్వభాష్యము.

ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే।
ఏతై ర్విమోహ యత్యేష జ్ఞాన మావృత్య దేహినమ్॥౪౦॥

అస్య అధిష్ఠానమ్=దీనికి అధిష్ఠానము, ఇన్ద్రియాణి మనః బుద్ధిః (ఇతి) ఉచ్యతే=ఇంద్రియములును మనస్సును బుద్ధియును (అని) చెప్పఁబడుచున్నది- ఏతైః జ్ఞానమ్ ఆవృత్య=వీనిచేత జ్ఞానమును ఆవరించి, దేహినమ్ విమోహయతి=ఆత్మను మోహింపఁజేయుచున్నది.

అధిష్ఠానమనఁగా ఆశ్రయము- శత్రువుయొక్క పట్టు తెలిసినచో సుఖముగా శత్రువును జయింపవచ్చునుగాన అదిఈశ్లోకమున చెప్పఁబడుచున్నది- అనిశంకరభాష్యము.

ఈకామము ఇంద్రియము మొదలగువానిని ఉపకరణములను (సాధనములను) గాఁ జేసికొని ఆత్మను ఆశ్రయించి యుండునుగాన ఆ యింద్రియాదులు ఈకామమునకు అధిష్ఠానమనఁబడును- మోహింపఁజేయుటయనఁగా ఆత్మజ్ఞానమున వైముఖ్యంబునును విషయానుభవమున ఆ

సక్తినిని పుట్టించుట- అని రామానుజభాష్యము.

బుద్ధి మొదలగునవి విషయములను పొందినయెడనుగదా జ్ఞానము ఆవరింపఁబడును- అధిష్ఠానము హరింపఁబడినతోడనె శత్రువు నశించును గదా. అని మధ్వభాష్యము.

తస్మాత్త్వ మిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥౪౧॥

(హే) భరతర్షభ!=(ఓ) భరతవంశమువారిలో శ్రేష్ఠుఁడా!; తస్మాత్ త్వమ్ ఆదౌ ఇన్ద్రియాణి నియమ్య=ఆ హేతువువలన నీవు మొదటను ఇంద్రియములను నియమించి, జ్ఞానవిజ్ఞాననాశనమ్ పాప్మానమ్ ఏనమ్ ప్రజహి=జ్ఞానవిజ్ఞానములను నశింపఁజేసెడి పాపస్వరూపమైన దీనిని నశింపఁజేయుము- హి అనునది పాదపూరణము. హి=స్ఫుటముగా అని మధుసూదనటీకలో అర్థము చేయఁబడినది. ‡

పాపమనఁగా కామము- జ్ఞానమనఁగా శాస్త్రములవలనను ఆచార్యునివలనను ఆత్మ మొదలగువానిఁ దెలిసికొనుట- విజ్ఞానమనఁగా విశేషముగా దానిననుభవించుట- ఈ రెండును మేలును పొందుటకు సాధనములైనవి- అని శంకరభాష్యము.

సమస్తేంద్రియవ్యాపారములను ఉడుగుట స్వరూపముగాఁగల జ్ఞానయోగమునఁ బ్రవర్తించినవానికి, ఈ కామ మనెడి శత్రువు, విషయములయందు అభిముఖ్యమును కలుగఁజేసి ఆత్మయందు వైముఖ్యమును కలుగఁజేయునుగాన, ప్రకృతిసంపర్కము కలిగియుండుటచేత ఇంద్రియవ్యాపారములయందే ఆసక్తి కల నీవు, మొదటను అనఁగా మోక్షోపాయమును మొదలుపెట్టినప్పుడు ఇంద్రియవ్యాపారరూపము గు కర్మయోగమునఁనె ఇంద్రియములను నియమించి, ఈ కామమును నశింపఁజేయుము- జ్ఞానమనఁగా ఆత్మస్వరూపమును తెలిసికొనుట- విజ్ఞానమనఁగా ఆత్మ దేహముకంటె వేఱు అని యెఱుంగుట- అని రామానుజభాష్యము.

---

‡ మన దేశపు శంకరభాష్యపుస్తకములో ప్రజహిహి=పరిత్యజ అని పాఠమున్నది- బొంబాయిలో అచ్చుపడినపుస్తకములో ప్రజహి పరిత్యజ, హి యస్మాత్ - అని యున్నది- రామానుజభాష్యమధ్వభాష్యములకు ప్రజహి, హి, అని రెండు పదములని యె తాత్పర్యము- మధుసూదనటీకలో ఏకపదముగానును, రెండుపదములుగానును గూడ వ్యాఖ్యానము చేయఁబడినది.

ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః॥౪౨॥

ఇన్ద్రియాణి పరాణి ఆహుః=ఇంద్రియములను ఉత్కృష్టములనుగా చెప్పుచున్నారు- ఇన్ద్రియేభ్యః మనః పరమ్=ఇంద్రియములకంటె మనస్సు ఉత్కృష్టము- మనసఃతు పరా బుద్ధిః=మనస్సుకన్నను ఉత్కృష్టమైనది బుద్ధి- బుద్ధేఃతు పరతః యః, సః (పరమాత్మ)=బుద్ధికంటెను పైని ఎవ్వఁడో, వాఁడు (పరమాత్మ)- బుద్ధియనఁగా అధ్యవసాయము- అనఁగా నిశ్చయజ్ఞానము.

ఎవ్వఁడు బుద్ధిచునకునుండెడి దృశ్య(తెలియఁబడెడి)పదార్థములకు లోనివాఁడో, దేహవంతుఁడైన ఎవ్వనిని ఇంద్రియాదులనాశ్రయించియున్న కామము జ్ఞానమును ఆవరించి మోహింపఁజేయునని చెప్పఁబడినదో, అతఁడె తెలిసికొనెడి పరమాత్మ- అనిశంకరభాష్యము.

పరశబ్దమునకు జ్ఞానముతో విరోధించుటయందు ప్రధానము అనియర్థము- ఇంద్రియములు విషయవ్యాపారమునున్నచో ఆత్మజ్ఞానము ప్రవర్తింపదు- ఇంద్రియములుడిగినను మనస్సు విషయాసక్తమైనచో ఆత్మజ్ఞానము కలుగదు- మనస్సు మిగిలిన ప్రవృత్తులు లేనిదైనను విరుద్ధమైన నిశ్చయము కలిగెనేని జ్ఞానము ప్రవర్తింపదు- ఇన్నియునుడిగినను కోరికె యుండెనేని అది ఇంద్రియాదులనన్నిటిని తనవిషయమున నడిపించి ఆత్మజ్ఞానమును నిరోధించును- కాఁబట్టి యో బుద్ధేః పరతస్తు సః అని చెప్పఁబడుచున్నది- అనఁగా బుద్ధికంటె పైని పది కలదో అది కామమె అని యర్థము- అనిరామానుజభాష్యము.

శత్రువును చంపుటకు ఆయుధమువంటిదైన జ్ఞానమును చెప్పుటకు ఈ శ్లోకములో జ్ఞేయము (తెలియఁబడవలసినది) చెప్పఁబడుచున్నది- శరీరముకంటె ఇంద్రియములు ఉత్కృష్టములు- బుద్ధికంటెను ఉత్కృష్టుఁడు ఎవ్వఁడో వాఁడె తెలియఁబడవలసినవాఁడు- వాఁడు ఈశ్వరుఁడు-వాఁడు బుద్ధికంటెనే కాదు- అవ్యక్తము(ప్రకృతి)కంటెనను ఉత్కృష్టుఁడుగా తెలియఁబడవలసినవాఁడు- అనిమధ్వభాష్యము.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥౪౩॥

(హే)మహాబాహో!=(ఓ)గొప్పభుజములుకలవాఁడా!, ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా=ఇట్లు బుద్ధికంటెను ఉత్కృష్టమైనదానిని తెలిసికొని, ఆత్మనా ఆత్మానమ్ సంస్తభ్య=ఆత్మచేతను ఆత్మను నిలిపి, దురాసదమ్ కామరూపమ్ శత్రుమ్ జహి=దుఃఖముచేఁబొందఁదగిన కామస్వరూపమైన శత్రువును నశింపఁజేయుము.

బుద్ధికంటె పరుఁడైన ఆత్మను తెలిసికొని ఆయాత్మచేతనె మనసును నిలిపి తెలియశక్యము గాని అనేకవిశేషములుగల ఈకామమును చంపుము- అని శంకరభాష్యము.

. కామమును బుద్ధికంటెను ఉత్కృష్టమైన జ్ఞానయోగవిరోధిసిగాఁ దెలిసికొని (ఆత్మనా=)బుద్ధిచేత మనస్సును కర్మయోగమున నిలిపి ఈకామమనెడి శత్రువును నశింపఁజేయుము - అని రామానుజభాష్యము

బుద్ధిమొదలగువానికంటె నుత్కృష్టుఁడైన హరిని తెలిసికొని- ఆత్మానమ్=మనస్సును- ఆత్మనా=బుద్ధిచేతను- అనిమధ్వభాష్యము.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాంయోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబునగు భగవద్గీతలలో కర్మయోగప్రతిపాదకంబగు మూఁడవయధ్యాయము.



నాలుగవయధ్యాయము.

శ్రీభగవానువాచ.

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్।
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥౧॥
ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః।
సకాలే నేహమహతా యోగో నష్టః పరంతప॥౨॥
సఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః॥
భక్తోఽసిమే సఖాచేతి రహస్యం హ్యేత దుత్తమమ్॥౩॥

అహమ్ అవ్యయమ్ ఇమమ్ యోగమ్ వివస్వతే ప్రోక్తవాన్=నేను అవ్యయమైన ఈ యోగమును ఆదిత్యునికొఱకు చెప్పియుంటిని- వివస్వాన్ మనవే ప్రాహ=ఆదిత్యుఁడు మనువుకొఱకు చెప్పెను- మనుః ఇక్ష్వాకవే అబ్రవీత్=మనువు ఇక్ష్వాకువుకొఱకు చెప్పియుండెను. ఏవమ్ పరంపరాప్రాప్తమ్ ఇదమ్ రాజర్షయః విదుః=ఇట్లు పరంపరచేవచ్చిన దీని రాజర్షులు ఎఱుంగుదురు- (హే) పరంతప=(ఓ) శత్రువులను తపింపఁజేయువాఁడా!, సః యోగః ఇహ మహతా కాలేన నష్టః=ఆ యోగము ఈలోకమున గొప్ప కాలము చేత నశించినది- సః పురాతనః యోగఏవ=ఆ ప్రాచీనమైన యోగమె, మే భక్తః సఖాచ అసి ఇతి=నా భక్తుఁడవును చెలికాఁడవును అగుచున్నావు అని, అద్య మయా తే ప్రోక్తః=ఇప్పుడు నాచేత నీకు చెప్పఁబడినది- ఏతత్ ఉత్తమమ్ రహస్యంహి=ఇది గొప్ప రహస్యముగదా.

అవ్యయమనఁగా ఫలము తప్పనిది- తప్పక మోక్షమును కలుగఁజేయునదియనుట- క్షత్రియులకు ప్రజలను పరిపాలించెడి సామర్థ్యము కలుగుటకై సృష్ట్యాదియందు ఆదిత్యుఁడు మొదలగువారికికర్మయోగము వలనఁగలిగెడి సాంఖ్యయోగము ఉపదేశింపఁబడినది, అని శంకరభాష్యము.

సమస్తజగత్తును ఉద్ధరించుటకై ఈమన్వంతరము మొదటను మోక్షసాధనముగా యోగము వివస్వంతుఁడు మొదలగువారికి ఉపదేశింపఁబడెనని రామానుజభాష్యము.

అర్జునఉవాచ.

అపరం* భవతో జన్మ పరంజన్మ వివస్వతః।
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవానితి॥౪॥

భవతః జన్మ అపరమ్ = నీయొక్క పుట్టుక తరువాతిది- వివస్వతః జన్మ పరమ్ = ఆదిత్యునియొక్క పుట్టుక మునుపటిది- ఆదౌ త్వమ్ ప్రోక్తవాన్ ఇత్యేతత్ = మొదటను నీవు చెప్పితివి అనుదీనిని, కథమ్ విజానీయామ్ = ఎట్లు తెలిసికొనుదును.

భగవంతుఁడు చెప్పినది పరస్పరవిరుదమని యెవ్వరు ననుకొనకుండుటకై అర్జునుఁడు ప్రశ్నము చేయుచున్నాఁడు- అనిశంకరభాష్యము.

అర్జునుఁడు శ్రీకృష్ణమూర్తిని సర్వేశ్వరునిగా నెఱిఁగినవాఁడైనను సర్వేశ్వరునికి కర్మపరవశులకువలెఁగలిగిన జన్మము ఇంద్రజాలామలవలె అసత్యమా? సత్యమా? సత్యమైనయెడను జన్మవిధమెట్లు- ఈ శరీరము ఏమి స్వరూపమైనది? పుట్టుట కేమి హేతువు- పుట్టుకయెప్పుడుకలుగును- పుట్టుట(జన్మమునకు) ప్రయోజనమేమి- అని శంకంజేయుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

పయి సర్వాణి అనుశ్లోకమునం జెప్పఁబడిన భగవన్మాహాత్మ్యమును సహేతుకముగాఁ దెలియుటకు ప్రశ్నము చేయుచున్నాఁడు- అని మధ్వభాష్యము

శ్రీభగవానువాచ.

బహూని మే వ్యతీతాని జన్మాని తవచార్జున।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప॥౫॥

(హే)అర్జున = ఓయర్జునుఁడా!, మే తవ చ బహూని జన్మాని వ్యతీతాని = నాకును నీకును అనేకములయిన జన్మములు అతిక్రమించినవి- తాని సర్వాణి అహమ్ వేద = వానిని అన్నిటిని నేను ఎఱుంగుదును- (హే) పరంతప! = (ఓ) శత్రువులనుతపింపఁజేయువాఁడా!, త్వం న వేత్థ = నీవు ఎఱుంగవు.

* నిశంకరభాష్యపుస్తకములలోను, మధ్వభాష్యపుస్తకములలోను అపరమ్ అనుపాఠము అక్షరమొక్కటియే.

ధర్మాధర్మములచే ప్రతిబంధింపఁబడిన జ్ఞానశక్తిగలవాఁడవగుటచే నీ వెఱుంగవు- నిత్యశుద్ధబుద్ధముక్తసత్యస్వభావుఁడనుఅనఁగా నిత్యమైపరిశుద్ధమై ముక్తమై సత్యమైన స్వభావముగలవాఁడనగుటను ఆవరణము (కప్పు) లేని జ్ఞానశక్తిగలవాఁడనుగాన నేను సమస్తజన్మములను నెఱుంగుదును- అని శంకరభాష్యము.

నీజన్మములవలె నాజన్మములును సత్యములేకాని మిథ్యాభూతములు కావు- అని రామానుజభాష్యము.

అజోపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోపి సన్।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా॥౬॥

అజోపిసన్=పుట్టుకలేనివాఁడనగుచును, అవ్యయాత్మా (సన్=నాశములేనిస్వభావముకలవాఁడను (అగుచు), భూతానామ్ ఈశ్వరోపిసన్=భూతములకు ఈశ్వరుఁడను నగుచు,స్వాం ప్రకృతిమ్ అధిష్ఠాయ=నాదైన ప్రకృతిని అధిష్ఠించి, ఆత్మమాయయా సంభవామి=స్వమాయచేత పుట్టుచున్నాఁడను.

ప్రకృతియనఁగా విష్ణుసంబంధియగు త్రిగుణాత్మకమైన మాయ- ఈ జగత్తంతయును దానివశమున నై యున్నది- మాయచేత మోహితుఁడగుటనె తాను వాసుదేవుఁడను జ్ఞానము ఎవ్వనికినికలుగకున్నది- అట్టిమాయను స్వాధీనముచేసికొని, పుట్టినవానివలెనుండుదును- లోకులవలెఁ బరమార్థముగాఁ బుట్టుటలేదు- అని శంకరభాష్యము.

ప్రకృతియనఁగా స్వభావము- మాయఅనఁగా జ్ఞానము- అనఁగా సంకల్పము- పరమేశ్వరస్వభావములగు అపహతపాప్మత్వము (పాపములు లేకుండుట) మొదలగుదానిని విడువకయె తనశుద్ధసత్త్వమయమైన రూపమునె (విగ్రహము నె) దేవమనుష్యాదులతో సమానమైనయాకారముకలదానిగాఁజేసి తన సంకల్పముచేత దేవాదిరూపముకలవాఁడై పుట్టుచున్నాఁడు- అనిరామానుజభాష్యము.

అవ్యయాత్మ అనుదానికి నాశము లేని దేహముకలవాఁడై అనియర్థము- ఆత్మ యనాదియగుట అందఱికిని తుల్యమే- ప్రకృతివలనఁబుట్టినవసుదేవాదులయ మ దానితోనె వారికిఁ బుట్టినట్లు కనఁబడుచున్నాఁడు- ఆత్మమాయ యనఁగ దానికి ఆత్మజ్ఞానముతోఁగూడియుండుట- సృష్టికారణ

(హే)పార్థ!=(ఓ)యర్జునుఁడా!, మనుష్యాః సర్వశః మమ వర్త్మ అనువర్తన్తే=మనుష్యులు అన్నివిధములను నామార్గమును అనుసరించుచున్నారు.

ఏప్రకారముగా అనఁగా ఏఫలమునుగోరి ఆశ్రయింతురో- జ్ఞానవంతులై కర్మసంన్యాసముకలిగి మోక్షమునుకోరెడివారికి మోక్షమునును, ఫలమును కోరక కర్మములం జేయువారికి జ్ఞానమునును, ఆర్తులైనవారికి ఆర్తినిపోగొట్టుటనును, వారివారి కోరికెప్రకారము ఇచ్చెదనుగాని నాకు ఒకరియందును రాగమైనను ద్వేషమైనను లేదు- అని శంకరభాష్యము.

నన్నాశ్రయించువారికి దేవమనుష్యాద్యాకారమున నవతరించియె రక్షణమును చేయుదుననను నియమము లేదు- నన్ను ఆశ్రయింపఁగోరువారు వారివారి అపేక్షానుసారముగా నా రూపమును ఎట్లూహించికొందురో వారికి అట్లే నా స్వరూపమును చూపుదును- సమస్తమనుష్యులును నామార్గమును అనఁగా నా స్వభావమును, రాగాదులవాక్కులకును మనస్సులకును కూడ అగోచరమైనను. [illegible] చక్షురాదికరణములచేత తమకు అపేక్షితమైన అన్నిప్రకారములచేతను [illegible] భావించి అనువర్తింతురు- అని రామానుజభాష్యము.

అన్యదేవతాదిస్వరూపముగా నన్ను భజించినంతమాత్రమున హానికి లేదు- అయినను వారివారికి తగిన ఫలములనిచ్చెదను. నేను సర్వక్రతువులకు కర్తను భోక్తనుంగాన, అన్యదేవతలనుగూర్చి యజ్ఞాదులు చేయువారైనను నామార్గమునే అనుసరించుచున్నారు- అని మధ్వభాష్యము.

కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా॥౧౨॥

ఇహ కర్మణాం సిద్ధిం కాఙ్క్షన్తః=ఈలోకమున కర్మములయొక్క ఫలసిద్ధిని కోరుచున్నవారై, దేవతాః యజన్తే=ఇంద్రాదిదేవతలను గూర్చి యాగములను చేయుచున్నారు- మానుషే లోకే=మనుష్యసంబంధియగు లోకమున, కర్మజా సిద్ధిః క్షిప్రం భవతి హి=కర్మములవలనఁగలిగిన ఫలసిద్ధి శీఘ్రముగా అగుచున్నదిగదా.

నేను వేఱు, దేవతలు వేఱు, అని దేవతలను గూర్చి భేదబుద్ధితో యాగము చేయువారికి మానుషలోకమున శీఘ్రముగా ఫలసిద్ధి యగును. దీనిచే ఇతరలోకములయందుఁగూడ కర్మఫలములసిద్ధి తెలియఁజేయఁబడినది. మనుష్యలోకమున వర్ణాశ్రమాది కర్మములు విశేషము. అని శంకరభాష్యము.

మనుష్యలోకశబ్దము స్వర్గాదులం గూడఁ దెలియఁజేయును. ఈ లోకములోని వారు అందఱును అవివేకులై శీఘ్రఫలములం గోరి పుత్ర పశ్వన్నాదులకొఱకును స్వర్గాదులకొఱకును ఇంద్రాది దేవతలనుమాత్రము కర్మములచే నారాధించుచున్నారు. ఒకఁడైనను సంసారమందురోతపుట్టి మోక్షమునకై ఇంద్రాదులకు ఆత్మభూతుఁడనగు నన్ను కర్మములచే నారాధించుటలేదు. అని రామానుజభాష్యము.

అన్యదేవతలం గూర్చి యజ్ఞము చేయువారును నామార్గము ననుసరించువారగుటచే పుత్రాదిఫలప్రాప్తి శీఘ్రముగా కలుగుచున్నది. విష్ణువు యజ్ఞభోక్త కానియెడల బ్రాహ్మణులకు స్వాతంత్ర్యము లేకపోవుటచే ఫలమునిచ్చు సామర్థ్యము లేమిగాన ఫలసిద్ధి కలుగకపోవలసినది. అని మధ్వభాష్యము.

చాతుర్వర్ణ్యం [illegible] సృష్టం గుణకర్మవిభాగశః।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్॥౧౩॥

మయా గుణకర్మవిభాగశః చాతుర్వర్ణ్యం సృష్టమ్=నాచేత సత్త్వరజస్తమోగుణములయొక్కయు కర్మములయొక్కయు విభాగముచొప్పున చాతుర్వర్ణ్యము (బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు) సృజింపఁబడినది. అవ్యయం మాం తస్య కర్తారమ్ అకర్తారమపి విద్ధి=నిత్యుఁడనైన నన్ను దానికి (చాతుర్వర్ణ్యమునకు) కర్తనుగాను కర్తగానివానిగాను ను తెలిసికొనుము.

సత్త్వగుణప్రధానుఁడగు బ్రాహ్మణునికి శమము (ఇంద్రియనిగ్రహము), దమము (అంతఃకరణనిగ్రహము), తపస్సు, మొదలగునవి కర్మములు. సత్త్వముతోఁగూడిన రజోగుణము ప్రధానముగాఁగల క్షత్రియునికి శౌర్యము (శూరత్వము), తేజస్సు (ప్రతాపము), మొదలుగునవి కర్మములు. తమస్సుతోఁగూడిన రజోగుణము ప్రధానముగాఁగల వైశ్యునికి కృషి (వ్యవ

సాయము) మొదలగునవి కర్మములు- రజస్సుతోఁగూడిన తమోగుణము ప్రధానముగాఁగల శూద్రునికి శుశ్రూష( పరిచర్య )యొ కర్మము- ఇట్లు గుణకర్మవిభాగముచొప్పున చాతుర్వర్ణ్యమును సృజించుటకు నన్ను మాయావ్యవహారమున కర్తనుగానును, పరమార్థమున కర్త కానివాఁడనుగానును, అవ్యయునిగానును, అనఁగా అసంసారినిగాను ను తెలిసికొనుము- అని శంకరభాష్యము.

బ్రహ్మ మొదలుస్తంబము(గడ్డి కాడ) వరకునుండు జగత్తంతయు నాచే సృజింపఁబడినది, రక్షింపఁబడుచున్నది, సంహరింపఁబడుచున్నది, అని యెఱుంగునది- నన్ను దానికి కర్తనుగానును అకర్తనుగానును తెలిసికొనుము ( ఈయంశము ఉత్తరశ్లోకమున వివరింపఁబడును )- అని రామానుజభాష్యము.

చాతుర్వర్ణ్య మనఁగా నాలుగువర్ణముల సముదాయము. బ్రాహ్మణుఁడు సాత్త్వికుఁడు- క్షత్రియుఁడు సాత్త్విక రాజసుఁడు- వైశ్యుఁడు రాజసతామసుఁడు- శూద్రుఁడు తామసుఁడు- అనిగుణవిభాగము. శమోదమః (౧౮అ॥౪౨శ్లో)ఇత్యాదిశ్లోకముచే కర్మవిభాగము చెప్పఁబడును. కర్తనైన నన్ను క్రియ(పని)యందు అభిమానము లేకపోవుటవలన అకర్తనుగాఁదెలిసికొనుము- అని మధ్వభాష్యము.

న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే॥౧౪॥

కర్మాణి మాం నలిమ్పన్తి=కర్మములు నన్ను అంటవు- మే కర్మ ఫలే స్పృహా న=నాకు కర్మములఫలమందు కోరిక లేదు- ఇతి మాం యః అభిజానాతి=ఇట్లు నన్ను ఎవ్వఁడు తెలిసికొనునో, సః కర్మభిః నబధ్యతే=వాఁడు కర్మములచేత కట్టఁబడఁడు.

ఎవ్వరికి నేను కర్తను అనెడి యభిమానంబును కర్మములఫలముల యందు ఆశయునుకలదో, అసంసారులను కర్మములు దేహములఁగలుగఁజేయును-ఆ రెండును లేని నన్ను కర్మములు అంటవు- మఱియెవ్వఁడైనను నేనుకర్తను గాను, నాకు కర్మఫలమున కోరిక లేదు, అనుకొని నన్ను తానుగా తలఁచునో, వాఁడును, కర్మములచే బంధింపఁ(కట్టఁ)బడఁడు- అని శంకరభాష్యము.

ఈవిచిత్రసృష్టి మొదలగు కర్మములు(పనులు) నన్ను సంబంధింపవు- అనఁగా దేవమనుష్యాదిసృష్టి వైచిత్ర్యములు సృజింపఁబడువారి పుణ్యపాపకర్మవిశేషమువలన బుట్టి వచ్చినవి- కాఁబట్టి నేను విచిత్రసృష్టి మొదలగుదానికి కర్తనుగాను- కరణకళేబరములతో సృజింపఁబడిన జీవులు సృష్టివలన కలిగిన భోగ్యములను వారివారి కర్మానుగుణముగా ననుభవింతురు- కాఁబట్టి సృష్ట్యాదికర్మఫలంబునంగూడ వారికె కోరికగాని నాకు కోరిక లేదు- ఇట్లు సృష్టికి కర్తనుగానున్ను అకర్తనుగానున్ను సృష్ట్యాదికర్మఫలసంగము లేనివానిఁగా నన్ను నన్ను ఎవ్వఁడెఱుఁగునో, వాఁడు కర్మయోగారంభమునకు విరోధులగు ప్రాచీనకర్మములతో సంబంధింపఁడు. అని రామానుజభాష్యము.

నాకు కర్మఫలమందు(పరులకొఱకు) ఇచ్ఛమాత్రము కలదుగాని అభినివేశము లేదు- కొందఱే ముక్తులగుదురుగాని క్రమముగా నైనను సర్వముక్తి లేదు- అందుకు జీవులు అనంతులగుటయే హేతువు- అని మధ్వభాష్యము- ఫలముకొఱకుఁ బనులను జేయుటవలన మనస్సునకు విక్షేపము కలుగునో అది అభినివేశము- అని హన్క్షటీక.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥

పూర్వైః ముముక్షుభిరపి = పూర్వులైన మోక్షేచ్ఛకలవారిచేతను, ఏవం జ్ఞాత్వా కర్మ కృతమ్ = ఇట్లు తెలిసికొని కర్మను చేయఁబడినది. తస్మాత్ త్వమ్ పూర్వైః కృతం పూర్వతరం కర్మైవ కురు = అందువలన నీవు పూర్వులచేత చేయఁబడిన పురాతనమైన కర్మనునే చేయుము.

నేను కర్తనుగాను, నాకు కర్మఫలమున కోరిక లేదు, అని తెలిసికొనఁబడి పూర్వులగు ముముక్షువులచే కర్మము చేయఁబడినది- కాఁబట్టి జనకాదులచే చేయఁబడినకర్మనున్ను, నీవు ఆత్మజ్ఞానము లేనివాఁడవైనచో అంతఃకరణశుద్ధికొఱకును, ఆత్మజ్ఞానము కలవాఁడవైనచో లోకసంగ్రహముకొఱకును చేయుము- అని శంకరభాష్యము.

ఇట్లు తన్ను తెలిసికొని పాపములనన్నిటిని పోఁగొట్టుకొనిన పూర్వపు ముముక్షువులచే వెనకఁ జెప్పఁబడినకర్మము చేయఁబడినది- అం

మువలన నీవును ఇట్టిజ్ఞానముచే పాపములం బోగొట్టికొని పూర్వులను వివస్వంతుడు, మనువు, మొదలగువారిచే జేయబడిన పురాతనకర్మ మును చేయుము- అనిరామానుజభాష్యము.

జ్ఞానముకలిగినను కర్మమును చేయుటకు ఆచారముకలదు పూర్వ తరం అనుదానికి పూర్వముకలిగినది అనియర్థము- అనిమధ్వభాష్య ము- జ్ఞానికి మోక్షముకలుగుట నిశ్చితమైనను అంతకంటె నెక్కుడు మోక్షమును బొందుటకు కర్మములనాచరించుట యాచారసిద్ధము- అని మాధ్వటీకలో వివరింపబడినది.

కిం కర్మ కిమకర్మేతి కవయో ప్యత్ర మోహితాః।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్॥

కర్మ కిమ్=కర్మము ఏది?, అకర్మ కిమ్=అకర్మము ఏది?, ఇ త్యత్ర కవయోఽపి మోహితాః=అనువిషయమున పండితులు సైతము మో హమును చెందిరి- తత్ తే కర్మ ప్రవక్ష్యామి=అందువలన నీకు కర్మమును చెప్పెదను- యత్ జ్ఞాత్వా అశుభాత్ మోక్ష్యసే= దేనిని తెలిసికొని సంసారమునుండి విడుదలను పొందగలవో.

అకర్మ మనగా కర్తయైన ఆత్మయొక్క తత్త్వజ్ఞానము- చే యవలసిన కర్మమును దానిలోజేరిన జ్ఞానమును ఎట్టివి, అనువిష యమున పండితులుకూడ నెరుంగకున్నారు- ఇట్లు అంతర్గతమైన జ్ఞానముగల కర్మమును నేను నీకు చెప్పెదను- దేనివలన సంసారము నుండి విడువబడుదువో- అనిరామానుజభాష్యము.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః॥౧౭॥

కర్మణోఽపి బోద్ధవ్యం (తత్త్వమ్ అస్తి హి,=కర్మమునకును తెలి యబడదగిన (స్వరూపము కలదుగదా)- వికర్మణశ్చ బోద్ధవ్యమ్ (అస్తి)=వికర్మంబునకును తెలియబడదగినది (కలదు)- అకర్మణశ్చ బోద్ధవ్యమ్ (అస్తి)=అకర్మమునకును తెలియబడదగినది (కలదు)- క ర్మణః గతిః గహనా=కర్మముయొక్క విధము తెలియశక్యముకానిది- కర్మమనగా శాస్త్రముచే విధింపబడినది- వికర్మమనగా శా స్త్రముచే నిషేధింపబడిన కర్మము- అకర్మమనగా కర్మములంజేయు

క యోగయుక్తుఁడుట- వీని యొక్క తత్త్వము తెలియశక్యమునుకాదు- అని శంకరభాష్యము.

కర్మమనఁగా మోక్షసాధనమైనది. వికర్మమనఁగా నిత్యనైమిత్తిక కామ్యరూపములచేతనును దానికి సాధనములగు ద్రవ్యసంపాదనాది రూపములచేతనును అనేకవిధములయినకర్మము- అకర్మ మనఁగా జ్ఞానము- వికర్మమున తెలియవలసినది ఏది అనఁగా,— నిత్యనైమిత్తిక కామ్య ద్రవ్యార్జనాదికర్మమున ఫలభేదములవలన వచ్చిన నానావిధత్వమును విడచి మోక్షమే ఫలము అనునట్లు ఏకశాస్త్రార్థత్వమును అనుసంధానము చేయుట- ఇది, వ్యవసాయాత్మికా బుద్ధిః (అ౨॥౪౧శ్లో॥) అను శ్లోకమున వివరింపఁబడినది- అని రామానుజభాష్యము.

కర్మవికర్మములు విహితనిషిద్ధకర్మములు- అకర్మ మనఁగా కర్మమును చేయకపోవుట- అని మధ్వభాష్యము.

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః।
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్॥

యః కర్మణి అకర్మ పశ్యేత్ = ఎవ్వఁడు కర్మమున అకర్మమును చూచునో, యః అకర్మణి కర్మ చ పశ్యేత్ = ఎవ్వఁడు అకర్మమున కర్మమును చూచునో, సః మనుష్యేషు బుద్ధిమాన్ = వాఁడు మనుష్యులలో బుద్ధిమంతుఁడు- సః యుక్తః = వాఁడు యోగయుక్తవాఁడు- సః కృత్స్నకర్మకృత్ = వాఁడు అన్నికర్మములం జేయువాఁడు.

కర్మమనఁగా లోకులు చేసెడి వ్యాపారము(పని)- అకర్మమనఁగా లోకులు పనులు చేయక ఊరక యుండుట. అనఁగా నేను పనులేమియు లేక సుఖముగానున్నానను కొనుట- ఈ రెండును అవిద్య(అజ్ఞానము) వలన ఆత్మకు కలిగిన అధ్యాసమనెడి సంసారభ్రాంతిలో చేరినవియె- ఆత్మను ఒకక్రియకు(పనికి) కర్త(Agent) యగునుయనెడు కర్తృత్వము, దేహము కాఁబట్టి లోకులు చేసెడిపని ఆత్మయొక్క కర్మము కాదనియు, అట్లే, పనులు లేక సుఖముగా నున్నాననుకొనుట, నేను ఉన్నాను అని కర్తృత్వముతోఁ గూడియుండుటచేత కర్మమె యనియును, ఎవ్వఁ డెఱుంగునో, వాఁడు పండితుఁడును, యోగియును, అన్ని కర్మములును చేసినవాఁడును. ఒకఁడు యోడ కొందఱుజనుల నెక్కించికొని

వేకవిషయకంబగు బుద్ధిచేత ఆత్మకంటె మిగిలినవానినన్నిటినుండియు మరలినిపొంది, మనస్సును ఆత్మయందుంచి దేనిని తలంపకుండునది-అని రామానుజభాష్యము.

సర్వాన్ అనుదానికి అన్నివిషయములైన అనియర్థము-అశేషతః అనుటవలన ఒక్కవిషయముగల కామమునుగూడ స్వల్పముగానైనను ఒకానొకప్పుడైనను చేయఁగూడదనుట- ఏవ అనుశబ్దము మనస్సుచేతనే నియమింపశక్యమగును గాని మతియొక్కదానిచేత కాదని తెలియఁజేయును- బుద్ధి,మనస్సును నిగ్రహించుటయందును ఆత్మరమణము(ఆత్మయందు క్రీడించుట)నందును సాధనము - అని మధ్వభాష్యము.

యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చల మస్థిరమ్।
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్॥౨౬॥

చఞ్చలమ్ అస్థిరమ్ మనః=చంచలమైనదియును (కావుననె)స్థిరముగా నిదియునగు మనస్సు, యతోయతః నిశ్చరతి=ఏయేవిషయమునిమిత్తము బయలువెడలుచున్నదో, తతస్తతః ఏతత్ నియమ్య=దానిదాని నుండి దీనిని(మనస్సును) మరలించి, ఆత్మన్యేవ వశం నయేత్=ఆత్మవిషయముననె వశమును పొందింపవలయును.

మనస్సును విషయములనుండి నియమించి, అనఁగా, యథార్థస్థితిని తెలిసికొనుటచే ఆయావిషయముల ఆభాసమును(భ్రాంతివలనఁ దెలియఁబడినదాని)గాఁ జేయుచుండి, వైరాగ్యమును భావించుటచేత మనస్సునకు ఆత్మవశ్యతను కలుగఁజేయునది. ఇట్లు యోగాభ్యాసబలమున యోగియొక్క మనస్సు ఆత్మయందె శాంతినిపొందుచున్నది- అని శంకరభాష్యము.

ఆత్మయందు మిక్కుటమైన సుఖమును భావించుటచే మనస్సును వశ్యమునుగాఁజేయునది- అని రామానుజభాష్యము

యతోయతః=ఎచ్చటనెచ్చట- ఆత్మన్యేవవశంనయేత్ =ఆత్మవిషయముననె వశీకరించునది- అని మధ్వభాష్యము.

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్।
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్॥౨౭॥

ప్రశాన్తమనసం శాన్తరజసం బ్రహ్మభూతమ్ అకల్మషమ్ ఏనం

యోగినమ్ = శాంతినిపొందినమనస్సు కలవాఁడును శాంతినిపొందినరజోగుణముకలవాఁడును బ్రహ్మమైనవాఁడును కల్మషములేనివాఁడునగు ఈ యోగిని, ఉత్తమమ్ సుఖమ్ ఉపైతిహి = గొప్ప సుఖము పొందుచున్నదిగదా.

శాంతరజస్సు-అనఁగా పోయినమోహాదిక్లేశములుకలవాఁడనుట- బ్రహ్మభూతుఁడుఅనఁగా జీవన్ముక్తుఁడు(బ్రహ్మమునుచుండియె ముక్తిని జెందినవాఁడు), అంతయు బ్రహ్మమె అనెడినిశ్చయముకలవాఁడు-అకల్మషుఁడనఁగా ధర్మాధర్మము(పుణ్యము) మొదలగునవిలేనివాఁడు. అని శంకరభాష్యము.

ప్రశాన్తమనస్సుఅనఁగా ఆత్మయందునిశ్చలముగా ఉన్నఁబడినమనస్సుకలవాఁడును, దానివలననె రజోగుణములేనివాఁడును, దానివలననె బ్రహ్మభూతుఁడు అనఁగా తనస్వరూపముతో నున్నవాఁడునగుయోగిని ఆత్మానుభవరూపమగు ఉత్తమసుఖము పొందుచున్నది- ఆత్మస్వరూపముఉత్తమసుఖరూపమగుటదీనికి హేతువు, అనిహిశబ్దము తెలియఁజేయుచున్నది- అని రామానుజభాష్యము-

ఏవం యుఞ్జన్ సదాఽత్మానం యోగీ విగతకల్మషః।
సుఖేనబ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖ మశ్నుతే॥౨౮॥

ఏవమ్ సదా ఆత్మానం యుఞ్జన్ = ఇట్లు ఎప్పుడును ఆత్మనుగూర్చి యోగమును జేయుచున్నవాఁడై, విగతకల్మషః యోగీ = పోయినపాపములుగల యోగి, బ్రహ్మసంస్పర్శమ్ అత్యన్తం సుఖమ్ సుఖేన అశ్నుతె = బ్రహ్మసంబంధియగు గొప్ప సుఖమును అనాయాసముగఁ బొందుచున్నాఁడు.

విఘ్నములులేకుండ నిట్లు యోగమును ఆచరించుచున్నవాఁడై-అత్యంతమనఁగా అంతమునతిక్రమించినది- నాశములేనిదనుట- అని శంకరభాష్యము- యుఞ్జన్నేవం అని శంకరభాష్య పుస్తకములలో పాఠము.

కల్మషములనఁగా ప్రాచీన పాపములు-బ్రహ్మసంస్పర్శమనఁగా బ్రహ్మానుభవరూపమైనదనుట- సదా అశ్నుతే = ఎల్లప్పుడును పొందుచున్నాఁడు అని రామానుజభాష్యము.

ఈశ్లోకమునపూర్వశ్లోకమునఁ జెప్పఁబడినదెవిస్తరింపఁజేయఁబడిన

ది- అని మధ్వభాష్యము-

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥౨౯॥

యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః=యోగముతోఁగూడినయంతఃకరణముకలవాఁడై అంతట సమబుద్ధికలవాఁడు, ఆత్మానం సర్వభూతస్థమ్=ఆత్మను అన్నిభూతములయందున్నవానిగానును, సర్వభూతాని ఆత్మని చ=అన్నిభూతములను ఆత్మయందు(ఉన్నవానిగాను)ను, ఈక్షతే=చూచుచున్నాఁడు.

యోగమునకుగొప్పఫలమై సంసారముపోవుటకు కారణమైన, బ్రహ్మమొక్కటియెకలదనెడిజ్ఞానము, ఈశ్లోకముచేఁజూపఁబడుచున్నది- తనయాత్మను అన్నిభూతములలోనున్నవానినిగానును, బ్రహ్మమొదలుకొనిస్తంబమువఱకు నుండెడి అన్నిభూతములునుఆత్మయందు ఏకత్వమును పొందినవానినిగానును, చూచుచున్నాఁడు- అంతటసమబుద్ధికలవాఁడనఁగా బ్రహ్మమొదలుకొనిస్థావరముల (చెట్లుమొదలుగునవి) వఱకును హెచ్చుతగ్గులుగానున్నయన్నిభూతములయందును, నిర్విశేషమై వికారములు లేనిదైన బ్రహ్మంబును ఆత్మయునైనయొక్కటియె అనెడిజ్ఞానముకలవాఁడు- అనిశంకరభాష్యము-

ఇఁకనాలుగుశ్లోకములచే యోగముయొక్క నాలుగుపరిపాకదశలు చెప్పఁబడుచున్నవి- తనయాత్మయును మిగిలినయన్నిభూతములయాత్మలును ప్రకృతిసంబంధములేని స్వరూపముంబట్టి జ్ఞానమొక్కటియె యాకారముగాఁగలుగుటచే సమానులగుటనును, వైషమ్యముప్రకృతియందున్నదగుటనను, యోగముతోఁగూడినమనస్సుకలవాఁడు, ఆత్మలయందంతటను సమము జ్ఞానైకాకారులు అనెడిసమబుద్ధికలవాఁడై తనయాత్మను అన్నిభూతములలోనున్నవానినిగానును అన్నిభూతములను తనయాత్మయందున్నవానిగానునును చూచుచున్నాఁడు- తనయాత్మను అన్నిభూతములతో సమానమైనయాకారముకలవానినిగానును, తనయాత్మతోసమానమైన ఆకారముకలవానిగానన్నిభూతములనును చూచుచున్నాఁడని యర్థము- ఒకఁడు యాత్మవస్తువునుచూచినచో ఆత్మవస్తువంతయు దానితో సమానమైనదగుటను ఆత్మవస్తువంత

యు చూడఁబడినదగుచున్నదియనుట- అని రామానుజభాష్యము.

ఈశ్లోకముచే ధ్యేయము (ధ్యానము చేయఁబడవలసినది) చెప్పఁబడుచున్నది- ఆత్మను అనఁగా పరమేశ్వరుని అన్ని భూతములలో నున్నవానినిగాను, ఆత్మయందు అనఁగా పరమేశ్వరునియందు సర్వభూతములను, ఆపరమేశ్వరుని బ్రహ్మతృణము మొదలగు నన్నిటియందు ఐశ్వర్యము మొదలగు సామ్యముతోడను చూచుచున్నాఁడు- అని మధ్వభాష్యము.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ ౩౦॥

యః=ఎవ్వఁడు, మాం సర్వత్ర పశ్యతి=నన్ను అంతట చూచుచున్నాఁడో, మయి సర్వం చ పశ్యతి=నాయందు సమస్తమును చూచుచున్నాఁడో, తస్య అహం న ప్రణశ్యామి=వానికి నేను కనఁబడకపోను- స చ మే న ప్రణశ్యతి=వాఁడును నాకు కనఁబడకపోఁడు.

వెనుక చెప్పఁబడిన ఆత్మైకత్వదర్శనమునకు ఫలము ఈశ్లోకమున చెప్పఁబడుచున్నది- అన్నిటికిని ఆత్మయైన వాసుదేవుఁడనైన నన్ను అన్ని భూతములయందును, అన్నిభూతములను సర్వాత్మనైన నాయందును, చూచుచుండెడి ఆత్మైకత్వదర్శికి, నేను పరోక్షుఁడను గాను- నాకు అజ్ఞాని యు పరోక్షుఁడు గాఁడు- వానికిని నాకును ఆత్మయొకటియే- తన యాత్మ తనకు ప్రియుఁడే కదా- అని శంకరభాష్యము.

వెనుకటివశకంటె విపాకదశను పొందినవాఁడు, పుణ్యపాపములు వదలి స్వరూపమున నున్న యాత్మవస్తువంతయు నాతో (భగవంతునితో) సమానమని చూచుచున్నాఁడు- (వెనుకటిశ్లోకముచొప్పున నె యన్వయము) అని రామానుజభాష్యము-

ఫలము చెప్పఁబడుచున్నది- వానికి నేను (నప్రణశ్యామి) ఎల్లప్పుడును యోగక్షేమములను వహించినవాఁడనగుదును- వాఁడు నాకు (నప్రణశ్యతి) ఎల్లప్పుడును భక్తుఁడగును- పలుకయున్నను వీనిని రక్షింపకున్నచో ఓఁడుఁ నాథుఁడె- ఇట్టి భృత్యుఁడున్నను భృత్యుఁడు లేనివాఁడే- అని మధ్వభాష్యము

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః।

సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥ ౩౧॥

యః ఏకత్వమ్ ఆస్థితః (సన్)=ఎవ్వఁడు ఏకత్వమును పొందినవాఁడు(అగుచు), సర్వభూతస్థితం మాం భజతి=అన్నిభూతములయందునున్న నన్ను సేవింపుచున్నాఁడో, సః యోగీ=ఆ యోగి, సర్వథా వర్తమానోఽపి మయి వర్తతే=అన్నిప్రకారములను ఉన్నవాఁడైనను నాయందె ఉన్నాఁడు.

ఏకత్వముననున్నవాఁడనఁగా సర్వాత్మైకత్వమును తెలిసికొనువాఁడు- వాఁడు ఏప్రకారమున్నను వైష్ణవ పరమపదమైన నాయందు ఉన్నవాఁడె- వాఁడునిత్యముక్తుఁడె- మోక్షమునుగూర్చి దేనిచేతను ప్రతిబంధింపఁబడఁడు, అనియర్థము- అనిశంకరభాష్యము.

ఏకత్వమును పొందినవాఁడె యనఁగా, సంకోచము లేని జ్ఞానమె యాకారముగాఁగలవాఁడగుటచేత ప్రాకృతభేదములను విడిచినవాఁడైయనుట- ఇట్టివాఁడె సర్వభూతములయందున్న నన్ను, యోగదశయందు దృఢముగానెవ్వఁడు భజించునో, వాఁడు వ్యుత్థాన(యోగము లేని)దశయందును, తనయాత్మను సర్వభూతములను చూచుచున్నవాఁడైనను నాయందెయున్నాఁడు- అనఁగా నన్నెచూచుచున్నాఁడు- తనయాత్మయందును సమస్త భూతములయందును ఎల్లప్పుడును నాసామ్యమునె చూచుచున్నాఁడనిఫలితార్థము- ఇది వెనుకటిశ్లోకపుదానికంటెను పరిపాకమునుపొందినదశ- అనిరామానుజభాష్యము.

వెనుకటిశ్లోకమునఁజెప్పఁబడినదె స్పష్టపఱుపఁబడుచున్నది- ఏకత్వమును పొందినవాఁడు అనఁగా అంతటను ఈశ్వరుఁడు ఒక్కఁడెఅని యున్నవాఁడు, అన్నిప్రకారములనున్నవాఁడైనను నాయందె యున్నాఁడు- అపరోక్షజ్ఞానముకలవానికిజ్ఞానఫలము తప్పనిదియని యర్థము- అట్లయినను తలుచుగా నధర్మమును చేయఁడు- అనిమధ్వభాష్యము.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యదివా దుఃఖం స యోగీ పరమో మతః॥ ౩౨॥

(హే) అర్జున! =(ఓ) యర్జునుఁడా!, సుఖం వా దుఃఖం యదివా

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం యః పశ్యతి=సుఖమునైనను దుః
ఖమునైనను తనసాటితోడ అంతట సమముగా ఎవ్వఁడు చూచుచు
న్నాఁడో, సః పరమః యోగీ మతః=వాఁడు గొప్ప యోగిగా తలం
పఁబడినాఁడు.

నాకు సుఖమెట్లు అనుకూలమో (ఇష్టమో), అట్లు అన్నిప్రాణులకు
నుసుఖము అనుకూలము, దుఃఖము ప్రతికూలము (అనిష్టము), అని తెలిసికొ
నినవాఁడై, ఎవ్వనికిని ప్రతికూలము చేయక, అహింసకుఁడైయుండె
డియోగి అందఱుయోగులలో నుత్తముఁడు- అని శంకరభాష్యము.

ఆత్మలందఱును జ్ఞానమైకస్వరూపముగాఁగలవారగుటచేత పుత్రజ
న్మాది సుఖంబును పుత్రమరణాదిదుఃఖంబును ఆత్మలకు సంబంధింపవి
అనియెవ్వఁడుతలంచునో, అనఁగా ఒరునికి కలిగినపుత్రజన్మ మరణాది
కముల వలెనే తనపుత్రజన్మమరణాదికమునుగూడ సమముగా నెవ్వఁ
డుతలంచునో, వాఁడు యోగపరమావధిని పొందినవాఁడు- అని రామా
నుజభాష్యము.

సామ్యమును మఱియొకవిధమున ఈశ్లోకము వివరింపుచున్నది- అ
ని మధ్వభాష్యము.

అర్జున ఉవాచ.

యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన;
ఏతస్యాహం నపశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్॥33॥

(హే) మధుసూదన!=(ఓ) శ్రీకృష్ణుఁడా!, సామ్యేన యోఽయం యో
గః త్వయా ప్రోక్తః=సామ్యముచేత ఏయీ యోగము నీచేత చెప్పఁ
బడినదో. (మనసః) చఞ్చలత్వాత్=(మనస్సు) చంచలమగుటవలన,
ఏతస్య స్థిరాం స్థితిం నపశ్యామి=ఈయోగముయొక్క స్థిరమైన
ఉనికిని కానకున్నాను.

దేవతలు మనుష్యులు అనెడి భేదంబును, జీవుఁడు ఈశ్వరుఁడు అ
నెడి భేదంబును చాలకాలమునుండి అనుభవింపఁబడుచుండుటచే, జ్ఞా
నైకస్వరూపులగుటచే జీవులందఱును పరస్పరము సములనియు, కర్మ
వశ్యులుకాకుండుటచే ఈశ్వరునితో సములనియు తలంచుటయనెడి,
నీచేఁజెప్పఁబడినయోగము స్థిరపడుట సంభవింపదని తోచుచున్నది-

అని రామానుజభాష్యము.

చఞ్చలంహి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥ ౩౪॥

(హే) కృష్ణ!=(ఓ)కృష్ణుఁడా!, మనః=మనస్సు, చఞ్చలమ్ ప్రమాథి బలవత్ దృఢంహి=నిలకడలేనిదియు క్షోభపెట్టునదియు ప్రబలమైనదియు గట్టిదియునుగదా- వాయోః ఇవ తస్య నిగ్రహం సుదుష్కరమ్ అహం మన్యే=వాయువునువలె దానిని నిగ్రహించుటను మిక్కిలి యసాధ్యమైనదానిగా నేను తలంచుచున్నాను.

కృష్(గీయు) అనిధాతువు- కృష్ణుఁడనఁగా భక్తజనముల పాపాది దోషములనుపోఁగొట్టువాఁడు- ప్రమాథియనఁగా శరీరములను ఇంద్రియములనుగూడ పరవశముగాఁజేయునది- బలవత్తనఁగా ఎవ్వఁడును నియమించుటకుశక్యముకానిది- దృఢమనఁగా తంతునాగమువలె తెగఁగొట్ట శక్యముకానిది- అని శంకరభాష్యము (తంతునాగమనునది నదులు మడుగులు మొదలగువానిలో పొడవుగా కానెకోశ్వలెనుండెడి యొకజంతువు- అదిమనుష్యులుపశువులు మొదలగునవి నీటిలో ఈదుచున్నప్పుడు వానికాళ్లకుచుట్టుకొనును- దానివలన ఆజంతువులు మునిఁగిపోవును)

తనకుఅలవాటుపడియున్న విషయములలోఁగూడ నిలుకడలేనిదైన మనస్సును అట్టిదికాని ఆత్మస్వరూపమున నిలుపుటను, ఎదురుగాలిని విసనకఱ్ఱ మొదలగుదానితో నిలుపుటవలెమిక్కిలిదుస్సాధమనుగాఁదలంచెదను- మనోనిగ్రహోపాయమును చెప్పవలయుననియభిప్రాయము- అని రామానుజభాష్యము.

శ్రీభగవానువాచ-

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్।
అభ్యాసేనతు కౌన్తేయ వైరాగ్యేణచ గృహ్యతే॥ ౩౫॥

(హే)మహాబాహో!=(ఓ)గొప్పభుజములుకలవాఁడా!, మనః చలమ్ దుర్నిగ్రహంచ=మనస్సు చంచలమైనదియు (కావుననె) నిగ్రహింపశక్యముకానిదియును, అసంశయమ్=సంశయములేదు- కింతు=ఇఁకనేమన్నను,— (హే) కౌన్తేయ!=(ఓ)కున్తీపుత్రుఁడా!, అభ్యాసేన వైరాగ్యేణచ గృహ్యతే=అభ్యాసముచేతనను వైరా

గ్యముచేతనును నిగ్రహింపఁబడుచున్నది.

అభ్యాసమనఁగా చిత్తమున సమానమైనజ్ఞానమును ఆవృత్తిచేయుచుండుట(ధ్యానము)- వైరాగ్యమనఁగా విషయములయందుదోషములను తెలిసికొనుచుండుటచేఁగలిగెడి నిరాశ- ఈ రెంటిచేనును చిత్తముయొక్క విక్షేపము నిగ్రహింపఁబడుచున్నది- అని శంకరభాష్యము.

ఆత్మగుణస్వరూపమగుట నభ్యసించుటచే నాత్మయందుఁగలిగిన యాభిముఖ్యముచేతనును, ఆత్మకంటెమిగిలినవానియందు దోషాకరత్వమును తెలిసికొనుటచేఁగలిగిన వైతృష్ణ్యము(నిరాశ)వల్లనను, ఒకానొకవిధమున మనస్సుగ్రహింపఁబడును- అని రామానుజభాష్యము.

ఒకరూపమును మనస్సుస్వయముగా నిగ్రహింపఁబడదు- అనిమధ్వభాష్యము.

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనాతు యతతా శక్యోఽవాప్తుముపాయతః॥౩౬

అసంయతాత్మనా యోగః దుష్ప్రాపః=నియమింపఁబడనియంతఃకరణముకలవానిచే యోగము పొందశక్యముకానిది, ఇతి మే మతిః=అని నా తాత్పర్యము- యతతా వశ్యాత్మనాతు=ప్రయత్నముచేయుచున్నవాఁడై స్వాధీనమైనయంతఃకరణముకలవానిచే, ఉపాయతః అవాప్తుం శక్యః=ఉపాయమువలన పొందశక్యమైనది.

అభ్యాసవైరాగ్యములచేత స్వాధీనముచేయఁబడిన యంతఃకరణముకలవాఁడు వశ్యాత్మ-అట్టివాఁడు కానివాఁడు అసంయతాత్మ-అనిశంకరభాష్యము.

అసంయతాత్మయనఁగా జయింపఁబడనిమనస్సుకలవాఁడు- (ఉపాయతః)జ్ఞానము అంతర్భవించియున్న కర్మముచేత (వశ్యాత్మనా)జయింపఁబడినమనస్సుకలవానిచేత-అనిరామానుజభాష్యము.

అర్జునఉవాచ

అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి॥౩౭॥

(హే)కృష్ణ!=(ఓ)కృష్ణుఁడా! అయతిః=ప్రయత్నము లేనివాఁడును, శ్రద్ధయా ఉపేతః=నమ్మకముతో కూడినవాఁడును, యోగాత్ చలిత

మానసః=యోగమునుండి తప్పినమనస్సుకలవాఁడునగువాఁడు, యోగసంసిద్ధిమ్ అప్రాప్య=యోగసిద్ధిని పొందక, కాం గతిం గచ్ఛతి=ఏ గతిని పొందుచున్నాఁడు.

యోగాభ్యాసమును అంగీకరించుటచేత ఇహలోక పరలోకములరెంటిని పొందఁదగిన కర్మములు విడువఁబడినవి- యోగసిద్ధికిఫలమై మోక్షసాధనమైనసమ్యగ్జ్ఞానముపొందఁబడలేదు- ఇట్టి యోగి,మరణకాలమున యోగమార్గమునుండి తప్పిన చిత్తముకలవాఁడు, ఏగతిని పొందును- అనిశంకరభాష్యము

శ్రద్ధచేత యోగమునఁబ్రవర్తించినవాఁడు మిక్కిలిదృఢమైనయభ్యాసమ నెడియత్నము లేని వాఁడై యోగసిద్ధినిపొందక యోగమునుండి చలించిన మనస్సుకలవాఁడైపనుగును- అని రామానుజభాష్యము.

కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి॥ ౩౮॥

(హే) మహాబాహో!=(ఓ)గొప్పభుజములుకలవాఁడా!, అప్రతిష్ఠః=ఆధారము లేనివాఁడును, బ్రహ్మణః పథి విమూఢః=బ్రహ్మయొక్క మార్గమునందు మోహముంజెందినవాఁడునై, ఉభయవిభ్రష్టః=రెంటంజెడ్డవాఁడై, ఛిన్నాభ్రమివ, ననశ్యతికచ్చిత్= విడిన మేఘము వలె నశింపఁడుగదా-

ఉభయమనఁగా కర్మమార్గంబును యోగమార్గంబును- అనిశంకరభాష్యము.

స్వర్గాదిసాధనమైనకర్మము, వీనికిఫలాభిసంధి(ఫలవుకోరిక) లేకపోవుటచేత, తనఫలమును కలుగఁజేసి వీనికి ఆధారముకాదు గాన ఈ యోగి అప్రతిష్ఠుఁడనఁబడుచున్నాఁడు- వీడు తనచే నారంభింపఁబడిన బ్రహ్మమార్గమునుండితప్పినవాఁడుగూడ గాన ఉభయవిభ్రష్టుఁడనఁబడుచున్నాఁడు- ఛిన్నాభ్రమువలె నశించుటయనఁగా మేఘపు తునియ ఒకగొప్పమేఘమునుండి విడినదై రెండవ మేఘమును చేరకయె నడుమనే నశించినట్లు నశించుట- అని రామానుజభాష్యము.

ఏతన్మే సంశయం కృష్ణ చ్ఛేత్తు మర్హస్యశేషతః।
త్వదన్య స్సంశయస్యాస్య చ్ఛేత్తా న హ్యుపపద్యతే॥ ౩౯॥

(హే) కృష్ణ!=(ఓ) కృష్ణుఁడా, మే ఏతం సంశయమ్=నా యొక్క-ఈ సంశయమును, అశేషతః ఛేత్తుమ్ అర్హసి=నిశ్శేషముగా తెగఁగొట్టను తగుచున్నావు- త్వదన్యః=నీకంటెనితరుఁడు, అస్య సంశయస్య ఛేత్తా నోపపద్యతే=ఈ సంశయమును తెగఁగొట్టువాఁడు కుదురఁడు.

ఛేత్తుమ్=పోఁగొట్టను- నీకంటెనితరుఁడైన ఋషియైనను దేవుఁడైనను- అని శంకరభాష్యము.

స్వయముగా ప్రత్యక్షముగా ఒకసారే అన్నిటినిచూచువాఁడవగు నీకంటె నితరుఁడు- అని రామానుజభాష్యము.

శ్రీభగవానువాచ.

పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్యవిద్యతే,
నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి॥౪౦॥

(హే) పార్థ!=(ఓ) యర్జునుఁడా!, తస్య=వానికి, వినాశః=చేటు, ఇహ నవిద్యతఏవ=ఈలోకమున బొత్తిగాలేదు- అముత్ర(చ) నవిద్యతే=పరలోకమందు(ను) లేదు- (హే) తాత!=(ఓ) తండ్రీ!, కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం నగచ్ఛతిహి=మంచిపనినిచేయువాఁడు ఒకఁడు (ను) చెడుగతిని పొందఁడుకదా.

వినాశమనఁగా మనపటిదానికంటె తక్కువపుట్టుకకలుగుట- శిష్యుఁడును కొడుకువంటివాఁడుగాన తండ్రీ! అనిపిలువఁబడుచున్నాఁడు-అని శంకరభాష్యము.

శ్రద్ధతో యోగము నారంభించి యోగమునుండి తప్పినవానికి, వినాశము అనఁగా స్వర్గాదిభోగములననుభవించుటలోఁగానీ బ్రహ్మానుభవంబునఁగానీ తానుకోరినదిదొరకకపోవుటయు ప్రత్యవాయముకలుగుటయును లేదు- అని రామానుజభాష్యము.

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో ఽభిజాయతే॥౪౧॥

యోగభ్రష్టః=యోగమునుండితప్పినవాఁడు, పుణ్యకృతాం లోకాన్ ప్రాప్య=పుణ్యముచేసినవారి లోకములను పొంది, శాశ్వతీః సమాః ఉషిత్వా=పెక్కు సంవత్సరములను ఉండి, శ్రీమతాం శుచీ

నాం గేహే అభిజాయతే॥ సంపదకలవారును పరిశుద్ధులును(అగు వారి) ఇంటను పుట్టుచున్నాఁడు.

యోగమార్గమునఁబ్రవర్తించిన సంన్యాసి అశ్వమేధాదులుచేసిన వారిలోకములనుబొంది, అచ్చటియనుభవము అయినతోడనె, శుచులు అనఁగా శాస్త్రోక్తముగా నాచరించువారియింటనుబుట్టుచున్నాఁడు- అనిశంకరభాష్యము.

ఎట్టి భోగమునుకోరుటచే యోగమునుండిజారునో అట్టిభోగములను యోగపుమహిమచేతనె అనుభవించి భోగములయందలి ఆశపోవునతోడనె యోగారంభమునుచేయుటకుతగినవారి ఇంటనుపుట్టుచున్నాఁడు- అనిరామానుజభాష్యము.

అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం॥౪౨॥

అథవా=లేక,ధీమతాం యోగినాం కులఏవ భవతి=జ్ఞానవంతులగు యోగుల వంశమందె పుట్టుచున్నాఁడు- ఈదృశం జన్మ యత్=ఇట్టి జన్మము ఏది(కలదో), లోకే ఏతత్ దుర్లభతరంహి=లోకమున ఇది మిక్కిలిదుర్లభమైనదికదా.

అథవా అనునది దరిద్రులయిన యోగులవంశమున అని తెలియఁజేయుచున్నది- అనిశంకరభాష్యము.

పరిపక్వమైన యోగముకలవాఁడైె చలించెనేని, యోగమునుచేయువారును స్వయముగానె యోగమునుపదేశింపతగినవారునగువారివంశమునఁబుట్టుచున్నాఁడు- (వెనుకటిశ్లోకమునఁజెప్పఁబడిన)యోగమునకు తగినవారియింటఁబుట్టుటయు (ఈశ్లోకమునఁజెప్పఁబడిన) యోగముకలవారివంశమునఁబుట్టుటయుఁగూడ లోకంబున ప్రాకృతులకు మిక్కిలి దుర్లభమైనవి- అనిరామానుజభాష్యము-

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్।
యతతేచ తతో భూయః సంసిద్ధౌ కురునందన॥౪౩॥
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపిసః॥౪౩½॥

తత్ర=అచ్చటనె, పౌర్వదైహికం తం బుద్ధిసంయోగమ్ లభతే=వెనుకటిశరీరపుదైన ఆ బుద్ధిసంబంధమును పొందుచున్నాఁడు- (హే)

కురునన్దన!=(ఓ)కౌరవుఁడా!, తతశ్చ సంసిద్ధౌ భూయః యత తే=దానివలను సిద్ధివిషయమున మిక్కిలి ప్రయత్నముచేయుచున్నాఁడు. సః అవశోఽపి=అతఁడు పరవశుఁడైనను, తేన పూర్వాభ్యాసేనైవ హ్రియతే=ఆ పూర్వాభ్యాసముచేతనె హరింపఁబడుచున్నాఁడు.

తత్ర=ఆ యోగికులమున, తతః=ఆపూర్వ సంస్కారము వలన-యోగాభ్యాసమువలనఁగలిగినసంస్కారము కంటె బలవత్తరమైన అధర్మాదికర్మము చేయఁబడకుండెనేని యోగాభ్యాససంస్కారముచే నీయోగభ్రష్టుఁడు హరింపఁబడుచున్నాఁడు. బలవత్తరమైనఅధర్మమెచేయఁబడినయెడను అధర్మముచేతనె యోగపుసంస్కారము తిరస్కరింపఁబడుచున్నది. ఆయధర్మము క్షయించినపైని ఎంతకాలమైయున్నను తిరిగియు యోగజసంస్కారము కార్యకరమగును. అని శంకరభాష్యము.

తత్ర=ఆజన్మమున, (తతః) అటుపైని, నిద్రపోయిలేచినట్లు (భూయః) వెండియు సిద్ధివిషయమున విఘ్నములచేనడ్డబడకుండునట్లు ప్రయత్నముచేయుచున్నాఁడు. ఈయోగమహాత్మ్యము (హి) ప్రసిద్ధమెకదా అనిరామానుజభాష్యము.

జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥౪౪॥

యోగస్య జిజ్ఞాసురపి=యోగమును తెలియఁగోరువాఁడును, శబ్దబ్రహ్మ అతివర్తతే=శబ్దబ్రహ్మమును అతిక్రమింపుచున్నాఁడు.

యోగస్వరూపమును తెలియఁగోరినవాఁడై యోగమార్గమునఁబ్రవర్తించిన సంన్యాసి, యోగభ్రష్టుఁడైనను శబ్దబ్రహ్మమును అనఁగా వేదమునందు చెప్పఁబడిన కర్మానుష్ఠానమును అతిక్రమింపుచున్నాఁడు. ఇట్టివాఁడె ఇట్లగుచుండఁగా ఇఁక యోగమును దెలిసికొని యోగనిష్ఠుఁడై యోగాభ్యాసమును చేయుచున్నవానిఁగూర్చి చెప్పవలసినదేమున్నది! అని శంకరభాష్యము.

యోగమునఁబ్రవర్తింపకపోయినను యోగముందెలియఁగోరి దానినుండితప్పినపుననస్సకలవాఁడు వెండియును ఆకోరికనె పొంది కర్మయోగము మొదలగు యోగమునుఆచరించి, శబ్దబ్రహ్మమును అతిక్ర

మింపుచున్నాఁడు- శబ్దబ్రహ్మమనఁగా దేవుఁడు మనుష్యుఁడు భూమి ఆకాశము స్వర్గముఅనియిట్లు శబ్దములచేఁ జెప్పఁబడఁదగినదైనప్రకృతి- దానినతిక్రమించుటయనఁగా ప్రకృతిబంధమువదలినవాఁడై దేవమనుష్యాదిశబ్దములచేఁ జెప్పఁదగని జ్ఞానానందైకస్వరూపమైన యాత్మనుపొందుట- అనిరామానుజభాష్యము.

నాకుయోగము తెలియవలయునని మిక్కిలికోరికగలవాఁడుకూడ (శబ్దబ్రహ్మ) పరబ్రహ్మమును (అతివర్తతే) పొందుచున్నాఁడనియర్థము-అనిమధ్వభాష్యము.

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్॥౪౫॥

ప్రయత్నాత్ యతమానః యోగీతు=ప్రయత్నమువలన యత్నము చేయుచున్న యోగి, సంశుద్ధకిల్బిషః అనేకజన్మసంసిద్ధః=పోయిన పాపములుకలవాఁడును అనేకజన్మములయందుసిద్ధినిపొందినవాఁడునై, తతః పరాం గతిం యాతి=అటుపైని గొప్ప గతిని పొందుచున్నాఁడు.

ప్రయత్నమువలన యత్నముచేయుచున్నవాఁడనఁగా మిక్కిలియత్నము చేయుచున్నవాఁడు- యోగియనఁగా తెలిసినవాఁడు- అనేకజన్మములయందుకొంచెముకొంచెము సంస్కారములను సంపాదించికొని దానిచేతసిద్ధినిపొందినవాఁడు దానివలన మంచిజ్ఞానముకలిగి గొప్పగతినిపొందుచున్నాఁడు- అనిశంకరభాష్యము.

యోగమాహాత్మ్యమిట్టిదిగావునననేకజన్మములయందు సంపాదింపఁబడినపుణ్యసముదాయములచేత పాపములులేనివాఁడై యత్నము చేయుచున్నయోగి చలించినను తిరిగియు పరమగతినిపొందును- అనిరామానుజభాష్యము.

తెలియఁగోరినవాఁడు, తెలిసికొనిప్రయత్నముంజేయును- ఇట్లు అనేకజన్మములచే సిద్ధినిపొందినవాఁడై అపరోక్షజ్ఞానియై గొప్పగతి పొందుచున్నాఁడు- అనిమధ్వభాష్యము.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః।
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున॥౪౬॥

యోగీ తపస్విభ్యః అధికః=యోగి తపస్సుకలవారలకంటె అధికుఁడు- జ్ఞానిభ్యోపి అధికః మతః=జ్ఞానులకంటెను అధికుఁడుగా తలంపఁబడినాఁడు- యోగీ కర్మిభ్యశ్చ అధికః=యోగి కర్మములుకలవారలకంటెను అధికుఁడు- (హే)అర్జున!=(ఓ)యర్జునుఁడా!, తస్మాత్ యోగీ భవ=ఆహేతువువలన యోగివి కమ్ము.

జ్ఞానమనఁగా శాస్త్రార్థమందలి పాండిత్యము- కర్మములు అగ్నిహోత్రాదులు- అనిశంకరభాష్యము.

కేవలతపస్సులచేతను, ఆత్మజ్ఞానముకాక మిగిలినజ్ఞానములచేతనను, కేవలములయినయశ్వమేధము మొదలగు కర్మములచేతను, ఏయేపురుషార్థము(ఫలము)సాధింపఁబడునో, వానియన్నిటికన్నవధికమైనపురుషార్థమును సాధించునది యోగము- అనిరామానుజభాష్యము.

జ్ఞానులనఁగా యోగజ్ఞానముకలవారు- తపస్వులు అనఁగా కృచ్ఛ్రము మొదలగువానిని ఆచరించువారు- అనిమధ్వభాష్యము. (కృచ్ఛ్రమనఁగా గోమూత్రాదులను భక్షించి యుపవాసము చేయుట)

యోగినామపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥

సర్వేషాం యోగినామ్=అందఱు యోగులలోపల, యః శ్రద్ధావాన్ మద్గతేన అన్తరాత్మనా మామ్ భజతే=ఎవ్వఁడు శ్రద్ధకలవాఁడై నన్నుజేరిన అంతఃకరణముతో నన్ను భజింపుచున్నాఁడో, సః మే యుక్తతమః మతః=వాఁడు నాకు మిక్కిలియుక్తుఁడుగా తోఁచినవాఁడు.

శివుఁడు ఆదిత్యుఁడు మొదలగువారిని ధ్యానముచేయువారి యందఱిలోపలను వాసుదేవుఁడనైననాయందు సమాహితమైన అంతఃకరణముతో నన్ను సేవించువాఁడు మిక్కిలియుక్తుఁడు- అని శంకరభాష్యము.

వెనుక(౬అ॥౨౯- ౩౦- ౩౧- ౩౨శ్లో)నలుగురు యోగులు చెప్పఁబడిరి- వీరందఱును ప్రత్యగాత్మను (జీవుని) చూచువారు- వారికంటెను పరవిద్య (భగవదుపాసనము)నాచరించువాఁడు గొప్పవాఁడని ఈశ్లో

కము చెప్పుచున్నది- యోగినామ్ అనుదానికి యోగులకంటెననియర్థము- సర్వేషామ్ అనుదానికి తపస్వులు మొదలగు వారియందఱికంటెనుననియర్థము- ఆవగింజలు, వానిలో పరస్పరము హెచ్చుతగ్గులున్నను, మేరుపర్వతముంబట్టి క్రొద్దివగుటలోనెట్లు తుల్యములో అట్లు, యోగము తపస్సు మొదలగువానిలో- నన్యోన్యతారతమ్యమున్నను పరవిద్యకంటె తక్కువయగుటలో నన్నియు సమానములె- అంతరాత్మయనఁగా బాహ్యములును(వెలుపలివి)అభ్యంతరములును(లోపలివి)అగుప్రవృత్తివిశేషములకు ఆశ్రయమగుమనస్సు- నాయందుమిక్కిలి ప్రీతిగలవాఁడగుటచే నన్ను విడిచి ఆత్మనునిలిపికొనలేఁడుగాన నన్నుజేరినమనస్సుతో, శ్రద్ధావంతుఁడైయనఁగా ఒకక్షణమైనను నన్నువిడిచియుండ లేకపోవుటచేత నన్నుపొందుటకైనప్రవృత్తియందు త్వరకలవాఁడై ఎవ్వఁడునన్ను ఉపాసింపుచున్నాఁడో, వాఁడు అందఱికంటె శ్రేష్ఠుఁడని సర్వజ్ఞుఁడనైననేనె తలఁచుచున్నాను- అని రామానుజభాష్యము.

తపస్సులకంటెను యజ్ఞాదికర్మములకంటెనును ధ్యానయోగము విశేషింపుచున్నది- ఆధ్యానములలోఁగూడ ఆదిశేషుఁడు, లక్ష్మి, బ్రహ్మ శివుఁడు, మొదలగువారిధ్యానముకంటె విష్ణువుయొక్క ధ్యానము శ్రేష్ఠము- జ్ఞానములేనిధ్యానముకంటె జ్ఞానము శ్రేష్ఠము- కేవలజ్ఞానముకంటె జ్ఞానముతోఁగూడినధ్యానము శ్రేష్ఠము- ధ్యానముకంటెనుదర్శనము శ్రేష్ఠము- దర్శనముకంటెనును భక్తి [illegible] నసాధనములేదు- అనిమధ్వభాష్యము.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మ
సంయమయోగోనామషష్ఠోధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్ర
పాదకంబునుయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జున
సంవాదంబునగుభగవద్గీతలలో ఆత్మసం
యమయోగప్రతిపాదకంబగు
ఆఱవయధ్యాయము

---

గీతాభాష్యత్రయసారము.

ఏడవ యధ్యాయము

శ్రీభగవానువాచ.

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జన్మదాశ్రయః।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥

(హే) పార్థ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, మయి ఆసక్తమనాః మదాశ్రయః యోగం యుఞ్జన్=నాయందు ఆసక్తిగలమనస్సుకలవాఁడవును నేనుఆధారముగాఁగలవాఁడవునై యోగమును ఆచరింపుచున్నవాఁడవై (త్వమ్=నీవు,)మామ్ అసంశయమ్ సమగ్రమ్ యథా జ్ఞాస్యసి=నన్ను సంశయములేకుండునట్లును సంపూర్ణముగానును ఏప్రకారమున తెలిసికొనఁగలవో, తత్ శృణు=దానిని వినుము.

ఎవ్వఁడైనను ఒక్కపురుషార్థమును (ఫలమును)కోరువాఁడు దానికి సాధనమగు అగ్నిహోత్రాదికర్మమునైనను, తపస్సు ఈవి మొదలగుదానినైనను ఆధారమునుజేసికొనును- ఈయోగి మిగిలినసాధనములనువదలి నన్నే ఆశ్రయముగాతలంచును- నాయందె ఆసక్తికలవాఁడగును- సమగ్రమ్ మామ్=సంపూర్ణుఁడవైన నన్ను, అనఁగా విభూతులు బలము శక్తి ఐశ్వర్యము. మొదలగువానితోఁగూడిననన్ను అనుట- అనిశంకరభాష్యము.

ఆసక్తమనస్సు అనఁగా నాస్వరూపము గుణములు నావ్యాపారములు నావిభూతి వీనితోవిశ్లేషముగలిగినచో తత్క్షణమె నిలువలేని స్వభావముకలవాఁడగుటచే నాయందు దృఢముగా తగులుకొనిన మనస్సుకలవాఁడు- యోగమునాచరించువాఁడనఁగా యోగమునాచరించుటకుప్రవర్తించువాఁడు- యోగమునకువిషయమైన నన్ను ఎట్లు, తెలిసికొనునో అనఁగా విజ్ఞానముచేతతెలిసికొనునో ఆజ్ఞానమును వినుము- అనిరామానుజభాష్యము.

ఆసక్తమనస్సుఅనఁగా మిక్కిలి స్నేహముతోఁగూడినమనసుకలవాఁడు- నేనుఆశ్రయముగాఁగలవాఁడు అనఁగా భగవంతుఁడె నాచేత నన్నిటినిజేయింపుచున్నాఁడు, వాఁడె నాకు శరణము(రక్షకుఁడు), వానియందె నేను ఉన్నాఁడను అనియున్నవాఁడు- అని మధ్వ

భాష్యము.

జ్ఞానం తేహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే॥

అహమ్ తే=నేను నీకొఱకు, సవిజ్ఞానమ్ ఇదం జ్ఞానమ్=విజ్ఞానముతోఁగూడిన ఈ జ్ఞానమును, అశేషతః వక్ష్యామి=నిశ్శేషముగాను చెప్పఁగలను- యత్ జ్ఞాత్వా (స్థితస్య)=దేనిని తెలిసికొని (ఉన్నవానికి), ఇహ భూయః అన్యత్ జ్ఞాతవ్యం నావశిష్యతే=ఈవిషయమున తిరిగియు మఱియొకఁటి తెలియవలసినది మిగులదో.

విజ్ఞానమనఁగా స్వానుభవము (తనయనుభవము)- తత్త్వము నెఱిఁగినవాఁడు సర్వజ్ఞుఁడే- అనిశంకరభాష్యము.

విజ్ఞానమనఁగా భగవంతుఁడు మిగిలినచేతనాచేతనములన్నిటికంటె విలక్షణుఁడు అనెడిజ్ఞానము- అని రామానుజభాష్యము.

ఈ జ్ఞానమనఁగా నన్నుగుఱించిదిసజ్ఞానము- విజ్ఞానమనఁగా విశేషజ్ఞానము- అనిమధ్వభాష్యము-

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాంవేత్తి తత్త్వతః॥3॥

మనుష్యాణాం సహస్రేషు=మనుష్యుల వేలలో, కశ్చిత్ సిద్ధయె యతతి=ఒకానొకఁడు సిద్ధికొఱకు ప్రయత్నముచేయుచున్నాఁడు- యతతాం సిద్ధానామపి=ప్రయత్నముచేయుచున్న సిద్ధులలోఁగూడ, కశ్చిత్ మాం తత్త్వతః వేత్తి=ఒకానొకఁడు నన్ను తత్త్వముతో తెలిసికొనుచున్నాఁడు-

మోక్షముకొఱకు మోక్షమార్గమునఁబ్రవర్తింపుచున్నవారు సిద్ధిని పొందినవారేకదా- అనిశంకరభాష్యము.

మనుష్యులనఁగా శాస్త్రమునుఅధికరించుటకు (నేర్చికొనుటకు) తగినవారు- సిద్ధివఱకు ప్రయత్నముచేయువారివేలలో ఒకానొకఁడె నన్ను తెలిసికొని నావలనిసిద్ధికొఱకు ప్రయత్నముచేయుచున్నాఁడు- నన్ను తెలిసికొనవారి వేలలోనొకానొకఁడె నన్ను యథాస్థితిగానెఱుఁగువాఁడు- ఎవ్వఁడు నెటుఁగఁడని తాత్పర్యము- అని రామానుజభాష్యము.

ఈశ్లోకము జ్ఞానమర్లభత్వమును తెలియఁజేయును- అని మధ్వభాష్యము.

భూమి రాపోఽనలోవాయుః ఖం మనో బుద్ధిరేవచ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా॥౪॥

భూమిః ఆపః అనలః వాయుః ఖం మనః బుద్ధిః అహంకారశ్చ ఇతి అష్టధైవ=భూమియును నీళ్లును నిప్పును గాలియును ఆకాశంబును మనస్సును బుద్ధియును అహంకారంబును, అని ఎనిమిదివిధములుగానే, మేప్రకృతిః భిన్నా=నాప్రకృతి విభజింపఁబడినది.

. భూమి మొదలగునయిదింటిచేతను స్థూలభూతములు (పనకునఁబడెడి)నున్న మొదలుగునవి చెప్పంబడవు- తన్మాత్రములు (సూక్ష్మభూతములు) చెప్పఁబడును, మనస్సనఁగా మనస్సునకుఁగారణమైనయహంకారము- బుద్ధి శబ్దముచేత అహంకారమునకుకారణమైన మహత్తత్త్వంబును, అహంకారశబ్దముచేత అవిద్యతోఁగూడినయవ్యక్తంబును చెప్పఁబడును- ఈప్రకృతి నాయొక్క- ఈశ్వరమాయాశక్తి- అని శంకర భాష్యము.

ఈవిచిత్రమైన జగత్తుయొక్క ప్రకృతి(మూలము)పంచభూతములను మనస్సు మొదలగు నింద్రియమ్ములును మహదహంకారములునని యెనిమిదివిధములుగలది- అదినాయది- అనిరామానుజభాష్యము.

వెనుక ప్రతిజ్ఞచేయఁబడినజ్ఞానము చెప్పనారంభింపఁబడినది- మహత్తత్త్వమునకు అహంకారమననే యంతర్భావము- అని మధ్వభాష్యము.

అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మేపరామ్।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥

ఇయమ్ అపరా (ప్రకృతిః)=ఇది(భూమిమొదలుగునది) కొద్ది (ప్రకృతి) - (హే )మహాబాహో!=(ఓ)గొప్పభుజములుకలవాఁడా!, ఇతః అన్యామ్ జీవభూతాం ప్రకృతిమ్=ఇంతకంటెను ఇతరమైన జీవస్వరూపమైన ప్రకృతిని, మే పరాం (ప్రకృతిం) విద్ధి=నాయొక్క ఉత్కృష్టమైన(ప్రకృతినిగాను) తెలిసికొనుము- యయా ఇదంజగత్ ధార్యతే=దేనిచేత ఈజగత్తు ధరింపఁబడుచున్నదో.

కొద్దిది అనఁగా నికృష్టమైనది- అనఁగా అపరిశుద్ధమైనదియు సంసారస్వరూపమైనదియు బంధకస్వరూపమైనదియు ననుట- నాయొకట యనఁగా నాకు ఆత్మయైనదియనుట- జీవుఁడనఁగా ప్రాణములనిలిచియుండుటకునిమిత్తమైన క్షేత్రజ్ఞుఁడు- ప్రత్యగాత్మ క్షేత్రజ్ఞుఁడు లోపలఁజొచ్చియుండుటచేత ఈజగత్తు నిలిచియున్నదో- అని శంకరభాష్యము.

పర యనఁగా భోక్త (అనుభవించువాఁడు)అగుటచే ప్రధానమైనది- జగత్తనఁగా అచేతనము- అని రామానుజభాష్యము-

జీవభూతయనఁగాలక్ష్మి- అనిమధ్వభాష్యము-

ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా॥౬॥

సర్వాణి భూతాని ఏతద్యోనీని=అన్ని భూతములును ఇవి(రెండు ప్రకృతులును) కారణముగాగలవి, ఇతి ఉపధారయ=అని తలంపుము. అహం కృత్స్నస్య జగతః ప్రభవః=నేను సమస్తమైన జగత్తునకు ఉత్పత్తికారణమైనవాఁడను, తథా ప్రళయః=అట్లె నాశకారణమైన వాఁడను.

క్షేత్రజ్ఞులనెడి, నాయొక్క రెండుప్రకృతులును, జగత్తునకు కారణముగాన, వానిద్వారమున సర్వజ్ఞుఁడనైన ఈశ్వరుఁడనైన నేనే జగత్తునకు ఉత్పత్తికారణమైనవాఁడను- అని శంకరభాష్యము.

భూతములుఅనఁగా బ్రహ్మాదిస్తంబపర్యంతములైనవి- నాప్రకృతులవలనఁగలిగినవిగాన నవియన్నియునావియె- నేను వానికిశేషినైనవాఁడను- అని రామానుజభాష్యము.

ఉనికికిని తెలియఁబడుటకును కారణమగుటను ప్రభవను మొదలగునదియగుచున్నాను- అనిమధ్వభాష్యము.

మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనఞ్జయ।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥౭॥

(హే) ధనఞ్జయ!=(ఓ)యర్జునుఁడా!, మత్తః పరతరమ్=నాకంటె గొప్పదైనది, అన్యత్ కిఞ్చిత్ నాస్తి=ఇతరమైనది ఒకానొకటియు లేదు- సూత్రే మణిగణా ఇవ=దారమునందు మణులసమూహములువలె, ఇదం సర్వమ్ మయి ప్రోతమ్=ఇది అంతయును నా

యందు గ్రుచ్చఁబడినది.

పరమేశ్వరుఁడనైన నాకంటె నితరమైన కారణము లేదు- నేనే జగ
త్కారణము అనియర్థము- ప్రోతము అనఁగా పడుగునందు బట్ట (పే
ర్చ)వలెనే గ్రుచ్చఁబడినది- అని శంకరభాష్యము.

నేను, అన్నిటికిని కారణమైన రెండుప్రకృతులకును కారణమగుట
చేతను, అన్నియచేతనములకును శేషియైనచేతనునికిఁగూడ శేషి
(నియామకుఁడు)యగుట చేతనును, గొప్పవాఁడనైనట్లు, జ్ఞానము శ
క్తి బలము మొదలగుగుణములుకలుగుటనుఁగూడ నేనే గొప్పవాఁ
డను- జ్ఞానబలాదిగుణములుగలది మఱియేదియు గొప్పదికాదు-
ఈ చేతనాచేతనవస్తుసముదాయమంతయు కార్యావస్థలోనున్నదియు
కారణావస్థలోనున్నదియుఁగూడ నాకుశరీరమై ఆత్మనైనవాయందు
దారమునందుమణులవలెఁగ్రుచ్చబడినది- అనఁగా నన్ను ఆశ్రయించి
యున్నదనుట- అని రామానుజభాష్యము.

నేనేగొప్పవాఁడను- నాకంటెమిగిలినది ఒక్కటియును గొప్ప
దికాదు- అనితలంచుటజ్ఞానము- ఇఁకమీఁదిశ్లోకముల చేఁజెప్పఁబడు
నదివిజ్ఞానము- అని మధ్వభాష్యము.

రసోఽహ మప్సు కౌన్తేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః।
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥౮॥
పుణ్యో గన్ధః పృథివ్యాంచ తేజ శ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు॥౯॥
బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్।
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్॥౧౦॥
బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥౧౧॥

(హే)కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్త్రుఁడా!, అహమ్ అప్సు రసః (అ
స్మి)=నేను నీళ్లయందు రసము (అగుచున్నాను)- శశిసూర్యయోః
ప్రభా అస్మి=చంద్రసూర్యులయందు వెలుఁగు అగుచున్నాను- స
ర్వవేదేషు ప్రణవః (అస్మి)=అన్నివేదములయందును ఓంకారము
(అగుచున్నాను)- ఖే శబ్దః (అస్మి) =ఆకాశమునందు శబ్దము (అగుచు

నాను)- నృషు పౌరుషమ్ (అస్మి)=మనుష్యులయందు పౌరుషము (అగుచున్నాను)- పృథివ్యాం పుణ్యః గన్ధశ్చ (అస్మి)=భూమియందు పుణ్యమైన గంధంబును (అగుచున్నాను)- విభావసౌ తేజశ్చ అస్మి= అగ్నియందు తేజస్సును అగుచున్నాను- సర్వభూతేషు జీవనమ్ (అస్మి)=అన్నిభూతములయందు బ్రదుకును (అగుచున్నాను)- తపస్విషు తపశ్చ అస్మి=తపసులయందు తపస్సును అగుచున్నాను, (హే) పార్థ!= (ఓ) కుంతీపుత్రుఁడా!, మామ్ సర్వభూతానాం సనాతనం బీజం విద్ధి=నన్ను అన్నిభూతములకును నిత్యమైన విత్తనమునుగాను ఎఱుంగుము- బుద్ధిమతామ్ బుద్ధిః అస్మి=బుద్ధిమంతుల బుద్ధిని అగుచున్నాను- అహమ్ తేజస్వినామ్ తేజః (అస్మి)=నేను తేజస్సుకలవారియొక్క తేజస్సును (అగుచున్నాను)- అహం బలవతాం కామరాగవివర్జితం బలంచ (అస్మి)=నేను బలవంతులయొక్క కామంబును రాగంబును లేని బలంబును (అగుచున్నాను)- (హే) భరతర్షభ!=(ఓ) భరతశ్రేష్ఠుఁడా!, భూతేషు ధర్మావిరుద్ధః కామః అస్మి=భూతములయందు ధర్మమునకువిరుద్ధముగాని కామమును అగుచున్నాను.

నీటియొక్క సారము రసము- ఆరసమైననాయందు నీళ్లుపోఁతములై యున్నవి- అంతటనిట్లే- నేనునీటియందు రసమెట్లయితినో అట్లె చంద్రసూర్యులయందు వెలుఁగునగుచున్నాను- పౌరుషమనఁగా మగతనము- పుణ్యగంధమనఁగా మంచివాసన- ఇట్లు రసాదులయందుఁగూడ పుణ్యమైనగసము అనియిట్లు అన్వయించికొనునది- గంధాదులకు పుణ్యత్వము స్వభావసిద్ధము- అపుణ్యత్వము అవిద్యాధర్మాదులంబట్టి వచ్చినదై సంసారులకు భూతవిశేషములతో సంబంధముకలుగుటకు కారణమగును- అగ్నియందు తేజస్సు అనఁగా దీప్తి (జ్వాల)- బీజమనఁగా మొలచుటకు కారణమైనది- బుద్ధియనఁగా అంతఃకరణముయొక్క వివేకశక్తి- తేజస్సనఁగా ప్రాగల్భ్యము (నేర్పు)- బలమనఁగా సామర్థ్యము- దీనినె ఓజస్సనియెదరు- కామమనఁగా లభింపని విషయములయందలి యాశ- రాగమనఁగా లభించినవిషయములయందలియనురాగము (ప్రీతి)- ఈరెండును లేనిబలమనఁగా దేహాదిధార

ణముమాత్రముకొఱకైన సత్త్వము(సత్తువ)- తృష్ణారాగములకు కారణమైన సంసారులబలము నేను కాననుట- ధర్మమనఁగా శాస్త్రములో విధింపఁబడినది- భూతములనఁగా ప్రాణులు- కామమనఁగా దేహధారణమాత్రము ప్రయోజనముగాఁగల అశనపానాదివిషయమైనకోరిక- అని శంకరభాష్యము-

అంతయును పరమపురుషునికి శరీరమగుటను అన్నిశబ్దములచేతను ఆతఁడె చెప్పఁబడునని తెలియఁజేయఁబడుచున్నది- ఈవిలక్షణములైన పదార్థములన్నియు నావలననె పుట్టినవి- నాకుశేషములు (నియామ్యములు) అయినవి- నాకుశరీరమగుటచే నాయందెయున్నవి- కాఁబట్టి అవిప్రకారముగాఁగలవాఁడనై నేనెయున్నాఁడను- అని రామానుజభాష్యము.

నీళ్లు మొదలగునవియును ఆతనివలననె కలుగుచున్నవి- రసము మొదలుగునవి వానివానిస్వభావములగుటయును సారములగుటయును ఏర్పఱుచువాఁడు (నియామకుఁడు) ఆతఁడెకాని జలాదులయొక్క ఏర్పాటువలన రసాదులు రసాదులగుటయు వానివానిసారములగుటయును లేదు- కాఁబట్టి ఇట్లు రసాదులకు కారణమగుటనును రసము మొదలగుసారములను అనుభవించువాఁడు (భోక్త) అగుటనును ఆతనికి రసాదిశబ్దములు నామములు- ఈరసాదులయందు భగవంతుని నుపాసింపవలయునని యుఁదెలియఁజేయఁబడుచున్నది-, అన్నిబలములయందును అన్నికామములయందును భగవంతుని నుపాసింపఁగూడదు- మఱియేమన్నను కామరాగములులేనిబలమందును ధర్మావిరుద్ధమైనకామమునందు నె- ఈశ్వరుఁడు పుణ్యగంధమునకె భోక్త- పుణ్యగంధమునందె ఆతని నుపాసించునది- జీవుఁడును ఈశ్వరుఁడునుఁగూడ శారీరులని చెప్పఁబడుదురు- అని మధ్వభాష్యము.

యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి॥౧౨॥

సాత్త్వికా ఏవ భావాః యే=సాత్త్వికములైయైన భావములు ఏవి (కలవో), రాజసాః యే=రాజసములైనవి ఏవి (కలవో), తామసాశ్చ యే=తామసములైనవియును ఏవి(కలవో), తాన్ మత్త ఏవ

న్నాను)- నృషు పౌరుషమ్ (అస్మి)=మనుష్యులయందు పౌరుషము (అగుచున్నాను)- పృథివ్యాం పుణ్యః గన్ధశ్చ (అస్మి)=భూమియందు పుణ్యమైన గంధంబును (అగుచున్నాను)- విభావసౌ తేజశ్చ అస్మి=అగ్నియందు తేజస్సును అగుచున్నాను- సర్వభూతేషు జీవనమ్ (అస్మి)=అన్నిభూతములయందు బ్రదుకును (అగుచున్నాను)- తపస్విషు తపశ్చ అస్మి=తపసులయందు తపస్సును అగుచున్నాను, (హే) పార్థ!=(ఓ) కుంతీపుత్రుఁడా!, మామ్ సర్వభూతానాం సనాతనం బీజం విద్ధి=నన్ను అన్నిభూతములకును నిత్యమైన వితనమునుగాను ఎఱుంగుము- బుద్ధిమతామ్ బుద్ధిః అస్మి=బుద్ధిమంతుల బుద్ధిని అగుచున్నాను- అహమ్ తేజస్వినామ్ తేజః (అస్మి)=నేను తేజస్సుకలవారియొక్క తేజస్సును (అగుచున్నాను)- అహం బలవతాం కామరాగవివర్జితం బలంచ (అస్మి)=నేను బలవంతులయొక్క కామంబునురాగంబునులేని బలంబును (అగుచున్నాను)- (హే) భరతర్షభ!=(ఓ) భరతశ్రేష్ఠుఁడా!, భూతేషు ధర్మావిరుద్ధః కామః అస్మి=భూతములయందు ధర్మమునకువిరుద్ధముగాని కామమును అగుచున్నాను.

నీటియొక్కసారము రసము- అరసమైననాయందు నీళుపోతములై యున్నవి- అంతటనిట్లే- నేనునీటియందు రసమెట్లయితినో అట్లైచంద్రసూర్యులయందు వెలుగునగుచున్నాను- పౌరుషమనఁగా మగతనము- పుణ్యగంధమనఁగా మంచివాసన- ఇట్లురసాదులయందుఁగూడ పుణ్యమైనగసము అనియిట్లు అన్వయించికొనునది- గంధాదులకు పుణ్యత్వము స్వభావసిద్ధము- అపుణ్యత్వము అవిద్యాధర్మాదులంబట్టి వచ్చినదై సంసారులకు భూతవిశేషములతో సంబంధముకలుగుటకు కారణమగును- అగ్నియందు తేజస్సనఁగా దీప్తి (జ్వాల)- బీజమనగా మొలచుటకుకారణమైనది- బుద్ధియనఁగా అంతఃకరణముయొక్క వివేకశక్తి- తేజస్సనఁగా ప్రాగల్భ్యము (నేర్పు)- బలమనఁగా సామర్థ్యము- దీనినెఓజస్సనియెదరు- కామమనఁగా లభింపని విషయములయందలియాశ- రాగమనఁగా లభించినవిషయములయందలియనురాగము (ప్రీతి)- ఈరెండునులేనిబలమనఁగా దేహాదిధార

ణముమాత్రముకొఱకైన సత్త్వము(సత్తువ)- తృష్ణారాగములకు కారణమైన సంసారులబలము నేను కానని- ధర్మమనఁగా శాస్త్రములో విధింపఁబడినది- భూతములనఁగా ప్రాణులు- కామమనఁగా దేహధారణముమాత్రము ప్రయోజనముగాఁగల అశనపానాదివిషయమైనకోరిక- అని శంకరభాష్యము-

అంతయును పరమపురుషునికి శరీరమగుటను అన్నిశబ్దములచేతను ఆతఁడె చెప్పఁబడునని తెలియఁజేయఁబడుచున్నది- ఈ విలక్షణములైన పదార్థములన్నియు నావలననె పుట్టినవి- నాకు శేషములు (నియామ్యములు) అయినవి- నాకు శరీరమగుటచే నాయందె యున్నవి- కాఁబట్టి అవిప్రకారములుగాఁగలవాఁడనై నేనె యున్నాఁడను- అని రామానుజభాష్యము.

నీళ్లు మొదలగునవియును ఆతనివలననె కలుగుచున్నవి- రసము మొదలగునవి వానివాని స్వభావములగుటయును సారములగుటయును ఏర్పఱుచువాఁడు (నియామకుఁడు) ఆతఁడెకాని జలాదులయొక్క ఏర్పాటువలన రసాదులు రసాదులగుటయు వానివానిసారములగుటయును లేదు- కాఁబట్టి ఇట్లు రసాదులకు కారణమగుటను రసము మొదలగు సారములను అనుభవించువాఁడు (భోక్త) అగుటను ఆతనికి రసాదిశబ్దములు నామములు- ఈ రసాదులయందు భగవంతుని నుపాసింపవలయుననియుఁ దెలియఁజేయఁబడుచున్నది-. అన్నిబలములయందును అన్నికామములయందును భగవంతుని నుపాసింపఁగూడదు- మఱియేమన్నను కామరాగములు లేనిబలమందును ధర్మావిరుద్ధమైన కామమునందు నె- ఈశ్వరుఁడు పుణ్యగంధమునకె భోక్త- పుణ్యగంధమునందె ఆతని నుపాసించునది- జీవుఁడును ఈశ్వరుఁడునుఁగూడ శారీరులని చెప్పఁబడుదురు- అని మధ్వభాష్యము.

యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి॥౧౨॥

సాత్త్వికా ఏవ భావాః యే=సాత్త్వికములైయైన భావములు ఏవి (కలవో), రాజసాః యే=రాజసములైనవి ఏవి (కలవో), తామసాశ్చ యే=తామసములైనవియును ఏవి(కలవో), తాన్ మత్త ఏవ

ఇతి విద్ధి=వానిని నావలనఁ(గలిగినవియె) అని తెలిసికొనుము- అహంతు తేషు న(అస్మి)=నేను వానియందు లేను- తే మయి (సన్తి)=అవి నాయందు ఉన్నవి.

సాత్త్వికములనఁగా సత్త్వగుణమువలననయినవి- రాజసములనఁగా రజోగుణమువలననయినవి- తామసములనఁగా తమోగుణమువలననయినవి- ఇట్టియన్నియు నావలనఁగలిగినవైనను నేను, సంసారులవలె, వానికి అధీనమైనవాఁడను కాను- అవినాకుఅధీనములె- అని శంకరభాష్యము.

దేహముగానును ఇంద్రియములుగానును భోగ్యములు (అనుభవింపవలసినవి)గానును వానికి కారణములుగానునుండెడి సాత్త్విక రాజస తామసములయిన భావములన్నియు నావలనఁ బుట్టినవనియు నాకు శరీరముగుటచేత నాయందె యున్నవనియును తెలిసికొనుము- నేను ఎప్పుడును వానికి అధీనమైన ఉనికిగలవాఁడను కాను.

శరీరము జీవునకధీనమైన స్థితికలదైనను జీవునియొక్క స్థితియందు శరీరపు ఉపకారము (సహాయము) కూడకలదు. నాకు వానివలన అట్టియుపకారము లేదు- వట్టిలీలయె నాకు ప్రయోజనము- అని రామానుజభాష్యము.

నేను వానియందు లేననుటచే అవియాధారములు కాకపోవుట చెప్పఁబడుచున్నది- అని మధ్వభాష్యము

త్రిభిర్గుణమయై ర్భావై రేభి స్సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మా మేభ్యః పరమవ్యయమ్॥౧౩॥

సర్వమ్ ఇదమ్ జగత్=సమస్తమైన ఈ జగత్తు, గుణమయైః త్రిభిః భావైః మోహితమ్=సత్త్వరజస్తమోగుణమయములైన మూడుభావములచేత మోహమును జెందింపఁబడినదై, ఏభ్యః పరమ్ అవ్యయం మామ్ నాభిజానాతి=వీనికంటె గొప్పవాఁడనును నాశములేనివాఁడనునగు నన్ను ఎఱుంగకున్నది.

భావములనఁగా రాగము ద్వేషము మోహము మొదలగునవి- మోహమనఁగా అవివేకము - వీనికంటెననఁగా ఈగుణములకంటె, పరుఁడుఅనఁగా అతిరిక్తుఁడును, విలక్షణుఁడును- అవ్యయమ్ అ

నుటచే భావవికారములేవియును లేనివాఁడనుట- అని శంకరభాష్యము.
(౨అ॥ ౨౦శ్లో॥ ౧౦౪॥)

ఈసాత్త్విక రాజస తామస గుణమయములగు భావములకంటె గొప్పవాఁడనును అవ్యయుఁడనును అనఁగా ఎల్లప్పుడునొక్కవిధముగా నుండువాఁడనునగు నన్ను త్రిగుణమును నశించిపోయెడివిని, పూర్వకర్మానుసారముగా దేహములుగానును ఇంద్రియములుగానును భోగ్యములుగానునుండెడి గుణమయపదార్థములచేత మోహితమై దేవతిర్యఙ్మనుష్యస్థావరరూపముగానున్న యీజగత్తు ఎఱుఁగదు- అని రామానుజభాష్యము-

గుణమయములనఁగా గుణాత్మకములనుట- భావములనఁగా పదార్థములు- వీనికంటెపరుఁడు- ఈకనఁబడుచుండుభావములన్నియు గుణమయములె- ప్రాణులుకాకమిగిలిన ఈజగత్తంతయు, గుణమయమగు శరీరాదికమునుజూచి ఈశ్వరశరీరంబునట్టిదియె యనుకొనుటచే మాయామోహితమైనదియని యర్థము- అని మధ్వభాష్యము.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే॥

దైవీ గుణమయీ మమ ఏషా మాయా=దేవసంబంధియు గుణమయమైనదియునగు నాయొక్క ఈ మాయ, దురత్యయా=అతిక్రమింపశక్యముకానిది- యే మామేవ ప్రపద్యన్తే=ఎవ్వరు నన్నే ఆశ్రయింపుచున్నారో, తే ఏతాం మాయాం తరన్తి=వారు ఈ మాయను దాఁటుచున్నారు-

దైవియనఁగా ఈశ్వరుఁడనును విష్ణువునగు నాకు స్వభావమైనది- ఎవ్వరు అన్నిధర్మములనువిడిచి, మాయకలవాఁడనును వారికిఆత్మనునైన నన్నే సర్వవిధములను ఆశ్రయింపుచున్నారో, వారుఅన్నిభూతములచిత్తములను మోహింపఁజేసెడి ఈమాయను అతిక్రమింపుచున్నారు- అని శంకరభాష్యము.

దైవియనఁగా క్రీడించుటకు ప్రవర్తించిననాచేతనిర్మింపఁబడినది- గుణమయియనఁగా సత్త్వరజస్తమోగుణమయమైనది- విచిత్రకార్యములను జేయునదియగుటచే మాయయని చెప్పఁబడుచున్నది

మాయ యనునది ప్రకృతి- ఇది భగవత్స్వరూపము తెలియకుండ నడ్డపడు
ను- కాఁబట్టి మాయామోహితమైన జగత్తు భగవంతుని యానంద
స్వరూపమును తెలిసికొనకున్నది- నన్నే ఎవ్వరు శరణముగాఁ
బొందుచున్నారో, వారు యీమాయను విడిచి నన్ను ఉపాసింపుచు
న్నారు- అని రామానుజభాష్యము. [ఈ శరణాగతియె ప్రపత్తి యనఁ
బడును- దీనివిస్తరము చరమశ్లోకమునఁ (౧౮అ॥ ౬౬శ్లో॥) జూడనగును]

ఇది మోహిక (మోహింపఁజేసెడిది) యగు మాయ- అదియును సృ
ష్ట్యాదిక్రీడ మొదలుగునవికల దేవునిదిగాన శక్తివలన దాటశక్యముకా
నిది- మిగిలిన దానినంతయు విడిచి నన్నే ఎవ్వరు ఆశ్రయింపుచున్నా
రో, గురువు మొదలగువారికి చేయు వందనములఁగూడ నాయందే స
మర్పింపుచున్నారో, భగవంతుఁడె వారియందున్నవాఁడై గురువు మొ
దలగువారు అగుచున్నాఁడు అని తెలిసికొనుచున్నారో, వారిచే, దాఁటఁ
దగినది- అని మధ్వభాష్యము.

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః॥

దుష్కృతినః మూఢాః=పాపములఁ జేయువారును అజ్ఞానులును,
మాయయా అపహృతజ్ఞానాః=మాయచేత నపహరింపఁబడినజ్ఞాన
ములవారును, ఆసురం భావమ్ ఆశ్రితాః=అసురసంబంధియగు
స్వభావమును ఆశ్రయించినవారును, నరాధమాః=మనుష్యాధ
ములు, మాం న ప్రపద్యన్తే=నన్ను ఆశ్రయింపరు

ఆసురభావమనఁగా హింసించుట అసత్యము పలుకుట మొదలగు
నది- అని శంకరభాష్యము.

నన్ను ఆశ్రయింపని దుష్కృతులు నాలుగువిధములవారు-౧. మూఢు
లు అనఁగా విపరీతజ్ఞానముకలవారు - తమయాత్మయును మిగిలినవ
న్నియును గూడ తమకే శేషములనుకొను వారు-౨ నరాధములు - అనఁ
గా నా స్వరూపము తెలిసినను నాయందభిముఖ్యము నకుతగని వారు-౩
మాయచే నపహరింపఁబడినజ్ఞానముకలవారు-అనఁగా నాజ్ఞానముకలి
గియు దానిని చెడుయుక్తులచేత పోఁగొట్టుకొనినవారు-౪ అసురభావము
ను ఆశ్రయించినవారు - అనఁగా నన్ను లెస్సగాఁదెలిసికొని నాయందు

ద్వేషమును వహించువారు- వీరిలో ఉత్తరోత్తరులు పాపిష్ఠులు- అని రామానుజభాష్యము.

దుష్కృతులగుటను మూఢులైనవారు- కావుననె నరాధములు- అపహరింపఁబడిన అనఁగా తిరస్కరింపఁబడిన జ్ఞానముకలవారగుట కూడ మూఢులగుటకు హేతువు- కావుననె ఆసురభావమును పొందిన వారు- ఆసురభావము ప్రవృత్తించనివృత్తించ (౧౬అ॥ ౭శ్లో)అను శ్లోకమునఁ జెప్పఁబడఁగలదు- అసురులనఁగా (అసు)ప్రా)ణములయందు (ర=రత)ఆసక్తికలవారు- అని మధ్వభాష్యము.

చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ॥౧౬॥

(హే)అర్జున!=(ఓ)యర్జునుఁడా!, ఆర్తః జిజ్ఞాసుః అర్థార్థీ జ్ఞానీచ(ఇతి)=ఆర్తుఁడును జిజ్ఞాసువును అర్థార్థియును జ్ఞానియును(అనెడి), చతుర్విధాః సుకృతినః జనాః=నాలుగువిధములవారగు పుణ్యవంతులునగు జనులు, మాం భజన్తే=నన్ను భజించుచున్నారు.

ఆర్తుఁడనఁగా దొంగలు, పెద్దపులులు, రోగములు, మొదలగువానిచేఁ బరస్కరింపఁబడినవాఁడు- జిజ్ఞాసువనఁగా భగవంతునితత్త్వమును తెలియఁగోరువాఁడు- అర్థార్థియనఁగా ధనమునుగోరువాఁడు- జ్ఞానియనఁగా విష్ణువుయొక్కతత్త్వము నెఱింగినవాఁడు- అని శంకరభాష్యము.

పుణ్యకర్మముకలవారు నన్నుశరణముగాఁబొంది నన్ను భజింతురు- వారుపుణ్యతారతమ్యముచే నాల్గువిధములవారు- అందు ఉత్తరోత్తరులుఅధికులు- అందు ఆర్తుఁడనఁగా ఐశ్వర్యముపోయి స్థితిలేనివాఁడై తిరిగియునైశ్వర్యమునుకోరువాఁడు- అర్థార్థియనఁగా ఐశ్వర్యమునుపొందకుండుటచే నైశ్వర్యమునుకోరువాఁడు- జిజ్ఞాసువుఅనఁగా ప్రకృతిసంబంధములేని యాత్మస్వరూపమును(కైవల్యమును)పొందఁగోరువాఁడు- జ్ఞానియనఁగా ఆత్మస్వరూపము భగవంతునికి శేషభూతమని యెఱిఁగినవాఁడై భగవంతునిపొందఁగోరువాఁడు- అని రామానుజభాష్యము.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే।
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహం సచ మమప్రియః॥

తేషాం=వారలలో, నిత్యయుక్తః ఏకభక్తిః జ్ఞానీ విశిష్యతే=ఎల్లప్పుడుయోగముకలవాఁడును ఒకనియందేభక్తికలవాఁడునగు జ్ఞాని విశేషింపుచున్నాఁడు- అహం జ్ఞానినః అత్యర్థం ప్రియః హి=నేను జ్ఞానికి మిక్కిలి ఇష్టుఁడనుగదా- సచ మమ ప్రియః=వాఁడును నాకు ఇష్టుఁడు.

వాసుదేవుఁడనైన నేనుజ్ఞానికి ఆత్మనుగాన ప్రియుఁడను- జ్ఞానియునునాకుఆత్మగాన ప్రియుఁడు- ఆత్మప్రియుఁడగుటలోకమునఁబ్రసిద్ధమేకదా- అనిశంకరభాష్యము.

నేనొకఁడనె ప్రాప్యుఁడు(పొందఁదగినవాఁడు) గాఁగలవానికి నాతోడ యోగము (సంబంధము)నిత్యము- మిగిలినవారికి వారివారి కోరికెలు లభించువఱకునె నాతోసంబంధము- జ్ఞానికి వాఁడొకని యందేభక్తి- మిగిలినవారికి తమచేఁగోరఁబడినదానియందును దానికి సాధనమగుటచే నాయందునుభక్తి- అత్యర్థమనఁగా చెప్పనలవిగానంతయనియర్థము- అనిరామానుజభాష్యము.

ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామే వానుత్తమాం గతిమ్॥

ఏతే సర్వే ఉదారాఏవ=వీరు అందఱును ఉదారులే- జ్ఞానీతు ఆత్మైవ=జ్ఞానియో ఆత్మయె, (ఇతి) మే మతమ్=(అని) నా మతము- యుక్తాత్మా సః=యోగముగలయాత్మకలవాఁడైన అతఁడు, మామేవ అనుత్తమాం గతిమ్ ఆస్థితోహి=నన్నె ఇంతకంటె నుత్తమములేని గతినిగాను పొందినవాఁడుగదా.

ఉదారులనఁగా ఉత్కృష్టులు- అందఱునుఅనఁగా ముగ్గురును నాకుప్రియులె- వాసుదేవుఁడనైననాకు నాభక్తుఁడైనవాఁడు అనిష్టుఁడుగాఁడుగదా- జ్ఞానియే మిక్కిలియిష్టుఁడు- ఆత్మయెఅనఁగా నాకంటెవేఱుగాఁడు- యుక్తాత్మయనఁగా భగవంతుఁడైనవాసుదేవుఁడు నేనెఅని సమాధానమునుపొందిన చిత్తముకలవాఁడు- ఆస్థితుఁడనఁగా పరబ్రహ్మమైన నన్ను పొందుటకు ప్రవర్తించిన

వాఁడు - అని శంకరభాష్యము.

ఉదారులనఁగా దాతలు- ఎవ్వారలు నావలన నొకటిదానిని గ్రహింతురో వారు నాకు సర్వస్వమును ఇచ్చినవారు- జ్ఞాని నాకు ఆత్మయె అనఁగా నేను జ్ఞానికి అధీనమైన ఉనికికలవాఁడనుగాఁ దలంచెదను- ఈజ్ఞాని నన్ను విడిచి తాను ఉండలేక నన్నె ప్రాప్యనిగాఁబొందెనుగాన నేనును అతనివిడిచి నిలువలేను- కాఁబట్టి అతఁడు నాకు ఆత్మగదా- అని రామానుజభాష్యము.

బహూనాం జన్మనా మన్తే జ్ఞానవా న్మాం ప్రపద్యతే।
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥౧౯॥

బహూనాం జన్మనామ్ అన్తే జ్ఞానవాన్=పెక్కు జన్మముల అంమున జ్ఞానముకలవాఁడై, సర్వం వాసుదేవః ఇతి=అంతయును వాసుదేవుఁడె అని, మాం ప్రపద్యతే=నన్ను పొందుచున్నాఁడు- సః మహాత్మా సుదుర్లభః=ఆ మహాత్మ మిక్కిలిదుర్లభుఁడు.

జ్ఞానముకొఱకైన సంస్కారమును సంపాదించుటకల యనేకజన్మములసమాప్తియందు పరిపాకజ్ఞానమును పొందినవాఁడై అంతయును వాసుదేవుఁడె అని, ప్రత్యగాత్మయై వాసుదేవుఁడనైన నన్ను తెలిసికొనుచున్నాఁడు- వాఁడె మహాత్మ- వానితోసమానుఁడైనను అధికుఁడైనను లేఁడు- అని శంకరభాష్యము.

లెక్కలేని పుణ్యజన్మములుగడచినపైని, నేను వాసుదేవునికి శేషభూతుఁడను, నాస్వరూపంబును నాయునికియు నాప్రవృత్తియు వానియధీనంబులు, వాఁడు లెక్కలేనికల్యాణగుణములచేనుత్కృష్టుఁడు, అనుజ్ఞానముకలవాఁడై వాసుదేవుఁడె నాకు అంతయును అనఁగా ప్రాప్యంబును ప్రాపకంబును, ఇదిగాక నేను కోరవలసినదంతయును వాసుదేవుఁడె, అని నన్ను ఉపాసించుచున్నాఁడు(భజించుచున్నాఁడు వాఁడుమహాత్మయనఁగా గొప్పమనస్సుగలవాఁడు- అని రామానుజభాష్యము.

అనేకజన్మములతుదిని జ్ఞానవంతుండగును- అని మధ్వభాష్యము.

కామై స్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తే౽న్యదేవతాః।
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా॥

స్వయా ప్రకృత్యా నియతాః=తనదైన ప్రకృతిచేత నియమింపఁబడినవారును, తైస్తైః కామైః హృతజ్ఞానాః=ఆయా కోరికలచేత అపహరింపఁబడినజ్ఞానముకలవారునై, తంతం నియమమ్ ఆస్థాయ=ఆయా నియమమును అవలంబించి, అన్యదేవతాః ప్రపద్యన్తే=ఇతరదేవతలను ఆశ్రయింపుచున్నారు. (నియమములనఁగా ఏయేదేవత ప్రీతికలుగుటకు ఏయేనియమములు ఆవశ్యకములో౯వి.)

కామములనఁగా సంతానము పశువులు స్వర్గము మొదలగువాని కోరికెలు. ఆత్మయైన వాసుదేవునికంటెనితరమైన దేవతలను. ప్రకృతి యనఁగా స్వభావము, అనఁగా జన్మాంతరమున సంపాదింపఁబడిన సంస్కారవిశేషము. అనిశంకరభాష్యము.

ప్రకృతియనఁగా పాపవాసన. అదిగుణమయభావముల (౭అ॥ ౧౩శ్లో)యందలిది. దానితో నియతులనఁగా నిత్యముగాఁగూడియున్నవారు. జ్ఞానమనఁగా నా (భగవంతుని)స్వరూపమును తెలిసికొనుట. ఇతరదేవతలననఁగా వహ్నియింద్రాదిదేవతలను. ప్రపద్యన్తే=ఆదేవతలనాశ్రయించి పూజింపుచున్నారు. అని రామానుజభాష్యము.

ప్రకృతియనఁగా స్వభావము. అనిమధ్వభాష్యము.

యోయో యాంయాం తనుంభక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి
తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥ ౨౧

యోయః యాంయామ్ తనుం భక్తః(స్సన్) శ్రద్ధయా అర్చితుమ్ ఇచ్ఛతి=ఎవ్వఁడెవ్వఁడు ఏయే శరీరమును భక్తికలవాఁడగుచు శ్రద్ధతో పూజింపఁ గోరుచున్నాఁడో, అహమ్=నేను, తస్యతస్య తాం శ్రద్ధామేవ=వానివానియొక్క ఆ శ్రద్ధనే, అచలాం విదధామి=నిశ్చలమైనదానిగా చేయుచున్నాను.

తనుమ్=దేవతాశరీరమును. అచలామ్=స్థిరమైనదానినిగా. అని శంకరభాష్యము.

తనుమ్=నాకుశరీరమైనదేవతను. నాశరీరమనియెఱుఁగకపోయినను పూజింపఁగోరుచున్నాఁడో. అచలామ్=నిర్విఘ్నమైనదానిగా. అని రామానుజభాష్యము.

బ్రహ్మాదిస్వరూపమైనశరీరమును. అనిమధ్వభాష్యము.

స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధనమీహతే।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్॥

సః తయా శ్రద్ధయా యుక్తః=వాఁడు ఆ శ్రద్ధతో కూడినవాఁడై, తస్య ఆరాధనమ్ ఈహతే=దానియొక్క ఆరాధనమును చేయుచున్నాఁడు- తతః=దానివలననే, మయైవ విహితాన్ హితాన్ కామాంశ్చ లభతే=నాచేతనే కలుగఁజేయఁబడినవియును హితములైనవియునగు కామములను పొందుచున్నాఁడు.

తస్యాః=ఆ దేవతావిగ్రహముయొక్క - (తస్యాః=రాధనమ్ అనిపదచ్ఛేదము- రాధనమనఁగా ఆరాధనము- అనిమధుసూదనటీక) దానివలననఁగా ఆదేవతావిగ్రహమువలననుట- హి, తాన్ అని రెండుపదములు- తాన్ కామాన్ లభతే హి=ఆ కోరికెలను పొందుచున్నాఁడుగదా- హితాన్ అనిపదచ్ఛేదముచేసినయెడను హితముల(మేలుకలుగఁజేయువాని)వలెఁదోఁచెడి అని యర్థము- అని శంకరభాష్యము.

హితాన్=తనచేఁ గోరఁబడిన- అని రామానుజభాష్యము.

అన్తవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్।
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥

అల్పమేధసాం తేషామ్ తత్ ఫలంతు=స్వల్పబుద్ధిగల వారలయొక్క ఆ ఫలము, అన్తవత్ భవతి=నశించునది అగుచున్నది- దేవయజః దేవాన్ యాన్తి=దేవతలఁగూర్చి యాగములఁజేయువారు దేవతలను పొందుచున్నారు- మద్భక్తా అపి మామ్ యాన్తి=నాభక్తులును నన్ను పొందుచున్నారు.

కోరికగల నాభక్తులు మొదటను నాయనుగ్రహమువలన కావలసినకోరికెలనుపొందుదురు, అటుపైని నన్నుగూర్చిన యుపాసనము చరుటవలననన్నుఁగూడఁజెందుదురు, అనిఅపిశబ్దము తెలియఁజేయుచున్నది- అనిమధుసూదనటీక.

ఇంద్రాదులుకొంతకాలమేయుండువారును పరిమితమైనభోగముకలవారునగుటచే, వారలఁగూర్చి యాగము చేసినవారు వారలతోఁగూడ భోగముల ననుభవించి వారలతోఁగూడ నెజారుదురు- నాభక్తులైనవారు ఆకర్మములు నాకుఆరాధనరూపములనియెఱింగి స్వల్పఫలములను

విడిచి నాప్రీతికొఱకే కర్మములనాచరింపుచున్నవారై నన్ను జెం దుచున్నారు- మతీచులలరు- అని రామానుజభాష్యము

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః।
పరం భావ మజానన్తో మమావ్యయ మనుత్తమమ్॥౨౪॥

అబుద్ధయః=అజ్ఞానులు, మమ అవ్యయమ్ అనుత్తమమ్ పరం భావమ్ అజానన్తః=నాయొక్క వికారములేనిదియును ఇంతకం టెనుత్తమమైనది లేనిదియునగు ఉత్కృష్టమైన స్వభావమును ఎఱుంగకున్నవారై, మామ్ అవ్యక్తమ్ వ్యక్తిమ్ ఆపన్నమ్ మన్యన్తే=నన్ను స్ఫుటపడనివాఁడనైయుండి స్ఫుటపడుటను పొందినవానిగా తలంపుచున్నారు.

ఎల్లప్పుడును ప్రసిద్ధుఁడనై ఈశ్వరుఁడనైన నన్ను- పరమ్ భావమ్=పరమాత్మస్వరూపమును- అని శంకరభాష్యము (అవ్యక్తుఁడనైయుండి అనఁగా ఈదేహమునుధరించుటకు ముందు కార్యములు చేయుటకుతగనిస్థితిలోనుండి, ఇప్పుడు వసుదేవునియింటను భౌతిక దేహమును ధరించుటచే వ్యక్తిని అనఁగా కార్యములుచేయఁదగి నస్థితిని పొందినవానిగా- అనిమధుసూదనటీకలో వివరింపఁబడినది)

సర్వేశ్వరుఁడనైన నేను నాస్వభావములను వదలకయె వసుదేవునియింట నవతరించితినని యెఱుఁగక ప్రాకృతులైన రాజపుత్రులవలె పుట్టకముందు అభివ్యక్తిలేకయుండి కర్మవశమువలన జన్మమునుపొంది వ్యక్తినిపొందినవానిగా, బుద్ధిలేనివారు, తలంపుచున్నారు- ఇందువలననె నన్నుఆశ్రయింపరు- నన్నుకర్మముచేనారాధింపరు- అని రామానుజభాష్యము.

అవ్యక్తుఁడను అనఁగా కార్యము దేహము మొదలగునవి లేనివాఁడనగు నన్ను కార్యదేహములనుపొందినవానిగా అజ్ఞులు తలంపుచున్నారు- ఆనందదేహముకలవానిని గౌణదేహముకలవానినిగాఁ దలంపుచున్నారు-భావమును అనఁగా యాథార్థ్యమును- అని మధ్వభాష్యము

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః।
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్॥

యోగమాయాసమావృతః అహమ్=యోగమాయచేనావరింపఁబడిన నేను, సర్వస్య(లోకస్య)ప్రకాశః న=సమస్తమైన(జనములకును)ప్రసిద్ధుఁడను కాను- మూఢః అయం లోకః=మోహమును జెందిన ఈ లోకము, మామ్ అజమ్ అవ్యయమ్ నాభిజానాతి=నన్ను పుట్టుకలేనివానిగాను నాశములేనివానిగానును ఎఱుఁగకున్నది.

నాభక్తులైన కొందఱికే నేను తెలియఁబడుదును అని యభిప్రాయము- యోగమనఁగా సత్త్వరజస్తమోగుణములకూడిక- అదియె మాయ- అని శంకరభాష్యము. (యోగమనఁగా భగవత్సంకల్పము- దానికి అధీనమైనమాయ యోగమాయ-అనిమధుసూదనటీక)

క్షేత్రజ్ఞులకు(జీవులకు)కలిగెడిమనుష్యత్వము మొదలగుఆకారముల యోగము నెడిమాయిచేత- సర్వేశ్వరుఁడనైనను అందఱును ఆశ్రయించుటకుగాను మనుష్యాకారమును పొందినవానిగా నెఱుఁగరు- అని రామానుజభాష్యము.

అట్లు తెలిసికొనకపోవుటయును నాయిచ్ఛచేతనె- యోగముచేతనును అనఁగా సామర్థ్యాతిశయము చేతనును, మాయచేతనను- అని మధ్వభాష్యము.

వేదాహం సమతీతాని వర్తమానానిచార్జున।
భవిష్యాణిచ భూతాని మాంతు వేద న కశ్చన॥౨౬॥

(హే)అర్జున!=(ఓ)అర్జునుఁడా!, సమతీతాని వర్తమానాని భవిష్యాణిచ భూతాని=గతించినవియు ఉన్నవియు కాఁగలవియునగు భూతములను, అహమ్ వేద=నేను ఎఱుఁగుదును- మాంతు=నన్నో, కశ్చన న వేద=ఒకఁడును ఎఱుఁగఁడు.

నాభక్తుఁడుతప్ప మిగిలినవాఁడెవ్వఁడును నన్నెఱుఁగఁడు- నా తత్త్వము తెలియకపోవుటనె నన్ను భజింపఁడు- అని శంకరభాష్యము

అందఱు నాశ్రయించుటకై నేనవతరించితినని యెవ్వఁడు నెఱుఁగడు- అనిరామానుజభాష్యము.

మాయ నన్ను బంధింపఁజాలదు- ఎంతసమర్థుఁడైనను తనసామర్థ్యముచేత నన్నెఱుఁగలేఁడు- అనిమధ్వభాష్యము.

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత।
సర్వభూతాని సంమోహం సర్గే యాన్తి పరంతప॥ ౨౭॥

(హే)పరంతప!=(ఓ)శత్రువులను తపింపఁజేయువాఁడా!, (హే)భారత!=(ఓ)భరతవంశమువాఁడా!, సర్గే=జన్మకాలమందు, ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన=కోరిక ద్వేషము అనువీనివలనఁ బుట్టిన ద్వంద్వమోహముచేత, సర్వభూతాని సంమోహం యాన్తి=అన్నిభూతములును మోహమును చెందుచున్నవి.

ద్వంద్వమునిమిత్తముగాఁగల మోహము ద్వంద్వమోహము- ద్వంద్వమనఁగా ఇచ్ఛాద్వేషములు- సుఖమునందును సుఖమునకు హేతువయినదానియందును ఇచ్ఛ(కోరిక)యును, దుఃఖమునందును దుఃఖమునకు హేతువయినదానియందును ద్వేషంబును కలిగి, ఇట్లు ఇచ్ఛాద్వేషములు నిలువఁబారినతోడనే, అవి, అన్నిభూతములయొక్క యుక్తి తెలివిని తమయధీనము చేసికొని పరమార్థజ్ఞానము(ఆత్మతత్త్వజ్ఞానము)పుట్టుటకు ప్రతిబంధకమైన మోహమును(అజ్ఞానమును)కలుగఁజేయును- ఇచ్ఛాద్వేషములకు పరవశమైన చిత్తముగలవానికి వెలుపలఁగూడ యథార్థజ్ఞానము పుట్టదుగదా- ఇట్లుండఁగా అనేకప్రతిబంధకములుగల ప్రత్యగాత్మజ్ఞానము పుట్టదనికూడ చెప్పవలయునా- అని శంకరభాష్యము.

ద్వంద్వమను పేరుగల మోహము ద్వంద్వమోహము- అండజములుజన్మకాలమందె పూర్వపూర్వజన్మవాసనానుసారముగా సుఖదుఃఖాదులయందు ఇచ్ఛాద్వేషములు కలుగుటచే ద్వంద్వమోహముకలుగుచున్నది- కావున నెవ్వఁడును నాతోకలియుటయె సుఖముగానును నాతో నెడబాయుటయె దుఃఖముగానును తలంచుటయె స్వభావముగాఁగలవాఁడుకాఁడు- జ్ఞానిమాత్రము అట్టివాఁడు- పుట్టుకతోడనె యట్టి స్వభావము కలిగియుండుట సంభవింపదు- అని రామానుజభాష్యము-

ద్వంద్వమోహమనఁగా సుఖదుఃఖాదివిషయమోహము- ఇచ్ఛాద్వేషములు పెఱిగినచో నేదియును తెలియశక్యముకాదు- ఇదియొకకారణము- సర్గే=సృష్టికాలమునందు- శరీరము కలిగినంతనే

ఇచ్ఛాకులుకలుగుట- శరీరము లేనియప్పుడు అజ్ఞానము(ప్రకృతి) మెయుం డును- అని మధ్వభాష్యము.

యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్।
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః॥

పుణ్యకర్మణాం యేషాం జనానాం పాపమ్ అన్తగతమ్=పుణ్యకర్మముగల ఏ జనుల పాపము అంతమునుపొందినదో(నశించినదో), తే తు ద్వంద్వమోహనిర్ముక్తాః దృఢవ్రతాః మామ్ భజన్తే=వారోయన్నను ద్వంద్వమోహముచేతవిడువఁబడినవారై దృఢమైనవ్రతముకలవారై నన్ను భజింతురు-

అంతగతమనఁగా- క్షయించినది- సత్త్వశుద్ధికి కారణమైనపుణ్యకర్మమెవ్వరికిఁగలదో వారుపుణ్యకర్ములు- ఇట్టి వారు నన్ను అనన్యముగాభజింపుచున్నారు- సర్వమునుపరిత్యజించి(సన్యసించి), ఇదిమోపరమార్థతత్త్వము, మఱియొకప్రకారముకాదు, అనియిట్లు నిశ్చితమైన జ్ఞానముకలవారు దృఢవ్రతులనఁబడుచున్నారు- అని శంకరభాష్యము-

పాపమనఁగా సుఖదుఃఖాదిద్వంద్వములయందలి రాగద్వేషములకు కారణమైనాయెడను ఆభిముఖ్యము కలుగుటకువిరోధియైనది- అది అనేకజన్మములయందు సంపాదింపఁబడిన గొప్పపుణ్యములచేత నెవ్వరికి క్షయించినదో, వారు, నన్ను ప్రపత్తి చేయుటచేసుఖదుఃఖమోహవినిర్ముక్తులై జరామరణముల విడుదలకొఱకును(౧)గొప్పఐశ్వర్యముకొఱకును(౨)నన్ను జెందుటకును(౩) దృఢమైన సంకల్పముకలవారై నన్ను భజింపుచున్నారు- అని రామానుజభాష్యము.

వెనుకటిశ్లోకమునఁ జెప్పఁబడినవారికంటె విపరీతులైనవారుకలరు, అని ఈశ్లోకము తెలియఁజేయుచున్నది- అని మధ్వభాష్యము.

జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్॥

జరామరణమోక్షాయ మామ్ ఆశ్రిత్య యే యతన్తి=ముసలితనమును చావునువిడుచుటకై నన్ను ఆశ్రయించి ఎవ్వరు ప్రయత్నము చేయుదురో, తే=వారు, తత్ బ్రహ్మ=ఆ బ్రహ్మమును

త్స్నమ్ అధ్యాత్మమ్=సమస్తమైన ఆత్మతత్త్వమునను, అఖిలం క
ర్మ=సమస్తమైన కర్మమునను, విదుః=ఎఱుఁగుదురు.

నన్నాశ్రయించి నాయందే ఏకాగ్రతగల చిత్తము కలవారై- అధ్యాత్మమనఁగా ప్రత్యగాత్మవిషయమైనవస్తువు- అని శంకరభాష్యము. (ప్రయత్నము చేయుట యనఁగా, వేదవిహితములయిన కర్మములను నాకు సమర్పించి ఫలమును గోరక యాచరించుట- సగుణుఁడనైన నన్ను శరణముగాఁ బొందినట్టివారు, తత్పదార్థమైననిర్గుణబ్రహ్మమునను, త్వంపదార్థమైనజీవాత్మను తెలిసికొందురు- ఈజ్ఞానమునకు సాధనమైన గురువునాశ్రయించుట, అతనివలనవినుట, దానిమననము చేయుట, మొదలగు కర్మమును గూడ తెలిసికొనుదురు- అ. మధుసూదనటీక.)

జరామరణమోక్షమనఁగా ప్రకృతిసంబంధము లేని యాత్మస్వరూపమును జూచుట- అని రామానుజభాష్యము

ఏకాంతభక్తికలవారు ఫలముఁగోరక భగవంతునాశ్రయింపఁగూడదుగాన జరామరణమోక్షముఁ గోరకనుట, మిగిలినకోరికలు లేకుండవలయునని తెలియఁజేయుటకుగాని మోక్షమును గోరవలయునని విధింపదు- అని మధ్వభాష్యము.

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః।
ప్రయాణకాలేఽపిచ మాం తే విదుర్యుక్తచేతసః॥ ౩౦॥

యే మామ్=ఎవ్వరు నన్ను, సాధిభూతాధిదైవం సాధియజ్ఞంచ విదుః = అధిభూతముతోడనను అధిదైవముతోడనను గూడినవానిగానును అధియజ్ఞముతోఁ గూడినవానిగానును తెలిసికొనుచున్నారో, తే=వారు, ప్రయాణకాలేఽపిచ యుక్తచేతసః మామ్ విదుః=మరణకాలమందును నియమింపఁబడినయంతఃకరణముకలవారై నన్ను ఎఱుఁగుదురు.

భగవద్భక్తులు మూఁడువిధములవారు- అందొకవిధమువారు వెనుకటిశ్లోకమునఁ జెప్పఁబడిరి- ఈశ్లోకమున మఱియొకవిధమువారగు ఐశ్వర్యార్థులు చెప్పఁబడుచున్నారు- ముగ్గురు అధికారులును నిత్యనైమిత్తికరూపములైన పంచమహాయజ్ఞాదులనాచరించుట

యావశ్యకము గాన సాధియజ్ఞం విమః అనునది అంవఱకునుఅన్వయిం
చును- ప్రయాణకాలమున వారివారిప్రాప్యమునకు తగినట్లు నన్నె
ఱుఁగుటయును మూక్షురికిని తుల్యమె- అని రామానుజభాష్యము.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే వి
జ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబగు బ్రహ్మవిద్యాప్రతిపాద
కంబగు యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవా
దంబునగు భగవద్గీతలలో విజ్ఞానయోగప్రతి
పాదకమగు ఏడవయధ్యాయము.



## ఎనిమిదవయధ్యాయము

### అర్జునఉవాచ.

కింతద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ।
అధిభూతంచ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే॥౧॥
అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన।
ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః॥౨॥

(హే)పురుషోత్తమ!=(ఓ)శ్రీకృష్ణుఁడా!, తత్ బ్రహ్మ కిమ్=ఆ బ్రహ్మము ఏది- అధ్యాత్మమ్ కిమ్=అధ్యాత్మము ఏది- కర్మ కిమ్=కర్మము ఏది- అధిభూతంచ కిం ప్రోక్తమ్=అధిభూతంబును ఏదిగాఁ జెప్పఁబడినది- అధిదైవం కిమ్ ఉచ్యతే=అధిదైవము ఏదిగాఁ జెప్పంబడుచున్నది- (హే)మధుసూదన!=(ఓ)కృష్ణుఁడా!, అస్మిన్ దేహే అధియజ్ఞః కః=ఈదేహమునందు అధియజ్ఞుఁడు ఎవ్వఁడు- అత్ర కథమ్ (జ్ఞేయః)=ఈవిషయమున ఎట్లు (తెలియఁబడఁదగినవాఁడు)- నియతాత్మభిః ప్రయాణకాలే కథం జ్ఞేయః అసి=నియమింపఁబడినయంతఃకరణముకలవారిచే మరణకాలమున ఎట్లు తెలియఁబడఁదగినవాఁడవు అగుచున్నావు-

కైవల్యార్థులకు తెలియఁదగిన బ్రహ్మంబును అధ్యాత్మంబును ఎయ్యవి- ఐశ్వర్యార్థులకు తెలియఁదగిన అధిభూతంబును అధిదైవంబును ఏవి- ముగ్గురికిని తెలియఁదగిన అధియజ్ఞుఁడు ఎవ్వఁడు- ఈముగ్గురిచేతనును ప్రయాణకాలమున నెట్లు తెలియఁబడఁదగినవాఁడవు- అని రామానుజభాష్యము.

మరణకాలమునఁ జేయవలసినది, గతి, మొదలగునది ఈయధ్యాయమున నుపదేశింపఁబడును- అని మధ్వభాష్యము.

### శ్రీభగవానువాచ.

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే।
భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః॥౩॥

పరమమ్ అక్షరం బ్రహ్మ=పరమమైన అక్షరము బ్రహ్మము- స్వభావః అధ్యాత్మమ్ ఉచ్యతే=స్వభావము అధ్యాత్మముగాఁ జెప్పఁబడుచున్నది- భూతభావోద్భవకరః విసర్గః కర్మసంజ్ఞితః

—భూతభావముయొక్క-యుత్పత్తినిచేసెడి విసర్గము కర్మమనుసంజ్ఞ గలది.

పరమమైనయక్షరమనఁగా పరమాత్మ- స్వభావమనఁగా ఆ బ్రహ్మము ప్రతిశరీరంబునను ప్రత్యగాత్మయగుట- దేవతలంగూర్చి చరు పురోడాశాదులనువిడుచుటయె కర్మమనఁబడును- అది వర్షాది క్రమముచేత స్థావరజంగమాదిభూతములు పుట్టుటకు కారణమగును- (చరువనఁగా అన్నము- పురోడాశమనఁగా వరిపిండితోఁ జేయఁబడునది- స్థావరములు వృక్షాదులు - జంగమములు మనుష్యపశు పక్ష్యాదులు) అని శంకరభాష్యము.

అక్షరమనఁగా క్షేత్రజ్ఞసమష్టి (జీవసముదాయము)- పరమాక్షరమనఁగా ప్రకృతిసంపర్కములేని యాత్మస్వరూపము- స్వభావమనఁగా ప్రకృతి- అనఁగా ఆత్మకంటెవేఱైనదయు ఆత్మతోఁ గలియునదియునగు సూక్ష్మభూతములు, వానివాసన, మొదలగునది- ఇది తెలియఁదగినదిగాఁ బంచాగ్నివిద్యలోఁ జెప్పఁబడినది- కైవల్యము గోరువారిచే పరమాక్షరము ప్రాప్యము (పొందఁదగినది) గానును, స్వభావము పరిత్యాజ్యము (విడువవలసినది) గానును దెలియఁబడవలసినవి- భూతభావమనఁగా మనుష్యాదులగుట- అదికలుగుటకు కారణమై స్త్రీసంయోగముచేతఁ గలిగెడి రేతోవిసర్జనము (వీర్యమునువిడుచుట) కర్మమనిచెప్పఁబడును- ఈకర్మంబును దీనితో సంబంధించినవియునుగూడ నేవగింపఁదగినవిగానును పరిహరింపఁబడఁదగినవిగానును మోక్షముంగోరువారిచేఁ దెలియఁబడఁదగినవి- అని రామానుజభాష్యము.

ఇచ్చటపరమమైనయక్షరముబ్రహ్మముగాని వేదాదులుకావు-ఆత్మయందున్నదిఅధ్యాత్మము- ఆత్మాధికారంబున నేదికలదో యదియైనను- స్వభావము జీవసంబంధియగునది- స్వభావమనఁగా జీవుఁడనుఁగా వచ్చును- ఎల్లప్పుడు నొక్క విధముగానుండువాఁడని భావము- అంతఃకరణాదులు కాకుండుటకై భావశబ్దము- అంతఃకరణాదులు వికారమునుపొందునవిగాన ఎప్పుడునొక్క విధముగానుండవు. స్వశబ్దము ఈశ్వరుఁడుకాకుండుటకు- భూతములయొక్కయును అనఁగా జీవుల

యొక్కయును భావములయొక్కయును అనఁగా జడపదార్థములయొక్కయును ఉద్భవమును అనఁగా ఉత్పత్తినిచేసెడిఈశ్వరుని యొక్క వ్యాపారము విసర్గము- విశేషముగాసృజించుటకదా విసర్గము- అనిమధ్వభాష్యము.

అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్।
అధియజ్ఞో ఽహ మేవాత్ర దేహే దేహభృతాం వర॥४॥

క్షరః భావః అధిభూతమ్=క్షరమైన భావము అధిభూతము- పురుషశ్చ అధిదైవతమ్=పురుషుఁడు అధిదైవతము- (హే)దేహభృతాం వర!=(ఓ) శరీరమునుధరించినవారిలో శ్రేష్ఠుఁడా!, అత్ర దేహే అహమేవ అధియజ్ఞః=ఈ శరీరమున నేనే అధియజ్ఞుఁడను.

క్షరమైన భావముఅనఁగా నశించెడిపదార్థము- అనిత్యం= పుట్టుచున్నది- పుట్టెడివస్తువెల్లను అధిభూతము- పురుషుఁడనఁగా సూర్యునిలోనుండెడి హిరణ్యగర్భుఁడు- అతఁడు అన్నిప్రాణులయుకరణములకు (శరీరేంద్రియాదులకు) ఉపకారకుఁడు- అతఁడె అధిదైవతము- యజ్ఞము దేహముచేతఁజేయఁబడునదిగాన దేహమునందున్నట్లు చెప్పఁబడుచున్నది- అట్టి యజ్ఞములన్నిటికిని అభిమానియైన విష్ణువనెడిదేవత అధియజ్ఞము- అని శంకరభాష్యము.

అధిభూతాధిదైవతములు ఐశ్వర్యార్థులకుఁ దెలియవలసినవి- ఆకాశాదిభూతములయందుండెడి విలక్షణములైన శబ్దస్పర్శరూపరసగంధములను వానియాశ్రయములును అధిభూతము- పురుషుఁడనఁగా భోక్త- ఇంద్రుఁడు ప్రజాపతి మొదలగువారి భోగ్యములకంటె విలక్షణమైన శబ్దాదులను అనుభవించెడిపురుషుఁడు అధిదైవతము- ఈ భోక్తృత్వావస్థయైశ్వర్యార్థులచే ప్రాప్యముగాఁదలఁపఁబడఁదగినది-అధియజ్ఞుఁడనఁగా యజ్ఞములచే నారాధింపఁబడెడివాఁడను, నాకుశరీరములైన ఇంద్రాదులయందు ఆత్మగానున్న నేనే(భక్తులచే) యజ్ఞములచేతనారాధింపఁబడఁదగినవాఁడనని, పంచమహాయజ్ఞములు మొదలగు నిత్యనైమిత్తికకర్మలను ఆచరించువేళలలో,

ముగ్గురుఅధికారులచేతను తలంపఁబడవలసినది- అని రామానుజభాష్యము.

భూతములనఁగా శరీరములతోఁగూడినజీవులు- వారినిఅధికరించి యేదికలదో అ వినాశి(నశించెడి)పదార్థము అధిభూతము- అవ్యక్తమునకుఁగూడ మఱియొకవిధముగానగుటయనెడి వినాశము కలదు- పురుషుఁడనఁగా జీవుఁడు- ఇచ్చట సంకర్షణుఁడైనను బ్రహ్మయైనను- ఆతఁడు అందఱుదేవతలపైనిని అధిపతిగాన అధిదైవతము- దేవాధికారములలోనున్నవాఁడని యైనను జెప్పవచ్చును- అన్నియజ్ఞములను అనుభవించుట మొదలగుదానిచేత సర్వయజ్ఞుఁడు- అందఱుప్రాణుల శరీరమునందునుండెడి విష్ణుస్వరూపములు అధియజ్ఞము- అనిమధ్వభాష్యము.

అన్తకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్రసంశయః॥

యః=ఎవ్వఁడు, అన్తకాలే మామేవచ స్మరన్=మరణకాలమున నన్నే తలంచుచు, కళేబరం ముక్త్వా ప్రయాతి=శరీరమునువిడిచి పోవుచున్నాఁడో, సః మద్భావం యాతి=వాఁడు మద్భావమును పొందుచున్నాఁడు- అత్ర సంశయః నాస్తి=ఇందు సంశయము లేదు.

పరమేశ్వరుఁడనును విష్ణువునగు నన్నే- మద్భావమును అనఁగా వైష్ణవతత్త్వమును- అని శంకరభాష్యము.

ఇది ముగ్గురుఅధికారులకును ఆవశ్యకమె- మద్భావమును అనఁగా నాయొక్కస్వభావమును- మరణకాలమున నన్నెట్లు తలంచునో యట్టి యాకారముకలవాఁడగును- ఆదిభరతుఁడు మరణకాలమున తలంపఁబడినమృగముతో సమానమైనయాకారముకలవాఁడై పుట్టెను గదా- అని రామానుజభాష్యము.

మద్భావమును అనఁగా నాయందు ఉనికిని- అదిదుఃఖములేనిదియును నిరతిశయానందము స్వరూపముగాఁగలదియును- అని మధ్వభాష్యము.

యంయంవాఽపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్।
తంతమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః॥ ౬॥

(హే)కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, అన్తే=మరణకాలమందు, యంయంవాపి భావం స్మరన్ కళేబరం త్యజతి=ఏయే పదార్థ ముసు తలంపుచు శరీరమును విడుచుచున్నాఁడో, సదా తద్భావభావితః=ఎల్లప్పుడును దానిభావముచేతభావితుఁడై, తంతమేవ ఏతి=దానిదానినె పొందుచున్నాఁడు.

భావమనఁగా దేవతావిశేషము(ఒకటి-దేవత)- తద్భావభావితుఁడనఁగా, ఆదేవతయందలిభావము తలంపఁబడుటచేత అభ్యసింపఁబడినదిగాఁగలవాఁడు- అనిశంకరభాష్యము.

అంతకాలమునందలితలంపు, తలంచువానిని, తలంపఁబడినదానితో సజాతీయమైన యాకారముగలవానిగాఁజేయును- సదాతద్భావభావితః అనునది, అంతకాలపుతలంపు, అంతకు పూర్వము బ్రదికియున్నప్పుడు భావింపఁబడినదానియందె కలుగునని తెలియఁజేయును- అని రామానుజభాష్యము.

సదాతద్భావభావితః అనుదానిచేతను అంతకాలస్మరణమునకు ఉపాయము చెప్పఁబడినది- భావమనఁగా లోపలనుండెడిమనస్సు- భావితమనఁగా మిక్కిలివాసనకలది- అనిమధ్వభాష్యము.

తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ।
మయ్యర్పితమనోబుద్ధి ర్మామే వైష్య స్యసంశయః॥ ౭॥

తస్మాత్=ఆహేతువువలన, సర్వేషు కాలేషు మామ్ అనుస్మర=అన్నికాలములయందును నన్ను తలంపుము- యుధ్యచ=యుద్ధమునుంగూడ చేయుము- మయి అర్పితమనోబుద్ధిః=నాయందు అర్పింపఁబడినమనస్సునుబుద్ధియునుకలవాఁడవై, మామేవ ఏష్యసి=నన్నే పొందఁగలవు- అసంశయః=సంశయము లేదు.

తస్మాత్ అనుదానికి అంత్యమైన భావన (తలంపు)దేహాంతరమును పొందుటకు కారణమగుటను అని యర్థము- యుద్ధమును చేయుమనుటకు తనధర్మము నాచరింపవలసినదియనియర్థము- అనిశంకరభాష్యము.

తస్మాత్ అనుదానికి పూర్వకాలమున నభ్యసింపఁబడిన దానియందె అంతిమప్రత్యయము కలుగుటవలననని యర్థము- మరణ

మువఱకునన్ను స్మరింపుము- నాస్మృతిని కలుగఁజేసెడి యుద్ధాది
కమైన నిత్యనైమిత్తికవర్ణాశ్రమధర్మము నాచరింపుము- దీనిచేతనీబు
ద్ధియును మనస్సును నాయందర్పింపఁబడినవి అయినవాఁడవై అం
తకాలమున నన్నేతలంపుచు నన్ను పొందెదవు- అని రామానుజభా
ష్యము-

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్॥౮॥

(హే) పార్థ! =(ఓ) కుంతీపుత్రుఁడా!, అభ్యాసయోగయుక్తేన నా
న్యగామినా చేతసా = అభ్యాసయోగసహితంబును మఱియొకఁడా
నినిపొందనిదియునగు అంతఃకరణముచేత, దివ్యం పరమంపురుషమ్
అనుచిన్తయన్ = దివ్యుఁడైన పరమపురుషుని . తలంపుచున్నవాఁడై,
(పరమంపురుషమ్) యాతి = (పరమపురుషుని) పొందుచున్నాఁడు-

అభ్యాసమనఁగా మధ్యమునమఱియొకఁడు తలంపు లేకుండునట్లు నా
తలంపును ఆవృత్తిచేయుచుండుట- అదియె యోగముగాన అభ్యా
సయోగమనఁబడును- దివ్యుఁడనఁగా సూర్యమండలముననుండువాఁ
డు- అనుచిన్తయన్ అనుదానికి శాస్త్రము ఆచార్యోపదేశము వీ
నిననుసరించి ధ్యానముచేయుచున్నవాఁడై అనియర్థము- అనిశం
కరభాష్యము-

ఇఁకమూడుశ్లోకములచేతను ఐశ్వర్యార్థుల యుపాసనప్రకారం
బును అంత్యప్రత్యయప్రకారంబును చెప్పఁబడుచున్నవి- అభ్యాసమ
నఁగా నిత్యనైమిత్తికకర్మములకు విరోధములేనికాలములయందంతట
ను మనస్సుచేత ఉపాసింపవలసినదానిని అనుసంధించుట- యోగ
మనఁగా ప్రతిదినంబును యోగకాలమునవాచరింపఁబడుచుండెడి స
లక్షణమైనయుపాసనము- ఈరెంటితోనుంగూడిన మనస్సుచేత అం
తకాలమున దివ్యపురుషుఁడనైన నన్ను తలంచువేని నన్నె పొం
దును- ఆదిభరతునికి మృగత్వము వచ్చినట్లు ఐశ్వర్యముచేత నాతో
సమానమైనయాకారముకలవాఁడగును- అని రామానుజభాష్యము.

సదాతద్భావభావితత్త్వము ఈశ్లోకముచే స్పష్టపఱుపఁబడు
చున్నది- అభ్యాసమె యోగము- దివ్యుఁడనఁగా సృష్ట్యాదిక్రీడ

లుకలవాఁడు- పురుషుఁడనఁగా శరీరమునందుండువాఁడును పూర్ణుఁడును- అనిమధ్వభాష్యము.

కవిం పురాణ మనుశాసితార
మణో రణీయాంస మనుస్మరేద్యః।
సర్వస్య ధాతార మచిన్త్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥౯॥

కవిం పురాణమ్ అనుశాసితారమ్=సర్వజ్ఞుఁడైనవాఁడును పురాతనుఁడైనవాఁడును జగత్తు ననుశాసించువాఁడును, అణోః అణీయాంసమ్=అణువుకంటెను మిక్కిలిసూక్ష్మమైనవాఁడును, సర్వస్య ధాతారమ్=అన్నిటికిని ధాతయైనవాఁడును, అచిన్త్యరూపమ్=తలంపశక్యముగానిస్వరూపముకలవాఁడును, తమసః పరస్తాత్ ఆదిత్యవర్ణమ్=తమస్సునకు పైని సూర్యునివంటివర్ణముకలవాఁడును (అగువానిని), యః విచిన్తయేత్ =ఎవ్వఁడు తలఁచునో.

ఎవ్వఁడుతలంచునో వాఁడు దివ్యపురుషునిపొందును అని పూర్వశ్లోకముతోనన్వయము. అంతటికినిధాతయనఁగా కర్మఫలముల నన్నిటిని పంచియిచ్చువాఁడు- తమస్సనఁగా అజ్ఞానమనెడి చీకటికి పైనున్నవాఁడు- అనిశంకరభాష్యము.

అణువుకంటెను సూక్ష్ముఁడనఁగా జీవునికంటెను మిక్కిలిసూక్ష్ముఁడనుట- ధాతయనఁగా సృజించువాఁడు- అచిన్త్యరూపుఁడనఁగా మిగిలినపదార్థములన్నిటికంటెను విలక్షణమైనస్వరూపముకలవాఁడు- తమసః పరస్తాత్ ఆదిత్యవర్ణమ్=ప్రకృతికంటె పైభాగమున దివ్యమంగళవిగ్రహముతోఁగూడియున్నవాఁడు- ఇట్టివానిని ప్రయాణకాలమున నెవ్వఁడు తలఁచునోయని యుత్తరశ్లోకముతోనన్వయము- అని రామానుజభాష్యము.

ఈశ్లోకముచే ధ్యానముచేయవలసినది చెప్పఁబడుచున్నది- ధాత యనఁగా ధారణపోషణములఁజేయువాఁడు- తమస్సుకంటెను అనఁగా అవ్యక్తముకంటెను పైనున్నవాఁడు- అనిమధ్వభాష్యము.

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ।

భ్రువో ర్మధ్యేప్రాణమావేశ్య సమ్య
క్సతం పరం పురుష ముపైతి దివ్యమ్॥౧౦॥

ప్రయాణకాలే=మరణకాలమునందు, అచలేన మనసా భక్త్యా యోగబలేనచ యుక్తఏవ(సః)=నిశ్చలమైన మనస్సుతోను భక్తితోను యోగబలముతోను కూడుకొనినవాఁడై (అగుచు), భ్రువోః మధ్యే ప్రాణం సమ్యక్ ఆవేశ్య=కనుబొమల మధ్యమునందు ప్రాణమును లెస్సగాను ఉనిచి, సః=వాఁడు, దివ్యం పరం పురుషమ్ ఉపైతి=దివ్యుఁడైన పరమపురుషుని పొందుచున్నాఁడు.

భక్తి యనఁగా భజనము- యోగబలమనఁగా సమాధిసంస్కారములనఁ గలిగిన చిత్తస్థైర్యము- మొదటను హృదయపుండరీకమున(గుండెకాయలో)చిత్తమును స్వాధీనముచేసికొని దానినుండి పైకనడచెడి నాడిచేత భూమిజయక్రమము చేత కనుబొమలనడుమను ప్రాణమునునిలిపిన యోగి, వెనుకటిశ్లోకమున చెప్పఁబడిన యాపురుషుని పొందుచున్నాఁడు- దివ్యుఁడనఁగా ప్రకాశించుట స్వరూపముగాఁ గలవాఁడు- అని శంకరభాష్యము.

ప్రతిదినము నభ్యసింపఁబడుచున్న భక్తితోఁగూడిన యోగబలముచేత సంస్కారముకలిగియుండుటను నిశ్చలమైనమనస్సుచేత ప్రయాణకాలమున కనుబొమలమధ్యను ప్రాణమును నిలిపి, దివ్యపురుషునిఎవ్వఁడుతలంచునో, వాఁడు ఆతనినె పొందును- అనఁగా దివ్యపురుషునితోసమానమైన ఐశ్వర్యముకలవాఁడగును- అని రామానుజభాష్యము.

వాయువులనుజయించుట మొదలగు యోగముతోఁగూడినవారికిమరణకాలమున చేయవలసినది చెప్పఁబడుచున్నది- వాయుజయాదులు లేనివారైనను జ్ఞానభక్తివైరాగ్యాదులు సంపూర్ణముగాఁ గలిగెనేని ముక్తినిపొందుదురు- వాయుజయాదులుకలవారికో యన్నను జ్ఞానాదిసంపూర్తి కొంచెముతగ్గినను నేర్పరులైనచో ముక్తి కలుగును- అనిమధ్వభాష్యము.

యదక్షరం వేదవిదో వదని

విశన్తి యద్యతయో వీతరాగాః।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥౧౧॥

యత్ అక్షరమ్ వేదవిదః వదన్తి=ఏ అక్షరమును వేదములనెఱిఁగినవారు చెప్పుచున్నారో, వీతరాగాః యతయః యత్ విశన్తి=రాగములులేని యతులు దేనిని చొచ్చుచున్నారో, యత్ ఇచ్ఛన్తః బ్రహ్మచర్యం చరన్తి=దేనిని కోరుచున్నవారై బ్రహ్మచర్యమును ఆచరింపుచున్నారో, తత్ పదమ్=ఆ పొందఁదగినదానిని, తే సంగ్రహేణ ప్రవక్ష్యే=నీకు సంగ్రహముగా చెప్పఁగలను.

అక్షరమనఁగా నాశములేనిది- వేదవిత్తులనఁగా వేదార్థము నెఱిఁగినవారు, స్థూలము గానిది సూక్ష్మముగానిది పొట్టిదిగానిది పొడవైనదిగానిది అనిఇట్లు విశేషములెవ్వియు లేనిదానిగాఁ జెప్పుచున్నారో- సంన్యాసులు జ్ఞానముకలిగినపైని దేనిలోఁబ్రవేశింపుచున్నారో- ఏయక్షరమును తెలిసికొనుటకు గురువుదగ్గిర బ్రహ్మచర్యమును చేయుచున్నారో,- అని శంకరభాష్యము.

కైవల్యమునుకోరువారుస్మరింపవలసిన ప్రకారము చెప్పఁబడుచున్నది. అస్థూలత్వము(స్థూలముకాకపోవుట)మొదలగు గుణములగల అక్షరమును- ఏయక్షరమునుపొందుటకు బ్రహ్మచర్యమునుచేయుదురో- మనస్సుచేత(పద్యతే)పొందఁబడునదిగాన పదమనఁబడును- వేదాంతములచేఁదెలియఁదగిన నాయక్షరస్వరూపమునుపాసనమును సంక్షేపముగాఁజెప్పెదను- అని రామానుజభాష్యము.

ఆధ్యేయమె విస్తరముగాఁజెప్పఁబడుచున్నది- మోక్షమునుగోరువారిచే పొందబడుటచేత పదమనఁబడును- అని మధ్వభాష్యము.

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నియమ్యచ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్
ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిం॥

సర్వద్వారాణి సంయమ్య=అన్నిద్వారములను నియమించి, మనః హృది నియమ్యచ=మనస్సును హృదయమున నియమించియును,

ఆత్మనః ప్రాణం మూర్ధ్ని ఆధాయ=తనయొక్క ప్రాణమును శిరస్సునందు నిలిపి, యోగధారణామ్ ఆస్థితః=యోగధారణను పొందినవాఁడై, ఓమ్ ఇతి ఏకాక్షరం బ్రహ్మ వ్యాహరన్=ఓమ్ అని ఒక్కయక్షరమైన బ్రహ్మమును పలుకుచు, మామ్ అనుస్మరన్=నన్ను తలంపుచున్నవాఁడై, యః దేహం త్యజన్ ప్రయాతి=ఎవ్వఁడు దేహమును విడుచుచున్నవాఁడై పోవుచున్నాఁడో, సః పరమాం గతిం యాతి=వాఁడు పరమమైన గతిని పొందుచున్నాఁడు.

ప్రశ్నోపనిషత్తునందును కఠోపనిషత్తునందును ఓంకారమును భగవంతునికి వాచకముగాను ప్రతిమవలె ప్రతీకము(అవయవము)గాను ఉపాసనచేయుట మందమధ్యాధికారులకై చెప్పఁబడినది- దానివలన కాలాంతరమున ముక్తి గలుగును- ఇందును ఇఁకను అదియె చెప్పఁబడును- అన్నిజ్ఞానద్వారములను- మనస్సును నిరోధించుటయనఁగా సంచారము లేకుండునట్లు చేయుట- అహృదయమునుండిపైకిపోయెడినాడిచేత మీఁదికెక్కి, శిరస్సున తనప్రాణమును నిలిపి- ఆస్థితుఁడనఁగా ప్రవర్తించినవాఁడు- బ్రహ్మమనఁగా బ్రహ్మమునకువాచకమనుట- అప్రణవమునకర్థమైన నన్ను తలంపుచు- ప్రయాతి=వచ్చుచున్నాఁడో- దేహమునశించుటచే నాత్మకు మరణముగాని, స్వయముగానాశములేదని తాత్పర్యము- అని శంకరభాష్యము.

జ్ఞానమునకు ద్వారములైన శ్రోత్రము మొదలగు నింద్రియములనన్నిటిని వానివానివ్యాపారమునుండి మరలించి హృదయకమలముననున్న యక్షరుఁడనైన నాయందు మనస్సునునిలిపి యోగమను పేరుగలధారణను అనఁగా నాయందునిశ్చలమైనస్థితినిపొందినవాఁడై నాకువాచకమైన ఓమ్ అనుదానినిపలుకుచు దానికివాచ్యుఁడనైన నన్ను తలంపుచు- పరమగతిని అనఁగా ప్రకృతిసంపర్కము లేనివాఁడును నాతోసమానమైనయాకారముకలవాఁడనగు నాత్మను(కైవల్యమును)పొందుచున్నాఁడు- మఱిపునరావృత్తి లేదు- అని రామానుజభాష్యము.

బ్రహ్మనాడితప్ప మఱియొక్కనాడినుండి వెడలుననేని మోక్ష

మనుపొందక సూర్యుడు దిక్కులు మొదలగుస్థానాంతరములన పొందునుగాన నన్నిద్వారములను నియమించి- హృది=నారాయణుని యందు మనస్సును నిలిపి- శిరస్సునప్రాణముండగా హృదయముస మనస్సుండుట సంభవింపదు- యోగమునుధరించుట యందె మిక్కిలియుక్తుడై- అనిమధ్వభాష్యము.

అనన్యచేతా స్సతతం యోమాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః॥౧౪॥

(హే)పార్థ!=(ఓ)కుంతీపుత్రుడా!, యః అనన్యచేతాః(సన్ మామ్ సతతమ్ నిత్యశః స్మరతి=ఎవ్వడు మఱియొకడాగయందు మనస్సులేనివాడ(అగుచు) నన్ను ఎల్లప్పుడును నిత్యముగా తలంచుచున్నాడో, నిత్యయుక్తస్య తస్య యోగినః=నిత్యము గా యోగముకలవాడగు ఆ యోగికి, అహం సులభః=నేను సులభుడను.

నిత్యముగాననుటచే ఆఱునెలలుగాని ఒకసంవత్సరముగాని కాక బ్రదికియుండువఱకును ఎవ్వడు నన్ను తలచునోయని యర్థము అనిశంకరభాష్యము.

ఇకను జ్ఞానియొక్క(భగవత్ప్రాప్తినిగోరువానియొక్క)భగవదుపాసనప్రకారము చెప్పబడుచున్నది- నిత్యశః=ఉద్యోగించినది మొదలు- సతతమ్=అన్నికాలములయందును- నాతలంపులేనిచో నిలువలేనివాడై అతిప్రీతితో నన్నెవ్వండు తలంచునో- నిత్యయుక్తుడనగా నిత్యయోగమునుకోరువాడు- ఇట్టివానిని విడువనొక నేనె ఆతనినివరించెదను- నన్నుపొందుటకు తగినయుపాసనపరిపాకమును, దానివిరోధులుపోవుటను, నేనెమిక్కిలిప్రియుండనైయుండుటను, కలుగజేసెదను- అనిరామానుజభాష్యము.

నిత్యయుక్తుడనగా నిత్యోత్సాయముకలవాడు- యోగియనగా సంపూర్ణమైనయోగముకలవాడు- అనిమధ్వభాష్యము.

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్।
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః॥౧౫॥

మామ్ ఉపేత్య=నన్ను పొంది, పరమాం సంసిద్ధిం గతాః మహాత్మానః=గొప్ప సిద్ధిని పొందిన మహాత్ములు, దుఃఖాలయమ్ అశా

శ్వతమ్ పునర్జన్మ నప్రాప్నువన్తి=దుఃఖములకు స్థానమైనదియును అనిత్యమైనదియునగు పునర్జన్మము పొందరు.

౩.కను అధ్యాయాంతముకంట్ను జ్ఞానికిని కైవల్యార్థికిని అపునరావృత్తియు, ఐశ్వర్యార్థికి పునరావృత్తియును, చెప్పఁబడుచున్నది- పునః=తిరిగియు, జన్మ=జన్మమును,పొందరు- అని రామానుజభాష్యము.

ఆబ్రహ్మ భవనాల్లోకాః పునరావర్తినోఽర్జున।
మాముపేత్యతు కౌన్తేయ పునర్జన్మ నవిద్యతే॥౧౬॥

(హే) అర్జున!=(ఓ)యర్జునుఁడా!, ఆబ్రహ్మభవనాత్=బ్రహ్మలోకమువఱకు(నుండెడి), లోకాః పునరావర్తినః=లోకములు పునరావృత్తికలవి- (హే)కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, మామ్ ఉపేత్యతు=నన్ను జేరినయో, పునర్జన్మ నవిద్యతే=పునర్జన్మము లేదు-

బ్రహ్మలోకముగూడ పునరావృత్తి కలదియె- అని శంకరరామానుజభాష్యములు.

మహామేరువునందుండెడి బ్రహ్మయొక్క స్థానము మొదలు పునరావృత్తి లేదు- ఆక్రిందనె పునరావృత్తి- అనిమధ్వభాష్యము.

సహస్రయుగపర్యన్త మహ ర్య ద్బ్రహ్మణో విదుః।
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః॥

అహోరాత్రవిదః తేజనాః=ఆహోరాత్రములనెఱిఁగిన ఆజనులు, బ్రహ్మణః యత్ అహః (అస్తి)=బ్రహ్మయొక్క ఏ దినము (కలదో). (తత్) సహస్రయుగపర్యన్తమ్ విదుః=(దానిని) వేయియుగములు పర్యవసానముగాఁగలదానిగా నెఱుఁగుదురు- రాత్రిం యుగసహస్రాన్తాం (విదుః)=రాత్రిని వేయియుగములుపర్యవసానము గాఁగలదానిగా (నెఱుఁగుదురు)

బ్రహ్మయనఁగా ప్రజాపతి- అతఁడె విరాట్టు- అని శంకరభాష్యము.

బ్రహ్మయనఁగా చతుర్ముఖుఁడె- యుగములనఁగా చతుర్యుగములు- అనిరామానుజభాష్యము.

నన్నుబొందినపైని పునరావృత్తిలేదని తెలియఁజేయుటకు ఈ

వ్యక్తుఁడను పేరుగల తనయొక్క సామర్థ్యమును చూపుటకు ప్రళయాదులు చూపఁబడుచున్నవి- సహస్రమనఁగా అనేకములని- బ్రహ్మయొక్క యనఁగా పరబ్రహ్మముయొక్క- ద్విపరార్ధప్రళయమె ఇచ్చట వివక్షింపఁబడినది- అనిమధ్వభాష్యము.

అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే॥౧౮॥

అహరాగమె=పగటిసమయమునందు, అవ్యక్తాత్ సర్వాః వ్యక్తయః ప్రభవన్తి=అవ్యక్తమునుండి అన్ని వ్యక్తులును బుట్టుచున్నవి- రాత్ర్యాగమే=రాత్రిసమయమునందు, అవ్యక్తసంజ్ఞకే తత్రైవ ప్రలీయన్తే=అవ్యక్తమను పేరుగల దానియందె లీనమగుచున్నవి.

అవ్యక్తమనఁగా ప్రజాపతియొక్క నిద్రావస్థ- వ్యక్తులనఁగా స్థావరజంగమరూపములగు ప్రజలు- అహరాగమకాలమనఁగా బ్రహ్మ మేలుకనియున్నప్పుడు- రాత్ర్యాగమకాలమనఁగా బ్రహ్మ నిద్రపోవునప్పుడు- అనిశంకరభాష్యము.

వ్యక్తులనఁగా మూఁడులోకములలోననుండెడి శరీరములు ఇంద్రియములు భోగములు భోగస్థానములు అనునవి- అవ్యక్తమనఁగా చతుర్ముఖదేహావస్థను పొందిన ప్రకృతి- అనిరామానుజభాష్యము.

అవ్యక్తుఁడనఁగా భగవంతుఁడు- అనిమధ్వభాష్యము.

భూతగ్రామ స్స ఏవాయం భూత్వాభూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమె ఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే॥౧౯॥

(హే)పార్థ!=(ఓ)యర్జునుఁడా!, సోఽయం భూతగ్రామః అవశఏవ=ఆయీ భూతసమూదాయము అస్వాధీనమైయె, భూత్వా భూత్వా=కలిగికలిగి, రాత్ర్యాగమె ప్రలీయతె=రాత్రిసమయమున లీనమగుచున్నది- అహరాగమె ప్రభవతి=పగటిసమయమునందు పుట్టుచున్నది-అవశమైయనఁగా కర్మవశ్యమైయనుట.

పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తా త్సనాతనః।
యస్ససర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి॥౨౦॥
అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్।
యం ప్రాప్య ననివర్తన్తే తద్ధామ పరమం మమ॥౨౧॥

తస్మాత్ అవ్యక్తాత్ పరః=ఆ అవ్యక్తముకంటెను ఉత్కృష్టమైనదియును, అన్యః అవ్యక్తః సనాతనః యో భావః(అస్తి)=విలక్షణమైనదియు ఇంద్రియగోచరముకానిదియు నిత్యమైనదియునగు ఏభావము(కలదో), సః=అది, సర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి=అన్ని భూతములును నశించుచున్నను నశింపదు- (యః) అవ్యక్తః అక్షరః ఇతి ఉక్తః=(ఏది) అగోచరము నాశములేనిది అని చెప్పఁబడినదో, తం పరమాం గతిమ్ ఆహుః=దానిని పరమమైన గతినిగాను చెప్పుచున్నారు- యం ప్రాప్య ననివర్తన్తే=దేనిని పొంది మఱలరో, తత్ మమ పరం ధామ=అది నాయొక్క గొప్ప స్థానము.

వెనుకఁజెప్పఁబడిన యక్షరమును పొందుటకు సాధనము ఓమిత్యేకాక్షరంబ్రహ్మ(౮అ॥ ౧౩శ్లో)అనునది మొదలు చెప్పఁబడినది- ఆ యక్షరస్వరూపమిఁక చెప్పఁబడును- భూతసమూహములకు బీజమైనదియును అవిద్యాస్వరూపమైనదియునగు నవ్యక్తముకంటె పరము అనఁగా భిన్నమైనది- అన్యము అనఁగా విలక్షణమైనది- పరమధామమనఁగా విష్ణువైన నాయొక్కపరమపదము- అని శంకరభాష్యము.

అవ్యక్తముకంటెననఁగా నచేతనమైన ప్రకృతికంటె నుత్కృష్టంబును, విలక్షణంబును, ప్రమాణముచేతను తెలియంబడదగనిదై తనకుమాత్రము తెలియఁదగినయాకారముకలదియునగు పరిశుద్ధాత్మస్వరూపము అక్షరము- అనఁగా ప్రకృతిసంబధము పోయినయాత్మస్వరూపము- దీనిపొందుటయె కైవల్యము- అది అపునరావృత్తియైనది- ధామమనఁగా నియమనస్థానము- అచేతనమైనప్రకృతి మొదటినియమనస్థానము- దానితోఁగలిసియున్నజీవుఁడు వెడిప్రకృతి రెండవనియమనస్థానము- అచేతనసంసర్గముపోయిన ముక్తస్వరూపము గొప్పనియమనస్థానము- ధామశబ్దమునకు ప్రకాశముగూడ నర్థముగాన ప్రకృతిసంపర్కముగలిగి పరిమితజ్ఞానముగలయాత్మకంటె, అపరిమితజ్ఞానముకల ముక్తస్వరూపము గొప్ప ప్రకాశమనియునర్థము చెప్పవచ్చును- ఏదిఅవ్యక్తముకంటె గొప్పదో అని మొ

దలుపెట్టి ఏది సర్వభూతములునశించిననునశింపదో అయవ్యక్తమె అక్షరము- అనియన్వయము- అనిరామానుజభాష్యము-

ధామ=స్వరూపము- తెజస్సు- అనిమధ్వభాష్యము.

పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా।
యస్యాన్తస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥౨౨॥

(హే)పార్థ!=(ఓ)యర్జునుడా!, భూతాని యస్య అన్తస్థాని=భూతనులు ఎవ్వని లోపలనున్నవో, యేన ఇదం సర్వం తతమ్=ఎవ్వనిచేత ఇది యంతయును వ్యాపింపబడినదో, సః పరః పురుషః=ఆ పరుడైన పురుషుడు, అనన్యయా భక్త్యా లభ్యః=అనన్యయగు భక్తిచేత పొందదగినవాడు.

భక్తియనగా జ్ఞానము- అనన్యయనగా ఆత్మవిషయమైనది- అనిశంకరభాష్యము.

జ్ఞానియొక్క ప్రాప్యము కైవల్యముకంటె విలక్షణమైనదని ఈశ్లోకము తెలియజేయుచున్నది- అనన్యయనగా ఆపరమపురుషుడె విషయముగాగలది- అనిరామానుజభాష్యము-

ఈశ్లోకనుచేబకమసాధనము చెప్పబడుచున్నది- అని మధ్వభాష్యము.

యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥౨౩॥

(హే)భరతర్షభ!=(ఓ)భరతశ్రేష్ఠుడా!, యత్ర కాలేతు ప్రయాతాః యోగినః=ఏ కాలమున బయలుదేరిన యోగులు, అనావృత్తిమ్ ఆవృత్తించైవ యాన్తి=మరలకపోవుటను మరలుటనును పొందుచున్నారో, తం కాలం వక్ష్యామి=ఆ కాలమును చెప్పుచున్నాను.

కాలవ్యవధితోముక్తినిపొందెడి ఉపాసకులయొక్కమార్గము అనావృత్తిమార్గము- కర్మములనాచరించువారిమార్గము ఆవృత్తిమార్గము- అనావృత్తిమార్గమును స్తోత్రము చేయుటకుగాను ఆవృత్తిమార్గముచెప్పబడినది- యోగులనగా ఉపాసకులును కర్మయోగులును- ప్రయాతులనగా మరణమునుపొందినవారు- అని శంక

రభాష్యము.

కాలమనఁగా మార్గము- కైవల్యమునుపొందువానికిని భగవత్ప్రాప్తినిపొందువానికినిగూడ ననావృత్తిమార్గమె- పుణ్యకర్మములఁజేయువారికి ఆవృత్తిమార్గము- అని రామానుజభాష్యము.

కాలేనుట ఉపలక్షణము- అగ్న్యాదులుగూడ చెప్పఁబడినవిగదా- అనిమధ్వభాష్యము.

అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥

అగ్నిః జ్యోతిః అహః శుక్లః షణ్మాసాః ఉత్తరాయణమ్(ఇతి యః మార్గః అస్తి)=అగ్నియును జ్యోతిస్సును దినంబును శుక్లపక్షంబును ఆఱుమాసంబులును ఉత్తరాయణంబును(అని ఏ మార్గము కలదో), తత్ర ప్రయాతాః బ్రహ్మవిదః జనాః=దానిలో ప్రయాణముచేసిన బ్రహ్మజ్ఞులగు జనులు, బ్రహ్మ గచ్ఛన్తి=బ్రహ్మమును పొందుచున్నారు.

అగ్నియును జ్యోతిస్సును కాలాభిమానిదేవతలు- కాలాభిమానులుకాని దేవతలనియుఁజెప్పవచ్చును- ఆపక్షమున కాలాభిమానిదేవతలు విస్తారముగానుండుటచేత కాలమని చెప్పుట- మిగిలినచెట్లు కలిగినను మామిడిచెట్లు మిక్కిలిగాఁగలతోటను మామిడితోటయనునట్లు- ఆఱుమాసములైన ఉత్తరాయణమని రెండునొక్కదేవతయె- బ్రహ్మవిత్తులనఁగా బ్రహ్మమును ఉపాసించువారు (సగుణోపాసకులు)- బ్రహ్మజ్ఞానముకలవారికి (నిర్గుణోపాసకులకు) తత్క్షణముననె ముక్తికలుగునుగాని యర్చిరాదిమార్గాపేక్షలేదు- అనిశంకరభాష్యము.

అగ్న్యాదులు మిగిలినసంవత్సరాదులకుఁగూడనుపలక్షకములు- అని రామానుజభాష్యము. (అగ్నిరూపమైన జ్యోతిస్సని అర్చిర్లోకము చెప్పఁబడును అని రామానుజీయటీక)

అగ్నిని పొందినతరువాత పొందఁదగిన జ్యోతిస్సనునది అర్చిస్సె- మాసాభిమానిదేవతలును అయనాభిమానిదేవతలును వేఱుగాని యొక్కటికాదు- అహస్సు అభిజిత్తోనును శుక్లపక్షము పొ

ణ్ణమాసితోనునని మెఱుంగునది- అని మధ్వభాష్యము.

ధూమో రాత్రి స్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్।
తత్రచాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్యనివర్తతే॥౨౫॥

ధూమః రాత్రిః తథా కృష్ణః షణ్మాసాః దక్షిణాయనమ్=ధూమంబును రాత్రియును అట్లె కృష్ణపక్షంబును ఆఱుమాసంబులు(అయిన) దక్షిణాయనంబును(ఇతి యః మార్గః అస్తి=అని యే మార్గము కలదో) తత్ర చాన్ద్రమసం జ్యోతిః ప్రాప్య=దానిలో చంద్రసంబంధియగు తేజస్సును పొంది, యోగీ నివర్తతే=యోగి మఱలుచున్నాఁడు.

ధూమమనఁగా ధూమాభిమానిదేవత- ఇట్లె రాత్ర్యాదులును- యోగియనఁగా కర్మములంజేసినవాఁడు- అచ్చటియనుభవము క్షయించినతోడనె మఱలుచున్నాఁడు- అని శంకరభాష్యము.

ఇదియును పితృలోకాదుల కుపలక్షకము- యోగియనఁగా పుణ్యకర్మసంబంధముకలవాఁడు. అని రామానుజభాష్యము.

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తి మన్యయావర్తతే పునః॥౨౬॥

జగతః=జగత్తునకు, శుక్లకృష్ణే ఏతే గతీ=తెల్లనిదియు నల్లనిదియునగు ఈమార్గములు, శాశ్వతే మతే=శాశ్వతములుగా అభిమతము లైనవి- ఏకయా అనావృత్తిం యాతి=ఒకదానిచేత అనావృత్తిని పొందుచున్నాఁడు- అన్యయా పునః ఆవర్తతే=రెండవదానిచేత వెండియును మఱలుచున్నాఁడు-

జ్ఞానమును ప్రకాశింపఁజేయునదిగాన తెల్లనిది- అట్టిది కాకుండునది నల్లనిది- జగత్తనఁగా జ్ఞానకర్మాధికారులుమాత్రమె కాని జగత్తంతయును కాదు- సంసారము నిత్యముగాన ఈమార్గములును నిత్యములే- అని శంకరభాష్యము.

శుక్లగతియనఁగా నర్చిరాదిమార్గము(౧)- కృష్ణగతియనఁగా ధూమాదిమార్గము(౨)- ఈగతులు రెండువిధములజ్ఞానులకును(౧) పుణ్యకర్ములుకలవారికిని(౨) తప్పనివని శ్రుతిలోఁజెప్పఁబడినవి- అని రామానుజభాష్యము.

నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన।
తస్మా త్సర్వేషు కాలేషు యోగయుక్తో భ వార్జున।

(హే)పార్థ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, ఏతే సృతీ జానన్ యోగీ= ఈ మార్గములను ఎఱుఁగుచున్న యోగి, కశ్చన(అపి) నముహ్యతి=ఒకఁడు(ను) మోహముం జెందఁడు- తస్మాత్ =ఆ హేతువువలన, (హే)అర్జున!, (ఓ)యర్జునుఁడా!, సర్వేషు కాలేషు యోగయుక్తః భవ=అన్ని కాలములయందును యోగముతోఁ గూడినవాఁడవు అగుము.

ఒకటి సంసారముకొఱకు అనియు, రెండవది మోక్షముకొఱకుఅనియు నెఱిఁగెడియోగి- అనిశంకరభాష్యము.

ఈమార్గములనెఱిఁగినయోగి ప్రయాణకాలమున మోహమును జెందఁడు- మఱియేమన్నను- తన యర్చిరాదిమార్గముననే పోవును- కాఁబట్టి ప్రతిదినంబును అర్చిరాదిగతిని తలంచుటయనెడి యోగముకలవాఁడవు అగుము- అనిరామానుజభాష్యము.

ఈమార్గములను తెలిసికొని ఉపాయమును ఆచరించువాఁడు మోహమును జెందఁడు- అని మధ్వభాష్యము.

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్॥ ౨౮॥

వేదేషు యజ్ఞేషు తపస్సు దానేషుచైవ = వేదములయందును యజ్ఞములయందును తపస్సులయందును దానములయందును, యత్ పుణ్యఫలం ప్రదిష్టమ్=ఏ పుణ్యఫలము చెప్పఁబడినదో, ఇదం విదిత్వా=దీనిని తెలిసికొని, యోగీ తత్ సర్వమ్ అత్యేతి=యోగి దానిని అంతయును అతిక్రమించుచున్నాఁడు- ఆద్యం పరం స్థానంచ ఉపైతి=మొదటిదియును గొప్పదియునగు స్థానమును పొందుచున్నాఁడు.

యోగమాహాత్మ్యము చెప్పఁబడుచున్నదీ- ఈయేడుప్రశ్నముల ౮(అ॥౧శ్లో॥) యుత్తరములలోఁ జెప్పఁబడిన యంశములను తెస్స

గా నాచరించెడి యోగి, వేదాధ్యయనాదులను లెస్సగా నాచరించుటవలన నేపుణ్యఫలము శాస్త్రముచేతఁ జెప్పఁబడినదో, ఆఫలమును అతిక్రమించిపోవుచున్నాఁడు- గొప్పదైన ఈశ్వరసంబంధియగు స్థానమునను పొందుచున్నాఁడు- ఆద్యమనఁగా కారణమైనబ్రహ్మము- అని శంకరభాష్యము.

ఈ సప్తమాష్టమాధ్యాయములలోఁ జెప్పఁబడిన భగవన్మాహాత్మ్యమును తెలిసికొనినవాఁడు వేదాభ్యాసాది సమస్తపుణ్యకార్యములయందును నేఫలము చెప్పఁబడినదో దానినతిక్రమింపుచున్నాఁడు- భగవన్మాహాత్మ్యమును తెలిసికొనుటయనెడి సుఖముతప్ప రెండవదానిని గడ్డిపరకనువలె తలంపుచున్నాఁడు- అటపైని యోగియనఁగా జ్ఞానియై జ్ఞానికిపొందఁదగిన గొప్పస్థానమునుపొందుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

ఇతిశ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అక్షరపరబ్రహ్మయోగోనామ అష్టమోధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జున సంవాదంబునగు భగవద్గీతలలో అక్షరపరబ్రహ్మయోగప్రతిపాదకంబగు నెనిమిదవయధ్యాయము.



## తొమ్మిదవయధ్యాయము

### శ్రీభగవానువాచ

ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥

అనసూయవే తే=అసూయలేనివాఁడవగు నీకు, గుహ్యతమం విజ్ఞానసహితమ్ ఇదం జ్ఞానమ్=మిక్కిలిరహస్యమైనదియును విజ్ఞానముతోఁ గూడినదియునగు ఈ జ్ఞానమును, ప్రవక్ష్యామి=చెప్పఁగలను- యత్ జ్ఞాత్వా అశుభాత్ మోక్ష్యసే=దేనిని తెలిసికొని అశుభమునుండి విడువఁబడఁగలవో.

అంతయును వాసుదేవుఁడెఅనెడి యిదియె మంచిజ్ఞానము, అనువిశేషమును తెలియఁజేయునది తుశబ్దము- విజ్ఞానమనఁగా ననుభవము- అశుభమనఁగా సంసారబంధనము- అనిశంకరభాష్యము.

జ్ఞానమనఁగా భక్తిరూపమైనయుపాసనము- విజ్ఞానమనఁగా ఉపాసనయొక్కగతివిశేషములజ్ఞానము- అసూయలేనివాఁడనఁగా నామాహాత్మ్యమును విని, దానిని నమ్మినవాఁడు- ఏజ్ఞానమును అనుష్ఠానపర్యంతముగా (ఆచరించుటవఱకును) తెలిసికొని నన్ను జేరుటకు విరోధియైన యశుభమునుండి విడువంబడుదువో- అని రామానుజభాష్యము.

సప్తమాధ్యాయమునఁ జెప్పఁబడినదియె యీయధ్యాయమున స్పష్టపఱుపఁబడును- అనిమధ్వభాష్యము.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్॥౨॥

ఇదం (జ్ఞానమ్) రాజవిద్యా=ఈ(జ్ఞానము) విద్యలకురాజు- రాజగుహ్యమ్=రహస్యములకురాజు- ఉత్తమం పవిత్రమ్=గొప్ప పవిత్రము(శుద్ధిని చేయునది)- ప్రత్యక్షావగమమ్=ప్రత్యక్షావగమము- ధర్మ్యమ్=ధర్మముతప్పనిది- కర్తుం సుసుఖమ్=ఆచరించుటకు మిక్కిలిసుఖకరమైనది- అవ్యయమ్=నాశములేనిది.

పవిత్రమనఁగా అనేకజన్మసంచితములగు [illegible]

ధర్మాధర్మాదులకు మూలమైనకర్మమును ఈజ్ఞానము క్షణమా
త్రమున భస్మముచేయుననుట- ప్రత్యక్షావగమమనఁగా సుఖాదుల
వలె ప్రత్యక్షముచేతనె తెలియఁబడునది- శ్యేనయాగమువలె ధ
ర్మమునకు విరుద్ధముకాదని తెలియఁజేయుటకు ధర్మ్యమ్ అనువిశే
షణము- ఇట్లయినను కష్టసాధ్యముకాదు- సులభసాధ్యమైనను
నాశములేనిఫలముకలదని తెలియఁజేయునది అవ్యయమ్ అనువిశేషణము-
అని శంకరభాష్యము.

రాజులు విరివియై గంభీరమైనమనస్సుకలవారలు గాన ఈవి
ద్యగొప్పమనస్సుకలవారికె- పవిత్రమనఁగా నన్నుపొందుటకు వి
రోధులైన పాపములనన్నిటిని పోగొట్టును- అవగమమనఁ
గా తెలియఁబడునది- అనఁగా విషయము- ప్రత్యక్షమైన విషయ
ముకలది- భక్తిరూపమైనయుపాసనముచేత సేవింపఁబడుచున్న
నేను అప్పుడెయుపాసనముచేయువానికి ప్రత్యక్షుఁడనగుదునని య
ర్థము- ధర్మ్యమనఁగా నిశ్శ్రేయసము(గొప్పమేలు)నకుసాధనము-
ఈజ్ఞానము స్వయముగా మిక్కిలిప్రియమగుటను అప్పుడెనాద
ర్శనమును కలుగఁజేయునది యగుటను స్వయముగా నిశ్శ్రేయస
స్వరూపమైనను నన్నుపొందుటయనెడి నిశ్శ్రేయసమునకుసాధనము
కూడనగునని యర్థము- ఇదియాచరింపఁబడుచుండగనె సుఖము
నుకలుగఁజేయును- అవ్యయమనఁగా క్షయింపనిది- నన్నుపొందించి
యును తానునశింపదు- ఇట్టియుపాసనమును చేయువానికి నేను నన్ను
ఇచ్చినను, వీనికేమియును చేయనైతిననే నాకుతోచును- అని రామా
నుజభాష్యము.

రాజవిద్యయనఁగా ప్రధానవిద్య- ప్రత్యక్షమైనబ్రహ్మము దేని
చేతఁదెలియఁబడునో యదిప్రత్యక్షావగమము- అక్షములయందు అనఁ
గా నింద్రియములయందుండువాఁడుగాన భగవంతుఁడు ప్రత్యక్షుఁ
డనఁబడును- సమస్తజగత్తునుధరించువాఁడుగాన ధర్మశబ్దమునకు
భగవంతుఁడర్థము- అతఁడు విషయముగాఁగలది ధర్మ్యము- అని
మధ్వభాష్యము.

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప।

అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని॥ ౩॥

(హే)పరంతప!=(ఓ) శత్రువులనుతపింపఁజేయువాఁడా!, అస్య ధర్మస్య అశ్రద్దధానాః పురుషాః=ఈధర్మమునకు నమ్మని పురుషులు, మామ్ అప్రాప్య=నన్ను పొందక, మృత్యుసంసారవర్త్మని నివర్తన్తే=మృత్యువుతోఁగూడినసంసారమార్గమునందు మఱలుచున్నారు.

అస్య ధర్మస్య (స్వరూపే ఫలేచ) అశ్రద్దధానాః-ఈ యాత్మజ్ఞానముయొక్క (స్వరూపమునందును ఫలమునందును) శ్రద్ధచేయనివారు- వారు దేహమేయాత్మయనుకొనువారు- నన్ను బొందక అనఁగా నన్నుబొందుటకు సాధనమైన భక్తినిగూడ పొందక- అనిశంకరభాష్యము.

ఈయుపాసనమును స్వీకరించుటకు తగిన దశను పొందియును శ్రద్ధచేయనివారై అనఁగానమ్మకముతోఁగూడిన త్వరలేనివారై మృత్యురూపమైన సంసారమార్గమున నిశ్చయముగా నున్నారు- ఏమియాశ్చర్యము! అనిరామానుజభాష్యము.

మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా।
మత్స్థాని సర్వభూతాని నచాహం తే ష్వవస్థితః॥ ౪॥
నచమత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్।
భూతభృ న్నచ భూతస్థో మమాత్మా భూతభావనః॥ ౫॥

అవ్యక్తమూర్తినా మయా=స్ఫుటపడనియాకారముగల నాచేత, ఇదం సర్వం జగత్=ఈ సమస్తమైన జగత్తును, తతమ్=వ్యాపింపఁబడినది- సర్వభూతాని మత్స్థాని=అన్నిభూతములును నాయందున్నవి- అహంచ తేషు నావస్థితః=నేను వానియందు లేను- భూతాని మత్స్థానిచ న=భూతములు నాయందున్నవియును కావు- మే ఐశ్వరం యోగం పశ్య=నాయొక్క ఈశ్వరసంబంధియగు యోగమును చూడుము- మమ ఆత్మా భూతభృత్=నాయాత్మ భూతములనుభరించునది- భూతస్థః నచ=భూతములయందుండునది కాదు- భూతభావనః=భూతములను కలుగఁజేయునది.

నాచేతననఁగా నాయొక్క పరమభావముచేతను; అవ్యక్తమ

నఁగా కరణములకు (ఇంద్రియములకు) అగోచరమైనది. భూతము లనఁగా బ్రహ్మాదులు గడ్డికాడవఱకున్నవి. ఆత్మలేనిభూత మొక్కటియు వ్యవహారమునకుతగదుగాన నాయందున్నవియనఁగా నేనుఆత్మయగుటచే నాత్మకలవైయున్నవిఅనుట. ఆభూతములకు నేను ఆత్మనుగాన నేనువానియందున్నానని మూఢబుద్ధు లాలోచును. దానికిగాను, ఒకవస్తువునకు మఱియొకవస్తువుతోడవలె నాకు వానితో సంశ్లేషము (సంయోగము) లేదుగాన, నేనువానియందు లేనని చెప్పుచున్నాను. ఆకాశమునకుఁగూడ నేనులోపలివాఁడనుగదా. నేను సంసర్గము(సంయోగము) లేనివాఁడను గావుననే బ్రహ్మాదిభూతములు నాయందున్నవియునుగావు. యోగమనఁగా ఘటనము. మఱియొకయాశ్చర్యమునుగూడఁ జూడుము. సంగములేనివాఁడనైనను భూతములనుభరించుచున్నాను. వెనుకఁ జెప్పిన చొప్పున భూతములయందుండువాఁడను కాను. నాయాత్మయని భగవంతుఁడు చెప్పుట, లోకబుద్ధ్యనుసారమున. లోకమునందు అజ్ఞానులు దేహమును నేనుఅనుకొని నాయాత్మయనునట్లె. ఆత్మయైన భగవంతునికి మఱియొకయాత్మ లేఁడుగదా. భూతభావనుఁడనఁగా భూతములనువృద్ధిపొందించువాఁడు. పుట్టించువాఁడనియుఁ జెప్పవచ్చును. అనిశంకరభాష్యము.

చేతనాచేతనస్వరూపమగునీజగత్తును నిలుపుటకును నియమించుటకును అంతర్యామినై నేను వ్యాపించియున్నవాఁడను. నేను వానియందు లేను అనఁగా నాయునికి వానికి అధీనముకాదు. నేను నిలిచియుండుటకు వానియుపకారమేమియు లేదనుట. నీళ్లకు కుండయాధారమగునట్లు నేను వానినిధరించుచున్నవాఁడనుగాను. నాసంకల్పముచేతనే వానిని నిలువఁబెట్టుచున్నాఁడను. నేనుసమస్తభూతములనుపోషించువాఁడను, వానివలననాకేమియునుపకారములేదు, నాయొక్కయాత్మయనఁగా నాసంకల్పమె భూతములనుకలుగఁజేయునదియు నియమించునదియును, అపెడి ఈ యాశ్చర్యమైన అనఁగా మఱియొకచో నూహింపశక్యముగాని యోగమునుచూడుము. అని రామానుజభాష్యము.

నాయందు సమస్తమునున్నను భూమియందు స్పృశించి (తగిలి) పదార్థములున్నట్లు నాయందు లేవు- నా యాత్మయనఁగా శరీరమే భూతభావనము- అని మధ్వభాష్యము.

యథాఽఽకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ॥౬॥

నిత్యమ్ ఆకాశస్థితః=ఎల్లప్పుడును ఆకాశమునందున్నదియు, సర్వత్రగః మహాన్ వాయుః యథా=అంతటనున్నదియు గొప్పదియునగు వాయువు ఎట్లో, తథా=అట్లు, సర్వాణి భూతాని మత్స్థాని=అన్ని భూతములును నాయందున్నవి, ఇతి ఉపధారయ=అని నిశ్చయించికొనుము.

ఆకాశము వలెనంతటనున్న నాయందు సంశ్లేషము (సంయోగము) లేకయె యన్నిభూతములున్నవి- అని తెలిసికొనుము- అని శంకర భాష్యము.

నిరాలంబనమునను న్న వాయువు అంతటను సంచరింపుచున్నది- అని రాలంబనమైన వాయువు నాయధీనమైన యుని కిగలదని అవశ్యముగా నంగీకరింపవలసినదై నాచేతధరింపఁబడినదని ఎట్లు తెలియఁబడుచున్నదో, ఇట్లె అన్నిభూతములును, వానికి కనుబడనినా యందుండి నాచేతధరింపఁబడినవని నిశ్చయించికొనుము- అని రామానుజభాష్యము.

నాయందున్నవియు నాయందు లేనివియుననుటకు దృష్టాంతము చెప్పఁబడుచున్నది- ఆకాశమునందున్న వాయువు స్పర్శము మొదలగు వానిని పొందదుగదా- అని మధ్వభాష్యము.

సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్।
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్॥౭॥

(హే) కౌన్తేయ! =(ఓ) కుంతీపుత్రా! [illegible] మామికాం ప్రకృతిం యాన్తి=అన్ని [illegible] మున నాయదియైన ప్రకృతిని పొందు[illegible] తాని పునః విసృజామి=కల్పారంభమున నేను వానిని వెండియు సృజించెదను.

ప్రకృతి యనఁగా త్రిగుణాత్మకమగు అపరప్రకృతి(౭అ॥౫శ్లో) అని శంకరభాష్యము.

స్థావరజంగమాత్మకములగు భూతములన్నియు, చతుర్ముఖుని యవసానకాలమున నాయదియనఁగా నాకు శరీరమైన ప్రకృతిని ఆనఁగా నామరూపవిభాగము లేని అవిభక్తతమస్సును(అసృష్టిసంగ్రహము)పొందుచున్నవి- అని రామానుజభాష్యము.

జ్ఞానమును చూపుటకై ప్రళయాంతములు విస్తరింపఁజేయఁబడుచున్నవి- అని మధ్వభాష్యము.

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః।
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ ॥౮॥

స్వాం ప్రకృతిమ్ అవష్టభ్య=స్వకీయమైన ప్రకృతిని పట్టి, ప్రకృతేః వశాత్ అవశమ్ కృత్స్నమ్ ఇమం భూతగ్రామమ్=ప్రకృతియొక్క వశమువలన అవశమై సమస్తమైన ఈ భూతసమూహమును, పునఃపునః విసృజామి=మాటిమాటికి సృజింపుచుందును.

అవశమనఁగా అవిద్యాదిదోషములచేత పరవశమైనది- ప్రకృతివశమువలననఁగా స్వభావవశమువలన ననుట- అని శంకరభాష్యము.

ప్రకృతిని భూమ్యాది(౭అ॥౪శ్లో)రూపముల నెనిమిదివిధములుగాఁ బరిణమింపఁజేసి- దేవతలు తిర్యక్కులు(పశుపక్ష్యాదులు)స్థావరములు(చెట్లు మొదలుగునవి) అని నాలుగువిధములగు భూతసమూహమును- నాయదియు మోహింపఁజేయునదియు గుణమయమైనదియునగు ప్రకృతివలన అవశమైనది- అని రామానుజభాష్యము.

కాళ్ళనడచుటకు సమర్థుఁడైనవాఁడే లీలచేత, కఱ్ఱనుపట్టుకొని నడచునట్లు భగవంతుఁడు ప్రకృతిని పట్టుట- అని మధ్వభాష్యము.

న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ।
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు॥౯॥

(హే)ధనఞ్జయ!=(ఓ)యర్జునుఁడా!, ఉదాసీనవత్ ఆసీనమ్=ఉపేక్షించువానివలె నున్నవాఁడనును, తేషు కర్మసు అసక్తమ్=ఆ కర్మములయందు సంగములేనివాఁడనునగు, మాం తాని కర్మాణి

ననిబధ్నన్తి=నన్ను ఆ కర్మములు బంధింపవు.

ఆకర్మములనఁగా భూతముల విషమసృష్టికి కారణములైనవి- అసక్తుఁడననఁగా ఫలసంగము లేనివాఁడనును నేను చేయుచున్నానని యెడి యభిమానము లేనివాఁడనును- కాఁబట్టి యె మఱియెవ్వఁడైనను ఫలసంగమును కర్తృత్వాభిమానమును లేనివాఁడు బంధమును పొందఁడు- అట్లుగానిచో కోసనకాయపురుగువలె కర్మబంధమును పొందును- అని శంకరభాష్యము.

ఆ కర్మములనఁగా భూతములను హెచ్చుతగ్గులుగా సృజించుట మొదలగునవి- నన్ను బంధింపవు అనఁగా నాకు వైషమ్యము(దయ లేకపోవుట)మొదలగువానిని కలుగఁజేయవు- జీవులు పూర్వము చేసికొనిన కర్మము లేకదా విషమసృష్టికి హేతువులు- ఆవైషమ్యమున నాకు సంగము లేదు- అని రామానుజభాష్యము.

ఉదాసీనునివలెనుండును గాని ఉదాసీనుఁడు కాఁడు- అసక్తమ్. అనునది దీనియర్థమునే తెలియఁజేయును- ఎవ్వనికి సంగము లేకపోవుటవలన సర్వకర్మశక్తియును కలుగుచున్నదో వానికి సర్వకర్మబంధమెట్లు కలుగును? ఎవ్వఁడు కర్మమునుగూడ నియమించునో వానిని కర్మము ఎట్లు బంధించును? అని మధ్వభాష్యము-

మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్।
హేతునాఽనేన కౌన్తేయ జగద్విపరివర్తతే॥౧౦॥

అధ్యక్షేణ మయా=అధ్యక్షుండనైన నాచేతను, ప్రకృతిః=ప్రకృతి, సచరాచరం జగత్ సూయతే=జంగమస్థావరములతోఁగూడిన జగత్తును కనుచున్నది. (హే)కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, అనేన హేతునా జగత్ విపరివర్తతే=ఈ హేతువుచేత జగత్తు ప్రవర్తింపుచున్నదిగదా.

జ్ఞానమాత్రస్వరూపుఁడనును ఆత్మనునగు నేను అధ్యక్షుఁడుగాననఁగా సాక్షిగానుండఁగా త్రిగుణాత్మికమై అవిద్యయనఁబడెడి నామాయ జగత్తును బుట్టించుచున్నది- ఈ హేతువుచేతను అనఁగా నేనిట్లు అధ్యక్షుఁడనైయుండుటచేతను- అని శంకరభాష్యము-

క్షేత్రజ్ఞుల కర్మములననుసరించియె నేను ప్రకృతికి అధ్యక్షుఁడనైయుందును- ఇందువలననె నాకు నైర్ఘృణ్యాదిదోషములు లేవు- అని రామానుజభాష్యము.

ఉదాసీనునివలెనున్నచో ప్రకృతి స్వయముగానె సృజించునను అనినం జెప్పుచున్నాఁడు- ప్రకృతియొక్క సూతిని అనఁగా సృష్టిని చూచెడికర్తను నేనె అనియర్థము- అనిమధ్వభాష్యము.

అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్॥౧౧॥

మూఢాః=మూఢులు, మమ భూతమహేశ్వరం పరం భావమ్ అజానన్తః=నాయొక్క భూతములకునియామకమైనదియు గొప్పదియునగు తత్త్వమును ఎఱుంగకున్నవారై, మానుషీం తనుమ్ ఆశ్రితం మామ్ అవజానన్తి=మనుష్యసంబంధియగు శరీరమును ఆశ్రయించిన నన్ను అనాదరింపుచున్నారు.

మనుష్యదేహమును ఆశ్రయించినవాఁడనఁగా మనుష్యదేహముచేత వ్యవహరింపుచున్నవాఁడు- భావమునుఅనఁగా ఆకాశమువలె నుండునదియు ఆకాశముకంటెను సూక్ష్మమైనదియునగు పరమార్థతత్త్వమును- అనిశంకరభాష్యము.

భూతమహేశ్వరం మామ్=భూతములకుపరమేశ్వరుఁడనైన నన్ను అవజ్ఞచేయుటయనఁగా ప్రాకృతమనుష్యులతో సమముగాఁదలంచుట- పరమైనభావమునుఅనఁగా ఈశ్వరుఁడనైయుండియు కారుణ్యాదులవలన మనుష్యత్వమునుపొందుటను- అనిరామానుజభాష్యము.

మనుష్యసంబంధియగు శరీరమును అనఁగా మూఢులైనవారికి మనుష్యసంబంధియైనదిగాఁదోఁచెడి శరీరమును- ఈశ్వరుఁడు సృష్ట్యాదినె అవతారరూపములను ప్రకటించియుంచునుగాన అవిమనుష్యాదిసంబంధులనుకొనుట భ్రాంతియె- భూతమైనదియు గొప్పదియు నీశ్వరమైనదియునగు భావమును- భూతమనఁగా నాద్యంతములు లేనిదనుట- అనిమధ్వభాష్యము.

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః।

రాక్షసీ మాసురీంచైవ ప్రకృతిం మోహినీం శ్రితాః||౧౨||

(తే=వారు) ఆసురీం రాక్షసీంచైవ మోహినీం ప్రకృతిం శ్రితాః=అసుర సంబంధియును రాక్షసులసంబంధియునై మోహమును గలుగఁజేసెడి ప్రకృతిని ఆశ్రయించినవారై, విచేతసః= జ్ఞానము లేనివారై, మోఘాశాః మోఘకర్మాణః మోఘజ్ఞానాః (భవన్తి)= వ్యర్థములైనయాశలుగలవారును వ్యర్థములైనపనులుగలవారును వ్యర్థమైనజ్ఞానముగలవారును (అగుచున్నారు).

వారుచేసెడి యగ్నిహోత్రాదికర్మములును వారిజ్ఞానంబును. నిష్ఫలములె- విచేతస్సులనఁగా వివేకములేనివారు- అసురసంబంధియును రాక్షససంబంధియునగు ప్రకృతిని ఆశ్రయించినవారనఁగా ఛేదింపుము, భేదింపుము, త్రాగుము, తినుము, పరులస్వమ్మును అపహరింపుము అనియిట్లుపలికెడివారై క్రూరవ్యాపారములు గలవారు అగుదురు- అనిశంకరభాష్యము-

కర్మములనఁగా ఆరంభములు- విచేతస్సులనఁగా యథార్థజ్ఞానములేనివారు- అని రామానుజభాష్యము.

భగవంతునియందు ద్వేషముగలవారు కోరెడి యాముష్మికము కొంచెమైననుపొందఁబడదు- బ్రహ్మ రుద్రుఁడు మొదలయినవారియందలి భక్తి మొదలగునుపాయము చేత వారు ఏయాముష్మికపురుషార్థమునునుపొందలేరు- శిశుపాలుఁడు మొదలగువారు ద్వేషించియు మేలునుపొందిరనుట తనభక్తుఁడైనవాఁడు ఒకానొకప్పుడు శాపముచేత ద్వేషించినను వానికి భక్తిఫలము నిచ్చునని తెలియఁజేయుటకు- అనిమధ్వభాష్యము

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజ న్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్||౧౩||

(హే)పార్థ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, దైవీం ప్రకృతిమ్ ఆశ్రితాః మహాత్మానస్తు=దేవసంబంధియగు ప్రకృతిని ఆశ్రయించిన మహాత్ములో, భూతాదిమ్ అవ్యయం మాం జ్ఞాత్వా=భూతములకుకారణమైనవాఁడనును నాశములేనివాఁడనునగు నన్ను తెలిసికొని, అనన్యమనసః భజన్తి=ఇతరములమనస్సులేనివారై ఆశ్రయింపుచు

న్నారు.

మహాత్ములనఁగా క్షుద్రములుగాని చిత్తముకలవారు- దైవప్రకృతి యనఁగా శమము(మనోనిగ్రహము), దమము(ఇంద్రియనిగ్రహము), కనికరము, విశ్వాసము, మొదలగునది- ఈశ్లోకమునఁ జెప్పఁబడినవారు భగవద్భక్తియనెడి మోక్షమార్గమునఁబ్రవర్తించినవారు- అని శంకరభాష్యము.

నన్ను శరణముగాఁబొందుటచేత సమస్తపాపబంధములును నశించినవారై నేనుపరమకారుణికుఁడనగుటను సాధువులనురక్షించుటకై మనుష్యుఁడనుగా నవతరించితినని తెలిసికొని- అని రామానుజభాష్యము.

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥౧౪॥

మాం సతతం కీర్తయన్తః=నన్ను ఎల్లప్పుడును చెప్పుచున్నవారును, యతన్తశ్చ=ప్రయత్నము చేయుచున్నవారును, దృఢవ్రతాః=దృఢమైనవ్రతములుకలవారును, మాం నమస్యన్తశ్చ=నన్ను నమస్కరించుచున్నవారును, భక్త్యా నిత్యయుక్తాః=భక్తితో నిత్యముగాఁగూడుకొనినవారునై, మామ్ ఉపాసతే=నన్ను ఉపాసించుచున్నారు.

బ్రహ్మస్వరూపుఁడవైన నన్ను- ప్రయత్నముచేయుట యనఁగా ఇంద్రియములనునిగ్రహించుట, దయ, హింసింపకుండుట, మొదలగు ధర్మములయందుఁబ్రవర్తించుట- హృదయముననున్న నన్ను నమస్కరించుచున్నవారు- అని శంకరభాష్యము.

నారాయణ, కృష్ణ, వాసుదేవ, అనియిట్లు భగవన్నామములను ఆర్ద్రహృదయులై చెప్పుటకీర్తనము- యతనమనఁగా అర్చనచేయుట, దేవాలయములనును నందనవనములనును నిర్మించుట, మొదలగువానులయందు దృఢవ్రతులు అనఁగా స్థిరమైనసంకల్పము కలవారై ప్రయత్నము చేయుట- భక్తితోనమస్కరించుచున్నవారు అనఁగా మనస్సు బుద్ధి అభిమానము రెండుచేతులు రెండుకాళ్లు శిరస్సు అనెడి ఎనిమిదియంగములతోనును, ధూళియనక బురదయనక రాలనక భూమియందు దండప్రణామము చేయుచున్నవారు-

ఎల్లప్పుడును నన్నుగుఱించి నిత్యయుక్తులు అనఁగా నాయొక్క నిత్యయోగమును కోరుచున్నవారు- అ. రామానుజభాష్యము.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్॥౧౫॥

అన్యేచ=ఇతరులు, జ్ఞానయజ్ఞేన యజన్తః=జ్ఞానయజ్ఞముచేత పూజించుచున్నవారై, మామ్=నన్ను, ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్=ఏకత్వముతోనను పృథక్త్వముతోనును అనేకవిధములుగా సర్వతోముఖునిగానును, ఉపాసతే=ఉపాసించుచున్నారు.

కొందఱు ఏకత్వముతోననఁగా పరబ్రహ్మమొక్కటియె యనెడి పరమార్థజ్ఞానముతోనుపాసింతురు- మఱికొందఱు పృథక్త్వముతోననఁగా అభగవంతుఁడగువిష్ణువె ఆదిత్యులు చంద్రుఁడు మొదలగురూపములనున్నాఁడనియుపాసనముచేయుదురు- మఱికొందఱు అభగవంతుఁడె బహువిధములుగానున్నవాఁడని భగవంతుని విశ్వరూపమును ఉపాసింతురు- అని శంకరభాష్యము.

మఱికొందఱు జ్ఞానయజ్ఞేనచ= జ్ఞానమనెడి యజ్ఞముతోనును వెనుకటిశ్లోకమునఁజెప్పఁబడిన కీర్తనాదులతోనునుగూడ, బహుధా పృథక్త్వేన విశ్వతోముఖమ్ మామ్=పెక్కువిధములను వేఱుపాటుతో జగదాకారునిననఁగా సమస్తప్రకారములనున్న నన్ను, ఉపాసించుచున్నారు- భగవంతుఁడు సృష్ట్యాదియందు సూక్ష్మములై నామరూపముల యేర్పాటులేని చేతనాచేతనములు శరీరముగాఁ గలవాఁడైయుండి, అనేకవిధములగు నామరూపములయేర్పాటుతోఁ గూడిన స్థూలచేతనాచేతనములు శరీరముగాఁగలవాఁడనుకావలయునని సంకల్పించి అతఁడొక్కఁడె దేవతిర్యఙ్మనుష్యస్థావరములనెడి విచిత్రమైనజగత్తంతయు శరీరముగాఁగలవాఁడైయున్నాఁడు, అని యనుసంధానముచేయుచునుపాసించుచున్నారని తాత్పర్యము- అని రామానుజభాష్యము.

అంతటనొక్కఁడేయగు నారాయణుఁడు ఉన్నాఁడు అని ఏకత్వముతోనును, అన్నిటికంటెనును విలక్షణుఁడు అను పృథక్త్వము

తోనును- భగవంతునిరూపము తెల్లదానివలె నెఱ్ఱదానివలె నల్లదానివలెననియిట్లు బహువిధముగాఁ దెలియఁబడును- బహుధా అనుదానికి దైవమే వాపరే(౪అ॥౨౫శ్లో॥)అనిచెప్పినచొప్పున అనేకవిధములు గాననియుంజెప్పవచ్చును- అనిమధ్వభాష్యము.

అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాఽహ మహమౌషధమ్।
మన్త్రోఽహ మహమేవాజ్య మహమగ్ని రహంహుతం॥ ౧౬॥

అహం క్రతుః= నేను జ్యోతిష్టోమాదిక్రతుస్వరూపుఁడను- అహం యజ్ఞః= నేను యజ్ఞస్వరూపుఁడను- అహం స్వధా= నేను పితృదేవతలకొఱకైనయన్నముస్వరూపముగాఁగలవాఁడను- అహమ్ ఔషధమ్= నేను ఔషధస్వరూపుఁడను- అహమ్ మన్త్రః= నేను మంత్రస్వరూపుఁడను- అహమేవ ఆజ్యమ్= నేనె (దేవతలకు హోమము చేసెడి) నెయ్యిస్వరూపముగాఁగలవాఁడను- అహమ్ అగ్నిః= నేను అగ్నిస్వరూపుడను- అహమ్ హుతమ్ నేను హోమస్వరూపుఁడను.

యజ్ఞమనఁగా స్మార్తము(వైశ్వదేవము మొదలగునది)- ఔషధమనఁగా అందఱుప్రాణులును తినెడి వరిమొదలగునది- స్వధయనఁగానందఱుప్రాణులుతినెడి యన్నమనియును ఔషధమనఁగా రోగమునుపోఁగొట్టునదియనియుఁ జెప్పవచ్చును- అనిశంకరభాష్యము.

యజ్ఞమనఁగా మహాయజ్ఞము- ఔషధమనఁగా వరిమొదలగుదానితోఁ జేయఁబడిన హవిస్సు- నెయ్యియనునది సోమము మొదలగు హవిస్సులకుపలక్షకము- అగ్నియనఁగా ఆహవనీయము మొదలగునది- అని రామానుజభాష్యము.

యజ్ఞమనఁగా దేవతలంగూర్చి ద్రవ్యములను విడుచుట- అని మధ్వభాష్యము.

పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః।
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవ చ॥ ౧౭॥

అస్య జగతః పితా అహమ్= ఈ జగత్తునకు తండ్రిని నేను- మాతా (అహమ్)= తల్లిని (నేను)- ధాతా (అహమ్)= ధాతను (నేను)- పితామహః (అహమ్)= తాతను (నేను)- వేద్యమ్ (అహమ్)= తె

లియవలసినది (నేను)- పవిత్రమ్ (అహమ్)=పవిత్రము (నేను)- ఓంకారః (అహమ్)=ఓంకారము (నేను)- ఋక్ సామ యజుశ్చ అహమేవ=ఋక్కును సామంబును యజుస్సును నేనే.

ధాతయనఁగా ప్రాణులకు కర్మఫలమును కలుగఁజేయువాఁడు- అని శంకరభాష్యము

ధాతృ శబ్దము తల్లిదండ్రులుగాక పుట్టుటకు ప్రయోజకుఁడైన చేతనునియందువర్తించును- వేద్యమ్ పవిత్రమ్ అహమేవ=వేదమునఁదెలియఁబడెడి పావనమైనది నేనే- అని రామానుజభాష్యము.

గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణంసుహృత్ ।
ప్రభవః ప్రళయ స్థానం నిధానం బీజ మవ్యయమ్॥౧౮॥

గతిః=గతియును, భర్తా=భర్తయును, ప్రభుః=ప్రభువును, సాక్షీ=సాక్షియును, నివాసః=నివాసంబును, శరణమ్=శరణంబును, సుహృత్=మిత్రుఁడును, ప్రభవః=ఉత్పత్తియును, ప్రళయః=ప్రళయంబును, స్థానమ్=స్థానంబును, నిధానమ్=నిక్షేపంబును, అవ్యయం బీజమ్=నాశములేని బీజంబును, అహమేవ=నేనే.

గతియనఁగా కర్మఫలము- భర్తయనఁగా పోషకుఁడు- ప్రభువనఁగా స్వామి- సాక్షియనఁగా ప్రాణులు చేసినవానిని చేయనివానిని నెఱుంగువాఁడు- ప్రాణులు దేనియందునివసింతురోయది నివాసము- శరణమనఁగా బాధలచేత నాశ్రయించువారి బాధలను పోగొట్టువాఁడు- సుహృత్తనఁగా ప్రత్యుపకారమును గోరక యుపకరించువాఁడు- ప్రభవమనఁగా జగత్తుయొక్క ఉత్పత్తి- దేనియందుజగత్తు లీనమగునోయది ప్రళయము- దేనియందు జగత్తునిలుచునోయది స్థానము- కాలాంతరమున ననుభవించుటకై దాచిపెట్టికొనినది నిధానము- మొలవవలసినవి మొలచుటకు కారణమైనది బీజము- సంసారమున్నంతవఱకును బీజ పరంపరయుండునుగాన అవ్యయమనఁబడును- అనిశంకరభాష్యము-

గతియనఁగా పొందవలసినస్థానము- భర్తయనఁగా ధరించువాఁడు- ప్రభువనఁగా శాసించువాఁడు- సాక్షియనఁగా ప్రత్యక్ష

ముగాఁజూచువాఁడు- నివాసమనఁగా ఇల్లు మొదలగునది- ఇష్టమును పొందించువాఁడగుటను అనిష్టమును పోఁగొట్టువాఁడగుటను ఆశ్రయింపఁబడెడి చేతనుఁడు శరణము- సుహృత్తనఁగా హితమును (మేలును) కోరువాఁడు- ప్రభవప్రళయస్థానమ్ అనియొక్క-పదము- ప్రపంచమును పుట్టుటకును లీనమగుటకును ఏదిస్థానమో అది- నిధానమనఁగా ఆపుట్టినదియు లీనమగునదియు- అవ్యయమైన బీజమనఁగా వికారములులేని కారణము- అని రామానుజభాష్యము

గతియనఁగా మోక్షమునుగోరువారి చేఁబొందఁబడువాఁడు- సాక్షియనఁగా ప్రత్యక్షముగాఁజూచువాఁడు- శరణమనఁగా సంసారమునకు బెదిరినవానికి ఆశ్రయమైనవాఁడు- సంహారకాలమున ప్రకృతితో జగత్తు ఈతనియందు ఉన్చఁబడునుగాన నిధానము- అని మధ్వభాష్యము.

తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున॥౧౯॥

అహం తపామి=నేను తపింపఁజేయుచున్నాను- అహం వర్షం నిగృహ్ణామి=నేను వర్షమును నిలుపుచున్నాను- (వర్షమ్) ఉత్సృజామి చ=(వర్షమును) విడుచుచున్నాను- (హే) అర్జున!=(ఓ, యర్జునుఁడా!), అమృతం చైవ మృత్యుశ్చ సత్ అసచ్చ=అమృతమును మృత్యువును సత్తును అసత్తును, అహమ్ (అస్మి)=నేను (అగుచున్నాను).

నేను ఆదిత్యుఁడనై కొన్నికిరణములచేత తపింపఁజేయుచున్నాను- మఱికొన్నికిరణములచేత నాలుగునెలలు వర్షమును విడుచుచున్నాను- తరువాత ఎనిమిదిమాసములు మఱికొన్నికిరణములచేత నాకర్షింపుచున్నాను- తరువాత వెండియు వానకాలమున విడిచెదను- అమృతము దేవతలయది- మృత్యువు మనుష్యులయది- దేనికి ఏది సంబంధించియుండునో దానికి అది సత్తు- అట్టిదికానిది దానికి అసత్తు- అంతియెకాని బొత్తిగా అసత్తు భగవంతుఁడుకాఁడు- సదసత్తులనియు కార్యకారణములఁగూడఁ జెప్పవచ్చును- ఎవ్వరు వెనుకఁ జెప్పఁబడిన ఏకత్వపృథక్త్వాదిజ్ఞానములనెడి యజ్ఞములచే నన్ను బూజింపుచు నుపాసింతురో, అజ్ఞానులు వారివారిజ్ఞానమునకుత

గునట్లు నన్ను పొందుదురు- అని శంకరభాష్యము.

అగ్ని ఆదిత్యుఁడు మొదలగురూపముల తపింపఁజేయుచున్నాను- లోకము దేనిచేతఁ బ్రదుకునో యదియమృతము- దేనిచేతఁజచ్చునో యది మృత్యువు- సత్తనఁగా ప్రకృతకాలముననుండునది- అసత్తనఁగానప్పుడులేనిది అనఁగా భూతంబును భవిష్యత్తును- అన్నియవస్థలనును చేతనాచేతనములు నాకుశరీరములుగాన, తత్ప్రకారుఁడనైనేనె యున్నానని యర్థము- వెనుకఁ(౯అ॥౧౫శ్లో) జెప్పినచొప్పున పృథక్త్వముతోనును ఏకత్వములోనును నన్ను అనుసంధింపుచున్నవారై నన్ను ఉపాసింపుచున్నారు- అని రామానుజభాష్యము.

సత్తనఁగా కార్యము- అసత్తనఁగా కారణము- అని మధ్వభాష్యము.

> త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
> యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే।
> తే పుణ్య మాసాద్య సురేన్ద్రలోక
> మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్॥౨౦॥
> తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
> క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
> ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
> గతాగతం కామకామా లభన్తే॥౨౧॥

త్రైవిద్యాః=ఋగ్యజుస్సామముల నెఱిఁగినవారు, సోమపాః పూతపాపాః(సన్తః)=సోమపానముచేసినవారై పవిత్రముచేయఁబడినపాపములుకలవారు(అగుచు), యజ్ఞైః మామ్ ఇష్ట్వా=యజ్ఞములచేత నన్ను పూజించి, స్వర్గతిం ప్రార్థయన్తే=స్వర్గగతిని ప్రార్థింపుచున్నారు- తే పుణ్యం సురేన్ద్రలోకమ్ ఆసాద్య=వారు పుణ్యమైన ఇంద్రలోకమును పొంది, దివి దివ్యాన్ దేవభోగాన్ అశ్నన్తి=స్వర్గమునందు దివ్యములైన దేవభోగములను అనుభవింపుచున్నారు- తే విశాలం తం స్వర్గలోకం భుక్త్వా=వారు విశాలమైన ఆ స్వర్గలోకమును అనుభవించి, పుణ్యే క్షీణే(సతి) మర్త్యలోకం విశన్తి=పుణ్యము క్షయించినది(అగుచుండఁగా) మనుష్యలోకమును చొ

చ్చుచున్నారు. ఏవం కామకామాః త్రయీధర్మమ్ అనుప్రపన్నాః = ఇట్లు కామములను కోరుచున్నవారై వేదత్రయములోని ధర్మమును పొందినవారు, గతాగతమ్ లభన్తే = గమనాగమనములను (రాకపోకలను) పొందుచున్నారు.

త్రైవిద్యులనఁగా యాజ్ఞికులు (యజ్ఞము జేయువారు). వసువాదిదేవతాస్వరూపినైన నన్ను. యజ్ఞము చేయఁగా మిగిలిన సోమరసమును త్రాగి దానిచేత పాపములుపోయినవారై. స్వర్గమనెడి గతిని. తే పుణ్యమ్ ఆసాద్య సురేన్ద్రలోకమ్ అశ్నన్తి = వారు పుణ్యఫలమును పొంది ఇంద్రలోకమును అనుభవింపుచున్నారు. త్రయీధర్మమనఁగా వట్టి వైదిక కర్మము. రాకపోకలను పొందుట యెకాని ఎచ్చటను స్వాతంత్ర్యమును పొందరు అనియర్థము. అని శంకరభాష్యము.

ఈశ్వరికి జ్ఞానుల (భగవద్భక్తుల) నడత చెప్పఁబడినది. ఇఁకను అజ్ఞులనడత చెప్పఁబడును. వేదాంతములయందు నిష్ఠలేనివారై మిగిలిన ఋగ్యజుస్సామవేదములయందుమాత్రము నిష్ఠగలవారు త్రైవిద్యులు. వీరు కేవలేంద్రాదులఁగూర్చి యాగములంజేసి తచ్ఛేషంబుగ సోమమును త్రాగి స్వర్గాదులకు విరోధులగు పాపములను పోఁగొట్టుకొనినవారై, వారు కేవలులగు ఇంద్రాదులను ప్రేరేపించినను వస్తుస్థితినిబట్టి తత్స్వరూపుఁడనగు నన్నుగూర్చియె యాగములు చేసినవారై, అట్టి నన్నుఁగక స్వర్గగతిని కోరుచున్నారు. వారు పుణ్యమైన అనఁగా దుఃఖములేని స్వర్గలోకమును పొంది అచ్చటదేవభోగములననుభవింపుచున్నారు. ఆయనుభవమునకు హేతువయిన పుణ్యము నశించిన తోడనె వెండియు మనుష్యలోకమునఁబ్రవేశింతురు. ఇట్లు వేదాంతసిద్ధజ్ఞానము లేనివారును కామ్యములగు స్వర్గాదులంగోరు వారును కేవలముగా వేదత్రయధర్మమును ఆశ్రయించినవారునగు వారుఅల్పంబులును అస్థిరంబులునగు స్వర్గాదులననుభవించి మాటిమాటికిని మఱలుచుందురు. అని రామానుజభాష్యము.

అయినను నాభజనమె అన్యదేవతాభజనముకన్న మేలు అని చెప్పఁబడుచున్నది. అని మధ్వభాష్యము.

అనన్యా శ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

అనన్యాః మాం చిన్తయన్తః యే జనాః పర్యుపాసతే=అనన్యులై నన్ను చింతింపుచున్న ఏ జనులు ఉపాసింపుచున్నారో, నిత్యాభియుక్తానాం తేషాం యోగక్షేమమ్=నిత్యాభియుక్తులగు వారియొక్క-యోగక్షేమములను, అహం వహామి=నేను వహింపుచున్నాను.

అనన్యులనఁగా నారాయణుఁడనైన నేనె తాముఅని తెలిసికొనినవారు- ఇట్టివారై నన్నుఉపాసనచేసెడి సంన్యాసుల యోగక్షేమములను నేనె నడపెదను- యోగమనఁగా తనకులేనిదానిని సంపాదించుట- క్షేమమనఁగా దానిని కాపాడికొనుట- భగవంతుఁడు మిగిలినభక్తుల యోగక్షేమములఁగూడ తానువహించినను వారుగూడ తమయోగక్షేమములను కొంతవఱకు వహించికొందురు- అనన్యజ్ఞానముకలవారు అట్లువహించికొనరు- వారు బ్రతుకుటయందుగాని చచ్చుటయందుగాని కోరికకలవారైయుండరు- భగవంతుఁడె శరణముగాఁగలవారైయుందురు- కావున భగవంతుఁడె వారి యోగక్షేమముల నిర్వహింపుచుండును- అనిశంకరభాష్యము.

అనన్యులనఁగా నన్నుఁదలంచుటకంటె నితరములైన ప్రయోజనములులేనివారు- పర్యుపాసనమనఁగా తక్కువలేకుండ నుపాసించుట- అనఁగా అన్నికల్యాణగుణములతోను అన్నివిభూతులతోను గూడినవానిగానుపాసించుట- నిత్యాభియుక్తులనఁగా నాయందలినిత్యసంబంధమునుకోరుచుండువారు- నన్నుపొందుట యోగము- పొందినపైని వదలకుండుట క్షేమము- అనిరామానుజభాష్యము.

అనన్యులనఁగా మఱియొకదానిని చింతింపనివారు- నిత్యనుగాఁగనఁగా చాలకాలము (అభితః) అంతటయుక్తులైనవారు- అని మధ్వభాష్యము.

యే ప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్॥౨౩॥

యేఽపి=ఎవ్వారలు, అన్యదేవతాభక్తాః శ్రద్ధయా అన్వితాః యజన్తే=ఇతరదేవతలకుభక్తులై శ్రద్ధతోఁ గూడినవారై యాగములఁ

జేసికొనుచున్నారో, (హే) కౌన్తేయ! =(ఓ) కుంతీపుత్రుఁడా!, తేఽపి అవిధిపూర్వకం మామేవ యజన్తి = వారలును అవిధిపూర్వకము గా నన్నుఁగూర్చియె యాగముం జేయుచున్నారు.

యాగముచేయుట యనఁగా పూజించుట- శ్రద్ధయనఁగా ఆస్తిక్యబుద్ధి- అవిధిపూర్వకముగాననఁగా నజ్ఞానపూర్వకముగానను టు- అనిశంకరభాష్యము.

యేత్వన్యదేవతాభక్తాః అనిపాఠము- అన్నిపదార్థములకును నా కు శరీరమగుటచే నింద్రాదిశబ్దములుగూడ నన్నుజెప్పునుగాన ఇం ద్రాదులంగూర్చి యాగములంజేయువారుగూడ నన్నుగూర్చిచేయు వారే- వేదాంతములు(ఉపనిషత్తులు) పరమపురుషునికి శరీరమైన ఇం ద్రాదులనారాధించునది యనివిధింపుచున్నవై ఆయింద్రాదులకు ఆ త్మయైన పరమపురుషుఁడె సాక్షాత్తుగా నారాధింపఁబడఁదగినవాఁడ ని విధింపుచున్నవి- వీరు వట్టియింద్రాదులను ఆరాధించుటచే ఆ విధిననుసరింపక యజ్ఞముఁజేయువారగుచున్నారు- అని రామానుజ భాష్యము.

అట్లయినచో నహంకర్తా (౯అ॥౧౭శ్లో) అనిచెప్పినది యసత్య మాయన ఈశ్లోకముచెప్పఁబడుచున్నది- అనిమధ్వభాష్యము.

అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ।
నతు మామభిజానన్తి తత్త్వే నాతశ్చ్యవన్తి తే॥౨౪॥

అహం సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ (అస్మి)హి = నేను అన్నియజ్ఞములకును భోక్తనును ప్రభువునును అగుచున్నానుగదా- తేతు మాం తత్త్వేన నాభిజానన్తి = వారు నన్ను తత్త్వముగను ఎంఱుగరు- అతః చ్యవన్తి = ఇందువలన తప్పుచున్నారు.

అన్నియజ్ఞములనఁగా శ్రౌతంబులును స్మార్తంబులును- దేవత లకు ఆత్మనగుటచే భోక్తను- నేను అధియజ్ఞుఁడ(౮అ॥౪శ్లో)ను గాన నేనె యజ్ఞమునకుస్వామిని- నన్నుయథాస్థితముగా నెఱుఁ గకపోవుటచే యజ్ఞఫలమునకుఁజెడుదురు- అనిశంకరభాష్యము.

త్రైవిద్యాః(౯అ॥౨౦శ్లో) ఈకర్మములు ఇంద్రాది శరీరకుండగు పరమపురుషుని యారాధనములన్నియు, ఆరాధింపఁబడువాఁడు అతఁ

డెయనియు నెఱుఁగరు. వారు కొంచెముఫలమునుపొంది మఱలువారు అగుదురు. ప్రభువనఁగా ఫలమునిచ్చువాఁడు. అని రామానుజభాష్యము.

అవిధిపూర్వకమగుటకు కారణము చెప్పఁబడుచున్నది. అని మధ్వభాష్యము.

యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్॥

దేవవ్రతాః దేవాన్ యాన్తి=దేవతలంగూర్చినవ్రతములుకలవారు దేవతలను పొందుచున్నారు. పితృవ్రతాః పితౄన్ యాన్తి=పితృదేవతలంగూర్చినవ్రతములుగలవారు పితృదేవతలను పొందుచున్నారు. భూతేజ్యాః భూతాని యాన్తి=భూతములంగూర్చినయాగములుకలవారు భూతములను పొందుచున్నారు. అపిచ=మఱియును, మద్యాజినః మామ్ యాన్తి=నన్నుఁగూర్చియాగముచేయువారు నన్ను పొందుచున్నారు.

దేవవ్రతులనఁగా దేవతలయందు నియమంబును భక్తియునుగలవారు. పితృవ్రతులనఁగా శ్రాద్ధాదిక్రియలంజేయువారు. పితృదేవతలు అగ్నిష్వాత్తులు మొదలగువారు. భూతేజ్యులనఁగా వినాయకుఁడు మాతృగణము చతుర్భగినులు మొదలగువారిని పూజించువారు. మద్యాజులనఁగా వైష్ణవులు. ఇటు, అన్నిటియందును ఆయాసము సమానముగానున్నను అందఱును నన్ను భజింపకపోవుటకు కారణము అజ్ఞానము. అందువలనవారు స్వల్పఫలముఁబొందుదురు. అని శంకరభాష్యము.

వ్రతశబ్దము సంకల్పమును చెప్పును. దర్శపూర్ణమాసాదులచేనింద్రాదులను ఆరాధించెదనను సంకల్పముకలవారు ఇంద్రాదులను పొందుదురు. ఇట్లు పితృయజ్ఞాదులచే పితృదేవతలనారాధించు సంకల్పముకలవారు పితృదేవతలఁజెందుదురు. యక్షరాక్షసపిశాచాది భూతములనారాధించెదమని ఎవ్వారలు భూతయజ్ఞసంకల్పముచేయుదురో వారు అభూతములంజెందుదురు. ఈచెప్పఁబడినయజ్ఞములచేతనే దేవతలును పితృదేవతలును భూతములును శరీరముగాఁగల భగ

వంతుని నారాధించెదమని ఎవ్వారలు సంకల్పింతురో వారు నన్నే చెందుదురు- దేవాదియజ్ఞములఁజేయువారు దేవాదులతోఁగూడ పరిమితమైన భోగములననుభవించి వారు నశించునప్పుడు వారితోఁ గూడనశింతురు- నన్నారాధించువారు నన్నుజేరిమఱలకుందురు- అని రామానుజభాష్యము.

ఈశ్లోకమున ఫలము వివేచింపఁబడి చెప్పఁబడుచున్నది- అని మధ్వభాష్యము.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥౨౬॥

యః=ఎవ్వఁడు, భక్త్యా=భక్తితోడను, పత్రం పుష్పం ఫలం తోయం మే ప్రయచ్ఛతి=ఆకునుపువ్వును పండును నీటిని నాకు ఇచ్చుచున్నాఁడో, (తస్య) ప్రయతాత్మనః=(ఆ) పరిశుద్ధమైనమనస్సుకలవానియొక్క, భక్త్యుపహృతం తత్ అహమ్ అశ్నామి= భక్తిచేతసమర్పింపఁబడిన దానిని నేను అనుభవింపుచున్నాను-

నేను సుఖముగా నారాధింపఁబడఁదగినవాఁడను- ప్రయతాత్మ యనఁగా పరిశుద్ధమైనబుద్ధిగలవాఁడు- అనిశంకరభాష్యము.

పత్రము మొదలగువానిలో నొకటి-దానినైననిచ్చెడి ప్రయతాత్మ అనఁగా నాకు ఇచ్చుటయె ప్రయోజనముగాఁగలుగుటయనెడి శుద్ధితోఁగూడినమనస్సుకలవానియొక్క- అపత్రాదికమును, నేను, అవాప్తసమస్తకాముఁడనైనను, దొరకరానిదిదొరికినచోఁగలుగవలసిన ప్రీతితోననుభవింపుచున్నాను- అనిరామానుజభాష్యము-

నీవుగొప్పవాఁడవుగాన దుర్బలులచే నారాధింపశక్యుఁడవుకావను శంకలోఁజెప్పఁబడుచున్నది- శాస్త్రములో విధింపఁబడని పత్రాదులను సమర్పింపఁగూడదు- భక్తిచేతనె నేను సంతోషించువాఁడను- అనిభావము- అనిమధ్వభాష్యము.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్॥౨౭॥

(హే)కౌన్తేయ!= ఓ కుంతీపుత్రుఁడా!, యత్ కరోషి=దేనిని చేయుచున్నావో, యత్ అశ్నాసి=దేనిని తినుచున్నావో, యత్ జు

హోషి=దేనిని హోమముచేయుచున్నావో, యత్ దదాసి=దేనిని ఇచ్చుచున్నావో; యత్ తపస్యసి=దేనిని తపస్సుగానాచరించుచున్నావో, తత్ మదర్పణంకురుష్వ=దానిని నాయందుసమర్పింపఁబడుదానిగాను చేయుము.

చేయుటయనఁగా శాస్త్రీయకర్మమునాచరించుట- తినుటయనఁగా స్వయముగాలభించినదానిని తినుట- హోమము శ్రౌతంబు స్మార్తంబును- ఇచ్చుటయనఁగా బ్రాహ్మణులు మొదలగువారికి బంగారము అన్నము మొదలగువానినిచ్చుట- అని శంకరభాష్యము.

చేయుట యనఁగా దేహయాత్రకొఱకైన లౌకిక కర్మములనాచరించుట- హోమాదులచే నిత్యనైమిత్తికరూపమగు వైదిక కర్మము చెప్పఁబడుచున్నది- అర్పింపఁబడునది అర్పణము- లౌకిక వైదిక కర్మములన్నింటియొక్కయు కర్తృత్వంబును భోక్తృత్వంబును ఆరాధ్యత్వంబును నాయందుసమర్పింపఁబడునట్లు చేయుము- అని రామానుజభాష్యము-

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః।
సంన్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి॥

ఏవం సంన్యాసయోగయుక్తాత్మా=ఇట్లు సంన్యాసయోగముతోఁగూడినయంతఃకరణముకలవాఁడవై, శుభాశుభఫలైః కర్మబన్ధనైః మోక్ష్యసే= మేలుగీడులుఫలముగాఁగల కర్మబంధములచేత విడువఁబడుదువు- విముక్తః(సన్) మామ్ ఉపైష్యసి=విడువఁబడినవాఁడవై నన్ను పొందఁగలవు.

శుభాశుభములనఁగా ఇష్టానిష్టములు- కర్మములనుచేయుచువానిని నాకుసమర్పించుట సంన్యాసంబును కర్మయోగంబునుగూడగాన సంన్యాసయోగమనఁబడును- బ్రదికియుండగానే కర్మబంధములచే విడువఁబడుదువు- శరీరముపోయినతోడనే నన్ను జేరుదువు- అనిశంకరభాష్యము.

కర్మబంధములనఁగా నన్నుజేరుటకువిరోధులగు ప్రాచీనకర్మములు- సంన్యాసమనెడియోగముతోఁగూడిన మనస్సుకలవాఁడు ఐ

నఁగా తాను నాకు శేషుఁడనియు నియామ్యుఁడనియును, కర్మమెల్లను నాయారాధనమనియు ననుసంధించువాఁడు- అని రామానుజభాష్యము.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోస్తి న ప్రియః।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥

అహం సర్వభూతేషు సమః= నేను అన్నిభూతములయందును సముఁడను- మే ద్వేష్యః నాస్తి = నాకు ద్వేషింపవలసినవాఁడు లేఁడు- ప్రియః న= ఇష్టుఁడు లేఁడు- యేతు మాం భక్త్యా భజన్తి = ఎవ్వరు నన్ను భక్తితో భజింతురో, తే మయి (వర్తన్తే)= వారు [illegible]యందు (ఉన్నారు)- అహంచ తేషు (వర్తే)= నేనును వారి[illegible] (ఉన్నాను).

నేను అగ్ని[illegible]గాఁడను- అగ్ని తనదగ్గఱకువచ్చిన వారలచలిని పోఁగొట్టును- [illegible]న్న[illegible]గలచలిని పోఁగొట్టదు- నేనున్ నన్ను భజించువారిని [illegible]గ్రహించెదను- ఇతరులననుగ్రహింప[illegible] భక్తులునాయందుండుటయు నేను వారియందుండుటయు స్వ[illegible]మువలనఁగాని నాకు వారియందు అనురాగముండుటవలనఁగాదు- బట్టి ఇతరులయందునాకు ద్వేషంబును లేదు- అని శంకరభాష్యము.

జాతినిబట్టియు ఆకారమునుబట్టియు స్వభావమునుబట్టియు మిక్కిలి హెచ్చుతగ్గులుగానుండెడి దేవతిర్యఙ్మనుష్యస్థావరములనెడి భూతములయందు, అందఱికిని ఆశ్రయింపఁదగినవాఁడనగుటచే, సముఁడను- కొందఱినె ప్రీతిచేత ఆశ్రయింపనిచ్చుటయును మిగిలినవారిని ద్వేషముచేత ఆశ్రయింపని[illegible]పోవుటయును లేదు- నేనెమిక్కిలి ప్రియుఁడుగాఁగలవారై నన్ను భజింపనిచో నిలువలేనిభక్తులు ఉత్కృష్టులైనను నికృష్టులైనను నాతోసమానమైన గుణములుగలవారివలె నాయందెయుందురు- నేను వారియెడను నాకంటె నుత్కృష్టులయెడనువలె నుందును- అని రామానుజభాష్యము.

నీవు స్నేహాదులు గలవాఁడవగుటచే కొంచెముభక్తుఁడైనవానికిని గొప్పఫలమునిచ్చెదవు, గొప్పభక్తునికి కొంచెముఫలమునిచ్చెదవుకాఁబోలునను శంకకై నేను సముఁడనని చెప్పఁబడుచున్నది- అ

యితే భక్తి కార్యకరముకాదా యనుశఙ్కార్థము చెప్పఁబడినది- వారునాయందున్నారు, వారియందు నేనున్నాను- అనఁగా నాకు వారువశ్యులు, వారికి నేను వశ్యుఁడను- వారు ఎల్లప్పుడు నాకు వశ్యులైనను బుద్ధిపూర్వకముగా వశ్యులయినవారును అబుద్ధిపూర్వకముగా వశ్యులయినవారు నను భేదముకలదు- మొదటివిధమువారు ఉద్ధవుఁడు మొదలగువారు- రెండవవిధమువారు శిశుపాలుఁడు మొదలగువారు- అనిమధ్వభాష్యము.

అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్।
సాధురేవ స మన్తవ్య స్సమ్యగ్వ్యవసితోహి సః॥౩౦॥

సుదురాచారోపి అనన్యభాక్(సన్) మాం భజతే చేత్=మిక్కిలి దుష్టమైనయాచారముకలవాఁడైనను అనన్యభక్తికలవాఁడు(అగుచు) నన్ను భజించునేని, సః సాధురేవ మన్తవ్యః=వాఁడు సజ్జనుఁడుగానె తలఁపఁబడఁదగినవాఁడు- సః సమ్యక్ వ్యవసితోహి=వాఁడు లెస్సగా నిశ్చయమునుపొందినవాఁడుగదా.

తనజాతికి తగినయాచారముదప్పిన నడవనివాఁడు సుదురాచారుఁడు- అనన్యభాక్కు అనఁగా భజించుటయొక్కటియె ప్రయోజనముగాఁగలవాఁడు- సాధువనఁగా వైష్ణవాగ్రేసరుఁడు- సమ్యక్ వ్యవసితః అను దానికి భగవంతుఁడు నాకుస్వామి, నాకుగురువు, నా సుమిత్రుఁడు, నాకుగొప్పభోగ్యము, అనెడినిశ్చయముకలవాఁడు అనియర్థము- ఇట్టివానికి ఆచారముతప్పుట స్వల్పలోపముగాన అంతమాత్రమున ననాదరమునుచేయఁదగఁడు- అనిరామానుజభాష్యము.

భగవద్భక్తుఁడు తలుచుగా దురాచారుఁడై యుండఁడు- అయినను బహుపుణ్యముచేతను ఎట్టకేలకు అట్లు అగునేని అప్పుడు సాధువనియె తలంపఁబడఁదగినవాఁడు- అనిమధ్వభాష్యము.

క్షిప్రంభవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి।
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి।౩౧॥

(సః) క్షిప్రం ధర్మాత్మా భవతి=వాఁడు శీఘ్రముగా ధర్మాత్మ అగుచున్నాఁడు- శశ్వత్ శాన్తిం నిగచ్ఛతి=నిత్యముగాను శాంతిని పొందుచున్నాఁడు- (హే)కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, ప్రతి

ప్రతిజానీహి = ప్రతిజ్ఞ చేయుము- మే భక్తః నప్రణశ్యతి = నా భక్తుఁడు చెడఁడు.

వెలుపలిదైన దురాచారమును విడిచి తనవ్యవసాయసామర్థ్యమున ధర్మాత్మయనఁగా ధర్మమున చిత్తముగలవాఁడు అగును- నాభక్తుఁడనఁగా నాయందు సమర్పింపఁబడిన యంతరాత్మ (అంతఃకరణము) కలవాఁడు- అని శంకరభాష్యము.

ధర్మాత్మయనఁగా ప్రతిబంధకములేనిదై పరికరముతోఁగూడిన దైన నాభజనమునందె మనస్సుకలవాఁడు- శాన్తియనఁగా నన్ను జెందుటకు విరోధులైన ఆచారములులేకపోవుట- అదిశాశ్వతమనఁగా మతిమలినిదియగును- నాభక్తిని ఆరంభించినవాఁడు విరోధ్యమైన యాచారసంపర్కముకలవాఁడైనను చెడఁడు- నాభక్తియొక్క మాహాత్మ్యము చేత విరోధినంతయునశింపఁజేసి శాశ్వతమైనవిరోధినివృత్తిని పొంది శీఘ్రముగా సంపూర్ణమైనభక్తికలవాఁడు అగును- అని రామానుజభాష్యము.

ఈశ్లోకమన వెనుకటిశ్లోకములోఁ జెప్పఁబడినదానికి హేతువు చెప్పఁబడును- శీఘ్రముగాధర్మాత్మయగును- ఇది దేవతలు దేవాంశులు మొదలగు వారియందెకలుగును- మిగిలినవాఁడు ఇట్లయ్యేనని ప్రాంతిఁ జెందియూహింపవలసినది- అని మధ్వభాష్యము.

మాంహి పార్థ వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిం॥
కింపున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా।
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమామ్॥ ౩౩॥

(హే) పార్థ! = (ఓ కుంతీపుత్రుఁడా!, యే = ఎవ్వారలు, పాపయోనయః = పాపముకారణముగాఁగలవారైన, స్త్రియః వైశ్యాః తథా శూద్రాః అపి స్యుః = స్త్రీలును వైశ్యులును అట్లె శూద్రులును అగుదురో, తేఽపి = వారలును, మాం వ్యపాశ్రిత్య = నన్ను ఆశ్రయించి, పరాం గతిం యాన్తి హి = గొప్ప గతిని పొందుచున్నారుగదా- పుణ్యాః భక్తాః = పుణ్యులును భక్తులునైన, బ్రాహ్మణాః రాజర్షయః (చ) = బ్రాహ్మణులును రాజర్షులును, తథా (ఇతి) కిం

పున(ర్భక్తా న్యామ్) = అట్లైన (ఇది) వేంఠియుఁ జెప్పవలయునా?- అ నిత్యమ్ అసుఖమ్ ఇమం లోకం ప్రాప్య=నిత్యముగానిదియు సు ఖము లేనిదియునగు ఈ లోకమును పొంది, మాం భజస్వ=నన్ను భజింపుము.

పాపయోనులనఁగా పాపమువలనఁబుట్టినవారు- పుణ్యులనఁగా పుణ్యమువలనఁబుట్టినవారు- పురుషార్థములను సాధించికొనుటకుతగి నదియు దుర్లభమైనదియునగు మనుష్యత్వమును పొందితివిగా న నన్నే భజింపుము- అని శంకరభాష్యము.

నీవు రాజర్షివిగాన అస్థిరమైనదియు తాపత్రయముల బాధకలదగు టచే నసుఖమైనదియునగు నీలోకమును బొందియున్నావుగాన నన్ను భజింపుము- అని రామానుజభాష్యము.

మనుష్యులకు బ్రాహ్మణత్వము మొదలుగునవి స్వాభావికములని యు పాపాదికృతములనియు రెండువిధములు- అందుముక్తినిబొంది నప్పటివి స్వాభావికములు- అవియే పుణ్యములు- శాపమువల్లను ను కామమువల్లను పురుషులును స్త్రీత్వమును పొందుదురు- అని మధ్వాచార్యులు చెప్పిరి.

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥ ౩౪॥

మన్మనాః మద్భక్తః మద్యాజీ(చ) భవ=నాయందుమనసు కలవాఁ డవును నాభక్తుఁడవును- నన్నుఁబూజించుయాగముంజేయువాఁడవు(ను) అగుము- మామ్ నమస్కురు=నన్ను నమస్కరింపుము- ఏవమ్ ఆ త్మానం యుక్త్వా=ఇట్లు అంతఃకరణమును ఏకాగ్రమునుజేసి, మ త్పరాయణః(సన్)=నేనెగొప్పగతిగాఁగలవాఁడవు(అగుచు), మామే వ ఏష్యసి=నన్నే పొందఁగలవు.

ఆత్మానం మామేవ ఏష్యసి=ఆత్మనైన నన్నే పొందఁగలవు- అ న్ని భూతములకును ఆత్మనును పరమగతినిఁ నేనేకదా- అని శంకరభా ష్యము.

మద్భక్తుఁడవై అనఁగా నాయందు మిక్కిలి ప్రీతిగలవాఁడవై, తైల ధారవలె ఎడతెంపులేకుండ నాయందు ఉన్నఁబడిన మనస్సు కలవాఁడ

వు అగుము- యజనమనఁగా సంపూర్ణమైన శేషవృత్తి(కైంకర్యము) ఔపచారికము సాంస్పర్శికము ఆభ్యవహారికము అనెడి మూఁడువిధములగు భోగములను సమర్పించుటగదా యాగము-(ఇదియె తిరువారాధనము- ఔపచారికములు అర్ఘ్యపాద్యాదులు- సాంస్పర్శికములుమాల్యములుమొదలగునవి- ఆభ్యవహారికములు అన్నపానములు)నమస్కారమనఁగా అంతరాత్మనైన నాయందు నమ్రుఁడైయుండుట- మత్పరాయణుఁడనఁగా నన్నువిడిచి తాను నిలువలేకుండుటచే నేనే ఆశ్రయముగాఁగలిగియున్న వాఁడు- ఆత్మయనఁగా మనస్సు- అనిరామానుజభాష్యము.

ఇతిశ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగు
హ్యయోగోనామ నవమోధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్ర
తిపాదకంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణా
ర్జునసంవాదంబునగు భగవద్గీతలలో రాజ
విద్యారాజగుహ్యయోగప్రతిపాదకంబగు
తొమ్మిదవయధ్యాయము.



# గీతాభాష్యత్రయసారము.

## దశమాధ్యాయము.



భూయఏవ మహాబాహో శృణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా॥

(హే) మహాబాహో!=(ఓ) గొప్ప భుజములుకలవాఁడా!, భూయ ఏవ=తిరిగియును, మే పరమమ్ వచః శృణు=నా గొప్ప మాటను వినుము- యత్=దేనిని, ప్రీయమాణాయ తే=ప్రీతినిజేయుచున్న నీకు, హితకామ్యయా వక్ష్యామి=హితమునుకోరుటచేత చెప్పఁగలనో.

పరమమనఁగా నిరతిశయము అనఁగా దానికంటె నతిశయములేనిదగు వస్తువును ప్రకాశింపఁజేయునది- నేను చెప్పెడి మాటలను వి ని అమృతమును త్రాగినయట్లు సంతోషింపుచున్ననీకు- అని శంకర భాష్యము.

నామాహాత్మ్యమును విని ప్రీతిని జెందుచున్న- హితమనఁగా నా యందు భక్తిపుట్టి యది వృద్ధిపొందుట- నా మాహాత్మ్యమును తెలియఁజేసెడి వాక్యమును- అని రామానుజభాష్యము.

ఉపాసనమునకై విభూతులను విశేషముగాఁగొన్నిటికి కారణమగుటయును ఈయధ్యాయమునఁ జెప్పఁబడును- ప్రీయమాణుఁడనఁగా విని సంతోషమును పొందుచున్నవాఁడు- అని మధ్వభాష్యము.

నమే విదుస్సురగణాః ప్రభవం నమహర్షయః।
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః॥౨॥

సురగణాః మే ప్రభవమ్ నవిదుః=దేవతాసమూహములు నాయొక్క ప్రభావమును ఎఱుఁగరు- మహర్షయః నవిదుః=మహర్షులును ఎఱుఁగరు- అహమ్ మహర్షీణామ్ దేవానాంచ సర్వశః ఆదిర్హి=నేను మహర్షులకును దేవతలకును అన్నిప్రకారములను మొదలైనవాఁడనుగదా.

దేవగణములు ఇంద్రాదులు-ప్రభవమనఁగా ప్రభావమైనను పుట్టుకయైనను- మహర్షులు భృగువు మొదలగువారు- ఆదియనఁగా కారణము- అని శంకరభాష్యము.

ఇంద్రియములచేఁ దెలియఁబడనివానిఁ దెలిసికొనెడివారుగూడ నా నామమును కర్మము (పని) స్వరూపము స్వభావము మొదలగు ప్రభావము నెఱుఁగరు- ఆ దేవతలను మహర్షులను సృజించి వారివారి పుణ్యానుసారముగా వారివారికి నేనిచ్చినజ్ఞానము పరిమితమైనది- అని రామానుజభాష్యము.

ప్రభవమనఁగా ప్రభావము-నాయొక్క జగత్సృష్టియైనను- ఉన్నచో సర్వజ్ఞులైన దేవాదులెఱుంగకుందురు, కాఁబట్టి లేదనిభావము- పుట్టుకగూడ నెవనికి వశమో వానికి పుట్టుకయెట్లు? మిగిలినయంశము పైశ్లోకమునఁజెప్పఁబడఁగలదు- అని మధ్వభాష్యము.

యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్,
అసంమూఢ స్సమర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥౩॥

యః మామ్=ఎవ్వఁడు నన్ను, అజమ్ అనాదిమ్ లోకమహేశ్వరం చ వేత్తి=పుట్టుకలేనివానిగాను మొదలులేనివానిగాను లోకములకు గొప్పయీశ్వరునిగాను తెలిసికొనుచున్నాఁడో, సః మర్త్యేషు అసంమూఢః=వాఁడు మనుష్యులలో అజ్ఞానములేనివాఁడై, సర్వపాపైః ప్రముచ్యతే=అన్నిపాపములచేతనను విడువఁబడుచున్నాఁడు.

దేవతలకును మహర్షులకును నేను కారణముగాన నాకు మఱికారణములేదు- అన్నిపాపములనఁగా బుద్ధిపూర్వకముగాఁ జేసినవియు అబుద్ధిపూర్వకముగాఁ జేసినవియు- అని శంకరభాష్యము.

లోకములో మనుష్యులకు రాజగువాఁడు మిగిలినమనుష్యుల జాతిలోనివాఁడై కర్మవిశేషముచేతవారికధిపతియగును- దేవతలయధిపతియును అండాధిపతియునట్లే- వారి కందఱకును భావనాత్రయసంబంధము కలదు- [భావనయనఁగా తాను జేయవలసినపనియందలి యుద్దేశము- అది కర్మభావన బ్రహ్మభావన ఉభయభావన అని మూఁడువిధములు- కర్మభావనయనఁగా పనులుచేయవలయుననెడియుద్దేశము- అదికలవారు దేవతలు మనుష్యులు మొదలగువారు- బ్రహ్మభావనయనఁగా భగవంతుని నుపాసింపవలెననెడి యుద్దేశము- అదికలవారుసనకసనన్దనాదులు- రెండిటియందును ఉద్దేశము ఉభయభావన- అదిక

లవారు చతుర్ముఖబ్రహ్మ మొదలగువారు.] అణిమ (సన్నమగుట), మహిమ (వలమగుట), మొదలగు నైశ్వర్యములను పొందినవారనట్లు- ఈభగవంతుఁడో పుట్టుకలేనివాఁడుగాన అచేతనముకన్నను దానితోఁ జేరియున్న సంసారికన్నను విలక్షణుఁడు- ఆదిలేనివాఁడగుటచే ముక్తులకన్న విలక్షణుఁడు- ఇతరవస్తువులతో భగవంతునిఁగూడ నొకటజాతికలవానిగాఁదలంచుటసంమోహము- అదిలేనివాఁడు అసంమూఢుఁడు- ఇట్టివాఁడు భక్తిపుట్టుటకు విరోధులుగానుండెడి పాపములన్నిటిచేతను విడువఁబడును- అని రామానుజభాష్యము.

అనాదిశబ్దమున అన ఆది అని రెండు భాగములు- అనః=అందఱకును చేష్టమకలుగఁజేయువాఁడును, ఆదిః= మొదలును, గాన అనాది యనఁబడుచున్నాఁడు- అనిమధ్వభాష్యము.

బుద్ధిర్జ్ఞాన మసంమోహః క్షమా సత్యం దమశ్శమః।
సుఖం దుఃఖం భవో ఽభావో భయం చాభయమేవ చ॥౪॥
అహింసా సమతా తుష్టి స్తపో దానం యశో ఽయశః।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పథగ్విధాః॥౫॥

బుద్ధిః జ్ఞానమ్ అసంమోహః=బుద్ధియును జ్ఞానంబును సంమోహము లేకపోవుటయు, క్షమా సత్యం దమః శమః=ఓరిమియు సత్యంబును బాహ్యేంద్రియములనునిగ్రహించుటయు మనస్సునునిగ్రహించుటయు, సుఖం దుఃఖం భవః అభావః=సుఖంబును దుఃఖంబును పుట్టుకయు లేకపోవుటయు, భయంచ అభయం చైవ=భయంబును భయము లేకపోవుటయును, అహింసా సమతా తుష్టిః=హింసింపకుండుటయు సమత్వంబును సంతోషంబును, తపః దానం యశః అయశః=తపస్సును ఈవియు కీర్తియును అపకీర్తియును, (ఇతి) భూతానామ్ పృథగ్విధాః భావాః=(అనెడి) భూతములయొక్క అనేకవిధములైన భావములు, మత్తఏవ భవన్తి=నావలననే కలుగుచున్నవి.

బుద్ధియనఁగా, అంతఃకరణము సూక్ష్మములు మొదలగువానిని గ్రహించెడి సామర్థ్యము- జ్ఞానమనఁగా నాత్మ మొదలగు పదార్థములను తెలిసికొనుట- అసంమోహమనఁగా తెలియవలసినవానియందువివేకముతోఁ బ్రవర్తించుట- క్షమయనఁగాలాఁగఁబడినను కొట్టఁబడి

నను చిత్తవికారము లేకుండుట- సత్యమనఁగా తాను చూచినది చూచినయట్లును వినినది వినినయట్లును ఇతరులకు తెలియఁ జేసెడి వాక్యము- వెలుపలియింద్రియములు శాంతిని పొందుట దమము- అంతఃకరణము శాంతినిపొందుట శమము- సుఖమనఁగా ఆహ్లాదము- దుఃఖమనఁగా పరితాపము- భవమనఁగా పుట్టుక- అదికానిది అభావము- భయమనఁగా బెదరు- అది లేకపోవుటయభయము- అహింసయనఁగా ప్రాణులను బాధింపకుండుట- సమతయనఁగా సమమైనచిత్తము కలవాఁడగుట- తుష్టియనఁగా లాభము కలిగినప్పుడు కలిగినదానితోనె తృప్తిని పొందుట- తపస్సు అనఁగా ఇంద్రియములనియమించి శరీరమును కష్టపెట్టుట- దానమనఁగా తనశక్తికొలఁదియైన యీవి - యశస్సు అనఁగా ధర్మముంబట్టి వచ్చినకీర్తి. అధర్మముంబట్టి వచ్చినది యయశస్సు- ఈబుద్ధి మొదలగు భావములు వారివారికర్మానుసారమున నావలననె కలుగును- అని శంకరభాష్యము.

బుద్ధియనఁగా మనస్సుయొక్క నిరూపించెడి సామర్థ్యము. జ్ఞానమనఁగా చేతనాచేతనవస్తువులనిశ్చయము- అసంమోహమనఁగా రజితముకంటె విజాతీయమగు ముత్తెపుచిప్ప మొదలగుదానియందు రజతముతో సమానమైన జాతికలది అనుజ్ఞానము లేకపోవుట. క్షమయనఁగా మనస్సువికరించుటకు హేతువు కలిగినను వికరింపకయుండుట-సత్యమనఁగా తాను చూచినది చూచినయట్లు ప్రాణులకు హితముగాఁ జెప్పుట- ఇది మనోవృత్తిప్రకరణముగాన సత్యమునకు తగినమనోవృత్తియిచట నుద్దేశింపఁబడినది. దమమనఁగా బాహ్యేంద్రియములను అనర్థవిషయములనుండి మరలించుట. శమమనఁగా నంతఃకరణమునట్లు నియమించుట. సుఖమనఁగా తనకు అనుకూలమైనఅనుభవము- దుఃఖమనఁగా ప్రతికూలానుభవము. భవమనఁగా కలుగుట. అనుకూలము ననుభవించుట వలనఁ గలిగినమనస్సుయొక్క ఉనికి. అభావమనఁగా ప్రతికూలమైనయనుభవము వలనఁ గలిగినమనస్సుయొక్క సంకోచము. భయమనఁగా తనకు కలుగఁబోయెడిదుఃఖమునకు హేతువును తెలిసికొనుటవలనం గలిగెడిదుఃఖము- అది లేకపోవుట యభయము. అహింసయనఁగా ఇతరుని దుఃఖమునకు తాను హేతువుకాకపోవుట. సమతయనఁగా తన

యందును స్నేహితులయందును శత్రువులయందును లాభము కలిగినను నష్టముఁకలిగినను సమమైనతలంపుగలుగుట- తుష్టియనఁగా కనబడిన యందలుఆత్మలయందును సంతోషస్వభావముగా నుండుట- తపస్సనఁగా భోగములను శాస్త్రీయముగాతగ్గించుటయనెడి కాయక్లేశము- దానమనఁగాతాను అనుభవింపవలసినవానిని ఒరునకిచ్చుట- యశస్సు అనఁగా గుణవంతుఁడనెడి ప్రసిద్ధి- అయశస్సుఅనఁగా గుణహీనుఁడు అనెడిప్రసిద్ధి- కీర్తికిని అపకీర్తికిని తగినమనోవృత్తివిశేషములు ఇచ్చట చెప్పఁబడినవి- తపస్సునందునుదానమునందునట్లె- భావములనఁగా ప్రవర్తించుటకును నివర్తించుటకును హేతువులగు మనస్సుయొక్కవృత్తులు అనఁగావ్యాపారములు- నావలనను అనఁగా నా సంకల్పమునకు అధీనములైకలుగుచున్నవి- అని రామానుజభాష్యము.

చేయవలసినదానిని చేయరానిదానిని నిశ్చయించుటబుద్ధి- జ్ఞానమనఁగా తోఁచుట- దమమనఁగా ఇంద్రియములను నిగ్రహించుట- శమమనఁగా పరమాత్మనిష్ఠుఁడగుట- తుష్టి యనఁగా చాలుననెడి బుద్ధి- అని మధ్వభాష్యము.

మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥౬

పూర్వే సప్త మహర్షయః=కడచిన ఏడుగురు మహర్షులును, తథా చత్వారః మనవః = అట్లె నలుగురు మనువులును, మద్భావాః మానసాః జాతాః=నాయందుభావనకలవారై (నా)మనస్సువలనఁబుట్టింపఁబడినవారై పుట్టిరి- లోకే ఇమాః ప్రజాః యేషామ్ (భవన్తి)=లోకమునందున్న ఈ ప్రజలు ఎవ్వరియొక్క (సృష్టి అగుచున్నారో.)

భృగువు మొదలగువారు మహర్షులు. సావర్ణి మొదలగువారు మనువులు. నాయందుభావనకలవారై విష్ణుసంబంధియగుసామర్థ్యముతోఁగూడుకొనినవారై- ప్రజలనఁగా స్థావరజంగమములు. అనిశంకరభాష్యము. (భృగువు, మరీచి,అత్రి,పులస్త్యుఁడు, పులహుఁడు,క్రతువు, వసిష్ఠుఁడు అనువారు సప్తమహర్షులు. సావర్ణులను పేరుగలమనువులు నలుగురు- లేక ఏడుగురుమహర్షులునునలుగురుమను

హర్షులగు సనక సనందన సనత్సుజాత సనత్కుమారులును, మనువులు పదునలుగురును అనియు నన్వయింపవచ్చును అని మధుసూదనటీక-

గడచిన మన్వంతరములో నిత్యసృష్టి జరుగుటకు బ్రహ్మ నన్ను సేవించఁగలిగిన భృగ్వాదిసప్తమహర్షులును, నిత్యపరిపాలనము జరుగుటకొఱకైన సావర్ణికులను పేరుగల నలుగురుమనువులును మద్భావులనఁగా నాభావమే భావముగాఁగలవారు అనఁగా నాయభిప్రాయము ననుసరించువారు, నాసంకల్పము ననుసరించువారగుట- వారిసంతానమైన ఈలోకమునందు ఈప్రజలందఱును ప్రళయము వఱకు ప్రతిక్షణంబును సంతానములం బుట్టించువారును పరిపాలించువారునై యున్నారు అని రామానుజభాష్యము. (సావర్ణికులనఁగా ధ్రువవంశమునఁ బుట్టిన స్వారోచిషుఁడు ఉత్తముఁడు తామసుఁడు రైవతుఁడు అనువారు)

సప్తమహర్షులనఁగా మరీచి, అత్రి, అంగిరస్సు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు, అనువారు. మనువులు స్వాయంభువుఁడు రోచిషుఁడు, రైవతుఁడు, ఉత్తముఁడు, అనువారు. తాపసుఁడు భగవదవతారముగాన నిచ్చట జెప్పఁబడలేదు. మద్భావులనఁగా నావలన భావము అనఁగా పుట్టుక కలవారు. వీరు బ్రహ్మకుమానసులుగాఁ బుట్టినవారైనను నావలనఁ బుట్టినవారే యనిభావము. అని మధ్వభాష్యము.

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః।
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః॥ ౭॥

మమ ఏతాం విభూతిం యోగం చ తత్త్వతః యః వేత్తి = నాయొక్క ఈవిభూతిని, యోగమునను తత్త్వమునను ఎవ్వఁడెఱుఁగునో, సః అవికమ్పేన యోగేన యుజ్యతే-వాఁడు నిశ్చలమైన యోగముతోఁ గూడుచున్నాఁడు- అత్ర సంశయః న = ఈవిషయమున సంశయము లేదు-

(విభూతిని అనఁగా అనేకవిధములుగా నగుటను- అని మధుసూదనటీక) యోగమును అనఁగా ఘటనమును (అనఁగా ఆయాపదార్థములను నిర్మించెడి సామర్థ్యమును అని మధుసూదనటీక)- యోగమువలనఁ

కలిగిన సర్వజ్ఞత్వమును అనియుం జెప్పవచ్చును. యోగముతోడను అనఁగా నిజమైనజ్ఞానముయొక్క స్థైర్యము(నిలుకడ)తోడను- అని శంకరభాష్యము.

విభూతియనఁగా ఐశ్వర్యము- అనఁగా అన్నిటియొక్కయును పుట్టుకయును ఉనికియును ప్రవర్తించుటయును భగవంతునికి ఆధీనములైయుండుట- హేయములు అనఁగా విడువఁదగినవి- అనఁగాదుర్గుణములు- వానికి విరోధులగు కల్యాణగుణములు, అనఁగా మంచిగుణములుకలవాఁడగుటయోగము- యోగముతోడను అనఁగా భక్తియోగముతోడను- నా విభూతులవెలుంగుటయు నాకల్యాణగుణములనెలుంగుటయు భక్తియోగమును వృద్ధిచేయుననునంశము నీవు నిశ్చయముగానె తెలిసికొనఁగలవనుట- అని రామానుజభాష్యము.

అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః॥౮॥

అహం సర్వస్య ప్రభవః=నేను అంతటికిని ప్రభవము. మత్తః సర్వం ప్రవర్తతే=నావలన సమస్తంబును ప్రవర్తించుచున్నది. ఇతి మత్వా=అని తలంచి, భావసమన్వితాః బుధాః మాం భజన్తే=భావముతోఁగూడిన జ్ఞానులు నన్ను భజించుచున్నారు.

ప్రభవమనఁగా పుట్టుక. నిలుచుట నశించుట పనులుచేయుట వానిఫలమనుభవించుట అనునవిశ్వరూపముగాఁగలద్వైతవికారస్వరూపమైన సమస్తమైన జగత్తునునావలననె ప్రవర్తించుచున్నది- బుధులనఁగాపరమార్థతత్త్వమునెఱింగినవారు. భావమనఁగా పరమార్థతత్త్వమందలి యభినివేశము (ఊనిక)- అనిశంకరభాష్యము.

ప్రభవమనఁగా పుట్టుటకుకారణమైనవాఁడను- భావమనఁగామనోవృత్తివిశేషము. నాయందు స్పృహా (ఆశ) కలవారై నన్నుభజించుచున్నారనుట- అనిరామానుజభాష్యము.

భజించుచున్నవారును కొందఱు కలరని ఈశ్లోకము చెప్పుచున్నది- అనిమధ్వభాష్యము.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తిచ రమన్తిచ॥౯॥

మచ్చిత్తాః=నాయందుమనస్సుగలవారును, మద్గతప్రాణాః = నన్ను బొందినప్రాణములుకలవారును, పరస్పరం బోధయన్తః=ఒకరి కొకరును బోధచేయుచున్నవారును, మాం నిత్యం కథయన్తశ్చ=నన్ను ఎల్లప్పుడును చెప్పుకొనుచుండువారును(అయి),తుష్యన్తిచ రమన్తిచ= సంతోషింపుచున్నారు క్రీడింపుచున్నారు.

ప్రాణములనఁగా చక్షుస్సుమొదలగునవి- నాయందుఉన్నవి(బడిన ఇంద్రియములుకలవారు-ప్రాణమనఁగా జీవనమనియుం జెప్పవచ్చును. జ్ఞానముఅనఁగా తెలివి, బలము, ఐశ్వర్యము మొదలగుధర్మములతోఁ గూడిననన్ను చెప్పుకొనుచున్నవారై- (సంతోషమనఁగాతృప్తి-అనిమధు॥) సంతోషమువలనఁగలిగెడి గొప్పసుఖమురతి- ఇష్టుఁడైనవానితోఁ గలుసుకొనినప్పుడు కలుగు గొప్పసుఖమువంటిదిరతి-అనిశంకరభాష్యము-

మద్గతప్రాణులనఁగా నన్నువిడిచిబ్రతుకలేనివారు. అనఁగా తమ్మునునిలువఁబెట్టుకొనలేనివారు- తాముతాముఅనుభవించిననాగుణములను మిగిలినవారికి బోధచేయుచు, నేనుచేసినదివ్యములైనపనులను చెప్పుకొనుచు- చెప్పెడివారు , ప్రయోజనాంతరములేని ఆచెప్పుటచేతనె సంతోషింపుచున్నారు-వినువారును మిక్కిలియిష్టములయిన ఆగుణములు మొదలగువానిని వినుటచే ప్రీతిం జెందుచుందురు- అని రామానుజభాష్యము.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే॥ ౧౦॥

సతతయుక్తానాం ప్రీతిపూర్వకం భజతాం తేషామ్= ఎల్లప్పుడును యుక్తులైనవారును ప్రీతిపూర్వకముగా భజింపుచున్నవారునగు వారికి, తే యేన మామ్ ఉపయాన్తి=వారు దేనిచేత నన్ను పొందుచున్నారో, తం బుద్ధియోగం దదామి=ఆ బుద్ధియోగమును ఇచ్చుచున్నాను.

ఎల్లప్పుడును అభియుక్తులైనవారు- (భగవంతునియందుపరాగ్రములైన బుద్ధిగలవారు॥మధు) ప్రయోజనమేమియునుగోరక స్నేహపూర్వకముగా భజింపుచున్నవారు అనఁగా సేవింపుచున్నవారు- బుద్ధి యనఁగా నాతత్త్వమును లెస్సగా నెఱుఁగుట- పరమేశ్వరుఁడనైన న

న్న ఆత్మనుగాఁ బొందుచున్నారు- అని శంకరభాష్యము-

సతతయుక్తులనఁగా నిత్యముగా భగవంతునితోఁ జేరియుండుటను గోరుచున్నవారు- బుద్ధియోగమనఁగా పరిపక్వమైనభక్తి నిప్రీతిపూర్వకముగా నిచ్చెదను- అని రామానుజభాష్యము.

తేషా మే వానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥౧౧॥

తేషామేవ అనుకమ్పార్థమ్=వారికే అనుగ్రహము చేయుటకొఱకు. అహమ్ ఆత్మభావస్థః=నేను ఆత్మభావమునను న్నవాఁడనై, భాస్వతా. జ్ఞానదీపేన=ప్రకాశింపుచున్న జ్ఞానమనెడిదీపము చేత, అజ్ఞానజం తమః నాశయామి=అజ్ఞానమువలనఁ బుట్టిన తమస్సును నశింపఁజేయుచున్నాను.

అజ్ఞానమనఁగా అవివేకము- దానివలనఁ బుట్టినది అనఁగా మిథ్యాజ్ఞానమువలన(భ్రాంతివలన) బుట్టినది- తమస్సు అనఁగా మోహమనెడి యంధకారము- ఆత్మయొక్క భావము అనఁగా అంతఃకరణముయొక్క ఆశయము- అనఁగాను అభిప్రాయము- దానియందే ఉన్నవాఁడనగుచు- జ్ఞానమనఁగా వివేకజ్ఞానము- అదియె దీపము- దానికిభక్తియే చమురు- నన్ను గుఱించిన భావన(ధ్యానము) యందలి అభినివేశమనెడి గాలిచేతను ఆదీపము ప్రేరణచేయఁబడును. బ్రహ్మచర్యాదిసాధనములసంస్కారముగల జ్ఞానమె దానికి వత్తి- వైరాగ్యముతోఁ గూడినయంతఃకరణమె ఆధారము (ప్రమిదె)- విషయములనుండి మరలిన చిత్తమను గదిలోనదియున్నది. అగవి రాగద్వేషాదులనెడి గాలిలేనిది- నిత్యమును నిశ్చలముగా ధ్యానముచేయుచుండుట చేతఁ గలిగిన మంచి జ్ఞానమె ఆ దీపముయొక్క వెలుఁగు. అని శంకరభాష్యము.

ఆత్మభావస్థుఁడను అనఁగా అజ్ఞానులయొక్క మనోవృత్తికి విషయముగా నున్నవాఁడనై, నాకల్యాణగుణములనుప్రకటనచేయుచు నాయందలిజ్ఞానమనెడి ప్రకాశింపుచున్నదీపముచేత, జ్ఞానముగకు విరోధులగు పూర్వకర్మములనెడి యజ్ఞానముచేఁ బుట్టిన నాకంటెని తరములగు విషయములయందలి ప్రావణ్యమనెడి చీకటి! నశింపఁజ

యుదును- ఆకీశవి పూర్వకాలమునుండి ఆశ్రయముపడియున్నది- అని రామానుజభాష్యము.

అర్జునఉవాచ.

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్॥౧౧॥

భవాన్ పరం బ్రహ్మ=నీవు పరబ్రహ్మము. పరం ధామ=గొప్ప తేజస్సు, పరమం పవిత్రమ్=గొప్ప పవిత్రము. పవిత్రమనఁగా పవిత్రముచేసెడిది.

నీవు పరబ్రహ్మమనియు పరజ్యోతిస్సనియు పరమపావనమనియు శ్రుతులు సెప్పుచున్నవి- అని రామానుజభాష్యము.

బ్రహ్మమనఁగా పరిపూర్ణమైనది. అనిమధ్వభాష్యము.

పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్॥౧౨॥
ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే॥౧౩॥

సర్వే ఋషయః=అందఱు ఋషులును, తథా దేవర్షిః నారదః=అట్లే దేవఋషియగు నారదుఁడును, అసితః దేవలః=అసితుఁడనెడి దేవలుఁడును, వ్యాసః=వ్యాసుఁడును, త్వామ్=నిన్ను, శాశ్వతం దివ్యం పురుషమ్=నిత్యుఁడును దివ్యుఁడునగు పురుషునిగానును, ఆదిదేవమ్=మొదటి దేవునిగానను, అజమ్=పుట్టుకలేనివానిగానును, విభుమ్=సర్వవ్యాపకునిగానును, ఆహుః=చెప్పుచున్నారు- స్వయం చైవ మే బ్రవీషి=స్వయముగానును నాకు చెప్పుచున్నావు.

దివ్యశబ్దమునకుదివి=పరమాకాశమునందు,భవః=కలిగినవాఁడు,అనియర్థము- (పరమాకాశమనఁగాతనస్వరూపము అనిమధు॥) అందఱుదేవతలకును మొదటఁగలిగినవాఁడుగాన నాదిదేవుఁడు- అనిశంకరభాష్యము.

శ్రీకృష్ణుఁడుగా నవతరించిన నీవుభగవంతుఁడవె -అని చెప్పుచున్నారు- అని రామానుజభాష్యము

అనేకవిధములుగా నయినవాఁడవుగాని విభువు- అని మధ్వభాష్యము.

సర్వమేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ।

న హి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః ॥౧౪॥

(హే) కేశవ!=(ఓ) శ్రీకృష్ణుఁడా!, మాం యత్ వదసి=నన్ను గూర్చి దేనిని చెప్పుచున్నావో, ఏతత్ సర్వం ఋతం మన్యే=దీని నిఁ అంతయును సత్యమునుగానె తెలిసికొనుచున్నాను. (హే) భగవన్=(ఓ) భగవంతుఁడా, తే వ్యక్తిమ్=నీ వ్యక్తిని, దేవాః దానవాః (శ్చ) నవిదుః=దేవతలును దానవులు(ను) ఎఱుంగరు. (దానవులు దేవతల శత్రువులలో నొకరు.)

నీవును ఋషులును చెప్పినదంతయు- వ్యక్తి యనఁగా పుట్టుక- అని శంకరభాష్యము.

నీచేఁ జెప్పఁబడిన నీయొక్క యైశ్వర్యము కల్యాణగుణములును స్తోత్రము చేయుటకు చెప్పఁబడినవి కావు- వస్తుస్థితియే- భగవంతుఁ డనఁగా జ్ఞానము శక్తి బలము వీర్యము తేజస్సు అనునవి కలవాఁడు- వ్యక్తి యనఁగా వ్యక్తిప్రకారము (వైభవమును చెప్పెడివిధము- ఆసిరామానుజీయటీక) దేవతలును దానవులును స్వల్పజ్ఞానము కలవారుగాన నెఱుంగరు- అని రామానుజభాష్యము.

స్వయమే వాత్మనా త్మానం వేత్థ త్వం పురుషోత్తమ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే॥౧౫॥

(హే) పురుషోత్తమ!=(ఓ) పురుషశ్రేష్ఠుఁడా!, భూతభావన!=భూతములను కలుగఁజేయువాఁడా, భూతేశ!=భూతములకధిపతియైనవాఁడా!, దేవదేవ!=దేవతలకు దేవుఁడైనవాఁడా!, జగత్పతే!=జగత్తులకధిపతియైనవాఁడా!, త్వం స్వయమేవ ఆత్మనా ఆత్మానం వేత్థ=నీవు స్వయముగానే ఆత్మచేత ఆత్మను తెలిసికొనుచున్నావు-

(ఆత్మనా=స్వరూపముచేతను అనిమధుః) నిన్ను ఇంతకంటె వట్టి యతిశయములేని జ్ఞానము ఐశ్వర్యము బలము మొదలగు శక్తులు కలవానిగా నెఱుఁగుదువు- అని శంకభారష్యము.

స్వయమేవ=నీజ్ఞానముచేతనె - ఈశుఁడనఁగా నియమించువాఁడు- మనుష్యులకంటె దేవతలు సౌందర్యము మొదలగు కల్యాణగుణములచే నెట్లు అతిశయించియుందురో అట్లు వారినిగూడ నతిశయించును గాన దేవదేవుఁడు- పతి యనఁగా స్వామి- అని రామా

నుజభాష్యము

వక్తు మర్హ స్యశేషేణ దివ్యాహ్యాత్మవిభూతయః।
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి॥౧౬

ఆత్మవిభూతయః దివ్యాః హి=నీవిభూతులు దివ్యములైనవిగదా- (తాః) అశేషేణ వక్తుమ్ అర్హసి=(వానిని) నిశ్శేషముగాఁ జెప్పఁదగుదువు- త్వమ్=నీవు, యాభిః విభూతిభిః ఇమాన్ లోకాన్ వ్యాప్య తిష్ఠసి=ఏవిభూతులచేత ఈ లోకములను వ్యాపించియున్నావో.

విభూతు లనఁగా మాహాత్మ్యవిస్తరములు-అని శంకరభాష్యము.

దివ్యములనఁగా నీకు అసాధారణములైనవి- మఱియొకనికి లేని వనుట- వనియమనవిశేషములతో (నియమించు బలతో) గూడినవాఁడవై ఈలోకములనన్నిటిని నియమించువాఁడవై వ్యాపించియున్నావో అని రామానుజభాష్యము

విభూతు లనఁగా వివిధములైన భూతులు- అని మధ్వభాష్యము

కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచిన్తయన్
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽపి భగవన్మయా॥౧౭॥

(హే)యోగిన్=(ఓ)యోగీ!, అహం సదా త్వాం పరిచిన్తయన్ కథం విద్యామ్=నేను ఎల్లప్పుడును నిన్ను తలంచుచున్నవాఁడనై ఎట్లు తెలిసికొందును-(హే)భగవన్=(ఓ)భగవంతుఁడా!, (కిం)చ=ఇంతియెకాక, మయా కేషు కేషు భావేషు చిన్త్యః అసి=నాచేతను ఏయేవస్తువులయందు ధ్యానముచేయఁదగినవాఁడవు అగుచున్నావు.

యోగీ అనుపాఠము- నేను యోగినై అనఁగా భక్తియోగనిష్ఠుఁడనై భక్తిచేత నిన్ను ఎప్పుడును చింతించుటకు ప్రవర్తించినవాఁడనై చింతింపఁబడవలసినవాఁడవైన నిన్నెట్లు తెలిసికొందును - వెనుకఁ జెప్పఁబడిన (౧౦అ-౪-౫శ్లో) బుద్ధిజ్ఞానాదులుకాక మిగిలినయేయే భావములయందు నియమించువాఁడవుగా నీవు నాచేఁ జింతింపఁబడఁదగినవాఁడవు- అని రామానుజభాష్యము

విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్॥౧౮

(హే) జనార్దన!=(ఓ) కృష్ణుఁడా!, ఆత్మనః యోగం విభూతించ విస్తరేణ భూయః కథయ=నీయొక్క యోగమునను విభూతిని విస్తరముగా వెండియును చెప్పుము- అమృతం శృణ్వతః మే=అమృతమును వినుచున్న నాకు, తృప్తిః నాస్తిహి=తృప్తి లేదుగదా-

యోగముననఁగా యైశ్వర్యపుశక్తివిశేషమును- విభూతిననఁగా ధ్యానము చేయవలసినపదార్థములవిస్తరమును- జనార్దనుఁ డనఁగా దేవతలకు శత్రువులైనయసురులను నరకమునుపొందించువాఁడు. అభ్యుదయంబును (మేలును) నిశ్శ్రేయసంబును (మోక్షంబును) అనెడి.పురుషార్థములను అందఱుజనులచేతను యాచింపఁబడువాఁడనియుం జెప్పవచ్చును- తృప్తియనఁగా పరితోషము- నీముఖమునుండిబయలు దేరినవాక్యామృతమును- అని శంకరభాష్యము.

(౧౦అ॥౮శ్లో) నేను అంతటికిని ప్రభవము, నావలననంతయుంబ్రవర్తించుచున్నదని సంక్షేపముగాఁ జెప్పఁబడిననీయోగమును అనఁగా సృజించుట మొదలగుదానిని, విభూతిని అనఁగా నియమనమునను- నీచేఁ జెప్పఁబడెడి నీమాహాత్మ్యమనెడియమృతమును వినుచున్ననాకు తృప్తిలేకపోవుటను నీవె యెఱుంగుదువు - అని రామానుజభాష్యము-

జనార్దనుఁడనఁగా పుట్టుకలేనివాఁడును సంసారమును పోఁగొట్టువాఁడును. అనిమధ్వభాష్యము.

శ్రీభగవానువాచ.

హన్త తే కథయిష్యామి విభూతీ రాత్మన శ్శుభాః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే॥౧౯

(హే) కురుశ్రేష్ఠ!=(ఓ) కౌరవశ్రేష్ఠుఁడా!, ఆత్మనః శుభాః విభూతీః=నాయొక్క శుభములైన విభూతులను, ప్రాధాన్యతః కథయిష్యామి=ప్రధానముగాఁ జెప్పెదను. అనఁగా ప్రధానములైనవానిని జెప్పెదననుట- మే విస్తరస్య అన్తః నాస్తి=నా విభూతివిస్తరమునకు అంతము లేదు- హన్త అనునది సంతోషమునందును కనికరించుటయందును ప్రయోగింపఁబడుననియుమధుసూదనుఁడు చెప్పెను- అనుమతియనఁగా నంగీకారార్థమునని చ్చట ప్రయోగింపఁబడినదని మధుసూదనటీక. ఆశ్చర్యార్థకమని రామానుజీయటీక- ఆదరార్థకను

నిషరమార్థప్రిప.

దివ్యాహ్యాత్మవిభూతయః అని రెండవపాదమునకుసారము-౧౬శ్లోకమున వలెనే అర్థము. వేనివేనిలోపయేనా విభూతిప్రధానమైనదో, దానిదానిని మాత్రము చెప్పెదను- నిశ్శేషముగాఁ జెప్పుటకు నూఱు సంవత్సరములైనంజాలవు- అనిశంకరభాష్యము.

ప్రాధాన్యశబ్దముచేతనుత్కర్షము చెప్పఁబడును- విస్తరముగాఁ జెప్పుటకును వినుటకునుగూడశక్యముకాదు- విభూతియనఁగా నియమింపఁబడునది- అనిరామానుజభాష్యము.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః।
అహమాదిశ్చ మధ్యంచ భూతానామన్త ఏవ చ॥౨౦॥

(హే)గుడాకేశ!=(ఓ)యర్జునుఁడా!, సర్వభూతాశయస్థితః ఆత్మా అహమ్=అన్నిభూతములయుహృదయమునందున్న ఆత్మనునేనే- భూతానామ్ ఆదిః మధ్యమ్ అన్తశ్చ అహమేవ=భూతముల ఆదియు మధ్యంబును అంతంబును నేనే-

గుడాకయనఁగా నిద్ర- దానికి ఈశుఁడుగాన గుడాకేశుఁడు- నిద్రనుజయించినవాఁడనుట- దట్టమైన తలవెంట్రుకలుగలవాఁడనియైనను చెప్పవచ్చును- తనహృదయమునందున్నయాత్మధ్యానము చేయఁదగినవాఁడు- దానికి శక్తిలేనివాఁడు చెప్పఁబోవు భావములయందు ధ్యానము చేయునది- భూతములకు కారణము మొదలగునవిగాను నుధ్యానముచేయఁబడఁదగినవాఁడు- అనిశంకరభాష్యము.

నాకు శరీరమైన యన్నిభూతములకును నేను ఆత్మను- ఆత్మ యనఁగా శరీరమనకు సర్వవిధములఆధారమైనవాఁడును నియమించువాఁడును శేషి (స్వామి)యును - ఇట్టి నేనుఆభూతములయుత్పత్తిస్థితిప్రళయములకు కారణమైనవాఁడను- అనిరామానుజభాష్యము.

ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ॥౨౧॥

ఆదిత్యానాం విష్ణుః అహమ్=ఆదిత్యులుపండ్రెండుగురిలో విష్ణువును నేను- జ్యోతిషామ్ అంశుమాన్ రవిః (అహమ్)=ప్రకాశింపఁజేయువానిలో కిరణములుగల సూర్యుఁడను (నేను)- మరుతామ్ మరీచిః

అహమ్=మరుత్తులనెడి దేవతలలో, మరీచియనువాఁడను నేను- నక్షత్రాణాం శశీ అహమ్=నక్షత్రములకు చంద్రుఁడను నేను.

ఆదిత్యులు మొదలగువారిలో విష్ణువు మొదలగువారు ఉత్కృష్టులు- నక్షత్రములకు అధిపతియైన చంద్రుఁడను నేనే- దేవుఁడు మనుష్యుఁడు పక్షి అనియిట్లు శరీరమును చెప్పెడిశబ్దములను వానియాత్మలయందు ప్రయోగించునట్లు విష్ణ్వాది దేవతలం జెప్పు శబ్దములనుభగవంతునియందుఁ బ్రయోగించుటయును- అని రామానుజభాష్యము.

విష్ణువనఁగా అన్నిటిని వ్యాపించియుండుటయును అన్నిటియందును ప్రవేశించియుండుటయును- విష్॥వ్యాప్తౌ (విష్=వ్యాపించుట) విశ ప్రవేశనే (విశ్=ప్రవేశించుట) అని ధాతువులు- అనిమధ్వభాష్యము.

వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా॥ ౨౨

వేదానామ్ సామవేదః అస్మి=వేదములలో సామవేదము అగుచున్నాను- దేవానాం వాసవః అస్మి=దేవతలలో ఇంద్రుఁడను అగుచున్నాను- ఇన్ద్రియాణాం మనః అస్మి=ఇంద్రియములలో మనస్సును అగుచున్నాను- భూతానాం చేతనా అస్మి=భూతములకు తెలివి అగుచున్నాను.

పదునొకండింద్రియములలోనును సంకల్పవికల్పస్వరూపమైన మనస్సును- కార్యకారణసంఘాతమున (శరీరేంద్రియసముదాయమున) స్ఫుటపడుచున్న బుద్ధియొక్కవృత్తియె చేతన- అనిశంకరభాష్యము.

భూతానాం అనునదియు నక్షత్రాణామ్ అనుపష్ఠివంటిదె-అనిరామానుజభాష్యము.

రుద్రాణాం శఙ్కరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణా మహమ్॥ ౨౩॥

రుద్రాణాం శఙ్కరశ్చ అస్మి=పదునొకండుగురురుద్రులలో శంకరుండనును అగుచున్నాను- యక్షరక్షసామ్ విత్తేశః (అస్మి)=యక్షులు రాక్షసులు వీరిలో కుబేరుఁడను (అగుచున్నాను)- వసూనాం పావకశ్చ అస్మి=ఎనమండ్రువసువులలో అగ్నిని అగుచున్నాను- శిఖరిణాం మేరుః అహమ్=శిఖరములుగలకొండలలో మేరుపర్వతము

నేను-

పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్,
సేనానీనా మహం స్కన్ద స్సరసామస్మి సాగరః॥౨౪॥

(హే) పార్థ! = (ఓ) యర్జునుఁడా!, పురోధసాం ముఖ్యం బృహస్పతిం మాం విద్ధి = (రాజుల) పురోహితులలో ముఖ్యుఁడైన బృహస్పతినిగా నన్ను తెలిసికొనుము- అహమ్ సేనానీనామ్ స్కన్దః = నేను సేనాపతులలో కుమారస్వామిని- సరసామ్ సాగరః అస్మి = సరస్సులలో సముద్రము అగుచున్నాను-

బృహస్పతి ఇంద్రునిపురోహితుఁడు-స్కందుఁడు దేవతలసేనాపతి- సరస్సులనఁగా దేవతలచేఁద్రవ్వఁబడినవి- అని శంకరభాష్యము.

మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్,
యజ్ఞానాంజపయజ్ఞోస్మి స్థావరాణాం హిమాలయః॥౨౫॥

మహర్షీణాం భృగుః అహమ్ = మహర్షులలో భృగువును నేను- గిరామ్ ఏకమ్ అక్షరమ్ అస్మి = మాటలలో ఒక్క- అక్షరము (ప్రణవము) అగుచున్నాను- యజ్ఞానాం జపయజ్ఞః అస్మి = యజ్ఞములలో జపయజ్ఞము అగుచున్నాను- స్థావరాణాం హిమాలయః అస్మి = స్థిరమయినవానిలో హిమవత్పర్వతము అగుచున్నాను-

మహర్షులనఁగా మరీచి మొదలగువారు- మాటలనఁగా అర్థమును జెప్పెడి శబ్దములు- స్థావరములనఁగాపర్వతమాత్రములు.అని రామానుజభాష్యము.

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాంచ నారదః,
గన్ధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః॥౨౬॥

సర్వవృక్షాణామ్ అశ్వత్థః (అస్మి) = అన్నిచెట్లలో రావిచెట్టు (అగుచున్నాను)- దేవర్షీణాంనారదశ్చ (అస్మి) = దేవర్షులలోనారదుఁడనును అగుచున్నాను- గన్ధర్వాణాం చిత్రరథః (అస్మి) = గంధర్వులలో చిత్రరథుఁడను (అగుచున్నాను)- సిద్ధానాం కపిలః మునిః (అస్మి) = సిద్ధులలో కపిలుఁడనెడి మునిని అగుచున్నాను-

దేవతలైయుండి మంత్రములను కనుటచేత ఋషులయినవారు దేవర్షులు- సిద్ధులనఁగా పుట్టుకతోనె ధర్మము జ్ఞానము వైరాగ్యము

పైశ్వర్యమువీనినిమిక్కిలిగాఁబొందినవారు. అనిశంకరభాష్యము.

కపిలుఁడనఁగా, (క)సుఖరూపుఁడైనవాఁడును,(పి)పాలింపఁబడెడి జగత్తుకలవాఁడును, (ల)లయము చేయఁబడెడిజగత్తుకలవాఁడును-అని మధ్వభాష్యము.

ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధిమా మమృతోద్భవమ్।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాంచ నరాధిపమ్॥౨౭॥

అశ్వానామ్ అమృతోద్భవమ్ ఉచ్చైశ్శ్రవసం మాం విద్ధి=అశ్వములలో నమృతమున బుట్టిన ఉచ్చైశ్శ్రవస్సునుగాను నన్ను ఎఱుంగుము- గజేన్ద్రాణామ్ ఐరావతం (విద్ధి)=గజశ్రేష్ఠములలో ఐరావతమునుగాను (ఎఱుంగుము)- నరాణాం నరాధిపంచ (విద్ధి)= మనుష్యులలో రాజునుగానును (ఎఱుంగుము).

అమృతమునఁబుట్టినదనఁగా నమృతముకొఱకైనసముద్రమథనమునఁబుట్టినదనుట-ఐరావతమనఁగా ఇరావతియొక్క సంతానము- అనిశంకరభాష్యము.

అమృతమనఁగాఉదకమైనను మథింపఁబడుచుండెడి యవస్థలోనుండెడియమృతమైనను - గజేంద్రులనఁగా దిగ్గజములు - అమృతమునఁబుట్టినయనిదీనికినన్వయింపవచ్చును-అని రామానుజభాష్యటీక.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్।
ప్రజనశ్చాస్మి కన్దర్ప స్సర్పాణా మస్మి వాసుకిః॥౨౮॥
అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్।
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్

ఆయుధానాం వజ్రమ్ అహమ్=ఆయుధములలో వజ్రాయుధము నేను- ధేనూనాం కామధుక్ అస్మి=పాలనిచ్చెడియావులలో కామధేనువును అగుచున్నాను- ప్రజనః కన్దర్పశ్చ అస్మి=పుట్టించెడి కాముఁడను అగుచున్నాను - సర్పాణాం వాసుకిః అస్మి=సర్పములలో వాసుకిని అగుచున్నాను. నాగానామ్ అనన్తశ్చ అస్మి=నాగులలో అనంతుఁడను అగుచున్నాను. యాదసామ్ వరుణః అహమ్=నీటిలో నుండువానిలోవరుణుఁడను నేను పితౄణామ్ అర్యమాచ అస్మి=పితృదేవతలలోఅర్యమునును అగుచున్నాను-సంయమతాం యమః అహ

మ్=శిక్షించువారిలో యముఁడను నేను.

వజ్రాయుధము దధీచియనుమహర్షి యెముకలలోఁగలిగినది- కామధుక్కు-అనఁగా వసిష్ఠునిధేనువైనను, కామధేనువైనను- (కామములలోఁ బుత్రులఁగలిగించెడి కామము నేను అనిమధు॥) వరుణుఁడు జలదేవతలకు రాజు- అర్యమపితృదేవతలకు రాజు- అని శంకరభాష్యము.

(ఆయుధములనఁగా ఈలోకములోనివి- కాఁబట్టి వజ్రాయుధము కన్నగొప్పదైన సుదర్శనము అనఁగా విష్ణుచక్రమున్నను బాధకము లేదు- అని రామానుజభాష్యటీక.) కామధుక్కు-అనఁగా స్వర్గములోని కామధేనువు- సర్పములు ఒక్క-శిరస్సుగలవి. నాగములు అనేకశిరస్సులుగలవి- అని రామానుజభాష్యము.

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్।
మృగాణాంచ మృగేన్ద్రోహం వైనతేయశ్చపక్షిణామ్॥౩౦॥

దైత్యానాం ప్రహ్లాదశ్చ అస్మి=దైత్యులలో ప్రహ్లాదుఁడనును అగుచున్నాను.కలయతాం కాలః అహమ్=లెక్క-పెట్టువానిలో కాలము నేను- మృగాణామ్ మృగేన్ద్రః అహమ్=మృగములలో సింహము నేను- పక్షిణాం వైనతేయశ్చ అహమ్=పక్షులలో గరుత్మంతుఁడను నేను.

మృగేంద్రుఁడనఁగా సింహమైనను పెద్దపులియైనను- అని శంకరభాష్యము-

అనర్థమునుపొందఁగోరువారగుటచే లెక్క-పెట్టువారిలోమృత్యువును నేను- అని రామానుజభాష్యము.

పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ॥౩౧॥

పవతాం పవనః అస్మి=పరిశుద్ధముచేయువానిలో వాయువును అగుచున్నాను. శస్త్రభృతాం రామః అహమ్=ఆయుధములనుధరించిన వారిలో శ్రీరామమూర్తిని నేను- ఝషాణాంచ మకరః అస్మి=మత్స్యములలోపలను మొసలిని అగుచున్నాను. స్రోతసాం జాహ్నవీ అస్మి=ప్రవహించువానిలో గంగను అగుచున్నాను.

పవతామ్=గమనముస్వభావముగాఁగలవారిలో- అని రామానుజభాష్యము.

(ర) ఆనందస్వరూపుఁడును, (అమ) పరిమాణములేనివాఁడునుగాన రాముఁడనఁబడుచున్నాఁడు- అనిమధ్వభాష్యము.

సర్గాణా మాది రన్తశ్చ మధ్యం చైవాహ మర్జున।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్॥ ౩౨

(హే)అర్జున!=(ఓ)యర్జునుఁడా!, సర్గాణామ్ ఆదిః మధ్యం చ అన్తశ్చ అహమేవ=సృష్టులకు ఆదియును మధ్యంబును అంతంబును నేనే- విద్యానామ్ అధ్యాత్మవిద్యా అహమ్=విద్యలలో మోక్షవిద్యను నేనే-ప్రవదతాం వాదః అహమ్=వాదించువారిలో వాదము నేను.

ఆదిమధ్యాంతములనఁగా ఉత్పత్తిస్థితిప్రళయములు- వెనుక (౨౦శ్లో) జీవులతోఁగూడినవానికి ఆదిఅంతము మొదలగునది నేనుఅని చెప్పఁబడినది- ఇచ్చట సృష్టికంతకుననివిశేషము- వాదించువారనుట చేవాదించుటలలో భేదములైన వాదముజల్పమువితండఅనునవిగ్రహింపఁబడును.అనిశంకరభాష్యము.

సర్గములనఁగా సృజింపఁబడునవి- వానికి ఆదియనఁగా సృజించెడివారలందఱును నేనే- అట్లే సంహరింపఁబడువానినిసంహరించువారలందఱును నేనే- రక్షింపఁబడువాని రక్షించువారలందఱును నేనే అనుట- జల్పవితండాదులను చేసెడివారలయొక్క వాదము నేనే- వాదమనునది తత్త్వమునిర్ణయించుకొనుటకై చేసెడిది. (జల్పమనునది ఎదుటివానిని జయించుటకు. వితండయనఁగా తనపక్షమును స్థాపించికొనకుండ నెదుటి పక్షమును దూషించుట.) అని రామానుజభాష్యము.

అక్షరాణా మకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ।
అహమే వాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః॥ ౩౩॥

అక్షరాణామ్ అకారః అస్మి=అక్షరములలో అకారము అగుచున్నాను-సామాసికస్య చ ద్వన్ద్వః అస్మి=సమాససమూహమునకు ద్వంద్వము అగుచున్నాను- అక్షయః కాలః అహమేవ=నాశములేని కా

లము నేనె-విశ్వతోముఖః ధాతా అహమ్=అంతటనుముఖములుగల ధాతను నేనె-

అక్షయకాల మనఁగా పరమేశ్వరుఁడనియుం జెప్పవచ్చును- ధాత యనఁగా కర్మఫలములను కలుగఁజేయువాఁడు - అని శంకరభాష్యము.

విశ్వతోముఖః ధాతా=నాలుగుముఖములుగల బ్రహ్మ- అని రామానుజభాష్యము.

మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్।
కీర్తి శ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా॥౩౪

సర్వహరః మృత్యుశ్చ అహమ్=అన్నిటినిహరించెడి మృత్యువును నేను- భవిష్యతామ్ ఉద్భవశ్చ అహమ్=కాఁగలవానియొక్క ఉద్భవంబును నేను- నారీణాం కీర్తిః శ్రీః వాక్ స్మృతిః మేధా ధృతిః క్షమాచ అహమ్=స్త్రీలయొక్క కీర్తియును సంపదయును వాక్కును స్మృతి (జ్ఞాపకశక్తి) యును బుద్ధియును ధైర్యమును ఓరిమియును నేనె.

మృత్యువు రెండువిధములు. ధనమునుపోఁగొట్టునదియు ప్రాణమును పోఁగొట్టునదియునని. అందు రెండవది సర్వహరము. ప్రళయ కాలమందనన్నిటినిహరించువాఁడుగాన పరమేశ్వరుఁడే సర్వహర మృత్యువు- ఉద్భవమనఁగా మేలు. కాఁగలవారనఁగా మేలును పొందఁగలవారు. అని శంకరభాష్యము.

సర్వహరమనఁగా అన్నిటిప్రాణములను హరించెడిది-పుట్టం గలవానికిఉద్భవమనుపేరుగలకర్మమును నేనె- స్త్రీలలో శ్రీని నేను, కీర్తిని నేను, అనియిట్లు ప్రత్యేకమన్వయము. అని రామానుజభాష్యము (శ్రీయనఁగా లక్ష్మి. మిగిలినవియును భగవంతునియసాధారణశక్తులు. అని తాత్పర్యచంద్రిక)

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీఛన్దసా మహమ్।
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః॥

తథా సామ్నాం బృహత్సామ అహమ్=సామములలో బృహత్సామము నేనె- ఛన్దసాం గాయత్రీ అహమ్=ఛందస్సులలో గాయత్రి

ని నేను- మాసానామ్ మార్గశీర్షః అహమ్=మాసములలో మార్గశీర్షము నేను- ఋతూనాం కుసుమాకరః అహమ్=ఋతువుల లో వసంతఋతువు నేను-

గాయత్రి మొదలగు ఛందస్సులతోఁ గూడిన ఋక్కులలో గాయత్రీచ్ఛందస్సుగలఋక్కును నేను- అని శంకరభాష్యము.

ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్।
జయోస్మి వ్యవసాయోస్మి సత్త్వం సత్త్వవతా మహమ్॥

ఛలయతాం ద్యూతమ్ అస్మి=మోసపుచ్చువారియొక్క జూదము అగుచున్నాను- తేజస్వినాం తేజః అహమ్=గొప్పప్రభావముకలవారియొక్క తేజస్సును నేను- (జేతౄణామ్) జయః అస్మి=(జయించువారలయొక్క) జయము అగుచున్నాను- (వ్యవసాయినామ్) వ్యవసాయః అస్మి=(పూనికగలవారలయొక్క) పూనిక అగుచున్నాను- (సత్త్వవతాం) సత్త్వమ్ అహమ్=(సాత్త్వికులయొక్క) సత్త్వము నేను.

సత్త్వమనఁగా గొప్పమనస్సుకలిగియుండుట- అని రామానుజభాష్యము.

వృష్ణీనాం వాసుదేవోస్మి పాణ్డవానాం ధనఞ్జయః।
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనాకవిః॥ ౩౭॥

వృష్ణీనాం వాసుదేవః అస్మి=యాదవులలో శ్రీకృష్ణుఁడను అగుచున్నాను- పాణ్డవానాం ధనఞ్జయః (అస్మి)=పాండవులలో అర్జునుఁడను (అగుచున్నాను)- మునీనామపి వ్యాసః అహమ్=మునులలోఁ గూడ వ్యాసుఁడను నేను-కవీనామ్ ఉశనా కవిః (అహమ్)=కవులలో శుక్రుఁడనెడి కవిని (నేను).

మునులనఁగా మననముచేయువారు- అనఁగా నన్ని పదార్థముల జ్ఞానముకలవారు- కవులనఁగా సూక్ష్మములనెఱింగినవారు- అని శంకరభాష్యము.

వసుదేవునికొడుకగుటయె విభూతి- మునులనఁగా మననముచేత పదార్థములతత్త్వము నెఱింగినవారు- కవులనఁగా పండితులు- అని రామానుజభాష్యము.

అంతటిని ఆచ్ఛాదించువాఁడగుటను అంతటనుండుటను వాసుదేవుఁడు- (వి) అన్నిటికంటె విశేషించినవాఁడును, (అ) అంతటనున్న (సః) ఆతఁడెగాననును, వ్యాసుఁ డనఁబడుచున్నాఁడు- అని మధ్వభాష్యము.

దణ్డో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్॥

దమయతాం దణ్డః అస్మి = శిక్షించువారియొక్క శిక్షను అగుచున్నాను- జిగీషతాం నీతిః అస్మి = జయింపఁగోరువారియొక్క రాజనీతిని అగుచున్నాను- గుహ్యానాం మౌనం చైవ అస్మి = గోప్యమయినవానిలో మౌనమునును అగుచున్నాను- జ్ఞానవతామ్ జ్ఞానమ్ అహమ్ = జ్ఞానముకలవారి జ్ఞానము నేను.

గుహ్యముల గోపనములలో మౌనమును అగుచున్నాను- అని రామానుజభాష్యము-

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున।
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్॥ ౩౯॥

(హే) అర్జున! = (ఓ) యర్జునుఁడా!, యత్ సర్వభూతానాం బీజమ్ = ఏది అన్నిభూతములకును బీజమో, తచ్చాపి అహమ్ = అదియునుకూడ నేను- యత్ మయా వినా స్యాత్ = ఏది నన్ను విడిచియుండునో, తత్ చరాచరం భూతం నాస్తి = అట్టి జంగమస్థావరరూపమైన భూతము లేదు-

బీజమనఁగా మొలచుటకు కారణమైనది- సముద్రమును మదాత్మకమె (వాగ్రూపమైనదె)- అని శంకరభాష్యము.

సమస్తవస్తువులును అన్నియవస్థలయందును నేను ఆత్మగాఁ గలవియె- దీనిచేత, వెనుకఁ జెప్పినయన్నివిభూతులకును నేను ఆత్మనగుటను నేనె అవిగాఁ జెప్పఁబడినవనుట- అని రామానుజభాష్యము.

నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా॥ ౪౦॥

(హే) పరంతప! = (ఓ) శత్రువులను తపింపఁజేయువాఁడా!, మమ దివ్యానాం విభూతీనామ్ = నాయొక్క దివ్యములైన విభూతులకు, అన్తః

నాస్తి=అంతము లేదు- ఏషః విభూతేః విస్తరస్తు=ఈ విభూతియొక్క విస్తరమో, మయా ఉద్దేశతః ప్రోక్తః=నాచేత ఏకదేశముగా చెప్పఁబడినది.

ఉద్దేశతః=సంక్షేపముగా- అని రామానుజభాష్యము.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్॥౪౧॥

విభూతిమత్ శ్రీమత్ ఊర్జితమేవ వా=విభూతికలదియైనను శోభకలదియైనను బలముకలదియైనను, యద్యత్ సత్త్వమ్ (అస్తి)=ఏయే వస్తుసమూహము (కలదో), తత్తత్=దానిదానిని, మమ తేజోంశసంభవమేవ త్వమ్ అవగచ్ఛ=నాయొక్క తేజస్సుయొక్క యంశమువలనఁగలిగినదానిగానె నీవు తెలిసికొనుము.

ఊర్జితమనఁగా ఉత్సాహముతోఁగూడినది- ఈశ్వరునియొక్క తేజోంశమనఁగా నేకదేశము- అని శంకరభాష్యము

విభూతికలదియనఁగా ఏలఁబడునవికలది- శ్రీమత్తనఁగా కాంతికలదైనను ధనధాన్యసమృద్ధి కలదియైనను- ఊర్జితమనఁగా శుభకార్యారంభములయందు ప్రయత్నముకలది- తేజస్సనఁగా ఇతరులనతిక్రమించెడి సామర్థ్యము- నానియమనశక్తియొక్క ఏకదేశమువలనఁగలిగినదానిగాఁ దెలిసికొనుము. అని రామానుజభాష్యము.

విష్ణువు మొదలగునవిశ్వరూపములే- మిగిలినవి తేజస్సుతోఁగూడినవి- అని మధ్వభాష్యము-

అథవా బహునైతేన కింజ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్॥౪౨॥

(హే)అర్జున!=(ఓ)యర్జునుఁడా!, అథవా=లేక, జ్ఞాతేన బహునా ఏతేన=తెలియఁబడిన విస్తారమైన దీనిచేతను, తవ కిమ్ (స్యాత్)=నీ కేమి (కలుగును)- అహమ్ ఇదం కృత్స్నం జగత్=నేను ఈ సమస్తమైన జగత్తును, ఏకాంశేన విష్టభ్య స్థితః=ఒక్కభాగముచేతను నిలుపఁబెట్టి ఉన్నాను-

ఎంతదెలిసినను తెలియవలసినది శేషించియేయుండెడి దీనివలన నేమి ప్రయోజనమున్నది? - ఏకాంశమనఁగా ఒక్కయవయవము- అగ్ని

భూతములును ఈశ్వరునికి పాదమని(పురు॥సూ॥3)మంత్రములోఁ జెప్పఁబడియున్నదిగదా- అని శంకరభాష్యము-

కింజ్ఞానేన అని పాఠము- చేతనాచేతనరూపమైన యీజగత్తంతయు స్వరూపము సిద్ధించుటయందును ఉనికియందును ప్రవర్తించుటయందును నాసంకల్పమునతిక్రమింపకుండునట్లు, నా మహిమలోని యతిస్వల్పభాగముచేత దానినంతయును నిలువఁ బెట్టియున్నాను. అని రామానుజభాష్యము-

ఏమికలుగుననుట, చెప్పఁబోవునది ప్రధానమని తెలియఁ జేయుటకుఁగాని, చెప్పఁబడినదంతయును నిష్ఫలమని తెలియఁజేయుటకు గాదు- నిష్ఫలమేయయినయెడను చెప్పఁబడకయేపోవును- అని మధ్వభాష్యము-

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశా
స్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ
దశమోఽధ్యాయః-

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకం
బును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబునగు
భగవద్గీతలలో విభూతియోగప్రతిపాదకంబగు
పదవయధ్యాయము.

విభూతివిస్తరయోగో నామ (విభూతివిస్తరయోగమును బ్రతిపాదించెడి) అని పాఠాంతరము-



గీతాభాష్యత్రయసారము.

పదునొకటవయధ్యాయము.

అర్జునఉవాచ.

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ॥

మదనుగ్రహాయ=నన్ననుగ్రహించుటకొఱకు, త్వయా పరమం గుహ్యమ్ అధ్యాత్మసంజ్ఞితమ్ యద్వచః ఉక్తమ్=నీచేతను గొప్పదియును రహస్యమైనదియును అధ్యాత్మమను పేరుకలదియునగు ఏ వాక్యము చెప్పఁబడినదో, తేన మమ అయం మోహః విగతః=దానిచేత నాయొక్క ఈ మోహము పోయినది.

అధ్యాత్మమనఁగా ఇదియాత్మ,ఇదియాత్మకాదు అనియేర్పఱుచునది- మోహమనఁగా అవివేకబుద్ధి- అనిశంకరభాష్యము.

అధ్యాత్మమనఁగా ఆత్మవిషయమునఁ జెప్పవలసినది- అది న త్వేవాహం జాతు నాసమ్(౨అ॥౧౨శ్లో) అనునది మొదలు తస్మాద్యోగీభవార్జున (౬అ॥౪౬శ్లో) అనువఱకును జెప్పఁబడినది- మోహమనఁగా దేహాత్మాభిమానము- అనిరామానుజభాష్యము.

ఎట్లు వినినయెడల ధ్యానము చేయుట శక్యమగునో, అట్లు స్వరూపస్థితి ఈయధ్యాయముచేత చెప్పఁబడును- అనిమధ్వభాష్యము.

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా।
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్॥౨॥

(హే)కమలపత్రాక్ష!=(ఓ)పుండరీకాక్షుఁడా!, భూతానాం భవాప్యయౌ=భూతములయొక్క పుట్టుకయునుప్రళయంబును,త్వత్తః మయా విస్తరశః శ్రుతౌ=నీవలన నాచేత విస్తరముగా వినఁబడినవి- అవ్యయం మాహాత్మ్యమపిచ శ్రుతమ్=క్షయింపని మాహాత్మ్యము గూడ వినఁబడినది.

ఏడవయధ్యాయము మొదలు పదవయధ్యాయముసమాప్తివఱకును అన్నిభూతములకును (త్వత్తః భవాప్యయౌ) నీవలననే గలిగెడి యుత్పత్తిప్రళయములు నాచేత వినఁబడినవి. మాహాత్మ్యమనఁగాచేతనాచేతనములన్నిటికిని శేషియగుటయు కల్యాణగుణములచే నన్నిటికంటె

గొప్పవాఁడగుటయు అన్నిటిప్రవృత్తులను ప్రవర్తింపఁజేయువాఁడగుటయు మొదలగునది- అనిరామానుజభాష్యము.

ఏవ మేత ద్యథాత్థత్వ మాత్మానం-ప రమేశ్వర।

ద్రష్టుమిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ ॥౩॥

(హే) పరమేశ్వర!=(ఓ) పరమేశ్వరుఁడా!, ఏతత్ ఏవమ్=ఇది ఇట్లు- త్వమ్ ఆత్మానం యథా ఆత్థ=నీవు ఆత్మనుగూర్చి ఏప్రకారముగా చెప్పితివో- (హే) పురుషోత్తమ! = (ఓ) పురుషోత్తముఁడా!, తే ఐశ్వరం రూపం ద్రష్టుమ్ ఇచ్ఛామి=నీయొక్క ఈశ్వర సంబంధియైన రూపమును చూడఁగను కోరుచున్నాను.

ఐశ్వరరూపమనఁగా జ్ఞానైశ్వర్యబలశక్తివీర్యతేజస్సులతోఁ గూడిన విష్ణుసంబంధియగు రూపము- అనిశంకరభాష్యము. ఐశ్వర్యమనఁగా ఈశ్వరునికి అసాధారణమైనది-అనిరామానుజభాష్యము.

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితిప్రభో।

యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్॥

(హే) ప్రభో!=(ఓ) ప్రభువా!, (హే) యోగేశ్వర!=(ఓ) యోగేశ్వరుఁడా!, తత్ మయా ద్రష్టుం శక్యమ్=అది నాచేత చూడ శక్యమైనది, (ఇతి) మన్యసే యది=(అని) తలంతువేని, తతః=అటులైని, త్వమ్ అవ్యయమ్ ఆత్మానం మే దర్శయ=నీవు వికారములులేని ఆత్మను నాకు చూపుము

యోగులయోగమునకు ఈశ్వరుఁడైనవాఁడు- ఎందువలన నేను మిక్కిలి కోరుచున్నానో, (తతః) అందువలన- అనిశంకరభాష్యము.

యోగమనఁగా జ్ఞానము మొదలగు కల్యాణగుణములసంబంధము- దానితోఁ గూడినయీశ్వరుఁడు- అవ్యయమ్ అనునది క్రియావిశేషణము- నిన్నుసంపూర్ణముగాఁ జూపుమనుట- అనిరామానుజభాష్యము ప్రభువనఁగా సమర్థుఁడు- అనిమధ్వభాష్యము.

శ్రీభగవానువాచ.

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః।

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ ॥౫॥

(హే) పార్థ!=(ఓ) యర్జునుఁడా!, శతశః అథ సహస్రశః=నూ

ములకొలదియు ఇట్టి వేలకొలదియు, నానావిధాని నానావర్ణాకృతీని దివ్యాని చ= అనేకవిధములైనవియు అనేకవిధములగు రంగులును ఆకారములును కలిగియు అప్రాకృతములైనవియునగు, మే రూపాణి పశ్య = నా రూపములను చూడుము.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా।
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత॥౬॥

(హే) భారత! = (ఓ) భరతవంశమువాఁడా!, ఆదిత్యాన్ వసూన్ రుద్రాన్ అశ్వినౌ తథా మరుతః పశ్య = పన్నిద్దఱుసూర్యులను ఎనమండ్రువసువులను పదునొకరుద్రులను ఇద్దఱుఅశ్వినీదేవతలను ఆఱై పదుగురుమరుత్తులను చూడుము- అదృష్టపూర్వాణి ఆశ్చర్యాణి బహూని పశ్య= పూర్వము చూడఁబడనివియును ఆశ్చర్యములైనవియునగు పెక్కింటిని చూడుము- నారూపమందు చూడుము అని.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్।
మమ దేహే గుడాకేశ యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి॥౭॥

(హే) గుడాకేశ! = (ఓ) యర్జునుఁడా!, సచరాచరం కృత్స్నం జగత్ = జంగమస్థావరములతోఁ గూడిన సమస్తమైనజగత్తును, యత్ అన్యత్ ద్రష్టుమ్ ఇచ్ఛసి (తత్) చ = ఏ మఱియొకదానిని చూడఁగోరుచున్నావో దానిని, ఇహ మమ దేహే ఏకస్థమ్ అద్య పశ్య= ఇచ్చట నా శరీరమందు ఒక్కచోటనున్నదానిగా ఇప్పుడు చూడుము. [ అనునది- అనిశంకరభాష్యము.
చూడఁగోరునది మనము జయింతుమో, వారు జయింతురో (౨అ।౬శ్లో)

న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్॥౮॥

అనేన స్వచక్షుషైవ తు మాం ద్రష్టుం న శక్యసే = ఈనీ చక్షుస్సుచేతనే నన్నుఁ జూడఁజాలవు- దివ్యం చక్షుః తే దదామి= అప్రాకృతమైన చక్షుస్సును నీకు ఇచ్చెదను- మే ఐశ్వరం యోగం పశ్య= నా యొక్క ఈశ్వరసంబంధియైన యోగమును చూడుము.

యోగమనఁగా యోగశక్తియొక్క అతిశయము. అనిశంక

రభాష్యము.

యోగమనఁగా జ్ఞానము మొదలగువానియొక్క సంబంధము, అని రామానుజభాష్యము.

సంజయ ఉవాచ.

ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥౯॥

(హే)రాజన్=(ఓ)రాజైనధృతరాష్ట్రుఁడా!, మహాయోగేశ్వరః హరిః=మహాయోగేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడు, ఏవమ్ ఉక్త్వా=ఇట్లు పలికి, తతః=అటుపైని, ఐశ్వరం పరమం రూపమ్=ఈశ్వరసంబంధియగు గొప్పరూపమును, పార్థాయ దర్శయామాస=అర్జునునికొఱకు చూపించెను-

గొప్పవాఁడును యోగేశ్వరుఁడునుగాన మహా యోగేశ్వరుఁడు-హరియనఁగా నారాయణుఁడు- అనిశంకరభాష్యము. (ము.
గొప్ప యాశ్చర్యయోగములకు ఈశ్వరుఁడు- అని రామానుజభాష్య
యజ్ఞాదిభాగములన్నిటిని హరించువాఁడుగాన హరియనఁబడుచున్నాఁడు. అనిమధ్వభాష్యము.

అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥౧౦॥
దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్॥౧౧

అనేకవక్త్రనయనమ్=అనేకములగుముఖములును నేత్రములును కలదియును, అనేకాద్భుతదర్శనమ్=అనేకములును అద్భుతములునగు దర్శనములు కలవియును, అనేకదివ్యాభరణమ్ = అనేకములును దివ్యములునగు ఆభరణములు కలదియును, దివ్యానేకోద్యతాయుధమ్=దివ్యములును అనేకములును ఎత్తఁబడినవియునగు ఆయుధములు కలదియును, దివ్యమాల్యామ్బరధరమ్=దివ్యములైనమాలికలను వస్త్రములను ధరించినదియును, దివ్యగన్ధానులేపనమ్=దివ్యమైన మైపూఁతకలదియును, సర్వాశ్చర్యమయమ్=అన్ని ఆశ్చర్యములతో నిండియున్నదియును, దేవమ్=ప్రకాశించునదియును, అనన్తమ్=అంతములేనిద్దియును, విశ్వతోముఖమ్=అంతట

ముఖములుకలదియునగు, (రూపం దర్శయామాస=రూపమును చూపెను.) (అనిశంకరభాష్యము.

ఇట్టి రూపమునుఅర్జునుఁడుచూచెను అనిర్దైనన్వయింపవచ్చును-అనంతమనఁగా మూడుకాలములయందునుండునదియుపరిమాణము లేనిదియును. అనిరామానుజభాష్యము. (భాష్యము:

సర్వాశ్చర్యమయమనఁగా సర్వాశ్చర్యాత్మకమైనది. అనిమధ్వ

దివి సూర్యసహస్రస్య భవే ద్యుగప దుత్థితా,
యది భా స్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః॥౧౨.

దివి యుగపత్ ఉత్థితా సూర్యసహస్రస్య భాః స్యాద్యది=ఆకాశమునందు ఒక్కపర్యాయము బయలుదేరినదగు వేయిసూర్యుల కాంతి కలుగునేని, సా తస్య మహాత్మనః భాసః సదృశీ స్యాత్=అది ఆ విశ్వరూపముయొక్క కాంతికి సాటి అగును. (ము

సహస్రశబ్దము అంతములేనిఅని తెలియఁజేయును-అనిమధ్వభాష్య

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాణ్డవ స్తదా॥౧౩॥

దేవదేవస్య తత్ శరీరే ఏకస్థమ్=భగవంతునియొక్క ఆ శరీరమునందు ఒక్కచోటనున్నదియును, అనేకధా ప్రవిభక్తమ్=అనేకవిధములుగా (దేవతలుతిర్యక్కులుమనుష్యులుమొదలుగాఁగలవిగా) విభజింపఁబడినదియునగు, కృత్స్నం జగత్=సమస్తమైన జగత్తునును, తదా పాణ్డవః అపశ్యత్=అప్పుడు అర్జునుఁడు చూచెను.

తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత॥౧౪॥

విస్మయావిష్టః హృష్టరోమా సః ధనఞ్జయః=ఆశ్చర్యపడినవాఁడును గగురుపాడిన వెండ్రుకలుగలవాఁడునగు ఆ యర్జునుఁడు, దేవం శిరసా ప్రణమ్య=భగవంతుని శిరస్సుచేత నమస్కరించి, కృతాఞ్జలిః అభాషత=చేతులుజోడించినవాఁడై పలికెను.

అర్జునఉవాచ-

పశ్యామిదేవాంస్తవదేవదేహే, సర్వాంస్తథాభూతవిశేషసంఘాన్,
బ్రహ్మాణమీశంకమలాసనస్థ,మృషీంశ్చసర్వానురగాంశ్చదివ్యాన్॥

(హే)దేవ!=(ఓ)దేవా!, సర్వాన్ దేవాన్=అందఱు దేవతలనును, తథా భూతవిశేషసంఘాన్=అట్లే ప్రాణివిశేషములసంఘములనును, బ్రహ్మాణమ్=బ్రహ్మను, కమలాసనస్థమ్ ఈశమ్=బ్రహ్మయందుండెడి రుద్రునిని, సర్వాన్ ఋషీంశ్చ=అందఱు ఋషులనును, దివ్యాన్ ఉరగాన్=దివ్యులైన నాగేంద్రులనును, తవ దేహే పశ్యామి=నీ శరీరమునందు చూచుచున్నాను.

ఈశం కమలాసనస్థం బ్రహ్మాణమ్-ప్రజలకధిపతియును భూమియనెడిపద్మమునకుమధ్యమైన మేరుపర్వతమనెడి యాసనముననున్నవాఁడునునగు బ్రహ్మను- అనిశంకరభాష్యము.

అనేకబాహూదరవక్త్రనేత్రం, పశ్యామిత్వాసర్వతోనన్తరూపమ్।
నాన్తంనమధ్యంనపునస్తవాదిం, పశ్యామివిశ్వేశ్వరవిశ్వరూప॥౧౬॥

అనేకబాహూదరవక్త్రనేత్రమ్ అనన్తరూపమ్ త్వా=అనేకములగు భుజములునుకడుపులునుముఖములును నేత్రములునుగలవాఁడవును అనంతములైనరూపములుకలవాఁడవునగు నిన్ను, సర్వతః పశ్యామి=అంతటను చూచుచున్నాను- విశ్వేశ్వర! విశ్వరూప!-అన్నిటికినధిపతియైనవాఁడా! అన్నియును రూపములుగాఁగలవాఁడా!, తవ అన్తం నపశ్యామి=నీ అంతమును చూడకున్నాను- మధ్యం న(పశ్యామి)=మధ్యమును చూడకున్నాను- ఆదిం నపునః(పశ్యామి)-మొదలును చూడకున్నాను-

అనేక, విశ్వ, అనునవి అనంతములగుటను తెలియఁజేయును- ఒకచోటనీతనిరూపములుఅనంతములు గాననంతరూపుఁడు- మఱియొకచోటపరిమాణములేనివాఁడు- భగవంతుఁడుఅచింత్యశక్తిగాన నిట్లు సందర్భించును- విశ్వరూపుఁడనఁగా సంపూర్ణమైనరూపముగలవాఁడు- అనిమధ్వభాష్యము-

కిరీటినంగదినంచక్రిణంచ, తేజోరాశింసర్వతోదీప్తిమన్తమ్।
పశ్యామిత్వాందుర్నిరీక్ష్యంసమన్తాద్దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్॥

తేజోరాశిం సర్వతోదీప్తిమన్తమ్=తేజఃపుంజమైనవాఁడవును అం

కటములబ్రకాశముగలవాఁడవును, సమన్తాత్ దుర్నిరీక్ష్యమ్=అంతట నుజూడశక్యముకానివాఁడవును, దీప్తానలార్కద్యుతిమ్ అప్రమేయమ్ త్వామ్=ప్రకాశించుచున్నయగ్నిసూర్యులవంటికాంతిగలవాఁడవును తెలియశక్యముకానివాఁడవునగు నిన్ను, కిరీటినం గదినం చక్రిణంచ పశ్యామి=కిరీటముగలవానిగానును గదగలవానిగానును చక్రముగలవానిగానును చూచుచున్నాను-

అనలార్క ద్యుతిమ్అనుటను మిత మైనకాంతిగలవాఁ డనుభ్రాంతి పుట్టునని అప్రమేయమ్ (పరిమితిలేని) అనిచెప్పఁబడినది- అనిమధ్వభాష్యము-

త్వమక్షరంపరమంవేదితవ్యం, త్వమస్యవిశ్వస్యపరంనిధానం।
త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా, సనాతనస్త్వంపురుషోమతోమే॥

వేదితవ్యం పరమమ్ అక్షరం త్వమ్=తెలియవలసిన గొప్ప అక్షరము (పరబ్రహ్మము) నీవు- అస్య విశ్వస్య పరం నిధానం త్వమ్=ఈ జగత్తునకు గొప్ప ఆధారము నీవు- త్వమ్ అవ్యయః=నీవు వికారములేనివాఁడవు- (త్వమ్) శాశ్వతధర్మగోప్తా=(నీవు)నిత్యమైనధర్మమును(వేదములఁజెప్పఁబడినదానిని)కాపాడువాఁడవు- త్వం సనాతనః పురుషః మే మతః=నీవు పురాణుఁడవైన పురుషుఁడవుగా నాకు ఇష్టమైనవాఁడవు-

అనాదిమధ్యాన్తమనన్తవీర్య, మనన్త బాహుంశశిసూర్యనేత్రమ్।
పశ్యామిత్వాదీప్తహుతాశవక్త్రం, స్వతేజసావిశ్వమిదంతపన్తమ్॥౧౯

అనాదిమధ్యాన్తమ్=ఆదియునుమధ్యంబునుఅంతంబునులేనివాఁడవును, అనన్తవీర్యమ్=అంతములేనిపరాక్రమముగలవాఁడవును,అనన్తబాహుమ్=అనంతములైనభుజములుగలవాఁడవును,శశిసూర్యనేత్రమ్=చంద్రుఁడునుసూర్యుఁడును నేత్రములు గాఁగలవాఁడవును, దీప్తహుతాశవక్త్రమ్=జ్వలించినయగ్నిహోత్రునివంటిముఖముగలవాఁడవును, స్వతేజసా ఇదం విశ్వం తపన్తమ్=తనతేజస్సుచేత ఈ లోకమును తపింపఁజేయువాఁడవునగు, త్వా పశ్యామి=నిన్ను చూచుచున్నాను-

వీర్యశబ్దము,జ్ఞానముబలముఐశ్వర్యము శక్తి తేజస్స అనెడిగుణము

లంగూడఁజూపును- భుజములనంతములనుట పాదములు ముఖములు మొదలగునవిగూడననంతములనిచూపును-చంద్రునివలెప్రసాదముకలవి (చల్లనివి)యును సూర్యునివలెఁదపింపజేయునవియునగు నేత్రములుకలవాఁడు-

తన్ను నమస్కరించెడి దేవతలు మొదలగువారలంగూర్చిప్రసాదము-వారికివిరోధులగునసురులు మొదలగువారలంగూర్చిప్రతాపము- తేజస్సనఁగా పరులతిరస్కరించెడిసామర్థ్యము- గొప్పదియు నొక్కటియునగు మొలమీదను అనేకములగుఉదరములు(కడుపులు)ను, క్రిందనుఅనేకములగుపాదములును, వానిలోనొక్కొక్కముఖమునకు రెండేసినేత్రములునుండుటచేతగాన నీచెప్పినదిసరిగానేయున్నది- అని రామానుజభాష్యము-

ద్యావాపృథివ్యోరిదమన్తరంహి, వ్యాప్తంత్వయైకేనదిశశ్చసర్వాః।
దృష్ట్వాద్భుతంరూపముగ్రంతవేదం, లోకత్రయంప్రవ్యథితంమహాత్మన్॥

ద్యావాపృథివ్యోః ఇదమ్ అన్తరమ్=ఆకాశముయొక్కయునుభూమియొక్కయును ఈ మధ్యము,ఏకేన త్వయా వ్యాప్తంహి=ఒక్కఁడవైన నీచేత వ్యాపింపఁబడినదిగదా- సర్వాః దిశశ్చ(వ్యాప్తాః)=అన్ని దిక్కులును వ్యాపింపఁబడినవి- (హే)మహాత్మన్!=(ఓ)మహాత్మా, అద్భుతమ్ ఉగ్రం తవ ఇదం రూపం దృష్ట్వా=అద్భుతమైనదియును భయంకరమైనదియునగు నీ ఈ రూపమును చూచి, లోకత్రయం ప్రవ్యథితమ్=లోకత్రయంబును(మూడులోకఁబులును) బెదరినవి.

మహాత్మయనఁగా క్షుద్రముకానిస్వభావముకలవాఁడు- ప్రవ్యథితమనఁగాకదలినదనియుఁజెప్పవచ్చును- అనిశంకరభాష్యము-

ద్యుశబ్దంబును పృథివీశబ్దంబును వరుసగామీఁదిలోకంబులనుకు క్రిందిలోకంబులనుజూపును-ఆరెంటియొక్క అంతరమనఁగా నీలోకములన్నియునుండెడియవకాశము- లోకత్రయమనఁగాయుద్ధమును చూచుటకువచ్చిన బ్రహ్మాదిదేవతలు మొదలగువారిలోఁబ్రతికూలులును అనుకూలులును మధ్యస్థులును- వీరలయందఱకును విశ్వరూపముచూడఁదగినదివ్యదృష్టినిభగవంతుఁడిచ్చెనని యెఱుంగునది-మహాత్మయనఁగాప

రిచ్ఛేదింపశక్యముగాని మహోవ్యాప్తిగలవాఁడు- అని రామానుజభాష్యము-

అమీహిత్వాంసురసంఘావిశన్తి, కేచిద్భీతాఃప్రాఞ్జలయోగృణన్తి।
స్వస్తీత్యుక్త్వామహర్షిసిద్ధసంఘాః,స్తువన్తిత్వాంస్తుతిభిఃపుష్కలాభిః॥

అమీ సురసంఘాః త్వాం విశన్తిహి= ఈ దేవతాసమూహములు నిన్ను చొచ్చుచున్నవిగదా- కేచిత్ భీతాః ప్రాఞ్జలయః(సన్తః)గృణన్తి= కొందఱు బెదరినవారై చేతులుజోడించినవారు(అగుచు)స్తోత్రముచేయుచున్నారు- మహర్షిసిద్ధసంఘాః స్వస్తి ఇతి ఉక్త్వా=మహర్షులయుసిద్ధులయుసమూహములు మేలు(జగత్తునకగుఁగాత) అని పలికి, పుష్కలాభిః స్తుతిభిః త్వాం స్తువన్తి=సంపూర్ణములగు స్తుతులచేత నిన్ను స్తోత్రముచేయుచున్నారు-

మనముజయింతుమో, మనలనువారుజయింతురో, య నెడి(౨అ॥ ఉశ్లో) యర్జునునిసంశయమునుదీర్చుటకై పాండవులకుజయము కలుగుటనిశ్చితమని భగవంతుఁడుచూపఁగాదానిఁజూచియర్జునుఁడు చెప్పుచున్నాఁడు- దేవతాసమూహములనఁగా భూభారమును తీర్చుటకై భీష్ముఁడుమొదలగువారుగానవతరించినవసువులు మొదలగువారు,నిన్నుచొచ్చునట్లు కనఁబడుచున్నారు- పనిగెత్తుటకును శక్తిలేనివారుచేతులుజోడించినిన్నుస్తుతింపుచున్నారు- ఉత్పాతను(అశుభనిమిత్తము)లనుచూచి మహర్షులును సిద్ధులును జగత్తునకు మేలు గలుగుఁగాత అనుచున్నారు-అనిశంకరభాష్యము-

గొప్పదేవతలందఱును నిన్ను విశ్వమునకు ఆశ్రయుఁ మైనవానిగాఁ జూచి సంతోషించినమనస్సుగలవారై నీదగ్గరకుచేరుచున్నారు- మఱికొందఱునీయుగ్రరూపమునుచూచి బెదరినవారై చేతులుజోడించికొని స్తుతింపుచున్నారు- పుష్కలములనఁగా భగవంతునికిఁదగినవి- అనిరామానుజభాష్యము-

భగవంతునిరూపముచూచువారికెల్ల తప్పక భయమునుగలుగఁజేయునదిగాదు- నారదునికి భయముకలుగలేదు- కొందఱకునూతనము భయమునుకలుగఁజేయును- ఆరూపమును అందఱునుచూడలేరు- చూడక

పోయినను రూపమును ఊహించికొని బెదరినచోఁ జూచునట్లు కనఁబడు
ను-అని మధ్వభాష్యము-

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా, విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ
గన్ధర్వయక్షాసురసిద్ధసంఘా, వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ ౨౨

రుద్రాదిత్యాః వసవః = పదునొకరుద్రులును పన్నిద్దఱు ఆదిత్యులును ఎనమండ్రు వసువులును, సాధ్యాః యే (తే) చ = సాధ్యులు ఎవ్వరో వారును, విశ్వే అశ్వినౌ మరుతశ్చ = విశ్వదేవులును అశ్వినీదేవతలును పదునగురు మరుత్తులును, ఊష్మపాశ్చ = పితృదేవతలును, గన్ధర్వయక్షాసురసిద్ధసంఘాః = హాహాహూహూప్రముఖగంధర్వులయు కుబేరుఁడు మొదలగు యక్షులయు విరోచనుఁడు మొదలగు అసురులయు కపిలుఁడు మొదలగు సిద్ధులయు సమూహములును, (ఏతే) సర్వే చైవ విస్మితాః (సన్తః) త్వాం వీక్షన్తే = (ఈ) అందఱును ఆశ్చర్యపడినవారు (అగుచు) నిన్ను చూచుచున్నారు-

[పాదమ్।
రూపం మహత్తే బహువక్త్రనేత్రం, మహాబాహో బహుబాహూరు
బహూదరం బహుదంష్ట్రాకరాలం, దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్

(హే) మహాబాహో! = (ఓ) గొప్పభుజములు కలవాఁడా!, బహువక్త్రనేత్రమ్ = అనేకములగు ముఖములును కన్నులును కలదియును, బహుబాహూరుపాదమ్ = అనేకములగు భుజములును తొడలును అడుగులును కలదియును, బహూదరమ్ = అనేకములగు కడుపులు గలదియు, బహుదంష్ట్రాకరాలమ్ = అనేకములగు కోఱలచేత వికారము గలదియును, మహత్ తే రూపం దృష్ట్వా = గొప్పదియునగు నీ రూపమును చూచి, లోకాః ప్రవ్యథితాః = లోకులు బెదరిరి- అహం (చ) తథా = నేనును అట్లు- ప్రవ్యథితాః = భయముచేత చలించిరి-అని శంకరభాష్యము-

కరాళమనఁగా [illegible] భయంకరమైనయాకారము గలది- లోకులనఁగా వెనుక (౧౧అ।౨౦శ్లో) చెప్పఁబడినప్రతికూలానుకూలమధ్యస్థులు- అని రామానుజభాష్యము-

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం, వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్!
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా, ధృతిం న విన్దామి శమం చ విష్ణో

లైనవారి)తో కూడనను- దంష్ట్రాకరాళాని భయానకాని తే వక్త్రాణి=కోఱలచే వికారరూపములైనవియు భయమునుఁ గలుగఁజేయునవియునగు నీ ముఖములను, త్వరమాణాః విశన్తి=త్వరపడుచున్నవారై చొచ్చుచున్నారు- కేచిత్ దశనాన్తరేషు విలగ్నాః= కొందఱు పండ్లసందులయందు చిక్కుకొనినవారై, చూర్ణితైః ఉత్తమాఙ్గైః సందృశ్యన్తే=పొడుము చేయఁబడిన శిరస్సులతోడ చూడఁబడుచున్నారు-

అమీచత్వాంధృతరాష్ట్రస్య...సర్వే సహైవ అనిపాఠము-అమీ సర్వే ధృతరాష్ట్రస్య పుత్రాః త్వాం త్వరమాణాః విశన్తి=ఈ అందఱు ధృతరాష్ట్రుని కొడుకులును నిన్ను త్వరపడుచున్నవారై చొచ్చుచున్నారు అనిఅన్వయము- దీనివలననాకు పరాజయశంకపోయినదనియర్జునుఁడు చెప్పుచున్నాఁడు- అని శంకరభాష్యము-

భగవంతుఁడు అసురాంశములగు దుర్యోధనాదులను తానె సంహరించి భూభారమును తగ్గించుటను అర్జునునకుచూపెను- దానిని చూచినపైని అర్జునుఁడు చెప్పినవియీశ్లోకములు- అని రామానుజభాష్యము-

యథానదీనాంబహవోఽమ్బువేగాః, సముద్రమేవాభిముఖాద్రవన్తి।
తథాతవామీనరలోకవీరాః,విశన్తివక్త్రాణ్యభివిజ్వలన్తి॥

యథా నదీనాం బహవః అమ్బువేగాః=ఎట్లు నదులయొక్క పెక్కులగు జలప్రవాహములు, సముద్రమేవ అభిముఖాః ద్రవన్తి = సముద్రమునుగూర్చియె అభిముఖములై చొచ్చుచున్నవో, తథా అమీ నరలోకవీరాః=అట్లు ఈ మనుష్యలోకములోని శూరులు, అభివిజ్వలన్తి తవ వక్త్రాణి ప్రవిశన్తి=అంతట వెలుఁగుచున్న నీ ముఖములను చొచ్చుచున్నారు-(అభితోజ్వలన్తి అని బొంబయిదేశపు పాఠము)

యథాప్రదీప్తంజ్వలనంపతఙ్గా, విశన్తినాశాయసమృద్ధవేగాః।
తథైవనాశాయవిశన్తిలోకా, స్తవాపివక్త్రాణిసమృద్ధవేగాః॥ ౨౯॥

యథా పతఙ్గాః ప్రదీప్తం జ్వలనం సమృద్ధవేగాః(సన్తః)నాశాయ

విశన్తి = ఎట్లు పతంగములు ప్రజ్వలించిన అగ్నిని సంపూర్ణమైన వేగముగలవై నాశముకొఱకు చొచ్చుచున్నవో, (తథైవ) లోకాః అపి తథైవ తవ వక్త్రాణి సమృద్ధవేగాః (సన్తః) నాశాయ విశన్తి = (ఈ) జనులును అట్లే నీ ముఖములను సంపూర్ణమైనవేగముకల వారై నశించుటకొఱకు చొచ్చుచున్నారు.

పతంగములనఁగా పక్షులు అని శంకరభాష్యము. మిడుతలు అని రామానుజభాష్యము.

లేలిహ్యసే గ్రసమానస్సమన్తాత్, లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం, భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో॥ ౩౦॥

సమగ్రాన్ లోకాన్ జ్వలద్భిః వదనైః గ్రసమానః = అందఱు జనులను జ్వలింపుచున్న ముఖములచేత మ్రింగుచున్నవాఁడవై, తేజోభిః సమగ్రం జగత్ ఆపూర్య = తేజస్సులచేత సమస్తమైన జగత్తును వ్యాపించి, సమన్తాత్ లేలిహ్యసే = అంతటను మాటిమాటికి నాకుచున్నావు. (హే) విష్ణో! = (ఓ) విష్ణువా!, తవ ఉగ్రాః భాసః ప్రతపన్తి = నీయొక్క క్రూరములైన తేజస్సులు తపింపుచున్నవి. ఇది శంకరభాష్యానుసారియగు యోజన.

సమగ్రాన్ లోకాన్ జ్వలద్భిః వదనైః గ్రసమానః సమన్తాత్ లేలిహ్యసే = అందఱు జనులను (రాజులను) వెలుఁగుచున్న ముఖములచేత మ్రింగుచున్నవాఁడవై అంతట నాకుచున్నావు. వారి రక్తముచేత పూయఁబడిన పెదవులు మొదలగువానిని కోపవేగముచేత మాటిమాటికి నాకుచున్నావు అనుట. (హే) విష్ణో! తవ ఉగ్రాః భాసః తేజోభిః సమగ్రం జగత్ ఆపూర్య ప్రతపన్తి = (ఓ) విష్ణువా! నీయొక్క మిక్కిలి ఘోరములైన కిరణములు తేజస్సుల (వెలుఁగు)ల చేత సంపూర్ణమైన జగత్తును నింపి తపింపుచున్నవి. ఇది రామానుజభాష్యయోజన.

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో, నమోఽస్తు తే దేవవర ప్రసీద।
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం, న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥ ౩౧॥

మే ఆఖ్యాహి=నాకు చెప్పుము- ఉగ్రరూపః భవాన్ కః = క్రూర మైనస్వరూపముగల నీవు ఎవ్వఁడవు- తే నమః అస్తు=నీకు నమస్కారము అగుఁగాత- (హే)దేవవర ప్రసీద=(ఓ) దేవశ్రేష్ఠుఁడా అనుగ్రహింపుము- ఆద్యం భవన్తం విజ్ఞాతుమ్ ఇచ్ఛామి= మొదటివాఁడవగు నిన్ను తెలియఁగోరుచున్నాను- తవ ప్రవృత్తిం నప్రజానామిహి=నీవృత్తాంతమును ఎఱుంగనుగదా-

ప్రవృత్తిమ్ = చేష్టను- అని శంకరభాష్యము-

నీసర్వేశ్వరత్వమును చూడఁగోరి నాచే ప్రార్థింపఁబడిన నీవు సర్వేశ్వరత్వమును చూపుచు ఈ యతిఘోరరూపమును ఆవిర్భవింపఁజేసితివి- ఇట్టిఘోరరూపముగల నీవు ఎవ్వఁడవో, ఏమిచేయఁ బ్రవర్తింపుచున్నావో దానిని నేను తెలియఁగోరుచున్నాను- నీకు ఇష్టమైనప్రవృత్తిని (ప్రవర్తించుటను) ఎఱుఁగకున్నాను- ఇట్లు చేయుటకై ఈ సంహారకరూపమును బయలుపుచ్చితివని చెప్పి ప్రసన్నమైనరూపముకలవాఁడవు అగుము- అని రామానుజభాష్యము-

లోకములోనొకనినామమును మాత్రము ఒకఁడు ఎఱిఁగియున్నను జాతిని తెలియఁగోరి నీవెవ్వఁడవుఅనియడుగునట్లు, అర్జునుఁడు, విష్ణో, త్వమక్షరం, ఇత్యాదులచేభగవంతుఁడని యెఱిఁగియుండియు మఱికొన్నిధర్మములను (గుణములను) తెలిసికొనుటకునీవెవ్వఁడవని భగవంతుని నడుగుచున్నాఁడు- అని మధ్వభాష్యము-

శ్రీభగవానువాచ-

కాలోఽస్మిలోకక్షయకృత్ప్రవృద్ధో,లోకాన్ సమాహర్తుమిహప్రవృత్తః
ఋతేఽపి త్వాంనభవిష్యన్తి సర్వే, యేఽవస్థితాః ప్రత్యనీకేషుయోధాః॥ ౩౨

లోకక్షయకృత్ ప్రవృద్ధః=లోకములనుక్షయింపఁజేయునదియు వృద్ధిబొందినదియు, ఇహ లోకాన్ సమాహర్తుం ప్రవృత్తః=ఇచ్చట లోకములను సంహరించుటకు ప్రవర్తించినదియునగు, కాలః అస్మి=కాలము అగుచున్నాను- యే యోధాః ప్రత్యనీకేషు అవస్థితాః=ఏ యోధులు ప్రతిసేనలలో ఉన్నారో, (తే) సర్వే=(వారు) అందఱును, త్వాం ఋతేఽపి నభవిష్యన్తి= నిన్ను విడిచియు కాఁబోరు. నీవు యు

ద్ధము చేసిచంపక పోయినను వారు మృతిఁబొందుట తప్పదనుట-

(కాలః) దుర్యోధనాదులమరణమును లెక్కపెట్టెడినేను, ఘోరరూపము గా వృద్ధినిపొందినవాఁడనై రాజసమూహమును సంహరించుటకై ఈలోకమునఁ (బ్ర) వర్తించినవాఁడను అగుచున్నాను- అని రామానుజభాష్యము-

కాలశబ్దము, జగత్తునుబంధించుట, ఛేదించుట, జ్ఞానము, మొదలగుభగవంతుని ధర్మములనన్నిటిని చెప్పును- కలబన్ధనే, కలచ్ఛేదనే, కలజ్ఞానే, అనిధాతువులు- కలకామధేనుః(కల అనుధాతువుకోరినయర్థములనన్నిటినిచ్చును) అని చెప్పుదురు-ప్రవృద్ధుఁడనఁగా పరిపూర్ణుఁడైనను ఆదిలేనివాఁడైనను- అపిశబ్దముచేత ధర్మరాజాదులుయుద్ధము చేయకపోయినను అనియర్థము- ప్రతిసేనలు అనెడిబహువచనము చేత అక్షౌహిణులుగ్రహింపఁబడును- అనిమధ్వభాష్యము-

తస్మాత్త్వముత్తిష్ఠయశో లభస్వ, జిత్వా శత్రూన్భుఙ్క్ష్వ రాజ్యంసమృద్ధమ్
మయైవైతే నిహతాః పూర్వమేవ, నిమిత్తమాత్రంభవ సవ్యసాచిన్॥ 33

తస్మాత్ త్వమ్ ఉత్తిష్ఠ = అందువలన నీవు లెమ్ము- యశః లభస్వ = కీర్తిని పొందుము- శత్రూన్ జిత్వా సమృద్ధం రాజ్యం భుఙ్క్ష్వ = శత్రువులను జయించి సంపదగల రాజ్యమును అనుభవింపుము- ఏతే మయైవ పూర్వమేవ నిహతాః = వీరు నాచేతనే పూర్వమె చంపఁబడినవారు-(హే) సవ్యసాచిన్! నిమిత్తమాత్రం భవ = (ఓ) యర్జునుఁడా! నిమిత్తమాత్రము అగుము- .

దేవతలచేఁగూడ జయింపశక్యముకానివారగు భీష్ముఁడు ద్రోణాచార్యుఁడు మొదలగువారు అర్జునునిచే జయింపఁబడిరి అనెడికీర్తి- ఎడమచేతంగూడ బాణములను వేయుటను సవ్యసాచియనఁబడును- అని శంకరభాష్యము-

నిహతులనఁగా చంపఁబడుటకు ఏర్పఱుపఁబడినవారు- నిమిత్తమాత్రమనఁగా ఆయుధము మొదలగుదానినిబోలినవాఁడవు(కము)- ఎడమచేతఁగూడ బాణములం గూర్చువాఁడు గాన సవ్యసాచి- సచ సమవాయె (సచ్ = కూర్చుట) అని ధాతువు- రెండుచేతులను యుద్ధముచేయు శక్తి కలవాఁడు- అని రామానుజభాష్యము-

ద్రోణంచభీష్మంచజయద్రథంచ, కర్ణంతథాఽన్యానపి యోధవీరాన్।

మయాహతాంస్త్వంజహిమావ్యథిష్ఠా,యుధ్యస్వజేతాసిరణేసపత్నాన్

మయా హతాన్=నాచేత చంపఁబడిన, ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ కర్ణం(చ) తథా అన్యాన్ యోధవీరానపి =ద్రోణాచార్యులనును భీష్మునిని సైంధవునిని కర్ణునిని అట్లే మిగిలిన బంటులనును, త్వం జహి=నీవుచంపుము- మావ్యథిష్ఠాః = బెదరకుము- యుధ్యస్వ=యుద్ధముచేయుము- రణే సపత్నాన్ జేతాసి=యుద్ధమున శత్రువులను జయింపఁగలవు-

ఏయేవీరులయెడను అర్జునునకుజంకుకలిగియుండెనో వారలందఱును ఈ శ్లోకమునఁజెప్పఁబడుచున్నారు- అనిశంకరభాష్యము-

గురువులుబంధువులు మొదలగువారిని ఎట్లు చంపుదునని (మావ్యథిష్ఠాః=)విచారింపకుము- వారుఅపరాధములను జేసియుండుటనుచంపఁబడుటకునాచేత నియమింపఁబడియున్నారు- అనిరామానుజభాష్యము-

నాకుమారునిశిరస్సువెవ్వఁడు భూమిమీఁద పడవేయునో వాని శిరస్సు బద్దలగునని వరముపొందిన తండ్రికలవాఁడగుటను సైంధవుఁడు సామాన్యుఁడుకాఁడు- ఇంద్రుఁడిచ్చినశక్తికలవాఁడుగాన కర్ణుఁడు నట్లే- అని మధ్వభాష్యము-

సంజయఉవాచ.

ఏతచ్ఛ్రుత్వావచనంకేశవస్య, కృతాఞ్జలిర్వేపమానఃకిరీటీ। నమస్కృత్వాభూయఏవాహకృష్ణం, సగద్గదంభీతభీతఃప్రణమ్య॥ ౩౫॥

కిరీటీ కేశవస్య ఏతత్ వచనం శ్రుత్వా=అర్జునుఁడు శ్రీకృష్ణమూర్తియొక్క ఈ మాటను విని, కృతాఞ్జలిః వేపమానః నమస్కృత్వా=చేతులుజోడించినవాఁడై వణఁకుచు నమస్కరించి, భీతభీతః(సన్)ప్రణమ్య=మాటిమాటికిబెదరినవాఁడు(అగుచు) నమ్రుఁడయి, భూయఏవ సగద్గదం కృష్ణమ్ ఆహ=వెండియు డగ్గుత్తికతోఁగూడునట్లు శ్రీకృష్ణునిఁగూర్చి పలికెను-

ప్రబలులగు ద్రోణాచార్యాదులు మరణమునుబొందుదు రేని నిరా

ధారుఁడైన దుర్యోధనుఁడుకూడమృతిఁబొందుననితలంచి ధృతరాష్ట్రుఁడు పాండవులతో సంధిని చేయునను నుద్దేశముతో సంజయుఁడీవాక్యమును చెప్పెను. విధివశంబున ధృతరాష్ట్రుఁడట్లు జరిగింపఁడయ్యె- అని శంకరభాష్యము-

భీతభీతః భూయఏవ తం ప్రణమ్య=మాటిమాటికిబెదరినవాఁడై వెండియును ఆతనినిగూర్చి నమస్కరించి, కృతాఞ్జలిః వేపమానః కిరీటీ సగద్గదమ్ ఆహ=చేతులుజోడించినవాఁడై వణఁకుచును అర్జునుఁడు డగ్గుత్తికతోఁగూడునట్లు చెప్పుచున్నాఁడు- అని రామానుజభాష్యము-

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా, జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి, సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః॥ ౩౬ ॥

స్థానే=యుక్తము- (హే) హృషీకేశ!=(ఓ) శ్రీకృష్ణుఁడా!, తవ ప్రకీర్త్యా జగత్ ప్రహృష్యతి=నీయొక్క కీర్తిచేత జగత్తు సంతోషింపుచున్నది- అనురజ్యతే చ=అనురాగమునుగూడపొందుచున్నది- రక్షాంసి భీతాని దిశః ద్రవన్తి=రక్షస్సులు బెదరినవై దిక్కులనుగూర్చి పరుగెత్తుచున్నవి- సర్వే సిద్ధసంఘాశ్చ నమస్యన్తి=సమస్తములైన సిద్ధులసమూహములును నమస్కరింపుచున్నవి-

జగత్తు సంతోషించుట మొదలగునది యుక్తమే అనుట- ఇట్లు ఎవనిఁ గూర్చి సంతోషించుట మొదలగునది జరుగుచున్నదో యా భగవంతుఁడు యుక్తుఁడు అనియైనఁ జెప్పవచ్చును- అని శంకరభాష్యము-

అగ్నిషోమాదులకంతర్యామియై జగత్తును హర్షింపఁజేయుటచేత హృషీకేశుఁడు-(హృషీక) ఇంద్రియములకు (ఈశ) అధిపతియగుటననియుఁ జెప్పవచ్చును- అని మధ్వభాష్యము-

కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।

(హే) మహాత్మన్! =(ఓ) మహాత్మా!, గరీయసే బ్రహ్మణోఽపి ఆదికర్త్రే తే=గొప్పవాఁడవును బ్రహ్మకుఁగూడ ఆదికర్తయైనవాఁ

డవు నను నీకొఱకు, (తే) కస్మాత్ ననమేరన్-(వారు) ఏల నమస్కరింపరు?-

మహాత్మ యనఁగా సంపూర్ణుఁడును ఆత్మయు నైనవాఁడు-ఆత్మ యనఁగా (ఆప్) పొందువాఁడును, (ఆదా) స్వీకరించువాఁడును, (అద్) విషయములననుభవించువాఁడును, (అత్) ఎల్లప్పుడునుండువాఁడును- అని మధ్వభాష్యము-

అనన్త దేవేశ జగన్నివాస, త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥౩౭॥
త్వమాదిదేవః పురుషః పురాణః, స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।

అనన్త!=అంతములేనివాఁడా!, దేవేశ!=దేవతలకునధిపతియైనవాఁడా!, జగన్నివాస!=జగత్తునకాధారమైనవాఁడా!, యత్ సత్ అసత్ తత్పరం (చ)=ఏది ఉన్నదియును లేనిదియును వానికంటె భిన్నమునో, (తత్) అక్షరమ్ త్వమ్=(ఆ) యక్షరము నీవు- త్వమ్ ఆదిదేవః=నీవు మొదటిదేవుఁడవు- (త్వమ్) పురాణః పురుషః=(నీవు) పురాతనుఁడవైన పురుషుఁడవు- అస్య విశ్వస్య పరం నిధానం త్వమ్=ఈ జగత్తునకు గొప్ప ఆధారమైనవాఁడవు నీవు-

సదసత్తులనెడు యుపాధులనుబట్టి అక్షరముగూడ సదసత్తులనఁబడును- పరమార్థమునుబట్టి సదసత్తులకంటె పరమైనది-జగత్తులను సృజించుటవలన నాదిదేవుఁడు- (పురిశయః) శరీరముననుండువాఁడుగాన పురుషుఁడు- నిధానమనఁగా ప్రళయకాలమున జగత్తంతయులీనమయ్యెడిస్థానము- అని శంకరభాష్యము-

అక్షరమ్=జీవస్వరూపంబును, సదసత్=కార్యకారణరూపమగు ప్రకృతియును, తత్పరమ్=వాని రెంటికంటెనితరమగు ముక్తాత్మయును నీవె- నిధానమనఁగా నాధారము- శరీరమైనవిశ్వమునకు ఆత్మయగుటను గొప్పయాధారమైనవాఁడవు నీవెయనుట- అని రామానుజభాష్యము-

తత్పరమ్=సదసత్తులకంటెపరమైనది- నీవే కారయితవు (చేయించువాఁడవు)- అని మధ్వభాష్యము-

వేత్తాఽసి వేద్యంచ పరంచ ధామ, త్వయా తతం విశ్వమనన్తరూప॥ ౩౮

(త్వం) వేత్తా అసి=(నీవు) తెలిసికొనువాఁడవు అగుచున్నావు- వేద్యంచ(అసి)= తెలియఁబడునదియును అగుచున్నావు- పరం ధామ చ అసి = గొప్ప పదంబును (అగుచున్నావు)- (హే) అనన్తరూప!=(ఓ) యంతము లేని స్వరూపముగలవాఁడా!, విశ్వం త్వయా తతమ్=జగత్తు నీచేత వ్యాపింపఁబడినది-

పరం ధామ=విష్ణుసంబంధియగు గొప్ప స్థానము- అని శంకర భాష్యము-

జగత్తులోఁ దెలిసికొనెడివారును తెలియఁబడునవియును నీవె- ఇట్లు అన్నిటికిని ఆత్మగానుండెడి నీవె పొందఁదగిన స్థానము- అని రామానుజభాష్యము-

వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాఙ్కః, ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ।

త్వం వాయుః యమః అగ్నిః వరుణః శశాఙ్కః ప్రజాపతిః ప్రపితామహశ్చ (భవసి)=నీవు వాయువును యముఁడును అగ్నియును వరుణుఁడును చంద్రుఁడును ప్రజాపతియును పితామహుని తండ్రియును (అగుచున్నావు)-

ప్రజాపతులనఁగా కశ్యపుఁడు మొదలగువారు- పితామహుఁడనఁగా బ్రహ్మకుఁ గూడ తండ్రిగాన ప్రపితామహుఁడు- అని శంకరభాష్యము-

పితామహస్త్వం ప్రపితామహశ్చ అనియును పాఠము- ప్రజాపతులు ప్రజలకు తండ్రులు- వారలకు తండ్రియైన బ్రహ్మ పితామహుఁడు- ఆతనికిఁ గూడ తండ్రియైనవాఁడు గాన ప్రపితామహుఁడు- పితామహుఁడు మొదలగు దేవతలకు ఆత్మవుగాన పితామహాదిశబ్దములచే నీవె చెప్పఁబడుచున్నావు- అని రామానుజభాష్యము-

నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః, పునశ్చ భూయోఽపి నమో నమస్తే॥

నమః పురస్తాదథ పృష్ఠతస్తే, నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ।

తే నమః అస్తు = నీకు నమస్కారము అగుఁగాక- సహస్రకృత్వః

నమః(అస్తు)=వేయిపర్యాయములు నమస్కారము(అగుగాత)- పున
శ్చనమః(అస్తు)=వెండియు నమస్కారము(అగుఁగాత)- భూయోఽపి
తేనమః= వెండియును నీకు నమస్కారము- పురస్తాత్ నమః= ఎదు
టను నమస్కారము- అథ పృష్ఠతః తే నమః=ఇఁకను వెనుకను నీ
కు నమస్కారము- (హే)సర్వ=(ఓ) అన్నియును స్వరూపముగాఁ
గలవాఁడా!, సర్వతఏవతు తే నమః అస్తు=అంతటనె నీకు నమ
స్కారము అగుఁగాత-

శ్రద్ధాభక్తులువిస్తారముగానుండుటవలనతృప్తి లేక విస్తారముగాన
మస్కారములను చేయుచున్నాఁడు- అని శంకరభాష్యము-

అనన్తవీర్యామితవిక్రమస్త్వం, సర్వంసమాప్నోషితతోఽసిసర్వః॥

(హే)అనన్తవీర్య!=(ఓ)అంతములేనివీర్యముగలవాఁడా!, త్వమ్ అన
న్తవిక్రమః=నీవు అంతములేనిపరాక్రమముగలవాఁడవు-సర్వం సమా
ప్నోషి=సమస్తమునును పొందుచున్నావు- తతః సర్వః అసి=అం
దువలన సర్వస్వరూపుఁడవు అగుచున్నావు-

అనన్తవీర్యామితవిక్రమః అని ఒకటేపదమె- నీవు అనన్తమైనవీర్యము
గలవాఁడవును అపరిమితమైనపరాక్రమముగలవాఁడవును అనియర్థ
ము-వీర్యమనఁగా సామర్థ్యము- ఒకటియాత్మచేత నె జగత్తునంతటి
ని వ్యాపించుచున్నావు- అని శంకరభాష్యము-

నీకుసమస్తమైనదియుశరీరము- కాన నీవుఆత్మగా నన్నిటియం
దుసువ్యాపించియున్నావు- కాఁబట్టి సర్వశబ్దముచేఁ జెప్పఁబడుచు
న్నావు- అని రామానుజభాష్యము-

సఖేతిమత్వాప్రసభంయదుక్తం, హేకృష్ణహేయాదవహేసఖేతి।
అజానతామహిమానంతవేదం, మయాప్రమాదాత్ప్రణయేనవాఽపి॥
యచ్చావహాసార్థమసత్కృతోఽసి,విహారశయ్యాసనభోజనేషు।
ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షంతత్ క్షామయేత్వామహమప్రమేయమ్

తవ ఇదం(చ) మహిమానం(చ) అజానతా మయా=నీయొక్క

దీనినిని(విశ్వరూపమునును) మహిమనును ఎఱుంగని నాచేత, ప్రమాదాత్ ప్రణయేనాపివా=పొఱపాటున్నైనను స్నేహముచేత నైనను, సఖా ఇతి మత్వా=చెలికాఁడవు అని తలంచి, హేకృష్ణ! హేయాదవ! హేసఖే! ఇతి=ఓకృష్ణుఁడా! ఓయాదవుఁడా! ఓచెలికాఁడా! అని, ప్రసభం యత్ ఉక్తమ్=వినయములేసందునట్లు ఏది చెప్పఁబడినదో,—విహారశయ్యాసనభోజనేషు = విహరించుటయందును పడకయందును కూర్చుండుటయందును భోజనమునందును, ఏకః అథవా తత్సమక్షమ్=ఒకఁడవైకాని లేక వారలయెదుటఁగాని, అవహాసార్థమ్ అసత్కృతోఽసి ఇతి యత్=నవ్వులాటలకొఱకు మన్నింపఁబడకుంటివన్నదియేది(కలదో),—తత్=దానిని, అప్రమేయం త్వామహం క్షామయే = అప్రమేయుఁడవైన నీచేత క్షమింపఁజేసికొందును-(త్వామ్=నిన్ను- ఆంధ్రభాషాశైలినిపట్టి నీచేత అని యర్థము వ్రాయఁబడినది- తవేమమ్ అనుపాఠమున ఇమమ్ మహిమానమ్=ఈ మహిమను అనియర్థము తత్సమక్షమ్ అనుపాఠమున సత్పురుషుల యెదుటను అనియర్థము.)

సఖయనఁగా సమానమైనఈడుకలవాఁడు- ఏకః=పరోక్షుఁడవై కాని, తత్సమక్షంవా=ప్రత్యక్షముగాఁగాని అనియర్థము- అప్రమేయుఁడనఁగా ప్రమాణములచేఁ దెలియఁబడనివాఁడు. అనిశంకరభాష్యము.

పితాసిలోకస్యచరాచరస్య, త్వమస్యపూజ్యశ్చగురుర్గరీయాన్ ।
నత్వత్సమోస్త్యభ్యధికఃకుతోన్యో, లోకత్రయేప్యప్రతిమప్రభావ॥౪౩॥

(హే)అప్రతిమప్రభావ!=(ఓ)సాటిలేనిప్రభావముగలవాఁడా!, త్వమ్=నీవు, చరాచరస్య లోకస్య=జంగమస్థావరరూపమైన ప్రాణిసమూహమునకు, పితా పూజ్యః గురుః గరీయాంశ్చ అసి=తండ్రియును పూజింపఁదగినవాఁడవును గురువును గొప్పగురువును అగుచున్నావు. లోకత్రయేపి త్వత్సమః నాస్తి=మూఁడులోకములయందును నీతోసమానుఁడు లేఁడు- అభ్యధికః అన్యః కుతః(స్యాత్?)=అధికుఁడైన ఇతరుఁడు ఏహేతువువలన (కలుగును?)

ఇంద్రులు ఈశ్వరులు సంభవింపరు-అనేకేశ్వరులున్న యెడను వ్యవహారము కుదురదుగదా. అని శంకరభాష్యము

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం, ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః, ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥

తస్మాత్ = ఆహేతువువలన, ప్రణమ్య=నమస్కరించి, కాయం ప్రణిధాయ=శరీరమును (భూమిమీదను)ఉనిచి, ఈశమ్ ఈడ్యమ్ త్వా=ఈశ్వరుండవును స్తోత్రముచేయందగినవాండవునగు నిన్ను, అహం ప్రసాదయే=నేను ప్రసన్నునిగాంజేసికొనుచున్నాను- (హే) దేవ!=(ఓ)దేవా!, పుత్రస్య పితేవ=పుత్రునకు తండ్రివలెనును, సఖ్యుః సఖేవ=చెలికానికి చెలికాండువలెనును, ప్రియః (త్వమ్)=(ఇష్టుండవైన) నీవు, ప్రియాయ (మే)=ఇష్టుండవైన నాకొఱకు, సోఢుమ్ అర్హసి=సహింపను తగుచున్నావు- శరీరమును భూమిమీదను ఉనుచుటయనంగా దండప్రణామముసేయుట.

పుత్రునియపరాధమును తండ్రిక్షమించునట్లును చెలికానియపరాధమును చెలికాండు క్షమించునట్లును (ప్రియాయాః ప్రియ ఇవ) ప్రియురాలియపరాధమును ప్రియుండు సహించునట్లును క్షమింపందగుదువు, అని శంకరభాష్యము

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా, భయేన చ ప్రవ్యథితం మనో మే।
తదేవ మే దర్శయ దేవరూపం, ప్రసీద దేవేశ జగన్నివాస॥౪౫॥

అదృష్టపూర్వం దృష్ట్వా హృషితః అస్మి=పూర్వము చూడనిదానిని(విశ్వరూపమును) చూచి సంతోషించినవాండను అగుచున్నాను- మే మనః భయేన ప్రవ్యథితమ్=నా మనస్సు భయముచేత కదలినది-(హే) దేవ!=(ఓ)దేవా!, తద్రూపమేవ మే దర్శయ=ఆరూపమునే నాకు చూపుము- (హే)జగన్నివాస! (హే)దేవేశ! ప్రసీద=(ఓ)జగత్తులు నివాసముగాంగలవాండా! (ఓ)దేవతలకు అధిపతియైనవాండా! అనుగ్రహింపుము

కిరీటినం గదినం చక్రహస్తమిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ।
తేనైవ రూపేణ చతుర్భుజేన, సహస్రబాహో భవ విశ్వమూర్తే॥

తథైవ = అట్లే (మునుపటివలెనే), కిరీటినం గదినం చక్రహస్తం త్వాం ద్రష్టుమ్ = కిరీటముకలవాఁడవును గదకలవాఁడవును చక్రము చేతఁగలవాఁడవునగు నిన్ను చూడను (చూచుటకు), అహమ్ ఇచ్ఛామి = నేను కోరుచున్నాను-(హే) సహస్రబాహో! (హే) విశ్వమూర్తే! = (ఓ) వేయిభుజములుగలవాఁడా! (ఓ) సమస్తంబును స్వరూపముగాఁగలవాఁడా!, చతుర్భుజేన తేన రూపేణైవ భవ = నాలుగు భుజములుగల ఆ రూపముతోడనె ఉండుము- ఆరూపమనఁగా వసుదేవపుత్త్రుఁడయినరూపము.

శ్రీభగవానువాచ-

మయా ప్రసన్నేన తవార్జునేదం, రూపం పరం దర్శితమాత్మయోగాత్।
తేజోమయం విశ్వమనన్తమాద్యం, యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్॥

(హే) అర్జున! -(ఓ) యర్జునుఁడా!, ప్రసన్నేన మయా = ప్రసన్నుఁడైన నాచేతను, తేజోమయం అనన్తమ్ ఆద్యం పరమ్ ఇదమ్ విశ్వరూపమ్ = తేజస్స్వరూపమైనదియును అంతములేనిదియును మొదటిదియును గొప్పదియునగు ఈ విశ్వరూపము, ఆత్మయోగాత్ తవ ప్రదర్శితమ్ = నా యోగమువలన నీకు చూపఁబడినది- మే యత్ (రూపమ్) త్వదన్యేన దృష్టపూర్వం న (భవతి) = నాయొక్క ఏ (రూపము) నీకంటెనితరమైనవానిచేత పూర్వము చూడఁబడినది కాదో-

ప్రసాదమనఁగా అనుగ్రహబుద్ధి - ఆత్మయోగమనఁగా నాయొక్క ఈశ్వరసంబంధియగు సామర్థ్యము- అని శంకరభాష్యము- (మధ-
ఆత్మయోగమనఁగా నాయొక్క సంకల్పము- అని రామానుజభాష్య

న వేదయజ్ఞాధ్యయనైర్న దానైః, న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః।
ఏవంరూపః శక్య అహం నృలోకే, ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥ ౪౮॥

(హే) కురుప్రవీర! = (ఓ) కురుశ్రేష్ఠుఁడా!, ఏవంరూపః అహమ్ - ఇ

రూపముగల నేను, నృలోకే=మనుష్యలోకమున, త్వదన్యేన వేదయజ్ఞాధ్యయనైః ద్రష్టుం నశక్యః=నీకంటెనితరునిచేత వేదములయజ్ఞములపనియధ్యయనముల(సహాయము)చేత చూడ శక్యమైనవాఁడనుకాను- దానైః (ద్రష్టుం) న(శక్యః)=దానములచేత చూడ(శక్యమైనవాఁడను)కాను- క్రియాభిశ్చ (ద్రష్టుం నశక్యః)=క్రియలచేతనును (చూడ శక్యమైనవాఁడనుకాను)- ఉగ్రైః తపోభిః (ద్రష్టుం నశక్యః)=భయంకరములైన తపస్సులచేత (చూడ శక్యమైనవాఁడను కాను-

[నుజభాష్యము-

నీకంటెనితరుఁడైనభక్తిలేనివానిచేఁ జూడ శక్యుఁడను- అని రామా

మాతేవ్యథామాచవిమూఢభావో,దృష్ట్వారూపంఘోరమీదృఙ్మమేదమ్
వ్యపేతభీః ప్రీతమనాఃపునస్త్వం, తదేవమేరూపమిదంప్రపశ్య॥౪౯॥

మమ ఘోరమ్ ఈదృక్ ఇదం రూపం దృష్ట్వా=నాయొక్క ఘోరమైన ఇట్టి ఈ రూపమును చూచి, తే వ్యథా మా(భూత్)=నీకు భయము (కలుగఁ)గూడదు- విమూఢభావశ్చ మా(భూత్)=మోహమునుపొందినవాఁడవగుటయును (కలుగఁ)గూడదు- త్వమ్ వ్యపేతభీః ప్రీతమనా(శ్చసన్)=నీవుభయములేనివాఁడవును ప్రీతినిబొందినమనస్సుకలవాఁడవు(నగుచు), మే తదిదమ్ రూపమేవ పునః ప్రపశ్య=నాయొక్క ఆయీ రూపమునే వెండియును చూడుము- ఆయీరూపమనఁగా మునుపటిరూపము.

సంజయఉవాచ.

ఇత్యర్జునంవాసుదేవస్తథోక్త్వా,స్వకంరూపందర్శయామాసభూయః।
ఆశ్వాసయామాసచభీతమేనం,భూత్వాపునస్సౌమ్యవపుర్మహాత్మా॥

వాసుదేవః అర్జునం(ప్రతి) ఇతి ఉక్త్వా=వాసుదేవుఁడు అర్జుననిగూర్చి ఇట్లు పలికి, తథా స్వకం రూపం భూయః దర్శయామాస=అట్లు తనదగు స్వరూపమును వెండియును చూపెను- మహాత్మా పునః సౌమ్యవపుః భూత్వా=మహాత్ముఁడయినశ్రీకృష్ణుఁడు వెండియు సౌమ్యమైనశరీరముగలవాఁడు అయి, భీతమ్ ఏనమ్ ఆ

శ్వాసయామాస=బెదరిన ఈతనిని ఓదార్చెను.

తథా ఉక్త్వా=అట్టిమాటనుపలికి- అనిశంకరభాష్యము-

శ్రీకృష్ణునకు స్వకీయమైనరూపము నాలుగుభుజములుకలదియె-కంసునకు బెదరిన వసుదేవునిప్రార్థనచేత కంసునిజంపువఱకు రెండుభుజములు ఉపసంహరింపఁబడినవి- తరువాతను ఆవిష్కరింపఁ(కలుగఁ)జేయఁబడినవి- శిశుపాలునకు ఎల్లప్పుడును కన్నులకుగట్టుచుండిన రూపముకూడ నాలుగుభుజములుకలదియెకదా-అనిరామానుజభాష్యము.

స్వకీయమైనరూపమనుట భ్రాంతులయుద్దేశమునుపట్టి- వస్తుస్థితినిబట్టి విశ్వరూపంబును స్వకీయమె- అనిమధ్వభాష్యము.

అర్జునఉవాచ.

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన।

ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః॥౫౧॥

(హే)జనార్దన!=(ఓ)శ్రీకృష్ణుఁడా!, తవ సౌమ్యమ్ ఇదం మానుషం రూపం దృష్ట్వా=నీయొక్క సౌమ్యమైన ఈ మనుష్యసంబంధియగు రూపమును చూచి, ఇదానీం సచేతాః ప్రకృతిం గతః అస్మి=ఇప్పుడు మనస్సుతోఁగూడినవాఁడనై(కూటఁబడినమనస్సుకలవాఁడనై) స్వభావమును పొందినవాఁడను అగుచున్నాను. (పద్యము.

సచేతస్సులనఁగా తేటయైనమనస్సుకలవాఁడనుట- అనిశంకరభాష్యము.

మానుషమనఁగా మనుష్యాకారముకలది-, అనిరామానుజభాష్యము.

శ్రీభగవానువాచ.

సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ।

దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః॥౫౨॥

మమ యదిదం రూపం దృష్టవాన్ అసి=నాయొక్క ఏయీ రూపమును చూచినవాఁడవుఅగుచున్నావో,(తత్)ఇదం సుదుర్దర్శమ్=(ఆ)యిది మిక్కిలిదుర్లభముగాఁజూడఁదగినది- దేవాఅపి నిత్యమ్ అస్య రూపస్య దర్శనకాఙ్క్షిణః (భవన్తి)=దేవతలుగూడ ఎల్లప్పుడును ఈరూపముయొక్క దర్శనమును కోరువారు (అగుచున్నారు.) (భాష్యము.

దేవతలుచూచియుండలేదు, చూడఁగలవారునుకారు. అనేదెకర

నాహం వేదైర్నతపసా నదానేన నచేజ్యయా।

శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥ ౫౩॥

మాం యథా దృష్టవాన్ అసి=నన్ను ఎట్లు చూచినవాఁడవు అగుచున్నావో, ఏవంవిధః అహమ్=ఇట్టివిధముగల నేను, వేదైః ద్రష్టుం శక్యః న(అస్మి)=వేదముల(సహాయము)చేత చూడ శక్యుఁడను కాను- తపసా న=తపస్సుచేతను కాను- దానేన న=దానముచేతను కాను- ఇజ్యయా చ న=యాగముచేతనును కాను.

నాయందు భక్తిలేక వేదాధ్యయనము మొదలగువానిచేత మాత్రము పొందఁదగినవాఁడను కాను - అని రామానుజభాష్యము.

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥ ౫౪॥

(హే)పరంతప! (హే) అర్జున!=(ఓ)శత్రువులను తపింపఁజేయువాఁడా! (ఓ)యర్జునుఁడా!, ఏవంవిధః అహమ్=ఇట్టివాఁడనగు నేను- అనన్యయా భక్త్యా=మఱియొకరినిఁగూర్చినది కాని భక్తిచేత, జ్ఞాతుం చ తత్త్వేన ద్రష్టుం చ ప్రవేష్టుం చ శక్యః=తెలిసికొనుటకును తత్త్వమున చూచుటకును, చొచ్చుటకును శక్యుఁడను- (ముక్తి) ప్రవేశించుటయనఁగా మోక్షమును పొందుట- అని శంకరభాష్య

తత్త్వమున చూచుటకును, తత్త్వమున ప్రవేశించుటకును(పొందుటకును)శక్యుఁడను- అని రామానుజభాష్యము.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సఙ్గవర్జితః।
నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాణ్డవ॥ ౫౫॥

మత్కర్మకృత్=నాకొఱకు కర్మములను జేయువాఁడును, మత్పరమః=నే పరగతిగాఁగలవాఁడును, మద్భక్తః=నాయందు భక్తిగలవాఁడును, సఙ్గవర్జితః=ఇతరములయందు స్నేహములేనివాఁడును, సర్వభూతేషు నిర్వైరః=అన్నిభూతములయందును వైరములేనివాఁడును, యః సః=ఎవ్వఁడో వాఁడు, (హే)పాణ్డవ!=(ఓ)యర్జునుఁడా!, మామ్ ఏతి=నన్ను పొందుచున్నాఁడు.

సంగమనఁగా ధనము కొడుకులు మిత్రులు మొదలగువానియందలి స్నేహము - అని శంకరభాష్యము.

వేదాధ్యయనాదికర్మములన్నియు నాయారాధనమె యని చేయు

వాఁడు మత్కర్మకృత్తు - దేని నారంభించినను నన్నుద్దేశించియే యారంభించువాఁడు మత్పరముఁడు - మద్భక్తుఁడనఁగా నన్ను కీర్తనము చేయుట స్తోత్రము చేయుట ధ్యానము చేయుట పూజించుట నమస్కరించుట మొదలగునవి లేక నిలువలేనివాఁడు - నిర్వైరుఁడనఁగా నాతోఁ కలిసికొనుటయే సుఖమనియు నాతో విడుటయే దుఃఖమనియు నుండుట చేతనును, తనకు కలిగెడి దుఃఖము తనయపరాధములవలననే కలుగు ననుకొనుట చేతనును, సమస్తభూతములును పరమపురుషున కధీనములని తెలిసికొనుట చేతనును ఏభూతముమందైనను వైరము కలుగుటకు ప్రసక్తి లేనివాఁడు - అని రామానుజభాష్యము.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపసందర్శనంనామ ఏకాదశోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబునగు భగవద్గీతలలో విశ్వరూపమును చూపుటను తెలియఁజేసెడి పదునొకండవయధ్యాయము.

# పండ్రెండవయధ్యాయము.

అర్జునఉవాచ.

**ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే।**
**యేచాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥౧॥**

ఏవం సతతయుక్తాః=ఇట్లు ఎల్లప్పుడును సావధానముగాఁ బ్రవర్తించినవారై, యే భక్తాః త్వాం పర్యుపాసతే=ఏ భక్తులు నిన్ను ఉపాసింపుచున్నారో, యేచ అవ్యక్తమ్ అక్షరమ్ ఉపాసతే=ఎవ్వరు ఇంద్రియములచేతఁ దెలియఁబడని అక్షరమును ఉపాసింపుచున్నారో, తేషాం కే యోగవిత్తమాః?=వారలలో ఎవ్వరు లెస్సగా యోగమునెఱింగినవారు?. ఇట్లు అనఁగా వెనుకటియధ్యాయపు తుదిశ్లోకములోఁ జెప్పినయట్లు అనుట.

నిన్నుఅనఁగా విశ్వరూపముగల నిన్ను ఉపాసించువారు(సగుణోపాసకులు). అక్షరముననఁగా ఉపాధులులేని బ్రహ్మమును ఉపాసించువారు(నిర్గుణోపాసకులు). అనిశంకరభాష్యము.

నిన్ను అనఁగా కల్యాణగుణపరిపూర్ణుఁడైనభగవంతుని నుపాసించువారు. అక్షరమనఁగా ప్రత్యగాత్మ(జీవ)స్వరూపము. యోగవిత్తములనఁగా శీఘ్రముగా ఫలమునుపొందువారు. అని రామానుజభాష్యము.

ఇఁకను అవ్యక్తము నుపాసించుటకంటె భగవంతుని నుపాసించుట శ్రేష్ఠమని చెప్పి,దానియుపాయము తెలుపఁబడును. అవ్యక్తమనఁగా మహాత్తుకంటెనుతక్కువ మైనప్రకృతి. అనిమధ్వభాష్యము.

శ్రీభగవానువాచ.

**మయ్యావేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే।**
**శ్రద్ధయా పర యోపేతా స్తే మే యుక్తతమా మతాః॥౨॥**

యే మయి మనః ఆవేశ్య=ఎవ్వారలు నాయందు మనస్సును ఉనిచి, నిత్యయుక్తాః పరయా శ్రద్ధయా ఉపేతాః(సన్తః)=ఎల్లప్పుడును సావధానముగాఁ బ్రవర్తింపుచున్నవారును గొప్ప శ్రద్ధతో కూ

డినవారు (నగుచు), మామ్ ఉపాసతే=నన్ను ఉపాసింపుచున్నారో, తే మే యుక్తతమాః మతాః=వారు నాకు యుక్తతములుగా సమ్మతులు.

విశ్వరూపుఁడైననాయందు- అని శంకరభాష్యము.

నిత్యయుక్తులనఁగా నిత్యమైనయోగమును (ప్రాప్తిని) కోరుచున్నవారు- యుక్తతములనఁగా నన్ను శీఘ్రముగాఁబొందువారు- అని రామానుజభాష్యము.

యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగమచింత్యంచ కూటస్థమచలం ధ్రువమ్॥ 3 ॥
సంనియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః।
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః॥ ౪ ॥

అనిర్దేశ్యమ్ అవ్యక్తం సర్వత్రగమ్ అచింత్యం కూటస్థమ్ అచలం ధ్రువంచ అక్షరమ్=నిర్దేశింపశక్యముకానిదియు తెలియఁబడనిదియు అంతటనుండునదియు తలంపశక్యముకానిదియును కూటస్థమైనదియు చలింపనిదియును స్థిరమైనదియునగు అక్షరమును, ఇంద్రియగ్రామం సంనియమ్య=ఇంద్రియసమూహమును నియమించి, సర్వత్ర సమబుద్ధయః (సంతః)=అంతటను సమమైనబుద్ధి గలవారలగుచు, యే పర్యుపాసతే=ఎవ్వారలు ఉపాసింపుచున్నారో, సర్వభూతహితే రతాః తే=అన్నిభూతములయొక్కహితమునందు ఆసక్తికలవారలగు వారు, మామేవ ప్రాప్నువంతి=నన్నే పొందుచున్నారు-

అవ్యక్తమనుటను శబ్దములకు గోచరముకానిగాన అనిర్దేశ్యము- ఉపాసించుటయనఁగా శాస్త్రానుసారముగా తాను ఉపాసింపవలసినదానిని నూనెధారవలె అవిచ్ఛిన్నముగనట్లు చాలకాలము తలంచుట- ఉప=దగ్గరను, ఆసనమ్=ఉండుట అని యవయవార్థము- అచింత్యమనఁగా మనస్సునకు విషయముకానిది- కూటమనఁగా దోషములుగలదై పైకి సుందరమువలెఁగనఁబడునది- కాఁబట్టి కూటమనఁగా మాయ- ఆమాయను సంబంధించునది యనఁగా మాయకు అధ్యక్షము(అధిష్ఠానము) అయినదిగాన కూటస్థమనఁబడును- పోకవలెనుండునదిగాన కూటస్థమని యర్థము చెప్పవచ్చును- ధ్రువమనఁగా నిత్యమనుట. అంతటననఁగా నన్నికాలముల

యుండునదనుట - ఇష్టముకలిగినను అనిష్టముకలిగినను ఒకటేవిధమైనబుద్ధిగలవారు!- భగవత్స్వరూపులగు వారిని యుక్తతములనిగానీ అయుక్తతములనిగానీ చెప్పనక్కఱలేదుగదా - అని శంకరభాష్యము.

అక్షరమనఁగా ప్రత్యగాత్మ (జీవాత్మ) స్వరూపము- అది శరీరమునంటె వేఱుగాన దేవమనుష్యాదిశబ్దములచే నిర్దేశింపఁబడఁదగనిది- చక్షుస్సు (కన్ను) మొదలగు నింద్రియములకు వ్యక్తము (స్ఫుటము) కానిది- దేవతలు మొదలగు నన్నిశరీరములయందు నుండునది - దేవాదిస్వరూపముగాఁ దలంపశక్యము కానిది- కూటస్థమనఁగా సర్వసాధారణమైనది. దేవత్వమనుష్యత్వాదులగు వేఱువేఱు ఆకారములు లేనిదనుట- పరిణమింపనిదగుటచేత తనయాకారము చలింపదుగాన అచలము- ధ్రువమనఁగా నిత్యము- ఇంద్రియములను నియమించుట యనఁగా వానివానిపనులం జేయనీకపోవుట- దేవమనుష్యాదిశరీరములయందుండుటను ఆత్మలు జ్ఞానస్వరూపము గలవారై సమానమైన యాకారము గలవారై యుందురనెడి సమబుద్ధి కలవారై- ఇట్టి సమబుద్ధి కలవారగుటను సమస్తభూతములహితమునందు నాసక్తులైనవారు- ఇతఁడు దేవుఁడు ఇతఁడు మనుష్యుఁడు, అని యిట్లు వైషమ్యబుద్ధి కలవారుగదా భూతములకహితమును జేయుదురు- ఇట్లు అక్షరోపాసనఁ జేయువారు నన్నుపొందువారే-అనఁగా నాతో సమానమైనయాకారముగల పరిశుద్ధమైనయాత్మస్వరూపమును పొందుచున్నారు అనుట. అని రామానుజభాష్యము.

క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥ ౫

అవ్యక్తాసక్తచేతసాం తేషామ్=అవ్యక్తమునందు ఆసక్తిగలమనస్సులు గలవారలకు, అధికతరః క్లేశః (భవతి)=మిక్కిలి యధికమైన దుఃఖము కలుగుచున్నది- అవ్యక్తా గతిః=అవ్యక్తసంబంధియగు మార్గము, దేహవద్భిః దుఃఖం (యథా తథా) అవాప్యతే=శరీరముగలవారలచే దుఃఖము (గా) పొందఁబడుచున్నదిగదా.

అవ్యక్తాసక్తచేతస్సులు అనఁగా పరమాత్మజ్ఞానమునం దాసక్తమనస్సులు గలవారలు (నిర్గుణోపాసకులు), దేహాభిమానమును విడువవలసి యున్నదిగాన క్లేశము మిక్కిలి యధికము- అవ్యక్తా గతిః=అక్షరమునొంది

ప్రాప్యము- అని శంకరభాష్యము.

అవ్యక్తా గతిః=అవ్యక్తమునుగూర్చిన మనోవృత్తి - దేహవంతులనఁగా దేహాత్మాభిమానముగలవారు- అని రామానుజభాష్యము.

యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥౬॥
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్॥౭॥

(హే) పార్థ!=(ఓ) యర్జునుఁడా!, సర్వాణి కర్మాణి మయి సంన్యస్య=అన్నికర్మములను నాయందు ఉనిచి, మత్పరాః=నేనే పరుఁడుగాఁగలవారును, అనన్యేన యోగేన మామేవ ధ్యాయన్త (ఉపాసన్తః)=ఇతరమునుగూర్చినదిగాని యోగముచేతను నన్నే ధ్యానము చేయుచున్నవారు(నగుచు), మామ్ యే తు ఉపాసతే=నన్ను ఎవ్వరు ఉపాసింపుచున్నారో, మయి ఆవేశితచేతసాం తేషామ్=నాయందు ఉనుపఁబడిన మనస్సులుగల వారలను, మృత్యుసంసారసాగరాత్ నచిరాత్ సముద్ధర్తా భవామి=మృత్యువుతోఁగూడిన సంసారమనెడిసముద్రమునుండి శీఘ్రముగానె ఉద్ధరించువాఁడను అగుచున్నాను.

అనన్యమనఁగా విశ్వరూపుఁడగు దేవునివిడిచి రెండవది ఆలంబనము(విషయము) గానిది- యోగమనఁగా సమాధి- అని శంకరభాష్యము.

కర్మములనఁగా శరీరమునిలుచుటకొఱకైన భోజనము మొదలగు లౌకికంబులును వైదికములగు యాగాదులును- ధ్యానము(తలంచుట), అర్చనము(పూజించుట), నమస్కరించుట, స్తోత్రము చేయుట, కీర్తనముచేయుట మొదలగువానినిమిత్తము ప్రీతితో, ఫలము సిద్ధించినట్లు తలంచుచు, చేయుచున్నవారై నన్నుడుపాసింపుచున్నారో- మృత్యుసంసారసాగరాత్=మృత్యువైన సంసారమనెడి సముద్రము [illegible] వారలను [illegible], నన్ను [illegible] గాన,

[illegible] అని రామానుజభాష్యము.

నన్నుపొం[illegible]

చెప్పుచున్నది- అని మధ్వభాష్యము.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం నసంశయః ౮॥

మనః మయ్యేవ ఆధత్స్వ= మనస్సును నాయందె ఉనుపుము- బుద్ధిం మయి నివేశయ=బుద్ధిని నాయందు ఉనుపుము- అతః ఊర్ధ్వం మయ్యేవ నివసిష్యసి= ఇంక మీదను నాయందె ఉందువు- సంశయః న=సంశయము లేదు-

విశ్వరూపుడనైయీశ్వరుడనైన నాయందె- మనస్సుసంకల్పవికల్పస్వరూపమైనది- బుద్ధి అధ్యవసాయము స్వరూపము గాంగలది- ఇంకమీదను అనగా ఈశరీరము పోయినతరువాతను- అనిశంకరభాష్యము

మనస్సును ఉనుచుటయనగా మనస్సుచే ధ్యానము చేయుట- బుద్ధి నివేశనమనంగా నేనెపరమప్రాప్యమనెడినిశ్చయము కలిగియుండుట- ఇంకమీదను అనంగా ఇట్టి నిశ్చయము కలిగినపైని అనుట- అని రామానుజభాష్యము-

అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరమ్।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ॥౯॥

అథ= ఇంకను, మయి చిత్తం స్థిరం సమాధాతుం నశక్నోషి(చేత్)=నాయందు చిత్తమును స్థిరముగా ఉనుచుటకుం జాల(వేని), (హే)ధనఞ్జయ=(ఓ)యర్జునుండా, తతః అభ్యాసయోగేన మామ్ ఆప్తుమ్ ఇచ్ఛ =అటపైని అభ్యాసయోగముచేత నన్ను పొందుటకు కోరుము-

అభ్యాసమనంగా చిత్తమును అన్నిటి నుండియుమరల్చి ఒక్క విషయమున మాటిమాటికి నునుచుచుండుట- దానివలనంగలిగెడియోగము అభ్యాసయోగము- విశ్వరూపుడనైననన్ను- అని శంకరభాష్యము-

అతిప్రీతితో స్మరించుటను అభ్యసించుట యనెడియోగముచేత స్థిరమైనచిత్తసమాధానముకుబొంది నన్నుపొందంగోరుము అని రామానుజభాష్యము.

అభ్యాసేప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి॥౧౦॥

అభ్యాసేఽపి అసమర్థః అసి(చేత్)=అభ్యాసమునఁగూడ అసమర్థుఁడవు అగుదు(వేని), మత్కర్మపరమః భవ=నాకర్మములె ముఖ్యములుగాఁగలవాఁడవు అగుము. మదర్థం కర్మాణి కుర్వన్నపి=నాకొఱకు కర్మములను చేయుచున్నను, సిద్ధిమ్ అవాప్స్యసి=సిద్ధిని పొందఁగలవు.

సిద్ధిని అనఁగా సత్త్వశుద్ధి(అంతఃకరణపరిశుద్ధి)వలనజ్ఞానము కలిగి దానివలనబ్రహ్మభావమును- అని శంకరభాష్యము.

నన్నుగూర్చినకర్మములను అనఁగా ఆలయములను(గుడులను) కట్టించుట, తోటలను వేయుట, దీపములు వెలిగించుట, ఆలయమును ఊడ్చుట, నీళ్లు జల్లుట, అలుకుట, పూవులు తెచ్చుట, పూజను నడిపించుట, నామములను చెప్పుట, ప్రదక్షిణములు చేయుట, స్తోత్రములు చేయుట, నమస్కరించుట, మొదలగునవి- వానిని మిక్కిలిప్రీతితో నాచరించుచు అభ్యాసయోగముద్వారమున నాయందు చిత్తస్థైర్యమును పొంది నన్నుఁ జేరుట యనెడి సిద్ధిని పొందుదువు- అని రామానుజభాష్యము.

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥౧౧॥

అథ=ఇఁకను, ఏతత్ కర్తుమపి అశక్తః అసి(యది)=దీనిని ఆచరించుటకును అశక్తుఁడవు అగుదు(వేని), తతః మద్యోగమ్ ఆశ్రితః(సన్)=అటుపైని నా యోగమును ఆశ్రయించినవాఁడవై, యతాత్మవాన్=నియమింపఁబడినయంతఃకరణముగలవాఁడవై, సర్వకర్మఫలత్యాగం కురు=అన్నికర్మములయొక్క ఫలములను విడుచుటను చేయుము.

మద్యోగము అనఁగా చేయఁబడెడి కర్మములను నాయందు నిలిపి చేయుట- అని శంకరభాష్యము.

మద్యోగమ్ ఆశ్రిత్య ఏతత్ కర్తుమ్ అశక్తః అసి(యది)=నన్నుగూర్చినభక్తియోగమును ఆశ్రయించి దీనిని చేయుటకు అశక్తుఁ

డవు అగుచు(వేని), భక్తియోగముయొక్క మొలకవంటిదైన మత్క
ర్మాచరణమునుజేయఁజాలవేని, మొదటిషట్కములోఁ(౬ అధ్యాయ
ములలో), జెప్పంబడినదై పరభక్తికిసాధనమైనఆత్మస్వభావము నను
సంధించుటయనెడి యక్షరయోగము (సాంఖ్యము) నకు సాధనము
గా కర్మఫలత్యాగమును చేయుము- ఫలములనువిడిచి నాయారా
ధనముగాఁజేసెడి కర్మముచేత ఆత్మధ్యానము సిద్ధించి, దానివలన
నజ్ఞానము మొదలగు నావరణములు పోయి భగవంతునకు శేషుఁడు(ప్ర
కారము) అగుటయె స్వరూపముగాఁగల ప్రత్యగాత్మప్రత్యక్షము కాఁగా
నటుపైని నాయందు పరభక్తిస్వయముగానే పుట్టును - అనిరామాను
జభాష్యము

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్॥౧౨॥

జ్ఞానమ్ అభ్యాసాత్ శ్రేయోహి = జ్ఞానము అభ్యాసముకంటె మంచిదిగదా- జ్ఞానాత్ ధ్యానమ్ విశిష్యతే=జ్ఞానముకంటె ధ్యానము విశేషింపుచున్నది- ధ్యానాత్ కర్మఫలత్యాగః (విశిష్యతే)= ధ్యానముకంటె కర్మఫలములనువిడుచుట విశేషింపుచున్నది- త్యాగాత్ అనన్తరమ్ శాన్తిః (భవతి)=త్యాగము వెంటనె శాంతి కలుగుచున్నది-

ఇప్పుడు కర్మఫలత్యాగము స్తోత్రము చేయఁబడుచున్నది- అవివేకపూర్వకంబగు నభ్యాసముకంటె జ్ఞానము (శాస్త్రములనుపట్టియు యుక్తులనుపట్టియు నాత్మనునిశ్చయించుట) విశేషింపుచున్నది- అట్టి జ్ఞానముకన్న జ్ఞానపూర్వకమగు ధ్యానము విశేషింపుచున్నది- ఇట్టి ధ్యానముకన్న కర్మఫలత్యాగము విశేషింపుచున్నది- శాంతియనఁగా సంసారముడుగుట- అజ్ఞుఁడై కర్మములఁ బ్రవర్తించినవానికి వెనుకఁ జెప్పఁబడిన యుపాయములనాచరించుటకు శక్తి లేనిచో సర్వకర్మ ఫలత్యాగమె మేలునుకలుగఁజేయునని చెప్పఁబడినది- ఆ కర్మఫలత్యాగమె ఇప్పుడు స్తోత్రము చేయఁబడుచున్నది- ధ్యానము చేయువాఁడు సర్వకర్మఫలత్యాగమును చేయునేని వానికి వెంటనే శాంతి కలుగును గాన అజ్ఞానికర్మఫలత్యాగముకూడ నట్టిదిగా స్తోత్రము చేయఁబడుచున్నది.

బ్రాహ్మణుఁడగు నగస్త్యుఁడు సముద్రమును త్రాగుటనుబట్టి ఇప్పటి బ్రాహ్మణులను స్తోత్రముచేయునట్లు- కర్మఫలత్యాగమున్న కర్మ యోగము శ్రేష్ఠము- అక్షరోపాసకునకు కర్మయోగము సందర్భింపదు- అని శంకరభాష్యము.

అభ్యాసమనఁగా ప్రీతిలేని శుష్కమైన స్మృత్యభ్యాసము (తలంపును వాడుక చేయుట)- జ్ఞానమనఁగా ఆత్మస్వరూపమును అనుసంధించి ప్రత్యక్షముగాఁ దెలిసికొనుట, అది విశేషించుచున్నది అనఁగా మిక్కిలి ఆత్మకు హితమైనది. లెస్సగా సిద్ధింపని ఆత్మాపరోక్షజ్ఞానముకంటె దానికిసాధనమైన ఆత్మధ్యానమె విశేషింపుచున్నది- సిద్ధింపకయుండెడి యాధ్యానముకంటె దానికిసాధనమైనఫలములను విడిచి యాచరింపఁబడెడి కర్మమె మేలు- ఇట్టి కర్మముల నాచరించినతోడనే పాపములన్నియు పోవుటను మనస్సునకు శాంతి కలుగును- అట్టి మనస్సుచేత ఆత్మధ్యానము కలుగును- ఆత్మధ్యానమువలననాత్మప్రత్యక్షము కలుగును- ఆత్మ ప్రత్యక్షమువలన పరభక్తి కలుగును- కాఁబట్టి భక్తియోగము నభ్యసింపలేనివానికి ఆత్మనిష్ఠయె (జ్ఞానమె) శ్రేష్ఠము- ఆత్మనిష్ఠ పైనను మనస్సునకు శాంతికలుగదేని ఆత్మజ్ఞానసాధ్యంబును ఫలములనుకోరక చేయఁబడినదియునగు కర్మాచరణమె ఆత్మనిష్ఠను కలుగఁజేయుటకు శ్రేష్ఠము- అని రామానుజభాష్యము.

అజ్ఞానపూర్వకమగు నభ్యాసముకంటె జ్ఞానమె విశేషింపుచున్నది- అట్టి జ్ఞానమున్న జ్ఞానముతోఁగూడిన ధ్యానము విశేషింపుచున్నది- ధ్యానముకంటె కర్మఫలత్యాగము విశేషింపుచున్నదనుట స్తోత్రము- ధ్యానాదులను పొందించునదిగాన త్యాగమును స్తోత్రముచేయుట యుక్తమె- అట్టి ధ్యానమున్న ఫలత్యాగముతోఁగూడినధ్యానము అధికము- అని మధ్వభాష్యము.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ॥ ౧౩॥
సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః॥ ౧౪॥

సర్వభూతానామ్ అద్వేష్టా = అన్నిభూతములకును ద్వేషికానివాఁడు

ను, మైత్రః=అన్నిటికిని మిత్రుఁడుగానుండువాఁడును. కరుణఏవచ=కనికరముకలవాఁడును, నిర్మమః=మమకారములేనివాఁడును, నిరహంకారః=అహంకారములేనివాఁడును, సమదుఃఖసుఖః=దుఃఖంబును సుఖంబునుఒక్కవిధమైనవిగాఁగలవాఁడును, క్షమీ=ఓరిమికలవాఁడును, సతతం సంతుష్టః=ఎల్లప్పుడును సంతోషించినవాఁడును, యోగీ=యోగముకలవాఁడును, యతాత్మా=నియమింపఁబడిన మనస్సుకలవాఁడును, దృఢనిశ్చయః=స్థిరమైననిశ్చయముకలవాఁడును, మయి అర్పితమనోబుద్ధిః=నాయందు ఉంచఁబడినమనస్సును బుద్ధియునుకలవాఁడునగు మద్భక్తః యః=నాభక్తుఁడు ఎవ్వఁడో, సః మేప్రియః=వాఁడు నాకు ఇష్టుఁడు.

అన్నిభూతములును ఆత్మయే యని యెఱుఁగుటను తన్ను దుఃఖపెట్టినవానియందుఁగూడ ద్వేషములేనివాఁడు. కరుణయనఁగా దుఃఖించువారలయందలిదయ. కాఁబట్టి కరుణుఁడనఁగా నన్నిభూతములకు నభయమునిచ్చెడిసంన్యాసియనుట. దుఃఖమునుపట్టి ద్వేషంబును సుఖమునుపట్టి రాగంబును లేనివాఁడు సమదుఃఖసుఖుఁడు. తిట్టినను కొట్టినను వికారములేనివాఁడు క్షమి. తనకు దేహమును నిలువఁబెట్టికొనుటకైనది(ఆహారము)(సతతమ్)దొరకినను దొరకకపోయినను సంతోషించినవాఁడు. యోగియనఁగా నిశ్చలచిత్తుఁడు. యతాత్మయనఁగా నియమింపఁబడినస్వభావముకలవాఁడు. నిశ్చయము ఆత్మతత్త్వముం గూర్చినది. సంకల్పవికల్పస్వరూపమైనది మనస్సు. అధ్యవసాయము స్వరూపముగాఁగలది బుద్ధి. అని శంకరభాష్యము.

నాకర్మమునుబట్టి యీశ్వరునిచే ప్రేరణచేయఁబడినవై భూతములు నాకు ఉపకారాపకారములు చేయుచున్నవనుతలంపుగలవాఁడగుటచే నన్నిభూతములయందును ద్వేషముచేయక స్నేహభావమును చేయువాఁడు. శరీరమునందును ఇంద్రియములయందును దేహసంబంధులయందును మమకారములేనివాఁడు. అహంకారమనఁగా దేహమే ఆత్మయనెడితలంపు. దైవవశమునలభించినయన్నాదులతోఁదృప్తిబొందినవాఁడు సంతుష్టుఁడు. సతతం యోగీ=ఎల్లప్పుడును ప్రకృతిసంప

ర్గమము లేని యాత్మస్వరూపమున ననుసంధించువాఁడు- యతాత్మయనఁగా నియమింపఁబడిన మనోవృత్తి కలవాఁడు- ఆత్మస్వరూపము నెఱింగించెడి శాస్త్రములలోఁ జెప్పినయంశములయందు దృఢమైన నిశ్చయముకలవాఁడు-భగవంతుఁడగువాసుదేవుఁడె ఫలమునుగోరక చేయఁబడెడికర్మములచేతఆరాధింపఁబడుచున్నాఁడు,ఇట్లారాధింపఁబడినవాఁడైనాకుఆత్మప్రత్యక్షమునుగలుగఁజేయును,అనియుండువాఁడు నాయందు సమర్పింపఁబడినమనోబుద్ధులుకలవాఁడు- నాభక్తుఁడనఁగా కర్మయోగము చేతనన్ను సేవించువాఁడు- అని రామానుజభాష్యము.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చయః।
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః॥

లోకః యస్మాత్ నోద్విజతే= లోకము ఎవ్వనికి భయపడదో, యశ్చ లోకాత్ నోద్విజతే= ఎవ్వఁడు లోకమునకు భయపడఁడో,యశ్చ హర్షామర్షభయోద్వేగైః ముక్తః= ఎవ్వఁడు సంతోషము కోపముభయముఉద్వేగముఅనువానిచేత విడువఁబడినవాఁడో, సః మే ప్రియః= వాఁడు నాకు ఇష్టుఁడు- ,(ఉద్వేగమనఁగా ఒంటరినైనేను జనులులేనిచోట నెట్లు జీవింతును? అని యిట్లు చిత్తమున వ్యాకులమునొందుట అనిమధుసూదనటీక- )

ఉద్విజతే=పరితపింపదో, క్షోభమునుపొందదో- హర్షమనఁగా ఇష్టమయినదికలుగుట చేతకలిగిన అంతఃకరణముయొక్క ఉత్కర్షము- అది గగురుపొడుచుట, ఆనందబాష్పములు పడుట మొదలగువానిచేఁ దెలియఁబడును- అమర్షమనఁగా తనకిష్టమైనదానికి అడ్డము వచ్చినదానినిగూర్చి సహనము లేకుండుట. భయమనఁగా బెదరు- అని శంకరభాష్యము.

ఏ కర్మనిష్ఠుఁడు లోకమునకు ఉద్వేగము కలిగెడి పనిని చేయఁడో, ఈతఁడు అందఱకును అవిరోధియను నిశ్చయమున సర్వలోకంబును ఈతనికిఉద్వేగము కలిగెడిపనిని చేయదో- అని రామానుజభాష్యము-

అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః॥౧౬॥

అనపేక్షః శుచిః దక్షః ఉదాసీనః గతవ్యథః సర్వారమ్భపరిత్యాగీ(చ) మద్భక్తః యః=అపేక్షలేనివాఁడును పరిశుద్ధుఁడును నేర్పరియును ఉదాసీనుఁడును బాధలులేనివాఁడును అన్నిప్రయత్నములను విడుచువాఁడునగు నాభక్తుఁడు ఎవ్వఁడో, సః మే ప్రియః=వాఁడు నాకు ఇష్టుఁడు.

శరీరము ఇంద్రియములు విషయములు వీనిసంబంధము మొదలగు వానియందు అపేక్షలేనివాఁడు- లోపలను వెలుపలను శుద్ధికలవాఁడు. దక్షుఁడనఁగా సమయస్ఫూర్తికలవాఁడు - ఉదాసీనుఁడనఁగా పక్షపాతములేనివాఁడు- వ్యథయనఁగా భయము- ఈలోకమునందును పరలోకమునందును కోరినఫలమును కలుగఁజేసెడి కర్మములు సర్వారంభములు- అనిశంకరభాష్యము.

ఆత్మ తప్ప మిగిలిన వాని యన్నిటియందును అపేక్ష లేనివాఁడు. శుచియనఁగా శాస్త్రములో విధింపఁబడినద్రవ్యముచేత శరీరపోషణము చేసికొనువాఁడు- దక్షుఁడనఁగా శాస్త్రమునఁ జెప్పినపనులను స్వీకరించుటకు సమర్థుఁడైనవాఁడు- శాస్త్రీయములుకానివానియందుపేక్షకలవాఁడు ఉదాసీనుఁడు- శాస్త్రములోఁ జెప్పఁబడినకర్మములఁ జేయునప్పుడు తటస్థించెడిచలువవేఁడి మొదలగువానివలనఁ గలిగెడి దుఃఖములవలన బాధపడనివాఁడు- శాస్త్రీయములుగాని కర్మములనన్నిటిని ఆరంభించుటలేనివాఁడు సర్వారంభపరిత్యాగి- అని రామానుజభాష్యము.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి॥
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యః స మే ప్రియః॥౧౭॥

యః న హృష్యతి=ఎవ్వఁడు సంతోషింపఁడో, యః న ద్వేష్టి=ఎవ్వఁ

డు ద్వేషింపఁడో, (యః) నశోచతి=(ఎవ్వఁడు) దుఃఖింపఁడో, (యః) నకాఙ్క్షతి=(ఎవ్వఁడు) కోరఁడో, శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్(చ) యః=శుభములనునశుభములనువిడిచిన భక్తిమంతుఁడు(ను) ఎవ్వఁడో, సః మే ప్రియః=వాఁడు నాకు ఇష్టుఁడు.

ఎవ్వఁడు ఇష్టముకలిగినప్పుడు సంతోషింపఁడో, అనిష్టము కలిగినప్పుడు ద్వేషింపఁడో, ఇష్టమైనవస్తువు ఎడఁబాసినచో దుఃఖింపఁడో, తనకు లభింపనిదానిని కోరఁడో- అని శంకరభాష్యము.

పకమర్ణయోగి ఇష్టానిష్టములు కలిగినప్పుడు సంతోషద్వేషములు లేనివాఁడో, భార్య పుత్రులు ధనము మొదలగునవిపోయినను దుఃఖింపఁడో, తనకు లేని భార్యాపుత్రాదికమునుకోరఁడో- పాప పుణ్యములు రెండును బంధహేతువులెకాన రెండిటిని విడుచువాఁడు శుభాశుభపరిత్యాగి- అని రామానుజభాష్యము.

సర్వారంభపరిత్యాగీ, శుభాశుభపరిత్యాగీ, అను వానిలో నొకటి సామాన్యంబును మఱియొకటి విశేషంబునుగానీ, ఒకటి సంగ్రహంబును మఱియొకటివివరణంబునుగానీ యగుటచే పునరుక్తిలేదు- హర్షాదులు లేనివాఁడన్నచో ఒకప్పుడైనను కొంచెము హర్షాదులు కలుగవచ్చునని ఎవ్వఁడు సంతోషింపఁడో అనియిట్లు వ్రాయఁబడినది- అని మధ్వభాష్యము.

సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సఙ్గవివర్జితః॥౧౮॥
తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సన్తుష్టో యేనకేనచిత్।
అనికేత స్స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః॥౧౯॥

శత్రౌచ మిత్రేచ సమః=శత్రువునందును మిత్రునియందును సముఁడును, తథా మానావమానయోః శీతోష్ణసుఖదుఃఖేషు సమః=అట్లె సంమానమునందు నవమానమునందును చలువయందును వేడియందు

నుసుఖమునందునుదుఃఖమునందునుసముఁడును, సఙ్గవివర్జితః=సంగములేనివాఁడును,తుల్యనిన్దాస్తుతిః=(తన్ను)నిందించుటయుస్తోత్రముచేయుటయుసమానముగాఁగలవాఁడును, మానీ=మానముకలవాఁడును, యేనకేనచిత్ సంతుష్టః=దేనిచేతనైనను సంతోషించువాఁడును, అనికేతః=ఇల్లులేనివాఁడును, స్థిరమతిః=స్థిరబుద్ధికలవాఁడును, భక్తిమాన్=భక్తికలవాఁడునగు, నరః మే ప్రియః=మనుష్యుఁడు నాకు ఇష్టుఁడు- మౌనమనఁగా వాక్కునునియమించుట-

శరీరమునిలుచుటకుతగినదేనిచేతనైనను సంతోషించువాఁడు- అనికేతుఁడనగాఁ నియతమైనఉనికిపట్టులేనివాఁడు- పరమార్థవిషయమైనబుద్ధికలవాఁడు స్థిరమతి- అనిశంకరభాష్యము.

అద్వేష్టాసర్వభూతానామ్ (౧౨అ॥౧౩శ్లో॥)ఇత్యాదికముచేత శత్రుమిత్రాదులయందు ద్వేషాదులులేకపోవుట చెప్పఁబడినది- ఇప్పుడు వారుసమీపించినప్పుడుగూడ చిత్తము సమముగా నుండుట యనెడి యంతకంటె విశేషము చెప్పఁబడుచున్నది- ఆత్మయందెస్థిరమైన బుద్ధికలవాఁడు- కావుననె ఇల్లు మొదలగువానియందుసంగములేనివాఁడుగాన అనికేతుఁడు- అనిరామానుజభాష్యము-

భక్తికలవాఁడనిరెండుపర్యాయములు (౧౭శ్లో॥ ౧౯శ్లో॥) చెప్పట,భక్తియొక్కఆధిక్యమును తెలియఁజేయుటకు- ఇది యేతుసర్వాణికర్మాణి (౧౨అ।౬శ్లో) ఇత్యాదికముయొక్కప్రపంచమె- అని మధ్వభాష్యము.

యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానామత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః।౨౦।

యేతు=ఎవ్వారలు, శ్రద్దధానాః మత్పరమాః(శ్చసన్తః)= శ్రద్ధచేయుచున్నవారును నేనుముఖ్యుఁడనుగాఁగలవారు(నగుచు), యథోక్తమ్ ఇదమ్ ధర్మ్యామృతమ్ పర్యుపాసతే= వెనుకఁజెప్పఁబడిన ఈ ధర్మ

ముతప్పనియమృతమును ఉపాసించుచున్నారో, తే భక్తాః మే అతీవ ప్రియాః=ఆ భక్తులు నాకు మిక్కిలి ఇష్టులు.

ఏసంన్యాసులు- అమృతమనఁగా అమృతత్వమును(మోక్షమును) కలుగఁజేయునది- ఇదియనఁగా అద్వేష్టా సర్వభూతానామ్(౧౨అ॥ ౧౩శ్లో॥) అనునది మొదలు చెప్పఁబడినది- పర్యుపాసతే= ఆచరింపుచున్నారో- మత్పరములనఁగా అక్షరాత్మయే గొప్పగతిగాఁగలవారు- భక్తులనఁగా పరమార్థజ్ఞాన మనెడి భక్తికలవారు- అని శంకరభాష్యము-

యథోక్తమ్=మయ్యావేశ్యమనోయేమామ్ (౧౨అ॥౨శ్లో॥) ఇత్యాదికముచేఁజెప్పఁబడిన భక్తియోగమును- అని రామానుజభాష్యము-

ధర్మ్యఁ డనఁగా విష్ణువు- అతఁడువిషయముగాఁగలదిధర్మ్యము- మరణము మొదలగుస ంసారమును నశింపఁజేయునదిగాన అమృతము- శ్రిత్=ఆస్తిక్యము- అదిగలవారు శ్రద్ధధానులు- అనిమధ్వభాష్యము-

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యా
యాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవా
దేభక్తియోగోనామ ద్వాదశోధ్యాయః

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్ర
తిపాదకంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణా
ర్జునసంవాదంబునగు భగవద్గీతలలో
భక్తియోగప్రతిపాదకంబగు
పండ్రెండవయధ్యాయము.



గీతాభాష్యత్రయసారము.

పదుమూఁడవయధ్యాయము-

శ్రీభగవానువాచ.

ఇదంశరీరం కౌన్తేయ క్షేత్ర మి త్యభిధీయతే।
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥౧॥

(హే)కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, ఇదం శరీరం క్షేత్రమితి అభిధీయతే=ఈ శరీరము క్షేత్రమని చెప్పఁబడుచున్నది- యః ఏతత్ వేత్తి=ఎవ్వఁడు దీనిని ఎఱుఁగుచున్నాఁడో, తం తద్విదః క్షేత్రజ్ఞ ఇతి ప్రాహుః=వానిని వానినెఱుఁగువారు క్షేత్రజ్ఞుఁడని చెప్పుచున్నారు-

(క్షత)దెబ్బనుండి (త్ర)కాపాడునదియగుటనును, నశించుటవల్లను, క్షయించుట(తగ్గిపోవుచుండుట)వల్లనును, భూమి(క్షేత్రము)యందువలెదీనియందుకర్మఫలముసిద్ధించుటవల్లనును శరీరము క్షేత్రమనిచెప్పఁబడును - స్వభావసిద్ధమగుజ్ఞానముచేత అఱకాలు మొదలుశిరస్సువఱకును తెలిసికొనువాఁడుగాన క్షేత్రజ్ఞుఁడనఁబడుచున్నాఁడు- ఉపదేశమువలనఁగలిగినజ్ఞానమునఁగూడ నేర్పాటుగా శరీరమునెఱుంగునుగాన క్షేత్రజ్ఞుఁడనఁబడుచున్నాఁడు- అనిశంకరభాష్యము

నేను దేవుఁడను, నేను మనుష్యుఁడను, నేను బలిసినవాఁడను, నేను చిక్కినవాఁడను అనియిట్లుఆత్మతోసామానాధికరణ్యమున (ఐక్యమున) తోఁచుచుండి ఆత్మకంటె వేఱైనశరీరము,ఆయాత్మకు భోగమునకు క్షేత్రముఅనఁగా స్థానముఅనిఆత్మతత్త్వమునెఱిఁగినవారిచేఁ జెప్పఁబడుచున్నది- ఈశరీరమును అవయవములుగానును మొత్తముగానును దీనిని నేనెఱుంగుదునని ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడోవానిని ఈశరీరముకన్న వేఱైన క్షేత్రజ్ఞునిగాఁ జెప్పుచున్నారు. అనిరామానుజభాష్యము-

వెనుకఁజెప్పఁబడిన జ్ఞానము,జ్ఞేయము(తెలియఁబడినది), క్షేత్రము, పురుషుఁడు(జీవుఁడు), అనువీనిని ఏర్పాటుగా నీ యధ్యాయము తెలియఁజేయును- అని మధ్వభాష్యము.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।

క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ॥

(హే)భారత!=(ఓ)భరతవంశమువాఁడా!, సర్వక్షేత్రేషు క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి=అన్నిశరీరములయందును ఆత్మను నన్నుగా తెలిసికొనుము- క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్=శరీరముయొక్కయు నాత్మయొక్కయు జ్ఞానము ఏది(కలదో), తత్ జ్ఞానం మమ మతమ్=అది జ్ఞానముగా నాకు ఇష్టము.

వెనుకఁ జెప్పఁబడిన క్షేత్రజ్ఞుని నన్ను అనఁగా సంసారసంపర్కము లేని పరమాత్మనుగాఁ దెలిసికొనుము- అన్నిక్షేత్రములయందునొకఁడై బ్రహ్మాదిస్తంబపర్యంతమైన అనేకక్షేత్రములనెడి యుపాధులచేత విభజింపఁబడిన ఈతనిని ఉపాధులవలనవచ్చిన భేదము లెవ్వియు లేనివానిగాను సత్తు(ఉండునది),అసత్తు(లేనిది)అనునివి మొదలగు శబ్దములచేత తెలియఁబడనివానిగాను దెలిసికొనుము- ఈ క్షేత్రక్షేత్రజ్ఞులజ్ఞానమె మంచిజ్ఞానమని నాతాత్పర్యము- అని శంకరభాష్యము.

దేవమనుష్యాదిసర్వశరీరములయందును జ్ఞాతృత్వమె(తెలిసికొనువాఁడగుటయె) స్వరూపముగాఁగల క్షేత్రజ్ఞుని(జీవుని) నన్నుగాను అనఁగా నేను ఆత్మగాఁగలవానిగాఁ దెలిసికొనుము- అపి(కూడ)అనుటవలన క్షేత్రమును గూడ నన్నుగాను అనఁగా నేను ఆత్మగాఁగలదానిగానెఱుంగుము- శరీరము క్షేత్రజ్ఞునికి విశేషణమగుటయె స్వభావముగాఁగలదగుటచేత ఆత్మనువిడిచియుండకపోవుటను ఆత్మతోడి సామానాధికరణ్యముచేతనె నేను దేవుఁడను మనుష్యుఁడను అనియిట్లు ఐక్యముగా)నిర్దేశింపఁబడునట్లు ఈ క్షేత్రంబును క్షేత్రజ్ఞుఁడును గూడనాకువిశేషణమగుటయెస్వభావముగాఁగలవగుటచేత నన్నువిడిచియుండకపోవుటను నాతోడిసామానాధికరణ్యము(ఐక్యము) నను నిర్దేశింపఁబడఁదగినవిగాఁ దెలిసికొనుము- అని రామానుజభాష్యము.

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు॥ 3॥

తత్ క్షేత్రమ్=ఆ శరీరము, యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్=ఏస్వరూపముకలదో ఏవిధమైనదో ఏవికారముకల

దో ఎందువలన(కలిగినదో) ఏదో, సచ యః యత్ప్రభావశ్చ=ఆ (క్షేత్రజ్ఞుఁడును) ఎవ్వఁడో ఎట్టిప్రభావములుకలవాఁడో, తత్ సమాసేన మే శృణు=దానిని సంగ్రహముగా నావలన వినుము.

యాదృక్=ఎట్టి ధర్మములుగలదో- యతఃయత్ (కార్యమ్ ఉత్పద్యతే)=దేనివలన ఏ(కార్యము పుట్టుచున్నదో)- ప్రభావములనఁగా ఉపాధులవలనవచ్చినశక్తులు- మే (వాక్యతః) శృణు=నా (వాక్యమున) వినుము - అనిశంకరభాష్యము.

యచ్చ=ఏద్రవ్యమో, యాదృక్చ=వేనికిఆధారమైనదో- యతశ్చ=ఏహేతువువలనఁబుట్టినదో- ఏప్రయోజనమునకొఱకో యనుట- యత్=ఏస్వరూపముకలదో- యః=ఏస్వరూపముకలవాఁడో- అని రామానుజభాష్యము-

యద్వికారి=ఏవికారముతోఁగూడినదో- యతశ్చ యత్=ఎవ్వనివలన ప్రవర్తింపుచున్నదో-(యాధాతువుమీఁద శతృప్రత్యయాంతమునకు నపుంసకైకవచనము యత్ అనునది-) సచయః=ఆప్రవర్తింపఁజేయువాఁడు ఎట్టి స్వరూపముకలవాఁడో- అనిమధ్వభాష్యము-

ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః॥౪॥

ఋషిభిః బహుధా గీతమ్=ఋషులచేత అనేకవిధములుగా చెప్పఁబడినది- వివిధైః ఛన్దోభిః పృథక్ (గీతమ్)=అనేకవిధములగు మంత్రములచేత ప్రత్యేకముగా (చెప్పఁబడినది)- హేతుమద్భిః వినిశ్చితైః బ్రహ్మసూత్రపదైశ్చైవ (గీతమ్)=హేతువులుకలవియు సంశయములేనివియునగు బ్రహ్మసూత్రపదములచేతఁగూడ (చెప్పఁబడినది.)

వసిష్ఠుఁడు మొదలగువారు ఋషులు- ఛందస్సులనఁగా ఋక్కులు మొదలగునవి- బ్రహ్మసూత్రములనఁగా బ్రహ్మమును తెలియఁజేయునవియును పదములనఁగా బ్రహ్మమును పొందించునవియునగు ఆత్మేత్యేవోపాసీత (బృ॥౩॥౪॥౭॥—ఆత్మయనియె ఉపాసనచేయవలయును) ఇత్యాద్యుపనిషద్వాక్యములు బ్రహ్మసూత్రపదములు - అనిశంకరభాష్యము.

ఈ క్షేత్రక్షేత్రజ్ఞులతత్త్వము పరాశరుఁడు మొదలగు ఋషులచేఁ జెప్పఁబడినది- ఛందస్సులనఁగా ఋగ్యజుస్సామాథర్వములు- బ్రహ్మసూత్రములనెడి పేరుగలపదములచేతను అనఁగా శారీరకసూత్రములచేతను. వినిశ్చితములనఁగా నిర్ణయమెతుదిగాఁగలవి- అని రామానుజభాష్యము.

బ్రహ్మసూత్రములనఁగా శారీరకము- అనిమధ్వభాష్యము-

మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ।
ఇన్ద్రియాణి దశైకంచ పఞ్చచేన్ద్రియగోచరాః॥౫॥
ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాత శ్చేతనాధృతిః।
ఏతత్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్॥౬॥

మహాభూతాని అహంకారః బుద్ధిః అవ్యక్త మేవచ=పృథివి మొదలగునయిదుభూతంబులును అహంకారతత్త్వంబును మహత్తత్త్వంబును మూలప్రకృతియును, ఇన్ద్రియాణి దశ ఏకంచ=ఇంద్రియములు పదియును ఒకటియును, ఇన్ద్రియగోచరాః పఞ్చచ=ఇంద్రియములచేఁ దెలియఁబడువిషయములు అయిదును, ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాతః చేతనా ధృతిః=కోరికయును ద్వేషంబును సుఖంబును దుఃఖంబును దేహము ఇంద్రియములు మొదలగువానిసముదాయంబును తెలివియును ధైర్యంబును, (ఇతి)ఏతత్=అనెడి ఇది, సమాసేన సవికారం క్షేత్రమ్ ఉదాహృతమ్=సంగ్రహముగా వికారములతోఁగూడిన క్షేత్రముగా చెప్పఁబడినది.

మహాభూతములనఁగా సూక్ష్మభూతములు (తన్మాత్రలు)· స్థూలభూతములు ఇంద్రియగోచరములలోఁ జేరును- అహంకారమనఁగా ఈ భూతములకు కారణమైన అహమ్(నేను) అనెడి జ్ఞానము స్వరూపముగాఁగలది- ఆయహంకారమునకు కారణమైన అధ్యవసాయ స్వరూపమగునది బుద్ధి - అవ్యక్తమనఁగా అవ్యాకృతము - అదియె యీశ్వరశక్తి- అదియె మాయ యని చెప్పఁబడును- ఇవియెనిమిదివిధములగు ప్రకృతియని తెలియఁజేయుటకై ఏవచ అనఁబడినది - బుద్ధీంద్రియములు అయిదును కర్మేంద్రియములు అయిదును- మనస్సొకటియును- ఇంద్రియగోచరములు శబ్దాదివిషయములు- ఇవియె ఇరువదినాలుగుతత్త్వములు- ఇచ్ఛ మొదలగునవి అంతఃకరణ ధర్మములేకాని ఆత్మధర్మ

ములు కావు- కాలినఇనుపగుండులోనిఅగ్నివలె అహంకారమునసం క్రమించినచైతన్యాభాసమె(చైతన్యభ్రాంతియె)తెలివి- ఈఇచ్ఛాదుల నుచెప్పుట అంతఃకరణధర్మములకన్నిటికిని ఉపలక్షణము- వికారములు మహత్తత్త్వము మొదలగునవి- ఈ చెప్పిన భేదములసమూహమైనఈ శరీరమె క్షేత్రము- అనిశంకరభాష్యము.

పృథివ్యప్తేజోవాయ్వాకాశములనెడి పంచమహాభూతంబులును భూతాదియనెడియహంకారంబును మహత్తత్త్వంబును ప్రకృతియు ననునివి క్షేత్రమునకు లుగఁజేసెడి ద్రవ్యములు- శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడి అయిదుజ్ఞానేంద్రియములును, వాక్పాణిపాద పాయూపస్థములనెడి అయిదుకర్మేంద్రియములును, మనస్సును, శబ్దస్పర్శరూపరసగంధములనెడి అయిదువిషయంబులును అనునివి క్షేత్రమునాశ్రయించియుండెడి తత్త్వములు- ఇచ్ఛాదులు క్షేత్రవికారము లు- ఇచ్ఛాద్వేషాదులు ఆత్మధర్మములైనను అవిక్షేత్రసంబంధమువల నఁగలిగినవగుటచే క్షేత్రకార్యములుగానక్షేత్రవికారములనఁబడును- చేతనాధృతిః సంఘాతః=(చేతన)జీవులకు(ఆధృతి)ఆధారమైమె పంచ భూతసంఘాతమైన, ఏతత్ క్షేత్రమ్= ఈ క్షేత్రము, వికారములతో అనఁగా కార్యములతోఁగూడ సంగ్రహముగాఁ జెప్పఁబడినది- చేతనుఁడు సుఖదుఃఖములను అనుభవించుటకు ఆధారమైనది క్షేత్రము- అని రామానుజభాష్యము.

ఇచ్ఛ మొదలగునవివికారములు. అనిమధ్వభాష్యము.

అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః॥ ౭॥

ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకారఏవచ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్॥ ౮॥

అసక్తి రనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టా నిష్టోపపత్తిషు॥ ౯॥

మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది॥ ౧౦॥

అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్।

ఏతజ్జ్ఞానమితిప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా ||౧౧||

అమానిత్వమ్ అదమ్భిత్వమ్ అహింసా క్షాన్తిః ఆర్జవమ్=అభిమానము లేకపోవుటయు దంభము లేకపోవుటయు హింస లేకపోవుటయు ఓరిమియు ఆర్జవంబును, ఆచార్యోపాసనం శౌచమ్ స్థైర్యమ్ ఆత్మవినిగ్రహః=ఆచార్యుని సేవించుటయు శౌచంబును స్థిరత్వంబును ఆత్మనిగ్రహంబును, ఇన్ద్రియార్థేషు వైరాగ్యమ్=విషయములయందు వైరాగ్యంబును, అనహంకార ఏవ చ=అహంకారము లేకపోవుటయును, జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్=జన్మమరణజరారోగదుఃఖదోషములం దెలిసికొనుటయు, అసక్తిః=సంగము లేకపోవుటయు, పుత్రదారగృహాదిషు అనభిష్వఙ్గః = పుత్రుఁడు భార్య ఇల్లు మొదలగువానియందు మిక్కిలియాసక్తి లేకపోవుటయు, ఇష్టానిష్టోపపత్తిషు నిత్యం సమచిత్తత్వం చ=ఇష్టములును అనిష్టములును అనుభవించునప్పుడు ఎల్లప్పుడును సమానమైనచిత్తము కలిగియుండుటయును, మయి అనన్యయోగేన అవ్యభిచారిణీ భక్తిశ్చ=నాయెడను ఇతరసంబంధము లేకుండునట్లు నియతమైన భక్తియును, వివిక్తదేశసేవిత్వమ్=నిర్జనప్రదేశమును ఆశ్రయించుటయును, జనసంసది అరతిశ్చ=లోకులకూటమియందు ఆసక్తి లేకపోవుటయును, అధ్యాత్మజ్ఞాననిత్యత్వమ్ = ఆత్మనుగూర్చిన జ్ఞానము నెల్లప్పుడుగలవాఁడగుటయు, తత్త్వజ్ఞానార్థదర్శనమ్ – తత్త్వజ్ఞానము యొక్క ప్రయోజనమును తెలిసికొనుటయును, ఏతత్ జ్ఞానమ్ ఇతి ప్రోక్తమ్=ఇది జ్ఞానము అని చెప్పఁబడినది- అతః అన్యథా యత్ (అస్తి) – దీనికంటె వేఱువిధముగా ఏది (కలదో), తత్ అజ్ఞానమ్–అది అజ్ఞానము-

జ్ఞానమునకు సాధనములగుగుణములు చెప్పఁబడుచున్నవి- ఇవి జ్ఞానసాధనములుగాన జ్ఞానమని చెప్పఁబడుచున్నవి- మానమనఁగా తన్ను పొగడికొనుట- దంభమనఁగా తనధర్మమును ప్రసిద్ధిచేసికొనుట- హింసయనఁగా ప్రాణులను బాధించుట. ఒకఁడు అపరాధమును చేసినను వికారము లేకుండుట క్షాంతి- ఆర్జవమనఁగా కుటిలుఁడు కాకుండుట- మోక్షసాధనంబునుపదేశించువాఁడు ఆచార్యుఁడు- శౌ

చమనఁగా శరీరపుమలమును మన్నుచేతను నీళ్లచేతను కడుగుట యును, మనస్సుయొక్క మలములగు రాగాదులను వానికివిరోధముగా తలంచుటచేత పోఁగొట్టుకొనుటయును- స్థైర్యమనఁగా మోక్షమార్గమందె ప్రయత్నముచేయుట- ఆత్మవినిగ్రహమనఁగా శరీరమునుమంచిమార్గమున నడపుట- ఇంద్రియార్థములనఁగా ఇహలోకపరలోకములలోని శబ్దాదివిషయములు- జన్మము మొదలగువానియందు దోషములను ఆలోచించుట- గర్భములోనుండుటయును యోనిద్వారమున వెడలుటయు జన్మదోషములు- ముదిమిలో తెలివి శక్తి తేజస్సు ఇవితగ్గుటదోషము- దుఃఖములనఁగా ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములనెడి తాపత్రయము- జన్మము మొదలగు వానియందు దుఃఖమనెడి దోషమునుఆలోచించుట యనియైననన్వయింపవచ్చును - జన్మాదులయందు దుఃఖదోషమునాలోచించినతోడనే విషయానుభవములయందువైరాగ్యముకలుగును. అటపైని ఆత్మదర్శనమునకై ప్రత్యగాత్మయందు ఇంద్రియములుప్రవర్తించునుగాన ఈదోషదర్శనముగూడ జ్ఞానహేతువే- సక్తియనఁగా విషయములయందలి ప్రీతిమాత్రము- అభిష్వంగమనునదియు సంగవిశేషమె- అదిఇతరుని తన్నుగాఁజూచుట- ఎట్లన్నను ఇతరునిసుఖదుఃఖములను తనసుఖదుఃఖములుగాఁదలంచుట (Sympathy). ఇష్టము కలిగినప్పుడు హర్షంబును అనిష్టము కలిగినప్పుడు ద్వేషంబును లేకపోవుట సమచిత్తత్వము- అనన్యయోగమనఁగా వాసుదేవునికన్నపరుఁడు(గొప్పవాఁడు) లేఁడు- కాఁబట్టి ఆతఁడెమన కుగతి అనునిశ్చయము- వివిక్తదేశములనఁగా తనంతవెకానీచాగు చేయుటచేఁగానీ అపరిశుద్ధములును పాములు దొంగలుపెద్దపులులు మొదలగునవియును లేని అడవి, పట్టియొడ్డు, దేవాలయములు మొదలగునవి- జనసంసత్తుఅనఁగా అశిక్షితులైన పామరులసమూహము- పండితులసమూహముకాదు. అదిజ్ఞానమునకుపకారియె- ఆత్మానుబంధియైనజ్ఞానముఅధ్యాత్మజ్ఞానము. జ్ఞానసాధనములగు అమానిత్వముల పరిపాకమువలనఁగలిగెడి జ్ఞానము తత్త్వజ్ఞానము. దానియర్థము అనఁగాప్రయోజనము- మోక్షమనుట- అదిసంసారముడుగుటయె. దానిని ఆలోచించుట తత్త్వజ్ఞానార్థదర్శనము- వీనికంటె నితరములగు

నవి మానిత్వము దంభిత్వము మొదలగునవి- అని శంకరభాష్యము.

మానమనఁగా గొప్పవారిని అగౌరవించుట- దంభమనఁగా తన్ను ధార్మికుఁడనుకొనుటకు ధర్మములనాచరించుట- హింసయనఁగా వాక్కునమనస్సునశరీరమునఁగూడ పరులనుబాధింపకుండుట- క్షాంతియనఁగా పరులుతన్నుబాధించినను చిత్తవికారములేకుండుట- ఆర్జవమనఁగా పరులంగూర్చి తనశరీరవాఙ్మనస్సుల ప్రవృత్తి యొక్కవిధము గానుండుట- ఆచార్యోపాసనమనఁగా ఆత్మజ్ఞానము నిచ్చెడి యాచార్యునింగూర్చి నమస్కారముప్రశ్నముసేవనినాచరించుట- శౌచమనఁగా ఆత్మజ్ఞానమునకును దానిసాధనమునకును తగినమనోవాక్కాయములు కలిగియుండుట- స్థైర్యమనఁగా ఆధ్యాత్మశాస్త్రమునఁ జెప్పఁబడినదానియందు నిశ్చలుఁడై యుండుట. ఆత్మవినిగ్రహమనఁగా ఆత్మస్వరూపముకంటె మిగిలినవానినుండి మనస్సును మరలించుట- ఆత్మకంటె మిగిలినవిషయములు ఇంద్రియార్థములు- వాని దోషములం దెలిసికొని వానియందు రోతగలిగియుండుట వైరాగ్యము- అహంకారమనఁగా దేహమును ఆత్మగాఁదలంచుట- ఇచ్చట తనవికానివానిని తనవియనుకొనుటనుంగూడ చేర్చికొనవలయును- జన్మాదిదోషానుదర్శనమనఁగా శరీరముతోనుండునప్పుడు జన్మము మొదలగు దోషములు తప్పనివి అని తలంచుట- ఆత్మకంటె మిగిలినవానియందు సంగము లేకపోవుట అసక్తి- శాస్త్రములోఁ జెప్పఁబడిన కార్యములయందు తప్ప మిగిలినవానియందు పుత్రాదులను చేర్చికొనకపోవుట అనభిష్వంగము- తత్త్వజ్ఞానార్థచింతనమనఁగా తత్త్వజ్ఞానము ప్రయోజనముగాఁగల చింతయేదిగలదో దానియందు ఆసక్తుఁడై యుండుట- జ్ఞానమనఁగా ఆత్మజ్ఞానసాధనము- అనేనజ్ఞాయతే (దీనిచేతఁ దెలియఁబడును) అని విగ్రహము- అజ్ఞానమనఁగా ఆత్మజ్ఞానమునకు విరోధియగునది- అని రామానుజభాష్యము.

(సచయోయత్ప్రభావశ్చ- ౧౩అ|| ౩శ్లో||) అతఁడెవ్వఁడో ఎట్టి ప్రభావముకలవాఁడో, దానిని చెప్పుటకు ఆతనిజ్ఞానమునకు సాధనములు చెప్పఁబడుచున్నవి. తాను తక్కువవాఁడని తెలిసియుండియు గొప్పదనమును చూపుట దంభము- మనస్సును వాక్కును శరీరంబును విపరీత

ము లు కాకుండుటయూ ఆర్జవము. సక్తి యనఁగా స్నేహము. అదిమికిఁ లిపక్వ మైనచో నభిష్వంగము. తత్త్వజ్ఞానార్థదర్శనమనఁగా ఆప రోక్షజ్ఞానముకలుగుట కై శాస్త్రములం జూచుట. అనిమధ్వభాష్యము

జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే।
అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నా సదుచ్యతే॥౧౨॥

యత్ జ్ఞేయం తత్ ప్రవక్ష్యామి=ఏది తెలియఁదగినదో దానిని చెప్పఁగలను. యత్ జ్ఞాత్వా అమృతమ్ అశ్నుతే=దేనిని తెలిసి కొని మోక్షమును పొందుచున్నాఁడో, తత్ అనాదిమత్=అది ఆదిలే నిది. (తత్) పరంబ్రహ్మ=అది పరబ్రహ్మము. తత్ సత్ న=అ ది సత్తు [ఉండునది] కాదు. (తత్) అసత్ (ఇతి) నోచ్యతే=(అ ది) అసత్తు [లేనిది] (అని) చెప్పఁబడదు.

కొందఱు, అనాదిమత్పరం అనిపదచ్ఛేదముచేసి, మత్పరమ్=నేను అనఁగా వాసుదేవుఁడను గొప్పశక్తిగాఁగలది అని యర్థముచేయుదు రు. ఇట్లు శక్తికలుగునట్లు చెప్పుట, నసత్తన్నాసదుచ్యతే అని విశేష ము లేమియులేదని తెలియఁజేసెడియుత్తరవాక్యముతో విరోధించును. అట్టివిరోధము లేనిచో నీయర్థముయుక్తముగానేయుండును. కాఁబట్టి అనాదిమత్ అనిమతుప్పును (మత్ అనుదానిని) ప్రయోగించుటశ్లో కపూర్తికొఱకని యెఱుంగునది. లోకమునయింద్రియములచేఁ దెలియఁ బడుదానిని కలదనియు తెలియఁబడనిదానిని లేనిదనియుచెప్పునట్లు పరబ్రహ్మమునుచెప్పుట శక్యముకాదు. అది యేయింద్రియమునకును గో చరముకాదు. అనిశంకరభాష్యము. పైశాచభాష్యమునమత్పరమ్ అని పదచ్ఛేదముచేయఁబడి మదాత్మకము అని అర్థమువ్రాయఁబడినది.

అమానిత్వము మొదలగు సాధనములచేత జ్ఞేయముఅనఁగాఁ బొందఁదగినప్రత్యగాత్మస్వరూపమునుచెప్పెదను. దేనిని తెలిసికొని అమృతుఁడగు అనఁగా పుట్టుకముదిమి చావు మొదలగునవిలేని యా త్మనుపొందుచున్నాఁడో. అనాది, మత్పరమ్అనియె పదచ్ఛేదము.ఆ దిలేనిది అనాది.మత్పరమనఁగా నేనుపరుఁడుగాఁగలది. బ్రహ్మమనఁ గా గొప్పదిఅనుట. శరీరముకంటె వేఱును స్వయముగా శరీరమును మొ దలగుపరిచ్ఛేదము (ఆవరణము) లేనిదియును, క్షేత్రజ్ఞతత్త్వము

(జీవవస్తువు) అనియర్థము- వీనికిశరీరపరిచ్ఛేదముకర్మముచలనవచ్చినది- కర్మబంధమువదలినపైని అనంతుఁడగును- సత్తనఁగా కార్యము (*Effect*)- అసత్తనఁగా కారణము(*Cause*)- కార్యమగుటయు కారణమగుటయు ననెడి రెండవస్థలులేకుండుటచే సదసచ్ఛబ్దములచే నాత్మస్వరూపము చెప్పఁబడదు- కార్యకారణావస్థలు ఆత్మకుకలుగుట కర్మమనెడి యవిద్యయొక్క ఆవరణముచేతవచ్చినది- దేవమనుష్యాదినామరూపములుకలిగియుండుటచేతఁగదా ఆత్మకుకార్యావస్థ- అదిలేనియప్పుడు అనఁగా సృష్ట్యాదియందు కారణావస్థ- కారణావస్థయందుఁగూడ సూక్ష్మరూపమైన యవిద్యయావరించియే యుండును-కాఁబట్టి కర్మసంపర్కములేనియాత్మస్వరూపముసత్తనియుఁ అసత్తనియునుగూడ చెప్పఁబడదు- అనిరామానుజభాష్యము.

(సచయః) ఆతఁడెవ్వఁడో అనునదిపరఁబ్రహ్మఅనుదానిచేఁజెప్పఁబడినది- మిగిలినది (యత్ప్రభావశ్చ) ప్రభావముకలవాఁడోఅను నంశము- ఆదిమత్తు అనఁగా ఆదికలదైన శరీరము మొదలగునది-ఆదిమత్తులేనిదిఅనాదిమత్తు-ఇట్లు అర్థముగానిచో అనాదిఅనియెయుండవలెను- అనిమధ్వభాష్యము.

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్,
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥౧౩॥

తత్ సర్వతఃపాణిపాదమ్=అది అంతటచేతులుకాళ్లు కలదియును, సర్వతోక్షిశిరోముఖమ్=అంతట నేత్రములును శిరస్సులును ముఖములును కలదియును,సర్వతశ్శ్రుతిమత్=అంతటచెవులుకలదియునయి, లోకే సర్వమ్ ఆవృత్య తిష్ఠతి=లోకములో అంతటిని ఆవరించి ఉన్నది-

సర్వప్రాణులయొక్కయుకరణములు(ఇంద్రియములు) అనెడి ఉపాధులచేత క్షేత్రజ్ఞుఁడుండుట ఊహింపఁబడుచున్నది- కాఁబట్టి పాణిపాదాదులుకలుగుటయనెడిమిథ్యారూపమునుగూడ క్షేత్రజ్ఞునియొక్క అస్తిత్వమును(ఉనికిని) తెలిసికొనుటకుజ్ఞేయముయొక్క (ఆత్మయొక్క) స్వరూపమువలె కల్పించి చెప్పఁబడుచున్నది- ఈయుపాధులవలనఁగలిగిన విశేషములన్నియు నసత్యములుగాన వానినిపరిహరించియె జ్ఞేయమగునని నసత్తన్నాసదుచ్యతే(౧౩అ॥౧౨శ్లో)అని చె

ప్పఁబడినది- శ్రుతియనఁగా వినెడియింద్రియము. లోకమనఁగాఁ సమస్త ప్రాణులసమూహము ఆవరించియనఁగా వ్యాపించి- అని శంకరభాష్యము.

పరిశుద్ధమైనయాత్మస్వరూపము చేతులుకాళ్లు మొదలగువానితో చేసెడి కార్యములను అంతటను జేయసమర్థమైనది- ప్రత్యగాత్మకూడ పరిశుద్ధుఁడైనచో పరబ్రహ్మముతో సమానుఁడగునుగదా- అంతటిని వ్యాపించియున్నది- అనఁగా పరిశుద్ధస్వరూపము దేశాదుల పరిచ్ఛేదములేనిదిగాన సర్వవ్యాపకమనుట- అని రామానుజభాష్యము.

సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥౧౪॥

తత్=అది, సర్వేన్ద్రియగుణాభాసమ్ సర్వేన్ద్రియవివర్జితమ్=ఇంద్రియగుణములచేఁ బ్రకాశించునదియు, అన్నియింద్రియములును లేనిదియును- అసక్తమేవ సర్వభృచ్చ=సంగములేనిదియేయై అన్నింటినిభరించునదియును- నిర్గుణం గుణభోక్తృ చ=సత్త్వరజస్తమోగుణములు లేనిదియును గుణములనుఅనుభవించునదియును-

ఇంద్రియములనఁగాకరణములు- అవి జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములును బుద్ధియును మనస్సును- వీనిగుణములనఁగా అధ్యవసాయము(నిశ్చయించుట), సంకల్పము(ఉద్దేశించుట), వినుట, మాటలాడుట, మొదలగునవి- ఈవ్యాపారములుకలదివలె తెలియఁబడుననుట- అసక్తమనఁగా అన్నింటితోను అంటులేనిది- సర్వమును భరించునదియనఁగా మనకుకలిగెడి జగద్భ్రాంతికంతటికిని ఆధారమైనది- మృగతృష్ణిక(ఎండమావి) మొదలగు భ్రాంతులుకూడ ఆధారములులేకకలుగవు- గుణములననుభవించునదియనఁగా శబ్దాదులద్వారంబునను సుఖదుఃఖమోహరూపముగాఁబరిణమించిన సత్త్వరజస్తమోగుణములను తెలిసికొనునది- అని శంకరభాష్యము-

ఇంద్రియగుణములనఁగా ఇంద్రియవృత్తులు- వానిచేతఁగూడ విషయములను తెలిసికొనుటకు సమర్థమైనదని యర్థము- సర్వేంద్రియములులేనిది అనఁగా స్వభావమునుపట్టి ఇంద్రియవృత్తులయపేక్షలేకయె అన్నింటిని తెలిసికొనునది యనియనుట- అసక్తమనఁ

గా దేవాదిశరీరములతో నంటులేనిదియు, సర్వభృత్తు—అనఁగా దేవాదిశరీరములన్నిటినీ భరించుటకు సమర్థమైనదియును- స్వభావముంబట్టి గుణములులేనిదియు, గుణములననుభవించుటకు సమర్థమైనదియును- అని రామానుజభాష్యము.

అన్నియింద్రియములనును గుణములనును ఆభాసింపఁజేయువాఁడుగాన సర్వేంద్రియగుణాభాసుఁడు- ఇంద్రియవర్జితుఁడగుటవెనుకఁజెప్పఁబడినది- అని మధ్వభాష్యము.

బహిరన్తశ్చ భూతానామచరం చరమేవచ।

సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికేచతత్ ॥౧౫

(తత్) భూతానాం బహిః అన్తశ్చ (అస్తి)=(అది) భూతములవెలుపలనును లోపలనును (కలదు)- అచరమ్ చరమేవచ=కదలనిదియును కదులునదియునే- తత్ సూక్ష్మత్వాత్ అవిజ్ఞేయమ్=అది సూక్ష్మమగుటవలన తెలియశక్యముకానిది- తత్ దూరస్థంచ=అది దూరమున నున్నదియును- (తత్) అన్తికేచ (అస్తి)=(అది) సమీపమునందును (కలదు)-

అది శరీరమునకు వెలుపలనును లోపలనునున్నది - సర్పము-గాఁదోఁచెడి త్రాటివలె జంగమస్థావరరూపమై శరీరముగా మనకుఁదోఁచునదియు నదియె- ఇట్లు తెలియఁబడినను ఆకాశమువలె సూక్ష్మమగుటచేత అజ్ఞానులకు స్వస్వరూపముతోఁ దెలియఁబడదు- జ్ఞానులకు అన్నియు నాత్మయె అన్నియును బ్రహ్మమె అనియిట్లు తెలియఁబడును- కావుననె అజ్ఞానులకు దూరస్థంబును జ్ఞానులకు సమీపస్థంబును- అని శంకరభాష్యము-

శరీరము లేనివాఁడై పృథివి మొదలగు భూతములను విడిచి వెలుపటనుండును-వానిలోనునుండును-ముక్తపురుషుఁడుతనయిష్టముచొప్పునశరీరముకలవాఁడై కదలుచుండువాఁడును కదలకయుండువాఁడు నగును- ఇట్లు సర్వజ్ఞత్వంబును సర్వశక్తియునుగల ఈయాత్మతత్త్వము(జీవుఁడు) శరీరముననున్నదైనను సూక్ష్మమగుటను శరీరముకన్న వేఱుగా సంసారులచేఁదెలియఁబడఁదగనిది- వెనుకఁజెప్పిన అమానిత్వాదిగుణములులేనివారికి దూరముననున్నదియె- ఆగుణములుకలవారికిదగ్గఱ

నున్నదియె-

అవిభక్తంచ భూతేషు విభక్తమివచ స్థితమ్।
భూతభర్తృచ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ॥౧౬॥

తత్ భూతేషు అవిభక్తం(సత్) విభక్తమివచ స్థితమ్=అది భూతములయందు విభజింపఁబడనిదగుచు విభజింపఁబడినదివలెనును ఉన్నది- (తత్) భూతభర్తృచ గ్రసిష్ణు ప్రభవిష్ణుచ జ్ఞేయమ్=(అది) భూతము ననుపోషించునదిగాను మ్రింగునదిగాను పుట్టునదిగాను తెలియఁబడఁదగినది-

ఆత్మతత్త్వము ఆకాశమువలె నొకటియెకానిప్రతిదేహమునందును విభజింపఁబడినదికాదు- ప్రాణులయందంతటను విభజింపఁబడినదివలెనుండును- అది స్థితిసమయమున భూతములను పోషించునది- ప్రళయకాలమున భూతములను మ్రింగునది- సృష్టికాలమున త్రాడుమొదలగువానియందు అసత్యముగా కల్పింపఁబడిన సర్పముమొదలగునవివలెనే పుట్టునది- అనిశంకరభాష్యము.

దేవతలుమనుష్యులు మొదలగు భూతములయందంతట నుండెడి యాత్మవస్తువు తెలిసికొనుటకుఁ దగుటయెయాకారముగాఁగలదగుటను విభజింపఁబడనిది- అజ్ఞులకు ఈతఁడు దేవుఁడు ఈతఁడు మనుష్యుఁడు అనియిట్లు విభజింపఁబడినదివలె నుండును. దేహరూపముగా చేరియున్న పృథివి మొదలగు భూతములను పోషించునదియెద్దియో అది పోషింపఁబడెడి భూతములకంటె వేఱు అని తెలియశక్యమయినది- భూతములవికారములయిన అన్నముమొదలగువానిని మ్రింగునది యెద్దియో అది మ్రింగఁబడువానికంటె వేఱు అని తెలియశక్యమైనది. ప్రభవిష్ణువనఁగా పుట్టుటకుకారణమైనది. మ్రింగఁబడి మఱియొకటి యాకారముగాఁబరిణమించిన యన్నాదులకు ఆపరిణామమును పుట్టుటకు కారణమైనది వానికంటె వేఱు అని తెలియశక్యమగును- చచ్చినశరీరమున మ్రింగుట మొదలగునవి కనబడకపోవుటచేత మ్రింగుట మొదలగు వానికి భూతసముదాయ రూపమైన ఈశరీరము కారణముగాదని నిశ్చయింపఁబడుచున్నది. అనిరామానుజభాష్యము.

జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే।

జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥౧౭

తత్ జ్యోతిషామపి జ్యోతిః=అది జ్యోతిస్సులకుఁగూడ జ్యోతిస్సు-(తత్) తమసః పరమ్ ఉచ్యతే=(అది) తమస్సుకంటె ఉత్కృష్టముగా చెప్పఁబడుచున్నది- (తత్) జ్ఞానమ్=అది జ్ఞానము- (తత్) జ్ఞేయమ్=(అది) జ్ఞేయము- (తత్) జ్ఞానగమ్యమ్=(అది) జ్ఞానముచేతఁబొందఁదగినది- సర్వస్య హృది విష్ఠితమ్=సమస్తమైనప్రాణిసమూహముయొక్క యు హృదయమునందు ఉన్నది-

ఆత్మతత్త్వము సూర్యుఁడు మొదలగువానినిగూడ ప్రకాశింపఁజేయునది- తమస్సు అనఁగా అజ్ఞానముకంటె నితరమైనది- అజ్ఞానసంపర్కము లేనిదనుట- జ్ఞానమనఁగా అమానిత్వము(౧3అ॥౭శ్లో) మొదలగునది- జ్ఞేయమనఁగా ౧౨శ్లో॥ము మొదలు చెప్పఁబడినది- జ్ఞానముచేఁబొందఁబడునది యనఁగా తెలియఁబడిన జ్ఞేయము- తెలియఁబడుచున్నప్పుడు అదియె జ్ఞేయము. తెలియఁబడినతరువాతను అదియె జ్ఞానమునకు ఫలము- ఈ మూఁడును అందఱుప్రాణులహృదయముననఁగా బుద్ధియందున్నవి- అని శంకరభాష్యము.

దీపము సూర్యుఁడు మొదలగు వానినిగూడ ఆత్మకువెలుగువంటిదైన జ్ఞానమె ప్రకాశింపఁజేయును(తెలియఁజేయును)- దీపము మొదలగునవి ఇంద్రియములకును విషయములకును( things ) సంబంధము కలుగ నీని చీకటిని పోఁగొట్టుటనుమాత్రమె చేయును- అంతమాత్రముననే వానిని ప్రకాశింపఁజేయువానిగాఁ జెప్పెదరు- తమస్సనఁగా సూక్ష్మావస్థ(సృష్ట్యవస్థ)యందుండెడి ప్రకృతి. దానికంటె నుత్కృష్టముగాఁ జెప్పఁబడుచున్నదనుట. జ్ఞానమ్ జ్ఞేయమ్=జ్ఞానస్వరూపముగాఁ దెలియఁబడఁదగినది- అది అమానిత్వము(౧3అ॥౭)మొదలగు జ్ఞానసాధనములచేత పొందఁబడఁదగినది- మనుష్యాదులయందలి హృదయమునందునుసంనిహితమైనది(ఉన్నది)- అని రామానుజభాష్యము.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే॥౧౮॥

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయంచ సమాసతః ఉక్తమ్=ఇట్లు క్షేత్రంబును అట్లే జ్ఞానంబును జ్ఞేయంబును సంగ్రహముగాను చెప్పఁబడినది- మద్భక్తః ఏతత్ విజ్ఞాయ=నాభక్తుఁడు దీనిని తెలిసికొని, మద్భావాయ ఉపపద్యతే=నేనగుటకు తగుచున్నాఁడు.

ఈచెప్పినదియె సమస్తవేదార్థంబును సమస్తగీతాశాస్త్రార్థంబును- నాయందు భక్తికలవాఁడనఁగా దేనినైనను చూచినను విన్నను ముట్టినను అదియంతయు వాసుదేవుఁడె యని తలంచువాఁడు- మద్భావమనఁగా పరమాత్మనైననేనగుట- మోక్షమును పొందునను ట- అనిశంకరభాష్యము.

దీనిని అనఁగా క్షేత్రముకన్న వేఱుగానుండెడి యాత్మనుపొందఁదగిన యుపాయముయొక్క స్వరూపమునను, క్షేత్రజ్ఞుని(జీవుని) స్వరూపమునను తెలిసికొని- మద్భావమనఁగా నాయొక్క స్వభావము-అనఁగాసంసారికాకపోవుట- దానిని పొందుటకుతగినవాఁడగును- అనిరామానుజభాష్యము-

వికారములలోఁజేరుటను జ్ఞానసాధనము మొదట చెప్పఁబడినది- విస్తారమగుటయును సాధనమునకు మిక్కిలియుపయోగించుటయును ప్రభావము తరువాతఁజెప్పఁబడినది- అనిమధ్వభాష్యము.

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥౧౯॥

ప్రకృతిం పురుషంచ (ఇతి) ఉభావపి అనాదీఏవ విద్ధి=ప్రకృతినిని పురుషునిని (అనెడి) ఇద్దఱినిని ఆదిలేనివారలనుగాను ఎఱుంగుము-వికారాంశ్చ గుణాంశ్చైవ ప్రకృతిసంభవాన్ విద్ధి=వికారములనును గుణములనును ప్రకృతివలనఁబుట్టినవానిగానె ఎఱుంగుము-

౭అధ్యాయమున ఈశ్వరునకుపరాపరములనెడి రెండుప్రకృతులు(౪ శ్లో) చెప్పఁబడినవి- అవియె క్షేత్రజ్ఞుఁడును క్షేత్రంబును- ఈశ్వరుఁడు నిత్యుఁడుగాన వాని ప్రకృతులుగూడ నిత్యములగుట యుక్తమె- ఈ రెండు ప్రకృతులనుగలిగియుండుటయే కదా ఈశ్వరుఁడగుట- ఈప్రకృతులచేతనే ఈశ్వరుఁడు జగత్తుయొక్క ఉత్పత్తిస్థితి ప్రలయములకు హేతువగును- ఇచ్చట కొందఱుప్రకృతిపురుషులు నిత్యు

లయినయెడను జగత్తు దానివలనఁ గలిగినదియె యగును, ఈశ్వరుఁడు జగత్తునకు కారకుఁడు కాకపోవును, కాఁబట్టి అనాది అనుదానికి ఆదికానివి అనఁగా కారణములు కానివి అని యర్థము చేతురు- అదియుక్తము కాదు- ప్రకృతిపురుషులు కలుగకముందు ఏర్పడునవి లేవుగాన ఈశ్వరుఁడు కారకుఁడు కాకపోవలసివచ్చును- సంసారము నిర్నిమిత్తమైనయెడను మోక్షము లేకపోవలసివచ్చును- శాస్త్రము నిరర్థకము కావలసివచ్చును- ఈశ్వరుఁడును ప్రకృతులును గూడ నిత్యములైనయెడను ఇవియన్నియును కుదురును. గుణములనఁగా చెప్పఁబడఁగల బుద్ధి మొదలు దేహమువఱకు నుండునవి- ప్రకృతియనఁగా ఈశ్వరునియొక్క మాయయను వేఱొక శక్తి- అది త్రిగుణాత్మకమైనది- అన్నివికారములకును కారణమైనది- అని శంకరభాష్యము.

వికారములనఁగా బంధమునకు హేతువులైన ఇచ్ఛ(కోరిక)ద్వేషము మొదలగునవి- గుణములనఁగా మోక్షహేతువులగు అమానిత్వాదులు. పురుషునితో ననాదిగాఁ గలిసియుండి క్షేత్ర(శరీర)రూపముగాఁ బరిణమించి యున్న యీ ప్రకృతియె ఇచ్ఛాద్వేషము మొదలగు తనవికారములచేత పురుషునకు బంధమును కలుగఁజేయును- అమానిత్వము మొదలగు తనవికారములచేత మోక్షహేతువగును- అని రామానుజభాష్యము-

యతశ్చ యత్ అనుదానిని (ప్రేరకత్వమును) చెప్పుటకై ప్రకృతివికారపురుషులు సంగ్రహించి చెప్పఁబడుచున్నారు. గుణములు సత్త్వము మొదలగునవి- ఈగుణములకు ప్రళయావస్థకంటె సృష్ట్యవస్థయందు మిక్కిలిస్వల్పమైనవిశేషమె కలిగియుండునుగాన వికారములు వేఱుగాఁ జెప్పఁబడినవి- అనిమధ్వభాష్యము.

కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే।
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥౨౦॥

ప్రకృతిః కార్యకారణకర్తృత్వే హేతుః ఉచ్యతే=ప్రకృతి కార్యములయొక్కయు కారణములయొక్కయు కర్తృత్వమున హేతువుగాఁ జెప్పఁబడుచున్నది. పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతుః ఉచ్యతే=పురుషుఁడు సుఖదుఃఖములకు భోక్తయగుటయందు హేతువుగా చెప్పఁబ

డుచున్నాఁడు.

కార్యకరణకర్తృత్వే అని పాఠము. కార్యమనఁగా శరీరము- కరణములనఁగా దానియందుండునవి- దేహమును కలుగఁజేసెడి పంచభూతములును అయిదు విషయములును అనెడి ప్రకృతివికారములు కార్యమనఁబడును- ప్రకృతివలనఁ బుట్టిన సుఖదుఃఖమోహస్వరూపములగు గుణములు కరణములను (ఇంద్రియములను) ఆశ్రయించియుండును గాన కరణములనఁబడును- వానికర్తృత్వమనఁగా వానిని బుట్టించుట- కార్యకారణకర్తృత్వే అను పాఠమున కార్యములు అనఁగా వికారములు- కారణములనఁగా అవికారములు కలవి- ఇవి వెనుకటి కార్యకరణములె- ఎనిమిది ప్రకృతులును (ప్రకృతి మహదహంకారములును పంచతన్మాత్రలును) కారణములనియు, పదియాఱు వికారములును (పదునొకండు ఇంద్రియములును పంచభూతములును) కార్యములనియుఁ జెప్పవచ్చును- పురుషుఁడనినను జీవుఁడనినను క్షేత్రజ్ఞుఁడనినను భోక్త యనినను ఒక్కటియె. భోక్త యనఁగా సుఖదుఃఖములను దెలిసికొనువాఁడు- కార్యకరణములనెడి హేతువులుగానును సుఖదుఃఖములనెడి ఫలములుగానును పరిణమించుటచేత భోగ్యయై (అనుభవింపవలసినదై) యున్న ప్రకృతితో పురుషునకు భోక్త (అనుభవించువాఁడు) యగుట యనెడి యజ్ఞానరూపమైన సంబంధ మెప్పుడు కలుగునో, అప్పుడే సంసారము- సంసారమనఁగా సుఖదుఃఖములకు భోక్త (అనుభవించువాఁడు) యగుటయె- అది కలుగుటయె పురుషునకు సంసారిత్వము- అని శంకరభాష్యము-

కార్యమనఁగా శరీరము- కారణములనఁగా జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములును- అవి క్రియలను (పనులను) చేయుటకు, పురుషునిచే నధిష్ఠింపఁబడిన ప్రకృతియె హేతువు- ఇట్టి ప్రకృతియైన క్షేత్రము ఆధారముగాఁ గలదియె భోగమును కలుగఁజేసెడి వ్యాపారములనుట- పురుషుఁడు తాను శరీరమును అధిష్ఠించుటయందలి ప్రయత్నమునకు హేతువగుటయె కర్తృత్వము- ప్రకృతితోఁ గలిసిన పురుషుఁడె సుఖదుఃఖానుభవమునకు ఆధారమైనవాఁడు. అని రామానుజభాష్యము-

కార్యము శరీరము- కారణము ఇంద్రియములు- భోగమనఁగా

అనుభవము- పురుషుఁడు చిద్రూపుఁడు(జ్ఞానస్వరూపుఁడు) అగుటను అనుభవింపుచున్నాఁడు- ప్రకృతిజడముగాన పరిణమించునది- అని మధ్వభాష్యము.

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు ॥ ౨౧॥

పురుషః ప్రకృతిస్థః (సన్)=పురుషుఁడు ప్రకృతియందున్నవాఁడు (అగుచు), ప్రకృతిజాన్ గుణాన్ భుఙ్క్తే హి=ప్రకృతివలనఁగలిగిన గుణములను అనుభవింపుచున్నాఁడుగదా- అస్య గుణసఙ్గః సదసద్యోనిజన్మసు కారణం హి=వీనికి గుణములతోడి సంపర్కము మంచివియు చెడ్డవియునగు యోనులయందలి పుట్టుకలవిషయమున కారణముగదా-

ప్రకృతిస్థుఁడనఁగా అవిద్యాస్వరూపమగు ప్రకృతినే ఆత్మనుగాఁ బొందినవాఁడు- ఈప్రకృతిస్థత్వమనెడి యవిద్యయొక్క గుణములు సుఖదుఃఖమోహములు- అనుభవింపఁబడుచున్నవీనియందలి సంగము అనఁగా ఆత్మభావము- అదియె కామము- అదియె ఈపురుషుఁడు మంచివియును చెడ్డవియునగుజంతువులయోనులయందుపుట్టుటవిషయమై అనఁగా సంసారమునకు కారణము- జన్మములయందలి ఈ సంసారమునకు అనిసంసారశబ్దమును తెచ్చియైనను యోజనచేయవచ్చును- సద్యోనులు దేవాదియోనులు- అసద్యోనులు పశ్వాదియోనులు- సదసద్యోనులనఁగా మనుష్యయోనులు- ఈసంసారము పరిత్యజింపవలసినదిగాఁ జెప్పఁబడుచున్నది-దీనినివర్తింపఁజేయునది జ్ఞానము-అది క్షేత్రక్షేత్రజ్ఞులంగూర్చి వెనుకఁ జెప్పఁబడినదియె-అని శంకరభాష్యము.

స్వయముగా తన్ననుభవించుటయె సుఖముగాఁగల ఈపురుషుఁడు ప్రకృతిసంపర్కముగలవాఁడై ప్రకృతిజములనఁగా ప్రకృతిసంపర్కమువలనఁగలిగిన గుణములను అనఁగా సత్త్వాదిగుణములకార్యములైన సుఖదుఃఖాదులను అనుభవింపుచున్నాఁడు- ఇట్లు ప్రకృతిపరిణామములగు దేవమనుష్యాదిజన్మములలోనున్నవాఁడై ఆయాజన్మములకు తగిన సాత్త్వికాదిసుఖములయందాసక్తిగలవాఁడై వానికి సాధనములగు పుణ్యపాపములం జేయును- ఆపుణ్యపాపములననుభవించుటకు తిరిగియు

ను మంచిజన్మములనును చెడ్డజన్మములనున పొందును- ఆట పైనిగూడ కర్మములంజేయుచుండును- ఆట పైనిగూడ పుట్టుచుండును- అమానిత్వము మొదలగు ఆత్మప్రాప్తినికలుగఁజేసెడి గుణములను సేవించువఱకును సంసారమును పొందుచుండును- అని రామానుజభాష్యము.

ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతిచాప్యుక్తో దేహేస్మిన్ పురుషః పరః॥౨౨॥

అస్మిన్ దేహే (స్థితః) పరః పురుషః= ఈ దేహమునందు (ఉన్న) గొప్ప పురుషుఁడు, ఉపద్రష్టా అనుమన్తా భర్తా భోక్తా మహేశ్వరః పరమాత్మా (ఇతిచాపి)= దగ్గఱనుండిచూచువాఁడు అంగీకరించువాఁడు పోషించువాఁడు అనుభవించువాఁడు గొప్పయీశ్వరుఁడు పరమాత్మ అనియును, ఉక్తః= చెప్పఁబడెను.

ఋత్విక్కులును యజమానులును యజ్ఞమునుచేయుచుండఁగా పనినిచేయక తటస్థముగా నుండి యజ్ఞమునుచేయుట నెఱిఁగినవాఁడై ఋత్విగ్యజమానులుచేయు వానిలోని గుణదోషములనుచూచువాఁడు ఉపద్రష్ట- అట్లే శరీరేంద్రియములు వ్యాపారముఁలం జేయుచున్నను తానువ్యాపారములేనివాఁడై వానికంటెవేఱై వానినిని వానివ్యాపారములనును సమీపమునసుండిచూచువాఁడు- లేక, దేహముచక్షుస్సు మనస్సు బుద్ధి ఆత్మ అనునవి ద్రష్టలు- వీనిలో వెలుపలిద్రష్ట దేహము- అన్నిటికిలోపలివాఁడైన ద్రష్టగానప్రత్యగాత్మ ఉపద్రష్ట యనియుంజెప్పవచ్చును- అనుమంతయనఁగా పనిచేయుచున్నవాని పనులవిషయమునసంతోషించువాఁడు. లేక, కార్యకరణప్రవృత్తులయందు తాను ప్రవర్తింపకపోయినను ప్రవర్తించినవానివలె వానికి అనుకూలముగా తలంపఁబడువాఁడు గానఅనుమంత- లేకప్రవర్తించినవానినివారింపనివాఁడు-దేహేంద్రియమనోబుద్ధులుచైతన్యముయొక్క ఆభాసములై(భ్రాంతులై)కాన వానిస్వరూపమునిలుచుట ఆయాత్మచేఁగలిగినదే కాన ఆయాత్మ భర్తయనిచెప్పఁబడుచున్నాఁడు. అగ్నియొక్క వేఁడి (ఇనుమునందు)వలె విషయములంగూర్చిన బుద్ధికికలిగెడిసుఖదుఃఖాజ్ఞానములయొక్క-ప్రత్యయములు (తెలువులు) ఆత్మయందు సంక్రమించినట్లు కనఁబడునుగాన ఆత్మ భోక్తయని చెప్పఁబడుచున్నాఁడు- కథితుఁ

డనఁగా శ్రుతిలోఁ జెప్పఁబడినవాఁడు- పరుఁడనఁగా నవ్యక్తమునకం టెనుత్కృష్టుఁడు- అని శంకరభాష్యము.

ఈ దేహమునందున్న పురుషుఁడు (జీవుఁడు) దేహము ప్రవర్తించుటకుఁ దగిన సంకల్పము (కోరిక) మొదలగునవి కలవాఁడగుటచే నుపద్రష్టయు ననుమంతయును, దేహమునకు భర్తయు (పోషకుఁడు)ను, దేహము ప్రవర్తించుటవలనఁ గలిగిన సుఖదుఃఖములకు భోక్తయు (అనుభవించువాఁడు)ను, ఇట్లు నియమించుట మొదలగు వానిచే దేహమును ఇంద్రియములు మనస్సు, వీనికి మహేశ్వరుఁడును, అగుచున్నాఁడు- ఆత్మశబ్దమునకు దేహంబును మనస్సును గూడ నర్థము గాన ఇతఁడు పరమాత్మ (గొప్ప యాత్మ) యగుచున్నాఁడు- పరుఁడయిన యనఁగా స్వభావమును పట్టి పరిచ్ఛిన్నములుగాని జ్ఞానశక్తులుగల యీ పురుషుఁడు అనాదియగు గుణప్రబంధము వలన ఈ దేహమునకు మాత్రమె మహేశ్వరుఁడును పరమాత్మయు నగుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

యతశ్చ యత్ అనునది ఈ శ్లోకమునఁ జెప్పఁబడుచున్నది- అనుమంతయనఁగా అనుసరించి విశేషముగా నిరూపించువాఁడు. అని మధ్వభాష్యము.

య ఏనం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥ ౨౩॥

ఏనం పురుషం ప్రకృతించ = ఈ పురుషునిని ప్రకృతిని, గుణైస్సహ యః వేత్తి = గుణములతోఁగూడ ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో, సః సర్వథా వర్తమానోఽపి = వాఁడు అన్నివిధములను ఉన్నవాఁడైనను, భూయః నాభిజాయతే = వెండియు పుట్టఁడు.

య ఏవమ్ అని పాఠము- ఏవమ్ = ఇట్లు, పురుషుని తన్నుగాను ప్రకృతిని అనఁగా వెనుకఁ జెప్పఁబడిన యవిద్యను దాని వికారములగు గుణములతోఁగూడ విద్యచేత లేకుండునట్లు చేయఁబడినదానిగాను ఎవ్వఁడు ఎఱుంగుచున్నాఁడో- ఎట్లున్నను ఈ జ్ఞానము గలిగిన శరీరము పోయినపైని మఱియొకట శరీరమును పొందఁడు- ఇట్లనుయుక్తప్రవృత్తి గలవాఁడు ముక్తిని జెందునని చెప్పవలయునా?- ఈ జన్మమున జ్ఞానము గలుగుటకు పూర్వము చేసినవియు జ్ఞానము గలిగిన తరవాత చేసినవియు గడ

చినయనేకజన్మములలోఁ జేసిపెట్టినవియునగు కర్మములన్నియును ఈజ్ఞానముచేత నశించును- ఈ జన్మమును కలుగఁజేసినదికర్మములుమాత్రము తత్త్వజ్ఞానము కలిగినపైఁ గూడ శరీరమును నిలువఁబెట్టును- అని శంకరభాష్యము-

సత్త్వాదిగుణములస్వరూపము చెప్పఁబడఁగలదు- తెలిసికొనుటయనఁగా ఏర్పాటుతోఁ దెలిసికొనుట- అన్నిప్రకారములను అనఁగా దేవమనుష్యాదిశరీరములలో మిక్కిలి దుఃఖపడుచున్నను వెండియు ప్రకృతితో సంబంధింపఁడు- అపరిమితమైన జ్ఞానము కలవాఁడును పాపసంపర్కము లేనివాఁడునగు ఆత్మను ఈశరీరము పోయినతోడనే పొందుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

పురుషస్సుఖదుఃఖానామ్ (౧౩అ। ౨౦శ్లో॥) అనుచోట జీవుఁడుమాత్రము చెప్పంబడెను- పురుషం ప్రకృతిమ్ అనునిచ్చట జీవుఁడును ఈశ్వరుఁడును చెప్పఁబడుచున్నారు- జీవునకు విష్ణుప్రతిబింబమగుట వలనవచ్చిన ఐక్యముకలదు- నేను భగవంతునివాఁడనని యుపాసనచేయుటయహంగ్రహోపాసనమనఁబడును- నేనుభగవంతునికి భృత్యుఁడను (దాసుఁడను), ప్రతిబింబమగుటను అతఁడే నేను అనియుపాసన చేయునది- ప్రతిబింబమగుట యనఁగా అతనితోడి సామ్యమె- అని మధ్వభాష్యము-

ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥౨౪॥

కేచిత్ ధ్యానేన ఆత్మని ఆత్మనా ఆత్మానం పశ్యన్తి = కొందఱు ధ్యానముచేత ఆత్మయందు ఆత్మచేత ఆత్మను చూచుచున్నారు- అన్యే సాంఖ్యేన యోగేన (పశ్యన్తి) = మఱికొందఱు సాంఖ్యమనెడి యోగముచేత (చూచుచున్నారు)- అపరేచ కర్మయోగేన (పశ్యన్తి) = మఱికొందఱు కర్మయోగముచేత (చూచుచున్నారు.)

ధ్యానమనఁగా శబ్దాదివిషయములనుండి శ్రోత్రము(చెవి) మొదలగునింద్రియములను మఱలించి మనస్సునఁ జేర్చి మనస్సును ప్రత్యగాత్మయందు ఏకాగ్రముగా నుంచి తలంచుట - నూనె ధారవలె ఎడతెగనితలంపు ధ్యానము- దానిచేత ఆత్మయందును అనఁగా బుద్ధి

యందు ఆత్మనుఅనఁగా ప్రత్యగాత్మను (ఆత్మనా) స్వయముగా నే-(ఆత్మనా=ధ్యానముచేతబాగుసేయఁబడిన యంతఃకరణముచేత అనియు కర-పాఠముననున్నది)- సాంఖ్యయోగమనఁగా ఈసత్త్వరజస్తమస్సులుగుణములు, వానివ్యాపారములకు సాక్షియై నిత్యుఁడయి గుణములకంటెవిలక్షణుఁడగువాఁడు ఆత్మ, అనితలంచుట- కర్మయోగమనఁగా-ఈశ్వరార్పణబుద్ధిచేతచేయఁబడెడి కర్మములు- ఈకర్మయోగముచేత సత్త్వశుద్ధి(అంతఃకరణపరిశుద్ధి)కలిగి దానివలనజ్ఞానము కలిగి దానిద్వారమున ఆత్మను చూతురు- అనిశంకరభాష్యము.

(ఆత్మని) శరీరమునందున్న ఆత్మను, (ఆత్మనా) మనస్సుచేత ధ్యానయోగముచేతయోగసిద్ధికలవారుచూతురు-యోగసిద్ధికలుగనివారుసాంఖ్యయోగముచేతను అనఁగా జ్ఞానయోగముచేత (౨అ|| ౩౯ శ్లో) మనస్సునుయోగమునకు తగినదానిగాఁ జేసికొనిఆత్మనుచూతురు- జ్ఞానయోగమునకుఁగూడఁదగనివారు కర్మయోగముచేతమనస్సునుయోగమునకు తగినదానిగాఁ జేసికొని ఆత్మనుచూతురు.

సాంఖ్యమనఁగా వేదమునఁజెప్పఁబడినభగవంతుని స్వరూపమును గూర్చిన జ్ఞానము-కర్మములనాచరించువారువినితెలిసికొనిధ్యానము చేసిచూతురు- వినువారుతెలిసికొనిధ్యానముచేసి చూతురు- సాంఖ్యులు ధ్యానముచేసిచూతురు- అనిమధ్వభాష్యము.

అన్యేత్వేవ మజానన్తః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే।
తేపి చాతి తరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥౨౫॥

అన్యేతు=మిగిలినవారో, ఏవమ్ అజానన్తః=ఇట్లు ఎఱుంగకున్నవారై, అన్యేభ్యః శ్రుత్వా ఉపాసతే=ఇతరులవలన విని ఉపాసనచేయుచున్నారు-శ్రుతిపరాయణాః తేఽపిచ మృత్యుమ్ అతితరన్త్యేవ=వినుటయందాసక్తిగల వారలుగూడ మృత్యువును దాటుచునేయున్నారు

అన్యులనఁగా వెనుకఁజెప్పఁబడినవానిచే నాత్మజ్ఞానము కలుగనివారు- ఇతరులవలననఁగా నాచార్యులవలన- మృత్యువుననఁగామృత్యువుతోఁగూడినసంసారమును- ఆచార్యునివలనవినుటయె గొప్పగతియనఁగా మోక్షమార్గమున ప్రవర్తించుటకుసాధనముగాఁగలవారుశ్రుతిపరాయణులు- తమకుస్వయముగా వివేకములేనివారై ఇతరులయుపదే

శమె ప్రమాణముగాఁగలవారనుట- ప్రమాణముంగూర్చి స్వతంత్రులై వివేకముగలవారలును సంసారమును దాఁటుదురని చెప్పవలయునా? అనిశంకరభాష్యము.

ఆత్మావలోకనమునకు(ఆత్మను చూచుటకు) సాధనములగు కర్మయోగాదులయందధికారము లేనివారు- ఆప్తులవలననఁగా జ్ఞానముకలవారలవలననివిని కర్మయోగాదులచేతఆత్మను ఉపాసించువారును ఆత్మదర్శనముచేతమృత్యువును దాఁటుదురు- వీరుకాక శ్రవణమాత్రమననిష్ఠకలవారలును పాపములుపోయిక్రమముగా కర్మయోగాములనాచరించిమృత్యువును దాఁటుదురు- అనిరామానుజభాష్యము.

అశక్తులకుఁగూడ సుపాయమునుచూపుటకు ఈశ్లోకము- అనిమధ్వభాష్యము.

యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజఙ్గమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ ॥ ౨౬ ॥

(హే)భరతర్షభ! =(ఓ)భరతవంశశ్రేష్ఠుఁడా!, స్థావరజఙ్గమమ్ యావత్ కించిత్ సత్త్వం సంజాయతే=స్థావరజంగమరూపమైనదైనను ఒక జంతువు పుట్టుచున్నదో, తత్ క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ (జాతం) విద్ధి = దానిని క్షేత్రక్షేత్రజ్ఞులసంయోగమువలన(పుట్టినదానిగా)ఎఱుంగుము-

సత్త్వమనఁగావస్తువు- క్షేత్రక్షేత్రజ్ఞులసంయోగముతాడిటనిక్కుండకుకట్టునట్లుకాదు-మఱియెట్లన్నను-త్రాడుముత్తైపుచిప్ప మొదలగువానియందు భ్రాంతిచేతఆరోపింపఁబడిన సర్పము వెండి మొదలగువానివలె క్షేత్రముయొక్కధర్మములను క్షేత్రజ్ఞునియందును క్షేత్రజ్ఞునిధర్మములను క్షేత్రమునందును ఆరోపించుటయె స్వరూపముగాఁగలది-అనిశంకరభాష్యము.

క్షేత్రక్షేత్రజ్ఞులసంయోగమువలనఁబుట్టుచున్నది- అనఁగారెండును చేరియెపుట్టుచున్నదిగాని ఒక్కదానితోనొక్కటివిడియుండిపుట్టుటలేదనుట- అనిరామానుజభాష్యము-

సామ్యము(సాటి)మొదలగుధర్మములతోఁగూడినప్రకృతిపురుషేశ్వరులస్వరూపము వెండియుఁజెప్పఁబడుచున్నది-అనిమధ్వభాష్యము.

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥ ౨౭॥

సర్వేషు భూతేషు సమం తిష్ఠన్తమ్=అన్ని భూతములయందును సమముగా ఉన్నవాఁడును, వినశ్యత్సు అవినశ్యన్తమ్=నశించుచున్నవానియందు నశింపక యున్నవాఁడును పరమేశ్వరమ్=గొప్పయీశ్వరుఁడు(నగువానిని), యః పశ్యతి=ఎవ్వఁడు చూచుచున్నాఁడో- సః పశ్యతి=వాఁడు చూచుచున్నాఁడు.

ఒకఁడైనయాత్మనుఎవ్వఁడుచూచుచున్నాఁడో, వాఁడె చూచువాఁడు- ఆత్మలుఅనేకులనిచూచువారు చూడనివారే- అనిశంకరభాష్యము.

సమముగాననఁగా దేవతలుమనుష్యులు మొదలగుఆకారభేదములు లేక- పరమేశ్వరుఁడనఁగా ఆయాదేహేంద్రియమనస్సులకు ఈశ్వరుఁడుగా నున్నవాఁడు- దేహము మొదలగునవినశించినను నశింపనివాఁడు- ఇట్లు ఆత్మను దెలిసికొనువాఁడుఆత్మనుయథార్థముగాఁ దెలిసికొనువాఁడు- దేహాద్యాకారములు ఆత్మకుకలవనియు ఆత్మకుపుట్టుకయునాశంబునుకలవనియు తెలిసికొనువాఁడు ఎల్లప్పుడును సంసారములోనేయుండును- అనిరామానుజభాష్యము-

సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్।
నహినస్త్యాత్మనా ఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్॥

సర్వత్ర సమం సమవస్థితమ్ ఈశ్వరమ్ పశ్యన్=అంతటను సమముగా ఉన్న ఈశ్వరుని చూచుచున్నవాఁడు, ఆత్మనా ఆత్మానం నహినస్తి హి=ఆత్మచేత ఆత్మను హింసింపఁడుగదా- తతః పరాం గతిం యాతి=దానివలన గొప్ప గతిని పొందుచున్నాఁడు-

దానివలననఁగా అహింసింపకపోవుటవలన- పరమగతియనఁగా మోక్షము- అజ్ఞుఁడగువాఁడు ఆత్మకానిదానిని(శరీరమును) ఆత్మగా గ్రహించి పుణ్యపాపములను చేసి దానినిబెడఁగొట్టి మఱియొక్క క్రొత్తదానినిపరిగ్రహించిదానినికూడబెడఁగొట్టి మఱియొకదానినిగ్రహించును- ఇట్లు తానుఆత్మగాననుకొనినదానిని తన పుణ్యపాపములచే నశింపఁజేయుచున్నాఁడుగాన ఆత్మనుచంపువాఁడు అగుచు

న్నాఁడు- పరమార్థమైన ఆత్మగూడ వీని అజ్ఞానముచేత చంపఁబ డినట్లె- అనిశంకరభాష్యము.

అంతటననఁగా దేవాదిశరీరములయందు- ఆయాశరీరమునకు శే షిగానును ఆధారముగాను నియంతగాను నుండుటచేత ఈశ్వరుఁడు- సమముగాననఁగా తెలిసికొనువాఁడగుటయనెడి యొక్క విధమైన ఆ కారముగలవానిగా- ఆత్మచేతననఁగా మనస్సుచేతను- హింసింపకపో వుటయనఁగా రక్షించుట- అనఁగా సంసారమునుండి విడిపించుట- దానివలననఁగా అంతటనుఆత్మనుఒక్కవిధమైనఆకారముగాఁ గలి వానిగాఁ దెలిసికొనుటవలన- గతియనఁగాపొందఁదగినవాఁడగు స్వ స్వరూపముతోనున్న ఆత్మను- దేవాద్యాకారములుగలవానిగా వాత్మను దెలిసికొనువాఁడుఆత్మను చంపుచున్నాఁడు- సంసారసముద్రమునఁ బడవేయుచున్నాఁడనుట- అనిరామానుజభాష్యము-

ప్రకృత్యైవచ కర్మాణి క్రియమాణానిసర్వశః।
యః పశ్యతి తథాఽత్మాన మకర్తారం సపశ్యతి॥౨౯

కర్మాణి సర్వశః ప్రకృత్యైవ క్రియమాణాని=కర్మములను అన్నిటి నిని ప్రకృతిచేతనె చేయఁబడినవానిగానును, తథా ఆత్మానం అకర్తా రంచ=అట్లె ఆత్మను కర్తకానివానిగానును. యః పశ్యతి=ఎవ్వఁడు చూచుచున్నాఁడో, సః పశ్యతి=వాఁడె చూచుచున్నాఁడు.

ప్రకృతియనఁగా సత్త్వరజస్తమోగుణస్వరూపమైనదగు భగవంతు నిమాయ- మహత్తత్త్వము మొదలుగాఁగల కార్యములుకరణములుమొద లయాకారముగాఁబరిణమించినఆమాయచేతను- కర్మములనఁగా వా క్కుచేతను మనస్సుచేతను శరీరముచేతనును జేయవలసిన పనులు-సర్వ శః=అన్నిప్రకారములను- ఆత్మనుఅనఁగా క్షేత్రజ్ఞుని- అకర్త నుగాననఁగా ఉపాధులన్నియులేనివానిగా- వాఁడె పరమార్థమునె ఱుంగువాఁడు- అనిశంకరభాష్యము.

కార్యకారణకర్తృత్వే (౧౩ అ॥ ౨౦శ్లో) అనుచోటఁ జెప్పినచొప్పు న ప్రకృతిచేతఁ జేయఁబడుచున్నవానిగా- జ్ఞానస్వరూపుఁడైన ఆత్మను కర్తకానివానిగానును- ఆతనికి ప్రకృతిసంబంధంబును దానినధిష్ఠించి యుండుటయును దానివలనవచ్చినసుఖదుఃఖానుభవంబును కర్మరూప

మైనయజ్ఞానము వలన వచ్చిన దేయని ఎవ్వఁడెఱుంగునో వాఁడు ఆత్మను లెస్సగా నెఱుఁగుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి।
తత ఏవచ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥30॥

యదా భూతపృథగ్భావమ్ ఏకస్థమ్ అనుపశ్యతి=ఎప్పుడు భూతములయొక్క వేఱుపాటును ఒక్కదానియందున్నదానిగా చూచుచున్నాఁడో, తతఏవచ విస్తారమ్ (అనుపశ్యతి)=దానివలననె విస్తరించుటను (చూచుచున్నాఁడో), తదా బ్రహ్మ సంపద్యతే=అప్పుడు బ్రహ్మమగుచున్నాఁడు-

ఒక్కచోట నున్నది యనఁగా నొక్కయాత్మయందె కల్పింపఁబడినది- చూచుట యనఁగా శాస్త్రము ఆచార్యులయుపదేశము వీనిననుసరించి తెలిసికొనుటయె కాని ప్రత్యక్షముగాఁజూచుట కాదు- విస్తరించుటయనఁగా సమస్తపదార్థములును ఆత్మవలననె వికసించుట- అని శంకరభాష్యము-

భూతములనఁగా ప్రకృతియును పురుషుఁడును చేరుటచేఁగలిగిన దేవమనుష్యాదులు- వారలయొక్క దేవత్వము మనుష్యత్వము హ్రస్వత్వము (పొట్టి) దీర్ఘత్వము (పొడవు) ఇవి మొదలుగాఁగల పృథగ్భావమును ఒక్కదానియందు అనఁగా ప్రకృతియందున్నదానిగా నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో- ఈదేవత్వాదులు ఆత్మయందున్నవికావని తలంపుచున్నాఁడోఅనుట- విస్తారమనఁగా కొడుకులు మనుమలు మొదలగు భేదములు విస్తరించుట- బ్రహ్మము అగుచున్నాఁడు అనఁగా అపరిచ్ఛిన్నమై జ్ఞానైకస్వరూపమైన ఆత్మనుపొందుచున్నాఁడనుట- అని రామానుజభాష్యము-

ఏకస్థమనఁగా ఒక్క విష్ణువునందెఉన్నది- ఆవిష్ణువువలననె విస్తారము- అని మధ్వభాష్యము-

అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయమవ్యయః।
శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే॥31॥

(హే)కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, అనాదిత్వాత్ నిర్గుణత్వాత్ అవ్యయః అయం పరమాత్మా=ఆదిలేకవాఁడగుటనును గు

ణములులేనివాఁడగుటనుసు నిర్వికారుఁడగు ఈ పరమాత్మ, శరీరస్థోఽపి=శరీరమునను న్నవాఁడైనను, నకరోతి=కర్మములంజేయఁడు, నలిప్యతే=వానియంటునుపొందఁడు-

ఆదిమనఁగా కారణము- కారణములేనివాఁడగుటను అవయవములులేనివాఁడుగాన నిర్వికారుఁడు- నిర్గుణుండగుటను గుణములనుపట్టియు వికారములేనివాఁడు- ఆత్మ శరీరమునందు తెలియఁబడునుగాన శరీరమునన్నట్లు చెప్పఁబడుచున్నాఁడు- కర్మములం జేయకపోవుటనే కర్మఫలములువీనినంటవు. ఇఁక శరీరమునందుండి కర్మములనాచరించువాఁడును ఫలములంబొందువాఁడును, ఎవ్వఁడును లేఁడు- అవిద్యామాత్రము స్వభావముగాఁగలవాఁడై చేయుచున్నాఁడు, ఫలములననుభవింపుచున్నాఁడు, అనువ్యవహారము మాత్రము కలుగును- పరమార్థమునుబట్టి లేదు. కావుననే జ్ఞాననిష్ఠకల పరమహంసలకు కర్మములయందధికారము లేదని పలుమారు చెప్పఁబడినది. అని శంకరభాష్యము-

ఈపరమాత్మయనఁగా దేహముకంటె వేఱుగా నిశ్చయింపఁబడిన యాత్మ, శరీరమునన్నవాఁడైనను క్రొత్తగాఁగలుగువాఁడు కాపుండుటను వ్యయము(వికారము)లేనివాఁడు- సత్త్వరజస్తమోగుణములు లేకపోవుటను కర్మములంజేయుటయును దేహస్వభావములు ఈతనినంటుటయును లేదు- అని రామానుజభాష్యము-

ఆదికలదియును గుణాత్మకమైనదియును 'గదా తలుచుగా వ్యయము కలది. నకరోతి మొదలగుదానికి అర్థము పూర్వమె చెప్పఁబడినది- లౌకికములగు క్రియలు మొదలగునవి వానికి లేవనుట. అని మధ్వభాష్యము,

యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే॥ ౩౨॥

సౌక్ష్మ్యాత్ సర్వగతమ్ ఆకాశం యథానోపలిప్యతే=సూక్ష్మమగుటవలన అన్నిటిని వ్యాపించియున్న ఆకాశము ఎట్లు అంటదో, తథా సర్వత్ర దేహే అవస్థితః ఆత్మా నోపలిప్యతే=అట్లు సమస్తమైన దేహముందును ఉన్న ఆత్మ అంటదు-

కర్మములను చేయకపోవుటకును కర్మములతో నంటకపోవుటకు ను ఇదిదృష్టాంతము- అనిశంకరభాష్యము-

సర్వగతముఅనఁగా అన్నివస్తువులతోఁగలిసియున్నదిఅయినను- దేవమనుష్యాదిదేహములయందంతటనున్నను ఆయాదేహస్వభావములతోనంటఁడు- అనిఅంటకపోవుటకు దృష్టాంతము చెప్పఁబడినది- అని రామానుజభాష్యము.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥

(హే)భారత!=(ఓ)భరతవంశమువాఁడా!, ఏకః రవిః కృత్స్నం లోకం యథా ప్రకాశయతి=ఒకఁడు సూర్యుఁడు సమస్తమైన లోకమునును ఎట్లు ప్రకాశింపఁజేయుచున్నాఁడో, తథా క్షేత్రీ కృత్స్నం క్షేత్రం ప్రకాశయతి=ఆట్లె క్షేత్రజ్ఞుఁడు సమస్తమైన శరీరమునును ప్రకాశింపఁజేయుచున్నాఁడు-

మహాభూతములు మొదలుధృతిపర్యంతముగాఁ(౧౩అ॥౫—౬శ్లో॥) జెప్పఁబడినక్షేత్రమును- క్షేత్రియనఁగా పరమాత్మ- శరీరములయందన్నిటియందునొకఁడే యాత్మ గనుటకునుకర్మఫలములతో నంటఁడనుటకును గూడ ఈ సూర్యదృష్టాంతము- అనిశంకరభాష్యము.

క్షేత్రజ్ఞుఁడు, ఇదినాక్షేత్రమనియు ఇదిఇట్టిదనియు క్షేత్రము(శరీరము)నంతనను అనఁగా వెలుపలనులోపలనునుగూడ తన జ్ఞానముచేఁబ్రకాశింపఁజేయును- ప్రకాశింపఁబడెడి లోకముకంటె ప్రకాశింపఁజేసెడి సూర్యుఁడు ఎట్లు వేఱో అట్లె తెలిసికొనువాఁడుగాన తెలియఁబడెడి క్షేత్రముకంటె నాత్మవేఱు అనియర్థము- అనిరామానుజభాష్యము.

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మన్తరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షంచయే విదుర్యాన్తి తే పరమ్॥౩౫॥

ఏవం క్షేత్రక్షేత్రజ్ఞయోః అన్తరమ్=ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞులవాసినిని, భూతప్రకృతిమోక్షంచ=భూతప్రకృతిమోక్షఁబునును, జ్ఞానచక్షుషా యే విదుః=జ్ఞానమనెడిదృష్టిచేత ఎవ్వారలు ఎఱుంగుదురో తే పరం యాన్తి=వారు గొప్పదానిని పొందుచున్నారు

అంతరమనఁగా పరస్పరమునుండెడి వైలక్షణ్యవిశేషము (వేఱుపాటును). శాస్త్రమువలనను ఆచార్యోపదేశమువలనను కలిగిన యాత్మజ్ఞానమనెడి చక్షుస్సుచేత. భూతములకు ప్రకృతి (కారణము) అయిన దియవ్యక్తమనెడి అవిద్య. దాని మోక్షమనఁగా అది లేకపోవుట. పరమును అనఁగా పరమార్థతత్త్వమైన బ్రహ్మమును పొందుదురు. తిరిగియు దేహమును స్వీకరింపరనుట. అని శంకరభాష్యము.

జ్ఞానమనఁగా శరీరము వేఱు ఆత్మ వేఱు అని తెలిసికొనుట. పరమును అనఁగా సంసారబంధము లేని పరిశుద్ధాత్మస్వరూపమును పొందుచున్నారు. భూతప్రకృతియనఁగా ప్రధానము. దానిని విడిపించెడి అమానిత్వము మొదలగునది (౧౩అ॥ ౭శ్లో॥) భూతప్రకృతిమోక్షము. దానిని తెలిసికొని ఎవ్వారలు ఆచరింతురో వారు ఆత్మస్వరూపమును పొందుదురు. అని రామానుజభాష్యము,

భూతములనుండియు ప్రకృతినుండియు మోక్షమునకు సాధనమగు అమానిత్వాదికమును (౧౩అ॥ ౭శ్లో॥) అని మధ్వభాష్యము.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్ర
క్షేత్రజ్ఞవిభాగయోగో నామ త్రయో
దశోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాద
కంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదం
బునగు భగవద్గీతలలో క్షేత్రమును క్షేత్రజ్ఞు
నిని విప్పఁజెప్పుటయనెడి సాధనమును తెలి
యఁజేసెడి పదుమూఁడవ యధ్యాయము.

బొంబాయిలో ముద్రింపఁబడిన ఆత్మ... భాష్యములో క్షేత్ర... ప్రకృతిపురుషవిభాగ యోగో నామ (ప్రకృతిని విడిపించుకొనుటయనెడి సాధనమును తెలియఁజేసెడి) అనియున్నది.

# గీతాభాష్యత్రయసారము.

## పదునాలుగవయధ్యాయము.

---

శ్రీభగవానువాచ.

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్।
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాంసిద్ధిమితో గతాః॥౧॥

జ్ఞానానామ్ ఉత్తమం పరం జ్ఞానమ్=జ్ఞానములలో ఉత్తమంబును పరంబునగు జ్ఞానమును, భూయః ప్రవక్ష్యామి=వెండియు చెప్పఁగలను. సర్వే మునయః=అందఱు మునులును, యత్ జ్ఞాత్వా=దేనిని తెలిసికొని, ఇతః పరాం సిద్ధిం గతాః=దీనికంటె గొప్ప సిద్ధిని పొందిరో.

పరము అనఁగా పరవస్తు(ఆత్మ)విషయముగాఁగలది. ఉత్తమమనఁగా గొప్పఫలముగలది. జ్ఞానములనఁగా యజ్ఞాదుల జ్ఞానములు. అవిమోక్షముకొఱకుఁగావు, ఈజ్ఞానము మోక్షముకొఱకైనది,అని స్తోత్రముచేయఁబడుచున్నది. మునులనఁగా సంన్యాసులు. పరసిద్ధియనఁగా మోక్షము. ఇతః=ఈదేహబంధమువదలినపైని. అని శంకరభాష్యము.

పరమనఁగా వెనుకఁజెప్పఁబడినదానికంటెనితరమైనది. జ్ఞానమనఁగా సత్త్వాదిగుణములంగూర్చినది. అది ప్రకృతిపురుషులజ్ఞానములన్నింటిలోను నుత్తమమయినది. మునులనఁగా దానిని మననముచేయువారు. ఈసంసారమండలముకంటె పరమైనసిద్ధిని. అని రామానుజభాష్యము.

ఇఁకమీఁదియధ్యాయములచేతసాధనముచెప్పఁబడుచున్నది. అనిమధ్వభాష్యము.

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే నవ్యథన్తి చ॥౨॥

ఇదం జ్ఞానమ్ ఉపాశ్రిత్య=ఈ జ్ఞానమును ఆశ్రయించి, మమ సాధర్మ్యమ్ ఆగతాః=నాయొక్క సాధర్మ్యమును పొందినవారు. సర్గేఽపి నోపజాయన్తే=సృష్టియందుఁగూడ పుట్టకున్నారు. ప్రల

యే నవ్యథన్తి చ=ప్రళయమునందుఁగూడ చలింపరు-

జ్ఞానము నాశ్రయించుటయనఁగా జ్ఞానసాధనమును ఆచరించుట-నాసాధర్మ్యమువనఁగా నాస్వరూపమును,పొందినవారు- గీతాశాస్త్రమున క్షేత్రజ్ఞునకును ఈశ్వరునకును భేదమునంగీకరిపఁబడుగానసమానమైనధర్మము(attribute)గలుగుటసాధర్మ్యము కాదు. ప్రళయమనఁగా చతుర్ముఖబ్రహ్మనశించుట- అనిశంకరభాష్యము.

సాధర్మ్యమనఁగా సామ్యము- సృజింపఁబడుటను సంహరింపఁబడుటను పొందరు- అనిరామానుజభాష్యము.

మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సమ్భవః సర్వభూతానాం తతో భవతి భారత॥3॥

మమ మహత్ బ్రహ్మ యోనిః=నాయొక్క గొప్పదగు ప్రకృతి కారణము- తస్మిన్ అహం గర్భం దధామి=దానియందు నేను గర్భమును ఉంచుచున్నాను-(హే)భారత!=(ఓ)భరతమువంశమువాఁడా!, సర్వభూతానాం సంభవః తతః భవతి=అన్నిభూతములయు పుట్టుక దానివలన కలుగుచున్నది.

గొప్పబ్రహ్మమనఁగా మాయయనెడి త్రిగుణాత్మకమైనప్రకృతి- యోనియనఁగా నన్నిభూతములకును కారణము- గర్భమనఁగా హిరణ్యగర్భుఁడుపుట్టుటకు కారణమైనబీజమును- (అదిసృష్టిసంకల్పము అనిమధు॥) క్షేత్రక్షేత్రజ్ఞులనెడి రెండుప్రకృతులును శక్తులుగాఁగల ఈశ్వరుఁడనగు నేను అవిద్య(అజ్ఞానము),కామము, కర్మము, అనెడియుపాధులననుసరించెడి క్షేత్రజ్ఞునిని క్షేత్రముతోఁ గలుపుచున్నానుట- సర్వభూతములయుత్పత్తి హిరణ్యగర్భునిద్వారమునఁగలుగునది- దానివలననఁగా ఆబీజమును ఉంచుటవలన- అనిశంకరభాష్యము.

యోనియనఁగా జగత్తుసకంతటికిని కారణమైనది- ఎనిమిదివిధములుగాఁజెప్పఁబడిన (౭అ॥౪శ్లో)యచేతనప్రకృతి- మహత్తుఅహంకారము మొదలగువికారములకు కారణమగుటను మహత్ బ్రహ్మఅనిచెప్పఁబడుచున్నది- తస్మాదేతద్బ్రహ్మనామరూపమన్నంచజాయతే(ముణ్డ॥౧॥౧॥౧౦|—ఆయీశ్వరునివలన ఈప్రకృతియును నామంబును రూపంబు

ను అన్నంబును పుట్టుచున్నది)అనుశ్రుతిలో బ్రహ్మశబ్దము ప్రకృతియందు ప్రయోగింపబడినది- చేతనప్రకృతియైనజీవసముదాయమే గర్భము- భోగమునకు క్షేత్రమైన(స్థానమైన)అచేతనప్రకృతితో భోక్తల(అనుభవించువారల)సముదాయమైన చేతనప్రకృతిని చేర్చెదను అను ట- నా సంకల్పమువలన గలిగినఆ రెండుప్రకృతులసంయోగముననే బ్రహ్మాది స్తంబపర్యంతమునైన భూతములన్నియు పుట్టుట- అని రామానుజభాష్యము.

మహద్బ్రహ్మ అనగా ప్రకృతి-అదిశ్రీభూదుర్గలనెడి భేదములుకలది- పార్వతి సరస్వతి మొదలగువారు దానియంశములుకల ఇతరజీవులు- యోనియనగా గర్భాధానమునకు ఉచితమైనది- తల్లియని యర్థము కాదు- సీతాదేవిముఖమునుచూపుట మొదలగునది అసభ్యముగా చూపుట యె- ఆభూశబ్దమున జెప్పబడినది ఈ (మనకుఆధారముగానుండెడి) భూమి కాదు- అనిమధ్వభాష్యము.

సర్వయోనిషు కౌన్తేయ మూర్తయస్సంభవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥౪॥

(హే)కౌన్తేయ! =(ఓ)కుంతీపుత్రుడా!, సర్వయోనిషు యాః మూర్తయః సంభవన్తి=అన్నియోనులయందును(దేవతలు పితృదేవతలు గంధర్వులు యక్షులు రాక్షసులు మనుష్యులు పశువులు మృగములుపక్షులు సరీసృపములుఅనగా ప్రాకునవి ఈ మొదలగువానియందు) ఏశరీరములు పుట్టుచున్నవో, తాసాం మహత్ బ్రహ్మ యోనిః =వానికి గొప్పదైన మాయ కారణము- అహం బీజప్రదః పితా- నేను బీజమునిచ్చెడి తండ్రిని.

ఈశ్వరుడనైన నేను గర్భాధానము చేసెడితండ్రిని. అనిశంకరభాష్యము.

దేవాదిశరీరములకు నాచేత చేతనులతో గూర్పబడిన ప్రకృతియె కారణము- ఆయాప్రకృతియందు వారివారికర్మానుసారముగా చేతనులను చేర్చువాడను నేనె- అని రామానుజభాష్యము.

సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్॥౫॥

(హే) మహాబాహో!=(ఓ) గొప్ప భుజములు కలవాఁడా!, ప్రకృతిసంభవాః సత్త్వం రజః తమః ఇతి గుణాః=ప్రకృతివలనఁ బుట్టుక గల సత్త్వము రజస్సు తమస్సు అనెడి గుణములు- అవ్యయం దేహినమ్=వికారములు లేనివాఁడగు ఆత్మను, దేహే నిబధ్నన్తి=శరీరమున కట్టిపెట్టుచున్నవి-

సత్త్వాదులకుఁ గూడ గుణములని పేరుమాత్రమే కాని, అవి రూపము(రంగు) మొదలగు వానివలె ద్రవ్యములనాశ్రయించియుండుట లేదు- ఇవియవిద్యాస్వరూపములగుటను క్షేత్రజ్ఞునిఁగూర్చియెల్లప్పుడు నుపస్థితములైయుండునుగాన గుణములనఁబడుచున్నవిగాని గుణములు కలవానికంటె భిన్నములగుటను కాదు- నిబధ్నన్తి=బంధమును కలుగఁజేయునట్లున్నవి- అని శంకరభాష్యము-

సత్త్వాదులు ప్రకృతియొక్క స్వరూపమును సరించియుండెడి స్వభావవిశేషములు- అవి ప్రకాశము (మకిల లేకపోవుట) మొదలగు కార్యములచేతనే నిరూపింపశక్యములైనవి- అవి ప్రకృతియందు తెలియఁబడకదానివికారములయందు స్ఫుటముగాఁ దెలియఁబడుచుండును-అవ్యయుఁడనఁగా స్వతము గాను గుణములతో సంబంధించుటకు తగనివాఁడు- దేహమునందుంచుటయే బంధించుట- అని రామానుజభాష్యము-

సాధనమును ఆచరించుటకై బాధించెడి ప్రకారము చూపఁబడుచున్నది- అనిమధుసూదనభాష్యము-

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయమ్।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ॥౬॥

తత్ర సత్త్వమ్=వానిలో సత్త్వగుణము, నిర్మలత్వాత్ ప్రకాశకమ్=నిర్మలమగుటవలన ప్రకాశింపఁజేయునది- అనామయమ్=నిర్దోషమైనది- [హే) అనఘ!=(ఓ) పాపములు లేనివాఁడా!, సుఖసఙ్గేన జ్ఞానసఙ్గేన చ బధ్నాతి=సుఖమునందలి సంగముచేతనుు జ్ఞానమునందలిసంగముచేతనును బంధింపుచున్నది-

అనామయమనఁగా ఉపద్రవము లేనిది- సుఖసంగముచేత బంధించుటయనఁగా నేను సుఖవంతుఁడను అని క్షేత్రధర్మమైనసుఖమును ఆత్మయందు ఆరోపింపఁజేయుట- జ్ఞానమనఁగానిచ్చటఅంతఃకరణస్వ

త్రిరూపమైన క్షేత్రధర్మమె- అని శంకరభాష్యము.

నిర్మలమనఁగా ప్రకాశమునుసుఖమునుఆవరింపనిస్వభావము నుకలిగియుండుట- ప్రకాశమనఁగావస్తువుయొక్కయథార్థస్థితి తెలియుట- అనామయమనఁగా రోగములు లేకుండుటకు హేతువైనదనుట- ఈసత్త్వము పురుషునికిజ్ఞానసంగమునను సుఖసంగమునను కలుగఁజేయును- వానియందుసంగముకలిగినతోడనె వానిసాధనములగు లౌకిక వైదిక కర్మములయందు ప్రవర్తించును- అటపైని ఆ కర్మఫలములననుభవింపఁదగినయోనులయందు పుట్టుచుండును- ఇదియె సత్త్వము బంధమునుకలుగఁజేయువిధము- అని రామానుజభాష్యము-

రజోరాగాత్మకంవిద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్।
తన్నిబధ్నాతికౌన్తేయ కర్మసఙ్గేనదేహినమ్॥ ౭॥

రాగాత్మకం రజః తృష్ణా సఙ్గ సముద్భవం విద్ధి=రాగస్వరూపమగు రజోగుణమును తృష్ణాసంగములపుట్టుకఁగలదానిగాను ఎఱుంగుము- (హే)కౌన్తేయ=(ఓ)కుంతీపుత్త్రుఁడా!, తత్ దేహినం కర్మసఙ్గేన నిబధ్నాతి=అది పురుషుని కర్మసంగముచేత బంధింపుచున్నది-

రాగమనఁగా రంగుకలుగఁజేయునది- తృష్ణయనఁగా లభింపనిదానియందలిఅభిలాషము- లభించినవానియందలిప్రీతి ఆసంగము- ఇవి దేనివలనఁబుట్టునో అట్టిది- దృష్టాదృష్టప్రయోజనములు (ఇహలోక పరలోకములయందలిఫలములు) గలవగుకర్మముల యందలిఆసక్తిని పుట్టించును- అని శంకరభాష్యము-

రాగమనఁగా స్త్రీపురుషులకుఅన్యోన్యముండెడి స్పృహ(ప్రీతి)- దానికిహేతువుగాన రాగాత్మకము- తృష్ణయనఁగా శబ్దాదివిషయములన్నిటియందలిస్పృహ- సంగమనఁగా పుత్త్రుఁడు, మిత్త్రులుమొదలగుసంబంధులతో కలియఁగోరుట- ఈరెంటికిని హేతువైనదనుట- ఇది కర్మములయందలిసంగమును అనఁగా స్పృహను పుట్టించును- అటపైని కర్మములనాచరించును- వానిఫలములననుభవించుటకుజన్మములఁబొందును-అని రామానుజభాష్యము- (భాష్యము-

తృష్ణాసంగములకు సముద్భవమనఁగా కారణము- అని మధ్వ

తమస్త్వజ్ఞానజంవిద్ధి మోహనం సర్వదేహినామ్।
ప్రమాదాలస్యనిద్రాభి స్త న్నిబధ్నాతిభారత॥౮॥

అజ్ఞానజం తమః=అజ్ఞానమువలనఁగలిగిన తమస్సును, సర్వదేహినాం మోహనం విద్ధి=అందఱుశరీరులకును మోహమును గలుగఁజేయుదానిగాను ఎఱుఁగుము. (హే) భారత=(ఓ)భరతవంశమువాఁడా!, తత్ ప్రమాదాలస్యనిద్రాభిః నిబధ్నాతి=అది ప్రమాదము ఆలస్యమునిద్ర అనువానిచేత బంధమునుగలుగఁజేయును.

మోహమనఁగా అవివేకము. అని శంకరభాష్యము.

జ్ఞానమనఁగా వస్తువులయథార్థస్థితిని తెలిసికొనుట. అజ్ఞానమనఁగా విపరీతజ్ఞానము. దీనివలనఁబుట్టునది తమస్సు. విపరీతజ్ఞానమునకు హేతువయినది మోహనము. ప్రమాదమనఁగా తాను చేయం బూనినపనినితప్పించి మఱియొకపనిలోఁబ్రవర్తింపఁజేసెడి అనవధానము (గుఱితేకపోవుట). ఆలస్యమనఁగా పనులు చేయలేకపోవుట. స్తబ్ధత్వమనుట. పురుషుఁడుఇంద్రియములనుప్రవర్తింపఁజేయుటచే తలఅలయికకలిగిఅన్నియింద్రియములపని లునుడుగుటనిద్ర. అందుబాహ్యేంద్రియములుమాత్రమెప్రవర్తింపకుండుటస్వప్నము (కల). మనస్సుగూడనుడుగుటసుషుప్తి (గట్టినిద్ర). వీనికిహేతువు వీనిద్వారమున పురుషుని బంధించునది తమోగుణము. అని రామానుజభాష్యము. [స్యము.

దేనివలనఅజ్ఞానముపుట్టుచున్నదో అదియజ్ఞానజము అనిమధ్వభా

సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత।
జ్ఞాన మావృత్యతుతమః ప్రమాదే సఞ్జయత్యుత॥౯॥

(హే) భారత!=(ఓ)భరతవంశమువాఁడా!, సత్త్వం సుఖే సఞ్జయతి=సత్త్వగుణము సుఖమునందు సంగమునుకలుగఁజేయును. రజః కర్మణి (సఞ్జయతి)=రజోగుణము కర్మమునందు సంగమునుకలుగఁజేయును. తమస్తు=తమోగుణమో, జ్ఞానమ్ ఆవృత్య ప్రమాదే సఞ్జయతి=జ్ఞానమును ఆవరించి ప్రమాదమునందు సంగమును కలుగఁచేయును.

జ్ఞానమునుఅనఁగా సత్త్వగుణమువలనఁగలిగెడి వివేకమును. చేయవలసినదానిని చేయకపోవుట ప్రమాదము. అనిశంకరభాష్యము

సత్త్వాదిగుణములు వేనివేనికి స్వరూపమును కలుగఁజేయునో వానిలో ప్రధానములు చెప్పఁబడుచున్నవి- జ్ఞానమనఁగా వస్తువుల యొక్క యథార్థస్థితి అని తెలిసికొనుట- అని రామానుజభాష్యము.

రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।

రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥౧౦॥

(హే) భారత!=(ఓ) భరతవంశమువాఁడా!, రజః తమశ్చ అభిభూయ సత్త్వం భవతి=రజస్సును తమస్సును తిరస్కరించి సత్త్వగుణము కలుగుచున్నది- సత్త్వం తమశ్చైవ (అభిభూయ) రజః (భవతి)=సత్త్వమును తమస్సును (తిరస్కరించి) రజస్సు (కలుగుచున్నది)- తథా సత్త్వం రజః (అభిభూయ) తమః (భవతి)=అట్లే సత్త్వమును రజస్సును (తిరస్కరించి) తమస్సు (కలుగుచున్నది)

కలుగుటయనఁగా వృద్ధిబొందుట- అట్లు వృద్ధిబొందిన గుణములు వానివాని కార్యములను జేయుచుండును- అని శంకరభాష్యము.

సత్త్వాదిగుణములు మూడును ప్రకృతితోఁ గలిసియున్నయాత్మస్వరూపము ననుసరించియున్నను, ప్రాచీనకర్మవశమునను ఆహారభేదముంబట్టియు నొకొక్కప్పు డొకొక్కగుణము దేహమందు మిగిలినగుణములను అణఁగఁద్రొక్కుచుండును- అని రామానుజభాష్యము.

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।

జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత॥౧౧

అస్మిన్ దేహే సర్వద్వారేషు=ఈ శరీరమున అన్నిద్వారములయందును, జ్ఞానం ప్రకాశః యదా ఉపజాయతే=జ్ఞానమనెడి వెలుగు ఎప్పుడు కలుగుచున్నదో, తదా సత్త్వం వివృద్ధమిత్యుత విద్యాత్=అప్పుడు సత్త్వము వృద్ధినిబొందినదనియును తెలిసికొనవలయును

ఆత్మకు తెలివిగలుగుటకు త్రోవలగు శ్రోత్రము మొదలగు నింద్రియములన్నియు ద్వారములు- ప్రకాశమనఁగా అంతఃకరణముయొక్క వృత్తి (పరిణామము) అదియె జ్ఞానము- అని శంకరభాష్యము.

ప్రకాశే అని పదచ్ఛేదము- వస్తువుల యథార్థస్థితిని ప్రకాశింపఁజేయుటకు విషయమైనజ్ఞానము, చక్షుస్సు మొదలగు నన్నిజ్ఞానద్వారములయందును ఎప్పుడు పుట్టుచున్నదో- అని రామానుజభాష్యము-

లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమస్స్పృహా।
రజ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన॥౧౨॥

(హే)కురునన్దన=(ఓ)కురువంశము వాఁడా!,లోభః ప్రవృత్తిః కర్మ ణామ్ ఆరమ్భః అశమః స్పృహా (ఇతి) ఏతాని=లోభంబును ప్రవర్తించుటయును పనులను ఆరంభించుటయును శాంతిలేకపోవుటయును కోరికయును (అను)నివి, రజసి వివృద్ధే(సతి) జాయన్తే=రజోగుణము వృద్ధిపొందినది(అగుచుండఁగా) పుట్టుచున్నవి-

లోభమనఁగా ఇతరుల సొమ్మును పొందఁగోరుట- అశమమనఁగా సంతోషము అనురాగము మొదలగునవి కలుగుట- అందఱకును పొందవలసిన వస్తువునందలి యాశ తృష్ణ- అని శంకర భాష్యము-

లోభమనఁగా తనసొమ్మును విడువలేకపోవుట-ప్రవృత్తియనఁగా ప్రయోజనమునుద్దేశింపకయె ప్రవర్తించుట- కర్మములనఁగా ఫలములనిచ్చునవి- అశమమనఁగా ఇంద్రియములు ఉపరమింపక (ఉడుగక)పోవుట- విషయములను గోరుట స్పృహ- అని రామానుజభాష్యము-

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ।
తమ స్యేతానిజాయన్తే వివృద్ధే కురునన్దన॥౧౩॥

(హే)కురునన్దన!=(ఓ)కురువంశము వాఁడా!,అప్రకాశః అప్రవృత్తిశ్చ=తెలివిలేకపోవుటయును ప్రవర్తింపకపోవుటయును, ప్రమాదః మోహ ఏవచ (ఇతి) ఏతాని=పొరపాటును మోహంబును (అను)నివి, తమసి వివృద్ధే (సతి) జాయన్తే=తమోగుణము వృద్ధిపొందినది (అగుచుండఁగా) పుట్టుచున్నవి-

అప్రకాశమనఁగా అవివేకము- దానివలనఁగలుగునవియె ప్రవర్తింపకపోవుట మొదలగునవి- అని శంకరభాష్యము-

అప్రకాశమనఁగా జ్ఞానముకలుగకపోవుట- అప్రవృత్తియనఁగా స్తబ్ధుఁడైయుండుట- ప్రమాదమనునది తానుచేయవలసినదానికంటె నితరమున ప్రవర్తింపఁజేయునది- మోహమనఁగా ఒకవస్తువునుమఱియొకవస్తువునుగాఁదలంచుట-అని రామానుజభాష్యము-

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయంయాతి దేహభృత్।

తదోత్తమవిదాంలోకా నమలాన్ ప్రతిపద్యతే॥౧౪॥

యదాతు=ఎప్పుడు, దేహభృత్ సత్త్వే ప్రవృద్ధే (సతి) ప్రళయం యాతి=సత్త్వగుణము వృద్ధిబొందినదగుచుండగా మరణమును పొందుచున్నాడో, తదా=అప్పుడు, ఉత్తమవిదామ్ అమలాన్ లోకాన్ ప్రతిపద్యతే=ఉత్తమజ్ఞానముకలవారలయొక్క నిర్మలములైన లోకములను పొందుచున్నాడు- (శంకరభాష్యము.

ఉత్తమవిత్తులనగా మహదాదితత్త్వములనెఱిగినవారు- అని శంకర

ఉత్తమతత్త్వము నెఱిగినవారనగా నాత్మస్వరూపము నెఱిగినవారు. వారలలోకములనగా సమూహములను- అవియజ్ఞానము లేని విగాన అమలములు- ఆత్మజ్ఞులవంశమునఁబుట్టి ఆత్మజ్ఞానమును కలుగఁజేయు పుణ్యకర్మములం జేయుననుట. అని రామానుజభాష్యము.

రజసి ప్రలయం గత్వా కర్మసఙ్గిషు జాయతే।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే॥

రజసి (ప్రవృద్ధే సతి) ప్రళయం గత్వా=రజోగుణము (వృద్ధిఁబొందినదగుచుండఁగా) మరణమును పొంది, కర్మసఙ్గిషు జాయతే=కర్మముననాసక్తిగలవారలలో పుట్టుచున్నాఁడు- తథా తమసి (ప్రవృద్ధే సతి) ప్రలీనః=అట్లే తమోగుణము (వృద్ధిబొందినదగుచుండఁగా) చచ్చిపోయినవాఁడు, మూఢయోనిషు జాయతే=మూఢయోనులయందు పుట్టుచున్నాఁడు-

మూఢయోనులనఁగా పశ్వాదియోనులు- అని శంకరభాష్యము-

కర్మసంగులనఁగా ఫలములనుగోరి కర్మములను జేయువారు- వారలలోఁ బుట్టి స్వర్గాదులకొఱకు కర్మముల నాచరించును- మూఢయోనులనఁగా కుక్కపంది మొదలగుయోనులు- ఏపురుషార్థమునైనను సంపాదించికొనుటకు తగనివాఁడగును- అని రామానుజభాష్యము-

కర్మణస్సుకృతస్యాహు స్సాత్త్వికంనిర్మలంఫలమ్।
రజసస్తుఫలందుఃఖ మజ్ఞానం తమసఃఫలమ్॥౧౬॥

సుకృతస్య కర్మణః=లెస్సగాఁజేయఁబడిన కర్మమునకు, సాత్త్వికం నిర్మలం ఫలమ్ ఆహుః=సత్త్వగుణసంబంధియగు నిర్మలమైనఫల

మును చెప్పుచున్నారు. రజసస్తు దుఃఖం ఫలమ్ (ఆహుః)=రజస్సునకో దుఃఖమును ఫలమునుగాను (చెప్పుచున్నారు) తమసః అజ్ఞానం ఫలమ్(ఆహుః)=తమస్సునకు అజ్ఞానము ఫలమునుగాను (చెప్పుచున్నారు)

సుకృతమనఁగా సాత్త్వికమనుట-రజస్సనఁగా రాజసకర్మము అనుట- కర్మాధికారమునఁ గలిగెడి ఫలము కూడ దుఃఖమే అనఁగా రాజసమె అగును-(దుఃఖమిశ్రమైనసుఖము అనుట- అని మధుసూదనటీక) తమస్సునకు అనఁగా తామసకర్మమునకు- అధర్మమునకనుట-అనిశంకరభాష్యము-

సత్త్వవృద్ధిలో మృతిబొందినవాఁడై ఆత్మజ్ఞులకులమునఁ బుట్టినవానిచే ఫలాపేక్షలేక నారాయణారాధనముగాఁ జేయఁబడిన కర్మముయొక్క ఫలము పూర్వముకంటె నధికసత్త్వమువలనఁ గలిగినదై నిర్మలమనఁగా దుఃఖసంపర్కము లేనిదై యుండును- అంత్యకాలమున వృద్ధిబొందిన రజోగుణముయొక్క ఫలము ఫలముంగోరి కర్మములం జేయువారికులమునఁ బుట్టుటయు అట్టి కర్మములఁ జేయుటయు దాని ఫలమున ననుభవించుటకు వెండియు జన్మము నొందుటయు రజస్సువృద్ధి బొందుటయు వెండియు ఫలములంగోరి కర్మములం జేయుచుండుటయు ననియిట్లు సాంసారికదుఃఖము బువిస్తారముగాఁ గలదై యుండును-ఇట్లు అంత్యకాలమున వృద్ధినిపొందిన తమస్సునకు ఫలము అజ్ఞానపరంపరయె-అని రామానుజభాష్యము-

దుఃఖమనఁగా స్వల్ప సుఖముతోఁగూడిన దుఃఖము- అని మధ్వభాష్యము-

> సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ।
> ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ॥౧౭॥

సత్త్వాత్ జ్ఞానం సంజాయతే=సత్త్వగుణమువలన జ్ఞానము పుట్టుచున్నది- రజసః లోభ ఏవచ సంజాయతే=రజోగుణమువలన లోభమె పుట్టుచున్నది- తమసః ప్రమాదమోహౌ భవతః=తమస్సువలన ప్రమాదంబును మోహంబును కలుగుచున్నవి- అజ్ఞానం చైవ(భవతి)=అజ్ఞానంబును (కలుగుచున్నది)

వెనుకఁ జెప్పినచొప్పున పరంపరచేఁ గలిగిన సత్త్వమువలన ఆత్మయథా

రూపప్రత్యక్షమనెడి జ్ఞానము కలుగుచున్నది- రజస్సువలన స్వర్గాదిఫలములయందు లోభము కలుగును- ప్రమాదమనఁగా అవధానము (జాగ్రత్త) లేకపోవుటవలన చెడ్డ కార్యములయందు ప్రవర్తించుట- దానివలన మోహమనఁగా విపరీతజ్ఞానము కలుగును- దానివలనమిక్కిలియధికమైనతమస్సు కలుగును- దానివలన నజ్ఞానమనఁగా జ్ఞానములేకపోవుట కలుగును- అని రామానుజభాష్యము-

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛన్తి తామసాః॥౧౮॥

సత్త్వస్థాః ఊర్ధ్వం గచ్ఛన్తి=సత్త్వగుణమునందున్నవారు మీదికి పోవుచున్నారు- రాజసాః మధ్యే తిష్ఠన్తి=రజోగుణసంబంధులగు వారు మధ్యమునందు ఉన్నారు- జఘన్యగుణవృత్తిస్థాః తామసాః అధః గచ్ఛన్తి= తక్కువగుణముయొక్క ప్రవృత్తియందున్న తామసులు క్రిందికి పోవుచున్నారు-

మీదికిపోవుటయనఁగా దేవలోకాదులయందు పుట్టుట- మధ్యమునందుండుటయనఁగా మనుష్యులలోఁబుట్టుట- క్రిందికిపోవుటయనఁగా పశ్వాదియోనులలోఁబుట్టుట- అని శంకరభాష్యము-

పైకిపోవుటయనఁగా సంసారబంధమునుండి తప్పిపోవుట— రాజసులు ఫలసాధనములగు కర్మములం జేయుచు వానిఫలముననుభవించుచు వెండియుపుట్టుచు కర్మములఁజేయుచునుందురుగాన మధ్యముననుందురు- ఇది పునరావృత్తిరూపమగుటను దుఃఖప్రాయమే- తామసులు ఉత్తరోత్తరము నికృష్టములగు తమోగుణవ్యాపారములయందున్నవారై చండాలత్వమునను అటపైని తిర్యక్కులగుటనను అటపైని క్రిమికీటాదిజన్మమునను అటపైని స్థావరత్వమునను అటపైని తుప్పలు తీగెలు అగుటనను అటపైని రాయి కఱ్ఱ బెడ్డలు గడ్డ మొదలగునవియగుటను బొందుదురు- అని రామానుజభాష్యము-

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥౧౯॥

(యః) ద్రష్టా గుణేభ్యః అన్యం కర్తారం యదా నానుపశ్యతి=(ప)

తెలిసికొనువాఁడు గుణములకంటెను ఇతరుఁడగు కర్తను ఎప్పుడు చూడఁడో, (కిం)చ గుణేభ్యః పరం వేత్తి=ఇంతియె కాక గుణముల కంటె పరుఁడగువానిని తెలిసికొనుచున్నాఁడో, సః మద్భావమ్ (తదా) అధిగచ్ఛతి= వాఁడు నేనగుటను (అప్పుడు) పొందుచున్నాఁడు-

గుణములే యన్నియవస్థలునుకల వై అన్నికర్మములకును కర్తలు; గుణవ్యాపారములకు సాక్షియగు నాత్మ నిర్గుణుఁడు; అంతయును వాసుదేవుఁడె; అని యిట్లు మందిజ్ఞానముకలవాఁడు వాసుదేవత్వమును పొందుచున్నాఁడు- అని శంకరభాష్యము.

స్వయముగా పరిశుద్ధమైనస్వభావముగలయాత్మకు అనేకవిధము లగు కర్మములంగూర్చినకర్తృత్వము పూర్వ పూర్వ కర్మములమూలముగా వచ్చిన గుణసంపర్కమునిమిత్తముగాఁగలది- ఆత్మ స్వయముగా కర్త కాఁడు- పరిచ్ఛిన్నముకాని జ్ఞానమె స్వరూపముగాఁగల వాఁడు- అనియిట్లు ఆత్మనుఎప్పుడుచూచునో అప్పుడు మద్భావమును (నావంటివాఁడగుటను) పొందుచున్నాఁడు-అని రామానుజభాష్యము.

గుణములకంటెనితరునిపరిణామి (పరిణామముగల) కర్తనుగాఁ జూడకున్నాఁడో- అని మధ్వభాష్యము-

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే॥ ౨౦॥

దేహీ=పురుషుఁడు, దేహసముద్భవాన్ ఏతాన్ త్రీన్ గుణాన్ అతీత్య= దేహమునఁగలిగిన ఈ మూఁడు గుణములనును అతిక్రమించి, జన్మమృత్యుజరాదుఃఖైః విముక్తః=పుట్టుకయును చావునుముదిమియును దుఃఖమునను వానిచేత విడువఁబడినవాఁడై, అమృతమ్ అశ్నుతే= మోక్షమును పొందుచున్నాఁడు-

(బ్రదికియుండియె యతిక్ర)మించి- దేహసముద్భవములనఁగా దేహము పుట్టుటకు బీజములైనవి- బ్రదికియుండియె జన్మాదులచేవిడువఁబడినవాఁడై జ్ఞాని అమృతమునుఅనఁగా నేనగుటనుపొందుచున్నాఁడు! అనిశంకరభాష్యము-

దేహాకారముగాఁబరిణమించిన ప్రకృతివలనఁబుట్టిన సత్త్వాదిగుణములనతిక్రమించి జ్ఞానైకస్వరూపుఁడగునాత్మను చూచుచున్నవాఁ

నైడై జన్మాంతములచే విడువఁబడినవాఁడై అమృతుని అనఁగా నాత్మ నుపొందుచున్నాఁడు. ఇదియె మద్భావముఅని యర్థము. అని రామానుజభాష్యము.

కైర్లింగైస్త్రీన్గుణానేతా నతీతో భవతి ప్రభో।
కిమాచారః కథం చైతాం స్త్రీన్ గుణానతివర్తతే॥ ౨౧॥

(హే) ప్రభో=(ఓ ప్రభువా!, ఏతాన్ త్రీన్ గుణాన్ అతీతః = ఈ మూడుగుణములను అతిక్రమించినవాఁడు, కైః లింగైః (విశిష్టః) భవతి= ఏగుఱుతులతో (కూడినవాఁడు) అగుచున్నాఁడు? కిమాచారః భవతి=ఏయాచారముకలవాఁడు అగుచున్నాఁడు? ఏతాన్ త్రీన్ గుణాన్ కథంచ అతివర్తతే=ఈ మూడు గుణములను ఎట్లు అతిక్రమింపుచున్నాఁడు?

శ్రీభగవానువాచ-

ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాండవ।
నద్వేష్టి సంప్రవృత్తాని ననివృత్తాని కాంక్షతి॥ ౨౨॥

(హే) పాండవ!=(ఓ) పాండవుఁడా!, సంప్రవృత్తాని=ప్రవర్తించిన, ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ నద్వేష్టి=ప్రకాశమునను ప్రవృత్తిని మోహమునను ద్వేషింపఁడు. నివృత్తాని నకాంక్షతి=మఱలినవానిని కోరఁడు.

ప్రకాశాదులువరుసగా సత్త్వరజస్తమోగుణముల కార్యములు. ఈ శ్లోకమునఁజెప్పిన లక్షణము తనకుమాత్రము తెలియఁదగినదె కానిఇతరులకు తెలియఁదగినది కాదు. అని శంకరభాష్యము.

అనాత్మ యందె నితరములగు నసిష్టవస్తువులయందు సత్త్వాదికార్యములగు ప్రకాశాదులు ప్రవర్తించినను ద్వేషింపఁడు. అనాత్మవ్యతిరిక్తములగు నిష్టవస్తువులయందు ప్రవర్తింపకపోయినను కోరఁడు. అని రామానుజభాష్యము.

తటుచుగా ద్వేషింపఁడు. తఱుచుగాఁ గోరఁడు. అని మధ్వభాష్యము.

ఉదాసీనవదాసీనో గుణైర్యోనవిచాల్యతే।
గుణావర్తన్త ఇత్యేవ యోవతిష్ఠతి నేఙ్గతే॥ ౨౩॥

యః ఉదాసీనవత్ ఆసీనః=ఎవ్వఁడు ఉదాసీనునివలెను ఉన్న

వాఁడై, గుణైః నవిచాల్యతే=గుణములచేత కదల్పఁబడఁడో- యః గుణాః వర్తన్త ఇత్యేవ అవతిష్ఠతి=ఎవ్వఁడు గుణములు ప్రవర్తింపు చున్నవిఅనియె ఉన్నాఁడో, నేఙ్గతే=కదలఁడో-

ఆసీనుఁడనఁగా గుణాతీతత్వమునకు సాధనమైనమార్గమునను స్థుఁడైనవాఁడు- పసంన్యాసి వివేకజ్ఞానావస్థనుండి చలింపఁడో- కార్యము (శరీరము)కరణములు(ఇంద్రియములు)విషయములు ఈ యాకారమునుగాఁబరిణమించిన గుణములు ఒకరిదానియందొకటి ఉండునని ఎవ్వఁడుండునో- అవతిష్ఠతెఅని యుండవలసినదానిని అవతిష్ఠతి అని ప్రయోగించుట శ్లోకము నడపదను భయముచేత- యోఽనుతిష్ఠతి అని పాఠాంతరము- కదలకపోవుటయనఁగా స్వరూపమునందెయుండుట- అని శంకరభాష్యము-

గుణములనుకాక ఆత్మనుచూచుటయందె తృప్తినిబొందియుండుటను మిగిలినవానియందు ఉదాసీనుఁడు- గుణములచేత ద్వేషమును ఆకాంక్ష(కోరిక) యును కలిగి వానిచేత చలింపఁబడఁడో- గుణములు వానికార్యములగు ప్రకాశాదులయందు ప్రవర్తించుచున్నవి అనియుండి కదలకపోవుటయనఁగా గుణముల కార్యములననుసరించి ప్రవర్తింపకపోవుట- అని రామానుజభాష్యము-

సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః॥౨౪॥
మానావమానయోస్తుల్య స్తుల్యోమిత్రారిపక్షయోః।
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతె॥౨౫॥

సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాఞ్చనః=దుఃఖంబును సుఖంబును సమంబులుగాఁగలవాఁడును స్వస్థుఁడును మంటిబెడ్డయును రాయియును బంగారును సమానములుగాఁగలవాఁడును, తుల్యప్రియాప్రియః ధీరః తుల్యనిన్దాత్మసంస్తుతిః=ఇష్టంబును అనిష్టంబును తుల్యములుగాఁగలవాఁడును ధీరుఁడును నిందించుటయు తన్ను స్తోత్రము చేయుటయు సమానములుగాఁగలవాఁడును, మానావమానయోః తుల్యః=మానమునందును అవమానమునందును ఒకవిధముగానుండువాఁడును, మిత్రారిపక్షయోః తుల్యః=మిత్రపక్షమునందును శత్రు

పక్షములందును ఒకటే విధముగా నుండువాఁడును, సర్వారంభపరిత్యాగీచ(యః)=అన్నియారంభములను విడుచువాఁడును (ఎవ్వఁడో), సః గుణాతీతః ఉచ్యతే=వాఁడు గుణాతీతుఁడని చెప్పఁబడుచున్నాఁడు-

స్వస్థుఁడనఁగా తనయాత్మయందున్నవాఁడు- ధీరుఁడనఁగా బుద్ధిమంతుఁడు- మానావమానములలోఁ దుల్యుఁడనఁగా వికారములేనివాఁడనుట- వీనియుద్దేశమున శత్రుమిత్రులు లేకపోయినను ఇతరులయుద్దేశమునుపట్టి శత్రుమిత్రులని చెప్పఁబడినది- ఆరంభములనఁగా కర్మములు- దేహము నిలుచుటకు కావలసినవి తప్ప మిగిలిన కర్మములనన్నిటిని విడుచువాఁడనుట- ఈ రెండుశ్లోకములందును జెప్పఁబడినది ప్రయత్నపూర్వకముగా నాచరింపఁబడినదై గుణాతీతత్వమునకు సాధనమగును- స్థిరపడినదైన ఇదియె గుణాతీతుఁడు తానని తెలిసికొనుటకు గుఱుతుకూడ నగును- అని శంకరభాష్యము-

దుఃఖమునందును సుఖమునందును సమమైనచిత్తము కలవాఁడు- స్వస్థుఁడనఁగా తనయందున్నవాఁడు- తనయాత్మమాత్రమె ఇష్టుఁడుగాఁగలవాఁడుగాన పుత్రాదులుపుట్టినను చచ్చినను ఒకటేవిధమైనచిత్తముగలవాఁడుగానె యుండువాఁడనుట- ధీరుఁడనఁగా ప్రకృతిని ఆత్మను వివేచించుటలో నేర్పరియైనవాఁడు- తనకు (ఆత్మకు) మనుష్యత్వాదులతో సంబంధము లేదని తలఁచుటచే ఆమనుష్యత్వాదులను పట్టినవేయైన నిందాస్తుతిమానావమానశత్రుమిత్రపక్షములయందు సమమైనచిత్తముకలవాఁడు- దేహయాత్రనుపట్టి వచ్చిన ఆరంభములనన్నిటిని విడుచువాఁడు- అని రామానుజభాష్యము-

తుల్యత్వముయొక్క యర్థము పూర్వము చెప్పఁబడినది- అని మధ్వభాష్యము-

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥ ౨౬॥

యః అవ్యభిచారేణ భక్తియోగేన మాం సేవతే=ఎవ్వఁడు అనియమములేనిదైన భక్తియోగముచేత నన్ను సేవించుచున్నాఁడో, సః ఏతాన్ గుణాన్ సమతీత్య=వాఁడు ఈ గుణములను అతిక్రమించి, బ్రహ్మభూయాయ కల్పతే=బ్రహ్మత్వమునకు సమర్థుఁడగుచు

నాఁడు-

సమస్తభూతముల హృదయమున నాశ్రయించియుండెడి యీశ్వరుఁడనును నారాయణుండనునగు నన్ను- సంన్యాసియైనను కర్మములనాచరించువాఁడైననగు నెవ్వఁడు-బ్రహ్మభూయమనఁగా మోక్షము- అని శంకరభాష్యము.

ప్రకృతినిని ఆత్మనును వేఱువేఱుగాఁదలంచినంతమాత్రమున గుణాతీతత్వము కలుగఁబోదు- అనాదికాలమునుండిప్రవర్తించినవిపరీతవాసనచే నాతలంపు బాధింపఁబడుచుండును- కావున నన్ను భజించువాఁడే, స్వయముగానతిక్రమింపశక్యముగాని గుణములనన్నిటిని నతిక్రమించి బ్రహ్మభావమునకుఁదగినవాఁడు అనఁగా స్వస్వరూపమునను న్న ఆత్మనుపొందువాఁడు, అగుచున్నాఁడు-అని రామానుజభాష్యము-

బ్రహ్మభూయమనఁగా ప్రకృతివలె భగవంతునకిష్టమగుట-ప్రకృతియిష్టమైనయంతయిష్టముకాదు- ఇష్టమగుటమాత్రమె- భూయము అనఁగా భావము-అని మధ్వభాష్యము-

బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహమమృతస్యావ్యయస్య చ|
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ||౨౭||

అమృతస్య అవ్యయస్య చ బ్రహ్మణః=నాశములేనివాఁడును నిర్వికారుండునగు బ్రహ్మంబునకును, శాశ్వతస్య ధర్మస్య చ=శాశ్వతమైన ధర్మమునకును, ఐకాన్తికస్య సుఖస్య చ=నియతమైన సుఖమునకును, అహం ప్రతిష్ఠా=నేను ప్రతిష్ఠను.

బ్రహ్మమనఁగాపరమాత్మ- నేను అనఁగా ప్రత్యగాత్మ-దేనియందుండునోఅది ప్రతిష్ఠ- ప్రత్యగాత్మయెఘుంచిజ్ఞానముచేత పరమాత్మగానిశ్చయింపఁబడునుగాన పరమాత్మకుప్రతిష్ఠ- ధర్మస్య సుఖస్య=జ్ఞానయోగమనెడిధర్మముచేతఁబొందఁదగినయానందమునకు-పయీశ్వరశక్తిచేగభక్తానుగ్రహము మొదలగువానికొఱకు బ్రహ్మముప్రవర్తింపుచున్నదో ఆశక్తివైననేనుబ్రహ్మమే- శక్తియునుశక్తికలదియునొకటియెకదా. మఱియొక్కవిశేషమగునర్థమెట్లన్నను- బ్రహ్మమనఁగాసవికల్పకబ్రహ్మము. దానికినిర్వికల్పకుఁడనైననేనాశ్రయమైనవాఁడను-

శాశ్వతధర్మమునకు అనఁగా జ్ఞాననిష్ఠకును దానివలనఁగలిగె
డి సుఖమునకును ప్రతిష్ఠ. అని శంకరభాష్యము.

(బ్రహ్మమనఁగా ప్రత్యగాత్మస్వరూపము) శాశ్వతధర్మమనఁగా
మిక్కిలియతిశయముగలిగిన నిత్యమైనయైశ్వర్యము- సుఖమనఁగా
జ్ఞానిపొందవలసిన యానందము- భగవంతునింగూర్చిన ప్రపత్తివలన
గుణములనతిక్రమించును- అటపైని బ్రహ్మభావముకలుగును- అని రా
మానుజభాష్యము-

బ్రహ్మమునకుఅనఁగామాయకు- అనిమధ్వభాష్యము.

ఇతిశ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదేగుణత్రి
యవిభాగోనామ చతుర్దశోఽధ్యాయః

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకం
బును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబునగు భ
గవద్గీతలలో గుణములుమూటిని విభాగించుటయ
నెడిపదునాలుగవ యధ్యాయము.



గీతాభాష్యత్రయసారము.

పదునేనవయధ్యాయము.

శ్రీభగవానువాచ.

ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్॥౧॥

ఊర్ధ్వమూలమ్ అధశ్శాఖమ్ అశ్వత్థమ్=మీఁదికి వేరులుగలదియును క్రిందికి కొమ్మలుగలదియునగు రావిచెట్టును, అవ్యయమ్ (శ్రుతయః) ప్రాహుః=నిత్యమైనదానిగా (శ్రుతులు) చెప్పుచున్నవి- యస్య ఛన్దాంసి పర్ణాని (ప్రాహుః)=దేనికి ఛందస్సులను ఆకులనుగాను (చెప్పుచున్నవో)- యః తం వేద=ఎవ్వఁడు దానిని యెఱుఁగుచున్నాఁడో, సః వేదవిత్=వాఁడు వేదము నెఱుఁగువాఁడు.

ఊర్ధ్వమనఁగా బ్రహ్మము- అవ్యక్తమాయాశక్తివిశిష్టంబగు ఆ బ్రహ్మమె మూలముగాఁగల యీ సంసారవృక్షము- మహత్తు అహంకారము తన్మాత్రలు మొదలగునవి కొమ్మలు- అశ్వత్థమనఁగా (అశ్వస్సః) రేపటికి ఉండనిది. ఈ సంసారవృక్షము అనాదికాలమునుండి ప్రవర్తించినదిగాన అవ్యయము. ఛందస్సులనఁగా ఋగ్యజుస్సామములు- ఆకులు చెట్టును కాపాడునట్లు వేదములు ధర్మాధర్మములను వానిసాధనములను వానిఫలములను ప్రకాశింపఁజేయునవిగాన సంసారమును కాపాడునవి- వేదవిత్తనఁగా వేదార్థము నెఱిఁగినవాఁడు- ఇట్లు సమూలవృక్షజ్ఞానము స్తోత్రము చేయఁబడుచున్నది. అని శంకరభాష్యము.

ఏ సంసారమనెడి యశ్వత్థమును ఊర్ధ్వమూలమునుగానును అధశ్శాఖమునుగానును అవ్యయమునుగానును శ్రుతులు చెప్పుచున్నవో- ఏడులోకములకును మీఁదనుండెడి చతుర్ముఖుఁడు మొదలుగాఁగలుగుట చేత నది యూర్ధ్వమూలము. భూమిమీఁదనుండెడి మనుష్యులు పశువులు మృగములు క్రిములు (పురుగులు) కీటములు అనఁగా తేళ్లు మొదలగునవి పక్షులు స్థావరములు అనఁగా చెట్లు మొదలగునవి అనునవి యంతము గాఁగలదగుట చేత అధశ్శాఖము. మంచిజ్ఞానము గలుగునంతకును ప్రవాహరూపము గానుండుట చే తెంపులేనిదై యుండును గాన నవ్య

యము. వేదములలోఁ జెప్పఁబడిన కామ్యకర్మములచేత నీసంసారము వృద్ధిపొందును గాన వేదములు దీనికి ఆకులు. ఆకులచేతఁ గదా చెట్టు ఎదుగుట. వేదము సంసారవృక్షమును తెగఁగొట్టెడి యుపాయమును తెలియఁజేయును- ఛేదింపఁబడవలసినవృక్షము నెఱుఁగుట ఛేదించెడియుపాయమును తెలిసికొనుటకు ఉపయోగించును- కాఁబట్టి ఈవృక్షము నెఱిఁగినవాఁడు వేదము నెఱిఁగినవాఁడని చెప్పంబడుచున్నది- అని రామానుజభాష్యము-

సంసారస్వరూపంబును దానిని దాఁటుటకు ఉపాయంబును విజ్ఞానంబును ఈయధ్యాయమునఁ జెప్పఁబడుచున్నవి- ఊర్ధ్వుఁడనఁగా విష్ణువు- ఊర్ధ్వుఁడనఁగా అన్నిటికంటె నుత్కృష్టుఁడు- క్రిందివి అనఁగా నికృష్టములైన, భూతములు శాఖలు- రేపుకూడ నొకవిధమున నుండదు గాన నశ్వత్థము- పూర్వపుబ్రహ్మకాలమున నేట్లుండెనో ఆట్లె ఎల్లప్పుడు నగుటను అవ్యయము. ఫలమునకు కారణములు గాన ఛందస్సులు ఆకులు- ఆకులు పుట్టక పండ్లు కలుగవు కదా- అని మధ్వభాష్యము.

అధశ్చోర్ధ్వంచప్రసృతాస్తస్యశాఖా, గుణప్రవృద్ధా విషయప్రవాలాః।
అధశ్చ మూలాన్యనుసంతతాని, కర్మానుబన్ధీని మనుష్యలోకే॥ ౨॥

గుణప్రవృద్ధాః విషయప్రవాళాః తస్య శాఖాః=సత్త్వాదిగుణములచేతవృద్ధిబొందినవియును శబ్దాదివిషయముల నెడి చిగురులుగలవియునగు దాని కొమ్మలు, అధశ్చ ఊర్ధ్వంచ ప్రసృతాః=క్రిందికిని మీదికిని ప్రసరించినవి- కర్మానుబన్ధీని మూలాని=కర్మము ననుసరించియుండెడి వేరులు, అధశ్చ మనుష్యలోకే అనుసంతతాని=క్రింద మనుష్యలోకమున విస్తరించియున్నవి.

మనుష్యులు మొదలగువారలకంటె క్రిందను అనఁగా స్థావరముల వఱకును, మీదను అనఁగా బ్రహ్మలోకము వఱకును- జ్ఞానకర్మఫలములు ఆచెట్టుకు కొమ్మలవంటివిగాన కొమ్మలు- అట్టి శాఖలవలనఁ గలుగునవిగాన శబ్దాదివిషయములు చిగుళ్లు- సంసారవృక్షమునకు గొప్ప మూలమైన ఉపాదానకారణము ఊర్ధ్వముగాఁ జెప్పఁబడినది- ఇప్పుడు ఫలములవలనఁ గలిగిన రాగద్వేషాదివాసనలు వేరులవలె ధర్మాధర్మప్ర

వృత్తికి కారణము వైననీయును దేహాదులకుతరువాతివీయును గానక్రిందివే రులు- అనుసంతతములనఁగా ప్రవేశించియున్నవి- కర్మానుబంధుల నఁగా ధర్మాధర్మస్వరూపమైనకర్మముతమవలనఁగలుగునదిగాఁ గలవి- విశేషముగా మనుష్యులకే కర్మమునందధికారముగాన మనుష్యలోకే అని చెప్పఁబడినది- అనిశంకరభాష్యము.

మనుష్యాదులుశాఖలుగాఁగల యీవృక్షమునకు ఆయాకర్మముల చేఁగలిగినమఱికొన్నిశాఖలు వెండియు మనుష్యపశ్వాదిరూపమునఁగ్రిందికిఁబ్రసరింపుచున్నవి- మీఁదికిగంధర్వయక్షదేవాదిరూపమున ప్రసరింపుచున్నవి- అనిరామానుజభాష్యము.

శరీరము మొదలగువానియందుండుభూతములు అవ్యక్తమునఁ(ప్రకృతియందుఁ)గూడ సూక్ష్మరూపముగా నుండునుగాన క్రిందికిని మీఁదికిని ప్రసరించినవి- గుణములు సత్త్వము మొదలగునవి- విషయములు ప్రతీతిమాత్రసుఖంబులు(సుఖకరములుగాఁదోచునవి)గాన ప్రవాలములు (చిగుళ్లు)అనఁబడును- మూలములు భగవత్ప్రియములు మొదలగునవి- భగవంతుఁడుగూడ కర్మానుబంధమున(కర్మానుసారముగ)ఫలము నిచ్చుచున్నాఁడు- అని మధ్వభాష్యము.

నరూపమస్యేహతథోపలభ్యతే నాన్తో నచాదిర్నచసంప్రతిష్ఠా।
అస్య రూపమ్=దీని రూపము, తథా ఇహ నోపలభ్యతే=అట్లు(వెనుకఁజెప్పఁబడినచొప్పున) ఇచ్చట కనఁబడకున్నది- అన్తః న=అంతము లేదు, ఆదిశ్చ న=మొదలును లేదు- సంప్రతిష్ఠా చ న=స్థితియును లేదు.

సంసారము, స్వప్నము మరీచ్యుదకము(ఎండమావిలోనినీరు) మాయ గంధర్వనగరము వీనితోసమానమైనదిగాన ఇప్పుడుచెప్పినచొప్పున దానిరూపము తెలియఁబడదు- సంప్రతిష్ఠయనఁగా మధ్యము- అని శంకరభాష్యము.

నేను మనుష్యుఁడను దేవదత్తునిపుత్రుఁడను యజ్ఞదత్తునితండ్రిని తగినపరిగ్రహముకలవాఁడను అనియింతమాత్రమే తెలియునుగాని గుణమయములగు భోగములయందు సంగము లేనిచో నీవృక్షము అంతమును పొందుటయును, దీనికి గుణసంగమె ఆదియగుటయును,ఆత్మ

కానిదానిని ఆత్మయనుకొనుటయనెడి యజ్ఞానము దీనికి ప్రతిష్ఠయగుటయును, దెలియదు- (ప్రతిష్ఠ యనఁగా మూలము నిలుచుటకు ఆధారమైన ప్రదేశము- అని తాత్పర్యచంద్రిక) అని రామానుజభాష్యము

ఎట్లున్నదో అట్లు తెలియఁబడదు- అంతాదియనఁగా విష్ణువు అని మధ్వభాష్యము-

అశ్వత్థమేనంసువిరూఢమూలమసఙ్గశస్త్రేణదృఢేనఛిత్త్వా॥ 3
తతఃపదంతత్పరిమార్గితవ్యంయస్మిన్గతానినివర్తన్తిభూయః।

సువిరూఢమూలమ్ ఏనమ్ అశ్వత్థమ్=లెస్సగా మొలచిన వేరులుగల ఈ అశ్వత్థమును, దృఢేన అసఙ్గశస్త్రేణ ఛిత్త్వా=దృఢమైన సంగములేకపోవుటయనెడిశస్త్రముచేత ఛేదించి, తతః=తరువాతను, యస్మిన్ గతాః భూయః ననివర్తన్తి=దేనిలో నడచినవారు వెండియును మరలరో, తత్ పదమ్=ఆ స్థానము, పరిమార్గితవ్యమ్=వెదకఁబడఁదగినది-

అసంగమనఁగా పుత్రులయందును ధనమునందును లోకములయందును ఆసక్తిలేకపోవుట- ఈ ఆసక్తిలే ఈ శస్త్రము- దృఢము అనఁగా పరమాత్మనుగూర్చిననిశ్చయముచేత దృఢముగాఁ జేయఁబడినది- ఆశస్త్రము వివేకమునభ్యసించుటయనెడి రాతిమీఁదఁ గీడఁబడినదికావలయును- ఛేదించుటయనఁగా సంసారవృక్షమును బీజముతోఁగూడఁ పెకిలివేయుట- పదమనఁగా వైష్ణవపదము- వెదకుటయనఁగా తెలిసికొనుట- గతులనఁగాఁజొచ్చినవారు- అని శంకరభాష్యము-

విరూఢములనఁగా అనేకవిధములుగా మొలచినవి- జ్ఞానమూలముగాఁగలదగుటచే దృఢమైనవి- గుణమయములగు భోగములయందు సంగము లేకపోవుటయనెడి శస్త్రముచేత- తతః=విషయములయందు ఆసక్తి కలిగియుండుటయనెడి హేతువున నె- అని రామానుజభాష్యము-

అసంగశస్త్రముచేతఅనఁగా సంగము లేకపోవుటతోఁగూడిసజ్ఞానముచేత- ఛేదించుటయనఁగా విమర్శించుటయే- అటుపైని వానికిబంధకము కాదు- అప్పుడు మూలమునను బ్రహ్మము దెలియఁబడును- అని మధ్వభాష్యము-

తమేవచాద్యంపురుషంప్రపద్యే,యతఃప్రవృత్తిఃప్రసృతాపురాణీ॥ ౪॥

తమ్ ఆద్యం పురుష మేవచ ప్రపద్యే—ఆ(పదశబ్దము చేఁ జెప్పఁబడిన) మొదటివాఁడగు పురుషుని నె ఆశ్రయింపుచున్నాఁడను- (ఇతి పరిమా ర్గితవ్యమ్—అని వెదఁకఁబడవలసినది)- యతః పురాణీ ప్రవృత్తిః ప్రసృతా—ఎవ్వనివలన పురాతనమైన (సంసారమనెడిమాయావృతుముయొక్క) ప్రవృత్తి ప్రసరించినదో- ఆపురుషుఁడు ఐంద్రజాలికుఁడు(గారుడిచేయువాఁడు)మొదలగువాని వంటివాఁడు- అని శంకర భాష్యము-

ప్రపద్యే ద్యతః అనిపాఠము (అజ్ఞానాదులునివర్తించుటకొఱకు);తమ్ ఆద్యం పురుష మేవప్రపద్యేత్ —ఆ మొదటి పురుషుని నె శరణముబొందవలయును- యతః పురాణీ ప్రవృత్తిః ప్రసృతా—ఎవ్వనివలన పురాతనమైన ఈగుణమయభోగసంగప్రవృత్తి ప్రసరించినదియో-ప్రపద్యే యతఃప్రవృత్తిః అని యైనను పాఠము- ప్రపద్య ఇయతః అనిపదచ్ఛేదము- తమ్ ఆద్యం పురుష మేవ ప్రపద్య—ఆ మొదటి పురుషుని నె శరణుఁజొచ్చి; ఇయతః(సాధనసూతా) పురాణీ ప్రవృత్తిః ప్రసృతా—ఇంతవాత్మునకు(అజ్ఞాననివృత్తి మొదలగుదానికంతటికిని) సానధమై పురాతనమైన ప్రవృత్తి ప్రసరించినది- ప్రాచీనులయిన ముముక్షువుల(మోక్షమునోరువారల) ప్రవృత్తి యనుట- ప్రాచీనులగు ముముక్షువులు నన్నె శరణమునుగాఁ బొంది బంధమును వదలించికొనిరనుట- అని రామానుజభాష్యము-

ప్రపద్యేఅనియె పాఠము- తమేవ ప్రపద్యే—అతనినే శరణుఁజొచ్చునది- ఇది ఛేదించుటకుఉపాయము- భగవంతునికంటె నితరుఁడు శరణ్యుఁడు లేఁడుకదా- అనిమధ్వభాష్యము-

నిర్మానమోహాజితసఙ్గదోషా,
అధ్యాత్మనిత్యావినివృత్తకామాః।
ద్వన్ద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై,
ర్గచ్ఛన్త్యమూఢాఃపదమవ్యయంతత్ ॥౫॥

నిర్మాన మోహాః జితసఙ్గదోషాః అధ్యాత్మనిత్యాః వినివృత్తకామాః =మాన మోహములు లేనివారును సంగమనెడిదోషమునుజయించిన వారును ఆత్మవిషయమునందాసక్తికలవారును కామములువివర్తించిన

వారును, సుఖదుఃఖసంజ్ఞైః ద్వంద్వైః విముక్తాః =సుఖదుఃఖము లనుపేరుగల ద్వంద్వములచేత విడువఁబడినవారును, అమూఢాః= మూఢులుకానివారును, అవ్యయం తత్ పదం గచ్ఛన్తి=నిర్వికారమ యిన ఆ పదమును పొందుచున్నారు-

అధ్యాత్మనిత్యులనఁగా పరమాత్మస్వరూపమును చూచుటయందు ఆసక్తిగలవారు, కామములు విశేషముగాఁబోయినవారు అనఁగా సం న్యాసులు-అమూఢులనఁగా మోహములేనివారు-అని శంకరభాష్యము-

మానమనఁగా ఆత్మకానిదానిని ఆత్మయనుకొనట- అదియె మో హము- సంగమనఁగా సత్త్వరజస్తమోగుణమయములగు భోగముల యందలి ఆసక్తి- అదియె దోషము- అధ్యాత్మమనఁగా ఆత్మజ్ఞానము- ఆదితప్పమిగిలినయొక్కటియందును కోరికలేనివారు- అమూఢులనఁగా ఆత్మకానిదానిస్వభావములను ఆత్మస్వభావములను తెలిసికొనినవారు-అ వ్యయమైనపదమనఁగా అపరిచ్ఛిన్నమైన జ్ఞానమె ఆకారముగాఁగల ఆత్మను పొందుచున్నారు- నన్ను శరణుఁజొచ్చినవారలకు ఈప్రవృత్తు లన్నియు నాప్రసాదమునను శక్యములైనవై సిద్ధించును- అని రామాను జభాష్యము-

ఈశ్లోకమున సాధనాంతరము చెప్పఁబడుచున్నది- అనిమధ్వభా [ష్యము

న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ॥౬॥

తత్ సూర్యః న భాసయతే=దానిని సూర్యుఁడు ప్రకాశింపఁజేయఁ డు- శశాఙ్కః న(భాసయతే)=చంద్రుఁడు ప్రకాశింపఁజేయఁడు- పావకః న(భాసయతే =అగ్ని ప్రకాశింపఁజేయఁడు- యత్ గత్వా న నివర్తన్తే=దేనిని చేరి మరలరో, తత్ మమ పరమం ధామ-అది నాయొక్క గొప్ప ధామము- (శంకరభాష్యము

ధామమనఁగా విష్ణువుయొక్క తేజోరూపమయిన పదము- అని

ఆత్మలయొక్క జ్యోతిస్సునాసంబంధియగునది-అనఁగా నావిభూతియ గుటచే నాకుఅంశమైనది- సూర్యాదులనుగూడ ప్రకాశింపఁజేయును గాన పరమమనఁబడుచున్నది- జ్ఞానమె అన్నిటిని ప్రకాశింపఁజేయు నది- వెలుపలిజ్యోతిస్సులు (సూర్యచంద్రాదిపావకులు) విషయములకును

ఇంద్రియములకును సంబంధమును కలుగనీని చీకటిని నిరసించుటయను ద్వారమున నుపకరించునది- ఆజ్ఞానమును ప్రకాశింపఁజేయునది యోగము- దానికి విరోధియగునది యనాదియైన కర్మము- దానిని నివర్తింపఁజేయునది భగవత్ప్రపత్తిమూలకంబగు అసంగము మొదలగునది- అని రామానుజభాష్యము.

ఈశ్లోకమున స్వరూపము చెప్పఁబడుచున్నది అనిమధ్వభాష్యము.

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః।
మన ష్షష్ఠా నీన్ద్రియాణి ప్రకృతి స్థాని కర్షతి॥ ౭॥

సనాతనః మమ అంశఏవ=పురాతనమైన నా అంశమే, జీవలోకే జీవభూతః=జీవలోకమున జీవుఁడైనవాఁడు- ప్రకృతిస్థాని మనష్షష్ఠాని ఇన్ద్రియాణి కర్షతి=ప్రకృతియందున్నవియును మనస్సు ఆఱవదిగాఁగలవియునగు ఇంద్రియములను ఆకర్షించుచున్నాఁడు-

పరమాత్మనునారాయణుఁడనునగు నాయొక్క భాగము-నీము గానంశముకాదు- అవిద్యచేతఁగలిగినయుపాధిచేతపరిచ్ఛిన్నమైన ఏకదేశము- జలసూర్యుఁడు అనఁగా జలమునందు ప్రతిఫలించిన సూర్యబింబము సూర్యునియంశమై జలమనెడి నిమిత్తముపోయినతోడనె సూర్యునినె పొంది మఱలనియట్లు ఈయంశముకూడ ఆయాత్మతోనె కలియుచున్నది. ఘటము మొదలగునుపాధులచేత పరిచ్ఛిన్నమైన ఘటాకాశము మొదలగునది ఆకాశముయొక్కయంశమై ఘటము మొదలగునవిపోయినతోడనె ఆకాశమునుపొందిమఱలదు- అట్లె ఇదియును- జీవలోకమనఁగా సంసారము- ప్రకృతియనఁగాఇంద్రియములకుస్థానములగు కర్ణశష్కులి(చెవి) మొదలగునవి-శరీరమునఁబ్రవేశించునప్పుడును ఉత్క్రమించునప్పుడును శ్రోత్రాదులను ఆకర్షించుచున్నాఁడు- అనిశంకరభాష్యము.

వెనుకఁజెప్పఁబడిన సనాతనమగు నాయంశమె ఒకానొకటి అనాదికర్మమనెడి యవిద్యచేత నావరింపఁబడినదై జీవుఁడైజీవలోకమున ప్రకృతిపరిణామవిశేషములగు దేవమనుష్యాది శరీరములలోనుండెడి ఇంద్రియములనుఇటుఅటులాగుచుండును- ఒకానొకఁడు వెనుకఁజెప్పఁబడినమార్గమున ఈయవిద్యనుండిముక్తినిపొందినవాఁడైతనస్వరూప

ముతోసుండును. అని రామానుజభాష్యము-

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥

యత్ శరీరమ్ అవాప్నోతి=ఎప్పుడు శరీరమును పొందుచున్నాఁడో, అపిచ=ఇంతియె కాక, యత్ ఉత్క్రామతి=ఎప్పుడు ఉత్క్రమింపుచున్నాఁడో, (తదా)=అప్పుడు, వాయుః ఆశయాత్ గన్ధానివ=వాయువు వస్తువునుండి వాసననువలె, ఈశ్వరః ఏతాని గృహీత్వా సంయాతి=ఈశ్వరుఁడు వీనిని స్వీకరించి పోవుచున్నాఁడు.

ఈశ్వరుఁడనఁగా దేహాదులకు స్వామియగు జీవుఁడు, ఎప్పుడుఒక క్రొత్తశరీరమునునుండి యుత్క్రమించి మఱియొకక్రొత్తశరీరమునుపొందుచున్నాఁడో అప్పుడు ఆయింద్రియములను స్వీకరించియె పోవుచున్నాఁడు. ఆశయమనఁగా పుష్పము మొదలగునది- అని శంకరభాష్యము.

(యత్ శరీరమ్) ఏశరీరమును పొందుచున్నాఁడో, (యత్)ఏశరీరమునుండి ఉత్క్రమింపుచున్నాఁడో, ఆశరీరమునను౦డెడి యింద్రియములకు ఈశ్వరుఁడైనజీవుఁడు, సూక్ష్మభూతములతోఁగూడనీ యింద్రియములను పట్టియుండియె పోవుచున్నాఁడు-వాయువు పూలు కలు చందనము కస్తూరి మొదలగువానినుండి వానిసూక్ష్మావయవములతోఁగూడ గంధములను స్వీకరించిపోవునట్లు- అని రామానుజభాష్యము.

ఆకర్షింపుచున్నాఁడనుటచే జీవునకు స్వాతంత్ర్యము వచ్చెననియీ శ్లోకము చెప్పఁబడుచున్నది- జీవుఁడు శరీరమును పొందునప్పుడును ఉత్క్రమించునప్పుడును ఈశ్వరుఁడు వీనిని(సూక్ష్మేంద్రియములను)స్వీకరించిపోవుచుండును- గంధములనుఅనఁగా గంధముగలసూక్ష్మావయవములను- అనిమధ్వభాష్యము.

శ్రోత్రం చక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణమేవచ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే॥౯॥

అయమ్=ఈతఁడు, శ్రోత్రం చక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణమేవచ మనశ్చ అధిష్ఠాయ=శ్రోత్రమునును చక్షుస్సునను త్వక్కును రసనమునను ఘ్రాణమునును మనస్సునను అధిష్ఠించి, విష

యాన్ ఉపసేవతే=విషయములను సేవించుచున్నాఁడు. శ్రో
త్రాదులనధిష్ఠించి దేహముననున్నవాఁడై- అని శంకరభాష్య
అధిష్ఠించుటయనఁగా వానివాని పనులయందుఁ బ్రవర్తిం
చుటకు తగినవానిగాఁ జేయుట- ఉపసేవతే=అనుభవింపుచున్నాఁ
డు- అని రామానుజభాష్యము.

ఈతనికి (ఈశ్వరునకు) గూడ భోగము పూర్వము సాధింపఁబడి
నది- ఇంద్రియద్వారమునఁ గూడ ఆతఁడు (ఈశ్వరుఁడు) గూడ ననుభ
వించును. గుణముకలదానిని మాత్రమె అనుభవించును (దుష్టమైనదాని
ని అనుభవింపఁడు)- అని మధ్వభాష్యము.

ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః॥౧౦॥

ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా=శరీరమునుండి వెడలుచు
న్నవాఁడైనను శరీరమునయున్నవాఁడైనను విషయముల ననుభవిం
పుచున్నవాఁడైనను, గుణాన్వితమ్ (ఏనమ్)=గుణములతోఁ గూడినవాఁ
డైన (ఈతనిని), విమూఢాః నానుపశ్యన్తి=మూఢులు చూడరు- జ్ఞా
నచక్షుషః పశ్యన్తి=జ్ఞానమనెడి నేత్రముకలవారు చూచుచున్నారు.

గుణములనఁగా సుఖము దుఃఖము మోహము (అజ్ఞానము) అనున
వి- విమూఢులనఁగా ఇహలోకపరలోకములయందలి భోగములచేనా
కర్షింపఁబడిన మనస్సులుగలవారలగుటచేత అనేకవిధములుగా మో
హమును పొందినవారు- జ్ఞానచక్షుస్సులనఁగా వివేకముతోఁ గూడిన
దృష్టికలవారు- అని శంకరభాష్యము.

గుణాన్వితుఁడనఁగా సత్త్వాదిగుణమయమగు ప్రకృతియొక్క పరి
ణామములగు మనుష్యాదిశరీరములతోఁ గూడియున్నవాఁడు- ఉత్క్రమ
ణము మొదలుగు అన్ని యవస్థలయందును మనుష్యాదిశరీరముకంటె విలక్ష
ణుఁడేయై జ్ఞానైకస్వరూపుఁడగు నాత్మను విమూఢులనఁగా శరీరము
లే యాత్మయనుకొనువారు తెలిసికొనరు- జ్ఞానచక్షుస్సులనఁగా శరీరం
బును ఆత్మయును వేఱు అనెడి వివేకజ్ఞానముకలవారు- అని రామాను
జభాష్యము.

ఆత్మైనచో నేల కనఁబడఁడు? అను శంకకు నుత్తరమీశ్లోకముచేఁ జె

ప్పఁబడుచున్నది. అనిమధ్వభాష్యము.

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥ ౧౧ ॥

యతన్తః యోగినః=ప్రయత్నము చేయుచున్న యోగులు, ఆత్మని అవస్థితమ్ ఏనం పశ్యన్తి=ఆత్మయందున్న వీనిని చూచుచున్నారు- యతన్తోఽపి అకృతాత్మానః అచేతసః=ప్రయత్నము చేయుచున్నవారైనను అశిక్షితమైనయాత్మగల బుద్ధిహీనులు, ఏనం నపశ్యన్తి=వీనిని చూడరు

యోగులనఁగా దివ్యజ్ఞానముఁగలవారు- చూచుటయనఁగా వీఁడున్నట్టివాఁడని తెలిసికొనుట- ఆత్మయందు అనఁగా బుద్ధియందు ఉన్నవాఁడు- అకృతాత్ములనఁగా శాస్త్రము మొదలగుపరిమాణములం బట్టి తపస్సుచేతను ఇంద్రియజయముచేతను సంస్కరింపఁబడని ఆత్మకలవారైదుర్వ్యసనములనుండి మరలనివారును గర్వము ఉడుగనివారును వారు- అచేతసులనఁగా అవివేకులు- అని శంకరభాష్యము.

ప్రయత్నము చేయుచున్నవారనఁగా నన్ను శరణుఁజొచ్చి కర్మయోగాదులనాచరించుచున్నవారై నిర్మలమైనమనస్సులుగలవారలైన యోగులు- ఆత్మయందనఁగా శరీరమునందు- అకృతాత్ములనఁగా వారియెడను ప్రపత్తిలేకపోవుటచేత సంస్కరింపఁబడనిమనస్సులుగలవారు- అచేతసులనఁగా ఆత్మస్వరూపమును చూచుటకు తగిన మనస్సులులేనివారు- అని రామానుజభాష్యము

జ్ఞానముఁబొంద ప్రయత్నముచేయుచున్నవారు- అకృతాత్ములనఁగా అపరిశుద్ధమైనజ్ఞానముకలవారు- అనిమధ్వభాష్యము.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ ౧౨ ॥

ఆదిత్యగతం యత్ తేజః=సూర్యునిబొందియున్న ఏ తేజస్సు, అఖిలం జగత్ భాసయతే=సమస్తమైన లోకమును ప్రకాశింపఁజేయుచున్నదో, చన్ద్రమసి యత్ (తేజః అస్తి)=చంద్రునియందు ఏ (తేజస్సు కలదో), అగ్నౌ చ యత్ (తేజః అస్తి)=అగ్నియందును ఏ (తేజస్సు కలదో), తత్ తేజః మామకం విద్ధి=ఆ తేజస్సును నా

దానినిగాను వెలుంగుము.

సూర్యాదుల వెలుఁగు నాయది- సూర్యాదులయందుండెడి చైతన్యప్రకాశమనియుం జెప్పవచ్చును- చైతన్యజ్యోతిస్సు స్థావరజంగమములన్నిటియందున్నను సూర్యాదులలో సత్త్వగుణము అధికముగానుండుటను తెలివియును అధికముగానుండును- ముఖ మొక్క విధమేయైనను కత్తి మొదలగువానియందు ప్రతిఫలింపదు- అద్దమున ప్రతిఫలించును- అట్లె ఇదియును- అని శంకరభాష్యము

సూర్యాదుల తేజస్సు నాది అనఁగా వారువారు నన్నారాధింపఁగా నాచేత నీఁబడినది. అని రామానుజభాష్యము.

వెనుకఁ జెప్పఁబడిన జ్ఞానమె విస్తరింపఁ జేయఁబడుచున్నది- అని మధ్వభాష్యము.

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా।
పుష్ణామి చౌషధీస్సర్వాః సోమో భూత్వా రసాత్మకః॥౧౩॥

అహం గామ్ ఆవిశ్య= నేను భూమిని చొచ్చి, భూతాని ఓజసా ధారయామి= భూతములను బలముచేత ధరించుచున్నాను- రసాత్మకః సోమః భూత్వా= రసస్వరూపుఁడనైన సోముఁడను అయి, సర్వాః ఓషధీః పుష్ణామి= అన్ని ఓషధులను పోషించుచున్నాను.

భూతములను అనఁగా జగత్తును- ఓజస్సు అనఁగా కామరాగములు లేనిదై జగత్తును ధరించుటకుఁగాను భూమియందు ప్రవేశపెట్టఁబడిన ఈశ్వరసంబంధియైన బలము- ఆ బలముచేత నె భూమి బలువుకలదైనను క్రిందికిపడి విడిపోకయున్నది- ఓషధులనఁగా వ్రీహి(వడ్లు), యవలు, మొదలగునవి. సోముఁడు తనరసమును ఓషధులలోఁ బ్రవేశపెట్టి పోషించుచున్నాఁడు- అని శంకరభాష్యము.

ఓజస్సనఁగా అద్భుతేనిసామర్థ్యము- రసాత్మకుఁడనఁగా అమృతరసస్వరూపుఁడు- అని రామానుజభాష్యము.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥౧౪॥

అహం వైశ్వానరః భూత్వా= నేను వైశ్వానరుఁడను అయి, ప్రాణినాం దేహమ్ ఆశ్రితః= ప్రాణులయొక్క శరీరమును ఆశ్రయించిన

వాఁడనుసు, ప్రాణాపానసమాయుక్తః (శ్వసన్) = ప్రాణవాయువుతోను నపానవాయువుతోనుగూడుకొనినవాఁడ(నునగుచు) చతుర్విధమ్ అన్నం పచామి = నాలుగువిధములగు అన్నమును పక్వముచేయుచున్నాను- వైశ్వానరుఁడనఁగా జాఠరాగ్ని.

దేహమును ఆశ్రయించుటయనఁగా దేహమునజొచ్చుట- భోజ్యము(అన్నము, కూరలు మొదలగునవి), భక్ష్యము(పిండివంట), చోష్యము(జుర్రఁదగినది), లేహ్యము(నాకఁదగినది), అని యన్నము నాలుగువిధములు- భుజించువాఁడు వైశ్వానరాగ్ని- భుజింపఁబడెడి యన్నము సోముఁడు- కాఁబట్టి సర్వంబును ఈయగ్నీషోములె అనితలఁచువానికి అన్నదోషము అంటదు- అనిశంకరభాష్యము.

ఖాద్యము(నమలఁదగినది), చోష్యము(పాయసము మొదలగునది), లేహ్యము(పచ్చడి), పేయము(త్రాగఁదగినది), అని నాలుగువిధములు- ప్రాణాపానవృత్తిభేదములతోఁగూడినవాఁడనై - అని రామానుజభాష్యము.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో,
మత్తః స్మృతిర్జ్ఞానమపోహనంచ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో,
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్॥౧౫॥

అహం సర్వస్య హృది సన్నివిష్టః = నేను అందఱియొక్క హృదయమునందు ఉన్నవాఁడను- స్మృతిః జ్ఞానమ్ అపోహనంచ మత్తః (భవన్తి) = తలంపును జ్ఞానంబును అజ్ఞానంబును నావలన (కలుగుచున్నవి). సర్వైః వేదైః వేద్యః అహమేవ = అన్ని వేదములచేతను తెలియఁబడఁదగినవాఁడను నేనె- అహం వేదాన్తకృత్ = నేను వేదాంతములను జేసినవాఁడను- వేదవిచ్చ అహమేవ = వేదముల నెఱిఁగినవాఁడను నేనె.

నేను ఆత్మనై హృదయమునయున్నాను- అపోహనమనఁగా స్మృతిజ్ఞానములు లేకపోవుట- పుణ్యముగలవారలకు స్మృతిజ్ఞానములు కలుగును- పాపముగలవారలకు అవి లేకపోవుటకలుగును- వేదాంతములయర్థముల సంప్రదాయములను నడపించినవాఁడు వేదాంతకృత్తు- వేదవి

త్తముగా వేదార్థము నెఱింగినవాఁడు- అని శంకరభాష్యము-

అసోమ వైశ్వానరులకును సమస్తమైన భూతసమూహము నకును ప్రవృత్తినివృత్తులకన్నిటికిని మూలంబగు జ్ఞానముపుట్టెడి ప్రదేశమయిన హృదయమునందు, సమస్తమైనదానిని సంకల్పము చేతనియమింపుచున్నవాఁడనై ఆత్మగా నున్నాను- స్మృతియనఁగా తెలిసికొనినదానిని తలంచుట- జ్ఞానమనఁగా ఇంద్రియముల చేతనును లింగములు గుటులు చేతనును శాస్త్రముచేతనును యోగసిద్ధిచేతనునుగలిగెడినిశ్చయము-అపోహనమనఁగాజ్ఞానము లేకపోవుట-ఊహాయనియుం జెప్పవచ్చును-ఊహాయనఁగా ఈ ప్రమాణముఇట్లు ప్రవర్తింపఁడగుచున్నదనిఆప్రమాణపుసామగ్రి మొదలగువానినిరూపించుట చేఁగలిగి ప్రమాణమునకు సహాయము చేసెడి జ్ఞానము- అగ్నిసూర్యాదులకుఁగూడ నేనంతర్యామినిగాన వారలనుప్రతిపాదించెడి వేదభాగములచేఁగూడ నేనె తెలియఁబడుదును- వేదములయంతమనఁగా ఫలము- వేదములలోఁజెప్పఁబడిన ఫలము నిచ్చువాఁడను నేనె- ఇట్లు నన్ను జెప్పెడి వేదమును నేనె యెఱుంగుదును- ఇట్లు కాక మఱియొకవిధముగా వేదార్థమును చెప్పువాఁడు వేదము నెఱుంగువాఁడు కాఁడు- అని రామానుజభాష్యము,

వేదాంతశబ్దముచే వేదనిర్ణయముస్వరూపముగాఁగల మీమాంస చెప్పఁబడుచున్నది- అనిమధ్వభాష్యము.

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థో-ఽక్షర ఉచ్యతే॥౧౬॥

లోకే=లోకమునందు, క్షరశ్చ అక్షర ఏవ చ=క్షరుఁడును అక్షరుఁడును, (ఇతి) ఇమౌ ద్వౌ పురుషౌ (స్తః=(అనెడి) ఈ ఇద్దరు పురుషులు (కలరు)- సర్వాణి భూతాని క్షరః=అన్ని భూతములును క్షరుఁడు- కూటస్థః అక్షర(ఇతి) ఉచ్యతే=కూటస్థుఁడు అక్షరుఁడని చెప్పఁబడుచున్నాఁడు-

లోకమునందు అనఁగా సంసారమునందు- రెండు మొత్తములును పురుషులనఁబడును- అందు నశించునదియెల్లను క్షరపురుషుఁడు- అక్షరపురుషుఁడనఁగా క్షరపురుషోత్పత్తికిమూలమగు భగవంతునిమాయాశ

క్తి- అది సంసారిజంతువులకామకర్మాదిసంస్కారములకు ఆధారమైనది- సర్వభూతములనఁగా వికారములన్నియును- కూటమనఁగా రాశి (ప్రోగు)- దానివలెనున్నదికూటస్థము- కూటమనఁగా మోసము, అప్రకారమున్నదికూటస్థమనియుం జెప్పవచ్చును- సంసారబీజమునకు అంతము లేదుగాన అక్షరశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది- అనిశంకరభాష్యము.

క్షరపురుషుఁడనఁగా సంసారి- అక్షరుఁడనఁగా ముక్తుఁడు- సంసారసంసర్గము సంసారవియోగము అనెడి రెండుఉపాధులనుబట్టి క్షరుఁడు అక్షరుఁడు అనిపకవచనములుగాఁ జెప్పఁబడినవి- కాలము అనాదిగాన ముక్తులుగూడ ననేకులు కలిగియున్నారు- అచేతనపరిణామములగు బ్రహ్మాదిశరీరములకు అసాధారణుఁడు కాఁడుగాన కూటస్థుఁడనఁబడుచున్నాఁడు- అనిరామానుజభాష్యము.

క్షరభూతములనఁగా బ్రహ్మ మొదలుగు జీవులు- కూటస్థ మనఁగా ప్రకృతి- అనిమధ్వభాష్యము.

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥౧౭॥

ఉత్తమః అన్యః పురుషస్తు=ఉత్తముఁడైన మఱియొకఁ పురుషుఁడో, పరమాత్మా ఇతి ఉదాహృతః=పరమాత్మ అని (వేదాంతములలోఁ) జెప్పఁబడినవాఁడు- యః=ఎవ్వఁడు- లోకత్రయమ్ ఆవిశ్య బిభర్తి=మూఁడులోకములను చొచ్చి భరించుచున్నాఁడో, అవ్యయః ఈశ్వరః(చ భవతి)=నాశములేనివాఁడును ఈశ్వరుఁడు(ను అగుచున్నాఁడో)

అన్యుఁడనఁగా విలక్షణుఁడు- పరమాత్మ యనఁగా దేహాద్యవిద్యలచేఁ గలుగఁజేయఁబడిన యాత్మల(అన్నమయాదులగునయిదుకోశముల)కంటెగొప్పవాఁడగు ప్రత్యగాత్మ- ఈశ్వరుఁడనఁగా పరిపాలించెడినారాయణుఁడు - అనిశంకరభాష్యము

అన్యుఁడనఁగా బద్ధముక్తులకంటె వేఱైనవాఁడు-లోకత్రయ మనఁగా అచేతనంబును దానితోఁ జేరియున్నజీవుఁడును ముక్తుఁడును- ఈమూఁడింటికిని ఆత్మయై లోపల ప్రవేశించి- అనిరామానుజభాష్యము-

యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః।
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః॥౧౮॥

యస్మాత్ అహమ్ క్షరమ్ అతీతః=ఎందువలన నేను క్షరపురుషుని అతిక్రమించితినో, అక్షరాదపిచ ఉత్తమః=అక్షరపురుషునికం టెనును ఉత్తముఁడనో, అతః=ఇందువలన, లోకే వేదేచ పురుషోత్తమఇతి ప్రథితః=లోకమునందును వేదమునందును పురుషోత్తముఁడనని ప్రసిద్ధుఁడను-

క్షరమను అనఁగాఅశ్వత్థమనుపేరుగల సంసారమాయావృక్షము- అక్షరమనునది దానికిబీజమైనది-ఉత్తముఁడనఁగాఉత్కృష్టుఁడైనను పైవాఁడైనను- కవులు కావ్యములలోఁగూడ పురుషోత్తముఁడనియెదరు- అనిశంకరభాష్యము.

లోకమనఁగా స్మృతి- అని రామానుజభాష్యము.

యోమా మేవ మసంమూఢో జానాతి పురుషోత్తమమ్।
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత॥౧౯॥

యః=ఎవ్వఁడు, పురుషోత్తమం మామ్=పురుషోత్తముఁడనయిన నన్ను, అసంమూఢః(సన్) ఏవం జానాతి=మోహములేనివాఁడు(అగుచు) ఇట్లు తెలిసికొనుచున్నాఁడో, సః సర్వవిత్=వాఁడు అన్నియు నెఱుంగువాఁడు, (హే)భారత!=(ఓ)భరతవంశమువాఁడా!, సః సర్వభావేన మాం భజతి=వాఁడు సర్వవిధముగానును నన్ను భజించుచున్నాఁడు.

తెలిసికొనుటయనఁగా నేనిట్టివాఁడనని తెలిసికొనుట· స్వభావము కోననఁగా సర్వాత్మచింతతో- అనిశంకరభాష్యము

సర్వవిత్తు అనఁగా నన్నుజెందుటకుసాధనముగా తెలియవలసినదంతయు తెలిసికొనినవాఁడు- సర్వభావమున భజించుచున్నాఁడు అనఁగా నన్నుబొందుటకు ఎన్నివిధములగు భజనప్రకారములుచెప్పఁబడినవో, వానియన్నిటిచేతను నన్ను భజించుచున్నాఁడు- నన్నుగూర్చినజ్ఞానము'న్నిటిచేతను భజనప్రకారములన్నిటిచేతనునాకుకలిగెడిప్రీతి, ఇట్లు తెలిసికొనుటచేత కలుగుననుట- అనిరామానుజభాష్యము.

ఇతి గుహ్యతమం శాస్త్రమిద ముక్తం మయానఘ।

ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యా త్కృతకృత్యశ్చ భారత। ౨౦।

(హే)అనఘ=(ఓ)నిర్దోషుఁడా, ఇతి=ఇట్లు, గుహ్యతమం ఇదం శాస్త్రం మయా ఉక్తమ్=మిక్కిలిరహస్యమయిన ఈశాస్త్రము నాచేత చెప్పఁబడినది- (హే)భారత=(ఓ)భరతవంశమువాఁడా! ఏతత్ బుద్ధ్వా=దీనిని తెలిసికొని, బుద్ధిమాన్ కృతకృత్యశ్చస్యాత్=బుద్ధిమంతుఁడును కృతకృత్యుఁడును అగును.

శాస్త్రమనఁగా భగవద్గీతలన్నియు నైనను,స్తోత్రముకొఱకు ఇచ్చట నీయధ్యాయముమాత్రమె చెప్పఁబడును- దీనిలోగీతాశాస్త్రము నర్థమంతయు నెఱిఁగి సమస్తవేదార్థంబును గూడఁ జెప్పఁబడినది- కృతకృత్యుఁడనఁగా ఎవ్వనిచేత చేయఁబడవలసినదంతయు చేయఁబడినదోవాఁడు- మంచిపుట్టుకకల బ్రాహ్మణుఁడు ఏమేమిచేయవలయునో అదియంతయును భగవత్తత్త్వము తెలిసినతోడనె చేయఁబడినది అగును- ఓయర్జునుఁడా, ఇట్టిపరమార్థతత్త్వమును నావలన వింటివిగాన నీవు కృతార్థుఁడవు- అనిశంకరభాష్యము.

నన్నుబొందువానికి కావలసినజ్ఞానమంతయు కలవాఁడగును-వాఁడు చేయవలసినదంతయుచేసినవాఁడునగును- వెనుకఁ జెప్పఁబడినపురుషోత్తమజ్ఞానమె దీనినంతయును జేయును, ప్రత్యక్షరూపమైనజ్ఞానము కాదు, అని ఈశ్లోకమునఁ జెప్పఁబడుచున్నది. అనిరామానుజభాష్యము.

ఇతిశ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాంయో
గశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమ
యోగోనామపఞ్చదశోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకం
బును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబు నగు
భగవద్గీతలలోపురుషోత్తమయోగప్రతిపాదకం
బగుపదునేనవయధ్యాయము.

---

## పదునారవ యధ్యాయము.

### శ్రీభగవానువాచ.

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥ ౧॥
అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్॥
దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్॥
తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా।
భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత॥ ౩॥

(హే) భారత! = (ఓ) భరతవంశమువాఁడా!, అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః = భయములేకపోవుటయును అంతఃకరణపరిశుద్ధియును జ్ఞానయోగాచరణంబును, దానందమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయః తపః ఆర్జవమ్ = ఈవియును వెలుపలి యింద్రియములను నిగ్రహించుటయును యజ్ఞంబును వేదాధ్యయనంబును తపస్సును ఋజుత్వంబును, అహింసా సత్యమ్ అక్రోధః త్యాగః శాన్తిః అపైశునమ్ = ఇతరులను బాధింపకపోవుటయును సత్యంబును కోపము లేకపోవుటయును త్యాగంబును అంతఃకరణనిగ్రహంబును కొండెగాఁడు కాకపోవుటయును, భూతేషు దయా అలోలుప్త్వం మార్దవం హ్రీః అచాపలమ్ - ప్రాణులయందు కనికరంబును అలోలుపత్వంబును మృదుత్వంబును సిగ్గును చపలత లేకపోవుటయును, తేజః క్షమా ధృతిః శౌచమ్ అద్రోహః నాతిమానితా - తేజస్సును ఓరిమియును ధైర్యంబును పరిశుద్ధియును ద్రోహము లేకపోవుటయును అభిమానము లేకపోవుటయును, దైవీం సంపదం అభిజాతస్య భవన్తి - దేవసంబంధియగు సంపదను పుట్టినవానికి కలుగుచున్నవి-

అంతఃకరణపరిశుద్ధియనఁగా లోకవ్యవహారములో పరులను మోసపుచ్చుట, అసత్యము, మొదలగువానిని విడుచుట. జ్ఞానమనఁగా శాస్త్రములవలనఁగానీ ఆచార్యునివలనఁగానీ ఆత్మ మొదలగు పదార్థములను తెలిసికొనుట-ఇంద్రియములను ఉపసంహరించి ఏకాగ్రచిత్తమున ఆ పదార్థములను తన యనుభవమునకుఁ దెచ్చికొనుట యోగము - వ్యవస్థితి

యనఁగా నిష్ఠ - ఇదియె ప్రధానమైన దైవసంపత్తు - దానమనఁగా తనశక్తికొలఁది అన్నము మొదలగువానిని పంచిపెట్టుట. యజ్ఞమనఁగా శ్రౌతమైన అగ్నిహోత్రాదికంబును స్మార్తంబగు దైవయజ్ఞాదికంబును - ప్రయోజనమును కోరక ఋగ్వేదాదులను అధ్యయనము చేయుట స్వాధ్యాయము - తపస్సు, ఇంక (౧౭అ॥ ౧౪శ్లో॥) చెప్పఁబడెడి శారీరము మొదలగునది - సత్యమనఁగా అనిష్టము కాని యథార్థస్థితిని చెప్పుట - అక్రోధమనఁగా పరులు కోపించినను కొట్టినను తనకుఁ గలిగెడి కోపమును అణఁచికొనుట - త్యాగమనఁగా సంన్యాసము - పైశునమనఁగా ఒకని ఛిద్రమును మఱియొకనికి చెప్పుట - దుఃఖించిన భూతములయందు దయ - అలోలుపత్వ మనఁగా విషయములు సంనిహితములైనను ఇంద్రియములు వికసింపకపోవుట - మార్దవమనఁగా క్రౌర్యము లేకపోవుట - చాపలమనఁగా ప్రయోజనమేమియు లేకయె వాక్కు చేతులు కాళ్లు మొదలగువానిచేఁ బని చేయుట - తేజస్సనఁగా ప్రాగల్భ్యము - శరీరచర్మమునందలి కాంతి కాదు - క్షమయనఁగా తిట్టినను కొట్టినను లోపల వికారము లేకయుండుట - దేహమును ఇంద్రియములను నీరసించినచో దానిని పోఁగొట్టెడియంతఃకరణవృత్తివిశేషము ధైర్యము - ఆ ధైర్యముచేత దృఢపడినవై శరీరేంద్రియములు నీరసింపవు - శౌచమనఁగా మంటితోను నీటితోనును చేసెడి బాహ్యశౌచంబును మాయ రాగము మొదలగు కాలుష్యములు లేకపోవుట స్వరూపముగాఁ గల మనోబుద్ధుల నైర్మల్యమనెడి యాభ్యంతరశౌచంబును - అద్రోహమనఁగా పరుని బాధింపఁగోరకపోవుట. అతిమానమనఁగా తాను మిక్కిలి పూజ్యుఁడని తలంచుట - అది లేకపోవుట నాతిమానిత - దైవసంపదను బుట్టినవాఁడనఁగా దేవతల విభవమునకుఁ దగినవాఁడు - అనఁగా కలుగఁబోయెడి మేలుకలవాఁడు - అని శంకరభాష్యము,

భయమనఁగా తనకు ఇష్టమైనది కలుగకపోవుటకును అనిష్టము కలుగుటకును హేతువులు కనఁబడుటచేఁ గలిగిన దుఃఖము - అది లేకపోవుట అభయము - అంతఃకరణమునకు పరిశుద్ధియనఁగా రజస్తమస్సులతో సంపర్కము లేకపోవుట - జ్ఞానయోగమనఁగా ప్రకృతిసంపర్కము లేని యాత్మస్వరూపమును పక్ష్పలుచుట - దానమనఁగా న్యాయముగా

సంపాదించినధనమును తగినవానికి ఇచ్చుట- దమమనఁగామనస్సు
ను విషయముల వైపుతిరుగకుండఁ జేయుట- యజ్ఞమనఁగా ఫలము ను
గోరకభగవదారాధనరూపముగాపంచమహాయజ్ఞాదులనాచరించుట-
స్వాధ్యాయమనఁగా విభూతివిశిష్టుఁడగు భగవంతునిని అతనియా
రాధనప్రకారమునును ప్రతిపాదించునదియె వేదమంతయునని తలంచు
చు వేదములనభ్యసించుట--తపస్సనఁగాభగవంతునిప్రీతినికలుగఁ జేసెడి
పనులనుఁ జేయుటకు యోగ్యతను కలుగఁ జేసెడి కృచ్ఛ్రము చాంద్రాయణ
ము ద్వాదశ్యుపవాసము మొదలగువానిని చేయుట-ఇతరులవిషయమున
మనోవాక్కాయముల ప్రవృత్తులు ఒక్కవిధముగానుండుటయార్జ
వము- హితమైన యథార్థస్థితిని జెప్పుటసత్యము- అక్రోధమనఁగా
పరులను బాధించెడి చిత్తవికారము లేకపోవుట- త్యాగమనఁగా తనకు
హితములుకానివానినివిడుచుట- శాంతియనఁగా ఇంద్రియములు వి
షయములయందు ఆసక్తములుకాకుండుటను అభ్యసించుట- అపైశు
నమనఁగా పరులకుఅనర్థమును కలుగఁజేసెడివాక్యమును తెలియఁ జే
యకపోవుట- అన్ని భూతములయెడనుదుఃఖమునుసహింపనిస్వభావ
ము దయ- అలోలుప్త్వమనఁగాఅలోలుపత్వము- విషయములయందు
నిస్పృహుఁడై యుండుట- అలోలుత్వమనుపాఠమునఁగూడ నిదియె
యర్థము- మార్దవమనఁగా కఠినుఁడు కాకపోవుట-
సత్పురుషులతోఁ గలిసికొనుటకు తగుటయనుట- చే
యరానిపనిని చేయుటయందు సిగ్గు- అచాపలమనఁగా కోరఁదగి
నవిషయముదగ్గ ఉన్నను కదలకపోవుట- తేజస్సనఁగా దుర్జనుల
చేఁదిరస్కరింపఁబడకయుండుట- క్షమయనఁగా ఒక్కని నొక్కఁడు
బాధించినను బాధించినవానియెడను చిత్తవికారము లేకుండుట- ధృతి
యనఁగా గొప్పయాపదకలిగినను చేయవలసినదానిని చేయుచునేయుం
డుట- శౌచమనఁగా శాస్త్రమునచెప్పినచొప్పున బాహ్యములుఅభ్యం
తరములునగు కరణములు(ఇంద్రియములు) కర్మాచరణమునకు తగి
యుండుట- అద్రోహమనఁగా ఇతరులు యథేష్టముగా సంచరించుట
కు అడ్డముకలుగఁజేయకపోవుట- అతిమానిత్వమనఁగా ప్రసక్తి లేనిదె
గర్వపడుట. అదిలేకపోవుటనాతిమానిత- దేవులనఁగాభగవంతునియాజ్ఞ

ములనువర్తించుటయే స్వభావముగాఁగలవారు. వారిసంపత్తు అనఁగా భగవంతుని యాజ్ఞను అనువర్తించుటయే. దానిని జరుపుటకు పుట్టినవానికి ఇవి కలుగును. అని రామానుజభాష్యము.

పురుషార్థసాధనమునకు విరోధులగునవి ఈయధ్యాయమున చూపఁబడును- తపస్సనఁగా బ్రహ్మచర్యము మొదలగునది- పైశునమనఁగా ఇతరులకు ఉపద్రవములు కలుగునట్లు వారలదోషములను రాజు మొదలగువారలకు చెప్పుట- (అలోలత్వమని పాఠము) లౌల్యమనఁగా రాగము- అచాపలమనఁగా స్థైర్యము- క్షమయనఁగా కోపము లేకపోవుట యెకాక అపకారము చేసినవానికి అపకారము చేయకపోవుట- అనిమధ్వభాష్యము.

దమ్భో దర్పోఽతిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్॥౪॥

(హే) పార్థ! = ఓకుంతీపుత్రుఁడా!, దమ్భః దర్పః అతిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ అజ్ఞానం చ = దంభంబును గర్వంబును అతిమానంబును కోపంబును పరుసదనంబును తెలివితక్కువయును, ఆసురీం సంపదమ్ అభిజాతస్య (భవన్తి) -అసురసంబంధియగు సంపదను పుట్టినవానికి (కలుగుచున్నవి)-

దంభమనఁగా ధర్మము ననుతావాచరించునట్లు ప్రకటన చేయుట- దర్పమనఁగా ధనంబును తనకు కావలసినవారును కలుగుటను గలిగెడి గర్వము- పారుష్యమనఁగా పరుషములైన మాటలు చెప్పుట- ఎట్లన్నను గ్రుడ్డివానిని కండ్లు కలవాఁడును, సౌందర్యము లేనివానిని సౌందర్యము కలవాఁడును, తక్కువకులమునఁ బుట్టినవానిని గొప్పకులమునఁ బుట్టినవాఁడును, ఎమటనె కఠినపుమాటలను జెప్పుట- అజ్ఞానమనఁగా చేయవలసినదియు చేయరానిదియు నేర్పాటుగాఁ దెలియకపోవుట-అని శంకరభాష్యము-

దంభమనఁగా తాను ధార్మికుండనుకొనుటకై ధర్మమునాచరించుట- దర్పమనఁగా విషయములననుభవించుటచేఁగలిగి చేయవలసినవానిని చేయరానివానిని పర్వటువనీని సంతోషము- అతిమానమనఁగా తనకుఁగలిగినవిద్యావంశములకుతగని యభిమానము-క్రో

ర్థమనఁగా పరులనిబాధించుటకొఱకైనచిత్తవికారము- పారుష్యమనఁగా సత్పురుషులకు ఉద్వేగింపునకలుగఁజేసెడిస్వభావము- అజ్ఞానమనఁగా పరాపరతత్త్వములనును కృత్యాకృత్యములను నెఱుఁగకపోవుట- అసురశబ్దముభగవంతునియాజ్ఞనుమీఱువారలనుచెప్పును. అని రామానుజభాష్యము

దైవీ సంపద్విమోక్షాయ నిబన్ధా యాసురీ మతా,
మా శుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ॥౫॥

దైవీ సంపత్ విమోక్షాయ మతా=దేవసంబంధియగు సంపత్తు బంధమునువదలుటకొఱకు (గాను) తలంపఁబడినది- ఆసురీ నిబన్ధాయ మతా=ఆసురసంపత్తు బంధముకొఱకుగాను తలంపఁబడినది-(హే)పాణ్డవ!=(ఓ)పాండవుఁడా!, దైవీం సంపదమ్ అభి జాతః అసి=దేవసంబంధియగుసంపదను పుట్టినవాఁడవు అగుచున్నావు. మా శుచః=శోకింపకుము. (భావము.

నీవు కలుగఁబోయెడిమేలుకలవాఁడవు అనియర్థము. అనిశంకరభాష్యము.

నాయాజ్ఞనుఅనువర్తించుటయనెడి దైవసంపద్క్రమముగా సమ్సారబంధమునుండి విడుదలనొందుటకొఱకుఅగును- నాయాజ్ఞనుఅతిక్రమించుటయనెడియాసురసంపద అధోగతి(క్రిందిగతి)ని పొందుటకొఱకుఅగును. అని రామానుజభాష్యము.

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు॥౬॥

అస్మిన్ లోకే=ఈ లోకమునందు, దైవః ఆసురః ఏవ చ (ఇతి)=దైవంబును ఆసురంబును (అని), ద్వౌ భూతసర్గౌ స్తః=రెండు భూతసర్గములు (కలవు)- దైవః విస్తరశః ప్రోక్తః=దైవము విస్తారముగా చెప్పఁబడినది- (హే)పార్థ!-(ఓ)కుంతీపుత్రుఁడా!, ఆసురం మే (సకాశాత్) శృణు=ఆసురమును నా (వలన) వినుము.

భూతసర్గములనఁగా సృజింపఁబడిన భూతములు- అందు దైవసర్గము అభయం సత్త్వసంశుద్ధిః(౧౬అ॥౧శ్లో॥) అనునదిమొదలువిస్తరముగాఁజెప్పఁబడినది- వినుటకొఱకుఆసురమునుగూడవిస్తరముగా వినుము. అని శంకరభాష్యము.

ఈకర్మలోకమున - భూతసర్గము లనఁగా భూతములపుట్టుకలు- పురాతనపుణ్యపాపములననుసరించి భగవదాజ్ఞను అనుసరించుటకుఁ గొందఱును దాఁటుటకుఁ గొందఱును అనియిట్లు పుట్టునప్పుడె ఏర్పాటుగాఁ బుట్టుదురనుట- నాయాజ్ఞన అనువర్తించువారిపుట్టుక ఎట్టి యాచారముకొఱకో ఆయాచారము, కర్మయోగజ్ఞానయోగభక్తియోగరూపమైనది, ఈవఱకును విస్తరముగాఁ జెప్పఁబడినది- ఇఁక నసురసంపదయాచారమును వినుము- అని రామానుజభాష్యము.

ప్రవృత్తించనివృత్తించ జనా నవిదు రాసురాః।
నశౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥ ౭॥

ఆసురాః జనాః=అసురులను జనులు, ప్రవృత్తించ నివృత్తించ నవిదుః=ప్రవృత్తినిని నివృత్తినిని ఎఱుఁగరు- తేషు శౌచం (నవిద్యతే)=వారియందు శౌచము (లేదు)- ఆచారోఽపి (నవిద్యతే)=ఆచారంబును (లేదు)- సత్యం నవిద్యతే=సత్యము లేదు.

పురుషార్థసాధనమునందు ప్రవర్తించుటనుఅనర్థహేతువునందునివర్తించుటను- అసురులు ఆచారములేనివారును మాయగలవారును అసత్యమును పలుకువారునుగదా- అని శంకరభాష్యము.

ప్రవృత్తియనఁగా స్వర్గాదులనుకలుగఁ జేసెడి వైదికధర్మము- నివృత్తియనఁగా మోక్షసాధనము- శౌచమనఁగా వైదికకర్మములను ఆచరించుటకు శాస్త్రమునఁ జెప్పినచొప్పునతగియుండుట- బాహ్యశౌచంబును అంతశ్శౌచంబును గూడ లేదు- ఈశౌచముకలుగుటకు సాధనమయినఆచారమనఁగా సంధ్యావందనము మొదలగునదియును లేదు- తాను గన్నచొప్పున భూతములకు హితమైనదానిని చెప్పుట సత్యము- అని రామానుజభాష్యము.

అసత్యమప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్॥ ౮॥

తే-వారు- జగత్=జగత్తును, అసత్యమ్ అప్రతిష్ఠమ్ అనీశ్వరమ్ అపరస్పరసంభూతమ్ ఆహుః=అసత్యముగాను ప్రతిష్ఠ లేనిదానిగాను ఈశ్వరుఁడు లేనిదానిగాను ఒకదానివలననొకటిపుట్టిన దానినిగాను చెప్పుచున్నారు- అన్యత్ కిమ్ (అస్తి?) వేఱు ఏమి

(ఉన్నది?)- కామహైతుకమ్ (ఆహుః)=కామమే హేతువుగాఁగలదానిగా (చెప్పుచున్నారు)

మనము అసత్యప్రాయులమైనట్లే ఈజగత్తును అసత్యమే- జగత్తునకు ధర్మాధర్మములు ప్రతిష్ఠ- (ప్రతిష్ఠయనఁగా వ్యవస్థకు హేతువైనది- అనిమధు॥) అదిలేనిదానిగాఁ జెప్పుచున్నారు- ఆధర్మాధర్మములనుబట్టి ఈజగత్తును శాసించెడి ఈశ్వరుఁడు లేఁడందురు- అపరస్పరసంభూతమనఁగా అన్యోన్యము పుట్టినది- స్త్రీపురుషులయన్యోన్యసంయోగము వలననె జగత్తంతయు పుట్టినదందురు- కామహైతుకమనఁగా కామహేతుకము- కామముతప్పఅదృష్టాదులుహేతువులుగాఁగలదికాదందురు- ఇదిలోకాయతమతము- అనిశంకరభాష్యము.

అసత్యమనఁగా సత్యశబ్దముచేఁ జెప్పఁబడినబ్రహ్మమునాత్మగాఁగలదికాదందురు- బ్రహ్మమునందు(ప్రతిష్ఠితం)ఉన్నదిఅనియును చెప్పరు- బ్రహ్మంబగు ననంతునిచేఁగదా ఈభూమిధరింపఁబడినదై అన్నిలోకములను ధరింపుచున్నది- సత్యసంకల్పుఁడును పరబ్రహ్మంబును సర్వేశ్వరుఁడునగునాచేత నియమింపఁబడినదనియును చెప్పరు- అపరస్పరసంభూతమ్ అన్యత్ కిమ్ (అస్తి)=ఒకదానివలననొకటిపుట్టనిది మఱియొక్కటి ఏది (ఉన్నది?)-స్త్రీపురుషులయన్యోన్యసంబంధముచేతఁబుట్టినవిగా మనుష్యులు పశువులు మొదలగునవి యన్నియును కనఁబడుచున్నవిగాని అట్టిదికానిదికనఁబడదు- కామహైతుకమ్అనియెపాఠము- కాఁబట్టి జగత్తంతయు కామమె హేతువుగాఁగలది- అనిరామానుజభాష్యము.

జగత్తునకు సత్యంబును (సృష్ట్యాదికారణంబును) ప్రతిష్ఠయును ఈశ్వరుఁడునవిష్ణువే- దీనికి విరుద్ధముగాఁ జెప్పుదురు- అన్నాద్భవంతి భూతాని (౩అ॥౧౪శ్లో॥) ఇత్యాదికముచేత అన్యోన్యముపుట్టుటచెప్పఁబడినది- అనిమధ్వభాష్యము.

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతో హితాః॥౯॥

ఏతాం దృష్టిమ్ అవష్టభ్య=ఈ దృష్టిని అవలంబించి, నష్టాత్మా

నః అల్పబుద్ధయః ఉగ్రకర్మాణః అహితాః(శ్చ సన్తః)=చెడఁగొట్టఁబడినఆత్మలుకలవారును స్వల్పబుద్ధికలవారును క్రూరమ్ములైనపనులుగలవారును శత్రువులు(నగుచు), జగతః క్షయాయ ప్రభవన్తి =జగత్తునొక్క క్షయముకొఱకు పుట్టుచున్నారు-

అవష్టభ్య-ఆశ్రయించి, నష్టాత్మలు=నష్టస్వభావులు- అనఁగా పరలోకసాధనములకుఁ జెడినవారనుట- అల్పమైనబుద్ధి, విషయములంగూర్చినది- ఉగ్రకర్మాణః=హింసించుటయెస్వభావముగాఁగలవారు- జగత్తునకు శత్రువులు- అనిశంకరభాష్యము.

నష్టాత్మలనఁగా దేహముకన్న వేఱుగా నాత్మను తెలిసికొననివారు- ఘటాదులవలె తెలియఁబడెడి వస్తువైన శరీరమును తెలిసికొనువాఁడగునాత్మ దేహముకంటె వేఱుగానున్నాఁడని తెలిసికొనలేరుగాన అల్పబుద్ధులు-అనిరామానుజభాష్యము. (జగతోఽశుభాః అనిరామానుజభాష్యపుస్తకమునను న్నది-)

కామ మాశ్రిత్యదుష్పూరం దమ్భమాన మదాన్వితాః।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ప్రవర్తన్తేఽశుచివ్రతాః॥

దుష్పూరం కామమ్ ఆశ్రిత్య=నింపశక్యముకాని కామమును ఆశ్రయించి, మోహాత్ అసద్గ్రాహాన్ గృహీత్వా=మోహమువలన చెడ్డపట్టుదలలను పట్టి, దమ్భమానమదాన్వితాః అశుచివ్రతా(శ్చ సన్తః=దంభమానమదములతోఁగూడినవారును అపరిశుద్ధములైన వ్రతములుగలవారు(నగుచు) ప్రవర్తించుచున్నారు

కామమనఁగా ఒక్కవిధమగు కోరిక- మోహమనఁగా అవివేకము. అసద్గ్రాహములనఁగా శుభములుకాని నిశ్చయములు- అనిశంకరభాష్యము

దుష్పూరమనఁగా పొందరానివిషయములకై- మోహమనఁగా అజ్ఞానము- అసద్గ్రాహములనఁగా అన్యాయముచేత గ్రహింపఁబడిన పరిగ్రహములు- అశుచివ్రతులనఁగా శాస్త్రమునవిధింపఁబడని వ్రతములుగలవారు. అని రామానుజభాష్యము.

చిన్తామపరిమేయాంచ ప్రళయాన్తాముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః॥౧౧॥

అపరిమేయాం ప్రళయాన్తాంచ చిన్తామ్ ఉపాశ్రితాః=కొలఁదిగానిదియు మరణమె అంతముగాఁగలదియునగు చింతను ఆశ్రయించినవారు - కామోపభోగపరమాః = కామములననుభవించుటయెగొప్పదిగాఁగలవారై, ఏతావత్ ఇతి నిశ్చితాః=ఇంతియ అని నిశ్చయించికొనినవారు

ఎప్పుడును చింతింపుచునేయుండువారు- కామములనఁగా శబ్దాదివిషయములు- వానిని అనుభవించుటయె గొప్పపురుషార్థమనినిశ్చయించికొనినవారు- అనిశంకరభాష్యము.

ఈదినముననో రేపో చావనున్నవారై ప్రళయాంతమనఁగా ప్రాకృతప్రళయమువఱకును సాధింపవలసినవిషయముగలచింతనుఆశ్రయించినవారు. అని రామానుజభాష్యము.

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః।
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్॥

ఆశాపాశశతైః బద్ధాః=ఆశల నెడియ నేకములయినయుచ్చులచేతఁగట్టఁబడినవారును, కామక్రోధపరాయణాః(సన్తః)= కామక్రోధములె ముఖ్యములుగాఁగలవారును(అగుచు), కామభోగార్థమ్ అన్యాయేన అర్థసంచయాన్(ప్రతి) ఈహన్తే=విషయముల ననుభవించుటకొఱకు అన్యాయముగా ధనసమూహములను(గూర్చ) పనిచేయుచున్నారు-

ఆశాపాశములచేతఁ గట్టఁబడిఅంతటను ఈడ్వఁబడుచున్నవారై- పరాయణమనఁగా గొప్పయాధారము- అన్యాయముగాననఁగా పరద్రవ్యాపహరణము మొదలగువానిచేత- ధర్మార్థముకాక, కామములననుభవించుటకొఱకు- అనిశంకరభాష్యము.

కామక్రోధైకనిష్ఠులై- అని రామానుజభాష్యము.

ఇద మద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్।
ఇద మస్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్॥౧౩॥

ఇదమ్ అద్య మయా లబ్ధమ్=ఇది ఇప్పుడు నాచేత పొందఁబడినది. ఇమం మనోరథం ప్రాప్స్యే=ఈ కోరికను పొందఁగలను- ఇదమ్ అస్తి=ఇది కలదు- పునః ఇదం ధనమపి మే భవిష్యతి=వెండియును

ఈ ధనముగూడ నాకు కలుగఁగలదు.

వారియభిప్రాయ మిట్టిదైయుండును - మనోరథమునఁగా మనస్సునకు సంతోషముగా కలుగఁజేసెడి ద్రవ్యము - పై సంవత్సరమున, వెండియు నీధనము నాకు కలుగును, దానిచేతను నేను ధనవంతుఁడనుగాఁ బ్రసిద్ధుఁడను కాఁగలను - అని శంకర భాష్యము.

ఈ క్షేత్రపుత్రాదికమంతయు నా సామర్థ్యముచేతనె పొందఁబడినదిగాని అదృష్టాదికముచేతఁగాదు - ఈ మనోరథమును నేనె పొందెదను - అదృష్టాదిసహాయమక్కఱలేదు - అని రామానుజ భాష్యము

అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ॥౧౪॥

అసౌ శత్రుః మయా హతః = ఈ శత్రువు నాచేతను చంపఁబడెను - అపరానపిచ హనిష్యే = మిగిలినవారలనుగూడ చంపఁగలను - అహమ్ ఈశ్వరః = నేను ఈశ్వరుఁడను - అహం భోగీ = నేను భోగములుకలవాఁడను - అహం సిద్ధః = నేను సిద్ధుఁడను - (అహం) బలవాన్ = (నేను) బలవంతుఁడను - (అహం) సుఖీ = (నేను) సుఖముకలవాఁడను.

జయింపరాని ఈ శత్రువు జయింపఁబడెను - మిగిలినవారిని గూడ చంపెదను - వీరు నన్నేమి చేయఁగలరు - అన్నివిధముల నాతో సమానుఁడు లేఁడు. సిద్ధుఁడను అనఁగా కొడుకులు మనుమలు మునిమనుమలు కలవాఁడను - నేను వట్టి మనుష్యుఁడను కాను - నాకంటె నితరులు భూమి భారమునకై పుట్టినవారు. అని శంకరభాష్యము.

బలవంతుఁడనగు నాచేతను - శూరుఁడను ధీరుఁడను నగు నేనే మిగిలిన శత్రువులను గూడఁ జంపెదను. మందబుద్ధులయి దుర్బలులగువారిచేఁ గల్పింపఁబడిన అదృష్టమనెడి పరికరము (సాధనసామగ్రి) ఏల? ఈశ్వరుఁడను అనఁగా నాకు నేనె అధీనుఁడను. ఇతరులను నియమించువాఁడను నేనె. నేను అదృష్టాదులచేతఁగాక స్వయముగానె భోగిని. అట్లె సిద్ధుఁడనును బలవంతుఁడనును సుఖముకలవాఁడనును అని రామానుజ భాష్యము

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః॥

అన్వ: అభిజనవాన్ (చ) అస్మి=ధనవంతుఁడనును మంచివంశముగలవాఁడను(ను) అగుచున్నాను- మయా సదృశః అన్యః కః అస్తి =నాతో తుల్యుఁడు ఇతరుఁడు ఎవ్వఁడు కలఁడు?- యక్ష్యే=యాగము చేయఁగలను- దాస్యామి=దానము చేయఁగలను- మోదిష్యే=సంతోషింపఁగలను- ఇతి అజ్ఞానవిమోహితాః (భవన్తి) = ఇట్లు అజ్ఞానముచేత మోహముం జెందినవారు (అగుచున్నారు)

అభిజనవంతుఁడనఁగా ఏడుతరములనుండి శ్రోత్రియత్వము (వేదాధ్యయనము) మొదలగువానిచే సంపన్నుఁడను- యాగము చేయుటచేఁగూడ నితరులను తిరస్కరించెదను- ఆటగాండ్రు మొదలగువారలకు దానము చేసెదను- విమోహితులనఁగా అనేకవిధములుగా నవివేకభావమును పొందినవారు- అని శంకరభాష్యము-

అభిజనవంతుఁడనఁగా ఉత్తమకులమునఁ బుట్టినవాఁడు- నాతో సమానుఁడనఁగా తనసామర్థ్యముచేతనె సంపాదించికొనిన సంపదకలవాఁడు- ఈశ్వరానుగ్రహ మక్కఱలేక తామె యాగదానాదులను చేయఁజాలుదుమని అజ్ఞానమోహితులై తలంచెదరు- అని రామానుజభాష్యము-

అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥౧౬॥

అనేకచిత్తవిభ్రాన్తాః మోహజాలసమావృతాః కామభోగేషు ప్రసక్తాః (చ సన్తః)=అనేకములగు చిత్తములచే భ్రాంతిని పొందినవారును మోహమనెడు వలచేత నావరింపఁబడినవారును కామభోగములయందు తగులుకొనినవారు(ను అగుచు), అశుచౌ నరకే పతన్తి=అపరిశుద్ధమైన నరకమునందు పడుచున్నారు.

వెనుకఁ జెప్పినచొప్పున ననేకములగు చిత్తములచేత ననేకవిధములుగా భ్రాంతిని పొందినవారై. అవివేకమనెడి వలచేతను-ఆ కామభోగముచేత సంపాదింపఁబడిన పాపములుకలవారై వైతరణి మొదలగు నరకమునఁబడుచున్నారు. అని శంకరభాష్యము.

అదృష్టము ఈశ్వరుఁడు మొదలగువాని సహాయ మక్కఱలేకయె తనంతనె అంతయును జేయ దగునని తలంచి, ఇట్లు చేతును, ఇదియు

ను చేతును, మఱియొకటియుఁ జేతును, అని యిట్లు అనేకచిత్తవి భ్రాంతులు- కామభోగములయందు మిక్కిలి గాఁ దగులుకొనినవారైన దుష్టులు నరకమునఁ బడుదురు- అని రామానుజభాష్యము.

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనావిధిపూర్వకమ్॥౧౭॥

ఆత్మసంభావితాః స్తబ్ధాః ధనమానమదాన్వితాః తే=తమంతనెగౌరవింపఁబడినవారును స్తబ్ధులును ధనమదముతోను నభిమానముతోను గూడినవారునయిన వారు, అవిధిపూర్వకం దమ్భేన=విధ్యుక్తముగాని చొప్పున దంభముతో, నామయజ్ఞైః యజన్తే-పేరుకుమాత్రము యజ్ఞములగువానిచేత దేవతలను పూజింతురు.

సర్వగుణములతోఁగూడినట్లు తమంతనె గౌరవింపఁబడినవారు. స్తబ్ధులనఁగా నమ్రులుగానివారు - ధనముచేఁ గలిగిన మానంబుచే మదంబును గలవారు- అని శంకరభాష్యము.

స్తబ్ధులనఁగా తాము పరిపూర్ణులని తలంచుచు ఏమియుఁ జేయకున్న వారు-విద్య, అభిజనము (మంచివంశమునఁ బుట్టుట), వీనిచేఁ గలిగిన యభిమానము. నామయజ్ఞములనఁగా యజ్ఞము చేయువాఁడనెడి పేరుగలుగుటకు మాత్రము పనికివచ్చునవి: అని రామానుజభాష్యము.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥౧౮॥

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః-అహంకారమునను బలమునను దర్పమునను కామమునను క్రోధమునను ఆశ్రయించినవారును, ఆత్మపరదేహేషు మాం ప్రద్విషన్తః అభ్యసూయకాః=తనశరీరమునందును నితరులశరీరములయందును నన్ను ద్వేషించుచున్నవారై అసూయపడువారును, (భవన్తి=అగుచున్నారు)

ఉన్నవియు లేనివియునగు గుణములను తనయందారోపించుకొని అధికుఁడను నేను అని తలంచుట అహంకారము. ఇదియె అజ్ఞానమను పేరుగలది. మిక్కిలి చెడ్డది. అన్నిదోషములకును మూలమైనది. అన్ని యనర్థప్రవృత్తులకు నిదియె మూలము. బలమనఁగా పరులను తిరస్కరించుటకు సాధనమైనది. దర్పమనఁగా అంతఃకరణము నాశ్రయించియుంది

యుండెడి యొకదోషము- అదికలిగినయెడను ధర్మమునతిక్రమింపుచుండుటను- స్త్రీలు మొదలగువారలంగూర్చినది కామము- అనిష్టమైన దానింగూర్చినది క్రోధము- ఇవిగాక ఇఁక ననేకదోషములంగూడ నాశ్రయించినవారు- అన్ని దేహములయందును బుద్ధికిని కర్మమునకును సాక్షిగానుండెడినన్ను ప్రద్వేషింపుచు. ప్రద్వేషించుటయనఁగా నాయాజ్ఞనుమీఱుట- అసూయగలవారలు అనఁగా మంచిమార్గముననున్న వారలగుణములను సహింపనివారు . అని శంకరభాష్యము.

రెండవదానియపేక్ష లేకనే నెఅంతటిని చేసెదననెడి యహంకారమును- నాయంతటివాఁడు లేఁడనెడిదర్పమును. నేనుకోరినతోడనే అంతయును సమకూడుననెడి కామమును. నాకు అనిష్టము చేసెడివారల నందఱను చంపెదననెడి క్రోధమును- అన్ని శరీరములయందునుండి అందఱకును ప్రేరకుఁడను పురుషోత్తముఁడను నగునన్నుగూర్చి అసూయపడుచున్నవారై- ద్వేషింపుచుననఁగా కుయుక్తులచేత నేను ఉండుటయందు కోపమును ప్రకటింపుచున్నవారై నన్ను సహింపనివారగుచు అహంకారము మొదలగు వానిని ఆశ్రయించినవారై యాగములు మొదలగుకర్మములఁ జేయుచున్నారు అని యర్థము. అని రామానుజభాష్యము.

ఎవ్వనికిని విష్ణువు కారయిత (ప్రేరకుఁడు) కాఁడు. అట్లగు నేని నాకుఁగూడ నిప్పుడు కారయిత కావలయును అని యిట్లు. అని మధ్వభాష్యము

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు ॥౧౯॥

ద్విషతః క్రూరాన్ అశుభాన్ తాన్ నరాధమాన్-ద్వేషింపుచున్న వారును క్రూరులును అశుభులునగు ఆ మనుష్యాధములను, సంసారేషు ఆసురీషు యోనిష్వేవ అజస్రం క్షిపామి=సంసారములలో అసురసంబంధులగు యోనులయందె ఎల్లప్పుడును ఉంచెదను-

సన్మార్గప్రతిపక్షులును సాధువులయెడను ద్వేషముకలవారును నన్ను ద్వేషింపుచున్నవారును- సంసారములయందు అనఁగా నరకములలోఁ జొచ్చెడిమార్గములయందు- అధర్మదోషము కలిగియుండుట చేనుండెదను- అశుభులనఁగా అశుభములగుపనులఁ జేయువారు- ఆసురయోనులనఁగా క్రూరవ్యాపారములు తలుచుగాఁగల వ్యాఘ్రసింహా

దియోనులు- అని శంకరభాష్యము-

ఇట్లు నన్ను ద్వేషించెడి- సంసారమునఁగా పుట్టుకమొదలిమిచావు మొదలగురూపముల తిరుగుచున్న సంతానములు- ఆసుర యోనులనఁగా నాకు అనుకూలముగానుండనిజన్మములు- ఆయాజన్మములనుపొందుటకుతగినట్లు ప్రవర్తించుటకు హేతువులగు క్రూరబుద్ధుల యందు నేనెచేర్చెదను అనుట. అని రామానుజభాష్యము-

ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్॥ ౨౦॥

(హే) కౌన్తేయ=(ఓ) కుంతీపుత్రుఁడా!, ఆసురీమ్ యోనిమ్ ఆపన్నాః= ఆసురసంబంధమగు యోనిని పొందినవారు, జన్మని జన్మని మూఢాః (సన్తః)=ప్రతిజన్మమందును మూఢులు (అగుచు), మామ్ అప్రాప్యైవ=నన్ను పొందకయె, తతః అధమాం గతిం యాన్తి=దానికంటె తక్కువదైన గతిని పొందుచున్నారు.

మూఢులనఁగా అవివేకులు- తమోగుణము విస్తారముగాఁగల యోనులయందెపుట్టుచున్నవారై క్రిందికిపోవుచున్నారు- ఈశ్వరుఁడనైననన్ను- నన్నుపొందుటకెప్పటికిని ఆశ లేమి. నాచే శాసింపఁబడిన మంచిమార్గమును పొందకయె యనియర్థము- అని శంకరభాష్యము.

నాకనుకూలముగానుండనిజన్మమునుపొందినవారై. మూఢులనఁగా నాయెడనువిరుద్ధమైనజ్ఞానముకలవారై. నన్నుపొందకయనఁగా సర్వేశ్వరుఁడుకలఁడనుజ్ఞానమునుపొందక- అని రామానుజభాష్యము-

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః।
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్॥ ౨౧॥

కామః క్రోధః తథా లోభః (ఇతి) ఏతత్=కామము క్రోధము అట్లె లోభము (అను) ఇది, ఆత్మనః నాశనమ్=ఆత్మకు నాశకంబగు, నరకస్య త్రివిధం ద్వారమ్ (భవతి)=నరకముయొక్క మూఁడువిధములగు ద్వారము (అగుచున్నది). తస్మాత్ ఏతత్ త్రయమ్ త్యజ= ఆ హేతువువలన ఈ మూఁటిని విడువుము.

నరకమును పొందుటకు ద్వారము- ఈ ద్వారమున బోవుచునె

యాత్మ నశింపు చున్నాఁడు. అనఁగా నొకటి-పురుషార్థమునకును పనికి రాఁడనుట- ఆత్మను నశింపఁ జేయునదియగుట నెవిడుపుము. ఇది త్యాజ్యస్తుతి. అని శంకరభాష్యము.

ఆసురస్వభావమనెడి నరకమునకు ద్వారము - అనఁగా మార్గము. హేతువనుట. అతి ఘోరమైన నరకమునకు హేతువగుటచే నీమూటిని దూరముగా విడిచిపెట్టుము. అని రామానుజభాష్యము.

ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారైస్త్రిభిర్నరః।
ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్॥ ౨౨॥

(హే) కౌన్తేయ! =(ఓ) కుంతీపుత్రుఁడా!, ఏతైః త్రిభిః తమోద్వారైః విముక్తః నరః = ఈ మూఁడు తమోద్వారముల చేతను విడువఁబడిన పురుషుఁడు, ఆత్మనః శ్రేయః ఆచరతి = తనకు మేలగుదానిని ఆచరించుచున్నాఁడు- తతః పరాం గతిం యాతి = దానివలన గొప్ప గతిని పొందుచున్నాఁడు.

తమస్సనఁగా దుఃఖమోహాత్మకమయిన నరకమునకు ద్వారములు- దేనియిద్దఱిచేత పూర్వము మేలునాచరింపలేదో అదిపోవుటవలన ఆచరించుచున్నాఁడు- గొప్పగతియనఁగా మోక్షము- అని శంకరభాష్యము

తమోద్వారములనఁగా నన్నుగూర్చిన విపరీతజ్ఞానమునకు హేతువులైనవి- మేలును ఆచరించుట యనఁగా నన్ను దెలిసికొని నాయానుకూల్యమునందు ప్రవర్తించుట. పరమగతియైన నన్నే పొందుచున్నాఁడు అని రామానుజభాష్యము.

యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥ ౨౩॥

యః శాస్త్రవిధిమ్ ఉత్సృజ్య = ఎవఁడు శాస్త్రవిధిని విడిచిపెట్టి, కామకారతః వర్తతే = యథేష్టాచరణముతో ప్రవర్తించునో, సః సిద్ధిమ్ న అవాప్నోతి = వాఁడు సిద్ధిని పొందఁడు - సుఖం పరాం గతిం (చ) న అవాప్నోతి = సుఖమును గొప్పగతిని(ని) పొందఁడు.

శాస్త్రమనఁగా వేదము దానివిధియనఁగా చేయఁదగినదానిని చేయరానిదానిని తెలియఁజేసెడిభాగము- కావున దానిచేతఁ జోదితమైన

యుప్రవర్తింపుచున్నాఁడో- సిద్ధిని అనఁగా పురుషార్థమునకు తగియుండుటనను, ఈలోకమునసుఖమునను, గొప్పగతినిని అనఁగా స్వర్గమునుగాని మోక్షమునుగాని యైనను పొందఁడు. అని శంకరభాష్యము.

శాస్త్రవిధిమ్=వేదములనెడినాయాజ్ఞను. కామకారమునవర్తించుటయనఁగా తన చిత్తమువచ్చినమార్గముననుండుట-వాఁడు కామము యొక్క-పరలోకములోని సిద్ధిని పొందఁడు. సుఖమునుగూడ పొందఁడు. గొప్పగతిని దేనినెట్లు బొందును? అని రామానుజభాష్యము

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥౨౪॥

తస్మాత్=ఆహేతువువలన, తే కార్యాకార్యవ్యవస్థితౌ శాస్త్రం ప్రమాణమ్=నీకు చేయవలసినవానినిం జేయరానివానిని నేర్పఱుచుటలో శాస్త్రము ప్రమాణము- శాస్త్రవిధానోక్తం జ్ఞాత్వా=శాస్త్రవిధిలోఁ జెప్పఁబడినదానిని తెలిసికొని, ఇహ కర్మ కర్తుమ్ అర్హసి=ఇచ్చట కర్మమును చేయుటకు తగుచున్నావు.

ప్రమాణమనఁగా తెలియఁజేయునది. శాస్త్రమనెడివిధానము అనఁగావిధి. దానిచేఁ జెప్పఁబడినకర్మమునే చేయఁదగుదువు. ఇహ=ఈకర్మాధికారములో. అని శంకరభాష్యము

స్వీకరింపవలసినదానినిని విడువవలసినదానినిని ఏర్పఱుచుటయందు. ధర్మశాస్త్రములు ఇతిహాసములు పురాణములు మొదలగువానిసహాయముగలవేదములు పురుషోత్తముఁడనెడిపరతత్త్వమునను ఆతనిప్రీతికిని ఆతనిం జేరుటకును సాధనమైనకర్మమునను, తెలియఁజేయుచున్నవి- ఆశాస్త్రమునఁ జెప్పఁబడినతత్త్వమునను కర్మమునను హెచ్చుతగ్గులు లేకుండునట్లు తెలిసికొని దానినె స్వీకరింపఁదగుదువు- అని రామానుజభాష్యము.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబునగు భగవద్గీతలలో దైవాసురసంపదలను విభజించుటయనెడి జ్ఞానసాధనమును తెలియఁజేసెడి పదునాఱవయధ్యాయము.

గీతాభాష్యత్రయసారము

పదునేడవయధ్యాయము

అర్జునఉవాచ.

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వ మాహో రజ స్తమః॥ ౧॥

యే శాస్త్రవిధిమ్ ఉత్సృజ్య=ఎవ్వరు శాస్త్రవిధిని విడిచిపెట్టి, శ్రద్ధయా అన్వితాః(సన్తః) యజన్తే=శ్రద్ధతో కూడినవారు(అగుచు) యాగమును చేయుచున్నారో, (హే)కృష్ణ!=(ఓ)కృష్ణుఁడా!, తేషామ్ నిష్ఠా కా =వారి నిష్ఠ ఏది- సత్త్వం (కిమ్)=సత్త్వమా (ఏమి?) ఆహో రజః=లేక రజస్సా?, (ఆహో) తమః=(లేక) తమస్సా?

శాస్త్రవిధి యనఁగా శ్రుతులయందును స్మృతులయందును చెప్పఁబడిన విధిని- యజన్తే=దేవతలు మొదలగువారిని పూజింపుచున్నారో- శ్రద్ధ యనఁగా ఆస్తిక్యబుద్ధి(కలదనెడినమ్మకము)- శాస్త్రము నెఱింగియు దానిని విడిచి తమకుతోఁచినట్లు యజించువారిచ్చట చెప్పఁబడరు- శ్రద్ధతోఁగూడినవారైరి అనుటచేత శాస్త్రము నెఱుంగక పెద్దలయాచారమునందు నమ్మకము గలవారై యజించువారు ఇచ్చటఁ జెప్పఁబడుదురు- వీరు దైవసంపదలోను నాసురసంపదలోనును చేరనివారు- నిష్ఠ యనఁగా ఉనికి- వారు చేసెడి దేవాదిపూజ సాత్త్వికరాజసతామసములు మూఁటిలో దేనిలోఁ జేరును? అని శంకరభాష్యము.

నిష్ఠ యనఁగా స్థితి- దేనియందుందురో అది- ఇచ్చట సత్త్వాదులె స్థితులు- వారు సత్త్వమునను ండురా రజస్సునను ండురా తమస్సునను ండురా? అని రామానుజభాష్యము.

ఈయధ్యాయమున గుణభేదములు విస్తరింపఁజేయఁబడును- శాస్త్రవిధిని విడిచి- వేదము నెఱుంగక- ద్విజుఁడు రహస్యములతోఁగూడ వేదమునంతయు తెలిసికొనునది అనువిధి వారిచే విడువఁబడినది కదా- వేదమును విడుచుటయె తాత్పర్యమైన యెడను తామసులనియె చెప్పవలసియుండును- సాత్త్వికరాజసతామసులని మూఁడువిధముల విభజించి చెప్పఁగూడకపోవును- అని మధ్వభాష్యము.

శ్రీభగవానువాచ.

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥౨॥

దేహినాం స్వభావజా సా శ్రద్ధా=ప్రాణులయొక్క స్వభావము వలనఁ గలిగిన ఆ శ్రద్ధ, సాత్త్వికీ రాజసీ చైవ తామసీచ ఇతి=సాత్త్వికియును రాజసియును తామసియును అని, త్రివిధా భవతి=మూఁడువిధములైనది అగుచున్నది. తాం శృణు=దానిని వినుము

స్వభావమనఁగా జన్మాంతరమునఁ గలిగి మరణకాలమున స్ఫుటపడిన ధర్మాధర్మాది సంస్కారము. సత్త్వమువలనఁ గలిగిన శ్రద్ధ దేవపూజాదులంగూర్చినది. రజస్సువలనఁ గలిగినది యక్షులు రాక్షసులు వీరిపూజ మొదలగు దానింగూర్చినది. తమస్సువలనఁ గలిగినది ప్రేతములు పిశాచలు వీనిపూజ మొదలగు దానింగూర్చినది. అని శంకరభాష్యము.

అందఱు శరీరులయు శ్రద్ధ-స్వభావమనఁగా పూర్వజన్మవాసననుబట్టి వానివానియందు రుచిపుట్టుట. దేనియందు రుచియుండునో దానియందు శ్రద్ధకలుగును. శ్రద్ధయనఁగా ఇదిమన ఇష్టమును ఈడేర్చునను నమ్మకముతోఁ గూడిన సాధనమునందలి త్వర. వాసనయు రుచియు శ్రద్ధయు నాత్మయొక్క ధర్మములు. అవి గుణముల సంపర్కమువలనఁ గలుగునవి. ఆయాత్మధర్మములను గలుగఁజేయునవి దేహము ఇంద్రియము అంతఃకరణము విషయములు వీనియందుండెడి సత్త్వాదిగుణములు. సత్త్వాదిగుణములతోఁ గూడిన దేహాదులయనుభవమని యర్థము. కాఁబట్టి ఈశ్రద్ధ సాత్త్వికియనియు రాజసియనియు తామసియనియు మూఁడువిధములు. ఈశ్రద్ధ ఎట్టిస్వభావముకలదో ఆస్వభావమును వినుము. అని రామానుజభాష్యము.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః॥౩॥

(హే) భారత!=(ఓ) భరతవంశమువాఁడా!, సర్వస్య సత్త్వానురూపా శ్రద్ధా భవతి=సమస్తమైనవానికిని అంతఃకరణమునకుఁ దగిన శ్రద్ధ కలుగుచున్నది. అయం పురుషః శ్రద్ధామయః=ఈ పురుషుఁడు శ్రద్ధామయుఁడు. యః యచ్ఛ్రద్ధః=ఎవ్వఁడు ఎట్టిశ్రద్ధ కలవాఁడో, సః స ఏవ=వాఁడు అట్టివాఁడే.

సత్త్వమనఁగా ఆయాసంస్కారములతోఁగూడిన యంతఃకరణము- ఈసంసారియైనజీవుఁడు శ్రద్ధాప్రాయుఁడు. అట్టివాఁ డనఁగా ఆశ్రద్ధకుతగినవాఁడు- అని శంకరభాష్యము.

సత్త్వమనఁగా అంతఃకరణము- అంతఃకరణముఎట్టి గుణములు గలదో అట్టిదానియందుశ్రద్ధపుట్టును- అంతఃకరణమును జెప్పుట వెనుకఁ జెప్పఁబడిన దేహేంద్రియాదులనుఁగూడఁ జూపును- శ్రద్ధామయుఁడనఁగా శ్రద్ధాపరిణామము- ఎవ్వఁడెట్టి శ్రద్ధగలవాఁడైయుండునో వాఁడు ఆ శ్రద్ధయొక్క పరిణామమే- పుణ్యకర్మమునశ్రద్ధగలవాఁ డగునేని పుణ్యకర్మఫలముతోఁగూడినవాఁడగును- కాఁబట్టి ఫలముకలుగుటకు శ్రద్ధయె ప్రధానముఅని చెప్పఁబడినది- అని రామానుజభాష్యము.

సత్త్వానురూపమనఁగా చిత్తమునకుఁదగినది- ఎవ్వఁడు ఎట్టి శ్రద్ధగలవాఁడో వాఁడుఅట్టివాఁడె- సాత్త్వికశ్రద్ధగలవాఁడు సాత్త్వికుఁడె యగునట్లు - అని మధ్వభాష్యము.

యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః॥

సాత్త్వికాః దేవాన్ యజన్తే=సాత్త్వికులు దేవతలను పూజించుచున్నారు- రాజసాః యక్షరక్షాంసి (యజన్తే)=రాజసులు యక్షులనును రాక్షసులనును(పూజించుచున్నారు)- అన్యే తామసాః జనాః=మిగిలిన తామసులగు జనులు, ప్రేతాన్ భూతగణాంశ్చ యజన్తే=ప్రేతములనను భూతగణములనును పూజించుచున్నారు.

భూతగణములనఁగా సప్తమాతృకలు మొదలగునవి- అని శంకరభాష్యము

దుఃఖసంభేదములేని గొప్పసుఖమును కలుగఁజేసెడి దేవయాగములంగూడిన శ్రద్ధ సాత్త్వికి- దుఃఖముతోఁగూడిన సుఖమును కలుగఁజేయునది రాజసి- దుఃఖముపిస్తారముగలిగినస్వల్పసుఖమును కలుగఁజేసెడి శ్రద్ధ తామసి- అని రామానుజభాష్యము.

అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః।
దమ్భాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః॥ ౫॥
కర్శయన్తః శరీరస్థం భూతగ్రామమచేతసః।

మాం చైవాన్తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥౬॥

యే జనాః=ఏ జనులు, దమ్భాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః అచేతసః=దంభముతోను అహంకారముతోను కూడిన వారును కామరాగముల బలముతోఁ గూడినవారును బుద్ధిలేనివారునై, శరీరస్థం భూతగ్రామమ్ అన్తశ్శరీరస్థం మాంచ కర్శయన్తః=శరీరమున నున్న భూతసమూహమును లోపలిశరీరమునన్న నన్నును కృశింపఁజేయుచున్నవారై, అశాస్త్రవిహితం ఘోరం తపః తప్యన్తే=శాస్త్రమునఁ జెప్పఁబడని ఘోరమయిన తపస్సును ఆచరించుచున్నారో, తాన్ ఆసురనిశ్చయాన్ విద్ధి=వారిని ఆసురనిశ్చయము గలవారినిగాను ఎఱుంగుము-

ఘోరమనఁగా ప్రాణులకును తనకును గూడ బాధించునది- భూతగ్రామమనఁగా కరణ(ఇంద్రియ)సముదాయము- అచేతస్సులనఁగా అవివేకులు- కర్మబుద్ధిసాక్షినయి శరీరమునందున్న నన్నుగూడ- నన్ను కృశింపఁజేయుటయనఁగా నాయాజ్ఞను మీఱుటయె- వారలను తెలిసికొనుట పరిహరించుటకొఱకు- అని శంకరభాష్యము-

తపస్సుయొక్క దుఃఖముంగూడఁ జూపును- భూతగ్రామమనఁగా శరీరమునందుండెడి పంచభూతములు- నన్ను అనఁగా నాయంశమైన జీవుని- అసురులనఁగా నాయాజ్ఞకు విరుద్ధముగా నాచరించువారు- అందువలననె వారికి సుఖలేశమైనం గలుగదు, మీఁదిమిక్కిలి అనర్థమునఁబడుదురని (౧౬అ॥౧౬శ్లో॥) చెప్పఁబడినది- అని రామానుజభాష్యము.

భగవంతుని కృశింపఁజేయుట యనఁగా అల్పుఁడని తలంచుటయె- ఆసురసంబంధియగు నిశ్చయము కలవారు- అని మధ్వభాష్యము

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥౭॥

సర్వస్యాపి ఆహారస్తు త్రివిధః ప్రియః భవతి=సమస్తమైనవానికిని ఆహారము మూడువిధములైనదై ఇష్టము అగుచున్నది- యజ్ఞః తపః దానం(చ) తథా=యజ్ఞంబును తపస్సును దానంబును అట్లే- తేషామ్ ఇమం భేదం శృణు=వారియొక్క ఈ భేదమును వినుము

సత్త్వాదిగుణముల సంబంధమును బట్టి మూడు విధములై ఇష్టమగు

చున్నది- అనిరామానుజభాష్యము.

ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః।

రస్యాస్స్నిగ్ధాస్స్థిరాహృద్యాఆహారాస్సాత్త్వికప్రియాః॥

ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః = ఆయుస్సునుసత్త్వమునుబలమునను ఆరోగ్యమునును సుఖమునుప్రీతినినివృద్ధిబొందించునవియును, రస్యాః స్నిగ్ధాః స్థిరాః హృద్యాః ఆహారాః=రసములవియును చమురుగలవియును స్థిరములయినవియును మనోహరములైనవియునగు ఆహారములు, సాత్త్వికప్రియాః(భవన్తి)=సాత్త్వికులకుఇష్టములైనవి (అగుచున్నవి.)

స్థిరములనఁగా దేహమునందు చాలకాలముండునవి- హృద్యములనఁగా హృదయమునకుఇష్టములైనవి- అనిశంకరభాష్యము.

సత్త్వమనఁగాఅంతఃకరణము-దానివలనఁగలిగెడిజ్ఞానమిచ్చట సత్త్వశబ్దముచేఁజెప్పఁబడుచున్నది- సత్త్వమయమగు నాహారముజ్ఞానవృద్ధిని చేయును- పరిణమించునప్పుడు(పక్వమగునప్పుడు)కూడయముగా సుఖమునువృద్ధిబొందించునవి- ప్రీతినిగలుగఁజేసెడి పనులను చేయించుటచేత ప్రీతివర్ధనములు- రస్యములనఁగా మధురరసముగలవి- స్థిరములనఁగా స్థిరమైనపరిణామముగలవి- హృద్యములనఁగా ఇంపైనవి- అనిరామానుజభాష్యము.

ప్రీతి,తరువాతఁగలుగునది- చూచినతోడనెహృద్యత్వము- స్థిరములుగానుండును- అప్పుడెపక్వములయిపోవవు-నెయ్యిమొదలగునవియట్టివిగదా- అనిమధ్వభాష్యము.

కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః।

ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః॥౯॥

కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః=కారముగానుపుల్లగానునుఉప్పగానునుండునవియుమిక్కిలివేడియైనవియుతీక్ష్ణములైనవియుచమురులేనివియుమంటనుకలుగఁజేయునవియును, దుఃఖశోకామయప్రదాః ఆహారాః=దుఃఖమునునుశోకమునునురోగమునునకలుగఁజేయునవియునగు ఆహారములు, రాజసస్య ఇష్టాః= రాజసునకు ఇష్టములైనవి-

అత్యుష్ణశబ్దములోని మికుటమును మిక్కిలికారములని యిట్లు అన్ని టియందునన్వయించునది- అనిశంకరభాష్యము.

లవణములనఁగా ఉప్పువిస్తారముగాఁగలవి- అతితీక్ష్ణములైనవి అనఁగా మిక్కిలిచల్లగానుండుట మిక్కిలివేడిగానుండుట మొదలగువాని చేత ఉపయోగింప శక్యముకానివి- శోషింపఁజేయునవి రూక్షములు- తాపమును(మంటను)కలుగఁజేయునవి విదాహులు- అవిదుఃఖాదులనును రజస్సునును వృద్ధిబొందించునవి- అని రామానుజభాష్యము-

యాతయామం గతరసం పూతిపర్యుషితంచ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥౧౦॥

యత్ భోజనమ్=ఏ ఆహారము, యాతయామం గతరసం పూతి పర్యుషితంచ ఉచ్ఛిష్టమ్ అపిచ అమేధ్యం(భవతి)-జాము దాఁటినదియు రసముపోయినదియు దుర్గంధముగలదియు పాచినదియు ఎంగిలియును ఇంతియె కాక అపరిశుద్ధంబును (అగుచున్నదో), తత్ తామసప్రియమ్=అది తామసులకు ఇష్టమైనది-

నిర్వీర్యము(సత్తువలేనిది)గతరసశబ్దముచేతనె చెప్పఁబడినదిగాన యాతయామమనఁగా బెగ్గగా ఉడుకనిది- పర్యుషితమనఁగా వండినతరువాత ఒక్కరాత్రిగడచినది- ఉచ్ఛిష్టమనఁగా తినఁగామిగిలినది- అమేధ్యమనఁగా యజ్ఞములకు తగనిది- అనిశంకరభాష్యము

యాతయామమనఁగా చాలకాలముండినది- స్వభావసిద్ధమైనరుచిపోయినది గతరసము- పర్యుషితమనఁగా కాలాంతరమున మఱియొక్క రుచినిపొందినది- ఉచ్ఛిష్టమనఁగా గురువు మొదలగువారు కాక మిగిలినవారల యెంగిలి- అమేధ్యమనఁగా యజ్ఞమునకు తగనిది అనఁగా యజ్ఞముచేయఁగా మిగిలినదికానిది-భోజనమనఁగా ఆహారము- ఇది వెండియు తమస్సును వృద్ధిబొందించును. కాబట్టి హితమునుగోరువారు సత్త్వము వృద్ధిబొందుటకు సాత్త్వికాహారమునె పుచ్చుకొమనది- అనిరామానుజభాష్యము

అఫలాకాఙ్క్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
యష్టవ్యమేవేతిమనస్సమాధాయ స సాత్త్వికః॥౧౧॥

అఫలాకాఙ్క్షిభిః=ఫలమును గోరనివారిచేత, విధిదృష్టః యః యజ్ఞః=

విధులనుగా౯కనంబడిన ఏ యజ్ఞము, యష్టవ్యమేవ ఇతి మనః సమాధాయ ఇజ్యతే= యాగము చేయవలసినదే అని మనస్సును నిశ్చలము గాఁజేసి ఆచరింపఁబడుచున్నదో, సః సాత్త్వికః (యజ్ఞః)=అది సాత్త్వికమైన (యజ్ఞము).

యజ్ఞమును చేయుటయె కార్యముగాని దీనిచేత నాకేపురుషార్థంబును అక్కఱలేదనునిశ్చయించికొని- అనిశంకరభాష్యము.

విధిదృష్టమనఁగా శాస్త్రమునఁజెప్పఁబడిన మంత్రములు, ద్రవ్యములు(వస్తువులు), పని, మొదలగువానితోఁగూడినది- భగవదారాధనమగుటను అదియె ప్రయోజనము గా యాగము చేయవలసినదియె యని- అని రామానుజభాష్యము.

అభిసంధాయతు ఫలం దమ్భార్థమపి చైవ యః।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్॥౧౨॥

(హే)భరతశ్రేష్ఠ!=(ఓ)భరతవంశశ్రేష్ఠుఁడా!, ఫలమ్ అభిసంధాయ=ఫలమును ఉద్దేశించియు, దమ్భార్థమపిచైవ=దంభముకొఱకును, యః (యజ్ఞః) ఇజ్యతే=ఏ (యజ్ఞము) చేయఁబడుచున్నదో, తం రాజసం యజ్ఞం విద్ధి=దానిని రాజసమైన యజ్ఞమును గాను ఎఱుంగుము.

దంభముతోఁగూడినదై కీర్తియె ఫలముగాఁగలయజ్ఞము. అని రామానుజభాష్యము.

విధిహీన మసృష్టాన్నం మన్త్రహీనమదక్షిణమ్।
శ్రద్ధావిరహితంయజ్ఞం తామసం పరిచక్షతే॥౧౩॥

విధిహీనమ్ అసృష్టాన్నం మన్త్రహీనమ్ అదక్షిణం శ్రద్ధావిరహితం యజ్ఞమ్=శాస్త్రము లేనిదియు అన్నదానము లేనిదియు మంత్రములు లేనిదియు దక్షిణ లేనిదియు శ్రద్ధలేనిదియునగు యజ్ఞమును, తామసం పరిచక్షతే=తామసమును గాను చెప్పుచున్నారు-

శాస్త్రమునకువిరుద్ధమైనది. బ్రాహ్మణులకు అన్నమునిచ్చుట లేనిది- స్వరవర్ణలోపముగలదిమంత్రహీనము- శాస్త్రమునందు చెప్పఁబడినదక్షిణ లేనిది- అని శంకరభాష్యము.

విధిహీనమనఁగా సందియాచారముగలవారును పండితులునగు బ్రా

హ్మణులచే ఈయాగము చేయవలసినదిఅని చెప్పఁబడనిది- అసృష్టా
న్నమనఁగా శాస్త్రమునఁ జెప్పఁబడని ద్రవ్యములు(వస్తువులు)గలది-
అని రామానుజభాష్యము.

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్।
బ్రహ్మచర్యమహింసాచ శారీరం తప ఉచ్యతే॥౧౪॥

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమ్ ఆర్జవం బ్రహ్మచర్యమ్ అహింసాచ = దేవతలను బ్రాహ్మణులను గురువులను తెలిసినవారిని పూజించుటయును పరిశుద్ధియును ఋజుత్వంబును బ్రహ్మచర్యంబును అహింసయును, శారీరం తపః (ఇతి) ఉచ్యతే = శరీరసంబంధియగు తపస్సు (అని) చెప్పఁబడుచున్నది-

శరీరముప్రధానముగా కలకర్తలు మొదలగువారిచేఁ గలుగవలసినది గాన శారీరము- పంచైతే తస్యహేతవః(౧౮ అ॥ ౧౫ శ్లో॥)అని చెప్పఁబడఁగలదుగదా- అని శంకరభాష్యము.

శౌచమనఁగా తీర్థములలో స్నానము చేయుట మొదలగునది- ఆర్జవమనఁగా మనస్సును శరీరమును ఒక్కవిధముగా ప్రవర్తించుట- బ్రహ్మచర్యమనఁగా స్త్రీలయందు భోగ్యతాబుద్ధి(అనుభవింపఁదగినవారనెడు తలంపు)తో చూచుట మొదలగునవి లేకపోవుట- అహింసయనఁగా ప్రాణులను పీడింపకపోవుట- అని రామానుజభాష్యము.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచయత్।
స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయం తప ఉచ్యతే॥౧౫॥

అనుద్వేగకరం సత్యం ప్రియహితంచ యత్ వాక్యమ్ = ఉద్వేగమును పుట్టింపనిదియు సత్యమైనదియును ఇష్టంబును హితమైనదియును ఏ వాక్యమో, (తత్) స్వాధ్యాయాభ్యసనంచైవ = అదియును వేదమును అభ్యసించుటయును, వాఙ్మయం తపః (ఇతి) ఉచ్యతే = వాఙ్మయమైన తపస్సు (అని) చెప్పఁబడుచున్నది.

అనుద్వేగకరమనఁగా ప్రాణులకు దుఃఖమును కలుగఁజేయనిది- దృష్టము(ఈలోకమునందలి ఫలము)కొఱకైనది ప్రియము- అదృష్టము(పైలోకమునందలి ఫలము)కొఱకైనది హితము- ఈ నాలుగు విశేషణముల లో నొక్కటైన తక్కువ కాని వాక్యము వాఙ్మయతపస్సు- ఎట్లన్నను-

వత్సా! నీవు శాంతుఁడవు కమ్ము, స్వాధ్యాయమును యోగమును నభ్యసింపుము- అను నిట్టి వాక్యము వాఙ్మయతపస్సు- యథాశాస్త్రముగా వేదమును చదువుటయును వాఙ్మయతపస్సు- అని శంకర భాష్యము-

మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే॥౧౬॥

మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమ్ ఆత్మవినిగ్రహః భావసంశుద్ధిః = మనస్సు తేటగా నుండుటయును సౌమ్యత్వంబును మాటలాడకపోవుటయును అంతఃకరణము నిగ్రహించుటయును, ఇత్యేతత్ మానసం తపః (ఇతి) ఉచ్యతే = అనునిది మనస్సంబంధియగు తపస్సు (అని) చెప్పఁబడుచున్నది

మనఃప్రసాదమనఁగా మనస్సును స్వచ్ఛముగాఁ జేయుట- సౌమ్యత్వమనఁగా సౌమనస్యము- అనఁగా ముఖము మొదలగునది ప్రసన్నముగా నుండుటచే నూహింపఁదగిన యంతఃకరణముయొక్క వృత్తివిశేషము- ఈ వాక్కును నియమించుట మనస్సు నియమించుటవలనఁ గలుగునదిగాన ఇచ్చట మౌనమని మనస్సంయమమె (మనస్సు నియమించుటయె) ఉద్దేశింపఁబడినది- ఆత్మవినిగ్రహ మనునది మనస్సును అన్నివ్యాపారములయందును నియమించుట- మౌనమనునది మనస్సు మాటలాడుటయనెడి వ్యాపారమునందుమాత్రము నియమించుట- భావసంశుద్ధి యనఁగా పరులతో వ్యవహరించునప్పుడు మాయ (మోసము) లేకపోవుట- అని శంకర భాష్యము-

ప్రసాదమనఁగా క్రోధాదులు లేకపోవుట- మనస్సు ఇతరులకు మేలు కలుగుటయందు ఆసక్తికలదై యుండుట సౌమ్యత్వము- మౌనమనఁగా మనస్సుచేత వాక్కును ప్రవర్తింపనీకపోవుట. ఆత్మవినిగ్రహమనఁగా మనస్సును ధ్యానము చేయవలసినదానియందు నిలుపుట- భావసంశుద్ధి యనఁగా ఆత్మ తప్ప మిగిలిన విషయములయందు తలంపులేకపోవుట- అని రామానుజభాష్యము-

సౌమ్యత్వమనఁగా క్రౌర్యము లేకపోవుట- మౌనమనఁగా మననము చేసెడి స్వభావము కలిగియుండుట- మఱియొక్క యర్థమును (మాటలాడకపోవుటను) చెప్పినచో మానసతపస్సు ఎట్లగును?. అని మ

ధ్వభాష్యము.

> శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః।
> అఫలాకాంక్షిభిర్యుక్తైస్సాత్త్వికం పరిచక్షతే॥ ౧౭॥

అఫలాకాంక్షిభిః యుక్తైః నరైః = ఫలమును గోరనివారును యుక్తులునగు పురుషులచేతను, పరయా శ్రద్ధయా తప్తమ్ - గొప్ప శ్రద్ధతో ఆచరింపఁబడిన త్రివిధం తత్ తపః - మూఁడు విధములగు ఆ తపస్సును, సాత్త్వికం పరిచక్షతే = సాత్త్వికమునుగాను చెప్పుచున్నారు.

శ్రద్ధ యనఁగా ఆస్తిక్యబుద్ధి - యుక్తులనఁగా సమాహితులు (నిశ్చలచిత్తులు) - సాత్త్వికమునుగా శిష్టులు చెప్పుచున్నారు - అని శంకరభాష్యము -

యుక్తులనఁగా ఇది పరమపురుషునకు ఆరాధనము అనెడి తలంపుతోఁ గూడినవారు - అని రామానుజభాష్యము.

> సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్।
> క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్॥ ౧౮॥

యత్ తపః = ఏ తపస్సు, సత్కారమానపూజార్థం దమ్భేన చైవ క్రియతే - సత్కారము మానము పూజ వీనికొఱకు దమ్భముతోఁ గూడను చేయఁబడుచున్నదో, చలమ్ అధ్రువం తత్ = చంచలమైనదియును స్థిరము గానిదియునగు ఆ తపస్సు. ఇహ రాజసం ప్రోక్తమ్ = ఈ శాస్త్రమున రాజసమని చెప్పఁబడినది.

సత్కారమనఁగా ఈ బ్రాహ్మణుఁడు సాధువు అని పిలిచికొనుట - మానమనఁగా ప్రత్యుత్థానము (లేచుట), అభివాదనము (దీవింపఁ జేసికొనుట), ఈ మొదలగువానిని తన నిమిత్తము ఆచరించుట - పూజయనఁగా కాళ్లు గడుగుట పూజచేయుట మొదలగునది - వీనికొఱకైన తపస్సు సత్కారమానపూజార్థమని చెప్పఁబడుచున్నది -

అధ్రువమనఁగా ఒకానొకప్పుడు కలిగెడి ఫలము గలది - అని శంకరభాష్యము.

మనస్సుచేత ఆదరించుట సత్కారము - నోట ప్రశంసించుట మానము - శరీరము చేతఁ జేయఁబడిన సత్కారము మొదలగునది పూజ - ఫలము

కోరికతోడనను సత్కారాదులకొఱకును- స్వర్గము మొదలగునస్థిర మ్రైనఫలములనిచ్చునదిగా నచలంబును అధ్రువంబును- చలమనఁగా స్వర్గమునుండిపడిపోదుమనెడిభయము చేతకదలికనుపుట్టించునది- అధ్రువమనఁగా క్షయించునది- అని రామానుజభాష్యము-

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ॥౧౯॥

యత్ తపః=ఏ తపస్సు, మూఢగ్రాహేణ ఆత్మనః పీడయా క్రియతే=మూర్ఖపుపట్టుదలచేత తన బాధతోఁగూడ చేయఁబడుచున్నదో, పరస్య ఉత్సాదనార్థం వా క్రియతే=ఇతరుని నశింపఁజేయుటకొఱకైనను చేయఁబడుచున్నదో, తత్ తామసమ్ ఉదాహృతమ్=అది తామసమని చెప్పఁబడినది-

మూఢగ్రాహమనఁగా అవివేకనిశ్చయము- అని శంకరభాష్యము- మూఢులనఁగా అవివేకులు- వారలచేఁ జేయఁబడిన అభినివేశము (ఉద్దేశము) చేతనుతనశక్తిమొదలగుదానిని పరీక్షింపకతననుబాధపెట్టుకొనుచు చేయఁబడుచున్నదో- అని రామానుజభాష్యము-

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥౨౦॥

యత్ దానమ్=ఏ దానము, దాతవ్యమ్ ఇతి=ఈవలసినదే అని, దేశే కాలే పాత్రే చ=దేశమునందును కాలమునందును పాత్రమునందును, అనుపకారిణే దీయతే=ఉపకారము చేయనివానికి ఈఁబడుచున్నదో, తత్ దానం సాత్త్వికమ్ (ఇతి) స్మృతమ్=ఆ దానము సాత్త్వికము (అని) తలఁపఁబడినది-

అనుపకారియనఁగా ప్రత్యుపకారము చేయలేనివాఁడు- సమర్థునికొఱకైనను అపేక్షలేకయె ఈఁబడుచున్నదో- దేశమనఁగా కురుక్షేత్రాదిపుణ్యదేశము- కాలము సంక్రాంతి మొదలగునది- పాత్రమనఁగా ఆఱు వేదాంగముల నెఱిఁగినవాఁడు వేదములు తుదముట్టఁ దెలిసినవాఁడు మొదలగువాఁడు- అని శంకరభాష్యము-

ఈవలసినదేఅనితలంచిఫలమునుగోరక-అని రామానుజభాష్యము-

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।

దీయతే చ పరిక్లిష్టం తద్రాజసముదాహృతమ్॥ ౨౧॥

యత్ (దానం)తు=ఏ దాన(మైతే), ప్రత్యుపకారార్థం ఫలమ్ ఉద్దిశ్య వా=ప్రత్యుపకారముకొఱకుఁగానీ ఫలమును కోరికానీ, పరిక్లిష్టం దీయతే=క్లేశముతోఁగూడినదిగాను ఈఁబడుచున్నదో, తత్ రాజసమ్ ఉదాహృతమ్=అది రాజసముగాను చెప్పఁబడినది-

సమయము వచ్చినప్పుడు ఈతఁడు పనికివచ్చును అని గాని ఈ దానమునకు అదృష్టమైన (పరలోకములోని) ఫలము నాకుఁ గలుగునని గాని ఈఁబడినది- పరిక్లిష్టమనఁగా ఖేదముతోఁ గూడినది- అని శంకర భాష్యము-

పరిక్లిష్టమనఁగా అమంగళద్రవ్యములు కలది- అని రామానుజభాష్యము.

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్॥ ౨౨॥

యత్ దానమ్=ఏ దానము, అసత్కృతమ్ అవజ్ఞాతంచ=సత్కారము లేనిదియును తిరస్కారముతోఁ గూడినదియునై, అదేశకాలే అపాత్రేభ్యః దీయతే=పుణ్యక్షేత్రము కానిచోటనను పుణ్యకాలము కాని యప్పుడునను పాత్రులు కానివారికి ఈఁబడుచున్నదో, తత్ తామసమ్ ఉదాహృతమ్=అది తామసముగాను చెప్పఁబడినది-

అదేశమనఁగా మ్లేచ్ఛులు అపరిశుద్ధులు మొదలగువారితోఁ గూడిన అపుణ్యదేశము- అపాత్రులనఁగా మూర్ఖుఁడు దొంగ మొదలగువారు- దేశాదులు కుదిరినను, అసత్కృతము అనఁగా మంచిమాటలాడుట కాళ్లు కడుగుట పూజచేయుట మొదలగునవి లేనిది- అవజ్ఞాతమనఁగా దానము పుచ్చుకొనువానిని పరిభవించుటతోఁ గూడినది- అని శంకర భాష్యము-

అసత్కృతమనఁగా పాదములను కడుగుట మొదలగు గౌరవము లేనిది- అవజ్ఞాతమనఁగా అవజ్ఞతోఁ గూడినది- ఉపచారములు లేనిదనుట- అని రామానుజభాష్యము

ఓంతత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధస్స్మృతః।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ ౨౩॥

బ్రహ్మణః నిర్దేశః=బ్రహ్మముయొక్క నిర్దేశము, ఓం తత్ సత్ ఇతి త్రివిధః స్మృతః=ఓమ్ తత్ సత్ అని మూఁడువిధములు కలదిగా తలంపఁబడినది- తేన= దానిచేతను, బ్రాహ్మణాః వేదాశ్చ యజ్ఞాశ్చ=బ్రాహ్మణులును వేదములును యజ్ఞములును, పురా విహితాః=పూర్వము చేయఁబడినవి

నిర్దేశమనఁగా పరబ్రహ్మముయొక్క పేరును చెప్పుట- వేదాంతములయందుబ్రహ్మమునెఱిఁగినవారిచేత తలంపఁబడినది- బ్రాహ్మణులు మొదలగునవి ఈనిర్దేశముచేతనె నిర్మింపఁబడినవి అని ఈనిర్దేశము స్తోత్రముచేయఁబడుచున్నది- అని శంకరభాష్యము.

నిర్దేశమనఁగా శబ్దము-బ్రహ్మమనఁగా వేదము- ఇచ్చట వైదికకర్మము చెప్పఁబడుచున్నది-వేదమునఁ జెప్పఁబడిన యజ్ఞాదికర్మము ఓమ్ తత్ సత్ అనశబ్దములతోఁగూడినది అగుచున్నది- ఓమ్ అను శబ్దము వైదికకర్మములకు అంగముగా ఆకర్మములను ఆరంభించునప్పుడు ప్రయోగింపఁబడునుగాన అన్వయింపుచున్నది- తత్ సత్ అనుశబ్దములు పూజింపఁబడునది యగుటను జెప్పుట చేఁగర్మణములం జెప్పి యన్వయింపుచున్నవి-ఈమూఁడు శబ్దములతోఁగూడినవారుగా బ్రాహ్మణులు అనఁగా వేదసంబంధముగల మూఁడువర్ణములవారును పూర్వము నాచే నిర్మింపఁబడిరి- వేదములును యజ్ఞములునుగూడ ఈ మూఁడు శబ్దములతోఁగూడినవిగానె నాచే నిర్మింపఁబడినవి- అని రామానుజభాష్యము.

మఱియు తనకర్మము మొదలగువాని ప్రకారమును జెప్పుటవలనఁగాను అర్థవాదము చెప్పఁబడుచున్నది-ఇవి పరబ్రహ్మముయొక్క నామములు గదా- ఆబ్రహ్మముచేతను తనపూజకొఱకు వేదవిధి బయలుపఱుపఁబడినది- అనిమధ్వభాష్యము

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః॥
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్॥౨౪॥

తస్మాత్ = ఆహేతువువలన, ఓమ్ ఇతి ఉదాహృత్య (స్థితానాం) బ్రహ్మవాదినామ్=ఓమ్ అని చెప్పి (ఉన్న) బ్రహ్మవాదులయొక్క, విధానోక్తాః యజ్ఞదానతపః క్రియాః= విధిలోఁ జెప్పఁబడిన యజ్ఞదాన

తపస్సులనెడి క్రియలు, సతతం ప్రవర్తన్తే = ఎల్లప్పుడును ప్రవర్తింపుచున్నవి-

విధానోక్తములనఁగా శాస్త్రములోఁ జెప్పఁబడినవి- బ్రహ్మవాదులనఁగా బ్రహ్మమును చెప్పెడు స్వభావముకలవారు- అని శంకరభాష్యము

బ్రహ్మవాదులనఁగా వేదవాదులగు మూడువర్ణములవారును- విధానమనఁగా వేదవిధి- యజ్ఞములు ఓమ్ అని చెప్పినతరువాతనె ఆరంభింపఁబడుచున్నవి- వేదములుగూడ ఓమ్ అని చెప్పినతరువాతనె ఆరంభింపఁబడుచున్నవి- ఇట్లు ఓమ్ అను శబ్దముతో నన్వయించియున్న వేదములను ధరించుటవల్లనున్ను యజ్ఞాదులను చేయుటవల్లనను మూడువర్ణములవారలకును ఓమ్ అను శబ్దముతో సంబంధము చెప్పఁబడినది- అని రామానుజభాష్యము.

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః॥ ౨౫॥

తత్ ఇతి = తత్ అని, ఫలమ్ అనభిసంధాయ = ఫలమును ఉద్దేశింపక, వివిధాః యజ్ఞతపఃక్రియాః దానక్రియాశ్చ = అనేకవిధములగు యజ్ఞములు తపస్సులు అనెడి క్రియలను దానములనెడి క్రియలును, మోక్షకాంక్షిభిః క్రియన్తే = మోక్షమును గోరువారిచేత చేయఁబడుచున్నవి.

తత్ అని బ్రహ్మమును చెప్పు శబ్దమును ఉచ్చరించి- అనేకవిధములగు దానములనఁగా భూదాన సువర్ణదానాదులు- అని శంకరభాష్యము.

మోక్షమును గోరెడి మూడువర్ణములవారిచేతను జేయఁబడెడి వేదాధ్యయనము యజ్ఞము తపస్సు దానము అనెడి క్రియలు బ్రహ్మమును జేరుటకు సాధనములుగా బ్రహ్మమును చెప్పెడి తత్ అను శబ్దముచేత నిర్దేశింపఁబడఁదగినవి- ఇట్లు వేదాధ్యయనాదులకు తత్ అను శబ్దముతో నన్వయము చెప్పఁబడినది- వీనిని ఆచరించుటచేత మూడువర్ణములవారలకును గూడ తచ్ఛబ్దాన్వయము సుసందర్భింపుచున్నది- అని రామానుజభాష్యము.

(తత్) ఆ ఫలమును నాకు కలుగవలయునని కోరక- అని మధ్వభాష్యము

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే।

ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥ ౨౬॥

సత్ ఇతి ఏతత్ = సత్ అనెడి ఇది, సద్భావే సాధుభావే చ ప్రయుజ్యతే = కలదియగుటయందును మంచిదియగుటయందును ప్రయోగింపబడుచున్నది (హే) పార్థ! = (ఓ) కుంతీపుత్రుడా!, తథా = అట్లే, సచ్ఛబ్దః ప్రశస్తే కర్మణి యుజ్యతే = సచ్ఛబ్దము ప్రశస్తమైన కర్మమునందు సందర్భింపుచున్నది-

సద్భావమనగా లేనిదికలుగుట- మంచినడతలేనివానికి మంచినడతకలుగుట సాధుభావము- వీనియందు బ్రహ్మముయొక్క సత్ అనెడినామము ప్రయోగింపబడుచున్నది- మంచికర్మమనగా వివాహము మొదలగునది- యుజ్యతే = ప్రయోగింపబడుచున్నది-అని శంకర భాష్యము

సద్భావశబ్దముచేత ప్రజనము సూచింపబడినది- అని మధ్వభాష్యము.

యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే।
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే॥ ౨౭॥

యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి ఉచ్యతే = యజ్ఞమునందును తపస్సునందును దానమునందును ఉనికి సత్ అని చెప్పబడుచున్నది- తదర్థీయం కర్మ చైవ = తదర్థమైన కర్మంబును, సత్ ఇత్యేవ అభిధీయతే = సత్ అనియె చెప్పబడుచున్నది

తదర్థీయమనగా యజ్ఞదానతపస్సులకొఱకైనది లేక ఓమ్ మొదలగుమూడునామములుగల ఈశ్వరునికొఱకైనదనియును చెప్పవచ్చును- శ్రద్ధాపూర్వకమగు యజ్ఞాదికము గుణహీనమయినను బ్రహ్మనామములను ప్రయోగించుటచేత సగుణమగును- అని శంకర భాష్యము.

మూడువర్ణములవారలయొక్క యజ్ఞాదులయందలి యునికి మంచిదిగా నన్నని చెప్పబడుచున్నది- (తదర్థీయమ్) ఆమూడువర్ణములవారలకొఱకైన యజ్ఞాదికర్మంబును సత్తనబడును- కాబట్టి వేదములును వైదికకర్మములును బ్రాహ్మణులని చెప్పబడిన మూడువర్ణముల వారును కూడ ఓంతత్సత్ అనుశబ్దములసంబంధమనెడి గుఱుతుచేత వేదములు కానివానికంటెను అవైదికులకంటెను విలక్షణులని తెలియబడదగినవారు- అని రామానుజభాష్యము.

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతంచ యత్।
అసదిత్యుచ్యతే పార్థ నచ తత్ప్రేత్య నో ఇహ॥౨౮॥

అశ్రద్ధయా హుతమ్=అశ్రద్ధతో హోమము చేయఁబడినదియు, (అశ్రద్ధయా) దత్తమ్-(అశ్రద్ధతో) దానము చేయఁబడినదియు, (అశ్రద్ధయా) తప్తం తపః-(అశ్రద్ధతో) ఆచరింపఁబడిన తపస్సును, (అన్యత్) యత్ (అశ్రద్ధయా) కృతం (తత్) చ=(ఇతరమైనది) ఏది (అశ్రద్ధతో) చేయఁబడినదో (అది)యును, అసదితి ఉచ్యతే =అసత్తని చెప్పఁబడుచున్నది- తత్ ప్రేత్య (ఫలాయ) న(భవతి)= అది చచ్చినతరువాతను (ఫలముకొఱకు) కానేరదు- ఇహచ (ఫలాయ) న(భవతి)-ఈజన్మమునఁగూడ (ఫలముకొఱకు) కానేరదు.

అశ్రద్ధతో బ్రాహ్మణులకిచ్చినదియును- అశ్రద్ధతోఁ జేయఁబడిన హోత్రమునమస్కారము మొదలగునదిగూడ- నన్ను జెందుటకు సాధనమయినమార్గమునకు వెలుపలిది గాన అసత్తనఁబడుచున్నది. అవి విస్తారము ఆయాసముతోఁగూడినదైనను పెద్దలచేనిందింపఁబడుటను ఇహపరములరెంటనుఫలమును గలుగఁజేయదు. అనిశంకరభాష్యము.

శాస్త్రీయమైనను అశ్రద్ధతోఁ జేయఁబడిన హోమము మొదలగునది అసత్తనఁబడును. అది మోక్షమునకును సంసారములోనిఫలమునకును గూడ పనికిరాకపోవుటయే అట్లు చెప్పఁబడుటకు హేతువు. అని రామానుజభాష్యము.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశా
స్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయవిభాగయోగో నామ
సప్తదశోఽధ్యాయః.

ఇట్లుఉపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకం
బును యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదం
బునగుభగవద్గీతలలో మూఁడుశ్రద్ధలను విభాగిం
చుటయనెడిజ్ఞానసాధనమును తెలియఁ
జేసెడిపదునేడవ యధ్యాయము.

# గీతాభాష్యత్రయసారము.

## పదునెనిమిదవయధ్యాయము.

అర్జునఉవాచ.

సంన్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన ॥౧॥

(హే) మహాబాహో! = (ఓ) గొప్పభుజములు కలవాడా!, (హే) కేశినిషూదన! = (ఓ) కేశిని చంపినవాడా!, (హే) హృషీకేశ! = (ఓ) శ్రీకృష్ణుడా!, సంన్యాసస్య త్యాగస్య చ తత్త్వమ్ = సంన్యాసముయొక్కయును త్యాగముయొక్కయును తత్త్వమును, పృథక్ వేదితుమ్ ఇచ్ఛామి = వేర్వేరుగా తెలియుటకు కోరుచున్నాను.

శ్రీభగవానువాచ.

కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥౨॥

(కేచిత్) కవయః = (కొందఱు) పండితులు, కామ్యానాం కర్మణామ్ న్యాసం సంన్యాసం విదుః = కామ్యములగు కర్మములను విడుచుటను సంన్యాసమునుగా తలంచెదరు. విచక్షణాః = పండితులు, సర్వకర్మఫలత్యాగం త్యాగం ప్రాహుః = అన్నికర్మములయొక్క ఫలమును విడిచిపెట్టుటను త్యాగమునుగా చెప్పుచున్నారు.

సర్వకర్మములనఁగా నిత్యనైమిత్తికములు. వానికిఁగూడ ఫలముకలదనియె భగవదభిప్రాయము. అని శంకరభాష్యము.

విచక్షణులనఁగా మఱికొందఱు పండితులు, నిత్యనైమిత్తికకామ్యములనెడి యన్నికర్మములయొక్క ఫలత్యాగమునే త్యాగమునుగాఁ జెప్పుదురు. త్యాగసంన్యాసశబ్దములు పర్యాయములు. అని రామానుజభాష్యము.

ఫలమును గోరకపోవుటచేతఁగానీ చేయకపోవుటచేతఁగానీ కామ్యకర్మములను విడుచుట సంన్యాసము. త్యాగమనఁగా ఫలమును విడుచుటయె. అని మధ్వభాష్యము.

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే ॥3॥

ఏకే మనీషిణః=కొందఱు పండితులు, దోషవత్ కర్మ త్యాజ్యమ్ ఇతి (ఆహుః)=దోషముగల కర్మము విడువఁదగినది అని (చెప్పుచున్నారు) అపరేచ=మఱికొందఱు, యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యమ్ ఇతి (ఆహుః)=యజ్ఞము దానము తపస్సు అనెడికర్మము విడువఁదగనిది అని (చెప్పుచున్నారు.)

మనీషులనఁగా సాంఖ్యులు. ఈ చెప్పినవికల్పములన్నియు కర్మాధికారులనుగూర్చినవియె. ఇదిజ్ఞాననిష్ఠులపరిగ్రహము కాదు- సాత్త్వికత్యాగము కూడ వీరిదె- జ్ఞానిగుణాతీతుఁడుగదా- అని శంకరభాష్యము.

కాపిలసిద్ధాంతమువారును తదనుసారులగువైదికులును రాగాదిదోషములుండుటనుకర్మమునంతయు విడువవలయునందురు- మిగిలినవారు విడువఁగూడదందురు- అని రామానుజభాష్యము.

మనీషులనుటచే నాపక్షముగూడ స్వీకరింపవలసినదే- ఆపక్షమున ఫలమును విడుచుటచేతనే త్యాగము- కావుననిదియుఁ దియునొకపక్షమే- అనిమధ్వభాష్యము.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగోహి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః॥౪॥

(హే) భరతసత్తమ!=(ఓ)భరతశ్రేష్ఠుఁడా!, తత్ర త్యాగే మే నిశ్చయం శృణు=ఆ త్యాగమువిషయమున నా నిశ్చయమును వినుము- (హే)పురుషవ్యాఘ్ర!=(ఓ)పురుషశ్రేష్ఠుఁడా!, త్యాగః త్రివిధః సంప్రకీర్తితోహి=త్యాగము మూఁడువిధములుగలదిగాఁ జెప్పఁబడినదిగదా.

త్యాగమన్నను సంన్యాసమన్నను ఒకటియె- ఇదితామసాదిభేదమునమూఁడువిధములు. ఇది పూర్వాధికారికె-అనిశంకరభాష్యము.

కర్మఫలమునువిడుచుటయు, ఇదినాకర్మమనెడిమమకారమును విడుచుటయు, సర్వేశ్వరుఁడు కర్త యనితలఁచుటచేత తనకర్తృత్వమును విడుచుటయునని త్యాగము మూఁడువిధములుగా ౩అ॥౩౦శ్లోకమునఁ జెప్పఁబడినదిగదా- అని రామానుజభాష్యము.

యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యంకార్యమేవతత్।
యజ్ఞోదానంతపశ్చైవ పావనాని మనీషిణామ్॥౫॥

యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యమ్=యజ్ఞదానతపస్సులనెడికర్మము విడువఁదగినదికాదు- తత్ కార్యమేవ=అది చేయఁదగినదే- యజ్ఞః దానం తపశ్చైవ మనీషిణాం పావనాని=యజ్ఞంబును దానంబును తపస్సునే మనీషులకు పవిత్రముచేయునవి.

మనీషులనఁగా ఫలమునుగోరనివారగనట- అనిశంకరభాష్యము-

యజ్ఞదానతపస్సులు మొదలయినవర్ణాశ్రమకర్మములు- మనీషులనఁగాఉపాసనముచేయువారు- వారిఉపాసనముసిద్ధించుటకు విరోధులగు ప్రాచీనకర్మమును నశింపఁజేయునుట-అని రామానుజభాష్యము.

రఅ॥౨౮శ్లోకము యజ్ఞభేదములుచెప్పఁబడినవి- దానములలో నభయదానము చేరుచున్నది- వీనిలో నేదైననొకవిధమగు యజ్ఞము మొదలగుదానిని చేయవలసిన దే- సంన్యాసులుగూడ జ్ఞానయజ్ఞము విద్యాదానము అభయదానము బ్రహ్మచర్యము మొదలగుతపస్సు వీరికి వారికి దా- కాఁబట్టి మతియొకవిధమైనవాక్యమేదైననున్నచో అధికారిభేదమునుపట్టి దానిని సవరించవలయును- లేనిచో మిగిలిన వచనములకు గతి లేకపోవలసివచ్చును- అని మధ్వభాష్యము-

ఏతాన్యపితుకర్మాణి సఙ్గంత్యక్త్వాఫలానిచ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితంమతముత్తమమ్॥౬॥

(హే)పార్థ!=(ఓ)కుంతీపుత్రుఁడా!; ఏతాని కర్మాణ్యపి=ఈ కర్మములుఁగూడ, సఙ్గం ఫలానిచ త్యక్త్వా కర్తవ్యాని ఇతి=సంగమును ఫలమునును విడిచి చేయఁదగినవి అని, నిశ్చితమ్ ఉత్తమమ్ మే మతమ్=నిశ్చయింపఁబడినదియు శ్రేష్ఠమైనదియునగు నా మతము. (అనిశంకరభాష్యము.

ఈకర్మములనఁగా యజ్ఞదానతపస్సులే- సంగమనఁగా ఆసక్తి- సంగమనఁగాకర్మమునందు మమకారము- ఉపాసనమువలె నివియును యావజ్జీవము చేయవలసినవే- అని రామానుజభాష్యము-

నియతస్యచ సంన్యాసః కర్మణోనోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః॥౭॥

నియతస్య కర్మణః సంన్యాసః నోపపద్యతే=నియతమైన కర్మమునకు సంన్యాసము సంభవింపదు- మోహాత్ తస్య పరిత్యాగః=అ

జ్ఞానముపలన దానిని విడుచుట, తామసః (ఇతి) పరికీర్తితః=తామసము (అని) చెప్పఁబడినది.

ఇవిజ్ఞానము లేనివాఁడె మోక్షముం గోరువానిఁగూర్చినది- నియతమనఁగా నిత్యము- అని శంకరభాష్యము-

నియతమనఁగా నిత్యనైమిత్తికరూపమయినది- జ్ఞానము కలుగఁజేసెడి కర్మము బంధమును కలుగఁజేయుననుకొనుట మోహము- అని రామానుజభాష్యము-

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥౮॥

యత్ కర్మ (తత్)=ఏది కర్మమో (దానిని), దుఃఖమ్ ఇతి=దుఃఖమును కలుగఁజేయునది అని, (యః) కాయక్లేశభయాత్ త్యజేత్=(ఎవ్వఁడు) శరీరాయాసమువలని భయముచేత విడుచునో, సః రాజసం త్యాగం కృత్వా=వాఁడు రాజసమైన త్యాగమును చేసి, త్యాగఫలం నైవ లభేత్=త్యాగముయొక్క ఫలమును పొందనే లేఁడు.

త్యాగఫలమనఁగా జ్ఞానపూర్వకమగు సర్వకర్మత్యాగము యొక్క ఫలమగు మోక్షమును- అని శంకరభాష్యము-

కష్టమనఁగా అశ్రీమ... శమ్మునకు... నఁగావ సుఖకరమగు ధనసంపాదనముచేతఁ జేయఁబడినది... పయమున నా... యాసరూపంబుగూడనని- త్యాగమున ఫలము... పురుష శేషమైయె కర్మము భగవత్ప్రాప్తిద్వారమనమనస్సు... నును కలుగఁజేయును- అని రామానుజభాష్యము.

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో మతః ॥౯॥

(హే) అర్జున!=(ఓ యర్జునుఁడా!), నియతం కర్మ=నియతమైన కర్మము, సఙ్గం ఫలం చ త్యక్త్వా కార్యమ్=సంగమును ఫలమును విడిచియె చేయఁదగినది, ఇత్యేవ క్రియతే(ఇతి) యత్=అనియె చేయఁబడుచున్నది(అనునది) ఏది కలదో, సః త్యాగః సాత్త్వికః మతః=ఆ త్యాగము సాత్త్వికముగా తలఁపఁబడినది-

నియతమనఁగా నిత్యము అని శంకరభాష్యము-

నియతమనఁగా నిత్యనైమిత్తికరూపమైన శాస్త్రీయకర్మము- అదివ్యారాధనముగా వేఱుప్రయోజనముకొఱకు అపేక్షయై చేయవలసినదని తలంచి, దానియందుమమకారమునను దానిఫలమునను విడిచి- అని రామానుజభాష్యము.

నద్వేష్ట్యకుశలంకర్మకుశలేనానుషజ్జతే।
త్యాగీసత్త్వసమావిష్టో మేధావీఛిన్నసంశయః॥౧౦॥

మేధావీ ఛిన్నసంశయః సత్త్వసమావిష్టః త్యాగీ=బుద్ధిమంతుఁడును తెగినసంశయములుగలవాఁడును సాత్త్వికుఁడునగు త్యాగి, అకుశలం కర్మ నద్వేష్టి=మంచిదిగాని కర్మమునుగూర్చి ద్వేషింపఁడు- కుశలే నానుషజ్జతే=మంచికర్మమున సంగముకలవాఁడుగాఁడు

అకుశలమనఁగా కామ్యము- కుశలమనఁగా నిత్యము- పైనఁజెప్పినవిధముననిత్యకర్మములనాచరించుటచేత పరిశుద్ధమైనయంతఃకరణముకలవాఁడై ఆత్మజ్ఞానమునందు ఆభిముఖ్యముకలవాఁడగుచు, మేధావియనఁగా ఆత్మజ్ఞానముకలవాఁడై, దానివలననవిద్యచేఁగలిగిన సంశయములన్నియుపోయినవాఁడై, క్రియలేమియులేనియాత్మ తానుగాఁ దెలిసికొనినవాఁడై అప్పుడు అన్నికర్మములనుమనస్సనవిడిచి నైష్కర్మ్యమనెడిసిద్ధిని పొందుచున్నాఁడు- అని వెనుకఁజెప్పఁబడినకర్మయోగముయొక్క ప్రయోజనము ఈశ్లోకముచేఁజెప్పఁబడినది- అని శంకరభాష్యము.

మేధావియైఅనఁగా తత్త్వజ్ఞానము కలవాఁడై, దానివలననే సంశయములన్నియును దీరినవాఁడై- కుశలకర్మమనఁగా ఇష్టములగు స్వర్గము పుత్రులు పశువులు అన్నము మొదలగువానిని గలుగఁజేయునది- అనిష్టములఁగలుగఁజేయు పాపకర్మను అకుశలము- అదియును ప్రమాదికమై(పొరపాటునఁజేయఁబడినదియై)ఇచ్చట వివక్షింపఁబడినది- అన్నికర్మములయందును మమకారముతోసిపోవుటనును బ్రహ్మముతప్పమిగిలిన ఫలములను విడుచుటచేతనను ఆ రెండు కర్మములను చేయునప్పుడు ప్రీతిద్వేషములఁజేయఁడు- కాఁబట్టి కర్మములఫలసంగకర్తృత్వములను విడుచుటయె శాస్త్రీయత్యాగము కానికర్మములనె విడుచుట కాదు- అని రామానుజభాష్యము

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే॥ ౧౧॥

కర్మాణి అశేషతః త్యక్తుమ్=కర్మములను అన్నిటిని విడుచుటకు, దేహభృతా శక్యం నహి=దేహమును ధరించియున్నవానికి శక్యము కాదుగదా- యః కర్మఫలత్యాగీ=ఎవ్వఁడు కర్మములఫలములనువిడుచువాఁడో, సః త్యాగీ ఇతి అభిధీయతే=వాఁడు త్యాగముగలవాఁడు అని చెప్పఁబడుచున్నాఁడు-

దేహభృత్తు అనఁగా దేహమె ఆత్మయనునట్టి నెడఁదఅజ్ఞాని- జ్ఞాని కాఁడు- కాఁబట్టిఅజ్ఞుఁడు నిత్యకర్మములను చేయుచు నె కర్మఫలమునందలియిచ్ఛ లేశమును గాత్యజించినవాఁడు కర్మములుగలవాఁడైనను త్యాగియని స్తోత్రము చేయఁబడుచున్నాఁడు- కాఁబట్టి పరమార్థమునెఱిఁగినవాఁడగుటచే దేహాత్మాభిమానము లేనివానిచేతనె అన్ని కర్మములును సన్న్యసింపశక్యములగును-అని శంకరభాష్యము

దేహభృత్తనఁగా శరీరమును ధరించియున్నవాఁడు- దేహమునిలుచుటకుఁ గావలసిన తినుట త్రాగుట మొదలగునట్టి తప్పనిసరిగా నకర్మములన్నియు విడువశక్యములుగావు- వానికై పంచమహాయజ్ఞాదులనుతప్పక చేయవలయును- ఇట్టి కర్మములఫలమును విడుచువాఁడె శ్రుతులలో త్యాగియని చెప్పఁబడువాఁడు- ఫలమనుట కర్తృత్వమును కర్మసంగమును కూడఁ జూపును- అని రామానుజభాష్యము.

త్యాగశబ్దమునకు మఱియొకయర్థము చెప్పుట యుక్తము కాదు అని యీశ్లోకమునఁ జెప్పఁబడుచున్నది- అని మధ్వభాష్యము.

అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ ౧౨॥

అనిష్టమ్ ఇష్టం మిశ్రం చ (ఇతి)-అనిష్టమును ఇష్టంబును మిశ్రంబును (అని). త్రివిధం కర్మణః ఫలమ్=మూఁడువిధములైన కర్మముయొక్క ఫలము, అత్యాగినాం ప్రేత్య భవతి=త్యాగములేనివారలకు గతించినతరువాతను కలుగుచున్నది- సన్న్యాసినాం తు క్వచిత్ (అపి) నభవతి=సన్న్యాసులకో ఒక్కచోటను కలుగదు-

అనిష్టము, నరకము పశుపక్ష్యాదులగుట మొదలగునది-ఇష్టము దే

వతలు మొదలగువారగుట - మిశ్రమనఁగా మనుష్యుఁడగుట - కర్మమనఁగా ధర్మాధర్మములు - ఫలమనఁగా ఫల్గు (క్రియైనది) అగుటచేతనయమును పొందునది అనఁగా కనఁబడకపోవునది - అవి బాహ్యములగుననే కారకముల (సాధనముల) వ్యాపారములవలనఁ గలిగినవై అవిద్యచేఁ గలిగి ఇంద్రజాలము మాయ మొదలగువానివంటివై గొప్ప మోహమును కలుగఁజేయునవియై ప్రత్యగాత్మను చేరియున్నట్లు తోఁచును - ఇట్టి ఫలము అజ్ఞులకు మరణానంతరము గలుగును - పరమహంస పరివ్రాజకులకు జ్ఞాననిష్ఠులకు గలుగదు - అని శంకరభాష్యము.

అనిష్టమనఁగా నరకాదికము - ఇష్టము స్వర్గము మొదలగునది - మిశ్రమనఁగా అనిష్టముతోఁ గూడిన పుత్రులు పశువులు అన్నము మొదలగునది - కర్తృత్వమును మమకారమును ఫలమును విడువనివారు అత్యాగులు - ప్రేత్య అనుదానికి కర్మములనాచరించిన తరువాతను అనియర్థము - త్యాగులకు మోక్షవిరోధమగు ఫలము ఎప్పుడును కలుగదు - ఇట్లు కర్మములను చేయుచునె వానికర్తృత్వములను విడుచుట శాస్త్రసిద్ధమైన సంన్యాసము - అదియె త్యాగము అని చెప్పఁబడినది - అని రామానుజ

ఇది త్యాగస్తోత్రము - అని మధ్వభాష్యము. (భాష్యము

పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే।
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥౧౩॥
అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥౧౪॥

(హే) మహాబాహో! - (ఓ) గొప్పభుజములుకలవాఁడా!, సర్వకర్మణాం సిద్ధయే = అన్నికర్మములను సిద్ధించుటకొఱకు, సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని = సాంఖ్యమనెడి సిద్ధాంతమున చెప్పఁబడిన, అధిష్ఠానం తథా కర్తా పృథగ్విధం కరణం చ = అధిష్ఠానంబును అట్లే కర్తయును వివిధములగు కరణంబును, పృథక్ వివిధా చేష్టా చ = వేఱువేఱుగా అనేకవిధములగు చేష్టయును, అత్ర పఞ్చమం దైవం చ = వీనిలో అయిదవదియగు దైవంబును, (ఇతి) ఏతాని పఞ్చ కారణాని = (అనెడి) ఈ అయిదు కారణములను, మే (సకాశాత్) నిబోధ = నా (వలన) తెలిసికొనుము.

కారణములనఁగా కార్యమును నెఱవేర్చునవి. కృతాంతమగు సాంఖ్యమున- అనఁగా కర్మములపరిసమాప్తిగల వేదాంతమున- ఆత్మజ్ఞానము కలిగినతోడనె కర్మములన్నియు నివర్తించును గదా- అధిష్ఠానమనఁగా ఇచ్ఛాద్వేషసుఖదుఃఖజ్ఞానాదులు బయలుదేరుటకు ఆధారమైన శరీరము- కర్తయనఁగా ఉపాధిస్వరూపుఁడగు భోక్త- కరణమనఁగా శ్రోత్రము మొదలగు పండ్రెండును- చేష్టలనఁగా వాయుసంబంధులగు ప్రాణము అపానము మొదలగునవి- దైవమనఁగా చక్షుస్సు మొదలగువానికి సహాయము చేసెడి ఆదిత్యుఁడు మొదలగునది- అని శంకరభాష్యము-

సంఖ్యయనఁగా బుద్ధి- సాంఖ్యమగు కృతాంతమున- అనఁగా వైదిక బుద్ధితోఁ జేరియున్న నిర్ణయమున- సిద్ధియనఁగా పుట్టుట- వైదిక బుద్ధి, శరీరజీవాత్మేంద్రియప్రాణములు ఉపకరణములుగాఁగల పరమాత్మనే కర్తగా నిశ్చయింపుచున్నది- ఇట్లు జీవునికర్తృత్వము పరమాత్మకు అధీనమైనచో విధినిషేధశాస్త్రములన్నియు నిరర్థకములు కావలసివచ్చునే యన్నను వినుండు- జీవాత్మ, పరమాత్మచే నీఁబడి ఆతఁడె ఆధారముగాఁగలవియును ఆతనిచేఁ గలుగఁజేయఁబడిన శక్తులుగలవియును అగు కరణకళేబరములతోఁ గూడినవాఁడై, తానును ఆతఁడె ఆధారము మొదలగునవిగాఁగలవాఁడై పనులు జరుగుటకు తన యిచ్ఛచేతనె కరణాదులను అధిష్ఠించియుండుటయనెడి ప్రయత్నమును ఆరంభించును. ఆలోపల నుండెడి పరమాత్మయును తన యనుమతినిచ్చుటచేత ఆతనిని ప్రవర్తింపఁజేయుచున్నాఁడు- కాఁబట్టి జీవునికి స్వబుద్ధిచేతనె ప్రవర్తించుట కలదు- అని బ్రహ్మసూత్రములలోనే (౨॥౩॥౪౧ సూ) స్పష్టపఱుపఁబడినది- అని రామానుజభాష్యము-

వెండియు సన్న్యాసమును వివరించుటకు కర్మకారణములు చెప్పఁబడుచున్నవి- సాంఖ్యేకృతాన్తే = జ్ఞానసిద్ధాంతమున. అధిష్ఠానమనఁగా దేహము మొదలగునది- కర్తయనఁగా విష్ణువు- జీవుఁడు కర్తగాఁడు- కరణమనఁగా ఇంద్రియములు మొదలగునది- చేష్టలనఁగా క్రియలు- హోమము మొదలగు కర్మములు చేతులు మొదలగువాని వ్యాపారములచేతఁగదా కలుగుచున్నవి- ధ్యానము మొదలగువాని

కిం గూడ మనస్సుయొక్క చేష్టసాధనము- పూర్వజన్మము సంచితచే
ష్టయను సంస్కారమునకుం గారణమగుటను. దైవమనంగా అదృష్ట
ము. అని మధ్వ భాష్యము.

శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః।
న్యాయ్యంవా విపరీతంవా పఞ్చైతే తస్య హేతవః॥౧౫॥

నరః శరీరవాఙ్మనోభిః=పురుషుండు శరీరము వాక్కు మనస్సు అనువాని చేత, న్యాయ్యంవా విపరీతంవా యత్ కర్మ ప్రారభతే=న్యాయము తప్పనిదైనను అట్టిది కానిదైనను ఏకర్మము నారంభించుచున్నాండో, తస్య ఏతే పఞ్చ హేతవః= దానికి ఈ ఐదును హేతువులు.

ఱెప్పపాటు శరీరముకు దల్చుట మొదలగునవి గూడ పూర్వజన్మపుధర్మాధర్మముల కార్యమె కాన న్యాయ్యవిపరీతములలోనె చేరుచున్నవి- అని శంకరభాష్యము

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః॥౧౬॥

ఏవం సతి=ఇట్లు అగుచుండంగా, తత్ర=ఆవిషయమున, యః అకృతబుద్ధిత్వాత్=ఎవ్వండు అశిక్షితబుద్ధిగలవాండగుటను, కేవలమ్ ఆత్మానం కర్తారం పశ్యతి=ఒక్క ఆత్మను కర్తనుగా తలంచుచున్నాండో, సః దుర్మతిః నపశ్యతి=ఆదుర్బుద్ధిగలవాండు ఎఱుంగండు-

తత్ర= ఆ యయిదింటిలో- కేవలమ్ ఆత్మానమ్=పరిశుద్ధుండైన ఆత్మను . అకృతమైనయనంగా వేదాంతములు ఆచార్యోపదేశము న్యాయము వీంచేత సంస్కరింపంబడనిదైన బుద్ధిగలవాండు- అని శంకర॥

జీవుని కర్తృత్వము పరమాత్మయొక్క యనుమతిని బట్టి నడగుచుండంగా. తత్ర=ఆకర్మమునందు. అకృతబుద్ధియనంగా వస్తుస్థితిని తెలిసికొననిబుద్ధి కలుగనివాండు- అని రామానుజభాష్యము.

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।
హత్వాఽపి స ఇమాఁల్లోకాన్న హన్తి న నిబధ్యతే॥౧౭॥

యస్య అహంకృతః భావః న=ఎవ్వనికి అహంకారముతోంగూడిన భావము లేదో, యస్య బుద్ధిః నలిప్యతే=ఎవ్వని బుద్ధి అంటును పొందదో, సః ఇమాన్ లోకాన్ హత్వాఽపి=వాండు ఈ లోకములను

చంపియును, నహన్తి=చంపఁడు- ననిబధ్యతే=బంధింపఁబడఁడు-

అహంకృతము అనఁగా నేను కర్తను అనెడి, భావము అనఁగా తలఁపు-అవిద్యచేత ఆత్మయందు కల్పింపఁబడిన ఈయధిష్ఠానాదులైదె అన్నికర్మములకును కర్తలు, నేను కాను, నేను వాని వ్యాపారములకు సాక్షిమైనవాఁడను, అనియిట్లు తలంచువాఁడు- బుద్ధియనఁగా ఆత్మకు ఉపాధియైన యంతఃకరణము- నలిప్యతే= పశ్చాత్తాపము గలదికాదో-ఎట్లన్నను- ఈపనిని నేను చేసితిని, దానిచేత నేను నరకమును పొందఁగలను, అనిఇట్లు. ఈలోకములను అనఁగా ప్రాణులను. ననిబధ్యతే=అధర్మము కలవాఁడుకాఁడు. చంపఁడు బంధింపఁబడఁడు అనుట పారమార్థికదృష్టినిపట్టి. నాయంహన్తి న హన్యతే (౨అ॥౧౯శ్లో) అనునదియెుత్తి చెప్పటను ఉపసంహరింపఁబడుచున్నది దేహాత్మాభిమానము లేకపోవుటతోనె అవిద్యవలనఁగలిగిన యన్నికర్మములను సంన్యసించుట సంభవించునుగాన సంన్యాసులకు అనిష్టాదికర్మఫలము కలుగదనుట యుక్తమె. అట్లు కాకపోవుటవలన నితరులకు కలుగునననిదియు తప్పనిదే- ఇట్లు గీతాశాస్త్రార్థమంతయు నుపసంహరింపఁబడినది. అనిశంకర॥

భావమనఁగా కర్తృత్వమునుఁగూర్చిన మనోవృత్తివిశేషము- అదిఅహంకృతము అనఁగా అహమ్ అనెడి అభిమానము చేతఁగలిగినది కాదో-నేను చేయుచున్నానని అనెడి జ్ఞానము ఎవ్వనికి లేకుండునోయనుట. బుద్ధిలేపమును పొందకయుండునో, అనఁగా ఈకర్మమున నాకు కర్తృత్వము లేకపోవుటవలన ఈఫలము నాతో సంబంధింపఁదు, ఈకర్మంబును నాదికాదు, అనియెవ్వనికి బుద్ధికలుగునో యనుట-వాఁడు ఈజనులను యుద్ధమున చంపియు చంపకున్నవాఁడె. ఆయుద్ధమనెడి కర్మముచేత బంధింపఁబడుట యనఁగా దానిఫలము ననుభవించుటయును లేదు. అనిరామానుజభా॥

ఈశ్లోకముచేతను అజ్ఞానము స్తోత్రమును చేయఁబడుచున్నది. ఎవ్వఁడు కొంచెము బంధమును పొందునో వాఁడు కొంచెము అహంకారము గలవాఁడుగూడ ననుసు. అనిమధ్వభాష్యము.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మకర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥౧౮॥

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా (ఇతి)=తెలిసియును తెలియఁబడున

దియు తెలిసికొనువాఁడును. (అని) కర్మచోదనా త్రివిధా-కర్మవిధి మూఁడువిధములుగలది. కరణం కర్మ కర్తా (ఇతి)= కరణంబును కర్మయును కర్తయును (అని,) కర్మసంగ్రహః త్రివిధః= కర్మసంగ్రహము మూఁడువిధములుగలది.

పరిజ్ఞాతయనఁగా ఉపాధిస్వరూపుఁడగుభోక్త. ఈమూఁడునుఅన్నికర్మములం బ్రవర్తింపఁజేయునవి. ఈమూఁడును జేరిన పైనె అన్నికర్మములను నారంభించుటకలుగును- కరణమనఁగా వెలుపలివియగుశ్రోత్రాదులునులోపలివియగు బుద్ధి మొదలగునవియును- కర్మమనఁగా కర్తచేఁబొందఁగోరఁబడినది- ఈమూటితోడనునుకర్మముసంబంధించియుండును గాన కర్మసంగ్రహమనఁబడుచున్నవి- అనిశంకరభాష్యము-

చేయఁదగినకర్మముజ్ఞేయము- దానిని తెలిసికొనుటజ్ఞానము- తెలిసికొనువాఁడు పరిజ్ఞాత-జ్ఞేయంబగుఆకర్మముమూఁడువిధములుగాసంగ్రహింపఁబడుచున్నది- ద్రవ్యము మొదలగు సాధనము కరణము-కర్మము,యోగము మొదలగునది- ఆచరించువాఁడుకర్త- అనిరామానుజభా॥

ఇట్లైనచో విధిపురుషునిఁబుట్టినది కాకపోవునను శంకకుఁజెప్పఁబడుచున్నది- ఈమూటినిఅపేక్షించి కర్మవిధిగాన కర్మవిధిమూఁడువిధములుగలదని చెప్పఁబడుచున్నది- ఉత్తరార్ధముచే కారణములుసంగ్రహించి చెప్పఁబడుచున్నవి. కరణసంగ్రహము అనఁగా కర్మమునకు కారణములగువానిసంగ్రహము- అధిష్ఠానము మొదలగునదికరణమునందె చేరుచున్నది- కర్తృత్వము లేకపోయినను విధిద్వారమున ఈశ్వరప్రసాదమున నిచ్ఛకలుగుటను,చెప్పఁబడినకారణములచేత కర్మద్వారమునపురుషార్థముకలుగుచున్నది- ఈశ్వరాధీనుఁడైనను విధిద్వారమున ఆతనిచేతనె నియమింపఁబడినవాఁడు- ఇచ్ఛాదులుపుట్టినచో ఈశ్వరునిచేతనెచేయఁబడినదియగును- ఫలముతప్పదు- వస్తుతత్వమునుబట్టి కర్త కాకపోయినను అభిమానికమగుకర్తృత్వమువానికె-జనములనపేక్షించి స్వాతంత్ర్యముగూడకలదుగాన వానింగూర్చి విధులువ్యర్థములగుట లేదు-అని మధ్వభాష్యము.

జ్ఞానంకర్మచకర్తాచ త్రిధైవగుణభేదతః।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణుతాన్యపి॥౧౯॥

జ్ఞానం కర్మచ కర్తాచ=జ్ఞానంబును కర్మంబును కర్తయునుగూడ, గుణభేదతః త్రిధైవ(భవన్తి)-గుణముల భేదమునుబట్టి మూడువిధములుగానె(ఉన్నవి)-(ఇతి) గుణసంఖ్యానే ప్రోచ్యతే-(అని) గుణసంఖ్యానమునందు చెప్పఁబడుచున్నది- తాన్యపి యథావత్ శృణు-వానినిగూడ తగునట్లుగా వినుము.

కర్మమనఁగా క్రియ. గుణసంఖ్యానమనఁగా కపిలునిచేఁ జెప్పఁబడిన సాంఖ్యశాస్త్రము. అదిబ్రహ్మమొక్కటియె అనువిషయమున విరుద్ధముగానున్నను గుణములవ్యాపారములను నిరూపించుటయందు సరిగానెయుండును- యథావత్=యథాశాస్త్రముగా. అని శంకరభాష్యము- (రామానుజభాష్యము_

గుణసంఖ్యానముననఁగాగుణముల కార్యములను చెప్పుటలో- అ
వెండియుసాధనమును విస్తరింపఁజేయుటకై చెప్పఁబడుచున్నది- గుణసంఖ్యానమనఁగా గుణములను లెక్కపెట్టెడి ప్రకరణము- అని మధ్వభాష్యము

సర్వభూతేషుయేనైకంభావమవ్యయమీక్షతే।
అవిభక్తంవిభక్తేషుతజ్జ్ఞానంవిద్ధిసాత్త్వికమ్॥౨౦॥

విభక్తేషు సర్వభూతేషు= విభజింపఁబడిన అన్నిభూతములయందును,అవిభక్తమ్ అవ్యయమ్ ఏకం భావమ్= విభజింపఁబడినదియును నిర్వికారమైనదియునునగు ఒక్క భావమును, యేన ఈక్షతే= దేనిచేత తెలిసికొనుచున్నాఁడో, తత్ జ్ఞానం సాత్త్వికం విద్ధి=ఆ జ్ఞానమును సాత్త్వికమునుగాను తెలిసికొనుము.

భావమనఁగా వస్తువు- ఒక్క ఆత్మవస్తువును- ఈసాత్త్వికజ్ఞానమె అద్వైతజ్ఞానము- అని శంకరభాష్యము-

భావమనఁగా ఆత్మవస్తువు- బ్రాహ్మణాదిభేదములచేవిభజింపఁబడిన అన్నిభూతములయందును ఆత్మలు అభేదములు లేనివారైజ్ఞానైకాకారులైఫలాదిసంగములకు తగనివారైయుండురనికర్మములనాచరించునప్పుడు తెలిసికొనెడి జ్ఞానము సాత్త్వికము-అని రామానుజభా॥

ఒక్క భావమును అనఁగా విష్ణువును-అని మధ్వభాష్యము.

పృథక్త్వేనతు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్।

వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్॥౨౧॥

యత్ జ్ఞానం తు=ఏ జ్ఞానమైతే, పృథక్త్వేన నానాభావాన్=అనేకవిధములుగా నుండెడి అనేకవస్తువులను, సర్వేషు భూతేషు పృథక్త్వేన వేత్తి=అన్ని భూతములయందును వేఱువాటుతో తెలిసికొనుచున్నదో, తత్ జ్ఞానం రాజసం విద్ధి=ఆ జ్ఞానమును రాజసమును గాను తెలిసికొనుము.

ప్రతిశరీరమునను ఆత్మలు భిన్నులు గానున్నారనుకొనుట రాజసజ్ఞానము-జ్ఞానము తెలిసికొనుచున్నదనుట సంభవింపదు గాన జ్ఞానముచేత తెలిసికొనుచున్నాఁడో అని యర్థము- అని శంకరభాష్యము.

కర్మముల నాచరించునప్పుడు ఆత్మలుగూడ బ్రాహ్మణాద్యాకారములుగలవారై యుందురనుకొనుట రాజసజ్ఞానము- అని రామానుజభా॥

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్॥౨౨॥

యత్తు= ఏ జ్ఞానమైతే, ఏకస్మిన్ కార్యే కృత్స్నవత్ సక్తమ్=ఒకటి కార్యమందు సమస్తమైనదానియందువలె ఆసక్తికలదో, అహైతుకమ్=హేతువులేనిదో, అతత్త్వార్థవత్= తత్త్వమునుగూడిన యర్థము లేనిదో, అల్పం చ=స్వల్పమైనదో, తత్ తామసమ్ ఉదాహృతమ్=అది తామసముగా చెప్పఁబడినది.

ఒకటి కార్యమనఁగా దేహముగాని ప్రతిమ(బొమ్మ) మొదలుగునదిగాని-ఇదియె ఆత్మయైనను ఈశ్వరుఁడైనను, దీనికి పైని మఱి లేదనునెడి జ్ఞానము- అహైతుకమని పాఠము- యుక్తులు కలది గానిది అనియర్థము- అల్పమనఁగా ఫలంబును విషయంబును స్వల్పములు గాఁ గలది- అని శంకరభాష్యము.

ఒకటి కార్యమనఁగా ప్రేతములు భూతగణములు మొదలగువానిని ఆరాధించుట-కృత్స్నవత్=అన్ని ఫలములనిచ్చెడి దానియందువలె-అహైతుకమ్=అట్టిశక్తి దానియందు కలుగుటకుతగిన హేతువులేనిది- స్వల్పమనుట స్వరూపముంబట్టియు ఫలమునుబట్టియు- అని రామానుజభాష్యము.

నియతం సఙ్గరహితమరాగద్వేషతః కృతమ్।

అఫలప్రేప్సునాకర్మయత్తత్సాత్త్వికముచ్యతే॥౨౩॥

యత్ కర్మ=ఏ కర్మము, నియతం సఙ్గరహితమ్=నియతంబును ఆసక్తి లేనిదియునై, అఫలప్రేప్సునా అరాగద్వేషతః కృతమ్=ఫలమును పొందఁగోరనివానిచేత రాగద్వేషములు లేక చేయఁబడినదో, తత్ సాత్త్వికమ్ ఉచ్యతే=అది సాత్త్వికముగా చెప్పఁబడుచున్నది.

నియతమనఁగా నిత్యము- అని శంకరభాష్యము.

నియతమనఁగా తనవర్ణాశ్రమములకుఁ దగినది- కర్తృత్వాది సంగము లేనిది- కీర్తియందు రాగము- అకీర్తియందు ద్వేషము- అని రామానుజభా॥

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః।
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్॥౨౪॥

యత్ కర్మ తు=ఏ కర్మమైతే, కామేప్సునా సాహంకారేణ వా=ఫలమును గోరువానిచేతఁ గానీ అహంకారముతోఁ గూడినవానిచేతఁ గానీ, బహులాయాసం (యథాతథా) క్రియతే=విస్తారమగు ఆయాసముతోఁ (కూడునట్లుగాను) చేయఁబడుచున్నదో, తత్ రాజసమ్ ఉదాహృతమ్=అది రాజసముగాను చెప్పఁబడినది.

సాత్త్వికకర్మమునకుఁ గూడ ఆత్మజ్ఞానము లేనివాఁడును అహంకారముతోఁ గూడినవాఁడు నేకర్తయగునప్పుడు రాజసతామసముల విషయమున చెప్పవలసినదేమున్నది? అని శంకరభా విభజింపఁబ

వా అనునది చ అనుదాని యర్థము గలదియును, యశస్సుగోరువాఁడును కర్తృత్వాభిమానముగలవాఁడునగువానిచేత- అని రామానుజభా॥

అనుబన్ధం క్షయం హింసామనవేక్ష్య చ పౌరుషమ్।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే॥౨౫॥

అనుబన్ధం క్షయం హింసాం పౌరుషం చ అనవేక్ష్య=తరువాతఁ గలుగుదానిని ధనము తగ్గుటను ప్రాణులకుఁ గలిగెడి పీడనును తనసామర్థ్యమును విమర్శింపక, యత్ కర్మ మోహాత్ ఆరభ్యతే=ఏ కర్మము అజ్ఞానమువలన ఆరంభింపఁబడుచున్నదో, తత్ తామసమ్ ఉచ్యతే=అది తామసముగా చెప్పఁబడుచున్నది-

క్షయమనఁగా శక్తియును ధనంబును తగ్గుట- అనపేక్ష్య(అపేక్షింపక) అని పాఠము అని శంకరభాష్యము.

కర్మమును చేసినందువలనఁ గలిగెడి దుఃఖము అనుబంధము- మోహమనఁగా పరమపురుషుఁడు కర్తయని తెలిసికొనకపోవుట- అని రామానుజభాష్యము.

ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥ ౨౬॥

ముక్తసఙ్గః అనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః= సంగము లేనివాఁడును అహంకారము లేనివాఁడును ధైర్యముతోను ఉత్సాహముతోను గూడినవాఁడును, సిద్ధ్యసిద్ధ్యోః నిర్వికారః కర్తా= సిద్ధించినను సిద్ధింపకపోయినను వికారము లేనివాఁడునగు కర్త, సాత్త్వికః ఉచ్యతే= సాత్త్వికుఁడుగా చెప్పఁబడుచున్నాఁడు-

ధృతి యనఁగా ధారణము- ఉత్సాహమనఁగా ప్రయత్నము- ఒక్క శాస్త్రమునె ప్రమాణముగా నమ్మి కర్మముల నాచరించువాఁడు సాత్త్వికుఁడు- అని శంకరభాష్యము.

ఫలమునందు సంగము లేనివాఁడు- అనహంవాదీ= కర్తృత్వాభిమానము లేనివాఁడు- ధృతి యనఁగా ఆరంభించిన పని కడతేరువఱకును తప్పని దుఃఖములు ఎన్ని తటస్థించినను ఓర్చుట- ఉత్సాహమనఁగా ఉద్యోగముతోఁ గూడిన మనస్సు కలిగియుండుట- అని రామానుజభాష్యము-

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ ౨౭॥

రాగీ కర్మఫలప్రేప్సుః లుబ్ధః హింసాత్మకః అశుచిః హర్షశోకాన్వితః కర్తా= రాగము కలవాఁడును కర్మఫలమును పొందఁగోరువాఁడును లుబ్ధుఁడును హింసించుట స్వభావముగాఁ గలవాఁడును అపరిశుద్ధుఁడును సంతోషదుఃఖములతోఁ గూడినవాఁడునగు కర్త, రాజసః పరికీర్తితః= రాజసుఁడుగా చెప్పఁబడినవాఁడు.

లుబ్ధుఁడనఁగా పరద్రవ్యమునందాశ కలవాఁడును పుణ్యతీర్థాదులయందుఁ గూడ తనసొమ్మును విడువలేనివాఁడును- ఇష్టము కలిగినప్పుడుగాని తాను చేసెడిపని యనుకూలమైనప్పుడుగాని హర్షము- ఇష్టము కలుగకపోయినను అనిష్టము కలిగినను తాను చేసెడిపని చెడినను శోకము అని శంకరభాష్యము.

రాగీ=కీర్తినిగోరువాఁడు- కర్మమునకుఁగా వలసినద్రవ్యమును వ్యయము చేయ లేనివాఁడు లుబ్ధుఁడు- హింసాత్మకుఁడనఁగా పరులను బాధించిపని చేయించువాఁడు- కర్మ సఫలమైనప్పుడు హర్షము- అని రామానుజభాష్యము-

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే॥ ౨౮॥

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠః నైష్కృతికః అలసః విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా=అయుక్తుఁడును తెలివిలేనివాఁడును స్తబ్ధుఁడును శఠుఁడును నైష్కృతికుఁడును మందుఁడును మనస్సు నుడిన్న బుద్ధి కొనినవాఁడును మెల్లగా పనిచేయువాఁడునగు కర్త, తామసః పరికీర్తితః=తామసుఁడుగా చెప్పఁబడినవాఁడు.

అయుక్తః=చిత్తైకాగ్రత లేనివాఁడు-ప్రాకృతః=బుద్ధికేమియు సంస్కారము లేకపిల్లవానివలెనున్నవాఁడు-స్తబ్ధః=ఎవ్వనికిని నమ్రుఁడుకానివాఁడు- శఠః=మాయను చేయువాఁడు- తనశక్తిని దాచికొనెడివాఁడు- నైష్కృతికః=పరులవృత్తులను చెడఁగొట్టువాఁడు-(నైకృతికః అని బొంబయి పాఠము) అలసః-చేయవలసినకార్యములం గూడ ప్రవర్తింప లేనివాఁడు- దీర్ఘసూత్రీ=చేయవలసిన కార్యములను చాలకాలము చేయువాఁడు- ఈదినమునఁగానీ రేపుగానీ చేయవలసినదానిని నెలకుఁగూడ చేయఁడు- అని శంకరభాష్యము.

అయుక్తః-శాస్త్రీయములోనికర్మములకుఁదగనివాఁడు- ప్రాకృతః-చదువులేనివాఁడు- స్తబ్ధః= పనులనారంభింపఁబోవుటయె స్వభావముగాఁగలవాఁడు- శఠః-అభిచారము(చెడిపి, చిల్లంగి) మొదలగువానియందురుచిగలవాఁడు- నైకృతికః-వంచనచేయువాఁడు- అలసః-ఆరంభించినకర్మములను మెల్లగా చేయువాఁడు- దీర్ఘసూత్రీ=అభిచారములు చేయుచు ఇతరులకు చాలకాలముండెడి యనర్థమును ఆలోచించువాఁడు- అని రామానుజభాష్యము-

పరుఁడు చేసిన దోషమును ఎంతకాలమూ గడచినను సూచింపుచు నేయుండువాఁడు దీర్ఘసూత్రి-అని మధ్వభాష్యము.

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు।

ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ॥ ౨౯॥

(హే) ధనంజయ! =(ఓ) యర్జునుఁడా!, అశేషేణ పృథక్త్వేన ప్రోచ్యమానమ్ = నిశ్శేషముగా వేఱువేఱుగా చెప్పఁబడుచున్న, గుణతః త్రివిధమ్ = గుణములను బట్టి మూఁడువిధములైన, బుద్ధేః ధృతేశ్చైవ భేదమ్ = బుద్ధియొక్కయును ధృతియొక్కయును భేదమును, శృణు = వినుము.

బుద్ధి యనఁగా వివేకపూర్వకమగు నిశ్చయజ్ఞానము- ధృతియనఁగా ఆరంభించిన పనిని విఘ్నములువచ్చినను విడువకపోవుట- అని రామానుజ॥

ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే।
బన్ధం మోక్షంచ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ॥ ౩౦॥

(హే) పార్థ! =(ఓ) కుంతీపుత్రుఁడా!, యా బుద్ధిః = ఏ బుద్ధి, ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే బన్ధమ్ మోక్షంచ వేత్తి = పుణ్యసాధనమును మోక్షసాధనమును కార్యమును నకార్యమును భయమును నభయమును బంధమును మోక్షమును తెలిసికొనుచున్నదో, సా సాత్త్వికీ = అది సత్త్వగుణసంబంధియైనది-

దేశకాలాదులనుబట్టి కర్మములను చేయుట కార్యము. చేయకపోవుట అకార్యము- దొంగ పెద్దపులి మొదలగు, భయమును కలుగఁజేయునవి భయములు- జ్ఞానమనునది బుద్ధియొక్క వృత్తివిశేషము- ధృతియనట్లు -అని శంకరభాష్యము-

ప్రవృత్తినివృత్తులలో దేని నవలంబించినవారికైనను దేశకాలావస్థలనుబట్టి చేయఁదగినది కార్యము. చేయరానిది అకార్యము-శాస్త్రమునతిక్రమించుట భయస్థానము-దానిననువర్తించుట అభయస్థానము-అని రామానుజభాష్యము

యయా ధర్మ మధర్మంచ కార్యం చా కార్యమేవచ।
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ॥ ౩౧॥

(హే) పార్థ! =(ఓ) కుంతీపుత్రుఁడా!, యయా = దేనిచేతను, ధర్మమ్ అధర్మంచ కార్యంచ అకార్యమేవచ = ధర్మమును అధర్మమును కార్యమును అకార్యమును, అయథావత్ ప్రజానాతి = ఉన్నదియున్నట్లు గాక తెలిసికొనుచున్నాఁడో, సా బుద్ధిః రాజసీ = ఆ బుద్ధి రజో

గుణసంబంధముకలది. (ము- అనిశంకరభాష్యము

శాస్త్రమునవిధింపఁబడినది ధర్మము- నిషేధింపఁబడినది అధర్మ ఉన్నదియున్నట్లు తెలియుటకాక విపరీతముగాఁగూడ మధ్యమ ధ్యను తెలియుట రాజసము విపరీతముగానె తెలియుట తామసియన్నచో తామసికిని దీనికిని భేదములేకపోవలసివచ్చును- అమధ్వభాష్యము-

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా।
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ॥ ౩౨॥

(హే) పార్థ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, తమసా వృతా యా = తమస్సుచేతను ఆవరింపఁబడిన ఏబుద్ధి, అధర్మం ధర్మమ్ = అధర్మమును ధర్మమునుగాను, ఇతి సర్వార్థాన్ విపరీతాంశ్చ = ఇట్లు అన్నివస్తువులను విరుద్ధములనుగా, మన్యతే = తలంపుచున్నదో, సా బుద్ధిః తామసీ = ఆ బుద్ధి తమోగుణసంబంధముకలది.

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః।
యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ॥ ౩౩॥

(హే)పార్థ=(ఓ)కుంతీపుత్రుఁడా!, యోగేన అవ్యభిచారిణ్యా యయా ధృత్యా (యుక్తః) = యోగముతోఁగూడి తప్పనిదైన ఏ ధృతితో (కూడినవాఁడు), మనఃప్రాణేన్ద్రియక్రియాః ధారయతే = మనస్సు ప్రాణము ఇంద్రియములు వీనివ్యాపారములను నిలువఁబెట్టుచున్నాఁడో, సా ధృతిః సాత్త్వికీ = ఆ ధృతి సత్త్వగుణసంబంధముకలది.

శాస్త్రమార్గమునతిక్రమింపకుండునట్లు నిలువఁబెట్టుట- యోగమనఁగా సమాధి- ధృతిచేత ధరింపఁబడెడి మనస్సు మొదలగువాని క్రియలను యోగముచేత ధరింపుచున్నాఁడో- అని శంకరభాష్యము.

యోగమనఁగా మోక్షసాధనము భగవదుపాసనము- దానికొఱకు ప్రవర్తించి దానికె సాధనములయిన మనస్సు మొదలగువాని వ్యాపారములను ఏధృతిచేత ధరింపుచున్నాఁడో- అని రామానుజభాష్యము.

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున।
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతిః సా పార్థ రాజసీ॥ ౩౪॥

(హే)అర్జున! =(ఓ)అర్జునుఁడా!, యయా ధృత్యా = ఏ ధృతిచేత, ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ (నర) = మిక్కిలి ఆసంగముతో ఫలమునుగోరుచున్న

వాఁడై, ధర్మకామార్థాన్ ధారయతే=ధర్మకామార్థములను నిలువఁబెట్టుచున్నాఁడో, సా ధృతిః రాజసీ=ఆ ధృతి రజోగుణసం బంధము కలది.

నిలువఁబెట్టుటయనఁగా ఎల్లప్పుడును మనస్సునకు లక్ష్యము కలుగుట- దేని ప్రసక్తి కలిగినప్పుడు దానిఫలమును గోరువాఁడు అగును- అని శంకరభా॥

ధర్మార్థకామముల నెడిఫలములను గోరెడిపురుషుఁడు, మిక్కిలి సంగముతో, ధర్మకామార్థములకు సాధనములగు మనః ప్రాణేంద్రియక్రియలను ఏ ధృతిచేతధరింపుచున్నాఁడో- అని రామానుజభాష్యము.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ।
న విముఞ్చతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ ॥ ౩౫॥

(హే) పార్థ!=(ఓ) కుంతీపుత్రుఁడా!, దుర్మేధాః=దుర్బుద్ధిగలవాఁడు, యయా=ఏ ధృతిచేతను, స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ నవిముఞ్చతి=నిద్రను భయమును సంతాపమును విషాదమును మదమును విడువకున్నాఁడో, సా ధృతిః తామసీ= ఆ ధృతి తమోగుణసంబంధము కలది-

శోకమనఁగా సంతాపము- విషాదమనఁగా అవసాదము- ముఖము చిన్నబుచ్చికొనుట- మదమనఁగా తనకుఁగలిగినవిషయానుభవమును గొప్పఁజేసికొనుచు మదించియుండుట- అని శంకరభాష్యము.

స్వప్నమదములంగూర్చి ప్రవర్తించినమనస్సు మొదలగువానిక్రియలను విడువఁడో-భయశోకవిషాదశబ్దములు వానికి కలుగఁజేసెడి విషయములం జెప్పును-వానికిసాధనములగు మనస్సు మొదలగువానిక్రియలను దేనిచేతధరింపుచున్నాఁడో- అని రామానుజభాష్యము-

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥ ౩౬॥

(హే) భరతర్షభ!=(ఓ) భరతశ్రేష్ఠుఁడా!, ఇదానీమ్=ఇప్పుడు, త్రివిధం సుఖమ్=మూఁడువిధములైనసుఖమును, మే (సకాశాత్) శృణు=నా (వలన) వినుము- యత్ర అభ్యాసాత్ రమతే=దేనియందలి అభ్యాసమువలన రతినిపొందుచున్నాఁడో, దుఃఖాంతం చ నిగచ్ఛతి= దుఃఖమునంతమును గూడ పొందుచున్నాఁడో-

నిరతిశయమైనప్రీతినిపొందుచున్నాఁడో- సాంసారికదుఃఖముతోఁ కూడ అంతము నుగూడఁబొందుచున్నాఁడో-అని రామానుజభాష్యము.

యత్తదగ్రే విషమివ పరిణామే ఽమృతోపమమ్।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్॥ ౩౭॥

యత్తత్ = ఏయ్యది, అగ్రే విషమివ (భవతి) = మొదటను విషమువలెను (ఉండునో), పరిణామే అమృతోపమమ్ (భవతి) = పక్వదశయందు అమృతముతో సాటియైనది (అగుచున్నదో), ఆత్మబుద్ధిప్రసాదజమ్ తత్సుఖమ్ - ఆత్మబుద్ధియొక్క ప్రసన్నతచేఁ గలిగెడి ఆసుఖము, సాత్త్వికం ప్రోక్తమ్ = సాత్త్వికముగాఁ జెప్పఁబడినది-

మొదటను అనఁగా జ్ఞానవైరాగ్యధ్యానసమాధులను ఆరంభించునప్పుడు- ఆత్మయొక్క బుద్ధి తేటగా నుండుటచేఁ గలిగినది- ఆత్మవిషయమైన బుద్ధియనియైనఁ జెప్పవచ్చును- అని శంకరభాష్యము

మొదటనన గా యోగము నారంభించునప్పుడు- ఆత్మస్వరూపమును గూర్చినబుద్ధియొక్క ప్రసాదమనఁగా మిగిలిన విషయములన్నిటినుండి యుపరమించుట- ఆత్మస్వరూపానుభవసుఖము సాత్త్వికము- అని రామానుజభాష్యము.

విషయేన్ద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥ ౩౮॥

యత్తత్ = ఏయ్యది, విషయేన్ద్రియసంయోగాత్ అగ్రే అమృతోపమం (భవతి) - విషయములును ఇంద్రియములును కలిసికొనుటవలన మొదటను అమృతమువంటిది అగుచున్నదో, పరిణామే విషమివ (భవతి) = పరిపాకమునందు విషమువలెను (అగుచున్నదో), తత్ రాజసం సుఖమ్ = అది రజోగుణసంబంధియగు సుఖము-

విషయేంద్రియసంయోగమువలనఁ బుట్టిన సుఖము, బలము తేజము మొదలగువానిని పోఁగొట్టుటను అధర్మమువలనఁ గలిగెడినరకాదులకు హేతువగుటను విషమువంటిది- అని శంకరభాష్యము-

మొదటను అనఁగా అనుభవించునప్పుడు- పరిణామమున అనఁగా విషయములు సుఖకరములగుటకు కారణములైన ఆకలి మొదలగునవి అణఁగినతోడనే- అని రామానుజభాష్యము-

యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహనమాత్మనః।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్॥౩౯॥

యత్ సుఖమ్=ఏ సుఖము, అగ్రే చ అనుబన్ధే చ ఆత్మనః మోహనం (భవతి)=మొదటను పరిణామమునను గూడ ఆత్మకు మోహమును కలుగఁజేయునది (అగుచున్నదో), నిద్రాలస్యప్రమాదోత్థం తత్=నిద్రవలనను ఆలస్యమువలనను పొరపాటువలననుగలిగెడి ఆసుఖము, తామసమ్ ఉదాహృతమ్=తామసముగాను చెప్పఁబడినది-

ఆలస్యమనఁగా ఇంద్రియవ్యాపారములుమందగించుట- మోక్షముంగోరువాఁడు రజస్తమస్సులను త్రోసివేసి సత్త్వమునేస్వీకరించుననియని ఫలితార్థము-అని రామానుజభాష్యము.

నతదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వాపునః।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః॥౪౦॥

యత్=ఏది, ప్రకృతిజైః ఏభిః త్రిభిః గుణైః ముక్తమ్=ప్రకృతివలనఁగలిగిన ఈ మూఁడు గుణములచేతను విడువఁబడినదో, తత్ సత్త్వమ్=అట్టి ప్రాణి, పృథివ్యాంవా నాస్తి-భూమియందైనను లేదు- దివి దేవేషువా పునః నాస్తి=స్వర్గమున దేవతలలోనైనను లేదు-

బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥౪౧॥

(హే) పరంతప!-(ఓ) శత్రువులనుతపింపఁజేయువాఁడా!, బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ కర్మాణి=బ్రాహ్మణక్షత్రియవైశ్యులయు శూద్రులయును వ్యాపారములు, స్వభావప్రభవైః గుణైః ప్రవిభక్తాని-స్వభావమువలనఁగలిగిన గుణములచేతను విభజింపఁబడినది-

స్వభావమనఁగా త్రిగుణాత్మకమైన ఈశ్వరునియొక్క ప్రకృతి - ఆయావర్ణముల స్వభావములకుఁ గారణములైన గుణములచేతను అనియుం జెప్పవచ్చును- ఎట్లన్నను. బ్రాహ్మణస్వభావమునకు సత్త్వగుణముకారణము- క్షత్రియస్వభావమునకు సత్త్వముతోఁగూడినరజస్సుకారణము- వైశ్యస్వభావమునకుతమస్సుతోఁగూడినరజస్సుకారణము- శూద్రస్వభావమునకురజస్సుతోఁగూడినతమస్సుకారణము- నాలుగువర్ణములవారలయుస్వభావములువరుసగా

శాంతియును అధికారంబును ప్రవర్తించుటయు తెలివిలేక ఒకఁడు చెప్పినట్లు చేయుచుండుటయును నివి. స్వభావమనఁగా ఈజన్మమునందు నిచేయుచున్న వెనుకటిజన్మపుసంస్కారము. అది కారణముగాఁగలగుణములు అనియుం జెప్పవచ్చును. ఈ సత్త్వాదిగుణములనను సరించి శాస్త్రముచేత ఆయావర్ణములవారలకు ఆయాకర్మములు ఏర్పఱుపఁబడినవి. అని శంకరభాష్యము.

స్వభావమనఁగా బ్రాహ్మణాదిజన్మములను కలిగించినపూర్వకర్మము. దానివలనఁగలిగినగుణములు. అందు బ్రాహ్మణునకు స్వభావప్రభవమగుగుణము రజస్తమస్సులను అణఁగఁద్రొక్కియలుదేరిన సత్త్వగుణము. క్షత్రియునకు సత్త్వతమస్సులనణఁగఁద్రొక్కి కలిగిన రజోగుణము. వైశ్యునకు సత్త్వరజస్సులనణఁగఁద్రొక్కి స్వల్పముగా నుద్రేకించినతమస్సు. శూద్రునకు లెస్సగా నుద్రేకించినతమస్సు. ఇట్లు స్వభావప్రభవములగుగుణములతోఁగూడ ఆయావర్ణములకు కర్మములు శాస్త్రములచే నేర్పాటుగాఁ జెప్పఁబడినవి. అని రామానుజభాష్యము.

శమో దమస్తపశ్శౌచం క్షాన్తిరార్జవమేవ చ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మస్వభావజమ్॥ ౪౨

శమః దమః తపః శౌచం క్షాన్తిః ఆర్జవమేవ చ=శమంబును దమంబును తపస్సును పరిశుద్ధియును క్షమయును ఆర్జవంబును, జ్ఞానం విజ్ఞానమ్ ఆస్తిక్యమ్=జ్ఞానంబును విజ్ఞానంబును ఆస్తిక్యంబును, స్వభావజం బ్రహ్మం కర్మ=స్వభావమువలనఁ గలిగిన బ్రాహ్మణులసంబంధియగు కర్మము.

తపస్సు అనఁగా శారీరము మొదలగునది(౧౭అ॥౧౪శ్లో). ఆస్తిక్యమనఁగా శాస్త్రమునఁ జెప్పఁబడినవానియందు నమ్మకము. అని శంకరభాష్యము.

వెలుపలి ఇంద్రియములను నియమించుట శమము. మనస్సు నియమించుట దమము. విషయానుభవములను నియమించుటయనెడి శాస్త్రసిద్ధమైన శరీరక్లేశము తపస్సు. శాస్త్రీయకర్మములకుఁ దగియుండుట శౌచము. ఇతరులు బాధించినను చిత్తవికారము లేకపోవుట క్షాంతి. ఇతరులయెడను తనమనస్సును బాహ్యవ్యాపారంబులు నొకవిధముగా

సంపుట ఆర్జవము - పరతత్త్వమునను అపరతత్త్వములనను యథార్థముగాఁ దెలిసికొనుట జ్ఞానము- పరతత్త్వమునందలి విశేషములనెఱుఁగుట విజ్ఞానము- వేదమునఁ జెప్పఁబడిన విషయమంతయు సత్యమే అనెడి గట్టి నమ్మకము ఆస్తిక్యము- అని రామానుజభాష్యము.

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥౪౩॥

శౌర్యం తేజః ధృతిః దాక్ష్యమ్=శౌర్యంబును తేజస్సును ధైర్యంబును నేర్పును, యుద్ధే అపలాయనంచ=యుద్ధమునందు పారిపోకపోవుటయును, దానమ్ ఈశ్వరభావశ్చ=ఈవియును అధికారియగుటయును, స్వభావజం క్షాత్రం కర్మ=స్వభావమువలనఁ గలిగిన క్షత్త్రియసంబంధియగు కర్మము.

శూరత్వము (గొప్పబలముకలవారలతోఁ గూడ యుద్ధముచేయుట) శౌర్యము- ప్రాగల్భ్యము(ఇతరులచేఁ దిరస్కరింపఁబడకపోవుట) తేజస్సు-అన్నియవస్థలయందును మనస్సును చిన్నబుచ్చుకొనకపోవుట ధృతి-సమయస్ఫూర్తితో పనిచేయుట దాక్ష్యము-శత్రువులకు వెనుకదీయకపోవుట అపలాయనము-తనప్రభుశక్తి సిద్ధిపఱచుట ఈశ్వరభావము- అని శంకరభాష్యము.

యుద్ధమున నిర్భయముగాఁ బ్రవేశించుట శౌర్యము- ఇతరులచేఁ దిరస్కరింపఁబడకపోవుట తేజస్సు- ఆరంభించిన కర్మమును విఘ్నములు గలిగినను కొనసాగించుట ధృతి- అన్ని పనులను జరిగించెడి సామర్థ్యము దాక్ష్యము- యుద్ధమున తాను చచ్చుట నిశ్చితమైనను వెనుకఁ దీయకపోవుట అపలాయనము- ఇతరులనందఱను నియమించెడి సామర్థ్యము ఈశ్వరభావము- అని రామానుజభాష్యము.

కృషిగోరక్షవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥౪౪॥

కృషిగోరక్షవాణిజ్యమ్=దున్నుకొనుటయును పశువులను పెంచుటయును క్రయవిక్రయములు చేయుటయును, స్వభావజం వైశ్యం కర్మ=స్వభావమువలనఁ గలిగిన వైశ్యసంబంధియగు కర్మము- అపి(చ)=ఇంకయు శూద్రస్య, పరిచర్యాత్మకం కర్మ=పరిచర్యాస్వరూపమగు కర్మము, శూద్రు

స్య స్వభావజమ్=శూద్రుని స్వభావమువలనఁగలిగినది.

పరిచర్యయనఁగా శుశ్రూష- అని శంకరభాష్యము-

కృషియనఁగా సస్యములను బుట్టించెడిపని- పరిచర్యచేయుట మూఁడువర్ణములవారలకును-అని రామానుజభాష్యము.

స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు॥౪౫॥

స్వే స్వే కర్మణి అభిరతః నరః=తనతన కర్మమునందు ఆసక్తిగల పురుషుఁడు, సంసిద్ధిం లభతే=సిద్ధిని పొందుచున్నాఁడు-స్వకర్మనిరతః సిద్ధిం యథా విన్దతి=తన కర్మమునందాసక్తుఁడైనవాఁడు సిద్ధిని ఎట్లు పొందుచున్నాఁడో, తత్ శృణు=దానిని వినుము

సంసిద్ధియనఁగా శరీరంబును ఇంద్రియములును జ్ఞాననిష్ఠకుఁ దగినవగుట- అని శంకరభాష్యము.

సంసిద్ధియనఁగా పరమపదమును బొందుట- అని రామానుజభాష్య॥

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥౪౬॥

భూతానాం ప్రవృత్తిః యతః (భవతి)=భూతముల ప్రవృత్తి ఎవ్వని వలన (కలుగుచున్నదో), ఇదం సర్వం యేన తతమ్=ఇది అంతయు ఎవ్వనిచేత వ్యాపింపఁబడినదో, తమ్ స్వకర్మణా అభ్యర్చ్య=ఆతనిని స్వకీయమగు కర్మముచేత పూజించి, మానవః సిద్ధిం విన్దతి=మనుష్యుఁడు సిద్ధిని పొందుచున్నాఁడు.

ప్రవృత్తియనఁగా పుట్టుకయైనను వ్యాపారమైనను- ప యంతర్యామియగునీశ్వరునివలన- స్వకర్మమనఁగా ఆయావర్ణమునకుఁ దగినకర్మము- సిద్ధియనఁగా జ్ఞాననిష్ఠకు తగియుండుట-అని శంకరభాష్యము

ప్రవృత్తియనఁగా పుట్టుక మొదలగునది-ఇంద్రుఁడు మొదలగువారలకంతరాత్మను గానున్ననన్ను-సిద్ధియనఁగా నన్ను బొందుట- అని రామా॥

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥

విగుణః స్వధర్మః=గుణములు లేనిదైన తనధర్మము, స్వనుష్ఠితాత్ పరధర్మాత్ శ్రేయాన్=లెస్సగా నాచరింపఁబడిన ఇతరులధ

మర్గముకంటె మేలయినది- స్వభావనియతం కర్మ కుర్వన్ =స్వభావముచేతనియమింపఁబడిన కర్మమును చేయుచు, కిల్బిషం నాప్నోతి= పాపమును పొందఁడు-

విగుణోఽపి-విగుణమైనను,అనిఅపిశబ్దముంజేర్చునది-స్వభావనియతమనఁగాస్వభావజమనిచెప్పఁబడినదియె-విషమునఁబుట్టినపురుగునకు విషమెట్లు దోషకరముగాదో,అట్లు స్వభావనియతమైనకర్మమునుచేయుచు పాపమును బొందఁడు- అనిశంకరభాష్యము-

స్వధర్మమనఁగా ప్రకృతితోఁగూడియున్న (ఈశరీరముగల) జీవుఁడు ఆచరింపవలసిన కర్మయోగము-పరధర్మమనఁగా ఇంద్రియజయము చేయఁజాలువానికెధర్మమైన జ్ఞానయోగము- శ్రేయస్సనఁగా ప్రమాదము లేనిది- కర్మముఇంద్రియవ్యాపారరూపమగుటనుస్వభావముననేనియతమైనది- కిల్బిషము అనఁగా సంసారము-జ్ఞానయోగమునఁబ్రమాదము కలుగుగాన ఒక్కొక్కప్పుడు కిల్బిషంబుగలుగవచ్చును- అనిరామానుజభాష్యము.

సహజం కర్మ కౌన్తేయ సదోషమపి నత్యజేత్ ।
సర్వారమ్భాహి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥౪౮॥

(హే)కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, సహజం కర్మ సదోషమపి నత్యజేత్= సహజమైన కర్మమును దోషముతోఁగూడినదైనను విడువఁగూడదు- అగ్నిః ధూమేనేవ=అగ్ని పొగచేతనువలె,సర్వారమ్భాః దోషేణ ఆవృతాహి=అన్నియారంభములును దోషముచేత ఆవరింపఁబడినవిగదా-

సహజమనఁగా తనపుట్టుకతోడనెపుట్టినవి- త్రిగుణాత్మకమగుటను సదోషము- సర్వారంభములనఁగా స్వధర్మంబునుపరధర్మంబుననెడికర్మములన్నియును. సహజకర్మంబగు తనధర్మమును విడిచిపరధర్మము నాచరించినను దోషముతప్పదు- పరధర్మముభయమునుగూడఁగలుగఁజేయును-కావునఅర్జునుఁడగుకర్మాధికారిఅన్నిటినివిడువశక్యముకాదు -సత్త్వరజస్తమోగుణములు యథార్థములైనను అసత్యములైననుగూడ వానిధర్మములయినకర్మములుమాత్రము ఆత్మయందుఅవిద్యచేత నారోపింపఁబడినవే గానఅర్జునుఁడైనవాఁడెవ్వఁడును క్ర

ర్మములనన్నిటిని విడువఁజాలఁడు- జ్ఞానియో జ్ఞానముచే తనయవిద్య పోవుటను అన్నికర్మములనువిడువఁజాలును- అని శంకరభాష్యము

సదోషమనఁగా దుఃఖముతోఁగూడినది- జ్ఞానయోగమునకుఁదగినవాఁడైనను కర్మయోగమునే చేయునది- సర్వారంభములనఁగాకర్మములనారంభించుటయును జ్ఞానమును ఆరంభించుటయును-దోషము చేతననఁగాదుఃఖము చేతను- ఈమాత్రము విశేషముకలదు-కర్మయోగము సులభముగాఁ జేయఁదగినదియు ప్రమాదము లేనిదియును- జ్ఞానయోగమట్టిదికాదు- అని రామానుజభాష్యము

అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసీ నాధిగచ్ఛతి॥ ౪౯॥

సర్వత్ర అసక్తబుద్ధిః=అన్నిటియందును సంగములేనిబుద్ధిగలవాఁడును, జితాత్మా విగతస్పృహః=జయింపఁబడినయంతఃకరణముగలవాఁడును ఆశలేనివాఁడునగువాఁడు, సంన్యాసేన పరమాం నైష్కర్మ్యసిద్ధిమ్ అధిగచ్ఛతి=సంన్యాసముచేత గొప్పదైన నైష్కర్మ్యసిద్ధిని పొందుచున్నాఁడు.

పుత్రులుభార్యమొదలగు వారలయందు సంగము లేని- దేహమునందును బ్రదుకునందును భోగములయందును ఆశలేనివాఁడు విగతస్పృహుఁడు- ఇట్టి ఆత్మజ్ఞుఁడు నైష్కర్మ్యసిద్ధిని పొందుచున్నాఁడు-నిష్కర్మయనగా నిష్క్రియమైనబ్రహ్మము తానుగాఁదెలిసికొనినవాఁడు- అట్టివాఁడగుట యనెడిసిద్ధిని- ఇదికర్మనువలనఁ గలిగెడిసిద్ధికంటెగొప్పది- అప్పుడేముక్తుఁడగుట స్వరూపముగాఁగలది- సంన్యాసమనఁగాజ్ఞానము-జ్ఞానముకలిగిసర్వకర్మములను విడుచుటయనియుం జెప్పవచ్చును. అనిశంకరభాష్యము.

అంతటననఁగా ఫలము మొదలగువానియందు- పరమపురుషుఁడు కర్తయనితలంచుటచేత తానకర్తయగుట యందుఁ స్పృహలేనివాఁడు- సంన్యాసముతోననఁగా వెనుకజెప్పఁబడినత్యాగముతోకర్మమును చేయుచు నైష్కర్మ్యసిద్ధినిపొందుచున్నాఁడు- నైష్కర్మ్యమనఁగా జ్ఞానము- దానికిఫలమైనధ్యానయోగనిష్ఠనుపొందుచున్నాఁడనుట-అని రామానుజ॥

నైష్కర్మ్యఫలయోగసిద్ధిని- అని మధ్వభాష్యము.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽప్నోతినిబోధ మే।
సమాసేనైవ కౌన్తేయనిష్ఠా జ్ఞానస్యయాపరా॥౫౦॥

సిద్ధిం ప్రాప్తః (సన్) బ్రహ్మ యథా ఆప్నోతి=సిద్ధిని పొందినవాఁడు (అగుచు) బ్రహ్మమును ఎట్లు పొందుచున్నాఁడో, తథా మే (సకాశాత్) సమాసేనైవ నిబోధ=అట్లు నా (వలన) సంగ్రహముగా తెలిసికొనుము-(హే) కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!, యా జ్ఞానస్య పరా నిష్ఠా=ఏది జ్ఞానముయొక్క గొప్ప నిష్ఠయో.

తనతనకర్మములచేత ఈశ్వరునారాధించి వానియనుగ్రహంబునశరీరేంద్రియములుజ్ఞాననిష్ఠకుయోగ్యములగుటయనెడిసిద్ధిని పొందినవాఁడు- బ్రహ్మమునుపొందుటయెజ్ఞానముయొక్క నిష్ఠయనఁగాపరిసమాప్తి- ఆత్మ,జ్ఞానాకారుఁడు- ఆత్మను శ్రుతులలో ఆదిత్యవర్ణుఁడు(సూర్యునివంటిరంగుకలవాఁడు), భారూపుఁడు (వెలుగెన్వరూపముగాఁగలవాఁడు), స్వయంజ్యోతిస్సు, అనియిట్లు చెప్పుట, ద్రవ్యగుణాద్యాకారుఁడుకాఁడనినతోడనె చెప్పవలసివచ్చినతమోరూపత్వమునునిషేధించుటగాని, ఆత్మకురూపముక్కలదని చెప్పుటకాదు- తనశరీరమునుతానుదెలిసికొనుటకుప్రమాణాంతరము ఎట్లుఅక్కఱలేదో అట్లె దానికన్ననంతరుఁడైనయాత్మను తెలిసికొనుటకును ప్రమాణమక్కఱలేదు- కాఁబట్టి ఆత్మజ్ఞానముంగూర్చిప్రయత్నమక్కఱలేదు- ఆత్మకానిదానిని ఆత్మయనుకొనుటనుమానుటయందె ప్రయత్నమును చేయవలసినది- అని శంకరభాష్యము.

కర్మయోగము చేఁగలుగవలసినధ్యానసిద్ధి నిపొందినవాఁడుఎట్లు ప్రవర్తించుచున్నవాఁడైబ్రహ్మమునుపొందునో- ఏబ్రహ్మముజ్ఞానమనెడి ధ్యానమునకు (పరానిష్ఠా)పరమప్రాప్యమో- అని రామానుజభాష్య॥

(యథా)ఏయుపాయము చేతసిద్ధినిపొందినవాఁడైబ్రహ్మమునుపొందుచున్నాఁడో- ఏసిద్ధిజ్ఞానముయొక్కగొప్పనిష్ఠయో- అనిమధ్వ॥

బుద్ధ్యావిశుద్ధయాయుక్తో ధృత్యాఽత్మానం నియమ్యచ।
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌవ్యుదస్యచ॥౫౧॥
వివిక్తసేవీలఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరోనిత్యం వైరాగ్యంసముపాశ్రితః॥౫౨॥

అహంకారంబలందర్పం కామంక్రోధంపరిగ్రహమ్।
విముచ్యనిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయకల్పతే॥౫౩॥

విశుద్ధయా బుద్ధ్యా యుక్తః=పరిశుద్ధమైన బుద్ధితో కూడినవాఁడును, ధృత్యా ఆత్మానం నియమ్యచ=ధైర్యముచేత ఆత్మను నియమించియును, శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వాచ=శబ్దము మొదలగు విషయములను విడిచియును, రాగద్వేషౌ వ్యుదస్యచ (స్థితః)=రాగద్వేషములను పరిహరించియును(ఉన్నవాఁడును), వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః=నిర్జనప్రదేశము నాశ్రయించువాఁడును లఘువుగాఁ దినువాఁడును నియమింపఁబడిన వాక్కును శరీరమును మనస్సును గలవాఁడును, నిత్యం ధ్యానయోగపరః=ఎల్లప్పుడును ధ్యానయోగమునం దాసక్తుఁడును, వైరాగ్యం సముపాశ్రితః=వైరాగ్యమును పొందినవాఁడును, అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం(చ) విముచ్య=ఆత్మకానిదానిని ఆత్మయనుకొనుటను బలమును గర్వమును కామమును కోపమును పట్టును విడిచి, నిర్మమః శాన్తః=మమకారము లేనివాఁడును శాంతుఁడునగు వాఁడు, బ్రహ్మభూయాయ కల్పతే=బ్రహ్మభావమునకు తగుచున్నాఁడు.

బుద్ధి యనఁగా అధ్యవసాయము- విశుద్ధి యనఁగా మాయ లేకపోవుట- ఆత్మయనఁగా శరీరేంద్రియ సముదాయము- శరీరము నిలుచుటకు మాత్రము కావలసిన విషయములు కాక మిగిలిన సుఖముకొఱకైన విషయములను విడిచి- శరీరముకొఱకైనవానియందుఁగూడ రాగద్వేషములు లేక- నిర్జనప్రదేశములు, అడవిపటిమొదళ్ళు పర్వతపుగుహ మొదలగునవి- వివిక్తసేవయును లఘ్వాహారంబును నిద్రాములను కలుగనీక చిత్తప్రసాదమును కలుగఁజేయును- ధ్యానమనఁగా ఆత్మస్వరూపమును తలంచుట- యోగమనఁగా ఆత్మస్వరూపమునందే చిత్తమును ఏకాగ్రమును చేయుట- నిత్యమ్ అనుట మంత్రజపాదులు చేయనక్కఱలేదని తెలియఁజేయుటకు- వైరాగ్యమనఁగా ఐహికాముష్మికములయందు ఆశ లేకపోవుట- బలమనఁగా కామరాగములతోఁగూడిన సామర్థ్యము- శరీర సామర్థ్యము స్వాభావికముగాన విడువ శక్యముగానిది- దర్పమనునది సంతోషమునకు వెంట నెకలిగి ధర్మము నతిక్రమింపఁజేయునది- కామమనఁగా

కోరిక- ఇంద్రియములయందును మనస్సునందును దోషము లేకపోయిన నుశరీరమును నిలుపుటకుఁగానీ ధర్మము నాచరించుటకుఁగానీ వెలుపలి పరిగ్రహము (ఉపకరణములు) కావలసియుండును- దానినిగూడ విడిచి పరమహంస పరివ్రాజకుఁడై- దేహము నిలిచియుండుట యందునుఁ గూడ మమకారము లేనివాఁడు నిర్మముఁడు- శాంతుఁడనఁగా సంతోషంబును దుఃఖంబును లేనివాఁడు- యతియనఁగా జ్ఞాననిష్ఠుఁడు- బ్రహ్మభూయమనఁగా బ్రహ్మమగుట- అని శంకరభాష్యము-

బుద్ధియనఁగా నాత్మతత్త్వము నెఱుఁగుట- ఆత్మను అనఁగా మనస్సును, విషయములనుండి మఱలించుటచేత యోగమునకుఁదగిన దానిగాఁ జేసి- శబ్దాదివిషయములను దగ్గఱనురానీక- వానివలనఁగలిగెడి రాగద్వేషములను విడిచి- వివిక్తమనఁగా ధ్యానవిరోధములు లేనిది- విస్తారము తినుటగానీ బొత్తిగా తినకపోవుట గానీ లేనివాఁడై- యతములనఁగా ధ్యానమునకు అభిముఖములుగాఁ జేయఁబడినవి- నిత్యమనఁగా చచ్చెడివఱకును= తాను ధ్యానము చేయవలసినది తప్పమిగిలిన వానియందలి దోషములను విమర్శించుటచేత వానియందును అనురాగము లేకపోవుటను వృద్ధిబొందించికొనుచు- బలమనఁగా దేహమె ఆత్మయని తోఁపించెడి వాసనాబలము- నిర్మముఁడనఁగా తనదికాని వానిని తనవిగా నితలంచుట- శాంతుఁడనఁగా ఆత్మానుభవసుఖ మొక్కటియె కలవాఁడు- బ్రహ్మభూయమనఁగా సమస్తబంధములును పోయినవాఁడై స్వస్వరూపమున నున్న యాత్మననుభవించుట- అని రామానుజభాష్యము.

బ్రహ్మభూయమనఁగా బ్రహ్మమునందుండుట- ఎల్లప్పుడును బ్రహ్మమునందె మనస్సు కలిగియుండుట- అని మధ్వభాష్యము-

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి న కాఙ్క్షతి।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥౫౪॥

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా=బ్రహ్మమయినవాఁడై ప్రసన్నమైన యాత్మగలవాఁడు, నశోచతి=దుఃఖింపఁడు- న కాఙ్క్షతి=కోరఁడు- సర్వేషు భూతేషు సమః=అన్ని భూతములయందును సముఁడై, పరాం మద్భక్తిం లభతే=గొప్పదైన నాయందలి భక్తిని పొందుచున్నాఁడు-

బ్రహ్మభూతుఁడనఁగా బ్రహ్మమును పొందినవాఁడు. ప్రసన్నాత్మ యనఁగా ప్రత్యగాత్మయందు ఆవిర్భవించిన యానందముగలవాఁడు. తనకు కలిగియున్న లోపమునకై విచారింపఁడు. దేనిదానికి కోరఁడు. న హృష్యతి (సంతోషింపఁడు) అనియును పాఠము. సముఁడనఁగా తనతోఁ దుల్యముగా నన్నిభూతములయందును సుఖదుఃఖములను తలంచువాఁడు. ఇట్టివాఁడు నాయందు నాల్గవభక్తిని (౭అ||౧౬||శ్లో) అనఁగా జ్ఞానమును పొందుచున్నాఁడు. అని శంకరభాష్యము.

బ్రహ్మభూతుఁడు అనఁగా అపరిచ్ఛిన్నజ్ఞానమె ఆకారముగాఁ గలదై భగవంతునికి శేషభూతుఁడగుటయె స్వభావముగాఁ గల ఆత్మస్వరూపము బయలుపడినవాఁడు. ప్రసన్నాత్మ యనఁగా క్లేశము (దుఃఖము) కర్మము మొదలగువానిచే కలుషముగాని స్వరూపముగలవాఁడు. నేను తప్ప మిగిలిన యన్నిభూతములయందును సమముగా ననాదరము కలవాఁడై అన్నిభూతములను గడ్డిపరకను వలె తలంచుచున్నవాఁడై సర్వేశ్వరుఁడనైన నాయందు మిక్కిలి ప్రీతితో ననుభవించుటయనెడి పరభక్తిని పొందుచున్నాఁడు. అని రామానుజభాష్యము.

భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥౫౫॥

తత్త్వతః (అహం) యావాన్ యశ్చ అస్మి = తత్త్వముంబట్టి (నేను) ఎంతవాఁడనను ఎవ్వఁడనను అగుచున్నానో, (తావన్తం తమ్) మామ్ = (అంతవాఁడనను వాఁడనునగు) నన్ను, భక్త్యా అభిజానాతి = భక్తిచేతను తెలిసికొనుచున్నాఁడు. తత్త్వతః జ్ఞాత్వా = తత్త్వమున తెలిసికొని, తతః మాం విశతే = దానింబట్టియె నన్ను చొచ్చుచున్నాఁడు.

ఉపాధికృతములైన భేదములచేత ఎంతవాఁడనో, ఉపాధిభేదములు నశించినచో నెట్టివాఁడనో. రెండవది లేనివాఁడనును జ్ఞానైకస్వరూపుఁడనును జరామరణాదులు లేనివాఁడనునగు ఆ నన్ను. జ్ఞానము కలుగుటయు నటపైని ప్రవేశించుటయు నని రెండు కావు. జ్ఞానము కలుగుటయే ప్రవేశించుట. ప్రత్యగాత్మను గూర్చిన జ్ఞానపరంపర కలుగఁజేసికొనెడి యభినివేశమే (ఉద్దేశమే) జ్ఞాననిష్ఠ. అది కర్మమునకు విరోధి. కాఁబట్టి సర్వకర్మసంన్యాసముచేత జ్ఞాననిష్ఠ సంపాదింపఁద

గినది- అని శంకరభాష్యము.

స్వరూపస్వభావములంబట్టి యెవ్వఁడనో, గుణములను విభూతులనుబట్టి యెట్టివాఁడనో, దానిని తెలిసికొని భక్తిచేత నన్నుబొందుచున్నాఁడు-తతః-అభక్తివలన- అని రామానుజభాష్యము.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్॥ ౫౬॥

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణః=అన్నికర్మములను ఎల్లప్పుడును చేయుచున్నవాఁడై, మద్వ్యపాశ్రయః=నేను ఆధారముగాఁగలవాఁడై, మత్ప్రసాదాత్ శాశ్వతమ్ అవ్యయమ్ పదమ్ ఆప్నోతి=నా ప్రసాదమువలన ఎల్లప్పుడునుండెడి నాశములేని పదమును పొందుచున్నాఁడు-

అన్నికర్మములను అనఁగా నిషిద్ధములనుగూడ- ఈశ్వరుఁడైన వాసుదేవుఁడైన నేను ఆధారముగాఁగలవాఁడై- అనఁగా అందఱకును ఆత్మయగుటను నాయందుఉంచినవాఁడై- వాఁడు నిత్యమైన వైష్ణవపదమును పొందుచున్నాఁడు-అని శంకరభాష్యము.

నిత్యనైమిత్తికములనే కాదు, కామ్యములనుగూడ- మద్వ్యపాశ్రయుఁడనఁగా నాయందుఉనుపఁబడిన కర్తృత్వము మొదలయినవికలవాఁడు- అవ్యయమనఁగా సంపూర్ణమైనది- పదమును అనఁగా పొందఁబడువాఁడనగు నన్ను, పొందుచున్నాఁడు- అని రామానుజభాష్యము.

రెండియు నంతరంగములగు సాధనములఁ జెప్పి ఉపసంహరింపఁబడుచున్నది- అని మధ్వభాష్యము.

చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ॥ ౫౭॥

సర్వకర్మాణి మయి చేతసా సంన్యస్య-అన్నికర్మములను నాయందు మనస్సుచేతను ఉంచి, మత్పరః=నేనే పరుఁడుగాఁగలవాఁడవై, బుద్ధియోగమ్ ఉపాశ్రిత్య-బుద్ధియోగమును ఆశ్రయించి, సతతం మచ్చిత్తః భవ=ఎల్లప్పుడును నాయందు చిత్తముగలవాఁడవు అగుము-

చేతసా=వివేకజ్ఞానముచేతను- బుద్ధియోగమనఁగా నాయందు ఏకాగ్రమైనబుద్ధి కలుగుట- ఉపాశ్రయించుట యనఁగా అదితప్పమి

గిలినదిశరణముగానుండకపోవుట- అని శంకరభాష్యము-

చేతసా=తానునావాఁడు, నకునియామ్యుఁడు, అనెడిబుద్ధిచేతను- మత్పరుఁడనగా నేనె(ఈశ్వరుఁడె) ఫలముగాఁబొందదగినవాఁడననితలంచువాఁడు- ఈబుద్ధినెఆశ్రయించి- అని రామానుజభాష్యము-

మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।
అథచేత్త్వమహంకారాన్నశ్రోష్యసివినఙ్క్ష్యసి॥౫౮॥

మచ్చిత్తః (త్వమ్)=నాయందుచిత్తముగల నీవు, సర్వదుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి=సమస్తదుర్గములను నాప్రసాదమువలన దాటఁగలవు- అథ=ఇఁకను, త్వమ్ అహంకారాత్ నశ్రోష్యసి చేత్=నీవు అహంకారమునుబట్టి వినకపోదువేని, వినఙ్క్ష్యసి=చెడిపోదువు.

దుర్గములనఁగా సంసారమునకుఁగారణములైనవి- అహంకారమునుబట్టి యనఁగా నేను పండితుఁడననుకొని- అనిశంకరభాష్యము.

ఇట్లు నాయందు చిత్తముకలవాఁడవై అన్నికర్మములం జేయుచు-సంసారములోనిదుర్గములను (నన్నుపొందుటకుఅడ్డములైనప్రకృతిసంబంధులగునావరణములను- అనిరా॥టీ॥)-నేనెకృత్యాకృత్యములంగూర్చి అనఁగాచేయవలసినవానింగూర్చియు చేయరానివానింగూర్చియు సమస్తమునెఱుంగుదుననియుండుట యహంకారము- అని రామానుజభాష్యము.

యదహంకారమాశ్రిత్య నయోత్స్యఇతిమన్యసే॥
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి॥౫౯॥

అహంకారమ్ ఆశ్రిత్య=అహంకారమును పట్టి, నయోత్స్యే ఇతి మన్యసేయది=యుద్ధముచేయఁబోవను అని తలంతువేని, ఏషః తే వ్యవసాయః మిథ్యా (భవిష్యతి)=ఈ నీయొక్క నిశ్చయము అసత్యము (కాఁగలదు)- ప్రకృతిః త్వాం నియోక్ష్యతి=ప్రకృతి నిన్ను నియోగింపఁగలదు.

ప్రకృతియనఁగా క్షత్రస్వభావము- అనిశంకరభాష్యము.

అహంకారమనఁగా మేలుకీడులను నేనెఱుంగుదననుకొనుట- (ప్రకృతియనఁగా నీస్వభావము-అనిరా॥టీ॥) అనిరామానుజభాష్యము.

స్వభావజేన కౌన్తేయ నిబద్ధస్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపితత్ ॥౬౦॥

(హే)కౌన్తేయ!=(ఓ)కుంతీపుత్రుఁడా!యత్ మోహాత్ కర్తుం నేచ్ఛసి= దేనిని మోహమున చేయుటకు కోరవో,తదపి=దానినిగూడ, స్వభావజేన స్వేన కర్మణా నిబద్ధః=స్వభావముచేఁగలిగిన స్వకీయమైన కర్మముచేత కట్టఁబడినవాఁడవై, అవశః=పరవశుఁడవై, కరిష్యసి=చేయఁగలవు.

స్వభావజమనఁగా వెనుకఁ జెప్పబడిన (౧౮అ॥౪౩శ్లో)శౌర్యము మొదలగునది-నిబద్ధుఁడనఁగా నిశ్చయముగాఁగట్టఁబడినవాఁడు-అని శంకరభాష్యము.

స్వభావజకర్మమనఁగా శౌర్యము -పరులతిరస్కారమును సహింపనివాఁడవైనీ వెయుద్ధమును చేయుదువు-అని రామానుజభాష్యము.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥

(హే)అర్జున!=(ఓ)యర్జునుఁడా!, ఈశ్వరః=ఈశ్వరుఁడు, యన్త్రారూఢాని సర్వభూతాని మాయయా భ్రామయన్=యంత్రముపైనున్న అన్నిభూతములను మాయచేత త్రిప్పుచు, సర్వభూతానాం హృద్దేశే తిష్ఠతి=సమస్తభూతములయొక్కయు హృదయప్రదేశమున ఉన్నాఁడు.

ఈశ్వరుఁడనఁగా పాలుటస్వభావముగాఁగల నారాయణుఁడు-భూతములనఁగా ప్రాణులు.మాయయేవ(మాయచేతనువలె)అని ఇవ శబ్దమునుఁజేర్చునది-కఱ్ఱతోఁజేయఁబడిన పురుషుఁడు మొదలగు దానినియంత్రముమీఁదనెక్కించి మాయచేత త్రిప్పినట్లు - అని శంకరభాష్యము.

హృదయదేశము అన్నిజంతువులకును జ్ఞానముపుట్టెడిస్థానము-యంత్రమనఁగా దేహేంద్రియరూపమైనప్రకృతి- మాయయనఁగా గుణత్రయాత్మకయగుప్రకృతి-అని రామానుజభాష్యము.

పరోక్షముగాఁజెప్పుట(నేనని చెప్పక ఈశ్వరుఁడని చెప్పుట) ద్రోణునింగూర్చిభీముఁడుచెప్పినట్లు - అని మధ్వభాష్యము.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।

తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥
(హే) భారత! = (ఓ) భరతవంశమువాడా!, సర్వభావేన తమేవ శరణం గచ్ఛ-అన్నివిధములను అతనినే శరణమునుగా పొందుము; పరాం శాన్తిమ్=గొప్ప శాన్తినిని, శాశ్వతం స్థానంచ=నిత్యమైన స్థానమునను, తత్ప్రసాదాత్ ప్రాప్స్యసి=అతని ప్రసాదమున పొందఁగలవు.

శరణమనఁగా ఆశ్రియము- సంసారబాధలనుపోఁగొట్టుటకై- ప్రసాదమనఁగా అనుగ్రహము- శాంతియనఁగా ఉపరతి (అన్నియునుడుగుట)-స్థానమునఁ అనఁగా విష్ణువునైన నా యొక్క- పరమపదమును- అని శంకరభాష్యము.

శాంతియనఁగా కర్మబంధములుఉడుగుట- పరమపదమనఁగా వైకుంఠము- అని రామానుజభాష్యము.

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥౬౩॥

ఇతి=ఇట్లు, మయా గుహ్యాత్ గుహ్యతరం జ్ఞానం తే ఆఖ్యాతం= నా చేతను గోప్యముకంటె మిక్కిలిగోప్యమైన జ్ఞానము నీకు చెప్పఁబడినది- ఏతత్ అశేషేణ విమృశ్య=దీనిని నిశ్శేషముగా విమర్శించి, యథా ఇచ్ఛసి తథా కురు=ఎట్లు కోరుదువో అట్లు చేయుము.

నేను చెప్పినశాస్త్రమునను దానియర్థమునను లెస్సగా నాలోచించి- అని శంకరభాష్యము.

మోక్షముంగోరువారు తెలిసికొనవలసినకర్మయోగజ్ఞానయోగభక్తియోగములంగూర్చినజ్ఞానము-నీయధికారమునకుఁ తగునట్లువిమర్శించి-కర్మయోగాదులలో దేనినైననీయిష్టమువచ్చినదానినాచరింపుము- అని రామానుజభాష్యము.

సర్వగుహ్యతమంభూయః శృణు మే పరమం వచః।
ఇష్టోసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥౬౪॥

భూయః సర్వగుహ్యతమం పరమం మే వచః శృణు=రెండవయు అన్నిటికంటెమిక్కిలి రహస్యమైనదియును గొప్పదియునగు నా మాటను వినుము. త్వమ్ మే దృఢమ్ ఇష్టః అసి=(నీవు) నాకుగట్టిగా ఇ

ష్టుఁడవు అగుచున్నావు- ఇతితతః=అనుదానివలన, తే హితం వక్ష్యా మి=నీకు హితమును చెప్పఁగలను.

భయమునకుంగాదు-ధనమునిమిత్తముగాదు-నీవుఇష్టుఁడవనిచెప్పెద ను. హితమునన, జ్ఞానముకలుగుటకు సాధనమును-అని శంకరభాష్యము

సర్వగుహ్యతమముభక్తియోగమని వెనుకను(౯అ॥౧శ్లో) కూడఁ జెప్పఁబడినది-దృఢః ఇష్టః (గట్టి ఇష్టుఁడవు) అనిపాఠము- అనిరా మానుజభాష్యము.

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోసి మే॥౬౫॥

మన్మనాః మద్భక్తః మద్యాజీ(చ) భవ=నాయందుమనస్సుకలవాఁ డవును నాయెడను భక్తికలవాఁడవును నన్నుగూర్చి యాగము చేయు వాఁడవును అగుము-మాం నమస్కురు=నన్ను నమస్కరింపుము-మా మేవ ఏష్యసి=నన్నే పొందఁగలవు- తే సత్యం ప్రతిజానే=నీకొఱకు సత్యముగా ప్రతిజ్ఞచేయుచున్నాను- మే ప్రియః అసి=నాకు ఇష్టుఁడ వు అగుచున్నావు.

నమస్కారమునుగూడనాకె చేయుము- ఇట్లు వాసుదేవునియందె స మర్పింపఁబడిన సాధ్యసాధనప్రయోజనములుకలవాఁడవై నన్నే పొం దుదువు- అని శంకరభాష్యము.

మన్మనాః=నన్నుఉపాసించువాఁడవును, మద్భక్తః=నేనె మిక్కి లి ఇష్టుఁడనుగాఁగలవాఁడవును, మద్యాజీ=ప్రీతిపూర్వకముగా న న్నుపూజించువాఁడవును, అగుము- ఎవ్వనికినాయందు మిక్కిలిప్రీతి యుండునో వానియెడను నాకునుమిక్కిలిప్రీతిగలుగుటను వానివిడువలేక వానినినాసంనిధనేఉంచికొనియెదను- అని రామానుజభాష్యము.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥౬౬॥

సర్వధర్మాన్ పరిత్యజ్య=అన్నిధర్మములను విడచి, ఏకం మాం శ రణం వ్రజ= ఒక్క నన్నే శరణమును పొందుము,-అహం త్వా సర్వపా పేభ్యః మోక్షయిష్యామి= నేను నిన్ను అన్నిపాపములనుండి విడిపించె దను- మా శుచః=దుఃఖింపకుము-

ధర్మశబ్దముచేత అధర్మములుగూడ గ్రహింపబడును. నైష్కర్మ్యము (సకలకర్మములను లేకపోవుటయె) ఇచ్చట వివక్షింపబడినది. సర్వాత్మనైయీశ్వరుడనైన నన్ను - శరణమును పొందుట యనగా ఆయీశ్వరుడను నేనె, నాకంటె వేఱుగా మఱియొకటి లేదని నిశ్చయించికొనుట. నేనె యాత్మనని తెలియజేయుటచే ధర్మాధర్మబంధనస్వరూపములగు అన్ని పాపములనుండియును విడిపించెదను.— ఈ గీతాశాస్త్రమున ఆత్మజ్ఞానమొక్కటియె మోక్షమును కలుగజేయునదిగా జెప్పబడినది. మోక్షము క్రొత్తగా గలుగునది కామగాన కర్మము దానికి సాధనము కాదు. నిత్యకర్మములుగూడ పుణ్యలోకమును కలుగజేయునవియె. ఆత్మకు కర్తృత్వము లేదు. సంసారమంతయు భ్రాంతివలన గలిగినదియె కాన జ్ఞానముచేత శుద్ధముగా నివర్తించును. అని శంకరభాష్యము.

కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగములనెడి ధర్మములనన్నిటిని చేయుచునె వానిఫలమును కర్తృత్వము మొదలగువానిని విడిచి నేనె కర్తననియు ఆరాధింపబడువాడననియు పొందబడువాడననియు ఉపాయమనియు తలంపుము. నన్ను పొందుటకు విరోధులగు పాపములన్నిటినుండియు నిన్ను విడిపించెదను. ఇది యొక్క యోజన— మఱియొక్క యోజన ఎట్లన్నను. భగవద్భక్తి కలుగుటకు అడ్డములైన పాపములను దలంచి భయపడుచున్న అర్జునునింగూర్చి భగవంతుడు చెప్పుచున్నాడు. భక్తియోగము నారంభించుటకు ప్రతిబంధకములైన పాపములను పోగొట్టుకొనుటకు చేయవలసిన ప్రాయశ్చిత్తరూపములైన ధర్మములనన్నిటిని విడిచి భక్తియోగము కలుగుటకైన నన్ను శరణమును పొందుము. నేనె ఆ పాపములనుండి నిన్ను విడిపించెదను. అని రామానుజభాష్యము.

ధర్మములను విడుచుట యనగా వానిఫలములను విడుచుట. లేనిచో యుద్ధమును చేయుమనుట యెట్లు? అని మధ్వభాష్యము.

ఇదంతే నాతపస్కాయ నాభక్తాయ కదాచన।
న చాశుశ్రూషవే వాచ్యం నచమాం యోఽభ్యసూయతి॥

తే (ఉక్తం) ఇదమ్= నీకొఱకు (చెప్పబడిన) ఈశాస్త్రము, అతపస్కాయ న వాచ్యమ్= తపస్సులేనివానికి చెప్పదగదు, అభక్తాయ క

దావన న(వాచ్యమ్)=భక్తిలేనివానికి ఎప్పుడును (చెప్పఁ)దగదు- అశుశ్రూషవేచ న(వాచ్యమ్)=శుశ్రూషచేయనివానికిని(చెప్పఁ)దగదు- మాం యః అభ్యసూయతి=నన్నుగూర్చి ఎవ్వఁడు అసూయపడుచున్నాఁడో,(తస్మై)చ న(వాచ్యమ్)=వాని(కొఱకు)ను(చెప్పఁ)దగనిది.

తపస్సుకలిగినను గురువునందును దేవునియందును భక్తిలేనివానికి చెప్పఁగూడదు- భక్తియునుతపస్సును గలిగియున్నను శుశ్రూషచేయని వానికిచెప్పఁగూడదు-నన్నుప్రకృతి సంబంధియైనమనుష్యునిగాఁదలంచి స్వస్తోత్రము మొదలుగుదోషములను నాయందారోపించి నేను ఈశ్వరుఁడగుట నెఱుంగక ఎవ్వఁడు నన్ను సహింపఁడో, వానికిఁగూడ చెప్పఁగూడదు- తపస్సులేకపోయినను మిగిలిన గుణములుకలిగి మేధావి(బుద్ధిమంతుఁడు) ఐనచోఁ జెప్పవచ్చును-అన్ని గుణములున్నను భగవంతుని యందసూయగలవానికిఁ జెప్పఁగూడదు-అనిశంకరభాష్యము.

నీయందును నాయందును భక్తిలేనివానికి- నాస్వరూపమందును నేను ఈశ్వరుఁడనగుటయందును నాగుణములయందును ఎవ్వఁడుదోషమును చూపునో వాని కొఱకును- మఱియొక్క విభక్తి(Case)తో చెప్పుటఇదిమిక్కిలి పరిహరింపవలసినదని తెలియఁజేయుటకు- అనిరామానుజభాష్యము.

య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాంకృత్వా మామేవైష్యత్యసంశయః॥౬౮॥

యః మద్భక్తేషు ఇదం పరమం గుహ్యమ్=ఎవ్వఁడు నాభక్తులయెడను ఈ గొప్ప రహస్యమును, మయి పరాం భక్తిం కృత్వా అభిధాస్యతి=నాయెడను గొప్పభక్తిని చేసి చెప్పఁగలఁడో, సః మామేవ ఏష్యతి=వాఁడు నన్నే పొందఁగలఁడు- అసంశయః=సంశయములేదు.

మూలమునైనను అర్థమునైనను చెప్పఁగలఁడో-భక్తిమాత్రమున్నను చాలును-తపస్సు మొదలగునవి యక్కఱలేదు-నన్నుబొందట యనఁగా ముక్తుఁడగుట-అనిశంకరభాష్యము.

చెప్పుటయనఁగా వ్యాఖ్యానముచేయుట-అనిరామానుజభాష్యము.

నచ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః।
భవితా నచ మేతస్మాదన్యః ప్రియతరో భువి॥౬౯॥

మే తస్మాత్ ప్రియకృత్తమః మనుష్యేషు కశ్చిచ్చ న=నాకు వానికం
టె మిక్కిలియిష్టమునుచేయువాఁడు మనుష్యులలో ఒకఁడును లేఁ
డు-భవితస్మాత్ అన్యః మే ప్రియతరః నచభవితా=భూమిలో వానికం
టెను ఇతరుఁడు నాకు మిక్కిలియిష్టుఁడు కలుగఁబోఁడు.

ఇప్పుడుఉన్నవారిలో లేఁడు-ఇఁక కలుగఁబోఁడు-అని శంకరభాష్య॥
ఇప్పటికికలిగియుండలేదు-ఇఁకకలుగఁబోఁడు-అని రామానుజభాష్య॥

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః॥
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితి మే మతిః॥ ౭౦॥

ధర్మ్యమ్ ఆవయోః ఇమం సంవాదమ్ యః అధ్యేష్యతే=ధర్మముతప్ప
నిదగు మనయిద్దఱియొక్కయు ఈసంవాదమును ఎవ్వఁడు అధ్య
యనముచేయునో, తేన జ్ఞానయజ్ఞేన అహమ్ ఇష్టః స్యామ్=వాని
చేత జ్ఞానయజ్ఞముచేత నేను పూజింపఁబడినవాఁడను అగుదును, ఇ
తి మే మతిః =అని నా తాత్పర్యము.

జ్ఞానయజ్ఞమువంటిది గీతాశాస్త్రాధ్యయనమనిస్తోత్రము- లేక జ్ఞా
నయజ్ఞముయొక్కఫలముతోఁదుల్యమైనఫలము గలుగుననిఫలమును చెప్ప
టమైనం గావచ్చును. అనిశంకరభాష్యము.

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః।
సోఽపిముక్తశ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥

అపిచ=ఇంతియెకాక, యః నరః=ఏమనుష్యుఁడు, శ్రద్ధావాన్ అన
సూయశ్చ(సన్) శృణుయాత్ =శ్రద్ధకలవాఁడును అసూయచేయకు
న్నవాఁడునై వినునో, సోఽపి ముక్తః(సన్)=వాఁడును పాపములచే
విడువఁబడినవాఁడై, పుణ్యకర్మణాం శుభాన్ లోకాన్ ప్రాప్ను
యాత్=పుణ్యములైనకర్మములుగలవారలయొక్క మంచి లోకముల
ను పొందును.

పుణ్యకర్మములనఁగా అగ్నిహోత్రము మొదలగునవి-అట్టి జ్ఞా
నులవారిని గూర్చి చెప్పవలసిన దేమున్నది? అనిశంకరభాష్యము.

భక్తివిరోధులగు పాపములచే విడువఁబడినవాఁడై. అని రామానుజ
భాష్యము.

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వ యైకాగ్రేణ చేతసా।

కచ్చి దజ్ఞానసంమోహః ప్రణష్టస్తే ధనఞ్జయ॥ ౭౨॥
(హే)పార్థ!=(ఓ) కుంతీపుత్రుఁడా!, త్వయా ఏతత్ ఏకాగ్రేణ మనసా శ్రుతంకచ్చిత్ =నీచేతను ఇది నిశ్చలమైన మనస్సుతో వినఁబడినదిగదా- (హే) ధనఞ్జయ!-(ఓ)యర్జునుఁడా!, తే అజ్ఞానసంమోహః ప్రణష్టఃకచ్చిత్ =నీయొక్క అజ్ఞానమువలనఁగలిగినయవివేకము పోయినదిగదా.

ఏ అజ్ఞానము చేత యుద్ధము చేయను(౨అ॥౯శ్లో)అని చెప్పితివో- అని రామానుజభాష్యము.

అర్జున ఉవాచ-

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత!
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥౭౩॥
(హే)అచ్యుత!-(ఓ)శ్రీకృష్ణుఁడా!, త్వత్ప్రసాదాత్(మే)మోహః నష్టః=నీయనుగ్రహమువలన నా అజ్ఞానము నశించినది మయాస్మృతిః లబ్ధా=నాచేత స్మృతి పొందఁబడినది గతసందేహః(సన్) స్థితః అస్మి =సందేహములుపోయినవాఁడను (అగుచు) ఉన్నవాఁడను అగుచున్నాను- తవ వచనం కరిష్యే=నీ మాటను చేసెదను-

మోహమనఁగా సంసారమనెడి యనర్థమునకుఁ గారణమైన యజ్ఞానము- స్మృతియనఁగా ఆత్మతత్త్వముం గూర్చినతలంపు- అది లభించినచో హృదయపు ముడులన్నియును వీడును- ఏజ్ఞానము వలన నజ్ఞానముపోవుటయు నాత్మస్మృతి లభించుటయును కలుగునో ఆజ్ఞానము కలుగుటయె గీతాశాస్త్రము నంతటిని తెలిసికొనుటకుఫలము-అని శంకరభాష్యము.

మోహమనఁగా విపరీత జ్ఞానము (ఒకటి-దానిని మఱియొకటిగాఁదలంచుట)-స్మృతియనఁగా-నున్నదియున్నయట్లు తెలిసికొనుట- ఆత్మకాని ప్రకృతిని ఆత్మయనుకొనుటయును, పరమపురుషునకు శరీరమగుటను పరమపురుషాత్మకములగు చేతనాచేతనములన్నియు నపరమపురుషాత్మకములు కానుకొనుటయును,పరమపురుషున కారాధనములగుటచేత పరమపురుషుని పొందుటకు సాధనములగు నిత్యనైమిత్తికకర్మములు బంధమును కలుగఁజేయునవి యనుకొనుటయు ననెడి మో

హమంతయును పోయినది- ఆత్మ ప్రకృతికంటె విలక్షణుఁడు, ప్రకృతియొక్క స్వభావములు లేనివాఁడు, తెలిసికొనువాఁడగుటయె స్వభావముగాఁగలవాఁడు, పరమపురుషునకు శేషభూతుఁడగుటయు నియామ్యుఁడగుటయునె స్వరూపములుగాఁగలవాఁడు అనెడిజ్ఞానంబును, సమస్తజగత్తుయొక్కయు సృష్టిస్థితి సంహారములు లీలగాఁగలవాఁడును దోషములకు విరోధియై కల్యాణగుణములకు ముఖ్యస్థానమైనవాఁడును స్వభావసిద్ధంబులును మేరలేనివియునగు జ్ఞానాదిగుణములు గలవాఁడును పరబ్రహ్మమని చెప్పఁబడువాఁడును పరమపురుషుఁడనెడి జ్ఞానంబును, ఇట్టి తత్త్వజ్ఞానమువల్లనును కర్మములను ప్రతిదినము చేయుచుండుటవల్లనును శమదమాదులవల్లనును గలిగెడిభక్తిరూపమైనయుపాసనచేతనె భగవంతుఁడు బొందఁదగినవాఁడనెడి జ్ఞానంబును లభించినది-నీవు చెప్పినట్లు యుద్ధము మొదలగుదానిని చేసెదను-అని రామానుజభాష్యము.

సంజయఉవాచ.

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।
సంవాదమిమమశ్రౌషమద్భుతం రోమహర్షణమ్॥ ౭౪॥

ఇతి=ఇట్లు, వాసుదేవస్య మహాత్మనః పార్థస్యచ=శ్రీకృష్ణునియొక్కయును మహాత్ముయగు అర్జునునియొక్కయును, అద్భుతం రోమహర్షణమ్ ఇమం సంవాదమ్=అద్భుతమైనదియును పులకరింతనుగలుగఁజేయునదియునగు ఈ సంవాదమును, అహమ్ అశ్రౌషమ్=నేను వింటిని.

మహాత్మ యనఁగా గొప్పబుద్ధిగలవాఁడు- అని రామానుజభాష్యము.

వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానిమం గుహ్యతమం పరమ్।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్॥

ఇమం గుహ్యతమం పరం యోగమ్=ఈ అతిరహస్యమైన గొప్పయోగమును, స్వయం కథయతః యోగేశ్వరాత్ కృష్ణాత్=స్వయముగా చెప్పుచున్న యోగేశ్వరుఁడైన కృష్ణునివలన, వ్యాసప్రసాదాత్ సాక్షాత్ శ్రుతవాన్(అస్మి)=వ్యాసునియనుగ్రహమున ప్రత్యక్షముగా విన్నవాఁడను(అగుచున్నాను)- వ్యాసుఁడు దివ్యచక్షుస్సునును

దివ్యశ్రోత్రమునను ఇచ్చుటవలనవింటినని భావము.

యోగముంగూర్చినదిగాన గీతాశంబునుయోగమె- స్వయముగావింటిని- పరంపరగా కాదు- అని శంకరభాష్యము-

యోగేశ్వరుఁడనఁగా జ్ఞానాదిగుణములకునిధి- అని రామానుజభాష్యము-

రాజన్‌సంస్మృత్య సంస్మృత్యసంవాదమిమమద్భుతమ్।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామిచ ముహుర్ముహుః॥

(హే)రాజన్=(ఓ)రాజా! (ధృతరాష్ట్రుఁడా!), (కిం)చ=ఇంతియెకాక, అద్భుతం పుణ్యం కేశవార్జునయోః ఇమం సంవాదమ్=అద్భుతమైనదియును పుణ్యమైనదియునగు శ్రీకృష్ణార్జునులయొక్క ఈ సంవాదమును, సంస్మృత్య సంస్మృత్య ముహుర్ముహుః హృష్యామి=తలంచి తలంచి మాటిమాటికిని ఆనందింపుచున్నాఁడను.

పుణ్యమనఁగాపిన్ననుగూడ పాపముగుపోఁగొట్టునది- అని శంకరభాష్యము.

తచ్చసంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః।
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామిచ పునఃపునః॥ ౭౭

(హే)రాజన్!=(ఓ)ధృతరాష్ట్రుఁడా!, హరేః అత్యద్భుతం తత్ రూపం సంస్మృత్య సంస్మృత్య-శ్రీకృష్ణునియొక్క మిక్కిలియద్భుతమైన ఆ విశ్వరూపమును తలంచి తలంచి, మే మహాన్ విస్మయః(భవతి)-నాకు గొప్ప ఆశ్చర్యము(కలుగుచున్నది)- పునఃపునశ్చ హృష్యామి-మాటిమాటికిని ఆనందింపుచున్నాఁడను-

యత్రయోగేశ్వరఃకృష్ణో యత్రపార్థో ధనుర్ధరః।
తత్రశ్రీర్విజయోభూతి ర్ధ్రువానీతిర్మతిర్మమ॥ ౭౮॥

యోగేశ్వరః కృష్ణః యత్ర (వర్తతే)=యోగేశ్వరుఁడగు కృష్ణుఁడేపక్షమునందు(ఉన్నాఁడో), ధనుర్ధరః పార్థః యత్ర(వర్తతే)=ధనుస్సునుపట్టిన అర్జునుఁడు ఏపక్షమునందు ఉన్నాఁడో, తత్ర శ్రీః ధ్రువా=ఆపక్షమునందు సంపద (తప్పనిది)- విజయః ధ్రువః-గెలుపు తప్పనిది- భూతిః (ధ్రువా)=సంపదయొక్క విస్తారము (తప్పనిది)- నీతిః(ధ్రువా)=న్యాయము(తప్పనిది)- (ఇతి) మమ మతిః=(అని) నా

తాత్పర్యము.

యోగేశ్వరుఁడనఁగా చేతనాచేతనముల స్వభావయోగములకు ఈశ్వరుఁడు. అన్ని వస్తువులయొక్కయు ప్రవర్తించుట మొదలగునవి తన సంకల్పమునకు అధీనములుగా నుండువాఁడు. ధ్రువయనఁగా కదలనిది. అని రామానుజభాష్యము.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం
భీష్మపర్వణి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యా
యాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
సంన్యాసయోగోనామ అష్టాదశోఽ
ధ్యాయః.

ఇట్లు నూఱువేలసంహితయగు మహాభారతమున భీష్మపర్వములోఁ జేరినదియు, ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును, యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబునగు భగవద్గీతలలో సంన్యాసమనెడి జ్ఞానసాధనమును తెలియఁజేసెడి పదునెనిమిదవయధ్యాయము.

1889.
ARSHA PRESS. VIZAGAPATAM.
PUBLISHER SRIPARAVASTU SRINIVASA JAGANNADHA
SWAMI AYYAVARALUGARU. PRINTER N. SUBBAROW.

